శ్రీరస్తు.

# శ్రీమదాంధ్ర భారతము.

## విరాటోద్యోగపర్వములు.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే బ్రకటితము.



1915.

# విషయసూచిక.



## విరాటపర్వము, ప్రథమాశ్వాసము.



## విరాటపర్వము, ద్వితీయాశ్వాసము.



## విరాటపర్వము, తృతీయాశ్వాసము.

## విరాటపర్వము, చతుర్థాశ్వాసము.



## విరాటపర్వము, పంచమాశ్వాసము.

విషయము. పుట.



## ఉద్యోగపర్వము, ప్రథమాశ్వాసము.



## ఉద్యోగపర్వము, ద్వితీయాశ్వాసము.



## ఉద్యోగపర్వము, తృతీయాశ్వాసము.

## ఉద్యోగపర్వము, చతుర్థాశ్వాసము.

శ్రీ

గణేశశారదాగురుభ్యో నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## విరాటపర్వము, ప్రథమాశ్వాసము.



శ్రీయన గౌరి నాఁ బరఁగు[1]చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగురూపము దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడుభక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చ మెచ్చుపరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్. 1

### కృతినిర్మాణప్రస్తావన.

వ. అని సకలబ్రహ్మప్రార్థనంబు సేసి తత్ప్రసా[2]దాసాదితకవిత్వతత్త్వనిరతిశయాను
భావానందభరితాంతఃకరణుండ నగుచుండి యొక్కనాఁ డిట్లని వితర్కించితి.

శా. విద్వత్సంస్తవనీయభవ్యకవితావేశుండు విజ్ఞాననం
పద్విఖ్యాతుఁడు [3]సంయమిప్రకరసంభావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయనుఁ డర్థి లోకహితనిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్య మగులేఖ్యం బైనయామ్నాయమున్. 3

క. వేదములకు [4]నఖిలస్మృతి, వాదములకు బహుపురాణవర్గంబులకున్
వా దైనచోటులను దా, మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్. 4

వ. అదియును. 5

ఉ. ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణసంభృత మై పెను [5]పొంది యుండ నం
దాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్. 6

మ. హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథోపేతంబు నానారసా

---

1 చెల్వలఁ...(మూర్తి నా). 2 దోఁదిత...(సురూపానంద). 3 స్వాయమిప్రవర... మగునామ్నాయంబు లేఖ్యంబుగాఁ. 4 నిఖిల...వాదంబులకుం బురాణ. 5 పొందు చుండు (పొంది యుండు).

భ్యుదయోల్లాసి విరాటపర్వ మట యుద్యోగాదులుం గూడఁగాఁ
బదియేనింటఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం
దుది [1]ముట్టన్ రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్. 7

క. అని రచనాకౌతుకమున, మన మలరఁగ నీప్రబంధమండలి కధినా 8
థునిఁగా నేపురుషునిఁ జే,ర్కొనువాఁడనొ యనుతలంపు [2]గూరినమదితోన్. 9

వ. ఇంచుక నిద్రించుసమయంబున.

సీ. మజ్జనకుండు సమ్మాన్యగౌతమగోత్ర, మహితుండు భాస్కరమంత్రితనయుఁ
డన్నమాంబాపతి యనఘులు కేతన, మల్లన సిద్ధనామాత్యవరుల
కూరిమితమ్ముండు గుంటూరివిభుఁడు కొ,మ్మనదండనాథుండు [3]మధురకీర్తి
విస్తరస్ఫారుఁ డాపస్తంబసూత్రప,విత్రశీలుఁడు సాంగవేదవేది

తే. యర్థిఁ గల వచ్చి వాత్సల్య మతిశయిల్ల, నస్మదీయప్రణామంబు లాదరించి
తుష్టి దీవించి కరుణార్ద్రదృష్టిఁ జూచి, యెలమి నిట్లని యానతి యిచ్చె నాకు.

వ. "కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్,
కిం కాలకూటః కిము వా యశోదాస్తన్యం తవ స్వాదు వద ప్రభో మే." యని
నీవు దొల్లి రచియించినపద్యంబు [4]గాఢాదరంబున నవధరించి భక్తవత్సలుం
డగుహరిహరనాథుండు నీదెస దయాళుం డై యునికిం జేసి నిన్నుం గృతార్థునిం
జేయం గార్యార్థి యయి నాకలోకనివాసి యయిననాకుం దనదివ్యచిత్తంబునం
గలయకార్యంబు తెఱంగెఱుంగునట్టిశక్తిం బ్రసాదించి నన్ను నాకర్షించి
కొలిపించికొని వీఁడె విజయంచేయు చున్నవాఁ డనుచుం జూపుటయు సవిశేష
సంభ్రమసంభరితహృదయుండ నయి యవ్వలనుఁ గలయం గనుంగొనునప్పుడు

సీ. కరుణారసము వొంగి తొరఁగెడుచాడ్పున, శశిరేఖ నమృతంబు జాలువాఱ
హరినీలపాత్రిక సురభిచం[5]దనమున, గతి నాభి ధవళపంకజము మెఱయ
గుఱి యైనచెలువున నెఱసినలోకర,క్షణ మనంగ గళంబుచాయ దోఁపఁ
బ్రథమాద్రిఁ దోతెంచుభానుబింబము నా ను,రమ్మునఁ గౌస్తుభరత్న మొప్ప

తే. సురనదియును గాళిందియు బెరసినట్టి, కాంతిపూరంబు శోభిల్లు శాంతమూ
ర్తి నామనంబు నానందమగ్నముఁగఁ జేయ, నెలమి సన్నిధి సేసె సర్వేశ్వరుండు.

వ. ఏనును భక్తిమయం [6]బగుసాష్టాంగదండప్రణామం బాచరించి కొండొక దోఁ
వినయావనతుండ నై లలాటోపరిభాగంబున నంజలిపుటంబు ఘటించి న
సంబులు నవయవంబులును బ్రమదబాష్పసలిలవిలులితంబులును బులకప

---

1 ముట్టంగ రచించు...(జన సంతోషంబు నిండారులుక్). 2 గొనకొను. 3 మహి
విస్తారసారుఁ; విస్తృతిస్ఫారుఁ...నాదరించి...దీపించు కరు. 4 గూఢార్థంబు. 5 దన వ
గతి... మెఱసిన...క్షణ మన గరళంబుచాయ (గరళంపుఁజాయ) ...మాద్రి నుదయించు...

పరికలితంబులునుం గా నంతంత నిలిచిన నద్దేవుండు. 1

క. అనుకంపాతిశయంబునఁ, దనదక్షిణనేత్రమును సుధారోచియ కా
నను [1]వింత లేక చూచి వ,దనమున దరహాసరసము దళు కొత్తంగన్. 1

ఉ. వైదిక[2]మార్గనిష్ఠ మగువర్తనముం దగ నిర్వహించుచున్
భేదము [3]లేనిభక్తి మతి నిర్మలవృత్తిఁ జేయు చుండుమ
త్పాదనిరంతరస్మరణతత్పరభావముకల్మి నాత్మ స
మ్మోదముఁ బొందఁ గావ్యరసముం గొనియాడుచు నుండు మెప్పుడున్. 1

వ. అందును. 1

క. పారాశర్యనికృతి యయి, భారత మనుపేరఁ బరఁగుపంచమవేదం
బారాధ్యము జనులకుఁ ద, ద్గౌరవ మూహించి నీ వఖండిత[4]భక్తిన్. 1

తే. తెనుఁగు[5]బాస వినిర్మింపఁ దివురు టరయ, భవ్యపురుషార్థతరుపక్వఫలము గా
దీని కెడ నియ్యకొని వేడ్క నూని కృతిప,తిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర

వ. అనిన నద్దివ్యవచనామృతం[6]బు నాయుల్లంబున వెల్లిగొనినఁ బునఃపునఃప్రణామ
బు లాచరించి యప్రమేయప్రభావభావనాతీతుం డయ్యును నప్పరమేశ్వరు
డాశ్రితులకు నత్యంతసులభుం డని బుధులవలన విని యునికిం జేసి ననుబోఁ
బాలస్వభావునకు నిట్టిమహనీయమహిమ దొరకొనుటయుం గలుగున కా
యని తలంచుచు నవ్విభునకు విన్నపంబు సేయువాఁడ నయి కొమ్మనామాత
నాననం బాలోకించి తదనుమతి వడసి యిట్లంటి. 1

క. భూరిభవత్కారుణ్యా, క్షీరాంబుధి [7]నాదుతుచ్ఛచిత్తంబున వి
స్తార మహితముగ నునిచితి, వారయ నచ్చెరువు గాదె యఖిలాండపతీ. 2

ఉ. ఇంతకు నేర్చునీకు నొకయింతటిలోన మదీయవాణి న
త్యంతవిభూతిఁ బెం పెసఁగునట్టినినుం గొనియాడఁ జేత దా
[8]నెంతటిపెద్ద నీకరుణ నిట్లు పదస్థుఁడ నైతి నింక జ
న్మాంతరదుఃఖముల్ దొలఁగునట్లుగఁ జేసి సుఖాత్ముఁ జేయవే. 2

వ. అని యుపలాలితుం డగుడింభకుండు దనకొలంది యెఱుంగక మహాపదార్థంబ
వేఁడువిధంబున బ్రహ్మానందస్థితిం గోరి సర్వాంగాలింగితమహీతలం బగునమ
స్కారంబు సేసిన నజ్జగన్నాథుండు. 2

తే. జననమరణాదు లైనసంసార[9]దురిత,ములకు నగపడ కుండంగఁ దొలఁగు తెరు

1 చింత. 2 ధర్మమార్గ...గని నిర్వ. 3 లేక భక్తిమతి (భక్తి నతి) ...చుందు ను,త
(చుండి మ, త్పా)......బొంది కావ్య. 4 బుద్ధిన్. 5 బాసను నిర్మింపఁ దివురుటయును...
నియ్య (కెడ నియ్య). 6 బున నాయుల్లంబు పల్లవితంబుగాఁ...బునఃప్రణామంబుచేసి...(భా
భావాతీతుం). 7 లోన నాను...(మహిమముగ). 8 నెంతయుఁ బెద్ద...దలఁగు నట్లుగఁ..
కృతార్థుఁ. 9 దుఃఖ...కుండు నిమ్మనకుఁ దెరువు (కుండ నిమ్మనను దెరువు).

గనువెలుంగు నీ కిచ్చితి[1]ననిన లేచి, నిలిచి సంతోష మెద నిండ నెలవుకొనఁగ.

వ. [2]మేలుకాంచి. 24

క. ఎలమియు నచ్చెరువును [3]సరి, నెలసి పొదలుమానసమున నెంతయుఁ బ్రోదిం
గలలోనఁ గన్నచందము, దలఁచుచు నుండితిని భక్తితాత్పర్యమునన్. 25

వ. తదనంతరంబ. 26

ఉ. ఇట్టిపదంబు గాంచి పరమేశ్వరునిం గృతినాథుఁ జేసి యే
పట్టునఁ బూజ్యమూర్తి [4]యగుభారతసంహితఁ జెప్పఁ గంటి నా
పుట్టుఁ గృతార్థతం బొరసెఁ బుణ్యచరిత్రుఁడ నైతి నవ్విభుం
గట్టెదఁ బట్ట మప్రతిమకారుణికత్వమహావిభూతికిన్. 27

ఉ. కూర్చుట నూత్నరత్నమునకుం గనకంబునకుం [5]దగుఁ జనా
భ్యర్చిత మైనభారత మపారకృపాపరతంత్రవృత్తిమైఁ
బేర్చినదేవదేవునకుఁ బ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి నా
నేర్చినభంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్. 28

వ. ఇది యనన్యసామా[6]న్యకరణం బగుపరమధర్మప్రకారంబు. 29

ఉ. కావున భారతామృతము కర్ణపుటంబుల[7]నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయు నట్లుగ సాత్యవతేయసంస్మృతి
శ్రీవిభవాస్పదం బయినచిత్తముతోడ మహాకవిత్వదీ
క్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్. 30

వ. అని పూని యీదృశంబు లగు[8]పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్కయారాధనవిశేషం బగుటం జేసి. 31

## షష్ఠ్యంతములు.

క. ఓంకారవాచ్యునకు నన, హంకారవిరూఢభావనారాధ్యునకున్
హ్రీంకారమయమనోజ్ఞా, లంకారోల్లాసనిత్యలాలిత్యునకున్. 32

క. త్రిభువనశుకదృఢపంజర, విభవమహితునకు సమస్తవిష్టపనిర్మో
కభుజంగపతి కఖిలజగ, దభిన్నరూపునకు భావనాతీతునకున్. 33

క. శ్రుతిసీమంతమణికి నా, శ్రితవాంఛాపూర్తికరణచింతామణి కా
నతదురితతమోద్యుమణికిఁ, గ్రతు[9]భూషణమణికి లోకరక్షామణికిన్. 34

క. పరమశమ[10]నిరతసంయమి, వరమానసకుముదహాసవర్ధనచంచ

---

1 ననఁగ...నిండు. 2 ఇట్లు మేలుకాంచి. 3 మది, నెలసి(సరి, యెలసి)...(పొదవు) పొదల...సభక్తి. 4 నయి భార...నేన యవ్విభుం...ప్రతిమకావ్యకవిత్వమహా. 5 దగన్ ...(రమణీయుఁడ నయ్యెద). 6 న్యాకారం (న్యకారణం). 7 (నారఁ గ్రోలి యాం, ధ్రా) గ్రోలి సత్కవీం, ద్రావళి...(సంస్కృత, శ్రీవిభవాశ్రితం). 8 పుణ్యప్రస్తావం. 9 భూషామణికి. 10 (నియత)...కమలహంసవర్తన...వి, స్ఫురణపిచిత.

చ్చరణనఖచంద్రికావి, స్ఫురణాచిత్రప్రకారశోభాఢ్యునకున్. 35

క. హరిహరనాథునకు మరు, త్సరిదాకల్పితమనోజ్ఞచరణాశిరస్సుం
దరమూర్తికి భావనత,త్పరచేతోయుక్తభక్తపరతంత్రునకున్. 36

కథాప్రారంభము.

వ. ఏను విన్నపంబు సేయు తెఱంగుగా నంతస్సన్నిధిం గలిగించుకొని యమ్మహా [1]కావ్యంబునర్థంబు సంగతంబు సేసెద. 37

క. శరణాగతసంశ్రితభయ, హరణా సురనికరశేఖరానర్ఘమణి
స్ఫురణాపరిచయరంజిత, చరణా వనమాలికాభుజంగాభరణా. 38

క. అజగవశార్ఙ్గాలంకృత, భుజగర్వనిరస్తదైత్య[2]భూమస్తుత్యా
త్రిజగద్ధారణనిత్యా, భుజగసమాచరితశయన భూషణకృత్యా. 39

క. జలనిధిహిమవద్భూధర, కలితజనన కేళికౌతుకవ్యక్తావ్య
క్తలలితసౌందర్యస్ఫుర, దలఘుతను[3]శ్రీసనాథ హరిహరనాథా. 40

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము. 41

ఆ. కథ జగత్ప్రసిద్ధి గావునఁ బూర్వప,ర్వార్థయుక్తి సేయునట్టియెడల
యత్న మించుకంత యయినను వలవదు, వలసినట్లు సెప్ప [4]వచ్చి యుండు.

వ. మహాభారతంబు సమస్తదురితాపహంబును నభిమతశుభావహంబునుం గావున నొక్కమహాఫలంబు గోరి జనమేజయుండు కృష్ణద్వైపాయనమహామునికారుణ్యంబు వడసి తదీయప్రియశిష్యుం డయిన వైశంపాయనువలన వినినకథ యగుటం జేసి తత్ప్రకారంబునడపెద నది యెట్లనినం బరమపవిత్రులగు పాండుపుత్రుల చరిత్రంబుపాఖ్యానసహితంబుగా వ్యాఖ్యానంబు సేయుచుండ వారలవనవాస సమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. 43

చ. మహితసముజ్జ్వలాకృతులు మానధనుల్ జనమాన్యు లంగనా
సహితము గాఁగ నేమిగతి సమ్యగుపాయ[5]నిగూఢవృత్తిమై
సహితుల కప్రభేద్యముగ నాపదుమూఁడగునేఁడు మత్పితా
మహులు చరించి రంతయుఁ గ్రమంబున నా కెఱుఁగంగఁ జెప్పుమా. 44

. అని యడిగినవైశంపాయనుఁ డమ్మనుజేంద్రచంద్రు నధికౌత్సుక్యం
బుసకలిమికిఁ దనహృదయం,బున గాఢాదరము భరితము గ నిట్లనియెన్. 45

. పాండవులు వనవాసంబు సముచితంబుగా [6]సలిపి పండ్రెం డగు నేఁటికడపటఁ దమకు ధర్మదేవతాసమాగమం బయినం దత్ప్రసాదంబున నజ్ఞాతవాససమయంబునకు భంగంబు గాకుండ వరంబు వడసి యంతకు మున్న తమవెనుక

1 వాక్యంబు. 2 భువన. 3 శ్రీ. 4 వలసి. 5 నియాథ...మగు నా...మూఁడవ. జరపి...యంతకు మున్న.

నడవులం దిరుగుచు నగ్నిహోత్రంబులఁ దోడన కొని వర్తిల్లుభూసురోత్త
ములు దమ్ముం బరివేష్టించి యుండఁ దా రనుష్ఠింపం బూనినపని వారల కెఱిం
గింపం దలంచి కర(కమల)ంబులు మొగిచి సవినయంబుగా ని ట్లనిరి. 46
సీ. తెల్లంబు గాదె మీ కెల్ల సుయోధను, చేసినకుటిలవిచేష్టితంబు
లకట మాతో మీరు నడవుల నిడుమలఁ, బొందితి[1]రోకభంగిఁ బోయెఁ గాల
మిది పదుమూఁ డగునేఁడు మా కజ్ఞాత, వాసంబు సలుపంగ వలయు నిందు
ధార్తరాష్ట్రులు సూతతనయసౌబలులును, జెఱుపన నేతురు చిన్నసన్న
ఆ. యెఱిఁగిరేనిఁ జాల నెగ్గు వాటిల్లు న, ట్లగుట మమ్ము నింక నతిరహస్య
వృత్తిమై నిరస్తవిఘ్నుల రై చరి, యింపుఁ డని యనుగ్రహింపవలయు. 47
వ. అని చెప్పి రట్టిసమయంబున ధర్మనందనుండు విషణ్ణహృదయుం డై. 48
క. ఒకనాఁ డేమును నాపద,లకు విడుమరఁ గాంచి విప్రులం జుట్టలఁ బె
ట్టుకొని సుఖ[2]ముండఁబడయుదు, మొకొ యిప్పాటెందుఁ గలదె యొరు లెవ్వరికిన్.
వ. అని డగ్గుత్తిక వెట్టి దుఃఖపరవశుం డగుటయు నమ్మహీసురవరులుం దమ్ములు
నతని నాశ్వాసించు చుండఁ దత్పార్శ్వంబున నున్నధౌమ్యుండు దదీయవిషా
దాపనోదంబు సేయం దలంచి యి ట్లనియె. 50

—ధౌమ్యుఁడు పాండవుల నూరార్చుట.—

ఉ. ధర్మనిరూపకత్వమున ధైర్యమునన్ మహనీయ[3]వృత్తి స
త్కర్మవిధిజ్ఞతం జతురతామహిమన్ దృఢబుద్ధి నెవ్వరున్
ధర్మజుపాటి గా రనఁగ ధాత్రిఁ బ్రసిద్ధుఁడ వైనయట్టినీ
పేర్మికి నీడె దుర్దశల పెల్లునకున్ దురపిల్లు టారయన్. 51
వ. అట్లుంగాక. 52
క. దేవతల కైన నొక్కొ,క, చో వలయున కాదె శత్రుసూదనవిధికా
[4]లావాప్తికి మును దమస, ద్భావంబు లడంచి యుడుగఁబడి యుండంగన్. 53
సీ. నిషధాద్రియం దనిమిషపతి ప్రచ్ఛన్న, సంచరణమున వర్తించుటయును
నదితిగర్భంబున నవతార మై వామ, నాకారమున హరి యడఁగుటయును
జననియూరుప్రదేశంబున నతినిగూ, ఢంబుగా నౌర్వుండు డాఁగుటయును
ధేనుశరీరవిలీనుఁ డై యజ్ఞాత, చర్య మార్తాండుండు సలుపుటయును
ఆ. వినమె యిట్లు వడిన[5]వీరలు పదపడి, తమకు నగ్గ మైన తఱి జయింప
రెట్లు ప్రబలి రిపుల నీవును నాపద, కోర్చి భంగపాటు దీర్చికొనుము. 54
క. అనవుడు నప్పలుకులు విని, తనచిత్తము కలఁక[6]దేఱి ధర్మతనూజుం

1 రిబ్భంగిఁ...జెఱుపనః జూతురు(చిన్ని)...ట్లగుటఁ జేసి మమ్ము. 2 మందఁ. 3 బుద్ధి ...సాటిగా రనఁగ ... పి (ల్లు టొప్పునే.) ల్ల నేటికిన్. 4 లావధికిని...ద్భావము (దలఁచి ;
[illegible]

డనుజన్ములదెసఁ జూచిన, ననిలసుతుం డిట్టు లనియె నాతనితోడన్. 55

మ. భవదాజ్ఞాదృఢబంధ[1]సంయమితశుంభద్వేగ మై కాక నాఁ
డవలీలన్ మనయజ్ఞసద్విపము క్రోధావేశదుర్దాంతద
ర్పవిలాసోద్భటభంగి నే పడరి కౌరవ్యాంబుజశ్రేణిఁ జి
క్కువడం జేయదె యొక్కవ్రేల్మిడిన నీకున్ వేడ్క సంధిల్లఁగన్. 56

వ. అనిన విని ధర్మనందనుండు దెలి వొందినమొగంబుతోడ శిరఃకంపంబు సేసె నట్టిసమయంబున నవ్విప్రు లందఱు నొక్కమొగిన మీతలంపునకు దైవం బనుకూలంబు గావుత మని పాండుపుత్త్రుల దీవించి పునర్దర్శనం బయ్యెడు మనుచు వీడ్కొని [2]నిజస్థానంబులకుం జనిరి తదనంతరంబ బాహ్యపరివారం బెల్లను సముచితప్రకారంబున వీడుకోలు వడసి తమతమపాండుపట్లకుం బోయిన. 57

ఉ. తమ్ములు ధౌమ్యుఁడున్ సతియుఁ దా నరదంబులతోడఁ గ్రోశమా
త్ర మ్మొకచోటి కల్లఁ జని ధర్మతనూభవుఁ డందు నాఁటి రే
యిమ్ముల [3]నల్పి వేగుటయు నీప్సితకార్యము సేయఁగా విచా
రమ్మున నున్నచో నమరరాజతనూభవుఁ జూచి యి ట్లనున్. 58

క. మన [4]మొక్కయేవుర మీయం, గనయుం దో నరుగుదేరఁ గా నెయ్యెడఁ బో
యిన నెఱుఁగ కుండుదు రెయి, ద్దినములు గడపంగ నెద్ది దెఱఁ గయ్యెడినో.

వ. అనిన [5]నతం డి ట్లనియె. 60

తే. ధర్మదేవత నీదుసత్కర్మమునకు, మెచ్చి యెంతయుఁ [6]బ్రీతిమై నిచ్చినట్టి
వరము గలుగంగ మన మేమివర్తనమున, నెచట నున్నను నొరులకు నెఱుఁగనగునె.

వ. కురుజనపదంబుచుట్లం బాంచాల చేది మత్స్య సాళ్వ విదేహ బాహ్లిక దశార్ణ శూరసేన కళింగ మగధ దేశంబులు సుభిక్షంబులు [7]జనాకీర్ణంబులు నతిస్థిరంబులు నై నివాసయోగ్యత గలిగి యున్నయవి యని విందుము వానియందు మీకుం జూడం బోలినయెడఁ దగినచందంబున నిలుచువారముగాక యనినం బ్రియం బంది ధర్మనందనుం డి ట్లనియె. 62

క. అగు నది యట్టిద దైవము, దగ నిచ్చిన[8]యవ్వరంబు దప్పునె మనకున్
విగతభయవాసయోగ్యం, బుగ నొక్కెడ సెప్పు మిపుడ పోవఁగ వలయున్.

ఆ. నాకుఁ జూడ మత్స్యనరపతి [9]సద్ధర్మ, వర్తి సుజనహితుఁ డవార్యబాహు
బలుఁడు గాన నతనిపాల నందఱుఁ దగ, వైనపనుల నిలుచు టభిమతంబు. 64

పాంచాలీపాండవులు దమ మెలంగవలయుపనుల నిశ్చయించుకొనుట.

క. మనలోన నెవ్వఁ డెమ్మెయి, పనివెంటను విరటుమనము వడయుద మది యె

1 సంశమిత. 2 నిజనివాసం (నిజాస్థానం). 3 నిల్పి. 4 మేవురమును నీయం. 5 నాఖండలనందనుం డి. 6 బ్రీతితో...నుండిన నొరుల. 7 నానాజనా. 8 యట్టివరము ..సెప్పఁ డిపుడ. 9 సత్పథ...నడచు టభి.

ల్లను నేర్పరించి యందఱుc, దనతనమది నున్న తెఱcగు [1]తథ్యమ చెప్పcడ

వ. అనిన విని సవ్యసాచి సవితర్కంబును సవిషాదంబును సగౌరవంబునుం [2]నతని నుపలక్షించుచు ని ట్లనియె.

సీ. మహనీయ[3]మూర్తియు మానవైభవమును, సౌకుమార్యంబును సరళతయు
మార్దవంబుc బ్రభుత్వమహిమయు నపగత, కల్మషత్వంబును గౌరవంబు
శాంతియు దాంతియుc జాగంబు భోగంబుc, గారుణ్యమును సత్యసారతయు
ధర్మమయక్రియా తత్పరత్వంబును, గీర్తిధనార్జనక్రీడనంబుc

ఆ. గలిగి జనుల నేలc గాని యెన్నండును, నొరులc గొల్చి తిరుగ వెరవు లేని
యట్టినీవు విరటు నెట్టిచందంబున, ననుచరించువాcడ వధిప చెప్పుమ.

క. అనినం దమ్మునినెమ్మన, మునc బుట్టినవగపు భావమున నెఱిcగియు గీ
టునc బుచ్చుచుc బ్రస్తుతకా, ర్యనిరూపణదశ[4]య మెఱయ నతcడి ట్లనియె

క. సన్న్యాసివేషమున రా, జన్న్యునిc గని యెప్పుడుc గొలిచి [5]సభ్యత్వమునc
మాన్న్యుcడనై పుణ్యకథా, విన్న్యాస మొనర్తు నతనివేడుకకుc దగన్.

క. శ్రౌతస్మార్తనిమిత్త, జ్యోతిర్విద్యలు [6]వహించి యోగ్యసమయసం
జాతప్రాగల్భ్యుcడనై, చాతుర్యము మెఱసి మానసం బలరింతున్.

క. ఆతనితో నొక్కొకమరి, కౌతూహలవృత్తికిం దగం [7]దొడcగి మృదు
ద్యూతంబునc గ్రీడింతుం, జేతోముద మొదవ [8]నక్షశిల్పప్రౌఢిన్.

తే. మణిమయమ్ములుcగలధౌతమయములునుసు,వర్ణమయములునాదిగావలయు
యడ్డ[9]సాళులు గలవునాకభిమతముగ, వానిc గొనిపోయిచూపుదువరుసతో

వ. మఱియు [10]నవసరోచితంబు లగువినోదంబులం బ్రమోదంబు వుట్టించు
బ్రసాదంబునకుం బాత్రుండనై కంకుం డనునామధేయంబు ధరియించి
యింతు నయ్యుర్వీశ్వరుండు మత్పూర్వవర్తనం బడిగెనేనియు ధర్మపుత్రుని
మైత్రిం దగిలి యతనిపాల వసియింతు ననంగలవాcడ నని చెప్పి యనిలతను
నిరీక్షించి తత్కాలజనితం బయినఖేదంబునం దొరcగ సమకట్టుబాష్పజలంబు
మగుడ నింకించుచు నిట్టూర్పు లడంచి ధైర్యం బవలంబించి యి ట్లనియె.

సీ. కడిమిమై సౌగంధికమున యక్షులమద, మడcచి కృష్ణకుc బువ్వులిట్లు దె
గిమ్మీరదానవు నమ్మెయి నిర్జించి, విగతకంటకముc గావించె వనము
బకదైత్యుc దొడరి యాభంగి రూపఱc జేసి, రక్షించె నేకచక్రాపురంబు
నప్పాటc బ్రబలుజటాసురు నడరి దం,డితుc జేసి మనలc బెట్టించుకొనిరా

1 తప్పక. 2 నయ్యమతనయు. 3 కీర్తియు...సరసతయును...దాంతియు శాంతి
త్యాగం...ననుసరించు...ననఘ చెప్పుమ. 4 మెఱయcగ. 5 సద్వృత్త. 6 గ్రహి
7 గడcగి. 8 నక్షశిక్షా; నాల్పశిల్ప. 9 సారెలు. 10 నాతనిచిత్తంబునకుం దగిన

తే. నితఁడు పుట్టినకోలెను నెనక[1]మెసఁగు, దర్పమునన వర్తిల్లు నుదగ్రహృదయుఁ
డకటయొరుచిత్తమునకెక్కనట్లుగాఁగ, మెలఁగియేమివిధంబునఁగొలుచువాఁడు.
వ. అనిన విని భీమసేనుం డిట్లనియె. 75
తే. ఏను వంటలవాఁడ నై యానరేంద్రుఁ, గొలిచి గరగరగాఁ గూడు గూర చిత్త
మునకువచ్చినచందంబునన యొనర్చి, [2]నేర్చి మెలఁగుదుఁ గరము వినీతి మెఱసి.
ఉ. ఆఱురసంబులం జవులయందలిక్రొత్తలు పుట్టనిచ్చలున్
వే ఱొకభంగిఁ బాకములు విన్నను వొప్పఁగఁ [3]జేసి చేసి నన్
మీఱఁగ బానసీని నొకనిం బురిఁ గాననియట్లుగాఁగ మేన్
గాఱియ వెట్టి యైన నొడికంబుగ వండుదు నెల్లకూరలున్. 77
తే. పఱియవాపంగఁదునియఁగావిఱువవలయు, నెడలఁ[4]గాళ్ళలఁ జేతులఁదొడలఁబట్టి
కడఁగి యనువుగఁ జేసి ప్రొయ్యిడుదుఁగాని, కత్తి గొడ్డలి యడుగనేఁగట్టియలకు.
క. సూపాధ్యక్షుఁడు గలిగిన, నాపురుషునితోడ సఖ్య మగునట్లుగ నే
నేపాట నైన నడవఁగ, నోపుదుఁ దత్తద్విధప్రయోగములమెయిన్. 79
వ. అట్లుంగాక. 80
తే. జెట్టితండంబుతోడఁ జేపట్టి హరాంత, కారి విఱిచిన[5]యట్టు లగ్గలిక విఱుతు
లాఁగు వేగంబు మెఱసి బలంబు నెఱపి, మల్లతనమున మెప్పింతుమనుజవిభుని.
క. పెక్కండ్ర నొక్కపోరను, [6]నుక్కఱ భంజింతుఁ జంపు టుడుగుదు రాజుం
దక్కటిచూపఱు లెంతయు, వెక్కసపడఁ జిత్రగతుల విహరింతుఁ దగన్. 82
చ. అదియును గాక కోలుపులి నైనను గారెనుపోతు నైన ను
న్మదకరి నైన నుగ్రమృగనాథుని నైనను గిట్టి ముట్టి బె
ట్టిదముగఁ గాలఁ గేలను గడిందిమగంటిమి యుల్లసిల్లఁ బ
ట్టుదు నడఁగంగ మాత్స్యుఁడు గడున్ వెఱఁ గందుచుఁ బిచ్చలింపఁగన్. 83
వ. ఇట్లు నానాప్రకారంబుల నతని[7]మనంబు వడయుదు వలలుం డనుసమాఖ్య
వహింతు నమ్మహీపతి నీ వెవ్వరివాఁడ వని యడిగెనేనిఁ బాండవాగ్రజునకు
బానసంబు సేయుదు ననంగలవాఁడ ననిన విని ధర్మజుం డమ్మెయికి సమ్మతించి
బీభత్సు వీక్షించి ఘూర్ణమానమానసుం డగుచు ని ట్లనియె. 84
ఉ. ఖాండవ మేర్చి దేవతలఁ గాననియీశ్వరుఁ గాంచె దోర్బలో
ద్దండమహాసురప్రతతిదర్ప మడంచి ప్రియం బొనర్చి యా
ఖండలుఁ డున్నగద్దియసగంబున నుండె మహానుభావుఁ డీ
తం డొకమర్త్యుఁ జేరి యనుదాత్తత [8]నెమ్మెయిఁ గొల్చువాఁడొకో. 85

1 మెసఁగ...వర్తిల్లె నుదగ్రమూర్తి. 2 నిచ్చ. 3 సంఘటించి న, నిమ్మఱిన బాన
నొకరు. 4 గాళ్లను...(ప్రోవిడుదుఁ). 5 యట్ల యగ్గ (లీల నగ్గ)...చలంబు. 6 నొక్కె

క. అనుమాటలు విని సంక్రందననందనుఁ డిట్టు లనియె దైవంబుకతం
బున నాకు నొక్కచందం, బను వై యున్నయది [1]దీని నోఁగా దనుజా. 86

వ. అమరనగరంబున కరిగినయెడ నూర్వశి నన్ను నపుంసకుంగా శపియించిన నాకు నాకేశుండు గరుణించి యీ[2]శాపఫలంబు భవదజ్ఞాతవాసవత్సరంబున ననుభవించి తదనంతరంబ శాపమోక్షంబు వడయు మని దీవించెం గావునఁ జేడితనంబు దాల్చి బాహులదీర్ఘత్వంబునకు గుణకిణంబులకుఁ గంచుకంబును శంఖవలయంబులును మాటు సేసికొని విరాటుకడకుం జని. 87

క. ఉత్తమకన్యా[3]జనులకు, నృత్తము గఱపంగ నాకు నేర్పు గలదు త
ద్వృత్తమునకు నన్నేలుము, చిత్తమునకు నెక్కఁ బనులు సేసెద నందున్.

క. అని కొలిచి యే బృహన్నల, యనునామముతోడఁ గన్యకాంతఃపుర[4]వ
ర్తన మొనరించుచు లాసిక, తనమున నిపుణుండ నై యతని మెచ్చింతున్.

క. [5]మానవపతి నన్నెక్కడి, దానవు నీ వనియె నేని ద్రౌపదికడ స
మ్మానంబు వడసి మెలఁగుదు, నానగళుల నృత్యగురువ ననఁ గలవాఁడన్. 90

తే. అనిన నిది వోలు నని యియ్యకొని యజాత,వైరి యల్లన నకులునివలను సూచి
నెమ్మనంబున నుమ్మలికమ్ము గదుర, నెలుఁగుచందంబు వేఱుగా నిట్టు లనియె. 91

ఉ. ఒప్పెడుమేనుఁ బెంపు గలయుల్లము నాగరికంపుఁజందముం
జెప్పక చూప కీతనివిశేషముఁ దెల్పెడుఁ గొల్చు టెంతయుం
దెప్పర మేమి సేయుదుఁ గడిందివిచారము వుట్టె నెట్లితం
డప్పురి సంచరించునొకొ యన్యు లెఱుంగక యుండునట్లుగన్. 92

వ. అనిన నప్పలుకులకు నకులుం డి ట్లనియె. 93

ఆ. అశ్వశిక్షకుండ నై మత్స్యభూవిభుఁ, గొలుచువాఁడ గుఱ్ఱములకు వలయు
తెఱఁగు లెల్లఁ [6]జాల నెఱుఁగుదు రూపుగా, నరయ నేర్తు వాని ననుదినంబు. 94

సీ. ఘోడిగజాతిలోఁ గొదమపెంటుల నేర్చి, మావుల హత్తించుమార్గవంబుఁ
[7]ద్రాళ్ళఁ బట్టింపంగఁ దఱి యైనకొదమల, సంచంబు లెఱిఁగి శిక్షించునేర్పుఁ
గళ్యాలఁ బదిలంబు గానిగుఱ్ఱంబులఁ, గ్రొత్తముట్టున కియ్యకొలుపువెరవుఁ
బెనఁగుశూకలముల బిరుదుతనంబులఁ, జలము డింపక తీర్పఁ జాలుటయును

తే. నలవరించినవాఁడ లాయమున నున్న,యపుడు దోడ కించుకయు లేనియట్లుగాఁగ
మాటిమాటికిఁ బరికించి మందడీల, కెల్ల నూఱట యగుచు వర్తిల్ల నేర్తు. 95

క. దామగ్రంథి యనఁగ నొక, నామము వెట్టుకొనువాఁడ నాతోఁటివిధం
బామనుజేశ్వరుఁ డడిగిన, నే మీకడవాఁడ నందు నిది తెఱఁగధిపా. 96

---

1 దాని కొఁ...ఁడీ. 2 శాపంబు ఫలం...గుణకిణాంకంబులకుఁ. 3 జనముల. 4 న, ర్తన. 5 ఆనరపతి...(నా నెలఁతకు) నా నగరున నృత్త. 6 జూచి యెఱుఁ. 7 ద్రాళ్లను (దాడులఁ) బట్టంగఁ...సంచు లెఱింగి...గళ్లెలఁ...బిరుసుఁదనం...దొసఁ గించుక.

క. అనినఁ గడులెస్స యని నెమ్మనమున నూఱడి విభుం డమానుష తేజో
ధనుఁ డగుసహదేవుఁ గనుంగొని యిట్లను వగలు మిగిలి కొందలపఱుపన్.

చ. అకుటిలుఁ డార్యసమ్మతుఁ డహంకృతిదూరుఁడు నీతినిర్మలా
త్మకుఁ డనవద్యశీలుఁ[1]డు సధర్ముఁడు దాంతుఁడు గొంతి ముద్దుసే
యుకొడుకు మేను లేఁత దనయుల్లము మెత్తన యిట్టియీతఁ డె
ట్లొకొ యొరు నాశ్రయించు విధి యోపదె యెవ్వరి నెట్లు సేయఁగన్. 98

క. అనుడు నతఁడు దనచిత్తంబునఁ దోఁచినవిధము ధర్మపుత్రునితో ని
ట్లని చెప్పె నాతనికిఁ బుట్టినయుత్తలపాటు గొంత డిందుపడంగన్. 99

క. కీలారితనమునకు నేఁ, జాలుదు నని కొలిచి మత్స్యజనపాలుకడ౯
మే లగునడవడిఁ దంత్రీ, పాలుం డనుపేరితోడఁ బరఁగుదు నధిపా. 100

సీ. వంజల నైనను వల నేర్పడఁగ నొక, భంగిఁ జేఁపఁగఁ జేసి [2]పాఁడి గొనఁగ
బడుగుల నైనను బాటించి పరికించి, గోమున మైఁ గండక్రొవ్వు దేఱఁ
దెవులుగొంటుల నైనఁ దేర్చుసంకటమున, గోపి ముందటియట్ల రూపుసేయ
నఱ్ఱుల నైనను నలు వైనవెరవున, ముట్టె యంటఁగఁ బట్టి కట్టి విడువఁ
ఆ. బిడుకఁ గడుపు నేర్ప బెదరు వాపఁగ నీరు, మేపు గలుగు నెడకు మెలఁగ వెలువ
మెకము నరయ మ్రుచ్చు మెలఁగిన వెలకొట్ట, నేర్తుఁ బసికిఁ జాలఁ గూర్తు నేను.

వ. నన్ను విరాటుండు మున్ను నీ వెం దుండుదని నిరూపించెనేని యుధిష్ఠిరుగోష్ఠంబుల కధిష్ఠాతనై యుండుదు నని యెదనని పలికినఁ గొంతేయాగ్రజుం డిది యుక్తం బగు నని యనుమతిసేసి పాంచాలి నాలోకించి ఖిన్నాం[3]తఃకరణుం డగుచు నిట్లనియె. 102

చ. ఇది గడుముద్దరాలు పను [4]లేమియుఁ జేయఁగ నేర దెంతయు౯
మృదు వొకకీడుపాటునకు మేకొనఁ జాల దుదాత్తచిత్త యొం
టి దిరుగుదాని కోర్వ దొకటిం దనుఁ దా సవరించుచొప్పెఱుం
గదు తగ నొండులం గొలువఁ గా వెర వెమ్మెయిఁ గల్గు నక్కటా. 103

క. అనిన నతనిచిత్తంబున, వెనుఁబా టంతయును బాయువెరవుకలిమి యె
ల్లను దెలియునట్లుగా ని, ట్లనియెం బాంచాలి యుచిత మగుచందమునన్.

క. సైరంధ్రీవేషంబునఁ, జేరుదు నంతఃపురంబుచెంతకు నన్నా
భూరమణుదేవి యెంతయు, గారవమునఁ బిలువ నంపఁ [5]గా వినయమునన్.

---

1 దనమానుఁడు (దాత్తుఁడు) శాంతుఁడు...విధి యొప్పదె. 2 పాలు...దీర్చి సంక...నఱవల...నలవున వెర...; నఱ్ఱావులను నైన నలు...నెడల మెలఁగ మలుప, మృగము నరయ...రేవ గళులు గొట్ట (పగలు రేలరికట్ట). 3 తరంగుం. 4 లెవ్వియు...జాలను భీత చిత్త యొం, టిది దిరుగాడ నోర్వ నొకజేనియుఁ దా సవ; దొకటిం దను దాన వరించు...తగ నొల్లనుం గొలువఁ గా. 5 గాఁ గలదు దగ౯; గాఁ జెలువమర౯.

క. కని కొలువు సేసికొని మా,లిని నాఁ జని సాధ్వి యిది మలీమసవృత్తిం
బునఁ బొంతఁ బోవ దెన్నఁడు, ననువ్రేఁకఁదనంబు దోఁచు నట్లు చరింతున్. 106

సీ. కలపంబు లభినవగంధంబులుగఁ గూర్చి, తనువున నలఁదుదు దనువు గాఁగ
మృగమదపంకంబు మృదువుగా సారించి, తిలకంబు వెట్టుదుఁ జెలువు మిగులఁ
బువ్వులు బహువిధంబులఁ గట్టి ముడి కొక్క, భంగిగా నెత్తులు వెట్ట నేర్తు
హారముల్ మెఱయ నొయ్యారంబుగా గ్రుచ్చి, యందంబు వింతగా నమరింతు

ఆ. వివిధశిల్పములఁ బ్రవీణ నై మఱియును, వలయుపనులవెంట మెలఁగి నేర్చి
మత్స్యరాజమహిషిమనమున మక్కువ, నెలకొనంగ నిట్లు గొలువ నేర్తు. 107

క. మును నీ వెచ్చో నిలుతే, పనిమెయి వర్తిల్లు దనినఁ బాంచాలిక నే
ననుచారిణి నై తగఁ బం,చినగరువపుఁబనులు నేర్చి చేయుదు సదనున్. 108

వ. అనవుడు ధర్మనందనుండు ద్రుపదనందన కిట్లనియె. 109

క. మనవంశం[1]బును వృత్తం,బును బెంపును గావఁ జాలుపుణ్యసతివి దు
ర్జను లగుతులువలతలఁపులు, గనుఁగొని యేమఱక మెలఁగఁగా వలయుఁ జుమీ.

వ. అనిన విని యాజ్ఞసేని యనాదరమందస్మితసుందరవదనారవింద యయి యాతని
కిట్లనియె. 111

క. ఆరయ నెందును గౌరవ, భారం బెడలంగ నీక పాతివ్రత్యా
చారముమై వర్తింతురు, సైరంధ్రీజాతివారు సౌజన్య[2]మునన్. 112

క. కావున నుచితము లగు నా, కా వెంటం గొలిచి తిరుగునప్పుడు మితభా
షావిరచనమును వ్రతసం, భావనమును గౌరవంబుఁ బాపభయంబున్. 113

క. అని చెప్పిన విని యగుఁ బొ, మ్మని కైకొని ధర్మతనయుఁ డంతఱమును ని
ట్లనపాయత వర్తిల్లుద, మని తమ్ములతోడ నిశ్చయంబుగఁ బలికెన్. 114

వ. ఇవ్విధంబునఁ గార్యంబు నిర్ణయించి మనయగ్నిహోత్రంబుల నెల్ల ధౌమ్యులు
రక్షించువారు వంటలవారును మహానసాధ్యక్షులును బాంచాలీపరిచారికలును
ద్రుపదుపురంబున నిలుచువారు రథంబులు గొని యింద్రసేనాదు లైనసారథులు
ద్వారకానగరంబున కరుగువారు వీ రెల్లను ద మ్మెవ్వ రైనను మనవార్త లడిగి
రేని ద్వైతవనంబున మమ్ము విడిచి పోయి రట యెఱుంగ మనం గలవా రని
చెప్పి యిత్తెఱంగున నభ్యంతరపరివారంబు నెల్ల [3]నియోగించి వీడుకొలిపి
నయ్యవసరంబున ధౌమ్యుండు పాండుకుమారుల కిట్లనియె. 115

ధౌమ్యుఁడు పాండవులకు సేవాధర్మంబు లెఱింగించుట.

క. ఎఱిఁగెడువారికి నైనను, గఱపక తక్క దుచితప్రకారము శుభముం
గొఱలు హితు లట్లగుట నం,దఱకును జెప్పంగ వలయుఁ దగియెడుబుద్ధుల్.

వ. అదియునుం గాక. 117

1 బున వృత్తం...తులువలమనములు. 2 నిధీ. 3 నిలుపు నియోగిం.

తే. కౌరవాన్వయజాతులై గారవమునఁ, బెరిఁగినట్టిమీ రొండొకనరునిఁ గొలిచి
[1]మసలి వర్తిల్లి మానావమానములకు, నోర్చి యడఁకువతోడన యునికి యరిది.

క. వాలి వివిధాస్త్ర[2]విద్యా, జ్వాలల వెలుఁగొందుపాండవజ్వలనం బా
భీలత మండం దొడరినఁ, గాలవిరోధంబు మఱచి కార్యముఁ దప్పున్. 119

వ. కావున మీకు నప్రమాదార్థంబుగా నానేర్చినవిధంబున నుపదేశం బవశ్య కర్తవ్యంబు రాజులం గొలిచి యెమ్మెయి నయినను బ్రదుకుజనంబులు గీడునుం [3]బొరయ కుండునట్టిసాధారణనీతి సంక్షేపరూపంబున నెఱింగించెద సావధానుల రయి వినుండు. 120

క. తగఁ జొచ్చి తనకు నర్హం, బగు నెడఁ గూర్చుండి రూప మవికృతవేషం
బుగ నమయ మెఱిఁగి కొలిచిన, జగతీవల్లభున కతఁడు సమ్మాన్యుఁ డగున్.

క. నరనాథుఁ గొలిచి యలవడఁ, దిరిగితి నా కేమి యనుచుఁ దేఁకువ [4]లేమిన్
మరియాద దప్ప మెలఁగినఁ, బురుషార్థంబునకు హాని పుట్టక యున్నే. 122

ఉ. రాజగృహంబు కంటె నభిరామముగా నిలు గట్టఁ గూడ దే
యోజ నృపాలుఁ డాకృతికి నొప్పగు వేషము లాచరించు నే
యోజ విహారముల్ సలుప నుల్లమునం గడువేడ్క సేయు నే
యోజ విదగ్ధుఁ డై పలుకు [5]నొద్దులకుం దగ దట్లు సేయఁగన్. 123

క. పుత్త్రులు పౌత్త్రులు భ్రాతలు, మిత్త్రు లనరు రాజు లాజ్ఞ [6]మిగిలినచోటన్
శత్త్రులకాఁ దమయలుకకుఁ, బాత్రము సేయుదురు నిజశుభస్థితిపొంటెన్. 124

క. చనువానిచేయుకార్యం, బున కడ్డము సొచ్చి [7]నేరుపున మెలఁగుచుఁ దా
నునుబయిఁ బూసికొనుటఁ దన, మును మెలఁగిన మెలఁకువకు నుముప్పగుఁ బిదపన్.

ఆ. రాజునొద్దఁ బలువురకు సంకటము గాఁగఁ, దిరుగుపనుల కెంత తేజ మయిన
వాని బుద్ధిగలుగువా రొల్ల రది మీఁదఁ, జేటు దెచ్చు నెట్లు సిద్ధ మగుట. 126

క. ఊరక యుండక పలువుర, తో రవ మెసఁగంగఁ బలుకఁ దొడరుపక మదిం
జేరువ గలనాగరికులుఁ, దారుఁ గలసి పలుక వలయు ధరణీశుకడన్. 127

క. వేఱొక తెఱఁగున నొరులకు, మాఱాడక యునికి లెస్స మనుజేంద్రుకడం
దీఱమి గలచోటులఁ దా, మీఱి కడఁగి వచ్చి పంపు మెయి కొన వలయున్.

చ. ధరణిపుచక్కఁ గట్టెదురు దక్కి పిఱుందును గానియట్లుగా
నిరుగెలనం దగం గొలిచి యే మనునో యెటు సూచునొక్కొ యె
వ్వరి దెస నెప్పు డేతలఁపు వచ్చునొ యాతని కంచుఁ జూడ్కి సు
స్థిరముగఁ దన్ముఖంబునన [9]చేర్చుచు నుండుట నీతి గొల్వనన్. 129

క. నగళులలోపలిమాటలు, దగునే వెలి నుగ్గడింపఁ దన కేర్పడ నొం

1 మలసి. 2 శస్త్ర...గాలవిరోధంబు నుచితకార్య. 3 దొరయ. 4 లేకమ్మరి.
5 నొద్దునుం. 6 మీఱిన. 7 యేరుపున...బూనికొనుట; బూనికొనిన. 8 నవం. 9 చేరిచి.

డుగడం బుట్టినఁ బతి విన, నగుపని సెప్పెడిది గాక యాతనితోడన్. 130

క. అంతిపురముచుట్టఱికం, బెంతయుఁ గీడంతకంటె నెగ్గుఁ దదీయో
పాంతచరకుబ్జవామన, కాంతాదులతోడిపొందుకలిమి భటునకున్. 131

ఆ. ఉత్తమాసనములు నుత్కృష్టవాహనం, బులును గరుణఁ దమకు భూమిపాలుఁ
డీక తార యెక్కు టెంతటిమన్నన, గలుగువారి కైనఁ గార్య మగునె. 132

క. మన్నన కుబ్బక యవమతి, ద న్నొందిన స్రుక్కఁబడక ధరణీశుకడన్
ము న్నున్నయట్ల మెలఁగిన, యన్నరునకు శుభము [1]లొదవు నాపద లడఁగున్.

క. జనపతి యెవ్వరి నైనను, మనుపఁ జెఱుపఁ బూని యునికి మదిఁ దెలియ నెఱిం
గినయేనిఁ దాను వెలిపుచ్చునె మునుము న్నెట్టిపాలసుండును దానిన్. 134

ఉ. ఎండకు వాన కోర్చి తనయిల్లు ప్రవాసపుఁజోటు నాక యా
కొండు నలంగుదుర్ నిదురకుం దఱి దప్పెడు డప్పి పుట్టె నో
క్కండన యెట్లొకో యనక కార్యము ముట్టినచోట నేలినా
తం డొక[2]చాయ చూపినను దత్పరతం బని సేయు టొప్పగున్. 135

క. తా నెంతయాప్తుఁ డైనను, హీనాయకుసొమ్ము పాము నెమ్ములుగా లో
నూనినభయమునఁ బొరయక, మానినిఁగా కేల కలుగు మానము బ్రదుకున్.

ఆ. ఆవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవ, నంబు గుప్తవర్తనములు గాఁగఁ
జలుపవలయు నృపతి గొలువున్నయెడల బాహిరము లైనఁ గెలని కిగ్గులగుట.

క. వైరులదూతలు నెర వగు, వారు నిరాకృతులుఁ బాపవర్తులుఁ దమకుం
జేరువగా వర్తించుట, నేరమి తుదిఁ బోయి చేటు నిందయు వచ్చున్. 138

ఆ. వసుమతీశుపాల వర్తించునేనుంగు, తోడనైన [4]దోమతోడ నైన
వైర మగు టెఱుంగు వలవదు తా రెంత, పూజ్యు లైన జనులపొందు లెస్స.

క. కలిమికి భోగముల కదా, ఫల మని [5]తను మెఱసి బయలుపడఁ బెల్లుగ వి
చ్చలవిడి భోగింపక వేడ్కలు సలుపఁగ వలయు భటుఁ డడంకువతోడన్.

వ. అని యిట్లు పురోహితుండు సేవాధర్మం బెఱింగించిన ధర్మజభీమార్జుననకుల
సహదేవులు ప్రసన్నచిత్తు లై యి ట్లనిరి. 141

క. తల్లియుఁ దండ్రియు దైవము, నెల్లసుహృజ్జనము మీర యిట్లు గొలిచి వ
ర్తిల్లెడు తెఱంగు లెంతయుఁ, దెల్లము సేసితిరి బ్రదికితిమి మీకరుణన్. 142

ఆ. అనిన ధౌమ్యుఁ డిట్టు లనియె నీవత్సర, [6]మొకఁడు నెట్టు లయిన నుడిగి మడిఁగి
సంకటముల కోర్చి చరియించి యాపద, నిస్తరించి పిదప నెగడ వలయు. 143

క. అనవుడు నట్లుల చేసెద, మని వారలు భక్తియుక్తి నతనికి నభివం
దన మొనరించినఁ దగుదీవన లిచ్చె నతండు గాఢవాత్సల్యమునన్. 144

1 లొలయు. 2 చోటు. 3 నంబు. 4 మైత్రి దొడరవలయు. 5 తా. 6 మకట ...నడఁగి మడిఁగి.

క. భూదేవోత్తమునాళీ, ర్వాదంబులఁ బ్రీతిఁ బొంది వారలు ప్రస్థా
నాదరపరు లగుటయు స, మ్మోదావహపుణ్యకర్మముల కుద్యతుఁ డై. 145
ఆ. అతఁడు నియతితోడ నగ్నిసముజ్జ్వలం, బుగ నొనర్చి [1]కామ్యపూజ దీర్చి
యానసమయమంగళార్థంబు లగుమంత్ర, సంచయములు దగ జపించుచుండె.

పాండవులు పాంచాలితోడ విరాటునగరంబునకు బయలుదేఱుట.

వ. తదనంతరంబ హుతవహునకుం బురోహితునకుం బ్రదక్షిణంబు సేసి యమ్మహీ
సురవరేణ్యుననుమతి వడసి పాండవులు పాంచాలిం బురస్కరించుకొని యాతం
డును దోడన యరుగుదేరం గదలి శుభనిమిత్తంబులు గైకొనుచుం జని దశార్ణ
దేశంబున కుత్తరంబునఁ బాంచాలజనపదయామ్యదిగ్భాగంబున సాళ్వశూరసేన
విషయంబులలోనం గాళిందీదక్షిణతీరం బొరసికొని పశ్చిమాభిముఖప్రయా
ణంబుల నెడనెడ వన్యాహారంబుల శరీరయాత్రలు నడపుచు నానా[2]మృగవివిధవి
హారంబులను మనోహరకుసుమకదంబగంధమకరందబిందుసందోహసుందరతరు
చ్ఛాయాసేవనంబులను గమలపరాగపరంపరాధూసరితభాసురజలాశయసమవ
గాహనంబులను సరిత్సంగమస్నానాద్యనుష్ఠానంబులను బహుప్రకారపాదప
గుల్మలతావలోకనంబులను బక్షికులప్రకరానేక భంగివిరుతాకర్ణనంబులను
వినోదించుచుఁ గాననమార్గంబుల నరిగి మత్స్యమండలంబుగడి సేరి ధౌమ్యుని
వీడుకొని రవ్విప్రవరుండును నొక్కపుణ్యాశ్రమంబున వసియించె వారు మఱి
యు నూళ్లుసారక యడవితెరువుల నడచి విరాటునగరంబున కనతిదూరం బగు
కాంతారంబునం దఱిమి పోవుసమయంబునఁ బథిశ్రమంబు నూని యాజ్ఞసేని
యిట్లనియె. 147

ఉ. డప్పి జనించె వ్రేళులపుటంబులు పొక్కఁ దొడంగె గోళ్లలోఁ
జిప్పిలఁ జొచ్చె నెత్తురులు చిత్తము నాకుఁ గడుఁ౯ వశంబు గా
దప్పుర [3]మిచ్చ టచ్చ టనునాసల వచ్చితి నెంతదవ్వొకో
యిప్పటిభంగి నొక్కఁడుగు నేఁగెడుదానికి నోర్వ నెమ్మెయిన్. 148
వ. అనవుడు. 149
క. తనమదిఁ గరుణయు ఖేదం, బును [4]బిరిగొను చుండ ధర్మపుత్త్రుఁడు నకులుం
గనుఁగొని ద్రుపదనృపతినం, దనదెస యాతనికిఁ జూపి తగ నిట్లనియె౯. 150
ఆ. అకట మనము వచ్చినది గడుదవ్వు నేఁ, డప్పురంబు సొత్త మని తలంచి
[5]తఱిమి నడచితిమి లతాతన్వి యిది వడ, గొనియె మోచి తెమ్ము కొంతదవ్వు.
క. అనిన విని [6]పూని గ్రక్కునఁ, జనుదేరమి నతఁడు డస్సెఁ జాలం డని నె

1 కొల్వ్య. 2 మృగవివిధవధవిహరణంబు...ప్రవరానేక...మండలంబుగదిసి; కదిసితి మని.
3 మిచ్చొ టచ్చొ...మెంతదవ్వొ...నోప నెమ్మెయి౯. 4 బురికొను...(ద్రుపదాధిపనం)ద్రు
పదాత్మజ నా, తని కొయ్యనఁ జూపి. 5 తడవు. 6 యతఁడు,

మ్మనమున నెఱింగి యాతని, యనుజన్ముని [1]బనిచె నతఁడు నలుసుం డయినన్. 153

వ. సవ్యసాచిం జూచి.

ఉ. ఇమ్మదిరాక్షి డస్సె మన కీనడుమన్ విడియంగ నొండుచో
టిమ్మును గాదు నిక్క [2]మున కేమును డస్సితి మట్లు గాన నీ
వెమ్మెయి నైన దీని భరియించి పురంబుసమీపభూమికిం
దెమ్మని చెప్ప నాతఁడును దెచ్చెఁ బ్రియంబునఁ బుష్పకోమలిన్. 154

క. మోచికొని వాసవాత్మజుఁ, డాచెలువం దేర నిట్లు లరిగి పురము దృ
గ్గోచర మగుటయుఁ దమ్ములఁ, జూచుచు వారలకు ధర్మసుతుఁ డిట్లనియెన్.

క. చక్కనిచిక్కనిమేనులు, నిక్కొదండము[3]లు నైన నెఱుఁగరె మన మీ
చక్కటి నిలుతమె శస్త్రము, లొక్కెడ దాఁచుటకు వేఁషయోజనములకున్.

వ. అనిన నిది కార్యం బని మధ్యమపాండవుం డాసుమధ్య నొక్కశీతలసికతాతలం
బున డించెఁ దక్కినవారలు నట్ల చేయుద మని నిలిచి రట్టియెడం బాండవాగ్ర
జుండు గాండీవిచేతివి ల్లుపలక్షించి యతని కిట్లనియె. 157

క. మనశస్త్రాస్త్రంబులు ద, క్కినయవి యొకభంగి [4]పిటికిని గాండివముం
గొనిపోయితి మేని సురయో, ధనునకు నగపాటు నిశ్చితం బూహింపన్. 158

వ. [5]అనవుడు. 159

చ. ఇది పెనుఁబాముచందమున నెంతయు భీషణ మై జనంబులన్
బెదరఁగఁ జేయు న ట్లగుటఁ బెట్టి చనన్ వలయుం [6]దలంచి నా
హృదయము దీనిఁ బాయుటకు నియ్యకొనం జొర దెట్లు సెప్పినం
దుది నొకచోట వైచుటయ తోఁచినకార్యము నయ్యెడుం గదా. 160

వ. అని వితర్కించుచుం గిరీటి యురియాడుచి త్తంబును త్తలం బుడిపికొని నిశ్చ
యించి యాయుధంబులు నిక్షేపించుటయ కర్జంబుగాఁ బలికి యోగ్యస్థలనిరూ
పణంబునకు నలుదిక్కులుం బరికించి ప్రేతభూమిపరిసరారణ్యంబునందు. 161

సీ. [7]నెగసినకొన లేచి నింగి యంతంతకు, నవులఁ ద్రోవఁగఁ దనరారుదానిఁ
జాఁగినశాఖ లాశాచక్రమునకొలం, దులు బారవెట్టంగఁ బొలుచుదానిఁ
గవట లొండొంటితోఁ గదియుచు నెడములు, ట్రింగిప్రబ్బఁగసొంపుమిగులుదాని
లోనిజొంపము పవలును బెనుజీఁకటి, నొదవించి పొదలంగ నొప్పుదానిఁ

తే. గనియెఁ బవమానవివిధన ర్తనకళానువ ర్తిఁ గాకఘూకారవస్ఫూ ర్తిజాత
భీతిపరిసరవ ర్తి నాభీలభుజగ, చండమూ ర్తి శమీతరుచక్రవ ర్తి. 162

వ. కని యమ్మహామహీరుహంబు ధర్మనందనునకుం జూపి యి ట్లనియె. 163

---

1 బనిచె నాతఁ డవశుం. 2 ముగ ... చెప్ప...లన్. 3 లుఁ జూచి. 4 వి చటికిని.
5 అనవుఁడు నర్జునుం డి ట్లనియె. 6 దలం (పనా) చినన్...నొకచోట వైచుటయుఁ; నొక
భంగి వైచు టది. 7 నిగిడిన; నెరసిన...ద్రోచుచు...వివిధవ ర్తన.

శా. పక్షివ్యాకులముం బరేతనిలయోపాంతోత్థముగ్ డాకినీ
రక్షోభూతపిశాచగోచరము [1]దుర్గస్థంబు నై చూడఁ జి
త్తక్షోభం బొనరించు నట్లగుటఁ జెంతం జేర రా దీశమీ
వృక్షం బెవ్వరి కిందుఁ బెట్టుదమె పృథ్వీనాథ శస్త్రాస్త్రముల్. 164

క. [2]పెనుఁబొడువుఁ బఱవు జొంప, మ్మును గలయది దీన నెల్లపురుషులకుఁ బ్రయో
జన మొకఁడు లేదు సేరం, జనఁ జూడఁగ నరయ నెక్క సమకట్టంగన్. 165

ఉ. కావున దీనియం దిడుట కార్యము గ్రిదువు లెల్లఁ గేశచ
ర్మావృతసంచయంబుగ శవాకృతిగా నొనరించి కట్టినం
బోవరు దీనిది క్కొరులు భూవర నెమ్మది నూఱడిల్లు మె
చ్చొ వసియించినం బిదపఁ జొప్పడుఁ గ్రమ్మఱ వచ్చి కైకొనన్. 166

పాండవులు దమయాయుధంబుల శమీవృక్షమునఁ బెట్టుట.

వ. అని చెప్పిన నందఱు నత్తెఱంగున కియ్యకొనుటయు నతండు గాండివం[3]బు
నవలోకించి. 167

చ. అనిమిషదానవాంబరచరాదికజాతుల నెల్లఁ బోర నీ
ధనువునఁ గాదె [4]గెల్తు సముదగ్రవిరోధి భయావహంబు దీ
నిని నొకమ్రానఁ గట్టి చను నిశ్చయముం దగఁ జేసె దైవ మే
మనఁ గల దట్ల కాక యని యాత్మ నలందురి మందచేష్టుఁ డై. 168

వ. ఎక్కిడించినఁ బాండవాగ్రజుండు. 169

క. దనుజకులత్రాసకరం, బును రిపుభంజనము రత్నభూషితరూపం
బును గురు[5]దేశాహ్లాదన, మును నగునిజకార్ముకంబు మోపెడలించెన్. 170

వ. తదనంతరంబ భీమనకులసహదేవుల దెసఁ గనుంగొని. 171

సీ. సైంధవయుక్తపాంచాలత్రిగర్తుల, దీనన యోర్చితి మానధనుఁడ
సౌరాష్ట్రనాథాదిశత్రులు దీనిచేఁ, గాదె మర్దితు లైరి ఘనభుజుండ
కాళింగపాండ్యమాగధుల నిర్జించుచో, నిదియ కైదువు నీకు విదితయశుఁడ
యని క్రమంబున వార లందఱవిండ్లులు, పెం పెసలార వేర్వేఱ పొగడి

ఆ. గొనయములు వదల్ప ననుమతి సేయుడు, వారు నట్ల చేసి తేరఁ జాప
ములును దొనలు వర్మములు నసిముద్గరా, ద్యాయుధములుఁ గూడ నతఁడుగట్టె.

వ. ఇట్లు పూర్వోక్తప్రకారంబునం బొదివి మహోరగంబులం బెట్టియలం బెట్టి కట్టు
చందంబున బంధించి వానిం గొనుచు నయ్యజాతశత్రుండు ధర్మదేవతాదత్త
వరుం డగుటం జేసి నిశ్శంకం బైనయంతఃకరణంబుతోడ శమీవృక్షసమారో
హణం బాచరించి. 173

1 దుర్గంధంబు. 2 కనుఁబొడువు. 3 బుపలక్షించి. 4 గెల్చుట యుదగ్ర ; గెల్చితి
నుదగ్ర. 5 దేవా.

తే. బ్రహ్మవిష్ణుమహేశదిక్పాలచంద్ర
సూర్యవనదేవతాపితృస్తుతు లొనర్చి
దివియు భువియును జూచి ప్రార్థించి యొక్క-
విపులశాఖ నాయుధములు వ్రేలఁగట్టె. 174

వ. ఇట్లు గట్టి తదీయాధిదైవతంబుల నుద్దేశించి నమస్కరించి. 175

క. నరునకు నాకుం దక్కఁగ, నొరులకు మీఱూపు సూప [1]కున్నది విషవి
స్ఫురితభుజగభంగి భయం, కరమూర్తులు దాల్చియుండఁ గా వలయుఁ జుఁడీ.

ఉ. భీముఁడు ధార్త[2]రాష్ట్రకులభీషణరోషుఁడు చిత్త మెప్పు డే
న్లై మద మెత్తునో యతనియాగ్రహవృత్తికి లోను గాక మీ
రేమెయి నైన వంచన వహించి తొలంగుట మత్సమీహితం
బేమఱ కుండఁ గా వలయు నివ్విషమాబ్దములోన నాతనిన్. 177

వ. అని వేఁడికొని వృక్షంబు డిగ్గి దానికిం బ్రదక్షిణంబు వచ్చి ప్రణమిల్లి భీమ
సేనుదెస మరలి చూచి సాంత్వనవచనసమేతంబుగా నతనిం గౌఁగిటం జేర్చి యను
నయించి తమచేసినవిధంబు దత్ప్రదేశవర్తు లయినగోపాలాదిక్షుద్రజనంబులకు
మఱువెట్టం దలంచి వారల కభిముఖు లై పాండునందను లందఱు ని ట్లనిరి.

చ. ఇది [3]శతవృద్ధ మాజనని యిప్పుడు మృత్యువుఁ బొందె నిట్లు సే
యుదుము కులప్రయుక్త మగు చున్నసనాతనధర్మ మిత్తెఱం
గ దహనకర్మ మొల్ల మది గానిది గా మును నిశ్చయించి మా
మొదలిటివా రొనర్చువిధముం గొనియాడితి మేము నియ్యెడన్. 179

వ. అని యిట్లు పలుమఱుం దెలియఁ బలికి శస్త్రాస్త్రంబుల నిక్షేపణంబు నిగూ
ఢం బగుటకు నూఱడిల్లి యచ్చేరువం జచ్చినపసరంబు వడి యున్నం జూచి సహ
దేవుం బనిచి ధర్మతనయుండు దానిచర్మం బొలిపించి శీతాతపవర్షపరిహారంబుగా
నాయుధంబులం బొదివించి మఱియును దత్సమీపంబున నొక్కశుష్కశవంబు
నవలోకించి యిది యుంఛవృత్తి యైనమానవుకళేబరంబు గావలయు ననుచు
నదియునుం గైదువులకట్టపయిం బెట్టి కట్టించె నివ్విధంబున నత్యంతగుప్తి యాచ
రించి దీనిదుర్గంధంబున వనచారు లెవ్వరుం జేర రని నవ్వుచు వార లచ్చోటు
వాసి విరాటపురాభిముఖు లై చనుచుండి యజ్ఞాతవాసకాలంబునం దమకవా
స్యవ్యవహారంబునకు ననువుగా నేవురపేళ్లను గ్రమంబున జయుండును జయం
తుండును విజయుండును జయత్సేనుండును జయద్బలుండు నని సంకేతించుకొని
యాజ్ఞసేనీపురస్సరంబుగాఁ బుణ్యనదీతీర్థావతరణంబు సేసి తదీయస్నానంబునం
బథిశ్రమం బపనయించి దేవపితృతర్పణమంగళజపహోమధ్యానాద్యనుష్ఠానంబు

1 (ఉన్నది=ఉండునది.) కున్నత...భుజంగౌఘభయం. 2 రాష్ట్రులెడ. 3 యొక
వృద్ధ...కులప్రవృత్తి; శతవృద్ధ.

లొనర్చిరి తదనంతరంబ యక్కౌంతేయాగ్రజుండు ప్రాఙ్ముఖుం డయి నిర్మల 180
చిత్తంబున ధర్మదేవతం దలంచి యిట్లనియె.

ఆ. తండ్రి నీవు నాకు దయతోడ నిచ్చిన, వరము చిత్తగించి వలయు తెఱఁగు
సమయసముచితముగ సమకట్టు మయ్య యీ, రాకుమారు లవిధిఁ బోక యుండ. 182

వ. అనుచు ననుజులదెసకు దూరవగచి డగ్గుత్తిక వెట్టి మఱియును.

ఉ. అంబరవర్తి వైనఁ గని [1]యక్షుత నీ కగపడ్డవీరిప్రా
ణంబులు మున్ను నిన్నడిగి నల్వురకుఁ నయవిక్రమప్రభా
వంబులు వేఁడికొన్న నతివత్సలభావముఁ బొంది యాదరా
ర్ద్రం బగుచూడ్కితోఁ బ్రియహితస్థిరభాషల నూఱడింపవే. 183

వ. అని తారు మున్ను భూసురవరునరణి దేర నరిగిననాఁడు సరోవరతీరంబునం దనకు ధర్ముండు సేసినమన్నన దోఁప నతనికి విన్నవించినవాఁడై కరకమలంబులు మొగిచి ఫాలభాగంబునం గదియించి సంప్రార్థనంబుగా వినయవినమితమస్తకుం డగుటయుఁ దదనుగ్రహంబునఁ బాండవాగ్రజుం డున్నయునికిన సన్న్యాసిరూపం బలవడి ధాతుపటదండకమండలుకలితమూర్తి యయ్యె నయ్యవసరంబున వారంద ఱు మహాద్భుతం బంద వారివారికి నయ్యైవేషంబుల కనుగుణంబు లగునంబరాభరణమాల్యాద్యుపకరణంబులు సన్నిహితంబు లయినం జూచి సంతసిల్లి యెల్లవారిం గలయం గనుంగొని క్రమంబున నొంటిమైఁ జనుదెం డని నియోగించి యతండు నానావిధంబు లగునక్షంబులముడి కక్షంబున నిడికొని చని దైవయోగంబున విరాటుండు వెడలి వచ్చి బయలికొలు విచ్చుటం జేసి తదాస్థానంబు 184
సేరం బోవునప్పుడు.

ధర్మరాజు సన్న్యాసివేషమున విరటుఁ గొల్వ వచ్చుట.

ఉ. దవ్వులఁ జూచి మత్స్యవసుధాపతి యీచనుదెంచు చున్నవాఁ
డెవ్వఁడొ నాదుచూడ్కులకు నెంతయు వేడ్కగయి తోఁచె [2]నెట్లితం
డివ్విధిఁ బొందెనో జగము లెల్లను నేలఁగ జాలు తేజ మా
మువ్వురతోడిజోడి యగుమూర్తి యతీంద్రునియొప్పు గంటిరే. 185

సీ. కరచరణాద్యంగకంబు లేలొకొ రత్న, భూషణప్రకరంబుపొందు దొఱఁగె
నుభయపార్శ్వంబుల నిభఘట లేలొకో, చనుదేవు సమదాళిసమితి మొరయఁ
బాయు తొలంగు మంచాయతవేత్రహ, స్తులమొత్త మేలొకో తోడ రాదు
ధవళాతపత్రముల్ దఱచుగా నేలొకో, పట్టరు మౌక్తికప్రభలు వెలుఁగ

తే. నితఁడు రా జగు రాజనునింతమాత్ర, గాదు మూర్ధాభిషిక్తవర్గంబుఁ దనదు
చరణయుగ్మంబు గొలిపింపఁ జాలుసార్వ, భౌమపదవికిఁ దగియెడుభంగి వాఁడు

1 యక్షునిచే నగ...మతివిక్రమ...వత్సలతం దగ నిచ్చి. 2 నిట్టి (ట్లి) తం, డెవ్విధి.. బోఁక నో డయిన ; ళ్లో పగుసు ; సాటి యగు.

క. మనకడకు నేమిటికి వ,చ్చె నొకొ యే నిమ్మహాత్ము చెప్పినపను లె
ల్లను జేయువాఁడ గోరిన, కనకాంబరమణులు దలఁపు గడవఁ[1]గ నిత్తున్. 187

ఆ. మత్స్యవిషయరాజ్యమహిమ[2]కు యుక్తుండు, గాఁ దలంచెనేని గారవమున
నట్లు చేసి భక్తి ననుచరింతు నమాత్య, సుతసుహృద్భటార్యయుతము గాఁగ.

వ. అని సమస్తజనంబులుఁ దదభిముఖు లయి భక్తియుక్తం బ్రత్యుత్థానంబు సేయం
దానును గద్దియ డిగ్గి యెదురుచని నమస్కరించి యతనియాశీర్వాదంబులు
గైకొని సగౌరవంబుగాఁ [3]దోడ్కొని చనుదెంచి సమంచితసమున్నతాసనంబున
నునిచి వినయావనతుం డయి. 189

ఉ. ఎయ్యది జన్మభూమి గుల మెయ్యది యెయ్యది యున్నచోటు పే
రెయ్యది మీర లిందులకు నిప్పుడు వచ్చినదానికిం గతం
బెయ్యది నాకు నంతయును నేర్పడఁగా నెఱింగింపుఁ డున్న రూ
[4]పయ్యది నావుడున్ నరవరాగ్రణి కయ్యతిముఖ్యుఁ డిట్లనున్. 190

ఆ. ఉన్నరూప పలుకు నన్నరు లెక్కడఁ, గలరు తోఁచినట్లు పలుకు వలుక
నైన చందమయ్యె నంతియకా కంత, పట్టి చూడఁ గలరె యెట్టివారు. 191

వ. అని మందహాసంబు సేయుచు మఱియును. 192

క. నానావిధభూతమయము, మే నతిచంచలము మనము మెయికొని నిక్కం
బేనరునకుఁ జెల్లింపం, గా నగు సత్యంబు నడపుక్రమ మట్లుండెన్. 193

వ. అనుచు మత్స్యమహీవల్లభు నవలోకించి. 194

క. ద్విజుఁడఁ గురువిషయజాతుఁడ, సుజనప్రియుఁ డైనధర్మసుతుసఖుఁడఁ బరి
వ్రజనాశ్రమకలితుండ మ,నుజవల్లభయోగ్యబహువినోద[5]కరుండన్. 195

క. ద్యూతక్రీడకుఁ గొండొక, నేతుం గపటమున [6]నొవ్వనిజనంబులు నా
చేతిధన మెల్లఁ గొని పరి, భూతి యొనర్చిన విరక్తి పుట్టి వెడలితిన్. 196

చ. నృపనయవిద్యకుం దగిననేర్పుల వడ్డది గొంత కొంత ధ
ర్మపరులసంగతిం దగిలి మచ్చిక నుండుదుఁ బేరు కంకుఁ డే
వపుఁగొలు వైన నాకు నిలువన్ మది గొల్పదు గాన నిన్ను భూ
మిపతులలోన సాధుజనమిత్త్రుఁడు నా విని కొల్వ వచ్చితిన్. 197

తే. వత్సరంబునఁ గడచను వ్రతము నాకు, దాని నీపాలఁ జల్పి యుత్సాహవృత్తి
[7]మెఱయ నాకుఁ గృతఘ్నత నెఱపి తొల్లి, యెగ్గు సేసినవారి జయింపఁ బోదు.

వ. అనిన విని సంప్రీతచేతస్కుం డై విరాటుం డతని కి ట్లనియె. 199

తే. అట్లు చేయుఁడు రుచిరోన్నతాసనములు

---

1 నొసఁగుదున్. 2 కు (ద్యుక్తుండు) నీశుండ ... ననుసరిం ... టా (ళి) ద్యయుతము.
3 తోడుకొని సభకుఁ దెచ్చి సముచితాసనం. 4 పయ్యెడు. 5 పరుండన్. 6 నొర్వని ;
నొప్పని...పాడమి వెడ. 7 మెఱసి నీపుఁ గృతజ్ఞత.

[1]వాహనమ్ములు వస్త్రముల్ వలయుభోగ
ములును మఱి యెల్లవర్తనములును బ్రీతి
నాకు నెట్లవ్విధమ మీకు నడపువాఁడ. 200

క. నాయనుచరులం దెవ్వఁడు, మీయెడ భయభక్తి లేక మిగిలి మెలఁగె నే
నాయధముని దండితుఁగాఁ, జేయుదు నతఁ డెంతయుం బ్రసిద్ధుం డయినన్. 201

వ. అట్లుం గాక. 202

చ. వెలయఁగ మత్స్యరాజ్యపదవీపరిపాలన సేయఁగా మదిం
దలఁచుట యెంతయుం బ్రియము దమ్ములుఁ బుత్త్రులు బంధులుం బ్రధా
నులును బలంబు నేను సుమనోవిభుతుల్యుఁడ వైననిన్ను మి
క్కిలి యగుభక్తిఁ గొల్చి కృతకృత్యతఁ బొందుదు మట్లు చేయవే. 203

వ. అనిన విని దరహసితవదనుం డగుచుఁ బాండవాగ్రజుం డతని కిట్లనియె. 204

క. ఏను హవిష్యము గుడుతును, భూనాయక నాకు శయ్య భూమియ యిమ్మెఁ
బూని వ్రతంబులు సలిపెదు, వానికి నిన్నియును నిట్లు వలయునె చెప్పుమా.

ఆ. అనిన విరటుఁ డిట్టు లనియె నెట్టెఱఁగున, నడవ నిష్ట మట్ల నడచి మీకు
మనసు వచ్చి నన్ని దినములు సలుపుఁ డి,చ్చోట నదియ మాకు శోభనంబు.

క. [2]ద్యూతజ్ఞులదెసఁ గొండొక, ప్రీతియుఁ గల దట్లుఁ గాక పెద్దల రగుమీ
రే తెఱఁగున విహరించినఁ, జేతోమోదంబు దగ వసింపుఁడు నెమ్మిన్. 207

వ. అని పలికి కౌంతేయాగ్రజు నత్యంతసంతుష్టాంతరంగుం జేసి. 208

చ. పొరిఁ బొరిఁ [3]బ్రీతి రెట్టిగ నపూర్వవిలోకన మాచరించుఁ ద
త్పర మగుసద్వివేకమున భావనిరూపణ సేయుఁ గౌతుక
స్ఫురణఁ గరంబు దత్కరముఁ బొంద నయంబునఁ జేర్చి వాక్యవి
స్తరచతురత్వ మేర్పడఁగ సల్లపనం బొనరించు నర్థితోన్. 209

వ. ఇట్లు మత్స్యమహీవల్లభుం డతనిం గలిపికొని పరివారంబును దానును దదీయ
సంభావనాతత్ప[4]రుఁ డై యుండె నంత. 210

### భీముఁడు వంటలవాఁడై విరటుఁ గొల్వ వచ్చుట.

సీ. చట్టువం బొకచేతఁ బట్టి ఖడ్గము సంకఁ, దగిలించి సురియతో బిగియ ద్రిండు
గట్టిననుఁజేల[5]క ప్పెంతయును జెన్నుఁ, సేయంగ దాపలిచేతియందు
బెడిదంపుఁగోలలు బెడఁగొంద బహువర్ణ, చిత్రితాజినము పైచీర గాఁగఁ
జూపఱెల్లను దనరూపంబు చూడ్కికి, వేఁ గైన నత్యంతవిస్మయంబుఁ

తే. బొందు చుండ సమీరణపుత్త్రుఁ డగ్రజుండు వోయినదెసఁ దప్ప నొండువలన

1 వాహనములు భోజనములు వస్త్రములును, వలయు భోగంబులును నెల్లవర్తనములు, నా
వు నెట్లట్ల మీకును. 2 ద్యూతాదుల...వర్తించినఁ, జేతో. 3 బ్రీతికిం దగ న...ద, త్పరమతి
స...జేర్చు వా. 4 రు లై యుండి రంత. 5 క డెంత.

సమదవారణపతిగమనమున మత్స్య, ధరణివల్లభుసభ నేరఁ జనుగుటయు నా. 21

వ. అంతఁ దంతం గనుంగొని.

క. ఉలుకును వెక్కసపాటును, దలకొను నెమ్మనముతోడ ధాత్రీరమణుం
[1]డలఘుభుజవిపులవక్ష, స్థలరేఖాకాంతిఁ బరవశత్వముఁ బొందెన్. 21

వ. ఇట్లతనిరూపాతిశయంబున కోటువడి చూచుచు నిజాంతర్గతంబున. 21

క. విహరింప మానవాకృతి, సహితంబుగ మహికి నర్థిఁ జనుదెంచిన ప
ద్మహితుఁడొ హిమకరుఁడొ శచీ, గృహమేధియొ కాక యితఁడు కేవలనరుఁడే

క. ఏమిగులంబునవాఁడొకొ, నామం బెద్ది యగునొక్కొ నాభృత్యులలో
నీమనుజోత్తముఁ దొల్లియు, నే మెఱుఁగుదు మనఁగ నిచట నెవ్వరు గలరో

క. అను చుండ ననతిదూరం, బున కల్లన వచ్చి పవనపుత్త్రుఁడు మనుజేం
ద్రునకు జయశబ్దయుతముగ, వినయంబున మ్రొక్కి విన్న[2]వించె నిభృతుఁ డై

శా. దేవా నాలవజాతివాఁడ నిను నర్థిం గొల్వఁగా వచ్చితిన్
సేవాదక్షత నొండుమై నెఱుఁగ నీచిత్తంబునన్ [3]మెచ్చున
ట్లే వండం గడు నేర్తు బానసమునం దిచ్చోటనే కాదు న
న్నేవీటన్ మిగులంగ నెవ్వఁడును లేఁ డెబ్భంగులం జూచినన్. 21

క. పేరు వలలుండు గూడుం, జీరయు నిడి సాకతంబు సేసినఁ జాలుం
గోరినవంటకములు నా, నేరిమిఁ దగ నెఱపి కొలుతు నిశ్చలభక్తిన్. 21

చ. అనవుడు మత్స్యభూరమణుఁ డాతని కిట్లను నెట్లు శూద్రుఁ గా
[4]నినుఁ దలపంగ వచ్చు ధరణీభరణక్షమమూర్తి వీవు నీ
కనుగుణ మైనయానమును నాసనముం రుచిరాతపత్త్రముం
జనవరికొల్వు నిచ్చెద గజవ్రజముం బరికింపు పెంపుతోన్. 2

క. అనుటయు [5] మోఱకుచందం, బున మో మడ్డము గదల్చి భూవిభుఁడు సభా
జనులు విన ననిలసుతుఁ డి, ట్లనియెం బ్రస్ఫుటనిరర్గళాలాపములన్. 2

ఉ. నా కవి యెల్ల నేల నరనాథులకుం బ్రియ మొందునట్లుగాఁ
బాకము సేయ నేర్తు జనపాలక ధర్మసుతుండు పెద్దయుం
జేకొని యుండు బానసము సేయువిధంబున కిచ్చ [6]మెచ్చి పు
ణ్యాకరమూర్తి వైననిను నాతనిఁ గొల్చినయట్ల కొల్చెదన్. 2

చ. వలసిన నేలు మేను బలవంతుఁడఁ గానెనుపోతు దంతి బె
బ్బులి మృగనాథునిం దొడరి పోరుదు శూరత యుల్లసిల్లఁగా
[7]దలమును లావు విద్య మెయి దర్పముఁ బేర్చి పెనంగుజెట్టిమ

---

1 డలఘుభుజు. 2 వించెం బ్రీతిన్. 3 వచ్చున, ట్లే; మెచ్చఁగా. 4 నిను మది న
వచ్చు...జను (పరిఁగొ) వరికొల్వ. 5 (యును మొఱకు) యు వేతొకచందం, బున మో మడ్డమ
వంచి. 6 మెచ్చుఁ బు, ణ్యా. 7 బలమును...బంటుతనంబునఁ బేర్చి జెట్టి.

ల్లుల విఱుతుఁ వడిఁ గడియలోనన చూడ్కికి వేడ్క సేయుదున్. 223

క. కొలువు [1]గొన నొల్ల కుండుట, గలిగినఁ బొమ్మనుట యంతకంటెను మే లే
వలసినకడ కేఁగెద నీ, తలఁ పెయ్యది యాన తిమ్ము ధరణీనాథా. 224

వ. అనిన విని భూనాథుండు సానునయంబుగా ని ట్లనియె. 225

ఉ. ఇమ్మహనీయరూప[2]మున నే ద్దెఱఁ గన్గొని వేడ్క నీకు యో
గ్య మ్మగుభంగిఁ జెప్పితిమి గాని నరోత్తమ యొండు గాదు నీ
వెమ్మెయి నైన నిల్చుటయ యిష్టము వంటలమేరవాఁడ వై
యిమ్ముల నుండు సూదజన మెల్లను నీ దగుపంపు సేయఁగన్. 226

క. అని హర్షోత్కర్షంబున, మన మలరఁగఁ బల్కె మత్స్యమనుజాధీశుం
డనిలసుతు నేలె నాతఁడుఁ, దనమనమున నూఱడిల్లెఁ దదవసరమునన్. 227

అర్జునుఁడు పేడిరూపమున విరటుఁ గొల్వ వచ్చుట.

సీ. కాళ్లయొప్పిద మాఁడుకట్టు నుజ్జ్వలము సే,యంగ సంకులబాహు లంద మెడలఁ
గంచుక మంగంబుకాంతికి మాటుగా, మెడ హేమపట్టిక మెఱయ కుండ
వదనంబుకొమరు భావనఁజేసి వేఱుగా, నుదుటి[3]పెం పలకలఁ బొదువఁ బడఁగఁ
బవడంపుజొత్తులఁ జెవులు రూ పడఁగంగఁ, బాపటఁ దలకట్టుభంగి దప్ప

ఆ. మంచు మఱుఁగువడినమార్తాండుఁడునుబోలె, నీఱు గవిసి యున్ననిప్పుఁబోలె
వేషధారి యైనవిష్ణుండుఁబోలె న, వ్విరటుకొలువు సేర నరుఁడు వచ్చె. 228

క. చనుదెంచి పేడితనమును, వనితారూపంబు నమర వాసవసుతుఁ డా
మనుజాధీశునకు సభా, జనులకుఁ దనుఁ జూపి మందసంచారమునన్. 229

వ. మెలంగినం గనుంగొని మత్స్యజనవిభుండు దనయొద్దివారలతో ని ట్లనియె.

మ. వనితావేషము గల్గి యున్నయది చెల్వం బొఁడుచందంబు గా
దు నిరూపింప మహానుభావతయు నిర్దోషత్వముఁ రాజసం
బును శోభిల్లెడు నెవ్వఁ డే నొకజగత్పూజ్యుండు గ్రీడార్థ మి
ట్లొనరం దాల్చినరూపు గావలయు మీ రూహింపుఁడా యట్లగున్. 231

తే. అనినఁ బరిజనంబులు విస్మయంబు గదుర, నిశ్చయము సేసి పలుకంగ నేర్పు లేక
చూచు చుండఁగ నాసవ్యసాచి సేరఁ, జని విరాటనృపాలుతో సవినయముగ.

క. నిన్నుఁ గొలువంగ వచ్చితిఁ, గన్నియలకు [4]నాట గఱపఁ గా నోపుదు వి
ద్వన్నుత మన్నామంబు బృ,హన్నల యేఁ బేడి ననుడు నతఁ డి ట్లనియెన్.

ఉ. ఆయతబాహులుఁ వెడఁద యైనసమున్నతవక్షముఁ సరో
జాయితలోచనంబులుఁ బ్రసన్నముఖంబు నుదాత్తరేఖయుం
గాయజుఁ గ్రేణి సేయు ననఁ గౌశికు మీఱు ననంగ విభ్రమ

1 గొను మొల్ల. 2 మును నే; మున కే......నిల్చుట యభీష్ట...సూపకరు లెల్ల; సూద జను లెల్ల. 3 సొం పలకలఁ(బొ)నొదుగఁ ... భంగి గప్ప... నివుఱు. 4 నాట పాట గఱపుదు నో.

శ్రీయును బెంపునుం గలుగఁ జేసి విధాతృఁడు పేడిఁ జేసెనే. 234
శా. మత్తో_ద్దండచయంబులోన నొకసమ్యానార్హచాపంబు భా
స్వత్కాండంబులు [1]హేమచంద్రకకనద్వర్మంబు నీ కెంతయుఁ
సత్కారంబున నిచ్చి వాహనపరిష్కారాంకసంభావ్యసం
పత్కల్యాణునిఁ జేసి వైభవము దర్పంబుఁ విజృంభింపఁగన్. 235
క. ఏము నిను మత్స్యరాజ్య,శ్రీమహిమకు నెల్ల యుక్తుఁ జేయఁ దలంపం 236
గా మామనోరథమునకు, నీమాట విరుద్ధ మయ్యె నిది యెట్లొకొ. 237
వ. అనిన విని యమ్మహీపతికి బృహన్నల యి ట్లనియె.
ఉ. ఆఁడుదనంబు నిక్కమున కారసి చూచిన లేదు పుంస్త్వముం
బోఁడిమి దప్పి యున్నది నపుంసకజన్మ మవశ్యభోగ్య మై
వాఁడిమి గల్గుశాపమున వచ్చెఁ బురాకృతకర్మభావ్య మె
వ్వాఁడును నేర్చునే తొలఁగ వైవఁగ నోర్వక పోవ వచ్చునే. 238
239
వ. కావున.
తే. ఒండుపనులకు సెలవు లే కునికిఁజేసి, యభ్యసించితి శైశవ మాది గాఁగ
దండలాసకవిధమును గుండలియును, [2]బ్రెక్కణంబు తెఱంగును బేరణంబు.
క. విశ్రుతవాద్యంబులు మం,జుశ్రుతిసంభావ్యగీతసుగతులు సద్భా
వాశ్రయములుఁ దజ్జన్యర, సాశ్రయములు నైనయభినయంబు లెఱుఁగుదున్.
తే. ఇన్ని తెఱఁగుల శ్రమము సేయింతుఁ జతుర,తావిహీనము లైనపాత్రములనైన
నట్టువొజ్జనై మెలఁగుదు నగళులందు, నిపుణనైపథ్య విధులకు నేర్తు నధిప.
చ. అనుడు విషణ్ణ మైనహృదయంబున గారవ మొంద నైపుణం
బున నుచితంబుమై నరసి పొచ్చెము లేమిఁ దదీయసేవ గై
కొనుటకు నిశ్చయించి తనకూఁతు విరాటుఁడు పిల్వఁ బుచ్చె న
ర్తనమునకై బృహన్నలకుఁ దత్పరతం దగ నప్పగింపఁగన్. 243
244
వ. ఇట్లు రావించిన.
సీ. అల్లదనంబునం[3]యనువు మైకొనఁ జూచు, నడపు కాంతికి వింతతోడవు గాఁగ
వెడవెడ నూఁ గారి వింత యై యేర్పడు, దేరనివళులలో నారు నిగుడ
నిట్టలు ద్రోచుచు నెలవులకలమేర, లెల్లను బిగి యెక్కి యేర్పడంగఁ
దెలుపును గప్పును వెలయంగ మెఱుఁగెక్కు, తారకంబులఁ గల్కితనముదొడరఁ
ఆ. జరణములును నడుముఁ జన్నులుఁ గన్నులు, జవ్వనంబుచెన్ను నివ్వటిల్లు
చునికిఁ దెలుపు చుండ నుత్తర ననుదెంచె,నలరువిలుతుపువ్వుటమ్ముపోలె. 245
ఆ. వచ్చి కొలువు సొచ్చి నెచ్చెలిపిండు నం,తంత నిలువఁ బనిచి యల్లనల్లఁ
గదిసి ప్రౌఢ వనితకై వడి ముద్దియ, ముద్దు పుట్టఁ దనకు మ్రొక్కుటయును.

1 హేమచిత్రితలసద్వర్మం. 2 బేంఖణంబు ... బేరణియును. 3 కనువు ... జిగి యెక్కి.

చ. తిగిచి కవుంగిలించి జగతీవిభుఁ డక్కమలాయతాక్షి నె
మ్మొగము మొగంబునం గదియ మోపుఁ గరాంగుళులం గపోల మిం
పుగఁ బుడుకుం బొరిం బొరి నపూర్వవిలోకన మాచరించుఁ గ
ప్పుగుమృదుమాళి నుజ్జ్వలనఖాంకురచేష్ట యొనర్చు నర్మిలిన్. 247

వ. ఇవ్విధంబునందనగాదిలికూఁతు నుపలాలించి బృహన్నల దెసంగనుంగొనిసాదర దరహసితరుచిరాననుండై యిమ్మగువ నీకు నాటగఱపం దగుపాత్రం బగునేయని యడిగి తత్ప్రీతివచనంబులయందలినాగరికత్వంబునకుఁ జిత్తంబు రంజిల్ల మధుర సల్లాపంబు సేసి కర్పూరసహితం బగుతాంబూలంబు వెట్టి చిత్రంబులగు చీనాంబ రంబులిచ్చి మణిమయంబులగునాభరణంబు లొసంగి సంభావించి యవ్విభుండు.

ఆ. నీవు చతురమతివి నీకు నిక్కన్నియ, నప్పగింప నేల యైన నాదు
హృదయ[1]మతులు దీనియెడఁ గడు నార్ద్రమై,యుండుఁ గానఁ జెప్ప కుండరాదు.

క. నెచ్చెలులతోడ నెంతయు, మచ్చిగఁ దనయిచ్చ నాడ మరగినయది యై
విచ్చలవిడి నింతకు ము, న్నిచ్చేడియ మెలఁగుశిక్ష యెఱుఁగుదునమ్మా. 250

ఆ. బాల కేళిమీఁదిభరము గ్రమంబున, విడువఁ గళలయందు వేడ్క సొనిపి
నయముతోడ నర్తనంబుల శిక్షింపు, నెలఁత కేడుగడయు నీవ కాదె. 251

చ. అని యుచితంబుగాఁ బలికి యంగనహస్తముఁ బట్టి తత్కరం
బునఁ గదియించి నీగురువుఁ [2]బొత్తి తగం గొనియాడు మెట్లు సె
ప్పె నటుల భక్తిమై నడపు పెంపెస లారఁగఁ గూడుగూర చం
దనకుసుమాదులున్ నడపి తప్పక యారసి గారవింపుమీ. 252

ఆ. ఎల్లచుట్టములును దల్లియుఁ దోడును, జెలియుఁ బరిజనంబుఁ జెలువ నీకు
గరువ యింక నొక్కకొఱఁతయు లే దిందుఁ, జేరి బ్రదుకు బుద్ధిగారవమున.

క. మనయింట నిచ్చ టచ్చో, టన కెచ్చట నైన నీబృహన్నల మెలఁగం
జనియెడుమానిసి దనమన, మున కిమ్ముగునట్టిచరితమున వర్తించున్. 254

నకులుఁ డశ్వపాలకుఁడై విరటుఁ గొల్వ వచ్చుట.

వ. అని యిత్తెఱంగున నయ్యిరువుర నొండొరులకు నప్పగించి పుచ్చినయనంతరంబ నకులుండు. 255

ఉ. అంబుజముల్ సముద్యదరుణాంశునిఁ గన్నవిధంబునన్ వికా
సంబున నుల్లసిల్లి జనచారువిలోచనముల్ నిజోజ్జ్వలాం
గంబున కర్థిమై నభిముఖంబులుగాఁ జనుదెంచి దైవయో
గంబున భూవిభుండు దురగంబులఁ దేరఁగఁ బంచిచూడఁగన్. 256

వ. ఆస్థానంబు సేర వచ్చి ఘోటకంబుల నుపలక్షించుచున్న నన్నరేంద్రుండు గనుంగొని పరిజనంబుల కతనిం జూపి. 257

1 మలరు. 2 బోటి.

క. ఇతఁడెవ్వఁడొకో రూపు ని,రతిశయమై మనమునకుఁ బ్రియం బొనఁగెడుఁ జూ
చితిరే చిత్తంబు సుదా,త్తత గానఁగ నయ్యెడుఁ వదనమునభంగిన్. 258
క. తురగంబులఁ జూచువిధం, బరయఁగ నితఁ[1]డశ్వవిద్యయందు నిపుణతా
స్ఫురణము గలవాఁ డగు బం,ధురమూర్తి పరాక్రమాన్వితుఁడు గానోపున్.
క. మీ రెఱిఁగినఁ జెప్పుఁ డీతని, పే రెఱుఁగనియట్టులైనఁ బెంపారంగాఁ
జేరం జని యల్లన యొకఁ, డారసి యెఱుఁగంగ వలయు ననుసమయమునన్.
క. చేరఁ జనుదెంచి పాండవ, వీరుఁడు మత్స్యాధిపునకు వినతుండై దే
వారాజవాహనము లగు, వారువముల నరయ నేర్తు వల నేర్పడఁగన్. 261
వ. దామగ్రంథి యనువాఁడ నాకు నశ్వవిషయం బయినవిచక్షణత్వం బెల్లనుం 262
గల దవధరింపు మని యిట్లనియె.
సీ. అవయవలక్షణం బాయుఃప్రమాణంబు, గర్భంబు లింగితాకారములును
మాత్రాంతరము వయోమానంబు దేశకా, లోచితాహారప్రయోగభంగి
జాత్యనురూపశిక్షావిధి క్రమగతి, వ్యాయామ[2]సాత్మ్యప్రవర్తనంబు
ప్రమదవిషాదాదిబహువిధచిత్తధ,ర్మము పోషణప్రకారము చికిత్స
ఆ. పరిచితములు ధరణిపాల నీముందట, రూపురేఖ మెఱయఁ జూప నేర్తు
బవరమైన నాకుఁ బని యేమి యనఁ జేతి, బలిమికలిమి నెఱపఁ దలఁపు గలదు.
వ. అనిన విరాటుం డతని కిట్లనియె. 264
క. నీకుఁ దగుపదవి యిచ్చెద, నాకలిమికి నెల్ల రక్షణం బొనరింపం
గాక హయశిక్ష[3]కుఁడ వగు, నాకొలఁదియె యిట్లు పలుకు టనుచిత మరయన్.
ఆ. అనుడు నకులుఁ డిట్టులను దేవ తమతమ, నేర్చుపనులవెంట నెగడి బ్రదుక
వలయుఁ గాక [4]నగరఁ దలము దప్పినమెలం, కువ కలుపు లియ్యకొనుటదగునె.
ఉ. ధర్మసుతుండు వెంచె ననుఁ దాన తురంగమశాస్త్రశిక్షకుం
గర్మఠుఁ జేసి యాత్మతురగంబుల కెల్లను నన్ను యుక్తుఁ గా
నర్మిలి నిల్పి యాగియుఁ బ్రియంబును నామెడ నాఁటినాఁటికిం
బేర్మి వహించుచుండ నడపెం దనతమ్ములలోనివానిఁగాన్. 267
క. ఆవిభుఁడు రాజ్యసుఖలీ, లావిముఖత వెడలి బంధులం దోఁడ్కొని యథే
ష్టావాసత బ్రుంగుడువడి, పోవుట నెచ్చోటఁ గడుపుఁ బ్రోతునో యనుచున్.
క. తిరిగి తిరిగి లోకోత్తర, చరితుఁడు సుజనుండు మత్స్యజనవిభుఁడు యుధి
ష్ఠిరునట్ల యనఁగ విని నినుఁ, గర మనురాగమునఁ గొలువఁగా నియ్యెడకున్.
క. చనుదెంచి కాంచి నానేర్చిన తెఱఁగున విన్నపంబు సేసితి నన్నుం
బనిగొనఁ దలఁచిన నేలెడి, దనుమానము గలిగెనేని నరిగెద నధిపా. 270

---

1 డశ్వశిక్ష. 2 సత్వ; సాత్వ (ధ్య). 3 కుండ (న)ను, నా. 4 (నగర)...కలు
(వ్రాతప్రతులం దలుపు లనియ యున్నది).

వ. అనవుడు. 271

ఉ. ఆనరనాథుఁ డిట్లనియె నశ్వములం బరికించి యున్కి యిం
పేనిఁ దురంగశాలలకు నెల్లను ముఖ్యుఁడ నై తదీయనా
నానియతప్రకారకరణంబులఁ ద్రిమ్మరు చున్నవారి ము
న్నే నెటు లట్లు నీ వరసి యిచ్చమెయిం బనిగొమ్ము నెమ్మితోన్. 272

క. అని చెప్పి యధికసమ్మా, ననపూర్వముగాఁగ మత్స్యనరపతి మాద్రీ
తనయుఁ దగ నిల్పె నాతఁడు, దనమదిఁ బ్రియ మందె నతనితమ్ముం డంతన్.

సహదేవుఁడు గోపవేషంబున విరటుఁ గొల్వ వచ్చుట.

క. [1]భావన శాంతత్వము నిజ, భావంబున సూక్ష్మలతయుఁ బ్రకటంబులు గా
నావిధుఁడు మనుజవేషం, బై వచ్చెనొ శిఖి శరీరి యయ్యెనొ యనఁగన్.

క. [2]తలుగులపొది యొక దెసఁ బె, య్యలదామెన యొక్కవలన నను నై యుండన్
మొల మోపి పెక్కుచుట్లన్, బలుద్రాటం జుట్టి గోపభావం బలరన్. 275

చ. నునుసెలగోల సేకొని మనోహర మై తనమేను రాజుచూ
పును బ్రజచూడ్కులం దిగువఁ బుష్కరపత్త్రనిభంబు లై సలో
చనముల మూర్తి దెల్పఁగ ససంభ్రమతం జనుదెంచె నల్ల న
ల్లన వెడభీతి దోఁప జనులన్ వెగ డయ్యెడుదృష్టిఁ జూచుచున్. 276

వ. ఇట్లు వచ్చి మత్స్యమహీవల్లభు నంతంతం జేరి వినయావనతుండగుచు నిట్లనియె.

క. నీపసులఁ గావఁ బెట్టుము, [3]భూపాలక నన్ను నేను బూని యరసినన్
గోపంక్తులు రుజ వడ వొరు, చేపడ వెన్నఁడును డప్పిఁ జేడ్పడ వెచటన్. 278

తే. తొఱఁగువో కుండ మెకములు గఱవ కుండఁ
బాఁడి దఱుఁగక యుండ నాపాటిగొల్ల
లిచ్చ మెచ్చ నీదృష్టికి నెక్కఁగ దుపు
నరయ నేర్తు న న్నేలుము ధరణినాథ. 279

వ. అనిన విరాటుండు పాండవావరజున కిట్లనియె. 280

ఉ. ఎక్కడిమాట గొల్లతన మించుక యేనియు లేదు నీదెసం
జక్కనిమేను నీగఱువచందముఁ గాంతియుఁ జూడ వచ్చినన్
నిక్కవ మీవు సూర్యశశినిర్మలవంశజు లైనరాజులం
దొక్కమహానుభావుతనయుండవు గా వలయున్ నరోత్తమా. 281

ఆ. వలయుపదవియందు నిలిచి నారాజ్య మం, తయును జక్కఁబెట్టి నయము విక్ర
మంబు నడపునంతమానిసి వై యుండి, కుచ్చితంపుబ్రదుకు గోరఁ దగునె.

వ. ఉత్తమవాహనంబులు మహనీయాయుధంబులు నిచ్చెద మత్స్యదేశంబున భవ
దభిమతస్థలం బొసంగెద మదీయమండలసేనాపరిపాలనంబు సేసి వర్తిల్లుము.

---

1 పావనశాంత. 2 పలుపుల. 3 భూపతిలక...జేడ్పడ వెంచున్.

చు విరాటధరణీశున కి
క. అనవుడుఁ బాండునృపాలక, తనయుఁడు మ్రొక్కుచు విరాటధరణీశున కి
ట్లను హీనకులుఁడ బాలుఁడ, మును నాగరికంపుఁగార్యముల వెర వెఱుఁగన్.
ఆ. పసులఁ గాచి కాని బ్రదుకఁ గొరవులప్రాఁ, తలము మున్న నేను ధర్మపుత్త్రు
పశుగణంబు నెల్లఁ బాలింతు నమ్మహీ, వరునిచిత్తమునకు వచ్చువాఁడ. 285
వ. తంత్రీపాలుం డనం బరఁగినవాఁడ నాచేతం గ్రేపులు పురాణించుటం జేసి కొం
డొకకాలంబునన కదుపులం బెనుతు నే నగు నని కైకొనిన యాఁబోతుపంచితం
బు మూర్కొనినను భైగాలివీచినను గోడ్డున కైనం జూలు నిలుచు నంగిడి
యదురుఁద్రిక్క యనువానికి నాపేరు సెప్పినం జాలు మఱియును బసికి వలయు
తెఱంగులెల్ల నెఱుంగుదు వే ఱొక్కపనికిం గాను గాని యే నీవెంట నీమనసు
వడయం జాలుదు నావలనం బ్రయోజనంబు గొనవలయు నేని నొండుమాటలు
దక్కి పసులం బరికింప నియోగింపుము. 286
చ. అనుటయు నెట్టకేలకు ధరాధిపుఁ [1]డట్టుల కాక యంచు నా
తనివదనంబు సూచి యుచితం బగునేనిఁ బ్రియంబ యేని నె
ట్లును గురుకార్యవర్తనములుఁ రుచియింపక యుండునేని గో
ధనముల కెల్ల రక్షణముఁ దత్పరతం దగఁ జేయు ముఖ్యతన్. 287
క. మున్న గలగోపవర్గము, నిన్నుం గని కొలిచి భక్తి నీపని సేయఁ
మన్ననమానిసి వై నీ, వున్నం గడు మేల కాక [2]యొప్పమి గలదే. 288

ద్రౌపది సైరంధ్రీవేషమున సుదేష్ణఁ గొలువ వచ్చుట.

వ. అని పలికి యతనియభిమతంబు సలిపి నిలిపె న ట్లయ్యేవురును విరటుం గొల్చిరి
తదనంతరంబ. 289
క. గారవమున నిజదేశా, చారముమై [3]నల్లి యున్నజడ యగుకబరీ
భారంబు విచ్చి తిరముగ, సైరంధ్రీజాతివేషసముచితభంగిన్. 290
క. వలపలిదిక్కున కించుక, మలఁగంగాఁ [4]దుఱు మిడి కుఱుమాపుడుఁబుట్టం
బలవడఁ గట్టి జరఠవల్కలమున నెవ్వఁగుఁజన్నుఁగవ గప్పి తగన్. 291
క. పరిచారికాత్వరేఖా, పరిణతి దనమేన నచ్చు [5]వడుభావనకుం
దిర మై తలకొనునంతఃకరణముతోఁ బురము ద్రుపదకన్యక సొచ్చెన్. 292
వ. ఇట్లు సొచ్చిన. 293
సీ. పఱమొయిల్ గప్పినఁ బాడఱినునుఁగాంతి, గదలినయమృతాంశుకళయుఁబోలెఁ
బెనుమంచు మీఁదఁ బర్విన వికాసము దప్పి, చెలువు గుందినసరోజినివిధమున
ధూమంబు వొదివినఁ దుఱఁగలి మెఱుఁగులు, నలఁగి మాసినదీపకళికపగిది
ధూళి పైఁ బొరసినఁ దొంగలించుట మాని, లావణ్య మెడలినలతికభంగి

1 డట్టుగఁ గాక. 2 యొ ప్పగునదియుఁ. 3 నమరి...విచ్చి తుఱుముగ. 4 దుఱుము కుఱుచ (లు) (కొప్పు దుఱిమి) జటావల్కల...నవ్వఁగు; నునుబిగువు. 5 పడ.

తే. గంధకారికావేషంబుకతన మూర్తి, యుజ్జ్వలత్వంబు మఱువడియుండఁ బాండు
తనయమహిషి యంచితగతిఁ జనఁగ రాజ, వీథిఁ బౌరజనంబు లవ్వెలఁదిఁ జూచి.
ఉ. రోహిణి యొండె నొండెను నరుంధతి గాక మనుష్య[1]జాతియే
యీహరిణాక్షి చెల్వమున నెత్తెఱ చూడ్కులు నాఁచికోల కా
దా హితగౌరవం బగుశుభాంగముఁ దేజముఁ జూడ బుద్ధిసం
దేహముఁ బొందుచున్నది సతీజన మిట్టిదె యెజ్జగంబులన్. 295
వ. అనుచు నంతంతం జేరి. 296
క. నీ వెవ్వ రేమిపనికై, [2]యేవలనికిఁ బోవు చునికి యిది నావుడు న
ద్దేవియు సౌముఖ్యము సం, భావనముం దోఁప నుచితభంగిం జెప్పెన్. 297
ఆ. ఏను గట్టువాలుదాన నా కెవ్వరు, గడుపుకూడు వెట్టి కట్టఁ జీర
యిచ్చి సాకతమున నేలుదు రట్టివా, రలకుఁ బనులు సేసి మెలఁగుబుద్ధి. 298
క. వచ్చితి ననవుడు విని జను, లచ్చెరువును సందియంబు [3]నడరెడుమదితో
నిచ్చెలువ గడుపుకూటికి, నెచ్చట నేనిలుచునట్టె యిది పలు కగునే. 299
వ. అనుచుం గనుంగొనుచు ముసరికొ(ని చ)ను చుండం బాంచాలరాజనందన
రాజమందిరంబుచక్కటికి నరుగునవసరంబున. 300
క. ముద మొదవ రమ్యహర్మ్యము, తుదినిలువునఁ బ్రణయసఖులతోడ విహారా
స్పద మగునెలవున మెలఁగెడు, సుదేష్ణ తజ్జాలకములఁ జూచెం బ్రీతిన్. 301
వ. ఇత్తెఱంగున మత్స్యరాజమహిషి ద్రౌపదీదేవి నాలోకించి కుతూహలంబున.
ఉ. ఎక్కడనుండి యెక్కడకు నేఁగెడినో యిది యొక్కకాంత రూ
పెక్కుడు పెంపుసొంపు మన కేర్పడుచున్నది దా వినీత యై
స్రుక్కుచు నీచభామినులచొప్పునఁ బల్కెడుఁ బౌరులుం గడుం
వెక్కస మంది చూచెదరు వేగమ తోడ్కొని రండు నెమ్మితోన్. 303
క. అని పలికి పనుపఁ బ్రౌఢాం, గన లిరువురు వోయి ద్రుపదకన్యకతో ని
ట్లనిరి విరాటుమహిషి నినుఁ, దనపాలికిఁ బిలువఁ బంపె దయ[4]పెం పెసఁగన్.
వ. అనవుడు. 305
క. [5]తనతలసీర యరసి య, వ్వనితారత్నంబు వినయవైభవము సతీ

1 మాత్రయే...గాచికోలు... (సతీజను లిట్టిర). 2 (యేవలనం ; యేవెంటం)...స, ద్భావంబును. 3 నందెడు (నలరెడు)...నైన నిలుచునటె యిది తగ వగునే. 4 చిగురొత్తఁగ. 5 (తన పిలిచినపని యారసి) 'తనతలఁపు నెరసె నని' అనియొకటిరెండు నూత్నముద్రితములు. 'తన తలసీర యరసి' అనునది మూలమున 'ఏకవాససమ్' అని యుండుటచేతను, అంగును మేలిముసుఁగు ప్రస్తావమే లేనందునను, తలసీరలోని సాదేశానిష్టముచేతను సమంజసము కాదఁట. 'అవ్యాక్షేప' న్యాయముచేఁగూడ నిది బాగేకాని 'ఏకవాససం' అను నియతి 'నలపలిదిక్కునకు' అను పద్యముతో నగళితమగుటచేతను, .సందర్భానుగుణ్యమును బట్టియు తలసీరలోనే యౌచితి మెఱయు

తను వొందినచందంబునఁ, జనియెం గేకయసుతానుచారికలబడిన్. 306

వ. ఇవ్విధంబునం జని సౌధంబునుపరిభాగం బెక్కి. 307

సీ. పదతలంబులకెంపు పరఁగినతలము కుంకుమలిప్తమైనచందము వహింప
నంగంబునునుఁగాంతి యడరినగోడలు, వేదులు మణిమయవిధము నొందఁ
గనుఁగవమెఱుఁగులు [1]గదిరినముందర, పుష్పోపహారంబుపోలుపు దాల్ప
వేనలికప్పు పర్విననమీఁదు నీలదుకూలంబుమేల్కట్టుకొమరు వడయఁ

తే. దాను జొచ్చినకతన మత్స్యక్షితీశు, నింట నిమ్మెయిఁ గ్రొత్తయొప్పెసక మెసఁగ
నమ్మహాదేవి యున్నెడ కల్ల నల్లఁ, బాండురాజతనూభవపత్ని యరిగె. 308

వ. కేకయరాజనందనయును. 309

చ. కనుఁగొని గారవంబును మొగంబునఁ గేలఁ బురఃప్రసారముం
దనువున నమ్రభావమును దంతమరీచుల సామినిర్గమం
బును దనలోఁ గడల్కొనఁగ భూరితరాదరరేఖ నిందు ర
మ్మనవుడు నంత నంత ద్రుపదాత్మజ సేరి వినీతి నిల్చినన్. 310

క. ఆపాదమస్తకము త, ద్రూపము వీక్షించుచుం గుతూహల మడరన్
భూపాలమహిషి యిట్లను, నాపోలఁతుకతోడ నుచితమయ్యెడుభంగిన్. 311

ఆ. ఏది కులము నామ మెయ్యది యెవ్వరి, దాన వేమిపనికిఁ బూని యిప్డు
[2]డెచటు బుద్ధిఁదలఁచి యేఁగెదవింతయు, నెఱుఁగఁజెప్పు మాకు మెఱుఁగుఁబోఁడి.

వ. అనిన విని యాజ్ఞసేని యిట్లను నేను సైరంధ్రీజాతిసంభూతనభిధానంబు మాలిని పురుషపంచకసనాథ నై యుండుదు నొక్కకారణంబున నుద్ధతు లగువిరోధుల చేతం బతులసన్నిధిం దలవట్టి యీడ్వంబడి వనంబునకరిగి వ్రతంబుమై వల్లభసహితంబుగా వన్యాహారంబులం గాలంబు గడపుచు బ్రహ్మచర్యంబు నడపితి నిట మీఁద నియమాచరణంబునకు నొక్కసంవత్సరంబు గొఱంత గలదు నీవు ధర్మవర్తిని వని వినుటంజేసి నానేర్చుపనులవెంట నీకడ నిలువందలంచి యిందువచ్చితి ననవుడు సుదేష్ణ యిట్లనియె. 313

క. సురగరుడఖచరవిద్యా, ధరకిన్నరయక్షసిద్ధతరుణులలో నీ
వరయఁగ నొక్కతె వగుది, ప్పురికిం జనుదేరఁ గతము బొంకక చెపుమా. 314

క. అనుటయు దరహసితముమో, మునకుఁ దొడవుగాఁగఁ బలుకు ముద్దియ యేఁ గృ
ష్ణునిదేవి సత్యభామకుఁ, బని సేయుదుఁ దొల్లి పిదపఁ బాంచాలికడన్. 315

తే. తగవుమైఁ బరిచారికాధర్మములకు, నెల్లఁ జాలి వర్తించితిఁ దల్లి వినుము
[3]నాకుఁ బ్రాణంబు ప్రాణమై నన్నుఁ దన్న, కాఁగ భావించి యాదేవి గారవించు.

---

చున్న దని సూక్ష్మదృక్కులమతము. మఱియుఁ బంచమాశ్వాసమందలి 260 వచనమువలనను పరివస్త్రమున్నట్లు దృఢమగుచున్నది.

1 గదిరినముందల. 2 డెటుకు బుద్ధిఁ; డెచట నుండఁ...నిగురుఁబోఁడి. 3 నాకుఁ బ్రాణంబు.

వ. నీవును. 317

క. నీచము లయ్యెడుపనులకు, నాచాలమి యెఱిఁగి మన్ననకుఁ బాత్రముగా
నీచిత్తంబునఁ గైకొని, యాచారము దప్పకుండ నరయుము నన్నున్. 318

వ. అని యిట్లు దేవజాతి యనుసందియంబు వాయం బలికి మఱియును. 319

క. కలపములు గూర్ప బహువిధ, తిలకంబులు వెట్ట వింత తెరువునఁ బలు[1]పు
వ్వులు గట్టి కట్టి ముద్దుగఁ, దల ముడువఁగ నరులు గ్రువ్వఁ దద్దయు నేర్తున్.

మ. అనినం గేకయరాజనందన ప్రభూతాశ్చర్య వై యిట్లనున్
విను నీరూపము సూచి మానృపతి యువ్విళ్లూరు నే నెమ్మెయిం
బనిగొందుం దగ నింతులుం దగిలి నీపైఁ జూడ్కి నెక్కొల్పి నె
మ్మనముల్ విస్మయ మందఁ జూచెదరు భామా పల్కు లిం కేటికిన్. 321

క. దుర్భర యగునినుఁ గర్కటి, గర్భము ధరియించునట్లు గైకొని నాకై
నిర్భరవిధ్వంసదశా,విర్భావము దెచ్చుకొనుట వెరవై యున్నే. 322

ఆ. అనిన నీతలంచి నట్ల కా దేర్పడ, వినుము నాదుపతులు వెరవు లావు
నలఘువిక్రమంబుఁ గలుగుగంధర్వు లేమఱు నన్ను నొక్కమాత్ర మైన.

క. నీచమతి నన్ను నెవ్వఁడు, సూచిన నారాత్రిలోనఁ జూతురు దెగఁ దా
రాచపలు హరిహరాదులు, గాచిన బలవిక్రమము లఖర్వము లైనన్. 324

క. బంధుశతంబులు శౌర్యమ, దాంధము లై శక్తిసంపదాభీలతమై
సింధురసదృశత నున్నను, సంధులసంధు లెడలించి చంపుదు రతనిన్. 325

వ. కావునఁ బురుషులు నాకడం దేఱి చూడను వెఱతు రదియునుం గాక. 326

క. నాచిత్తము దాదృశులకు, గోచరమే యస్మదీయ కులజన[2]సంశి
తాచారమహిమ యట్టిది, యే చెప్పకు తద్విఘాతి హీనవచనముల్. 327

చ. మనమున నూఱడిల్లు మనుమానము మానుము నన్ను నేలు మే
పనులు నుదాత్తనాగరికభంగుల నీమది కెక్కునట్లు నే
ర్పును భయభక్తులున్ మెఱయ రూపుగఁ జేసెదఁ దజ్జ్ఞ లైనస
జ్జనులు నుతింప వర్తనము సాధులు వృద్ధులు మెచ్చఁ జల్పెదన్. 328

క. ననుఁ గుచ్చితంపుఁబనులకుఁ, బనుపక యెంగిలికి లోనుపఱుపక తగుమ
న్ననతోడ నరయువారల, కనురాగము నెఱపి [3]నడతు రస్మత్పతులున్. 329

ఆ. అనిన సంతసిల్లి యద్దేవి సైరంధ్రి, నూఱడిల్లఁ బలికి యునిచికొనియె
నంతిపురముచరిత కలవడ మెలఁగుచు, నుండె నవ్వధూటియును ముదమున.

క. ఇవ్విధమున నయ్యేవురు, నవ్వేలఁదియు సకలజనుల కజ్ఞాతముగా
నవ్విరటుబ్రోలిలఁ బ్రమదము, నివ్వటిల వసించి రుచితనిభృతత్వమునన్. 331

వ. అనిన విని వారలవర్తనం బటమీఁదఁ జెల్లిన తెఱం గెఱింగింపు మని యడిగిన.

1 ప్రువ్వుల. 2 సంరక్షాచార. 3 కొలుతు.

ఉ. బాంధవశాత్రవాకలితభావభవా భవపాశ[1]బంధసం
బంధవిరామరామ పరిపక్వవివేకనిరూఢభక్తహృ
ద్గ్రంథివిభేదనా పరమకారుణికా పరిమాణదూర దుః
ఖేంధనపావకాయితసమీక్షణ చైత్త్ర్యమహాద్భుతప్రదా. 333

క. అన్నమయత్వాదివిరా, మోన్నత వాఙ్మనసదూర యోగిస్మేరా
[2]భిన్నాభిన్నాకార, చ్ఛన్నాత్మీయప్రకార జగదాధారా. 334

మాలిని. కమలభవకిరీటగ్రామపద్మావలీసం
గమసుభగపదాబ్జా గాఢ[3]భక్తిప్రకార
ప్రముదితమునిశశ్వ ద్భావనాగమ్యరమ్య
క్రమపరిణతమూర్తీ శ్రౌతశాఖాగ్రవర్తీ. 335

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున విరాటపర్వంబు నందుఁ బ్రథమాశ్వాసము.

---

శ్రీ

గణేశశారదాగురుభ్యో నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## విరాటపర్వము, ద్వితీయాశ్వాసము.


మదపాంగాలోకన
ధామసకృత్సంగరూఢతాదృశవిభవో
ద్దామాశ్రితలోకాలో
కామయనిర్హరణనిపుణ హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్టియెడ ధర్మసూనుండు సభాజనంబులయుల్లంబులు రంజిల్ల రాజునకు వినోదంబులు వివిధోదాత్తప్రకారంబులఁ జలుపుచు నొక్కొక్కమాటు మధురప్రసంగంబుగా నాడినసెత్తంబున గెలిచిన విత్తంబులు దమ్ముల కొసంగుచుండు వాయునందనుండు వంటకు మిగిలినమాంసంబు లమ్మునెపంబున నిచ్చలు సహోదరులకు నిచ్చుచుండు వివ్వచ్చుండు సంగీతప్రసంగంబున మెచ్చువడసినకనకాంబరాదులు సోదరులకుం జేర్చుచుండు నకులుండు [1]దురంగంబులగ్రాసంబులం గనినధనంబులు తోడంబుట్టువులకుఁ బెట్టుచుండు సహదేవుండు గోవులం జూచి భూవల్లభుండు సంతసిల్లినసమయంబున సముపార్జితంబు లగుపదార్థంబు లన్నియు నన్నలవశంబు సేయుచు వారలకు గోరసంబులం దుష్టి సలుపుచుండు ద్రౌపది దన్నరసికొని తిరుగుచున్న వీరలం గన్నులారం జూచుచు నుచితంపునడవడి మెలంగుచుండు. 2

తే. ఇట్లుదమతమవర్తిల్లునెడల సకల
జనములకు హృదయానురంజన మొనర్చి
తాల్మి పుయిలోట యడఁకువ తగవు మెలపు
నెఱిదెఱంగు వాటింపంగ నేర్పు గలిగి. 3

క. ఉన్నతఱి వివిధదేశో, త్పన్నులు నద్భుతవిధాయిబలవిక్రమసం
పన్నులు నగుమల్లులు విభ,వోన్నతుఁ డగువిరటుపాల నుద్భటవృత్తిన్. 4

1 దురంగప్రసంగంబులం.

క. తమలోన మాటలాడెడు, సమయంబున నొక్కరుఁడు విశాలోరస్కుం
డమితబలుఁడు పంచానన, సమమూర్తిస్ఫూర్తి యధికసంరంభమునన్.

వ. అన్నరపతికట్టెదుర నిల్చి మ్రొక్కి భుజాస్ఫాలనంబు సేసి యిట్లనియె.

తే. నేలనాలుగుచెఱఁగులనృపులకొలువు, లందు నేను వర్తించితి నవనినాథ
[1]యగ్గలించి నాయెదుర బాహాప్పళించి, కడఁగఁ జాలెడుమల్లుఁ గాన నెందు.

చ. అనునెడ వానియుగ్రసమదాకృతియుం బటువాక్యవృత్తియుం
గని విని మల్లురెల్ల భయకంపితమూర్తులు దాల్చి మాఱు వ
ల్కను గను విచ్చి చూడను మొగం బెగయింపను జాల కున్న న
జ్జనపతివేడ్క మోడ్పడుచందము గాంచి యుధిష్ఠిరుం డనున్. 8

క. వీనికి మార్కొనఁ జాలెడు, దానికిఁ దగువాని ధర్మతనయునిపురిలో
నానానియుద్ధలంపటు, నే నొక్కనిఁ గంటి [2]నిపుణుఁ డిందుల కతఁడున్. 9

క. మనబానసీఁడు వలలుం, డనుశూద్రుఁడు నాకుఁ దెల్ల మధికబలుల నో
ర్చినవాఁ డనేకమల్లుల, నిను మెచ్చింపంగఁ జాలు నిజ మిది యధిపా. 10

క. అనవుడు భూపతి పిలువం, బనిచె నతని నతఁడు నపుడ భయభక్తులతోఁ
జనుదెంచి మల్లవర్గముఁ, గని మై వెలుఁగంగ నిలిచెఁ గౌతూహలి యై. 11

వ. ఇట్లు నిలిచినపవనతనయు నవలోకించి యవనీవల్లభుం డమ్మల్లముఖ్యుం జూపి యితనితోడియుద్ధంబునకు సన్నద్ధుండవు గమ్మనిన నతండును ధర్మతనయుకను సన్న గనుంగొని యమ్మత్స్యవిభునకు వినయంబుతో నిట్లనియె. 12

తే. అధిప ధర్మజుపాల నున్నప్పు డతని, వేడుకకుఁ దగఁ బెనఁగుదు వింత లైన
[3]జెట్టిమల్లులతో నిప్పు డట్టువోలె, నీదువేడ్కకుఁ బెనఁగెద నేర్చినట్లు. 13

భీముఁడు మల్లునితో యుద్ధము సేయుట.

వ. అని మెత్తన యియ్యకొని గర్జించి గజాలస్యంబునం బ్రాంగణంబు సొచ్చి భూపాలునిముందట భుజాస్ఫాలనంబు సేసి మ్రొక్కి మరలునెడ నంతకు మున్న యమ్మల్లవరుండు నరపతియనుమతి వడసి కృతపరికరబంధుం డై యరుగుదెంచి యచ్చట నునికిం జేసి యతండును ననిలసుతుండునుం బరస్పరమూర్తుల నవలోకించి యుద్ధరంగంబుమన్ను ఫాలప్రదేశంబున ధరియించి శరీరంబులపైఁ జల్లుకొని రెండుసేతుల మునివ్రేళ్లను గొండొక వుచ్చికొని యొండొరులదెసకు వైచి యున్నతంబు లగునపసవ్యకరంబుల నాకుంచితసవ్యబాహుతలంబుల నప్పళించుచప్పుళ్లు గలసి యొక్కరుండ మల్లసఱచినచందంబున వీతేర వింత తానకంబుల నిలిచి కదిసిన యప్పుడు వృకోదరుండు. 14

1 యగ్గలించియు బాహావు లప్ప ; యగ్గలించి నాయెదుర చే యప్ప...కడవఁ జాలెడు.
2 నిప్పు డింగుల (నతఁడున్). 3 యట్టి...డట్లవోలె ; జెట్టి...గూడ నట్లవోలె.

సీ. ఉపతాయిలోఁ [1]దన కొదవినతోరహ, త్తము సూపి వేఁ)యక సమదవృత్తిఁ
బాసి క్రమ్మఱఁ జేరు బలువిడి వాఁడు పై, నదరిన జరగక యవనిఁ గ్రుంగి
నిలుచు నొత్తొరువున వలచినయప్పుడు, గొనిపోవు నవలీలఁ గూల వైచు
జళికి పట్టిన మనుసన్నపువిన్నాణ, ములు దొరకొన్నను ముట్టఁగొనఁడు
తే. కాలిదెసఁ జొర వచ్చుట గానిపించి, యడుగు సీసానఁ బట్టియు నుప్పళించుఁ
బోవ నిచ్చు మగుడ నేచి పోరఁ జేరు, నెడల సరిసేయ నగుతడ వీక హత్తు.
వ. మఱియు ననేకగతులయోజలు మెఱయుచుఁ గొండొకసేపు విరాటునకు వినో 16
దంబు సలిపి.
ఆ. కచ్చ యమరఁ బట్టి కాళ్లును జేతులు, వేఁ)ల మత్తగజములీల మెఱయ
ముష్టిబలువు నెఱయ ముక్కున వాతను, నెత్తు రొలుక మల్లు నెత్తి వైచె. 17
వ. ఇవ్విధంబున విసరి నేలతో వేఁ)సి వీపున మండివెట్టిన. 18
క. పెలుకుఱి తాళం బీ మదిఁ, దలఁచి యనువుగాక ధరణితలముఁ గరతలం
బులఁ నప్పళించె వాఁడ, క్కొలు వార్వఁగ విఱిచి మెఱసెఁ గుంతీసుతుఁడున్.
వ. ఇవ్విధంబున మహాబలుపట్టి యాజెట్టి నెట్టన గెల్చిన మత్స్యపతి మెచ్చి తన
కిచ్చినధనంబు లచ్చటి(యర్థిజ)నంబులకిచ్చి నిజనివాసంబునకుంజనియె మఱియు
నిత్తెఱంగున నతనికి వేడ్క సలుపు చుండుఁ జిక్కనిమల్లులు లేనితఱి నంతిపురం
బునింతులు సూడ నయ్యవనీకాంతుండు పోరింప శార్దూలశుండాలాదులతోడ
నీడంబోక పెనంగి భంగంబునకుం దెచ్చి మెచ్చించు చుండు. 20
క. పెఱవారలు దమమెలఁగెడు, తెఱఁగులు దొరఁకొన్న వింత తెరువుల నేర్పుల్
మెఱయుచుఁ బతిచిత్తము గొన, నొఱపు గలిగి మాస్యవృత్తినుండుదురుదగన్.
వ. ఇట్లు పాండవులు పాంచాలీసహితంబుగా విరాటునగరంబున వర్తించుచుఁ గతి
పయదినంబులు గొఱంతగా నేఁడుకాలంబు గడపినసమయంబున మత్స్యపతి
మఱందియు దండనాథుండును గీచకాగ్రజుండును రూపాభిమానియు నానా
భరణధరణశీలుండును దుర్విదగ్ధుండును బలగర్వితుండును నగుసింహబలుండు
దనయప్పును దేష్ణకు మ్రొక్కం జనువాఁ డద్దేవి కనతిదూరంబున నున్నద్రుపద 22
రాజనందనం గనుంగొని.
ఉ. అక్కజ మైన[2]చెల్వమున నాత్మకు వేఁగయి పొల్చుపొల్తిపై
నెక్కొనుచూడ్కిఁ గ్రమ్మఱుపనేరక యూరక నిల్చెఁ గాముచేఁ
జిక్కినసెమ్మనంబుఁ గడుఁ జేష్టుడుమానముఁ జేష్టితంబులం
దక్కినయంగముం దలఁకుధైర్యము నై యతఁ డప్పు డయ్యెడన్. 23

1 గొన కొద...నదరినఁ బెఱుగక...వలసినయప్పుడు...పోయి యవలీలఁ...ముట్టికొనఁ...
(గానిపించు, నడుగు) గానిపించి, యడుగు...(ను) నప్పళించి...లేచి పోవఁ జేరు, వెడల...నగు
నెడ వీక. 2 రూపమున.

తే. ద్రౌపదీరూపమనునురిఁదగిలితనదు,హృదయమనుమృగమ త్తతినుదిలగొనుచుఁ
గాముఁ డనుబల్లిదపు వేఁటకానిబారిఁ, బడుట కెంతయు నాసింహబలుఁడుదలరి. 25

వ. నిజాంతర్గతంబున.

ఉ. ఎందును నిట్టిరూపు నరు [1]లెవ్వరుఁ గాంచిరె నాక కాదు సం
క్రందనసూతికిం దగిలి కన్గొనఁ జాలదె దీన నిందిరా
నందనునాజ్ఞ యేచి భువనంబులఁ బ్రబ్బదె యుత్తలోదరిం
జెందఁగఁ గాన్పు గాదె ఫలసిద్ధి పురాతనపుణ్యబుద్ధికిన్. 26

సీ. [2]ఇయ్యింతిప్రాపున నయ్యనంగుఁడు పార్వ, తీశు నైనను దక్క నేల కున్నె
యిన్నాతిచెలువంబు గన్నశచీప్రియుం, డైనను గనుకలి నవయ కున్నె
యి త్తన్వి కెన లేమి కెదిరి పన్నిదము భా,షావిభుతో నైనఁ జఱవ రాదె
యి త్తలోదరిజీవితేశున కిందిరా, పతి నైన మెచ్చక పలుకఁ జనదె

తే. కుసుమబాణునిబాణముల్ గూడ నైదు, గరఁగి నేరిమి వాటించి కరువు గట్టి
పోసి చేసి చైతన్యసంపుటము దగ ఘ,టించెనో కాక యిట్టిచేడియలు గలరె.

క. ఈనెలఁతఁ గన్నమన్మథుఁ, డైనఁ జిగురుగొడుగుఁ బువ్వుటమ్ములపొదులున్
లోనుగ [3]సెజ్జలు సేయం, దా నియమింపండె విరహతాపము వేర్మిన్. 28

వ. అని వెండియు. 29

సీ. దీనిజన్మంబునఁ దేజంబు నొందిన, యింతియుఁ బతియును నెవ్వరొక్కొ
దీనినామాకృతిగా నోఁచి పడసిన, యిం పగువర్ణంబు లెవ్వియొక్కొ
దీనివల్లభుఁ డనఁగా నిల సొబగుసొం, పెసఁగ వర్తిల్లువాఁ డెవ్వఁడొక్కొ
దీనివసించుటఁ దా నొప్పి పెంపున, నేపారుమందిరం బెద్దియొక్కొ

ఆ. దీనిఁ బొందఁ గాంచుతెఱఁగు నా కెయ్యది, యొక్కొ యిట్టిపనికి నూఱఁ[4]డిల్లి
తోడుకొనఁగ నిచట నీ డగుచుట్టంబుఁ, దడవి యెట్టులొక్కొ పడయువాఁడ.

చ. అని యని యుగ్గడించు ధృతి యల్లల నాడినఁ దల్లడించుఁ బై
కొనుతల[5]పోఁత నించు మదిఁ గోర్కులు పేర్చిన నప్పళించు నె
ట్టన తెగ నగ్గలించు నచటన్ జనులం బరికించు బుద్ధి దూ
లిన వెస నెంతయుం గళవళించు మనోజవికారమగ్నుఁ డై. 31

క. మాసినచందముఁ దనుఁ గని, రోసినడెందంబుఁ గల[6]తరుణి నెఱుఁగఁడ బి
ట్టేసినమదనునిచే ధృతి, వాసిన బెగ డొందు సింహబలుఁ డట్టియెడన్. 32

సీ. వెఱవక ననుఁ జూచె వీఁ డని యెదఁ గలు, షించిన నొండొండ చెమట వొడమ

---

1 లెక్కడ...దీని నిందిరా...వృద్ధికిన్. 2 ఈయింతి...నాయనంగుం డేచి,పార్వతీశ్వరు నైన నోర్వకున్నె.. గనుకని నలి(ల)య...పోసి విధిచేసి చైతన్యపుటము దగ ఘ(ప్రోదిచేసి చైతన్య సం). 3 సజ్జలు. 4 డిల్ల (డించి)తోడు గాఁగ. 5 పోరగించు...బుద్ధి మాలిన (దెస) వెస. 6 తరుణిచేఁ గను బి ట్టేసిన.

ననుచితకృత్యంబు లాచరించువిధాతృ, బలిమికి నెవ్వాఁడుపాటు దోఁప
నిచ్చట దిక్కు లే రెవ్వరు నా కను, భయమున మేనఁ గంపంబు పుట్టఁ
జేయంగ నేమియుపాయంబు లేమి నా, ననమున వెల్లఁదనంబు గదుర

తే. నున్న పాంచాలిఁ గనుఁగొని యన్నరాధ
ముఁడు వివేకవిహీనుఁడై ముదితుఁ డగుచు
మదనవికృతియకాఁ దనమదిఁ దలంచి
రాగసాగరపూరనిర్మగ్నుఁ డయ్యె. 33

వ. అయ్యవసరంబున. 34

చ. పొలఁతుకకాంతి యింత పొలి వోవఁగ నీ [1]కెసలారఁ దార ని
శ్చలతఁ గడంగి క్రోలికొనఁ జాలుటఁ గీచకముఖ్యలోచనం
బులు నయనం ప్రధాన మనుపూర్వవచస్స్థితి దప్ప కుండఁగా
నెలమి వహించెఁ దక్కుఁ గలయింద్రియవర్గము ధిక్కరించుచున్. 35

క. అప్పయుఁ బరిజనములుఁ దనుఁ, దప్పక కనుఁగొనుచు నుండఁ దగ వేది కరం
బొప్పనితమకము చిత్తముఁ, గప్పికొనుట నుత్తలంబు గదురఁగ నచ్చోన్. 36

సీ. తన్వంగిమవ్వంపుఁ దనులత నెసఁగెడు, నునుఁగాంతివెల్లువ మునుఁగఁ బొఱఁ
గిసలయహస్తకెంగేల నేపారుక్రొ, మ్మించనులేయెండ మిగులఁ బర్వఁ
గమలాస్యముద్దుమొగంబులేమెఱుఁగుల, మొత్తంబుపరి చుట్టు ముట్టికొనఁగ
ధవళాక్షితొంగలితఱచుఱెప్పలచెన్ను, కప్పనుచీఁకటి గవియుదేర

తే. బెగ్గలం బంత కంతకు నగ్గలింప, నొదవుచెమటతోఁ జిత్తంబు సెదరి యెందు
మెలఁగఁ దలఁపేదియాసింహబలుఁడనంగు, పట్టియాడెడుజంత్రంబుపగిదినుండె.

—⊨ కీచకుఁడు సుదేష్ణవలన ద్రౌపదితెఱం గెఱుంగఁ గోరుట. ⊨—

వ. ఇట్లు కందర్పదర్పగోచరుం డై నకీచకుండు నిజసహోదరివలన నకోమలికల
తూపు దెలియం దలంచి దానిదెసం దగిలినదృష్టి యెట్టకేలకుం దిగిచికొని చని
య దేవికిం బ్రణమిల్లిన. 38

క. కాంచనపీఠము వెట్టఁగ, బంచి ప్రియము చూడ్కి మునుఁగువడఁ దనుసంభా
వించునెడ నాతఁ డప్పుకుఁ, బాంచాలిం జూపి [2]వేగపడి యిట్లనియెన్. 39

ఉ. ఇయ్యరవిందగంధికుల మేమి చరిత్రముచంద మెట్లు పే
రెయ్యది నాథుఁ డెవ్వఁ డిది యెచ్చట నెప్పుడు నుండు నిప్డు దా
నియ్యెడ కేఁగుదేవలయు టేపని సేయఁగఁ బూని దీనిపై
నెయ్యముకల్మి యేకొలఁది నీమది కింతయు నాకుఁ జెప్పుమా. 40

క. అనవుఁడు నయ్యంగన యితఁ, డనంగశరదళితహృదయుఁ డయ్యె నకట యీ
తనిచిత్తవృత్తి మరలుప, ననురూపం బగునుపాయ మది యెయ్యదియో. 41

వ. అని తలంచుచుఁ గీచకునిమాటలు గీటునం బుచ్చి యొండుపలుకులు పరిపిన
నతండును సత్త్వహీనుండు గావున సత్వరుండై క్రమ్మఱి ద్రౌపది యున్నయె
డకుం జని యాసమీపంబున నట్లాడుచు నమ్మానవతితో నిట్లనియె. 42

క. ఇవ్వసుమతి నేపొలఁతుల, కివ్విధమునఁ జెలువు గలదె యెన్నండును నీ
వెవ్వరితనయవు నీపతి, యెవ్వఁడు పే రేమి సెప్పుమిందునిభాస్యా. 43

వ. అనిన నప్పలుకులు వినియు వినమి భావించి యప్పాంచాలి నిర్వికారయై
యూరకున్న నచ్చపలుండు వెండియు నిట్లనియె. 44

సీ. తెలిగన్నుఁగవకాంతి పొలుపార నించుక, గను విచ్చి చూచినఁ గాదె యబల
చెలువంపునెమ్మోము నెలమిసొం పినుమడి, గా నల్ల నవ్వినఁ గాదె యింతి
దంతమౌక్తికరుచి దలకొన మఱుమాట, వలికినఁ గాదె యుత్పలదళాక్షి
యుల్లంబుసరసత దెల్లంబుగా లీలఁ, గైకొన్నఁ గాదె పంకరుహవదన

ఆ. యనుచుఁ జూచుఁ [1]జేరు నమ్ముగ్ధపలుకులు, వినఁగఁ గోరుఁ గేలు గసదు కేలఁ
గీలుకొలుపఁ దలఁచుఁ గీచకాధముఁడు ని, జానురక్తి దెలుప నప్పళించు. 45

వ. ఇట్లు దాన తమకంబున [2]వడిగొనుచు నిప్పు డయ్యంగన యింగితం బూహింప
నెరవు మాలి మఱియును. 46

సీ. సుదతి [3]నీమై చక్కఁ జూచుట కోడెదఁ, గనుఁబాటు వొరయునో యని తలంచి
మదిఁ బొనర్చినమాట మగువ నీపెంపునఁ, గుదిసి నానాలుకతుదికి రాదు
పడఁతి నీకరములు పట్టంగఁ దివిరి శం,కించి వడంకెడుఁ గేలు సూడు
నెఱి నిట్టి దని యింతి నీనెమ్మనం బెన్ని, భంగుల నరసినఁ బట్టువడదు

తే. చెలువ యింక నొక్కించుకసేపు నీ వ
నాదరంబున నెప్పటియట్ల యున్న
మన్మథుఁడు సమయించిన మగుడ నన్నుఁ
బడయ వచ్చునె యెన్నియుపాయములను. 47

వ. అని తనయభిలాషంబు దేటపడం బలికిన నబ్బోటి కలుషించియు దుర్వారం
బైనపరిభవవికారంబు దోఁప కుండఁ దన్నుం దాన యుపశమించుకొని
వీఁడు దురభిమాని యై యున్నవాఁడు వేగిరపాటు వలను గాదు [4]నెరవుతోడన
తప్పించుకొన వలయు నని తలంచి యతని కిట్లనియె. 48

క. నాయున్నబొము దలఁపవ, యీయొడ లీచీర యిట్టి యేవపుఁజందం
బోయన్న మదనవికృతిం, జేయు ననుట యెంతయును నిషిద్ధము గాదే. 49

తే. చనునె యిమ్మాట లాడ సజ్జనుల కాఁడుఁ, బుట్టువులతోడ నీవును బుట్టినాఁడ
వట్లుఁ గాకయు హీనవంశాభిజాత,[5]నై పతివ్రత నగు నన్ను నడుగఁ దగునె.

1 గేరు. 2 మల్లడిగొనుచు. 3 నీ నెమ్మోము... మది నిగిర్చిన... పడఁతి నీ కెంగేలు. 4 నేరుపు తోడన. 5 (నైన పతివత్ని...) నై పవిత్రను నగు నాకు నడవఁ దగునె; నై పతివ్రత... నట్లు దగునె.

క. అని వీడఁగఁ బల్కిన న, మ్మనుజాధముఁ డంతఁ బోక మదనోన్మాదం
బునఁ దన్ను నెదిరి నెఱుఁగక, వనితకు ని ట్లనియె గారవంపుఁబలుకులన్. 51

సీ. నెత్తమ్మిరేకుల మెత్తఁదనము దెచ్చి, యచ్చునఁ బెట్టిన ట్లంద మొంది
చక్రవాకంబులచందంబు గొని వచ్చి, కుప్పలు సేసిన ట్లొప్పు మెఱసి
చందురునునుఁగాంతికం దేర్చి కూర్చి బా,గునకుఁ దెచ్చినయట్లు గొమరుమిగిలి
యళికులంబులకప్పు గలయంతయును [1]దెచ్చి,నారు వోసినభంగి నవక మెక్కి

తే. యంఘ్రితలములుఁ గుచములు నాననంబుఁ
గచభరంబును ని ట్లున్న రుచిరమూర్తి
యనుపమానభోగములకు నాస్పదంబు
కాదె యాత్రిప్పు లేటికిఁ గమలవదన. 52

తే. నీవు దుర్జాతి గామికి నీవ సాక్షి, పరసతీసంగమున వచ్చుపాపమునకు
నోరుతును గాని సైరింప నోపఁ బచ్చ, విలుతుతూపులతాఁకున కలరుఁబోఁడి.

క. [2]అనునప్పలుకుల కయ్యం,గన కోపము గదిరి నీచుగావున జంకిం
చినఁ గాని మెత్తఁబడి పోఁ, డని మనమునఁ దలఁచి యిట్టు లనియెం బెలుచన్.

ద్రౌపది గీచకునితోఁ బరుసవాక్యంబులు వలుకుట.

శా. దుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ వెసం గిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా. 55

తే. అనుడు నతఁ డిట్టు లనియె నా[3]యతులబాహు
బలముఁ జెనయంగ భవదీయపతుల కారు
మూఁడులోకంబులందు నెవ్వాఁడు లేమి
నిక్కువం బింత నమ్ముము నీరజాక్షి. 56

వ. అనిన విని సైరంధ్రి సైరణ దక్కి ధిక్కరించి యి ట్లనియె. 57

క. చనుఁ జన దని చూడక యం,దనిమ్మఁకులపండ్లు గోయఁ దలఁచుట హితమే
మును చెడినరావణాదుల, విని యెఱుఁగవె యెన్నఁడును వివేకవిహీనా. 58

తే. ఇవ్విధంబునఁ బలికిన[4]యింతిపలుకు, గాన నేరక తమయప్పకడకు మగుడ
నరిగె నెవ్వగ మనమునఁబిరిగొనంగఁ,జిన్నఁబోయిన మొగముతో సింహబలుఁడు.

క. చని మదనాగ్నిజ్వాలలు, దనుకఁగ నిట్టూర్పుగాడ్పుదందడి నిగుడం
దను నూరార్పఁగ సఖి దొర, కొనమికి వెనుఁబడుచుఁ గీచకుం డాసతితోన్.

వ. ఏ నప్పుడు నీకుం జూపి యన్వయనామధేయంబు లడిగినయప్పొలఁతివలనం

1 బుచ్చి. 2 అనుపలుకుల కయ్యంగన, ఘన కో; అని పలికిన పలుకుల కం, గన కో. 3 య
[illegible]

జిక్కి చిత్తంబు త్తలపడు చున్నయది యిట మీఁద నీవ యెఱుంగు దయ్యింటి
యింతసేపు నీచేరువ నుండి యిప్పు డెట మెలఁగె నని యడిగిన విని యతని
వేగిరపాటు సూచి శిరఃకంపంబు సేయుచు సుదేష్ణ నిజాంతర్గతంబున. 61

తే. రాగరసమగ్నుఁడయ్యె సైరంధ్రిఁ జూచి, యకటదీన[1]నింకేమియపాయ మగునొ
వలదు తగ దన్ననుడిగెడువాఁడె వీఁడు, మాయదైవమ యే నేమి సేయుదాన.

వ. అయిన నా నేర్చుకొలందిఁ దగినతెఱంగున వారించి చూచెదం గాక యని
యూహించి యిట్లనియె. 63

సీ. లలితంబు లగుమట్టియలచప్పు డింపార, నంచకైవడి [2]నడ నల్ల వచ్చి
యెడమేనినెత్తావి సుడియంగఁ బయ్యెద, సగము దూలించి పై మగుడఁ దిగిచి
సోలెడునెలదీఁగెలీలఁ గ్రాలుచు వింత, చెలువంబు దలకొనఁ జేరి నిలిచి
తెలిగన్నుఁగవకు నెచ్చెలి యైనలేఁతన, వ్వ్వులయంగ సరసంపుఁబలుకు వలికి

తే. మెఱయు[3]చెయ్వులరాగంబు మెయికొనంగ
నెడద సొగయించుమాటల నెలమి మిగుల
నిన్ను ననురక్తిఁ గొలుచునన్నెలఁత లుండ
నీరసాకార సైరంధ్రిఁ గోరఁ దగునె. 64

వ. అనిననప్పలుకులదెస ననాదరంబు సేయుచు నచ్చేడియంజూచి కీచకుం డిట్లనియె.

క. నాకొలువువార కార, న్నాకేశుం గొలుచునంగనలలో నైనఁ
లే కునికి నాకుఁ దెల్లం, బాకొమ్మకు నీడు వోల్ప నయ్యెడుసుదతుల్. 66

సీ. గండుమీలకుఁ బుట్టి కాముబాణములతోఁ, గలసి యాడెడునట్టికన్నుఁగవయు
బిసకాండములశిక్షఁ బెరిఁగి లేఁదీగల, మెచ్చక యున్నట్టిమృదుకరములుఁ
జిగురులతో సంధి సేసి యంబుజముల, పై నెత్తి చనునట్టిపదతలములుఁ
గలకంఠములచేతఁ గఱచినవిద్య వీ,ణల కిచ్చునట్టితిన్ననియెలుంగు

తే. నత్తెఱంగునరేఖయు నవ్విధంబు, గరువచందంబు నమ్మెయికలికితనము
నట్టిచెన్నును సైరంధ్రియంద కాక, కలవె యొరులకు నెఱుఁగక పలికె తబల.

వ. కావున నాయెలనాఁగ నేమియుపాయంబున నైన నన్నుం జేర్ప వైతేనిఁ గంద
ర్పదర్పంబున నలందురి [4]వందుదు ననిన నవ్వేలంది వెండియు నిట్లనియె. 68

తే. ఆయురైశ్వర్యకీర్తుల నపహరించు
పరసతీసంగమము ధర్మపథమునందుఁ
బరఁగువారలు పరిహరింపంగఁ గనియు
వినియుఁ దెలియవె యిది దుర్వివేక మగుట. 69

సీ. పతి యెఱింగినఁ దనప్రాణంబుపై వచ్చు, ననుభయంబున నుల్ల మదరు చుండ
జనులుగాంచినమానుషముదూలుఁదనకను, పుయిలోటమున మోముపుల్లగిలఁగ

1 నపాయ మే మగునొ యింక. 2 నల్ల. 3 రాగంపుఁజెయ్వుల. 4 ద్రుందుదు.

బోటికిఁ దోఁచినఁ బోలియుఁ దేఁకువ యును, వెగడునఁ జెయ్వులు వీడువడఁగ
బంధుల కగపడ్డఁ బాయు నన్వయ మను, కలఁక మైఁ జెమటలు గ్రమ్ముదేరఁ
తే. గ్రీడ దెసఁ గౌతుకం బురియాడ రతుల, చవులు గొనియాడ నేరని జారపొందు
హృదయమున కింపు సేయమి నెఱుక గలుగు, వారు దీనిసుఖంబుగాఁ గోరరెందు.
వ. అదియునుం గాక. 71
క. బలవిక్రమసంపన్నులు, గల రేవురు దానిపతులు గంధర్వులు వా
రలఁ దలఁచిన నాచిత్తము, దలఁకెడు నది యేల నీకుఁ దమ్ముఁడ చెపుమా. 72
తే. కాని తెరువునఁ బోయినఁ గలుగునయ్య, బ్రదుకుచవి యెంత యైన నపథ్యములకు
వేడ్క సేయుదురయ్య వివేకు లెవ్వ, ధమున నాబుద్ధి వినవయ్య తమక ముడిగి.
క. అనవుడు నమ్మాటలు దన, మనమునకు సహింప రామి మల్లడిగొనుచున్
మనసిజపరతంత్రత ని, ట్లని పల్కె సుదేష్ణతోడ నతఁ డుద్ధతుఁడై. 74
మ. వనితా యే నొకపల్కు వల్కెదఁ జతుర్వారాశిమధ్యంబునన్
ఘనబాహాబల మొప్ప నన్ను నెదురంగా నొక్కఁడున్ లేమి యె
వ్వనికిం దెల్లము గాదె దానిమగలన్ వజ్రాహతిం గూలుశై
లనికాయం బని మద్భుజాసమదలీలన్ గీటడంగించెదన్. 75
ఉ. బుద్ధులు సెప్ప నెల్ల నటు వో విడు మెమ్మెయి నైన సౌఖ్యసం
సిద్ధి యొనర్పు నాకు నెడ సేసినఁ దాపము రూపుమాపు నా
వృద్ధి యకోరుదేని నవివేకివి నీ వని నన్ను నిట్లసం
బద్ధము లైనవాక్యములు వల్కక వే పిలిపింపు [1]కోమలిన్. 76
తే. అనుచు దైన్యంబు నొందెడు నాననంబు, తోడ దిగ్గన లేచి యత్తోయజాక్షి
చరణపీఠంబు కడఁ జక్కఁ జాఁగి మ్రొక్కి, యున్న నద్దేవి గనుఁగొని చిన్నఁబోయి.
ఉ. ఆవల వచ్చు నాపదల కన్నిటి కోర్చి లతాంగిఁ గూర్చి కా
కీ వెడమాటలన్ మరలఁ డెన్నివిధంబులఁ [2]జూపి చెప్పినం
గావల మైనవీఁడు దగుకార్యము వట్టునె వీని కెమ్మెయిం
జావు నిజంబు మన్మథునిశాతశరంబుల నైన నక్కటా. 78
క. అని మనమునఁ దలపోయుచుఁ, దనతమ్ముని నల్ల నెత్తి దందడి దొరఁగం
జనుదెంచు నశ్రుపూరము, కనుఁగవలో గ్రుంగికొనుచుఁ గామిని పలికెన్. 79
ఆ. ఇంత [3]దలర నేల యెమ్మెయి నైనను, గొమ్మ నలవరించి కూర్చు టరుదె
యుమ్మలంబు దక్కి యూఱటతోడ నీ, వేఁగు మసలవలవ దింక నిచట. 80
క. ఆసవమున కని నీదుని, వాసమునకు [4]దివములో నవశ్యంబును నే
నాసుదతిం బుత్తెంతు ని, జాసక్తి ఫలింపఁ గొఱలు మభిమతకేళిన్. 81

1 కామినిన్. 2 జాటి...కావర మైన; కానలుఁ డైన. 3 దలఁక. 4 దినము...
సలుపు (క్రోలు) మభిమత.

—కీచకుండు ద్రౌపదియందలిమోహంబునఁ బరితపించుట.—

వ. అనిన విని కీచకుండు ముదితహృదయుం డయి నిజసదనంబునకుం జని వివిధ మధురసంబు లొనరించి సముచితఖాద్యంబులుసమకట్టి తత్ప్రదేశంబు విజనంబు గావించి యొక్కరమ్యస్థలంబున నుండి పాంచాలివలనితగులు చిత్తంబు నుత్తల పఱుపం దలరి నెవ్వగల కగపడి తలపోఁతలకుం జొచ్చి దుర్విదగ్ధుండు గావున నమ్ముగ్ధకుం దనసన్నిధిఁ గామవికారంబు పుట్టుట గలుగ భావించుచు. 82

సీ. కేలిమై నొక్కట లీలఁ [1]గ్రేళ్లుఱికెడు, వాలుగుసోగల నేలుడెంచి
కరువలిసుడియమిఁ గరలక చెన్నొందు, నెఱవిరితమ్ముల నుఱక తెగడి
బెడఁ గొందఁ దుడిచిమైఁ దొడసినవలరాజు,వాలికతూపులఁ దూలఁ దోలి
పొలపంబు మెఱసి దిక్కులఁ గాంతిపూరించు,క్రొక్కారుమెఱుఁగులఁ నుక్కడంచి
తే. తనవిలోచనములు నాదుమనము నాఁచి
కొనఁగ నయ్యింతి ననుఁ గనుఁగొనియె నాత్మఁ
గైకొనియె రాగరసమునఁ గడలుకొనియె
మదనవికృతి బయల్పడ నుదిలకొనియె. 83

ఉ. చిత్తము మెచ్చి నావలనఁ జిక్కఁగ వెండియు నాలతాంగి య
చ్చొత్తినయట్లు నాకుఁ దనయుల్లము దెల్లము సేయ నున్కి దా
నత్తఱిఁ గ్రొత్తకా న్నగుట నడ్డము సొచ్చిన సిగ్గుపెంపు [2]స
న్నుత్తల మందఁ జేయుటకునో తలపోసి యెఱుంగ నయ్యెడున్. 84

తే. అనుచుఁ గొందలపడుకోర్కు లగ్గలించి
చిట్టుముట్టాడు చుండ నచ్చెలువచెలువుఁ
దగిలి తనయిచ్చఁ బొఱుచిత్తంబుపజ్జ
నరిగి యి ట్లను నక్కీచకాధముండు. 85

సీ. లీల నాముందట నాలేమి వొలసినఁ, జూడ్కికిఁ బబ్బనచూఱ గాదె
కను విచ్చి నన్ను నాతనుమధ్య సూచినఁ, దనువున కమృతసేచనము గాదె
చిఱునవ్వు బెరయ నచ్చెలువ నాతోడఁ బ, ల్కినఁ జెవులకు రసాయనము గాదె
యెలమి నమ్మెలఁత నన్నెలయింపఁ దివిరిన, నెడఁద కానందంబు నిక్క గాదె
తే. యానితంబిని మక్కువ ననఁగి పెనఁగి, యింపు పొంపిరివోవ నన్నేలికొనఁగఁ
దలఁచి పొందిన నది జన్మఫలము గాదె, యనుచు వలరాజుబారికి నగ్గమయ్యె.

వ. మఱియు ననేకభంగుల ననంగవిభ్రమంబులకనురూపంబు లైన[3]బహువిధప్రలాపంబుల బ్రొద్దు గడపుచు నమ్మదిరాక్షిరాక కెదురుచూచు చుండె నక్కడఁ బాంచాలి రావించి సుదేష్ణ తృష్ణ భావించుచు ని ట్లనియె. 87

1 బెల్లె (గ్రేళ్లె) సఁగెడు ... దుడిచిచేఁ (దుడిచినఁ). 2 త న్నుత్తల. 3 బహుప్రకారంబులం.

క. ఒదవెడుతృషపెల్లిదమున, వదనము వఱువట్లు వట్టె [1]వాసితరాజ
స్మదిరారస మానఁగ నా, హృదయంబున వేడ్క మెసక మెసఁగెడుఁ దరుణీ.
క. కీచకునియింట నెప్పుడు, వాచవి యగుబహు[2]విధములవారుణి గలుగున్
వే చని యిచటికిఁ గొని ర, మ్మా చూతముగాని నీగమనవేగంబున్. 89
వ. అనవుడు. 90
ఉ. ఉల్లము దల్లడిల్లఁ దను వుద్గతఘర్మజలంబు దాల్చుచున్
ఝల్లుపడంగ నా కిది గడిందివిచారము పుట్టె నందుఁ బో
నొల్ల ననంగ రా దచటి కూరక పోవను రాదు నేర్పు సం
ధిల్లఁగ దీనిఁ బాపికొనుదీమస మెట్టిది యొక్కొ దైవమా. 91
వ. అని తలంచుచు డోలాందోళితమానస యగుచు నమ్మానిని సుదేష్ణ కిట్లనియె.
ఉ. ఉత్పలగంధి న న్ను[3]డుగు మొడ్లను బంపుము కల్లు దేర నే
సత్పథవృత్తి నీకడన సంతతమున్ బహుమానపాత్రనై
తత్పరతం జరించి యుచితంపుఁబనుల్ దగఁ జేయఁగాక దు
ష్యత్పరివారయోగ్యపరిచారముమైఁ జనునట్టిదాననే. 93
క. అతివ తగునమ్మ నీగృహ, మతినిర్మలచరితభరిత మని యీయెడ మ
త్పతులయసన్నిధి నైనను, మతి నూఱడి యున్నచోట మన్నన దప్పన్. 94
ఉ. సాధులు సేరి [4]నెమ్మిఁగ నిజస్థిరవృత్తము దుష్టకోటిచే
బాధలఁ బొందకుండఁ దమపాల వసించినఁ బెద్దవారు ది
క్కై ధరియించి వారి కొకయాపద వుట్టక యుండఁ గాచు టొ
ప్పై ధరఁ గీర్తి కెక్కదె యపాయము సేసిన నింద వుట్టదే. 95
ఆ. [5]ఎవ్వరేనియింటి కెద్దియే నొకటికి, నన్నుఁ బంపఁ దగునె నిన్ను నాఁడ
కొలుచునెడ ననుజ్ఞ గొననె నీచము లగు, పనుల కేను జాల కునికి సెప్పి. 96
క. అనిన విని యనుచితంబున, కనయము శంకించియును లతాంగి మదిం ద
మ్మునివలవంత దలఁచి యి, ట్లనియెం బాంచాలితోడ సాదరవృత్తిన్. 97
ఉ. అక్కట యేను వేడ్కపడియానెడునాసవ మర్థిఁ దేరఁ [6]గా
నొక్కనికృష్టుఁ బంచుటకు నోపక చెప్పిన దీని నీవు గో
సెక్కఁగఁ జేసి నన్ను నతిహీనవిధాననియుక్తఁ జేతఁ గా
నిక్కమ యుమ్మలించి తిది నెయ్యముతియ్యముకల్మియే సఖీ. 98
క. అది లాఁతియిల్లె నినుఁ దమ, హృదయంబుల నెవ్వరేని నెఱుఁగరె యేఁ జె
ప్పుడు నీదుపెంపు నినుఁ గ,న్నది మొదలుగ నెల్లవారి కయ్యెభంగిన్. 99

1 వాడెడు. 2 విధంపువారుణి. 3 డిగి యొడ్డుల; డుగు మొడ్డుల. 4 నమ్మిఁగ... వచ్చిన నింద. 5 ఎవ్వరింటికేని యె...బుచ్చఁ దగునె. 6 నొండొక్కని ... నెయ్యముకల్మి యె చెప్పుమా సఖీ.

క. అని మఱియుఁ బెక్కుభంగులఁ, దనుఁ బ్రార్థింపంగ ద్రుపదతనయకుఁ జిత్తం
బున నింకఁ బెద్ద పెనఁగం, జన దీయమతోడ ననువిచారము పుట్టెన్. 100
వ. ఇట్లు దోఁచినతలంపునం జేసి. 101

—ద్రౌపది కీచకునింటికిఁ గల్లు దేరం బోవుట.—

చ. మన మురియాడుచుండ ననుమానముతోన సుదేష్ణఁ జూచి నీ
వనయముఁ గోరినట్టిపని యర్థి మెయిం జని చేయుదానఁ గా
కనుతనమాట కప్పొలఁతి హర్షము బొందుచు నంది యిచ్చుకాం
చనచషకంబు పుచ్చికొని చారువిలోచన యార్తమూర్తి యై. 102
వ. చను చుండి నీహృదయుం డగుకీచకుండు దన[1]యెదుర నప్పుడాడినక్రూరాలం
బులగుమాటలమీఁదం బిడుగు పడినవానిఁ గొఱవిం జూఁడినతెఱంగున సుదేష్ణ
ద న్ననుచితవ్యాపారంబునకు నియోగించుటకు నిర్వేదనంబుం బొంది. 103
చ. అలమటఁ బొందు [2]మాయవిధియా యని దైవము దూఱు నిత్తఱిం
గలరొకొ నాకు దిక్కను మొగంబున నశ్రులు వెల్లిగొల్పుఁ దొ
ట్రిలఁబడు జల్లనం జెదరుడెందము గూడఁగఁ దెచ్చి నన్నుఁ గే
వలమున ముట్ట నెవ్వరికి వచ్చు ననుం గలఁగున్ వెనుంబడున్. 104
వ. అట్టియెడ. 105
సీ. దైన్యంబుతలపోఁత దలకొన్నఁ జెలువ కా, ననమున [3]వెల్లఁదనంబు గదిరె
భయరసవేగంబు పైకొని ముట్టినఁ, గాంతకుఁ దనులతఁ గంప మడరె
బెగ డంత కంతకు మిగిలిన నింతికిఁ, బదముల నటఁ దొట్రుపాటు వెరసెఁ
దల్లడం బొందినఁ దన్వికి నవయవం, బుల నెల్ల ఘర్మాంబుకణిక లెసఁగెఁ
ఆ. దలఁకు పుట్టెఁ గొంకు గొలఁదికి మీఱె వెం, బాటు దోఁచె ముట్టుపాటు దొడరె
వెఱఁగుపాటు దనికె నెఱ నాడె నొవ్వ నె, వ్వగలు వగల నీనె దిగులు వొదిసె.
వ. ఇవ్విధంబున ద్రుపదపుత్త్రి దురవస్థం బొందుచు మహాపదలకుం బరిహారణంబు
హరిస్మరణంబ యని తనహృదయపుండరీకంబునం బుండరీకాక్షు నిక్షేపించు
కొని సుదేష్ణమందిరంబు వెలువడి దినకరుం గనుంగొని వినయవినమితోత్త
మాంగ యై నిజాంతర్గతంబున. 107
తే. పాండుపుత్త్రుల కేను దప్పనిమనంబు, గలుగుదాన నయేని యోకమలమిత్త్ర
కీచకుని[4]దెస న న్నొకకీడు తెరువు, వొరయ కుండఁగ రక్షింపు కరుణతోడ.
వ. అనుచుం గేలు మొగిచిన. 109
క. తరణియు దుఃఖిత యగున, త్తరుణిం గాచుటకు నత్యుదగ్రభుజావి

1 యెదుఱెమర నప్పు...ద న్ననిచిన యనుచితవ్యాపారంబునకు నిర్వే. 2 మాలవిధి వా యని...వెతంబడున్. 3 వి(చి)న్నదనంబు...గంప మొందె...బదములఁ దొట్రిలపాటు బెరసెఁ ...దలఁకు ముట్టెఁ...నెఱ వాడె నొవ్వ నె. 4 వారి.

స్ఫురణాఢ్య నొక్క[1]రక్కసుఁ, గరుణార్ద్రమనస్కుఁ డగుచు గ్రక్కున బనిచెన్.
వ. వాఁడునుం బని పూని యంబరతలంబున నదృశ్యాకారుం డై వచ్చి నిలిచె.
తే. ఇట్లు ప్రార్థించి పాంచాలి యెట్టకేని, సింహబలుమందిరం బల్లఁ జేర నరిగి
యొల్లఁబోవుచు బెబ్బులియున్నపొదరు, సొచ్చు[2]లేడిచందంబునఁ జొచ్చుటయును.
ఉ. అంబురుహాక్షి వచ్చుతెరు[3]వారయఁ గీచకముఖ్యుఁ డప్డు దె
ల్లంబుగఁ జూచి యుల్లముకలంకయు వారక మేన వెమ్ముతా
పంబును డిగ్గఁ ద్రావి గరుపాఱుచు నుత్కటసంభ్రమంబు హా
ర్షంబుఁ బెనంగొనంగ సతిచంచలభావపరీతమూర్తి యై. 113
క. చిడిముడిపడుచు నెదురుచనఁ, గడఁగుచు హారములు సక్కఁగాఁ ద్రోచుచు మ
ల్లడిగొనుచు [4]దుర్విలాసం, బొడలికి నొడఁగూర్చు చుండ నుగ్మలి యంతన్.
వ. [5]తత్ప్రదేశంబునకుం జని. 115
తే. దేవి దృష వుట్టె వారుణి దేరఁ బనుప, నరుగుదెంచితిఁ బోయింపుఁ డనిన నింతి
నెమ్మొగంబున దృష్టులు నిలిపి తమక, మడర నిట్లను నాకీచకాధముండు. 116
క. దేవితృష దీర్పఁ [6]బూనితి, వావెలఁదిసహోదరుండ నగునాతృష లీ
లావతి నీదుసరససం, భావనమెయిఁ దీర్ప కునికి పాడియె చెపుమా. 117
సీ. కాంతి దళ్కొత్తు నీకడకంటిచూడ్కితోఁ, బొందఁగానని మేనుపొగులుటయును
దీపారునీపల్కు దెల్లంబుగా వినఁ, గాననిపీనులు గందుటయును
[7]నింపగునీచెయ్వు లెలమిమైఁ గొనియాడఁ, గాననికోర్కులు గలఁగుటయును
సొగయించునీకేళిఁ దగిలి యానందంబుఁ, బొందఁ గాననిమది గుందుటయును
తే. బాయ నాదగుజన్మంబు ఫలము నొంద, భావజన్మునిపూనిక పార మొద్దు
నన్ను బంటుగా నేలుము నలినవదన, యింక నీసిగ్గుదెరయోల మేల నీకు. 118
వ. అనవుడు. 119
తే. చెలువ యప్పలుకులు పెడచెవులఁ బెట్టి
ధీర గావున విగతవికార యగుచు
మదిర వోయింపుఁ డద్దేవి యెదురు[8]చూచు
నలుగుఁ దడవైన మగుడఁ బో వలయు ననిన. 120
చ. మదిర సుదేష్ణపాలి కొకమాత్రన పుచ్చెద నొడ్లచేత నిం
పొదవెడునట్టిదీనిచవి యుల్లము సొక్కఁగ నాను మీవు నీ

---

1 యసురం. 2 లేటి. 3 (వారఁగఁ) వారయు...గ్రమ్మ (పెల్లు) తాపంబు. 4 దుర్వికారం. 5 తదనంతరంబ ద్రుపదపుత్త్రి కీచకుం డున్నతత్ప్రి. 6 జాలితి; జాఁగితి...నీ (విలసితసం) దువినయసం,భావన. 7 నింపారు చెయ్వుల నెలమి గైకొని...చూడ్కులఁ(గోర్కు-లు) గనలుటయును...నన్ను (నీ బంటుగా నేలు) బంటుగా నేలుమా...యింక సిగ్గది యది యొల్లమేల నీకు; యింక సిగ్గేల నీకు నోయింతి యనియె. 8 చూచి యలుగుఁ...మగుడి పో.

వదనసరోజ[1]సౌరభ మవారణ నన్నును గ్రోలి నిమ్ము పె
ట్టెదుఁ దగుకాముతాపులఁ దొడింబడ కుండఁగఁ గావు మి త్త్రాటిన్. 121

క. కరితురగరథసమితిఁ బొం, పిరివోయెడునాదులక్ష్మి పెంపున కెల్లన్
[2]సరసిరుహావదన నీవ కు,దురుగా నొనరించెదం గుతూహల మెసఁగన్. 122

క. రుచిరమణిభూషణంబులు, నుచితవిహారప్రకార యోగ్యా[3]గార
ప్రచయము సుందరగణికా, నిచయము నొప్పించుపాఁడ నీకుం దరుణీ. 123

క. [4]నాకులకాంతల నెల్లను, నీకుం బని సేయఁ బనిచి నెయ్యంబున నే
నీకనుసన్నన మెలఁగెద, నేకార్యం బైన నడపు మీవ తగంగన్. 124

వ. [5]అనుచు సింహబలుండు దనయంతరంగంబున నంత కంత కగ్గలించుతమకం
బునఁ దన్నుదా నెఱుంగక పయిం బడి పట్టికొనిన. 125

క. [6]తనుఁగాచి వెనుక వచ్చిన, దనుజుమహాబలము దనదుతను వొందిన నా
తనిచే విదిల్చి రభసం,బునఁ దన్మందిరము ద్రుపదపుత్త్రిక వెడలెన్. 126

వ. ఇట్లు ద్రోచిపోయినం గీచకుండు వెనువెంటం దగిలిన నమ్ముగువయు మరలిచూచి
భయభ్రాంత యై యెవ్వలనికింబోదునో యనితలంచి దైవయోగంబున విరా
టుం డప్పుడు [7]గొలువునికిం జేసి తత్సభాభాగంబుదెసకు వెసం బాఱినం గావా
యత్తచిత్తుండును గర్వోన్మత్తుండును గావున జనసమూహంబు సరకు సేయక
రహస్యప్రకాశవిభేదవిచారంబు దక్కి. 127

కీచకుఁడు ద్రౌపదిం బట్టుకొనుటకు వెంటఁ దగులుట.

సీ. సమదవారణము జంగమలత వెనుకొని, సరభసంబునఁ బట్టఁ జనువిధమునఁ
గ్రూరదానవుఁడు భూచారినిర్జరకాంతఁ, బొదువ రయమ్మునఁ బోవుభంగి
ఘోరగృధ్రము సుకుమారనాగాంగనఁ, బటుగతి నొడియంగఁ బాఱుకరణిఁ
బ్రబలబిడాలంబు బాలశారికమీఁద, నడరి సత్వరముగ నరుగుమాడ్కి
తే. సింహబలుఁ డత్యు[8]దగ్రతఁ జిగురుబోఁడి
పజ్జఁ గడువడిఁ దగిలి కోపంబు గదుర
నొడిచి తలపట్టి తిగిచి మహోగ్రవృత్తిఁ
గొంకు కొస రించుకయు లేక కూలఁ దాచె. 128

వ. అట్టియెడఁ బాంచాలీ[9]రక్షకుం డైనరాక్షసుం డతని డొల్ల వ్రేసిన. 129

క. కీచకుఁడు వ్రేటువడి తన, నీచపుదెస యొరు లెఱుంగ నేరక యుండన్

---

1 (సౌరభము వారక; 'వారుణి') మవారణఁ గ్రోలఁగ నిమ్ము నన్ను పె, ట్టెద మగు. 2 సరసిరుహానన; సరసిరుహనయన. 3 చార. 4 నాకుఁ గలకాంత లెల్లను. 5 (అనుచు లేచి సింహ)...గ న్నెఱుంగక. 6 తను గావ...నాతని (చేయి దుల్చి) చే యదల్చి. 7 బయు (లికొలు వు)లు కొలువునను...ప్రకారవిభేదనవివేకంబు దక్కి. 8 దగ్రుఁ డై...కూలఁ (ద్రోచె) దన్నె. 9 రక్షకుం డై వచ్చిన రాక్ష.

[1]లేచి వెనుకఁ జని విస్మయ, గోచరుఁడై యసురకతనఁ గుంఠితుఁ డగుచున్. 130

వ. ఒడుపు దప్పినమహానాగంబునుంబోలె నిట్టూర్పు నిగుడ నిట్టలం బగుకోపంబు వెల్లున మల్లడిగొను చుండె నయ్యవసరంబున. 131

క. తానును నన్నయు నయ్యా, స్థానమ్మున నుండి పవనతనయుఁ డసహ్యాం
బైనమనోవల్లభయవ, మానము నాసింహబలునిమదజృంభణమున్. 132

చ. కనుఁగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల నంగము
[2]గ్లనలఁగ సాంద్రఘర్మసలిలంబులు గ్రమ్మ నితాంతదంతపీ
డనరటదాస్యరంగవికటభ్రుకుటీచటులప్రవృత్తన
ర్తనఘటనాప్రకారభయదస్ఫురణాపరిణద్ధమూర్తి యై. 133

సీ. నేలయు నింగియుఁ దాళముల్ గాఁ జేసి, యేపున రేఁగి వాయించి యాడఁ
గులపర్వతంబులు [3]గూల్చి యొండొంటితోఁ, దాఁకంగ వీఁకమైఁ దన్ని యాడ
నేడుసాగరములు నిక్కడక్కడఁ బెట్టి, పలుచనిరొంపి మై నలఁదికొనఁగ
దిక్కులు నాలుగు నొక్కచోటికిఁ దెచ్చి, పిసికి పిండలి సేసి పిడుచగొనఁగ

తే. మిగిలి బ్రహ్మాండభాండంబు పగుల వ్రేయ
నప్పళించుచుఁ బ్రళయకాలానలమున
గండరించినరూపంబుకరణి భీముఁ
డతిభయంకరాకారత నతిశయిల్లె. 134

వ. ఇట్లు పేర్చినగోపాటోపంబున నవిచారితసమయవర్తనుం డయి వృకోదరుండు గీచకుని గీటడంగింపం జూచి తత్సంబంధబద్ధుండును నాజ్ఞాపరిపాలకుండును గావున మత్స్యపతిఁ [4]దనయలుకలోనివానినకాఁ దలంచుచు నచ్చేరువ నున్న యున్నతవృక్షంబు నిరీక్షించి యాననంబు పల్లటిల్ల ధర్మతనయుం గనుంగొనిన నతండు దననయనాకారంబున వారించి యి ట్లనియె. 135

మ. [5]వలలుం డెక్కడఁ జూచె నొండెడ ననేకక్ష్మాజముల్ పుట్టవే
ఫలితంబై వరశాఖ లొప్పఁగ ననల్పప్రీతి సంధించుచున్
విలసచ్ఛాయ నుపాశ్రితప్రతతికిన్ విశ్రాంతి గావింపఁగాఁ
గలయీభూజము వంటకట్టియలకై ఖండింపఁగా నేటికిన్. 136

తే. అని నిగూఢభాషణముల నయ్యజాత, శత్రుఁ డనిలజుకోపరసంబు పేర్మి
నెఱిచె నయ్యన్నదమ్ములచేష్టితములు, దెల్లముగ నప్డు సూచుచు నల్ల లేచి. 137

సీ. ఎలదీఁగఁ గప్పిన లలితపరాగంబు, క్రియ మేన మేదినీరేణు వొప్పఁ
జంపకంబున నవసౌరభం బెసఁగెడు, కరణి నాసిక వేఁడిగాడ్పు నిగుడఁ

1 లేచి వెను చనక (తనమదిని) విస్మయ. 2 ల్దనరఁగ...పీడనవిక్రుతాస్య...ప్రగల్భభయద. 3 గూర్చి...పిడిచికొనఁగ...(కాలానలంబు) గండళించిన ; గం డడంచిన ; గం డెసంగిన. 4 మను దనయులకలోనివాఁడకాఁ...దనయ్యాకారంబున. 5 వలలా యెక్కడఁ జూచె దొండెడ.

దోయజదళములతుది మించు దొరఁగెడు, గతిఁ గన్నుఁగవ నశ్రుకణము లుపఁ
నిందుబింబముమీఁదికందుచందంబునఁ, గురులు నెమ్మొగమున నెరసి యుండ
తే. సర్వజనవంద్యయైనపాంచాలి సింహ, బలునిచే నివ్విధంబున భంగపాటు
దనకు వచ్చిన నెంతయు దైన్య మొంది,యవ్విరాటునిసభఁ జేర నరిగి నిలిచి.

ద్రౌపది తనభంగపాటు విరాటునితోఁ జెప్పుట.

ఉ. పంబినకోపమున్ సమయభంగభయంబును నగ్గలించి యు
ల్లంబు పెనంగొనంగఁ బతులం దగ సభ్యులఁ జూచుమాడ్కి గూ
ఢుం బగుచూడ్కి నా[1]ద్రుపదుకన్నియ సూచి సభాజనప్రతా
నంబును మత్స్యనాథుఁడు వినంగ నెలుంగు సలింప నిట్లనున్. 139
సీ. నిఖిలధర్మాధర్మనిపుణంబులైనవి, ద్ధాంతరంగంబుల నతిశయిల్లి
శిష్టసంరక్షణదుష్టనిగ్రహముల, నీతి వాటింపంగ నేర్పు గలిగి
సకలశస్త్రాస్త్రసంచయములఁ బరమాద్భు, తంబు సేయు పరిశ్రమంబు దాల్చి
దుర్దమప్రతిభటమర్దనక్రీడమైఁ, జతురులు నా నెందు నుతికి నెక్కి
తే. యున్నగంధర్వులేవురు నన్ను నిట్టు, లొకఁడు వఱుపంగ నూరక యునికి సూడ
నచ్చెరువుగాదె యెవ్వరియాండ్రు రింకఁ, బరిభవంబునఁ బొందక బ్రదుకువారు.
క. ఈనరపతియాస్థానము,లో నొక్కరుఁడైన ధర్మలోప[2]భయమునం
బూని తగ వైనవెడపలు, కైనను బలుకంగఁ జాలఁ డయ్యెడు నకటా. 141
ఉ. ఇందఱుఁ జూడఁగా నిచట నిమ్మెయి నన్నుఁ [3]బతివ్రతాగుణా
స్పందితవర్తనం బరమసాధ్వి ననిందితశీలఁ గీచకుం
డెందును నెట్టియంగనల నెవ్వరుఁ జేయనియట్లు సేయఁగాఁ
గొందఱు కైన నిప్డు కృపకుం దఱి గా దట యేమి సెప్పుదున్. 142
ఉ. ఐనను మత్స్యదేశమునయాజ్ఞ కితం డొడయుండు గాన నా
కీనరనాథు దూఱఁ దగు నెయ్యదియేని నధర్మ మెవ్వ రెం
దైన నొనర్చినం బ్రభువు లారసి దండన మాచరింతు రి
చ్చో ననుఁ [4]దన్నఁ గీచకునిఁ జూచియు నూరక యున్కి పాడియే. 143
చ. అనుడు విరాటుఁ డుల్లమున నక్కటికం బొలయంగ నంగసం
గనుఁగొని కీచకుం గినియఁగాఁ దగుసత్త్వము లేమిఁ జేసి సాం
త్వనములు వల్కి రోషభరితస్థితిఁ గంపితమూర్తి యైనయా
తనిమద[5]కుందు వాపిన నతండును బోయె నివాసభూమికిన్. 144
వ. అట్టియవసరంబున. 145
సీ. శుభలక్షణాంగి యీసుందరి సైరంధ్రి,యగు నెట్లొకో యని వగచువారు

1 ద్రుపదకన్యక. 2 భయంబుం బూని; భయమునన్ మానుగఁ దగ దనియెడు.
3 బవిత్రతా...కైన నిందు. 4 దన్ను కీచకునిఁ. 5 కందు.

నిమ్మేని కక్కట యిట్టిది సేసెనే, [1]మాయదైవం బని మఱుఁగువారు
నింతకీ డొనరించెనే రాజు సూడ నీ, దుష్టాత్మకుం డని దూఱువారు
దేవియుపేక్షయ చూవె యీయామకు ని, ప్పాటు వచ్చుట యని ప్రందువారు
తే. నగుచు సభవార లందఱు నంత నంత, నల్లనల్లన గుజగుజ లాడు చుండి
రుల్లమున నిండి ఖేదంబు వెల్లివిరిసె, నాఁగ మోములవిన్నఁదనంబు గదుర.
ఉ. అప్పుడు ధర్మసూతి హృదయంబు గలంగ లలాటభాగముం
గప్పఁగ ఘర్మవారి యధికం [2]బగురోషము నొంది యుండియుం
దప్పఁగఁ ద్రోచికొంచుఁ దనధైర్యముపెంపున నిర్వికారుఁ డై
యెప్పుడుఁ దాను బల్కునెలుఁ గేర్పడ ద్రౌపదితోడ నిట్లనున్. 147
సీ. జననాయకుండు నీసభవారు నీ దగు, తెఱఁ గెల్ల నెఱిఁగిరి తెఱవ యింక
మానక యీపలుమాట లాడఁగ నేల, చనుము నీవు సుదేష్ణసదనమునకు
నీపరాభవమునఁ గోపింప నేరరే, గంధర్వులకుఁ దఱి గాదు గాక
సమయ మెయ్యదియేనిఁ దమకును [3]నీకుఁ గ,ల్గినయట్టు లైనను గినియ రిచటఁ
తే. గాన నాథుల దూఱంగఁ గాదు వినుము, సతికిఁ దానెంత వడియును సభలలోన
దడవుగా నిల్చి యిట్టు లుదగ్రవృత్తి, శంక సెడి ధిక్కరింపంగఁ జనునె చెపుమ.
వ. అని యిట్లు సెప్పినధర్మతనయునిపలుకులు విని వెండియు సైరంధ్రి యచ్చోటు గదలక నిలిచి యెద్దియేనియుం బలుకం దలంచినం [4]జూచి యతండు మఱియు నిట్లనియె. 149
క. పలువోకలఁ బోవుచు వి,చ్చలవిడి నాట్యంబు [5]సూపుచాడ్పున నిచటం
గులసతులగఱువచందము, దొలఁగఁగ నిట్లునికి దగునె తోయజవదనా. 150
వ. అనిన విని పాంచాలి సాభిప్రాయంబుగా నతని కిట్లనియె. 151
ఆ. నాదువల్లభుండు నటుఁ [6]డింత నిక్కంబు, పెద్దవారియట్ల పిన్నవారుఁ
గానఁ బతులవిధమ కాక యే శైలూషిఁ, గా ననంగ రాదు కంకభట్ట. 152
వ. అట్లగుటం జేసి నాకు నాట్యంబును బరిచితంబ మత్పతి శైలూషుండ కాఁడు కితవుండునుం గావున జూదరియాలికి గఱువతనం బెక్కుడియది యనుచు నచ్చోటువాసి తనచిత్తంబున. 153
ఉ. నన్నిటు లాదురాత్ముసదనంబునకుం జను మన్న జంత కిం
బన్నము లన్నియుం [7]దెలిపి ప్రయ్యెడనే యని పోయె నార్తయై
కన్నుల బాష్పపూరములు గ్రమ్మఁగ మోమున దైన్య మొందఁగా

1 మాల ... (వ్రం:; ఐందు; పలుకు) వారు,...రుల్లముల నుండి. 2 బుగ రోషరసంబు నొందియున్. 3 నీకును, గలిగిన యట్లైనఁ గనల...నిలిచి యుండి యుదగ్ర. 4 జూచి యక్కాంతను మఱియు. 5 సలుపు. 6 డౌట...పతులవిధమె కాక సతులకు శైలూషిఁ. 7 దెలిపి (పల్కెదఁ గా కని) ప్రాయిడనే యని పోయె; దెలియఁ బల్కెదఁ గా కని.

నన్నలినాక్షి తొట్రిలుచు నంగము దూల సుదేష్ణపాలికిన్. 154

తే. చనిన నయ్యేలనాఁగయు సంభ్రమంబు
దెచ్చికొని తా నెఱుంగని తెఱఁగు దాల్చి
శాఠ్యమున నుమ్మలించి పాంచాలితోడ
నెలుఁగు వే ఱొకభంగిగా నిట్టు లనియె. 155

సీ. ధరణిపరాగంబు వొరసి ధూసరిత మై, చేడియ నీమేను చెన్నుఁ దఱిఁగెఁ
జిత్తంబు తలపోఁతచే వాడు వొదవిన, చెలువ నీనెమ్మోము చిన్నఁబోయెఁ
బ్రస్వేదమునఁ దోఁగి ఫాలంబుతో నంటి, యుగ్మలి నీకురు లొప్పు గండెఁ
గన్నీరు వఱ్ఱోడి కాంతి యెంతయుఁ గొన్న, వెలఁది నీకనుఁగవ విన్న నయ్యె

ఆ. నేది కారణమున నెవ్వ రెచ్చోట నీ, కేమి కీ డొనర్చి రెట్టిపాటి
సాహసికులొ వారిఁ జంపుదు నొంపుదు, భంగపఱుతు [1]నిడుమపఱుతుఁ జెఱుతు.

వ. ఇత్తెఱంగు నాకుం జెప్పు మనిన నీ వెఱింగియు నెఱుంగమి భావించిన నింక నేమని పలుకం గలదాన నైనను విను మని సైరంధ్రి యి ట్లనియె. 157

మ. నను నీ వప్పుడు సూతమందిరమున న్మద్యంబుఁ దె మ్మన్నఁ బో
యిన నాతం డవినీతి సేసినను జే యీ కేను మత్స్యావనీ
శునియాస్థానముదిక్కు వే చనిన నచ్చోఁ దీవ్రకోపంబున
న్వెనుకం గూడఁగ ముట్టి పట్టికొని తన్నెం బల్కు లిం కేటికిన్. 158

వ. అని యేర్పడం బలికిన. 159

ఉ. ఖేదము దక్కు మీక్షణము కీచకు దండితుఁ జేసి నీకు నా
హ్లాద మొనర్తు నే నని [2]నయంబునఁ గేకయరాజపుత్త్రి య
త్యాదరవృత్తితో ననునయం బొనరించిన నయ్యసత్యసం
వాదినిపూన్కి పాండుసుతవల్లభ యాలము సేసి యి ట్లనున్. 160

క. నీ వింత యలుగ నేటికి, నావంతయుఁ బౌరజనమనఃఖేదము నో
క్కావంత ద్రిక్క కుండఁగ, లావంతులు మత్పతులు గలరు పగ దీర్పన్. 161

క. అనిన సుదేష్ణయుఁ దత్పరి, జనములు [3]వెఱఁ బొంది యెన్నిసాంత్వనములు సె
ప్పినఁ దేఱద మజ్జనభో,జనములకుం జొరద ద్రుపదసంభవ యెట్లున్. 162

వ. అట్టియెడ[4]సుదేష్ణ సేయునది లేక నివ్వెఱఁ గంది యుండెఁ దక్కటియంగనలును గీచకునినీచత్వంబు దలంచి [5]వానిచేటున కొడంబడిరి పరిభవానలసంతప్తయైన

1 జెఱుతుఁ బఱతు ననుచు. 2 భయంబునఁ. 3 వగఁ...దెరలక మజ్జన. 4 సుదేష్ణయుఁ బరిజనంబులు...యుండిరి. 5 " వానిచేటున కొడంబడి రనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె నయ్యా కీచకుం డేవంశంబునవాఁ డెవ్వం డనిన నమ్మునివరుం డాజనపతి కిట్లని చెప్పె బ్రాహ్మణియందు క్షత్త్రియునివలనం బుట్టినవాఁడు సూతుం డనం బరఁగుఁ బ్రతిలోమజాతులలోన నద్విజుం డనంబరఁగి క్షత్త్రియునికంటె నించుకతక్కువయు వైశ్యునికంటె నధికుండు

పాంచాలి నిజశయనస్థానంబునకుం జని తల్పంబుపై మేను వైచి యపాంగం
బులం దొరఁగుకన్నీరు చెవులకొలంకులు నిండ నెవ్వగలు నివ్వటిల్లం దలపోయు
చుండి. 163

క. ప్రబలుం డారయ నాసిం, హబలుం డాతని జయింప ననిలతనయు బా
హుబలంబ కూడఁ దగునై, వబలంబును [1]నాతనికి నవశ్యముఁ గల్గున్. 164

ద్రౌపది భీమసేనుతోఁ దనభంగపాటు సెప్పి పరితపించుట.

వ. ఇట్లూహించి రాత్రిసమయం బగుటయు సమస్తజనంబులుఁ గ్రమంబున
నిద్రింపం దొడంగినం దానును శయ్యాతలంబు విడిచి మేనిధూళిగడిగి ధౌతపరి
ధాన[2]పరీత యై మహానసగృహంబున సుప్తుం డైనవృకోదరుకడకుం జని. 165

ఉ. నన్నుఁ బరాభవించి సదనంబునకుం జని కీచకుండు ము
న్నున్న తెఱంగు దప్పక సుఖోచితశయ్యను నిద్ర సేయ నీ
కన్ను [3]మొగుడ్చునూఱటకుఁ గారణ మెయ్యది భీమసేన మీ
యన్నపరాక్రమంబు వల దన్న నొకో దయమాలి తక్కటా. 166

వ. అనుచు మందమందసంభాషణంబుల సంబోధించుపాంచాలిపాణిస్పర్శనంబున
మేలుకని యిది యెవ్వ రనవుడు నే ననునమ్మానినియెలుం గెఱింగి భీమసేనుం
డు యాజ్ఞసేని కీచకుదురాచరణంబు నాకుఁ బ్రకటించి వాని నిర్జింప నియో
గించునది యై యరుగుదెంచెం గావలయు నత్తెఱం గిత్తెఱవ దాన చెప్ప
విందు నని తలంచి. 167

తే. ఇంతప్రొద్దేల యిచ్చోటి కేఁగుదేరఁ, గారణం బేమి యెవ్వరుఁ గాన కుండు
నట్లుగాఁ జనుదెంచితె యంబుజాక్షి, యనిన నయ్యింతి యి ట్లను నతనితోడ.

చ. ఎఱిఁగి యెఱింగి న న్నడుగ నేమిటి [4]కప్పు డెఱింగి యింతకు
న్మఱచుట గల్గెనే నది వినం బని లే దటుగాక యున్నరూ
పెఱిఁగియు నేన చెప్ప విన నిష్టము గల్గుట చాల లెస్స య
త్తెఱఁ గెఱిఁగించెదన్ వినుము తెల్లముగా మొదలింటనుండియున్. 169

చ. అధిపుమఱంది సింహబలుఁ డప్పుకు మొక్కఁగ వచ్చి నన్ను న
త్యధికమనోజరాగమతి యై కనుఁగొంచుఁ గడంగి [5]యెన్నియేన్
విధములఁ బల్కి నాకుఁ దనవిన్నను వెల్లను జూపి చెప్పి మా

కన్యాసముద్భూతుండును నగుకీచకుం డనువాఁడు గలండు వానికి మాళవియం దు నూటయార్వురు కీచకులు పుట్టి రం దగ్రజుండు బలవంతుండై యుండి కేకయరాజపుత్రి యగుతమతల్లిచెలియలి కూఁతు రైనసుదేష్ణకుం బరిచరించుచు విరాటనగరంబున నుండు వానితమ్ములు నూటయేవురును వా నిన యనుసరించి యుండుదు రని యిట్లు సూతవంశప్రకారం బెఱింగించి యి ట్లనియె నంతం బరిభ వానలసంతప్త" అని కొన్నిప్రతులలో నున్నది.

1 నితనికి. 2 పరీస్నాత. 3 మొగుడ్ప. 4 కిప్పు డెఱింగి. 5 యెన్నియున్... వొప్పఁగ జూపి చేరి మా.

నధనవిహీనతం జెనకినం గడు నేవము వుట్టి యయ్యెడన్.

క. [1]విడియం బలుకఁగ వెండియు, నుడుగక కీచకుఁడు మన్మథోన్మాదము ద
న్నడరిన న న్నడుగుటకుం, దొడరినఁ గోపించి వానితో ని ట్లంటిన్.

శా. దుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ వెసన్ గిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా.

వ. అనిన విని వాఁడు గొన్ని ప్రల్లదంబులు వలికిన నేనునుం దత్కాలోచితవచ
బులం ద్రోచి పుచ్చినం బోయెఁ బదంపడి పాపాత్మ యైన సుదేష్ణ దనకు మది
సంబు దేరం గీచకనివాసంబునకు నన్నుం బనిచినం బోవుట కొడంబడక వె
సెప్పిన నన్నింటికి నన్ని సెప్పి నిర్బంధించినం బెద్ద పెనంగ నొల్లక నామనంబు
న్నెవ్వరికి నేమి సేయ వచ్చు నని మీలావు నచ్చి సూతునింటికి సురకుం బో

క. కొన్ని వెడమాట లాడుచు, నన్ను నతఁడు సెట్ట వట్టినం ద్రోచి వెసం
జన్న వెనుకొనుటయును మీ, యున్నెడ కే నప్పుడు సంభ్రమోపేతగతిన్

తే. పాఱు తెంచిన నక్కులపాంసనుండు, గోప మడరంగ [2]వెనుకస కూడ మ
నట యెఱుంగుదు నీవు మీయన్న పెద్ద,తనముఁ జూచితి నే మందు ననిలతన

ఉ. మీసుభటత్వముల్ బలము మిన్నక పోవఁగ దుస్ససేనుఁ డ
ట్లాసభలోన నన్ బఱిచె నంతియ కాక జయద్రథుండు సం
త్రాసభరంబు లే కనుచితం బొనరించినఁ జెల్లి పోయె నేఁ
డీసభికుల్ గనుంగొనఁగ ని ట్లయితిన్ వగ నాకు వింతయే.

ఆ. అకట యాఁడుకూయు నాలకూయును లాఁతి, వార్తికన పరయ వలగు న
నన్నుఁ గీచకుండు దన్నంగ నెట్టాలు, సూడ నేర్చె ధర్మసూనుఁ డప్పుడు.

వ. అనిన విని యతం డిట్లనియె.

ఉ. కీచకుఁ డట్లు మీఁదు పరికింపక నన్నుఁ బరాభవింపఁగాఁ
జూచి మహోగ్రకోపవివశుం డగునన్నును జూచి ధైర్యహీ
మాచలుఁ డైనధర్మసుతుఁ డమ్మెయి వారణ సేయ కున్న నే
[3]నీచత వాని మత్స్యవిభునిం బరివారము నుగ్గు సేసినన్.

వ. ఆ[4]సంరంభంబున సమయభంగంబుగా జనంబులు మసల నెఱింగిరయేని.

క. ముందటిభంగిన కానల, యందుఁ [5]జరింపంగ వలదె యది నీవును నే
నుం దెచ్చినయాపదగా, నిందింపరె యెల్లవారు నీరజనయనా.

వ. కావున సత్యవ్రత[6]నిష్ఠుం డగుయుధిష్ఠిరుండు పొగడ్తకుం దగువాఁడు

1 విడియఁగఁ బల్కిన మఱియును. 2 వెనుకొని కూడ ముట్టి, తన్ను టెఱుఁగుదు. [3]
చపలాత్మ...నా పరివారము. 4 సమయంబున. 5 చరింపంగ. 6 గరిష్ఠుం.

దూఱు వడ నర్హుండు గాఁ డని వెండియు నిట్లనియె. 182

క. పరిభవకరుఁ డగుకీచకుఁ, బరిమార్చుట [1]యిపుడు గడవఁ బడియెనె యిమ్మై
దురపిల్ల నేల వ్రేల్మిడిఁ, బొరిగొని నీమనముకలఁక వుత్తు లతాంగీ. 183

వ. మనల నెవ్వరు నెఱుఁగ కుండునట్టితెఱంగు దలపోయ వలయుఁ గాక [2]పగ
తుని భంజించుట యెంతటిపని యనిన విని యమ్మానిని యి ట్లనియె. 184

క. గొంతికి నంత వెఱవ మీ, కంత వెఱవ దైవమునకు నంత వెఱవ న
త్యంతకలుషాత్మ విరటుని, కాంతకు నే వెఱతుఁ బనులు గావించునెడన్. 185

చ. కినుకకుఁ జాల కెంతయును [3]గీడ్పడి నాపడుపాటు లెల్ల వ
మ్మునఁ గలయంగ నిట్టు లోకమూర్ఖునిచేఁ దుదిఁ బోయి కోలుపో
యెనె యభిమాన మన్వగపు నేడ్తెఱ డెందము గొందలంబుఁ బొం
దిన ధృతి మాలి యేఁ బలికితిం దగ వెల్ల నెఱింగి యుండియున్. 186

ద్రౌపది భీమునితో ధర్మరాజుమహిమ సెప్పుట.

వ. ఇట్టిద కాని సమస్తజనస్తవనీయుం డగుపాండవాగ్రజు నిక్కంబ నిందించిన
దానం గా నని పలికి మఱియును. 187

క. ధర్మతనూభవుసంతత, ధర్మనిరతి మనము బ్రదుకఁ దలఁచుట యరుదే
నిర్మలుఁ డగునాతని[4]స, త్కర్మంబునఁ గాదె బ్రదుకు ధాత్రికి నెల్లన్. 188

సీ. చనునె వేఱొకని కజాతశత్రుం డను, పేర దిగ్విజయంబు పెంపు దాల్ప
రాజసూయమహాధ్వరము గోరి చేయంగఁ, దీఱునే పెఱధరిత్రీపతులకు
ధర్మైకనిరతుఁ డాతం డొక్కరుఁడ చూవె, యనఁ జన నోరులకు నలవి యగునె
నిత్యవ్రతంబుగా సత్యంబు [5]పాటింప, వచ్చునె యొరుల కెవ్వరికి నైన

తే. నయ్యుధిష్ఠిరుగాంభీర్య మతనిధైర్య, మరయ నొండెడఁ గలుగునె యతఁడు కీర్తి
ధరుఁడు గరుణోత్తరుఁడు మహీసురసమృద్ధి,కరుఁడు నిజవంశకరుఁ డుపకారపరుఁడు.

క. కలిమికి నొప్పగు నీగియు, బలిమికిఁ [6]దోడ వైనయట్టిబలఁగము నై లో
కులచిత్తములకు వ్రేఁ గగు, కొలఁది మనక గొంతిపెద్దకొడుకున కమరున్.

సీ. ఎవ్వనివాకిట నిభమదపంకంబు, రాజభూషణరజోరాజి నడఁగు
నెవ్వనిచారిత్ర మెల్లలోకములకు, నొజ్జయై వినయంబు నొఱపు గఱపు
నెవ్వనికడకంట నివ్వటిల్లెడుచూడ్కి, మానితసంపద లీను చుండు
నెవ్వనిగుణలత లేడువారాసుల, కడపటికొండపైఁ గలయఁ బ్రాఁకు

తే. నతఁడు భూరిప్రతాపమహాప్రదీప, దూరవిఘటితగర్వాంధకారవైరి
వీరకోటీరమణిఘృణివేష్టితాంఘ్రి, తలుఁడు గేవలమర్త్యుఁడె ధర్మసుతుఁడు.

---

1 కిపుడు. 2 పగతుర. 3 గీడ్పడు...ధృతి దూలి. 4 సద్ధర్మంబున. 5 పాలింప, వచ్చునే యొరుల కెవ్వారి కైన; పాలింప, వచ్చునె యడ్డు లెవ్వ...యతుల కీర్తిపరుఁడు. 6 దోడైన...కొలఁది మనను.

ఉ. అట్టిమహాత్ముఁ డొక్కనికి నాశ్రితుఁ డై వెడగూడు జీరయుం
బెట్టఁగ నిల్చి వాని మదిప్రీతికి నీ డగువృత్తిఁ బేరునుం
బుట్టును మాలి యిప్పు డిటు బ్రుంగుడుపాటునఁ బొందఁ జూచి నా
కెట్టు మనంబు వట్టు ధృతి యెమ్మెయిఁ దూలక నిల్చుఁ జెప్పుమా. * 1

ఉ. నీపలమూఁపులావు మును నేల వహించిననాగకూర్మగో
త్రావనిభృద్దిశాకరుల కారయ నూఱటపట్టు గాదె సం
భావన భూజనంబులకుఁ బండువు గాదె మహోగ్రకోపరే
ఖావిభవంబు వైరులకుఁ గాలముచేరువ గాదె పావనీ. 19

తే. బకహిడింబకిమ్మీరులబాహుబలము, నాజరాసంధునుగ్రదర్పాతిశయము
లోకభీకరములు విజయాకరములు, నైన నీకరములకు లోనయ్యెఁ గాదె. 1

ఆ. అట్టినీవు వంటకట్టియలకు లావు, సూపుచుండ నెపుడుఁ జూచి చూచి
వగతు నదియుఁ గాక తగ వేదియమ్మత్స్య, మేదినీశ్వరుఁడు వినోదమునకు.

మ. మహిషవ్యాఘ్రగజాదిసత్త్వచయముల్ మల్లవ్రజంబుం గృపా
రహితుం డై యెదు రొడ్డుచుల్ వరుసఁ బోరం జూచు నిన్నెప్పుడుల్
మహనీయం బగునీశరీరము జగన్మాన్యంబు నీచక్రియా
విహితం బై నకుజీవనంబు విధి గావించెం గటా దీనికిన్. 19

వ. అని మఱియు నిట్లనియె వివేకహీనుం డగువిరాటుండు నిన్నుం బోరించు
నప్పుడు నిజాంతఃపురకాంతలకు వినోదంబు సేయ వారల రావించిన నేను
సుదేష్ణతో నరుగుదెంచి చూచుచుండుదు నయ్యవసరంబున. 1

క. భరమున నీవోరెడునెడఁ, బరమవిషాదంబు నీవు బలిమి మెఱసి యు
ద్ధురవృత్తి జయము గొనినం, బరితోషముఁ బొందు నన్ను భావించి మఱిన్.

వ. ఊహించి సుదేష్ణయుఁ దత్పరిజనంబులుం [1]దమలోన. 19

క. వలలునిదెస మాలినిచూ, డ్కులతెఱఁ [2]గెడపొందుఁ దెలిపెడుం గంటిరె
రలు వచ్చినసమయంబును, దలఁపఁగ నొక్కటియ యివ్విధం బెట్లొక్కో.

వ. అనుచుం గలదు లే[3]దని పెక్కువిధంబులం దలపోసి గుజగుజలు వోవు చుం
దు రట్టియెడ. 20

తే. [4]మరగినీమూర్తిపైఁగన్నుమనముఁదగిలి, యుండనేమఱియుండిరొక్కొక మాట
దలఁచికొనివారిదెసమదినిలుపునప్డు, డెఱుఁగనగువారునాతెఱఁగెఱుఁగు టెల్ల

వ. కావున మదీయపరిభవాతిరేకంబునకు నీవుద్రేకించినజనంబులుమనల భేదింతు
నీకుంబోలినభంగి రహస్యభంగంబుగాకుండ నరిభంగంబు సేయుమని వెండియు

సీ. తొడరినహరు నైన దోర్బలంబునఁ దన్ను, మిగులంగ నీఁ డనుమేటిమాట

* (దీని వెనుక) వ. అని మఱియు. 1 పెక్కువిధంబులం దమ. 2 గద. 3 దన
సందియంబులం బెక్కు. 4 మఱియు నీమూర్తి.

యమరేంద్రునర్ధాసనమునకు నైన న, ర్హుం డెంతయును ననుఱూఢిమాట
జమునిల్లు సొచ్చిన జంతువు నైనను, గాచు నెమ్మెయి ననురాచమాట
దనుఁ గోరి యూర్వశి దాన వచ్చిన నైన, లోలుండు గాఁ డనుమేలిమాట
తే. శౌర్యవైభవప్రాభవ[1]శౌచములకు, నొరుల కైనఁ గైవార మై యుల్లసిల్లు
నొక్కరుని కివి యెల్లను నిక్క మట్టె, యెందుఁ గలుగునె యర్జునునీడువాఁడు.
క. ఆపార్థుఁడు భరతాన్వయ, దీపకుఁ డమరేంద్రసుతుఁడు దేజోనిధి వి
ద్యాపారగుం[2]డు వినుత, వ్యాపారుం డాపదలకు నగ్గం బయ్యెన్. 205
చ. అరయ నతండు మానధనుఁ డక్కట రంగమునందు నిల్చి సుం
దరులకు నాట నూపెడువిధం బతిదీనము దానిఁ జూచి యేఁ
బురపురఁ బొక్కుదుం గడుపుఁ బ్రోచికొనన్ లఘువృత్తి కిమ్మెయిం
జొర నగువాఁడె దేవపతిసూనుఁడు దైవముచేత నూచితే. 206
చ. మగలకు మేటి యైనబలమర్దననందనుఁ బేడిఁ జేయఁ గాఁ
దగునె విధాత నీకు నని దైవము దూఱుదు నోర్వ రానినె
వ్వగ దలకొన్న నెంతయును వందుదు నిద్దురవస్థ యెన్నఁడో
తెగు టని సంతతంబును మదిం దలపోయుదు నేమి సేయుదున్. 207
సీ. తన[3]యొప్పెదురఁ గన్నఁ దగిలి యెవ్వరి కైన, మలఁగిక్రమ్మఱఁజూడవలయువాఁడు
దనవర్తనము విన్న మునిజనంబుల కైన, నలవరించికొనంగ వలయువాఁడు
దనబంటుతన మాజిఁ గనిన మార్తుర కైనఁ, బలుమాఱు నగ్గింపవలయువాఁడు
దనవితరణకేళి వినినఁ గల్పకతరు, వుల కైనఁ దల యూఁప వలయువాఁడు
తే. నకులుఁ డొరులకు నశ్వశిక్షకుఁడుగాఁగ, నగునె యాతనిదుస్థితియనుదినంబుఁ
గాంచి కన్నీరు డించుచుఁ గడవ రాని, దైవఘటనకు నొత్తుఁ జిత్తంబులోన.
శా. ఆరూపం బవికార మాభుజబలం బత్యంతనిర్గర్వ మా
శూరత్వంబు దయా[4]రసానుగత మాశుంభత్క్రియాజ్ఞాన మా
ర్యారంభప్రతికూలవాదరహితం బాయీగి సమ్మానవి
స్తారోదాత్తము మాద్రిపిన్నకొడు కేతన్మాత్రుఁడే చూడఁగన్. 209
క. సుకుమారుఁ డతఁడు గోపా,లకవృత్తి వహించి యడవులం గ్రుమ్మరు చు
న్కికి నాక కాదు పగవా,రికి నైనను నకట మన [5]మురియదే వగలన్. 210
ఉ. ఏనును మీరుఁ గానలకు నేఁగునెడన్ ననుఁ జేరి యెంతయున్
దీనత దోఁపఁ గుంతి సహదేవుని నిల్లడ [6]వెట్టి నాకు న
మ్మా నిను నమ్మి చాల విషమం బగునివ్వనవాస మీతఁడుం

---

1 శౌచములను. 2 డుదారుం, డాపదలకుఁ దాన యిప్పు డగ్గం బయ్యెన్. 3 యొప్పిదము...విని కల్పతరు వైనఁ, దలయూఁచి కొనియాడ వలయువాఁడు... కన్నీ రడంచుచు... నొత్తుఁ. 4 నుసారగత. 5 మెరియ. 6 వెట్టె.

బూనఁగ నియ్యకొంటి నని బోరన నశ్రులు గ్రమ్ము చుండఁగన్. 211
వ. మఱియును. 212
చ. కడుఁబసిబిడ్డ వీఁ డొకటి గా దవు నా నెఱుఁగండు ముందరె
య్యెడ నొకపా టెఱుంగఁ డెద యెంతయుఁ గోమల మెప్పుడైన నేఁ
గుడువఁగ బిల్తుఁ గాని తనకుం గలయాఁకటి ప్రొద్దెఱుంగఁ డీ
[1]కొడు కిటు వోకకుఁ మనము గుందెడు నిఁ గని యూఱడిల్లెడున్. 213
తే. ఎప్పు డెయ్యెడ నేమిట నెట్టు లరయ, [2]వలసె నమ్మెయి నారయు మలసి డస్సి
నొచ్చి యైనను నేమఱ కిచ్చఁ దలఁచి, తడమి నాచేత దీవన వడయు మమ్ము.
వ. అని యప్పగించె నేనును వనవాసకాలంబున నానేర్చువిధంబున మీకు నెల్లను
[3]గారా మైనతమ్ముని నమ్మెయిం బరికించికొని వచ్చితి నిపు డజ్ఞాతవాసాయాసి
తుం డగునతని నాకు ననుసరింప వెరవు గామిం జేసి చేయునది లేక చింతిల్లు
చున్నదాన నా తెఱంగు వినుము. 215
సీ. ద్రుపదభూవిభుఁడు పుత్త్రులకంటె నెంతయుఁ, బెంపు సేయుచు గారవింపఁ బెరిఁగి
కుంతీమహాదేవికోడండ్రలోపల, నగ్గలంబుగఁ గొనియాడఁ బరఁగి
ప్రాణంబులకు నెల్లఁ బ్రాణంబుగా మీరు, నెయ్యంబుతియ్యంబు నెఱప నడచి
మదిఁ దల్లిదండ్రులమాఱుగాఁ గొని జను, లనిశంబు భక్తిసేయంగ నెగడి
తే. రూపగుణవిక్రమంబులరూఢి కెక్కు, నట్టికొడుకులఁ గని భరతాన్వయంబు
నందు నాయిల్లు యిల్లుగా నతిశయిల్లి, తగవుమై బాంధవులచేతఁ బొగడు వడసి.
మ. వినుతింపం దగురాజసూయమునఁ బృథ్వీదేవతాకోటి కె
ల్లను [4]సంతృప్తి యొనర్చి వారిదయఁ గల్యాణాత్మ నై పుణ్యవ
ర్తన పాండుక్షితిపాలుకోడ లనఁగా రాజన్యమాన్యప్రియాం
గనలం దెల్లఁ బొగడ్త గంటి నతిలోకం బైనమీమన్ననన్. 217
ఉ. ఏను మనంబు పెంపు సెడి యిప్పుడు [5]నీచతరప్రచారముం
బూని నికృష్ట నై యుదరపోషణకై తగ వేది యెంతయుఁ
దీనతఁ బొంది యిమ్మెయి సుదేష్ణపనుల్ గనుసన్నఁ జేయుచుఁ
హీనత నున్కి మీకు వగ పేమియుఁ జేయద యేమి సేయుదున్. 218
క. పని వంపఁ గాని యొకతకుఁ, బని సేయ నెఱుంగ నన్నుఁ బనిగొనునెడఁ బాం
డునియగ్రమహిషి గొంకుచుఁ, బని గఱపెడుచందమునన పనుచు టెఱుఁగవే.
ఉ. ఒల్లరు రాజు దేవులును నొడ్డులు రాచినచందనంబు మే
నెల్లఁ జెమర్పఁగా నలయ కేను శ్రమంపడి నిల్చి నిల్చి య
ల్లల్లన మార్దవం బొనరునట్లుగ నెట్టకునేని రాచి మీ

1 కొడు కని పోకకున్. 2 వలయు నెమ్మెయి...తడవి నాచేత. 3 గారాబ మైన...యా సగతుం. 4 సంప్రీతి. 5 నీచతరప్రకారముఁ ; నీచతనమ్ము నిమ్ములఁ.

తల్లికి భక్తిఁ బెట్టెడువిధంబునఁ బెట్టుదు బ్రహ్మఁ దిట్టుదున్. 220

ఉ. సన్నఁదనంబుగా నలుఁగు నూరియుఁ జందన మట్లు రాచియుం
బన్నుగఁ గ్రొత్త లైనకలపంబులు గూర్చియు నాసుదేష్ణకుం
గన్నులసన్నలం బనులు గైకొని [1]వారక చేయు చుండుటన్
ము న్నటు లున్నపాణితలముల్ [2]బలుగాయలు గాచెఁ జూచితే. 221

క. అనుచుం దొరఁగెడునశ్రుల, మునిఁగినమో మతనివక్షమునఁ జేర్చిన న
వ్వనితయవస్థయ తాల్చుచు, ననిలసుతుం డడలె [3]డెంద మలమటఁ బొందన్.

తే. అట్టియెడఁ దన్నుఁ దాన యూరార్చికొనుచు
[4]నంబుజానన నెమ్మొగ మల్లఁ దుడిచి
యనునయించి, తత్కరములు దనమొగంబుఁ
గదియఁ జేర్చుచు నిట్టూర్పుగాడ్పు నిగుడ. 223

వ. చింతాక్రాంతుం డైనకౌంతేయునకు నయ్యింతి యిట్లనియె. 224

తే. ఇందఱకు నిన్నిభంగుల నిడుమ గుడువ, వలసె ధర్మతనూభవువలనఁ జేసి
దాయ లొడ్డినమాయజూదంపుటురులఁ, బడి కులంబున కాతఁ డిప్పాటు దెచ్చె.

ఉ. అక్కట మోసపోయి యడియాసలఁ జావక యున్నదానము
[5]న్నొక్కెడనే దురంతదురితోత్కటబాధలఁ బెట్టి యున్ననా
కెక్కడి దుఃఖశాంతి గడ యెద్దుట యెమ్మెయిఁ గల్గ నేర్చు మీ
ముక్కున నూర్పు గల్ల నొకమూర్ఖునిచేఁ బడితిన్ సభాస్థలిన్. 226

క. మీ రేమి సేయుదురు దై, వారంభము గాక శుభము నశుభంబును సం
[6]సారులఁ దనతనతఱి నని, వారణఁ బొందంగ మాన్ప వచ్చునె దానిన్. 227

ఉ. కావున మీర లభ్యుదయగౌరవ మొందుట యాత్మఁ గోరి యే
నేవిధి నైన నాపదల కెల్లను నోర్చెద దాని కేమి యీ
[7]కావర మైనకీచకుఁడు కామనిపీడితుఁ డై యలంతులం
బోవక యేచి పట్టుకొనఁ బోయిన దూఱెదఁ గాక యిమ్మెయిన్. 228

తే. వానిఁ దెగఁజూడ వై తేని వాయుపుత్త్ర, నీవు గనుఁగొన నురి నైన నీర నైన
నగ్ని [8]నైన విషంబున నైన నేను, మేను దొఱఁగుదు నెట్టు నీయాన సుమ్ము.

వ. అనిన వృకోదరుండు చిఱునవ్వు నవ్వుచు నిట్లనియె. 230

చ. జలజదళాక్షి కీచకునిఁ జంపుట కిమ్మెయి ముట్టఁ బల్కఁగా
వలయునె యేను జూడ ననివారణ నిన్నుఁ బరాభ[9]వించి వాఁ

---

1 పాయక. 2 వలిగాయలు. 3 దేహ. 4 తోయజానన మొగ మల్లఁ దుడిచితుడిచి.
5 న్నొక్కతెనే; న్నొక్కరినే...దుఃఖవార్ధి గడ యీచుట. 6 సారులకుం దమ తఱి...వానిన్. 7 కావల...వేచి పట్టు...దూఱెదఁ. 8 నైనను నే విషమాని యైన. 9 వించె వాఁ.

[1]డిల మన నింక నాంధ్రకును నెవ్వరు భంగము నీఁగఁ జాలువా
రలఘుమదీయబాహుబల మప్పుడ చూపనితప్పు సాలదే. 231

తే. ఎల్లి యెల్లవిధంబుల నెందుఁ జొచ్చె, నేని నాధర్మతనయుండు దాస నచ్చి
యడ్డపడెనేని నీవ పెంపారుకరుణఁ, గాచితేని నాచేఁ బడుఁ గీచకుండు. 232

వ. వానిదెసం జింత యావంత వలవ దమ్మాటలు విడువు మని యూఱడిల్లం బలికి
దుర్దశల నలందురునవ్వేలంది[2]డెందంబుకుందు వాపం దలంచి యిట్లనియె. 233

సీ. చ్యవనునివాంఛ[3]కు సంయాతినందన, యిడుమలఁ గుడువదె యడవిలోన
రాఘవుతోడ నరణ్యావాసము సేసి, సంతాప మందదె జనకతనయ
కుంభసంభవునకై ఘోరదుర్గముల లో,పాముద్ర యలజడిపాలు గాదె
నలునిపిఱుందఁ గానల కేఁగి దమయంతి, మనుజులు వడసియుట్లలిన నవదె

తే. వారు సైరణ సేసి దుర్వార[4]మైన, నిరతిశయదుఃఖభారంబు నిస్తరించి
సౌఖ్య మొందరె నీవు నాచందమునన, యాపదల కోర్చి సంపద లనుభవింపు.

వ. దుర్యోధనదుశ్శాసనకర్ణశకునిసైంధవప్రముఖం బగుదుష్టలోకంబు సద్గోలోకం
బున కనుచునంతకు మదీయాంతరంగంబు చింతాభరభుగ్నంబును నవమానా
పంకమగ్నంబును గోపోద్విగ్నంబును నై వేగిరపడుచున్నయది ధార్తరాష్ట్రు
లకుం గాలావసానం బైనయట్లు సమయకాలావసానం బయ్యె నజ్ఞాతవాసంబు
నకుం జొచ్చి పదునొకొండునెలలు సని పండ్రెండవనెల వర్తిల్లుచున్నది దీనికొ
అంత దీఱెన నీదువంతయుం దీఱు నూఱడిల్లి యుండుము సింహబలుండు నిన్నుఁ
బరిభవించి [5]మైమెతోనయునికిం జేసి యెల్లియుం జెనక వచ్చు నీవుం బ్రేమంబున
నోడంబడుట భావించికొని వానికి నర్తనశాల సంకేతప్రదేశంబుగాఁ జెప్పి
యొంటిమెయిం జను దేర నియమింపుము వాఁడు వచ్చిన నాసాబగునిం దేగఁ
జూచి నీకుం జూపి నీచిత్తంబు వడసెద నిత్తెఱంగుదప్ప నొండువిధంబు గర్జంబు
గా దిదియ నిశ్చయం బిట్ల చేయువార మిమ్మాటలవలనం దప్పవు గాని వేగుచు
న్నయది జనులు మేలుకాంచి మనలం గాంచిరేని వంచన బయలువడినం
గార్యంబు దప్పుఁ గీచకవధంబునకుం బూనిన నామనోరథంబు దుదిముట్ట
వలయు నిజశయనస్థానంబునకుం బొమ్మని శయ్యాతలంబు విడిచి యుత్తన్వియుం
దఱిమి కొన్ని యడుగు లనిచి మరలి మారుతాత్మజుండు గలుషితాత్మం
డగుచు సెజ్జకు వచ్చె నచ్చెలువయుం దననిద్రించునెడకుం బోయి పర్యంకభా
గంబునం దనువు వైచి యంకిలి దేఱనిడెందంబు గొందలంబుతోడి నిశ్చ
యంబుఁ బొరయ నిద్రం బొరయనికనుదోయి మొగిడ్చి యుండె నంత. 235

---

1 డిల మగ లింక. 2 డెందం బలరునట్లుగా. 3 కై శర్యాతి... 4 ఘోర. 5 మెయి
గానక (మెయితోడన) ...దెగటార్చి...మిమ్మాటల(వలనం దలంపము గాని) వెలిపుచ్చుమిం దలంపు
గలిగి సేయుదము గాని.

## ప్ర భా త కా ల వ ర్ణ న ము.

తే. ద్రుపదనందన పరిభవదుఃఖమునకు, నుల్లమున దురపిల్లుచు నున్నసరసి
వేఁడినిట్టూ[1]ర్పులో యన వెడలెఁ గ్రొత్త, తావి మూతులు విచ్చునెత్తమ్మివిరుల.

క. విచ్చెం దిమిరము గూఁపులు, వచ్చె మధుపకులము లబ్జవనముల కురులం
జొచ్చె విరులు తరులతికల, నిచ్చె రథాంగములు వంత యెల్లఁ దొగలకున్.

సీ. పెనఁకువఁ [2]దనిసినతనువు లొండొంటితోఁ, గీలించి నిద్రించి మేలుకాంచి
తరుణులుఁ బతులు వాతాయనంబుల నల్లఁ, బొలయు వేఁబోకటి మలయపవను
నింపారుచోఁకున నిగురొత్తుచిత్తంబు, లెలసి యొండొరులపైఁ బొలయుచూడ్కు
లాదట నుపకరణావలి వెడవెడ, యాదరించుట రాగ మడరఁ దొడరి

తే. కేళి సలిపిరి భవనదీర్ఘికలతమ్మి, విరులనెత్తావి నెనయంగ బెరసి చెమట
పొడము మేనులతనికంపు వోర్చి తఱచు, టూర్పుగాడ్పులపరిమళ ముల్లసిల్ల.

తే. రాలి యున్నపుష్పప్రకరము విదిర్చి, చెన్నుగా నున్నసేసినసెజ్జ యనఁగ
వేగుటయుఁ జుక్కలన్నియు విరిసి విశద, భాతిఁ జెలువొందెఁ జూడ నంబరతలంబు.

వ. [3]తదనంతరంబ యల్ల నల్లన తెఱపి యిచ్చి యవులవులం జను నంధకారంబు దూ
రంబులయందును లేకునికివలనం గడ ళ్లప్పళించి నెరసి విరసినం బొలుచుకలు
కట్టలుం బోనిదిక్తటంబులును దమపాసినకందువలు రోసి యెత్తినమెడలును బచ
రించినచూడ్కులు వేడ్కలం గ్రందైనడెందంబులుం గలిగి మెలంగుచు
నొండొంటి బిట్టు గాంచి యొదవుసమ్మదంబునం బొదలుమేనులు బెరయించి పర
మానందంబునం జొక్కుచు జక్కవకవలు గలసి పొలసి నలి రేఁగి చెలంగుచు
రేయింటియాఁకటిపెల్లున గొదగొని కమిచి చంచువులం దిగిచి త్రుంచి యానుచు
నిక్క డక్కడఁ బఱచినం జిక్కువడి యున్న మృణాళశకలంబులవలన బాల
చంద్రశితాభిరామంబు లగుశంభుజలమూర్తివిశేషంబులుంబోనిసరోవరంబు
లును జీఁకటి వాసినం బ్రభాతం బనువింతమానిసి మెలంగి ముసుంగు పుచ్చి
నట్లు మేలుకని యెఱకలు వొదల విదిర్చి కూర్చికొని కలగొనం బలుకుపులుఁ
గులమెలుంగులవలన నొండొంటిం దెలుపుకరణి నొప్పుధరణీరుహంబులును
బరఁగునరుణోదయరాగపటలంబు నెనయు కెంజాయ రంజిల్ల వికసిల్లురక్తార
విందంబుల దండడి నెగసి చరించుచంచరీకంబుల యెఱకలనెఱుల గిఱికొని
క్రొత్తయగుకాంతిప్రవాహంబులం గడలుకొల్పుపుప్పొళ్లు డుల్చి రాల్చుచుం
బొలయుమలయానిలంబునం గ్రాలుమవ్వంపుఁదీవలఁ గడివోయి తొరఁగినవిరుల

1 రుపో...తావి మూతలు. 2 దనియని (దనరిన) ...మలయు వేఁబోకటి...సోఁకున...
బొలసి...నాదరించుచు...క్రొత్తావి...దొడరుమేనుల తగుకంపు; తనిగప్పు; తఱిగంపు; తగునింపు.
3 తదనసరంబున... నెగసి విరిసి(నం బొలుచు చుక్కలకట్టలుం; నం బొలుచు కలువకట్టలుం)
నచాలు ముక్కలకట్టలుంబోని...పెల్లునం దగ గొని కదిసి...కలగొని పలుకు...రక్తారవిందంబుల

వలన మీనకేతనపురాతనబాణశాలలుం బోనిలతామండపంబులును మొగి
డియు జగంబుసంధ్యాంజలిపుటకరణంబుల ననుకరించువిధంబునం దర్శనీయం
బు లగుకుముదవనంబులును నేమేనినెపంబున నొండొరుల మేలుకాన్పురమణ
రమణీజనంబులనర్మాలాపంబులఁ బెరయుదరహాసంబులకాంతిఁ దేలుపెక్కు
నట్లు వెలరారుదీపంబులును మునుకడ వచ్చి యెఱుక సేయమికి వాతాయన
పవనునిపయిం బుట్టినయలుకవిధంబున వేగుఁబోకట నంకురించు మదంబునఁ
గెంపు గదురుట నిద్ర లేమి నని శంకింపక యింపునం గదియువిదగ్ధవిటజనం
బులమనంబులం దిగుచు లలనాలోచనంబులును రేపకడ వనలక్ష్మి పురశ్రీ నలంక
రించువడువున నెడపడక యెల్లెడల నిగుడువిభాతకుసుమకదంబపరిమళంబును 240
నై యున్నంత.

సీ. నీరజాకరములు నిష్ఠమైఁ జేసిన, భవ్య[1]తపంబులఫల మనంగ
దివసముఖాభినందితచక్రయుగ్మకం,బులయనురాగంపుఁబ్రోవనంగ
హరిహరబ్రహ్మమహానుభావంబు లొ,క్కటి గాఁగఁ గరఁగినగట్టి యనఁగ
నతులవేదత్రయలతికాచయము పెను, పొందఁ బుట్టెడుమూలకంద మనఁగ
తే. నఖిలజగముల కన్దెఱ యగుచు జనన, మాజకరపుటహృదయసరోజములకు
ముకుళనంబును జృంభణంబును నొనర్చి,భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగ.

వ. ఇట్లు సూర్యోదయ మగుటయు సమయసముచితకరణీయంబులు వేగిరంబ నడపి 242
[2]వేగిరపాటుతో సింగారంబు సేసికొని సింహబలుండు.

క. తనమదిఁ గదిరినతమకం, బునఁ జిడిముడి పడుచు ద్రుపదపుత్రికపై నూ
నినవేడ్క దిగువ [3]నొకటియుఁ, గనుఁగొన విన లేక మదనకంపితుఁ డగుచున్.

వ. అతిత్వరితంబ సుదేష్ణమందిరంబున [4]కరుగుచు నంతరంగంబున. 244

ఉ. చయ్యన నేఁగి యంబుజవిశాలవిలోచనఁ గాంచి ప్రీతిమై
నయ్యెడ నేకతంబ హృదయం బలరం దగఁ బల్కి [5]యొక్కపై
నియ్యకొనంగఁ జేసి యెలయించెద నిక్కకుఁ దార్చి నేర్పునన్
శయ్యకుఁ దెచ్చెదం గుసుమసాయకుపూనికి నేఁడ తీర్చెదన్. 245

క. అని యువ్విళ్లూరుచు వెసఁ, జని కేకయరాజపుత్రి సదనంబున స
య్యానిమిషచారువిలోచన, [6]యనురూపవిధాననిరత యై యుండంగన్. 246

చ. కనుఁగొని యప్డు గ్రొత్త యగుకౌతుకవృత్తి మునింగి పల్లటి

---

నందంద దండడినెరసి...విదిల్చి రాల్చు (దెరల్చి రాల్చు) చుం...దీవల వాసనలం గడివోయి...
పురాణబాణ...జనంబుల...కరంబుల...లలనాలోకనం...నెడపక.

1 తపగపుణ్యఫల; తపంబునఫల...గుట్టి యనఁగ; ఘుటిక యనఁగ...వేదత్రయీ...[illegible] ఱ యగుచు. 2 చిడుముడిపాటు. 3 నెద్దియు; నొంటిం. 4 కేఁగియు. 5 యు[illegible]పై... నిక్కకుఁ దాఁచి. 6 యనురాగవికాసనిభృత.

ల్లినధృతితోఁ గ్రమం బరయ లేనిమనంబు చలింప నచ్చటన్
[1]జను లెడ యాట గాంచునెఱి సాలక గ్రక్కున నింతిఁ జేరఁగాఁ
జనియె విధాతృలుబ్ధకవశంబునఁ బోవుమృగంబుచాడ్పునన్. 247

వ. చనుటయు ద్రౌపది యతనిం, గనియుం గాననివిధంబు గైకొని చిత్తం
బున బెదరక తనముందటి, [2]పనివెరవున నుండె భీముపలుకులయూఁతన్. 248
249

వ. అట్టియెడ.

సీ. ఎవ్వరితోనైన నెలుఁగెత్తి యొక్కింత, [3]పని లేనివెంగలిపలుకు వలుకు
మట్టియ లొండొంటి బిట్టు దాఁకఁగ నేల, నందంద మునిగాళ్ల నప్పళించుఁ
గడు వికారంబుగా నోడ లెల్ల విఱుచుచు, మలఁగి రిత్తకు రిత్త సెలఁగి నవ్వుఁ
దాళంబుగాఁ గరతలమునఁ బెలుచఁ గం,బంబు వ్రేయుచు వెడపాట వాడు
తే. మలయు నంతంతఁ జేరువఁ బోలయు నింతి,దన్నుఁ జూడమి కెంతయుఁ దల్లడిల్లు
నిక్కడక్కడవడుఁదగు లినుమడింపఁ, జూచునత్తన్విఁ బోరిఁ బోరిఁ గీచకుండు.

వ. ఇట్లు బహుప్రకారంబు లగు[4]దుర్విలాసంబులు సేయుచు నద్దురాత్ముండు ద్రుపద 251
నందన డాయంబోయి.

ఉ. భాగ్యము గాదె నీచరణపద్మము లెప్పుడుఁ జేరి కొల్వఁగా
యోగ్యత గల్గెనేని నను నొక్కని నొల్లవొ కామసౌఖ్యవై
రాగ్యము నీమనంబునఁ దిరంబొ నిజం బెఱుఁగంగఁ జెప్పు సౌ
భాగ్యము [5]గుందునే మగలపై నొకయించుక చూడ్కి నిల్పినన్. 252

ఉ. ఆలము సేసి నాతగుల మాఱడి వుచ్చఁగ నేల బేల న
న్నేలి యనంతభోగముల నిచ్చమెయిన్ విహరింపు నిత్యల
క్ష్మీలతికాలవాల మగుజీవన మంతయు నీమొగంబ కాఁ
బోలస సేయు మిప్పురముభామిను లెల్లను నిన్నుఁ గొల్వఁగన్. 253

ఉ. రాజుల నెల్లనుగ్రసమరంబుల వ్రేల్మిడి నోర్చి పేర్చి యీ
భూజనకోటి నా దగువిభుత్వసమగ్రత [6]నాదరింప వి
భ్రాజితరాజ్యతంత్రములు పాలనసేయుదు నేన వీటికిన్
రా జనఁగా నెపం బిడి విరాటునకుం దగఁ గూడు వెట్టుదున్. 254
255

వ. కావున.

క. నీ వొకత వేల యిలఁ బది,. వేవుర నే వలచి పట్ట వెదకిన నడ్డం
బై వచ్చి వలదు నా నిం, [7]దేవాఁడు మగండు దీని నెఱుఁగవ కంటే. 256

చ. విరటుఁడు సూచు చుండ నిను వేవురముందట [8]నట్లు ద్రోవ నొ

---

1 జను లెడయోల (జను లెడయాట) ... ముగ్ధమృగంబు. 2 యనువున నట్లుండె భీము
నాశ కలుగుటన్. 3 పస...లీలఁ గం,బంబు. 4 దుర్వికారం. 5 గం (ద్రమం) దునే. 6 నా
దరించి. . 7 దేవాఁడి మగఁడు (దేవాఁడు గలండు). 8 నట్లు తాఁప.

క్కరుఁడును గాదు గూడ దనఁ గల్గెనె పోటరు లైనభర్తలే
వురు గల రంటి వారియలవుం జలముం [1]గడగంటి నింక నె
వ్వరు గల రెట్లు దప్పె దనివారణఁ బట్టెద నెందుఁ జొచ్చినన్. 257

వ. అనిన నవ్వేలంది వీఁడు దమకించి యున్నవాఁడు నాయంత్రించుమాటలకు
మున్న కదియంబడినఁ గర్జంబు దప్పు నని విచారించి. 258

తే. బహువిధంబుల నమ్మెయిఁ బలుకునతని
పలుకు లేర్పడ విని మెత్తఁబడినయట్లు
సుభగ మెయివడిచూపుగాఁ జూచి తనదు
హృదయ మెఱిఁగించుతెఱఁగున నిట్టు లనియె. 259

చ. వల దని యెంత సెప్పినను [2]వావిరి నై కడువేగపాటునఁ
బలుమఱు నెల్లెడం దొడరఁ బాఱెదు నీహృదయంబునట్లగాఁ
దలఁపు మనోజుతూపులకుఁ దక్కటిచిత్తములం గడంగి వి
చ్చలవిడి సేఁత గర్జమె విచారము గోర్కికిఁ గానివావియే. 260

క. మగ లడఁకువ [3]నుండక తమ, తగులమ పాటింతు రెట్టితగులం బైనక
మగువల యెడలన యడఁగుం, దగవు విడిచి యడిచిపడరు ధైర్యము బెట్టినన్.

ఆ. ఇట్టు లగుట యెఱిఁగి యెల్లభంగుల రహ, స్యంబు గోలుపోనియట్లు గాఁగ
నడరునీదుకోర్కి కనురూప మెట్టిది, యట్టిభోగభంగి ననుభవింపు. 262

చ. అనవుడుఁ గీచకుండు హృదయంబునఁ బొంగి లతాంగితోడ ని
ట్లను ధృతిఁ గోలుపుచ్చెఁ గుసుమాయుధుఁ డేటివిచార [4]మిట్టు లేఁ
ప నగునె నైన నీ దయినపం పెదఁ గైకొని చేయువాఁడ నే
యనువున నెప్పు డెయ్యెడ నిజాభిమతం బొడఁగూర్తు చెప్పుమా. 263

క. అని పలికినఁ బాంచాలియుఁ, దనయురులం గీచకుండు దగులుట భావం
బున నిశ్చయించి యిట్లను, ననురాగాయత్తచిత్త యైనదివోలెన్. 264

ఉ. ఉత్తర లోనుగాఁ గలపయోజముఖుల్ పగ లెల్లఁ బ్రీతితో
నృత్తముఁ జేసి పోవఁ గమనీయరహస్యవిధిన్ [5]నిశీథినీ
వృత్తము గోరువారలకు వేడ్కకుఁ బట్టగుచుండునాగృహం
బుత్తమ మిత్తెఱంగునకు నొంటిమెయిం దగ నీవు వచ్చినన్. 265

క. అనిన నతఁడు వికసిల్లుచు, నను నమ్మెయి నేల్చికొనిన నలినాననని
యనుమతి సేయనె యొక్కఁడఁ, జనుదెంచెద నేఁటిరాత్రి సమ్మదలీలన్. 266

తే. [6]ఇదియ నిశ్చయ మిమ్మాట వదల కుండు, మనిన నీవొక్కరుండవ యరుగుదేర

1 దగఁ గంటి. 2 వావిరి మై...బాఱెదు నీహృ...గరంగి విచ్చలవిడి. 3 నుండక ...యెడఁ దన. 4 మింక. 5 గడంగి యీ. 6 ...నిశ్చయార్థ...వదలక, యుండు మనిన నీవు నొక్కరుండ, వరుగుదేరవలయు నటుగాకయున్న నే, నిలుచుదానఁ గాను నిక్కువంబు.

వలయు లేకున్న నయ్యెడ నిలుచుదానఁ, గాను జూ నిక్కువం బని పూని పలికె.

క. మన మి య్యెడఁ బెద్దయుఁ బ్రొ[1]ద్దనుమానము లేక మాట లాడుట దగ దీ
వును బో మ్మేనును నా దగు, పని సేసెద ననియెఁ గమలపత్త్రాననయున్. 268

చ. సమయము నిర్ణయింప విని చంద్రనిభాననపల్కు లప్డు చి
త్తమునకు నింపు వెంపఁగ ముదంబునఁ గీచకముఖ్యుఁ డాత్మగే
హమునకుఁ బోయె నమ్ముదిత యచ్చట వెండియుఁ బ్రస్తుతక్రియా
సముచితవర్తనంబుఁ దగఁ జల్పి మహానసశాలలోనికిన్. 269

—ద్రౌపది భీమునితోఁ గీచకుఁడు నర్తనశాలకు రాఁబోవుటం జెప్పుట.—

క. చని వెడ వికసిల్లెడునా, ననపద్మముతోడ ననిలనందనునకు ని
ట్లనియెఁ జతురోక్తిరీతి య, తనిగూఢక్రోధవహ్ని దరికొల్పంగన్. 270

క. నాకొఱఁతఁ దీర్చి వచ్చితి, నీకొఱఁతయ యింక సూతునిం దెగఁ జూడన్
లోకము వంచింపను దగు, చీఁకటి రే యొదవ నేమి సేసెదో చెపుమా. 271

వ. అనిన విని దరహసితవదనుం డగుచు వృకోదరుం డిట్లనియె. 272

క. న న్నడుగ నేల నీవును, నన్నీచుఁడు నేమిమాట లాడితి రది నా
కున్నట్లు లెఱుఁగఁ జెప్పుము, ని న్నే మెచ్చించువాఁడ నీరజవదనా. 273

వ. అనినఁ బాంచాలి సుదేష్ణమందిరంబునం దా నుచితాచరణంబున నునికియు సింహబలుండు సింగారించుకొని వచ్చుటయు రేయింటిమాటలవలనం దాను బెదరమియు వాఁడు సామభేదదానదండంబులు సూపి పలుకుటయు దానికి మెయికోలు భావించికొని క్రమంబునం దగినసంభాషణంబు సేసి నాట్యమండపంబు సంకేతస్థలంబుగాఁ జెప్పి యొక్కరుండ వచ్చువాఁడ వని నియమించుటయు సద్దురాత్ముండు ప్రముదితాత్ముం డగుచు రాత్రిసమయంబున నయ్యెడకు నొంటిమెయిం జనుదెంచువాఁ డై చనుటయుఁ దెలియం జెప్పిన నతండు పరమాహ్లాదంబునం [2]బొంది. 274

శా. క్రోధం బప్రతికార మై హృదయముం గుందింప నత్యంతచిం
తాధూతాత్ముఁడ నైన నాకుఁ బరమోత్సాహంబు సంధిల్ల దు
స్సాధం బైనవిరుద్ధకార్య మిటు లాసన్నంబుగా సంఘటిం
తే ధర్మాత్మజుఁ డాత్మ మెచ్చఁ బగ సాధింపంగఁ గా స్వల్పమే. 275

వ. అని పలికి కొండొక విచారించి. 276

క. వెఱపక సంకేతించిన, తెఱఁగున నయ్యెడకు నరుగుదెంచునొకో కొం
దఱఁ దెచ్చునొకో వెడఁ గై, యఱిముఱి వెలివుచ్చునొకొ రహస్యం బెల్లన్.

ఉ. [3]అట్టిద యేల చేయు ననయంబు నయం బొడఁగూడఁ బల్కు నీ
విట్టితెఱంగు సేయు మని యేర్పడఁ జెప్పిన వాని కత్తఱిం

1 ద్దనయము వెడ లేక...పత్త్రేక్షణయున్. 2 బొంగి. 3 అట్టిది.

బుట్టినసంతసంబుననువుం బరికించితి కాదె యింకని
ట్టట్టనఁ డెట్టు లైన హృదయంబున నెక్కుడిశంక వానికిన్. 278

ఉ. వచ్చు మదాంధవృత్తి ననివారణ [1]నొక్కఁడు నాట్యశాలకుం
జొచ్చు నవశ్యముం వెదకి చూచి ననుం గని యప్డు సంగరం
బిచ్చు మదీయబాహుబలహీనబలుం డయి నీకుఁ బ్రీతిగాఁ
జచ్చు నసంశయం బిది విచారము లిన్నియు నింక నేటికిన్. 279

వ. అని నిశ్చయించి వృకోదరుండు వెండియు నిట్లనియె. 280

మ. బలియుం డాసాబగుండు భావభవదర్పభ్రాంతుఁ డై వచ్చి ని
శ్చలసర్వాంగత నున్న నన్నరసి నీచందంబు గా నున్న నా
కులతం బొందెడు నప్డు మండపము సంక్షోభింపఁగా [2]లేతుఁ గ
ట్టలుకం బెబ్బులి గోల వ్రేసినటు లుగ్రాకార మేపారఁగన్. 281

క. ఎఱిఁగి పిలుసనిన వెసఁ బై, కుఱుకుదు సాళువము గాకి నొసిసిభంగిం
వెఱచఱవం బొదువుదుఁ బఱి, పఱిసేయుదు నీదుపూన్కి పారం బొయిదన్.

ఆ. నాదుబాహుబలమునకు మాఱుకొనఁ జాలు, భుజబలంబు గలిగి పోక [3]చిక్కఁ
బెనఁగి నన్నుఁ గొంత గినియింప నోపెడు, చండ మైన వినుము సరసిజాక్షి.

మ. అవనీచక్రము సంచలింపఁగ దివం బల్లాడ నాశాచయం
బవధూతంబుగ గోత్రశైలనికరం బాకంపముం బొంద న
ర్ణవముల్ ఘూర్ణన మొందఁ గ్రోధము గృతార్థత్వంబు నొందించి చి
త్రవధప్రౌఢి వహించి సూతునకు రౌద్రం బేర్పడం జూపెదన్. 284

వ. అనినం బాంచాలి సంచలితస్వాంత యై నిజాంతర్గతంబున సతనిత్రప్రక్రోధంబు
గుప్తసాధనంబునకు బాధకం బగు నని బోధింపం దలంచి యిట్లనియె. 285

ఉ. ఒవ్వనివారు నవ్వ మహిమోదధి ధర్మసుతుండు దీనికిం
నెవ్వగఁ బొంద భూజనులు నింద యొనర్పఁగ నే నొనర్చుసీ
చివ్వకు నీవు నల్కమెయిఁ జేసినయాపని గూఢవృత్తికిం
ద వ్వగునేని [4]నియ్యభిమతం బొడఁగూడియు నిష్ఫలం బగున్. 286

క. కావున వంచన బాహిర, పోవక యుండంగ మనరిపుం బరిమార్పం
గా వచ్చునేని నట్టిద, నావల పటు గాక తక్కినను వలదు సుమీ. 287

వ. అనిన విని ద్రుపదనందనకుం బాండునందనుం డిట్లనియె. 288

చ. మదమునఁ గీచ[5]కాగ్రజుఁడు మార్కొని నిల్చిన నీక మైమెయిం
గదిసితిమేని నప్పుడు ప్రకాశరహస్యవిభేదబుద్ధి నా
కొదవునె యైన నేఁ దలఁచి యొపినభంగి నిగూఢవృత్తిమెఁ

1 నొక్కఁడ. 2 నేతుఁ...గోల నేచినటు. 3 చిక్కి, పెనఁగి. 4 నాయభి.
5 [illegible]

బదిలము గల్గి తిన్ననియుపాయమునం దెగఁ జూతు నాతనిన్. 289

క. అనవుడు జయలక్ష్మిం జే,కొను మని దీవించి యింతకుం గేకయనం
దన నన్నుఁ దడవుఁ దడయం, జన దియ్యెడ నని లతాంగి సనియెం బ్రీతిన్.

వ. మారుతసుతుండును గృతనిశ్చయుం డై యుండె నట గీచకుండు గంధర్వ
దర్పగోచరుం డై పరిజనంబుల వంచించి యేకాంతస్థలంబున. 291

—కీచకుఁడు ద్రౌపదియందలిమోహంబునఁ బరితాపంబు నొందుట.—

సీ. నామాక్షిరుచిరలావణ్యంబు భావించుఁ, దన్వంగిరూపు చిత్తమున నిలుపుఁ
గంబుకంధరచెన్ను కై వడి దలపోయు, నంగనసౌకుమార్యము దలంచు
భామినిసహజవిభ్రమ మెదఁ గీలించుఁ, బడఁతిచెయ్వులు మదిఁ బట్టుకొలుపు
మానినిగరువంపుమాటపొం దూహించు, దళితాబ్జముఖితిన్నఁదనము మెచ్చు
తే. నడరికోర్కులు చిత్తుముత్తాడ వెడఁగు,పడినయుల్లంబు పట్టునఁ బఱుపఁదనకు
వశముగా కున్న నెంతయువంతఁబొందుఁ,జింత యెసకంబు వడిగొనిచిక్కువఱుప.

చ. తలరు నలందురున్ [1]నవయుఁ దాపభరంబున వెచ్చనూర్చు మే
నలయఁగ నొల్లఁబోవు వెగ డందుఁ గలంగుఁ బరిభ్రమించుఁ గొం
దలపడుఁ దల్లడం బడరి ధైర్యము దూలిన బెగ్గడిల్లు వి
చ్చలవిడిఁ బేర్చు నెవ్వగలసందడి డెందము గంది చేడ్పడున్. 293

వ. ఇవ్విధంబున[2]మదనవేదనాధూయమానమానసుం డగుచు నిట్లని వితర్కించు.

సీ. పడఁతి నన్నొల్లకుండఁ బలికినభంగిన, నిచ్చమై నిక్కకు వచ్చునొక్కొ
వచ్చి తొల్లిటియట్ల వడిఁ ద్రోచి పోవక,పొలఁతి యిం పెసలారఁ బొందునొక్కొ
[3]తలపోఁత గలిగి యమ్మెలఁత వచ్చుటకు నొం,డొకవింత పుట్టకయుండునొక్కొ
గంధర్వు లేవురు గల రని చెప్పె న, న్నెలఁతుకమాటలు నిక్కమొక్కొ
తే. తెఱవ చిడిముడిపాటు సుదేష్ణ యెఱిఁగి
వేడ్కఁ బని వంచు టుడిగి రా విడుచునొక్కొ
మదనుఁ డింతికి నొజ్జ యై మతకములును
నదను నెఱిఁగించి నాకడ కనుచునొక్కొ. 295

ఉ. నిక్కముపోలె నప్పు డొకనేరిమి మై ననుఁ ద్రోచి పుచ్చఁగా
నక్కమలాక్షి పొందు దగ నాడి తుదిన్ నిజ మేది నేఁటిరే
యిక్కకు రాక తక్కిన సహించునె [4]నన్ మరుఁ డట్టు లైన నా
కెక్కడిప్రాణ మేటితను వెయ్యది నిల్కడ యేమి సేయుదున్. 296

క. అట్టెల రాక తక్కం, గట్టిఁడియే యాలతాంగి గామాతురు నన్
బెట్టి యచటఁ దానికి మన, సెట్టు నిలుచుఁ దగవు విడువ నెట్టులు నేర్చున్.

1 సాగ (ల) యు...వెఱగందు...మాలిన బెగ్గ...డెందము గుందు. 2 మదనకదనదోధూయ. 3 (తలఁ పొత్మఁ గలిగి)...దొ, నొండువింతలు పుట్టకుండునొక్కొ. 4 మన్మథు.

ఉ. దానికి నేటినిక్కము వృథా పరితాపము దక్కి ¹బాసమై
పూనికి డిగ్గఁద్రావి వెసఁ బోయెద నిప్పుడ పోయి ముట్టి య
బ్జాననఁ బట్టి తెచ్చి హృదయం బలరంగ ననంగతంత్రవి
ద్యానిపుణత్వ మేర్పఱిచెదం బ్రమదాంబుధి నోలలార్చెదన్. 298

ఆ. అనుచు సంచలించు నడియాసఁ గ్రమ్మఱఁ, బాసఁ దలఁచి ధృతికిఁ బట్టువెట్టు
మరుని కోహటించి యురియాడుఁ²దుదిముట్టఁ, గాననిశ్చయించుఁగఁగుఁ దేఱు.

వ. ³మఱియు నక్కోమలివలని ప్రేముడిం దగిలి. 300

సీ. పొడసూపిన ట్లైన వడిఁ బట్ట ⁴సమకట్టి, పరికించి కానక బమ్మరించు
మెలఁగినయ ట్లైనఁ బలికింపఁ ⁵దలఁచి ని,రూపించి లేమి నశ్రులు వహించుఁ
గదిసినయ ట్లైనఁ గౌఁగిలింపఁ ⁶గడంగి, యారసి బొం కైన నలఁత నొందు
నొడఁబడ్డయ ట్లైన నడరి పైకొనఁ ⁷జూచి, చెన్నఁటి యగుట నిశ్చేష్టఁ బొరయు

తే. లలితవివిధవిహారంబులకు లతాంగి, యెలసి పొలసినయ ట్లైన నెలమిఁ గలసి
యభిమతక్రీడ సలుపంగ నప్పళించి, వెదకి ⁸రిత్తబయల్ గని విహ్వలించు.

—॥ కీచకుఁ డుద్యానవనంబున విహరించుట. ॥—

వ. ఇట్లు బహుప్రకారంబు లగుమన్మథవికారంబుల కగపడి నెగ డంది యమంద సంతాపభరితాంతఃకరణుం డగుచు సింహబలుండు పరిచారికాప్రార్థనం జేసి మజ్జనభోజనంబు లోకభంగి నడపినవాఁ డై తదనంతరంబ మనోవేదనాపనోద నార్థంబు మందిరారామభూమికిం జని తత్ప్రదేశంబున. 302

చ. కమలవనంబుపొంత నునుగాడ్పొకయించుక యాదరించుఁ జి
త్తమునకు దానఁ దల్లడము దక్కుటయుం జని గారవంపుఁజూ
తముకడ నిల్చు నిల్చి యది తాపముఁ బెంచిన లేఁతతీవజొం
పముఁ జొరఁబాఱు నం దలఁత పైకొనినన్ వెడలున్ వెనుంబడున్. 303

ఆ. సుడియుగాలిఁ బువ్వుఁబొడిఁదన్నుఁ ⁹గప్పునో, యనుచు బెగ్గలించు నగ్గలముగఁ
గురియు తేనియలకుఁ గొంకులతాగుల్మ, తరుసమీపములకు నరిగి యరిగి. 304

వ. ఇత్తెఱంగున నొక్కయెడ నయినను గాలూఁదక లీలోద్యానంబు గలయం గ్రుమ్మరుచు. 305

సీ. ¹⁰ఇంపైనప్రియ కాన నిచ్చి నిల్చినమధు, వాదట నానుమత్తాలివిభునిఁ
జెట్టుపల్ పచరించి చుట్టుఁ గ్రుమ్మరి మనో, రమ నియ్యకొలుపుమరాళవిభుని

1 నాసమై. 2 మనమూఁత. 3 మఱియుమఱియు. 4 సమకట్టు. 5 దలఁచు. 6 గడంగు(గి), యాఱడి పోఁ కైన. 7 జూచు. 8 తా రిత్తబయ లని. 9 గప్పిన, బెగ్గలించు మిగుల. 10 ఇంచిన ప్రియకాంత కిచ్చి...ఇంపారఁ బ్రియకాంత యిచ్చినమకరంద, మాదట.

ఫలరసమొందొంటికెలమిఁ జంచులనిచ్చు,మెయిన చొక్కెడుశుకమిథునములను
గమిఁ బాసి తలిరుజొంపమునకు మెయిమెయిఁ, దాఁకంగఁ జనుపికదంపతులను
తే. జూచి చూచి యుల్లంబున నేచి కోర్కు
లడరఁ జిడిముడిపడు మాఱునుపడు వెడంగు
పడు వెనుంబడుఁ దల్లడపడు దురంత
చింతబారికి నగపడు సింహబలుఁడు. 306
వ. ఇట్టివలవంత నిక్కడక్కడ వడిఁ దిరిగి తిరిగి. 307
క. వగ ముట్టికొనినఁ జిత్తము, వెగ డొందఁగ మేను గలయ వెమ్మఁగ ధృతిపాఁ
తగల నొకతీవయింటికిఁ, దగి యుండెడుచంద్రకాంతతల్పము సేరెన్. 308
క. అం దొరగి కీచకుం డా, యిందీవరనయన నాత్మ నిడి వేడ్కమెయిన్
డెందము చన విచ్చలవిడిఁ, గందర్పుఁడు వెట్టఁ జేయఁగా నిట్లనియెన్. 309
సీ. కెంగేలు గేలితోఁ గీలించి నెయ్యంపు, మాటలఁ దగుమఱుమాట లార్తు
గుచము లురంబునఁ గుదియించి క్రమమున, నిఱిసినకౌఁగిట నిం పొనర్తు
నంగుళంబుల నల్ల నలకలు గబళించి, కెమ్మోవి యాని [1]యెక్కింతుఁ గొవ్వ
మనము మనంబునఁ బెనఁచి కేళికిఁ జొచ్చి, సతిఁ దేల్తు సౌఖ్యరసంపునిట్టఁ
తే. దనివు మొదలైనఁ జిగురొత్తు తమకమునకుఁ
బ్రాఁకు వెట్టుచు మగుడఁ బైఁ బడుచు నింతి
వింతభంగుల కెలయించి వెకలిఁ జేసి
యభిమతక్రీడనములకు సలవరింతు. 310
వ. అనుచు వెండియు నిగుడుమనోరథంబులను భావరతంబుల శిశిరోపచారంబులఁ
బ్రొద్దు గడపి కడ గానక. 311
క. మాయరవి యేల క్రుంకఁడొ, కో యను నిట్టల తడసెనో యనుఁ గ్రుంకం
బోయెడుఁ జూ యిప్పుడ యను, [2]దాయ వఱచె నను మనోజతాపముపేర్మిన్.
ఆ. దివము కాని యింక [3]భువనంబునం దిట, పట్టి రాత్రి లేనియట్టు గాఁగఁ
జేసెనొక్కొ విధి విశేషించి నాకకా, నేఁడ దివము సాఁగి నిలిచెనొక్కొ.
తే. అనుచుఁ గ్రుంకింప రానిప్రొద్దరసి యరసి, శిశిరపర్యంకమున మేనుసేర్చి చేర్చి
వంతఁ దలపోసి తలపోసి వనరి వనరి, మిగుల వందురి వందురి పొగిలి పొగిలి.
సీ. తనికెడునారటంబున నంత కంతకు, వెమ్ముచు నునికికి విడుమరయును
గోలుమసంగెడుకోర్కుల వెనువెంటఁ, బొఱుచు నునికికి నూఱటయును
వావిరిఁ [4]బొదివెడువగలసందడిఁ బడి, యురియుచు నునికికి నుడుకువయును
సందంద కదిరెడుకొండలపాటుచేఁ, దలఁకుచు నునికికి నిలుకడయును

1 చొక్కంతుఁ గళల...బడుచు...నింతి...నప్పళింతు. 2 దాయ వెఱచె. 3 భువనం బులం...సాల నిలిపె. 4 బొదవెడు.

ఆ. లేమిఁ దాల్మిఁ గొనఁగ లేక యలందురి,తనువు నింద్రియములుమనముధృతియుఁ
దనవశంబు గాక తల్లడపడి సింహ, బలుఁడు విషమబాణు బారిఁ [1]బాటె.
క. [2]ఇమ్మెయిని నధికపరితా,పమ్మునఁ బడుసూతుహృదయపద్మం బలరం
దమ్మికొలంకుల మొగుడ వ,నమ్ములు సోలంగ దివసనాథుఁడు గ్రుంకెన్. 316
వ. తదనంతరంబ. 317

సూర్యాస్తమయవర్ణనము.

క. ఇనుఁడు దనకడకు నేతెం,చిన రాగముఁ బొందు టిది యుచిత మనఁగాఁ గెం
పున మెఱసి పశ్చిమాశాం, గన జనసంభావనముల గౌరవ మందెన్. 318
ఉ. చుక్కలు తోడుతోడఁ దలచూపఁ దొడంగె మనోభవుండు వి
ల్లెక్కిడి చక్రవాకములయిక్కలు రోయఁగఁ జొచ్చె నేల కెం
పెక్కుచు వచ్చె దీవియలయెత్తెఱ సోయగ మందె సందడుల్
దక్కెఁ బురంబువీథుల [3]మదం బొలసెఁ విటచిత్తవృత్తులన్. 319
వ. పదంపడి జారచోరజనంబులమనంబు లలరం జంద్రాస్తమయం బగుటయు.
క. పెనుమిఱ్ఱిది పల్లం బిది, యన కుండఁగ నోలమును బయలు నొక్కటిగాఁ
గనువిచ్చుటయును మోడ్చుట,యును సరిగాఁ దమము పర్వె నుర్విం దోడ్తోన్.
వ. అప్పు డాకృశోదరి వృకోదరుకడకుం జని సమయం బయ్యె ననవుడు. 322
తే. అతఁడు పెండ్లికిఁ బిలిచినయట్లు వికచ,హృదయుఁ డై తలచీర యాయితము సేసి
ద్రుపదనందనఁ జూచి నాతోన వెనుక, నల్ల నంతంత నరుగు దె మ్మని కడంగి.
చ. గమనముపీఁక వేఱొకవికారము పుట్టక సంగరోత్సవో
ద్యమరభసాతిరేకము బయల్పడు టించుక లేక రోషసం
భ్రమ మొకయింత యైనఁ బరభావనిరూప్యము గాక ద్రౌపదీ
రమణుఁడు వోయె విక్రమధురంధరతం దగ నాట్యశాలకున్. 324
వ. చని వివేకరహితహృదయంబునుంబోలెఁ దమోదూషింబును విదగ్ధవనితా
ప్రేమంబునుంబోలె దుర్నిరూపంబును ఘోరాటవీభాగంబునుంబోలె నిర్మను
ష్యంబును గాపురుషలక్ష్మీవిలాసంబునుంబోలె ననుపయోగ్యంబును ననభ్యస్త
శాస్త్రంబునుంబోలె దుర్గమంబును స్వప్నలబ్ధపదార్థంబునుంబోలె నదృష్టిగోచ
రంబును విషమకావ్యంబునుంబోలె నస్పష్టాలంకారంబును బాలిశురాజ్యంబునుం
బోలె జారచోరహృద్యంబును నైనయానర్తనాగారంబుముఖభాగస్థలంబు సేరి.
క. కెలకులఁ బిఱిందిదెసయుం, గలయం బరికించి తనయఖండితబాహా
బలగర్వమ యచ్చట ముం,గలిగా మదమత్తభద్రగజసదృశగతిన్. 326
శా. ధ్వాంతాకారితకుడ్యకుట్టిమఘనస్తంభావలీరూపముఁ

1 బడియె. 2 అమ్మెయిని నధిక మగుతా...సోలంగ దివస. 3 ముదం (బెసఁగెఁ) బొలసెఁ విటకోటి కెంతయుఁ.

[1]భ్రాంతాదిప్రవిభాగబోధరహితప్రాగ్ద్వారముం గాతర
స్వాంతత్రాసకరంబు నై దురభివేశం బైనయాలోను ని
శ్చింతుం డై సతికేలు వట్టికొని చొచ్చెన్ భీముఁ డత్యుగ్రతన్. 327

వ. ఇట్లు సొచ్చి తఱియం జని మధ్యప్రదేశంబున విరాటనందనలీలాపర్యంకం బరసి
కని దాని కనతిదూరంబునం బాంచాలి నోసరిల నునిచి తా నాతల్పంబును
నుండె నంతం గీచకుండు. 328

క. కై సేసి మదవికారో, ల్లాసంబున మేను వొంగ లఘుగతి నుత్కం
ఠాసవ[2]పానవిధాన, వ్యాసంగతరంగితాంతరంగుం డగుచున్. 329

శా. సింగం బున్నగుహానికేతమునకున్ శీఘ్రంబునన్ వచ్చుమా
తంగంబుం బురుడించుచుం బవనపుత్రస్వీకృతం బైనయా
రంగాగారము సేర వచ్చి మదిలో రాగంబు ఘూర్ణిల్ల నిం
తిం గాముం డిటఁ దేఁడె యింత కని [3]యుద్వృత్తాంగజోన్మాదుఁ డై. 330

ఉ. స్వాంతము బాహుగర్వఘనసంతమసాంధము గాఁగ శంక [4]యొ
క్కింతయు లేక కీచకుఁ డహంకృతి ముంగలి గాఁగ మండపా
భ్యంతరభూమిఁ జొచ్చి తఱియం జని యారసి సెజ్జ గాంచి య
త్యంతముదావహం బగుడు సందు రయంబునఁ గేలు సాఁచినన్. 331

చ. ఘనతరకోపవేగమునఁ గంపము నొందునిజాంగకంబులం
దనధృతిపెంపుసొం పచలితంబులఁ జేయ సమీరుకూర్మినం
దనుఁడు తదీయచేష్టలును దద్వచనంబుల[5]చొప్పు నేర్పడం
గనుమతి నూర కుండె సవికారనిగూఢనిజప్రకారుఁ డై. 332

ఆ. కీచకాధముండు గిమ్మీరవైరిపైఁ, గేలు సాఁచి యావిశాలనయన
గాఁ దలంచి మేను గరుపాఱ నిట్లను, మదనఘూర్ణమానహృదయుఁ డగుచు.

చ. వనిత మనోహరంబు లగువస్తువు లెల్లను వేడ్కఁ నేఁటి నీ
కని నియమించి తెచ్చితిఁ బ్రియంబునఁ గైకొను మెప్పు నంగనా
జనములు నన్నుఁ జూచి మరుసాయకముల్ దమచిత్తవృత్తు లే
చినఁ గొని వచ్చి యిత్తురు విశిష్టధనంబులు నాకు లంచముల్. 334

సీ. నాదురూపంబు మనంబునఁ జిక్కిన, తరుణి దక్కొరు నేల సరకుసేయు
నాదులావణ్యంబునకు నిచ్చ మెచ్చిన, యెలనాఁగ పైఁబడ కేల నిలుచు
నావిలాసంబులు భావింపఁ బడసిన, యింతి పుష్పాస్త్రుచే నెట్లు బ్రదుకు
నావివేకమున కానందింపఁ గనినయం,గన యెట్లు [6]నిలువునఁ గ్రాఁగ కుండు

తే. మెఱయ నాయాడుమాటలు దెఱవపిందు,నుల్లములకు నింపా రెడునురులుగావె

1 (భ్రాంతావిప్రతిభాగ ; బ్రాంతాది)...ప్రాగ్భాగముం. 2 విశేషపాన, వ్యాసంగ.
3 యుద్రిక్తా. 4 యా, వంతయు. 5 సొంపు. 6 విరహాగ్నిఁ...నాతోడిమాటలు.

యిట్లు నీ వొక్కతవె నన్ను [1]నేలుకొంటి, గాక మాట లింక నేటికిఁ గమలవదన.

క. అనవుడు మనమున నిస్సీ, యని యుచితనిగూఢభంగు లగుభాషణముల్
దనప్రియ వినిపించుట కి, ట్లనియెఁ మృదురీతి భీముఁ డాతనితోడన్. 336

తే. ఇట్టివాఁడవు గావున నీవు నన్నుఁ, బొగడికొనఁ దగు నకట నాపోల్కి యాఁడు
దాని వెదకియు నెయ్యెడనైన నీకుఁ, బడయ వచ్చునె యెఱుఁగక పలికితిట్లు.

క. నాయెడలు సేర్చినప్పుడ, నీయెడ లెట్లగునొ దాని నీ వెఱిఁగెదు న
న్నేయబలలతోడిదిగాఁ, జేయఁ దలంచితివి తప్పు సేసితి గంటే. 338

క. నను ముట్టి నీవు వెండియు, వనితలసంగతికిఁ బోవు వాఁడవె యైనం
దను వేఁ బడసినఫలమే, కనియెద విదె చిత్తభవవికారము లెల్లన్. 339

మ. అనుచున్ గ్రక్కున లేచి రోషకఠినం బౌహాస మాసూతునె
మ్మన ముద్వేగముఁ బొందఁ జేయ బల[2]సామగ్రిన్ సముజ్జృంభణం
బున వానిం దల వట్టి వంచుటయు నేపుం జేవయుం దోఁప వాఁ
డనుమానింపక బెట్టదల్చికొని కోపాటోపదీప్తాంగుఁడై. 340

భీమసేనుఁడు గీచకుని సంహరించుట.

వ. గంధర్వుం డనుతలంపున. 341

చ. పవనతనూజుబాహువులు పాణియుగంబునఁ బట్టి వీఁకమై
నవనిపయిం బడం దిగిచి యంగము [3]జానుల నూఁదినం గడున్
జవమున దండతాడితభుజంగముభంగి సముద్ధితాంగుఁడై
యవయవముల్ ప్రకోపరభసాతిశయంబునఁ బొంగ నుద్ధతిన్. 342

మ. మగుడం గీచకుఁ బట్ట వాఁడును బలోన్మాదంబునన్ బాహుగ
ర్వగరిష్ఠుం డగునాహిడింబరిపుఁ దీవ్రక్రోధుఁడై పట్టి బె
ట్టుగఁ ద్రోపాడఁగ నిద్దఱున్ భుజబలాటోపంబుమై నొండొరున్
మిగులం జాలక కొంతసేపు వడి మేమేఁ బోరి రుగ్రాకృతిన్. 343

వ. అట్టియెడ. 344

క. తనయగపాటొరు లెఱుఁగుదు, రని సూతుఁడు సమయభంగమగుటకు భీముం
డును గొంకుచుఁ జప్పుడు సే, యనిగూఢవిమర్దనప్రహారములఁ దగన్. 345

వ. మల్లయుద్ధనైపుణ్యంబు మెఱయం గడంగి. 346

సీ. తిగిచిన నడుగులు దెరలక యొండొరుఁ, గ్రమ్మఱఁ దిగుచుచుఁ గడిమి మెఱయఁ
బొడిచిన వెస బీఱు వోవక యొండొరు, నందంద పొడుచుచు నవనిఁ బెట్టి
యొత్తిన బెగ్గలం బొందక యొండొరు, బలువిడి నొత్తుచు నలవు మిగిలి
యడఁగంగఁ బొదివిన నడిచిపాటించుక, యును లేక వీఁక నొండొరుల నడరి

తే. యడఁగఁ బొదువుచు నలుక యంతంత కగ్గ

1 నేలవంటి. 2 సామగ్రీసము...దీప్తాత్ముఁడై. 3 సంధుల నూనినం.

లించి యాయముల్ నొంచి దోర్లీల నెఱపి
యుల్లసిల్లిన స్రుక్కఁ గొం డొరుల రౌద్ర
వృత్తి నొంచు చొం డొరులకు [1]వెక్కసముగ. 347

క. కదియుచుఁ బాయుచుఁ బట్టుచు, [2]నదలుచుచుం బడుచు లేచుచడఁగుచు వడి
చొదవెడుకినుకం గడు బె, ట్టిదముగఁ బెనఁగిరి చలంబు డింపక కడిమిన్. [గొం

ఆ. ఇవ్విధమున నేచి యిరువురుఁ బెద్దయుఁ, బ్రొద్దు పోర వాయుపుత్త్రుబలము
దొడుతొడఁ బెరుఁగఁ దొడఁగె నాకీచకా, ధముని లావు పిదపఁ దఱుఁగఁ జొచ్చె.

ఉ. దాని నెఱింగి యెంతయు నుదగ్రత నాబకవైరి గ్రక్కునన్
వాని నడంగఁ బట్టి పడవైచి మహోగ్రత నాక్రమించెఁ బం
చానన మేణముం బొదువునట్లుతఁ డూర్జితశక్తి [3]నుద్భటుం
డై నెగసెన్ సమీరసుతు నల్కకుఁ బ్రాఁ కిడినట్లు వీఁకతోన్. 350

క. నెగయునెడ నగ్గమైనను, [4]బిగి యారుచుఁ బిఱుఁదుసనినఁ బిడికిట గొఱసం
ది గడు బెడిదముగఁ బొడిచెం, బగతుఁడుగను మిడిసి నేలఁ బడి తన్నికొనన్.

ఆ. పల్లవప్రసూనఫలభరితం బగు, మ్రాను గూలఁ ద్రోచుమత్తగజము
[5]పోల్కి వివిధరత్నభూషణభూషితుం, డైనసూతుఁ గూల్చె ననిలసుతుఁడు. 352

చ. వికృతపుఁజావు సంప మది వేడుక పుట్టినఁ గిట్టి పట్టి మ
స్తకమును బీన దీర్ఘభుజశాఖలుఁ బాదయుగంబు మేనిలో
నికిఁ జొర నుగ్గుగాఁ దుఱిమి నించినగ్రంతలతిత్తియైనకీ
చకుధరణీస్థలిం జదిపి చక్కనిముద్దగఁ జేసెఁ దుష్టుఁ డై. 353

క. తనకడిమికలిమి నచ్చియు, మనమునఁ దలఁ కడర సూతుమరణంబు గనుం
గొనుటకుఁ దల్లడపడు ప్రియ, వనిత కతనిచావు సెప్పి వడిఁ దన్మాత్రన్. 354

చ. అనలము గూఢయత్నమున నయ్యెడకుం గొని వచ్చి దానిఁ జ
య్యన వెలుఁగొందఁ జేయుటయు నచ్చెరువున్ భయమున్ బ్రియంబునుం
బెనఁగొనఁగాఁ గనుంగొనియె భీతమృగేక్షణ భీము డాయఁ గాఁ
జని కడునక్కజం బయినచందమునం బడి యున్న పీనుఁగున్. 355

ఉ. చూచుచుఁ జేరి వ్రేల్మిడుచుచుం దల యూఁచి [6]విలక్షచిత్తయై
యాచపలాక్షి ముక్కుపయి నంగుళముం గదియించి దీనికై
కీచక యింత సేసితి సుఖిత్వముఁ బొందుదుగాక యింక న
గ్గించిన నిట్లు గా కుడుగునే యనుచున్ వెఱఁ గందు చుండఁగన్. 356

క. పూనిక నెఱపితి సతియవ, మానముఁ బరితాపభరము [7]మాన్చితి నిపు డి

---

1 వెగ్గలముగ. 2 నొదలుచుచుం...చుడుగుచు వడిఁ గెం, పొదవెడు; లేచు చలుగుచు నెడఁదం, పొదలెడు కినుకం...బోరిరి. 3 నుద్ధతుం. 4 బిగి యాడుచు...,భీకరుఁ డై బెట్టుగఁ బొడిచె నపుడు భీముఁడు; బిఱుఁదుసనని పిడికిట ఘోరం, బుగఁ బొడిచెను వడి భీముఁడు, పగ. 5 పోలె. 6 విదగ్ధ; విషణ్ణ. 7 మాన్పించితి ని; మాన్పితి ననిలో.

ల్లెనని మదిఁ బొంగెడుపవ, మానసుతుం డిట్లు లనియె మానినితోడన్. 357

శా. చింతాశల్యము వాసెనే భుజబలోత్సేకంబు నీ కెక్కెనే
శాంతిం బొందెనె రోషపావకుఁడు దుశ్చారిత్రునిం జూచి తే
సంతోషించితె యిట్లు గాక బ్రదుకన్ శక్యంబె దుర్వృత్తి నీ
చెంతం జేరినయట్టి[1]వీరులకు నాచేతం బయోజాననా. 358

క. అనిన విని సింహబలమ,ర్దను నవలోకించి ద్రుపదరాజతనయ యి
ట్లనుఁ దనమనమున నిండా,రినసమ్మోదంబు వెలి విరిసి బెరయంగన్. 359

సీ. కొలువులోపల నిన్న కోప మల్లెత్తినఁ, దలఁకక నిలిచినధైర్యమహిమ
నేఁ డిందుఁ జనుదెంచి నిర్వికారతఁ బ్రజ, కన్నులు [2]గప్పినగౌరవంబు
మనవారిలోన నొక్కని నైనఁ బిల్వకు, త్సాహంబు సేసినసాహసంబు
లోకదుర్జయుఁ డగునీకీచకునిని వ్రేల్మిడి రూపు మాపినకడిమిసొంపు
తే. సూడఁ దలపోయ మెచ్చ సంస్తుతి యొనర్ప, నాదలంబె నీయుత్తమనాయకత్వ
మఱిఁగి నినుఁ గొనియాడ నేనెంతదాన, మహిత విస్మయానందనిర్మగ్న నైతి.

క. అనుపలుకులు కర్ణరసా, యనము లగుడు నయ్యుధిష్ఠిరానుజుఁడు ముదం
బునఁ దేలి యింకఁ దడయం, జన దని ద్రౌపదికిఁ జెప్పి చయ్యన నేఁగెన్.

క. అనిన విని కీచకుఁడు స, చ్చినవిస్మటఁ [3]బుట్టినవ్విశేషము లెల్లన్
వినువేడుక మన మలరెడు, ననఘా యేర్పడఁగఁ జెప్పు మనుటయుఁ బ్రీతిన్.

చ. పరమకృపావిధేయ నిరుపాధికచిన్మయకాయ [4]గాఢవి
స్తరనిగమైకవేద్య గుణతత్త్వవికారనియత్యభేద్య సం
స్మరణనిరస్తతాప ఘనసంసృతిసంతమసప్రదీప ని
ష్ఠురభుజసారదానవనిషూదన భక్తజనప్రమోదనా. 363

క. చతురానందమయా దు,ర్గతిరోగోద్గమచికిత్సకా భువనభవ
స్థితిసంహారకరా ని,ర్వృతిపణ్యాపణపదారవిందవికాసా. 364

మాలిని. [5]సురపరివృఢచూడాశోభిరత్నాంశువీచి
స్ఫురణసుభగపాదాంభోజసంచారకేళీ
పరిచయకలనాలబ్ధవ్యయాతీతసౌఖ్యో
త్తరమునిజనహృన్మాద్యన్మరాళప్రతానా. 365

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున విరాటపర్వంబునందు ద్వితీయాశ్వాసము.

---

1 వారలకు. 2 గట్టిన...నాతరంబ నీయుత్తమ...మహితగుణపూజ్యసంతోషమగ్న.
3 బుట్టు. 4 గూఢ దు,స్తర...నిరస్తపాప. 5 సురపతిధృత (దృఢ).

శ్రీ

గణేశశారదాగురుభ్యో నమః.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## విరాటపర్వము, తృతీయాశ్వాసము.



త్త్వశివాత్త్వాలంబన
తత్త్వాశ్లేషాత్తశబలతాసంగతక
ర్తృత్త్వాది[1]కలీలాత్తమ
హత్త్వాహంకారభావ హరిహరనాథా. 1

ఉపకీచకులు ద్రౌపదిం దమయన్నశవంబుతోఁ గట్టి దహింపం గొని పోవుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియెఁ బవనతనయుం డట్లు సని
మహానసమందిరంబు పరిసరంబున శరీరప్రక్షాళనంబు సేసికొని యనులేపనంబున
[2]నసృగ్గంధం బుడిపికొని కృతకృత్యుం డై శయ్యాతలంబునం గూర్చుండె నిట
యాజ్ఞసేనియు భీమసేనుం డింతకు వంటయింటికిం బోయి నిశ్చింతంబున నుండు
నని నిశ్చయించి నర్తనశాల వెలువడి కావలివారలం బిలిచి. 2

క. నాపతు లగుగంధర్వుల, చేపడి మృతిఁ బొందె వీఁడె సింహబలుం డీ
పాపాత్మునిఁ జూడుఁడు దు,ర్వ్యాపారఫలంబు గాంచె నని పలుకుటయున్. 3

ఆ. వారు సంభ్రమించి వడిఁ[3]గోలదివియలు,గొనుచు నులివు మిగులఁ గూడఁబాఱి
నృత్తశాలఁ జొచ్చి రత్తఱి నాకల, కల మెఱింగి కీచకవ్రజంబు. 4

చ. [4]కడువెస వచ్చి రూపఱినకాయమునున్న తెఱంగుఁ జూచి బి
ట్టడలు మనంబులం గదిరి హా యనువారును జోద్య మంది మ్రా
న్పడియెడువారు నగ్రజునిపైఁ బడి మూర్ఛలఁ బొందువారు న
య్యెడ కరుగంగ నోర్వక మహిం బెఱచోఁ బలవించువారు నై. 5

వ. ఉన్నంత బంధుజనంబులు గూడం బాఱి కీచకశవంబు గనుంగొని. 6

ఉ. మానవకోటి నిట్టి[5]విసుమానపుఁబీనుఁగు లైనవారి నెం
దైనను గంటిమే యకట యాఱడి వమ్మయి పోయె దుర్జయం

---

1 విలాసమయమ (విలాసాత్తమ) హత్త్వాలంకార. 2 నస్ర (విస్ర) గంధం...వంట కంబునింటికిం. 3 గాలుదివియలు ; దివ్వెకోలలు. 4 కడువడి. 5 కసుమాలపుఁ.

బైనబలంబు గానితెరు వై తన కీర్తిఁ దోడు [1]గాద యు
క్కనిమనంబు గీడు పరికించునె క్రొవ్విఁ జేటుదప్పునే. 7

వ. అనుచు డాయం జని. 8

తే. కరము లెయ్యవి శిరమేది గాళ్లు లెచట, జొచ్చె గంధర్వవరులచేఁ జచ్చువార
లెల్లనిట్టుల యగుదురో యితనితోడి, యలుకఁ జేసిరో యిది గడు నక్కజంబు.

వ. అని వెండియు బహుప్రకారంబులం బలుకుచు శోకవిస్మయపరీతచేతస్కు లయి
యున్నంత నొక్కయుపకీచకుండు నిజసహోదరులం జూచి. 10

క. మన మెంత[2]పనవి పిలిచిన, విన నేర్చునె సింహబలుఁడు వేగమ యితనిం
గొనిపోవఁగ వలయుం గా, కని యందఱఁ దేర్చె ననునయాలాపములన్. 11

ఉ. సూతులు దాని కియ్యకొనుచుం దమయన్నకు నగ్ని [3]యేర్చువా
రై తగ వాచరించునెడ నల్లన ద్రౌపది వీరి చందముల్
సూతము గాక యంచునొకచోఁ దమచేరువ నున్నగాంచి సం
జాతమహోగ్రకోపు లయి చారువిలోచనఁ బట్టి క్రూరతన్. 12

క. పెడగేలు గట్టి పాపపుఁ, బొడ వగు నిది గాదె యితనిఁ బొడ వడఁగించెన్
గెడగూడ దీని నీతని, యొడలిపయిం బెట్టి కాల్చు టుచితం బరయన్. 13

వ. అని విరాటున కెఱింగించి చేయువా రై యంతకు మున్న యీవృత్తాంతం బంత
యు విని సంక్షుభితహృదయుం డై యున్నయతనిపాలికిం బోయి. 14

తే. ఎల్లభంగుల సైరంధ్రి నేము సింహ,బలునితోఁ జంపువార మై తలఁచి నీకు
నెఱుఁగఁ జెప్పంగ వచ్చితి మీవు నింత, వట్టుమన్నన మాకు నీవలయు ననిన.

వ. అతండును దనమనంబున నియ్యుపకీచకులచందంబు సూడ నేను వారించితినే
నియు నుడుగం గలవారు గా రని (యు గంధర్వులు బలవంతులు గావునఁ
దద్రక్షిత యైనసైరంధ్రి కపాయంబు వొంద దని) యు నూహించి వారలం
గలయం గనుంగొని యట్ల కాక మీకుం బోలినతెఱంగు సేయుం డనిన నది
య యనుమతిగాఁ గైకొని సరభసంబునం జనుదెంచి. 16

ఉ. అంగజరాగమత్తుఁ డగునన్నకు నిమ్మెయి నైనఁ బ్రీతిసే
యం గలవార మీజఱభి యాతనితోడన తీఱుఁ గాక యం
చుం గొనిపోయి [4]దైన్యమున సూతునిపీనుఁగుమీఁదఁ బాండుపు
త్రాంగనఁ బెట్టి కట్టిరి దయాపరివర్జితచిత్తవృత్తు లై. 17

చ. అశుచియుఁ గష్టుఁడున్ లఘువు నైననిజాగ్రజుమేనితోడ ని
త్యశుచియుఁ బుణ్యశీలయు నుదాత్తయు నాఁ జనునింతిఁ గొంచుఁ గ
ర్కశమతిఁ గీచకుల్ బహుముఖంబుల బాంధవవిప్రలాపముల్

---

1 గాక. 2 వనరి పలికి. 3 యిచ్చు...నల్కక ద్రౌపది. 4 ధైర్యమున (హీనముగు)
...వర్జితు లై రయంబునన్,

దిశ లద్రువం జెలంగఁ గరదీపనికాయము ప్రజ్వరిల్లఁగన్. 18

క. పితృవనముదెసకుఁ జన న, య్యతివ భయభ్రాంతచిత్త యై బాష్పజలో
ద్గతి మొగముఁ గప్ప నిట్లని, యతిరావముగా నొనర్చె నాక్రందనమున్. 19

ఆ. అనద నైతి నిచట నాలికుయ్యాలింపుఁ, డకట మీరు గలుగ నాక్రమించి
నన్నుఁ గట్టి సూతనందను లిమ్మెయి, వెఱపు లేక భంగపఱుచు[1]వారు. 20

ఉ. ఆనతవైరి యోజయ మహాద్భుతవిక్రమ యోజయంత దు
ర్మానవిఘూర్ణమానరిపుమర్దన యోవిజయాభిధాన తే
జోనిహతాహితప్రకటశూరగుణప్రతిభాస యోజయ
త్సేన విరోధిబాహుబలజృంభణభంజన యోజయద్బలా. 21

సీ. [2]తొడఁగినపని చలం బెడపక యతిదుష్క, రం బైనఁ గడతేర్చుప్రభువులార
పెనఁగిన వైవస్వతుని నైనఁ గడిమిమై, వ్రేల్మిడిఁ బరిమార్చువీరులార
శరణార్థి యగుదుష్టశాత్రవు నైనను, గరుణ రక్షించుసత్పురుషులార
యర్థికిఁ బ్రాణంబు లైనను డాఁపక, తమకించి యిచ్చునుదారులార

తే. నాథులార గంధర్వరత్నంబులార, నన్ను నుపకీచకులు దమయన్నశవము
నందు బంధించికొని వెస నరుగు చున్న, వారు రక్షింప వేగ రావలయు మీరు.

భీముఁ డుపకీచకులం జంపి ద్రౌపదిని విడిపించుట.

చ. అని పలవించునయ్యెలుఁగు లాపవమానతనూజుఁ డేర్పడన్
విని మది నాదువల్లభకు [3]వీండ్రను గ్రమ్మఱ నింత సేసిరే
యనుచు సరోషసంభ్రమత నాయిత మై వెసఁ బాఱి పప్రలం
ఘున మొనరించె గుప్తముగ గ్రక్కున ముట్టెడుదానికిం దగన్. 23

తే. ఇట్లు లంఘించిపోయి పరేతభూమి, యొద్ద నలుదిక్కులునుజూచి యొక్కయున్న
తావనీజంబు వెఱికి రౌద్రాతిరేక, మడర [4]భుజశిఖరంబునయం దమర్చి. 24

మ. వికటభ్రూకుటిఘోరఫాల[5]కలితస్వేదోద్భటుండుం జల
ద్వికృతోష్ఠద్వయుఁడుం బ్రమర్దనదశావిర్భావసంభావితాం
గకుఁడుం జిత్తవిదాహదోహలసమగ్రక్రోధవేగుండు నై
బకవిధ్వంసకుఁ డయ్యెడన్ నిలిచె శుంభన్మూర్తివిస్ఫూర్తితోన్. 25

వ. తదనంతరంబ. 26

ఆ. సూతుశవముతోడ నేతెంచు [6]నెరవులు, దవ్వుదవ్వులన యుదగ్రరూప
కలితుఁ డైనభీముఁ గనుఁగొని నడవక, నిలిచి రంత నంతఁ గలఁగఁ బాఱి.

మ. ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొని రింకెట్లొక్కొ యంచున్ భయం

---

1 వారె. 2 తొడరిన...బెడలక...చెనకిన వైవ...వీర యగుగు. 3 వెండియు వీండ్రను. 4 నిజభుజశిఖరంబునం. 5 ఘటితస్వేదో (ద్గమం) ద్భవుండుం...బ్రవర్ధనదశా...విధ్వంసకుం. 6 కీచకుల్ (వారలు).

బొదవం బల్లములందు డాఁగియు సమీపోర్వీజముల్ ప్రాఁకియుం
జెదరం బాఱియు నీరు సొచ్చియును నిశ్చేష్టం బదద్వంద్వముల్
గుదివడ్డం బెగడొందియుం భరితసంక్షోభాత్ము లై రత్తఱిన్. 28

ఉ. సూతులు భీతు లై ద్రుపదసూతిసమేతము గాఁగ నగ్రజ
ప్రేతము వైచి వీటిదెసఁ బెల్లుగఁ బాఱఁ దొడంగినం వడిం
వాతసుతుండు ముట్టికొని వారి బడల్పడ వ్రేసి యందఱం
జేతులతీఁట వో నుఱుముసేసె విశృంఖలవిక్రమంబునన్. 29

వ. ఇవ్విధంబుననూటయేవు రుపకీచకులను సమయించి శమితక్రోధుం డై నచ్చి
పాంచాలీబంధమోక్షంబు గావించి యింక నిశ్చింతంబున సుదేష్ణామందిరంబున
కుం జను మని యవ్వెలంది వీడుకొలిపి తానును వేఱొక్కమార్గంబున మహానస
గృహంబున కరుగుదెంచెం దత్సమయంబున విరాటుండు గీచకానుజులు గంధ
ర్వులచేత నిరవశేషంబుగా మృతిం బొంది రని విని చకితచేతస్కుం డగుచు
సహోదరమరణశోకాయత్తచిత్త యయినజీవితేశ్వరి నుచితాలాపంబుల ననున
యించి యి ట్లనియె. 30

ఆ. చంద్రవదన యింక సైరంధ్రి నిచ్చోటు, వాప వలయు నేమిభంగి నైనఁ
గాన నాదుపలుకు గాఁ జెప్పు వెడలుట, కనుగుణముగ నమ్మృగాక్షితోడ. 31

ఆ. పురుషు లాలతాంగిపొరువునఁ బోయినఁ, జేటు వచ్చుఁ గానఁ జెప్పు నేను
వెఱతు నాఁడువారు [1]వెరవుతో మృదువచో, రచనఁ జెప్పుటరయ నుచితవృత్తి.

ఉ. ఆకమలాక్షిరూపమహిమాతిశయంబు మనోహరంబు భో
గైకపరాయణుల్ పురుషు లంగజుఁ డప్రతికారచేష్టిత
స్వీకృతలోకుఁ డ ట్లగుటఁ జేటు పురంబునవారి కెప్పుడుం
గా కెటు లుండు నిట్టియవగాఢపుఁబొత్తు మనంగ వచ్చునే. 33

క. అని నిశ్చయించి పలికిన, విని కేకయరాజపుత్రి విభుతలఁపు మనం
బునకుఁ బ్రియం బగుటయుఁ గై, కొని యాపని యట్లచేఁతకుం బూనెఁ దగన్.

క. అంతం గుంతీనందన, కాంతాచింతామహాంధకారముతో న
త్యంతంబు మచ్చరించెనొ, నంతమసం బనఁ బ్రభాతసమయం బయ్యెన్. 35

వ. పదంపడి పద్మినీప్రమోదసంపత్కరుం డగునరుణకిరణుం డుదయించె నట
మున్న పాంచాలి సచేలస్నానంబు సేసి రాగాదివికారనిరాసనంబునం బ్రసన్న
యయిన బుద్ధియుంబోలె సింహబలప్రభృతికీచకవిధ్వంసనంబునం దెలి వొంది
మందమందయానంబునం బురంబు సొచ్చి రాజవీథి నరుగుదెంచునప్పుడు. 36

సీ. మనకీచకుల కెల్ల మారి యై పుట్టిన, సుదతి వోయెడు నని చూచువారు
నద్దిరా నీకుఁ గ్రొవ్వఱుగదేఁ జూతు గా, కని తల సూపక యడఁగువారు

1 తెఱఁగుతో.

సలవోక గనుఁగొని యంతరంగము బిట్టు, [1]బెదరమాఱుమొగంబు వెట్టువారు
నెదురుగావచ్చిన నెంతయేనియు దవ్వు, గలుగ వేఱొకత్రోవఁ దొలఁగువారు
తే. ముట్టఁబడి మేనఁ గంపంబుపుట్ట నొదిఁగి, యుండువారుఁ గరంబుననుదరమప్ప
ళించి యమ్మరొ రక్కసయంచు నుల్ల, ములుకువారునై పురజనంబులు దలంకి.
చ. పులిఁ గనుఁగొన్న [2]లేడులునుబోలె విభీతిఁ గలంగఁ బాఱ న
న్నెలఁతుక యంతరంగమున నిండినహాస్యరసంబు మోముపై
వెలి విరియంగ నీక చని వేచి మహానసశాలవాకిటన్
నిలిచినభీమసేనుఁ గని నెయ్యమెదం జిగురొత్తు చుండఁగన్. 38
క. తనయంతన యటు వలుకుచుఁ, జనువిధమున నతనిదిక్కు చక్కనిచూడ్కిం
[3]గనుఁగొనక ద్రుపదనృపసం, దన యిట్లను నిజకృతార్థతం దెలుపుటకున్. 39
తే. కీచకులదెసఁ బుట్టిన కిల్బిషంబు, పాచి నన్ను రక్షించినపరమధర్మ
రతికి గంధర్వపతికి నిరంతరంబు, భక్తియుక్తిమైఁ బ్రణమిల్లి బ్రదుకుదాన. 40
వ. అనిన విని యనిలనందనుండు నిగూఢవచనచాతుర్యధుర్యుం డై యిట్లనియె.
చ. అతివ యపాయముం బొరయునప్పుడు గావక తక్కెనేని నా
పతి పతియే తలంప మగపాడియె లోకముపాడియే భవ
త్పతు లిటు లాచరించుట గదా భవదీయమనోనువర్తన
స్థితి [4]కుచితంబు వారల నుతింపఁగ నేల నిసర్గవృత్తులన్. 42

ద్రౌపది యర్జునునితో సల్లాపంబు సేయుట.

తే. ఇట్లు దమ్ము నిరూపింప నితరజనము, లకు నశక్యంబు గాఁగ సల్లాపరసము
ననుభవించుచు నల్లనల్లన లతాంగి, యరిగెన ర్తనమండపోపాంతమునకు. 43
వ. చని విరాటకన్యకలయాటఁ జూచుచందంబున నందుఁ బురందరనందనుం
గనుంగొనునప్పాంచాలి నాలోకించి యతండునుం దారును దదభిముఖంబుగా
వచ్చి యక్కన్నియ లి ట్లనిరి. 44
ఉ. కీచకకోటిచేత నొకకీడును బొందక వచ్చితమ్మ ని
న్నేచినదుర్మదుండు జమునిం గొలువం జనెనమ్మ యంతఁ బో
కేచినసూతు లీమొదలి కింతయపాయ మొనర్తురమ్మ వే
కాచి విరోధులం దునుమఁ గా నిటు ముట్టుదురమ్మ నీపతుల్. 45
వ. అని తారు మున్ను విన్నకీచకవృత్తాంతంబున కనుగుణంబుగా నుపచారంబులు
వలుకు చుండ నాబృహన్నల సైరంధ్రి కి ట్లనియె. 46
క. ఆపాపాత్ముల నీచ, వ్యాపారక్రమము వార లందఱు మృత్యు

1 బెదరి...రక్కసి. 2 తెల్లగమిఁ (బోలెను) బోలెడి; భీతిఁ (గలంగిపాఱు) గలంగువాఱ. 3 గొన నీక ద్రుపదనందన, యనియె నిజకృతార్థవృత్తి యంతయుఁ దెలియన్. 4 యుచితంబు వారికి...(వృత్తముల్).

ప్రాపితు లైన తెఱంగును, నీపలుకుల నెఱుఁగ వలయు నెలఁతుక [1]చెపుమా. 47

వ. అనిన విని సైరంధ్రి సాభిప్రాయంబుగా బృహన్నల కి ట్లనియె. 48

తే. కన్నియల కాట గఱపుచు నున్న నీకు, నకట సైరంధ్రి యిప్పు డేమయ్యె నేని
ఖేద మెద నించుకయు లేమిఁ గాఁ దె సస్మి, తాననంబుతో నన్నిటులడుగు టెల్ల.

వ. అనిన బృహన్నల యి ట్లనియె. 50

క. [2]నీ వలుగులపడుటకు దుః, ఖావేశము వొందెనే నిరర్థక మగు ని
య్యేవపుఁబుట్టువు పుట్టిన, నావగ పెవ్వరికి నెక్కు నలినదళాక్షీ. 51

క. నీతోడిపరిచయము [3]లే, దే తలపోయఁగ ననింద్య వెందును నీ వి
ట్లాతుర వగుటకు నామది, నేతాపము లేదు నైజ మెఱుఁగవు గంటే. 52

వ. అని తాను నిజసహోదరులయట్లపోలె వేషాంతరంబు దాల్చినయంతియ కాక యూర్వశి యిచ్చినశాపం బనుభవించుటకు శరీరాంతరపరిగ్రహంబు సేయుటం జేసి రిపుమర్దనంబు తనకు వెరవు గా కునికి గుప్తసాభిజ్ఞానంబుగాఁ దెలిపిన బలసూదన సూనుపలుకులు విని పాంచాలి యంతస్స్మితకమనీయకపోల యగుచుని ట్లనియె. 53

ఆ. అట్ల కాక యింత యన నేల నీమది, తెఱఁగు గొంత యేను నెఱుఁగ కున్న
దానఁ గాను నగరఁ దగవుమై నీవు వర్తించుటయ కరంబు ప్రియము నాకు.

వ. అనుచుం గన్యకాజనపరివృత యై యరిగి యంతఃపురంబు సొచ్చి సహోదర మరణ[4]శోకాతుర యగు కైకేయికడకుం జనునప్పుడు. 55

సీ. ముదమున నెలమిసాం పొద వినెమ్మొగమునఁ, దోఁపంగ వచ్చినఁ ద్రోచి త్రోచి
లలి నుల్లసిల్లుచు లలితలోచనదీప్తు, లడర నుంకించిన నాఁగి యాఁగి
సంతసంబున బాలిశము లగు చెయ్వులు, దొడరఁ [5]జూచినఁ జేయ కుడిగి యుడిగి
మనమున నుబ్బు మై మాట నాలుకకు రాఁ, గడఁగిన నాడక కడపి కడపి

తే. ధీర యై యిట్లు సమ్మదపూరమునకు, గఱువతన మనుబలితంపుఁగట్ట వెట్టి
వెలఁది యెఱుఁగనియది వోలె వికృతి లేక, యల్ల నెప్పటియట్టుల యరుగుటయును.

క. భయశోకంబులు దనదుహృ, దయమునఁ [6]బిరిగొనవిరాటధరణీనాథ
ప్రియ సంభావన సేసె వి, నయపూర్వము గాఁగ ద్రుపదనందనకుఁ దగన్.

వ. ఇట్లు సంభావించి యుత్తరుణిం దనపరిసరంబున నునిచికొని తదీయవదనం బవలోకించి. 58

తే. నీవు చక్కనిదానవు నెలఁత ధైర్య
రహితచిత్తులు మగవారు రాజు దీనిఁ
దలఁచి భయ మంది నిన్ను నీవలచు నెడకు

1 మాకుఁజ. 2 నీవు వగలఁ; నీ వలజడిఁ; నీ వలమటఁబడు...వొంద నే. 3 లే, నేతల.
4 శోకాయత్తచిత్త యగుకేకయరాజనందనకడకుం. 5 వచ్చినఁ...మదమున నబ్బు. 6 బురికొన.

నరుగునట్లుగఁ బ్రార్థించి యనుపు మనియె. 59

వ. అని తనమనంబునం గదిరినయనుజవియోగతాపం బుత్కటం బగుటయు వెండియు ని ట్లనియె. 60

క. [1]బిరుదు గలమగలు గల రని, తరమిడి చంపింపఁ జూచెదవు జనములు నీ
పొరువునఁ బో వెఱతురు మా, పురమును రాష్ట్రంబు వెడలి పొమ్మం డైనన్.

వ. అనిన విని విరాటవల్లభకు సైరంధ్రి యి ట్లనియె. 62

ఉ. ముందటియట్ల యింకఁ బదుమూఁడుదినంబులమాత్రకుఁ భవ
న్మందిరవాస మియ్యకొనినం గడతేఱు మదీయవాంఛ యం
తం దగఁ దోఁచి మత్పతు లుదాత్తమతిః భవదీయవాంఛితం
బుం దలకొల్పఁ జాలుదు రపూర్వమనఃప్రమదంబు సేకుఱున్. 63

క. కృతమెఱుఁగుదు రుపకార, వ్రతమున వర్తింతు రెపుడు [2]వదలరు కరుణా
న్వితు లీనరపతికి శుభ, ప్రతిపాదకు లగుదు రేమిభంగుల నైనన్. 64

వ. కావున. 65

క. సైరంధ్రి యిట్టు లనుటకుఁ, [3]గారణము దలంప నేమిగా నోపునొ యం
చారసి బహుప్రకారవి, చారములకుఁ జొచ్చు టుడుగు సరసిజవదనా. 66

క. ఇదియేమియైన నే మగు, మది నా [4]కీచింత యేల మన్నన యెల్లం
దుదిఁ జెఱుపక ప్రార్థన సేయుదుఁ గా కని నిశ్చయించు టుచితమె నీకున్. 67

చ. అనిన సుదేష్ణ యి ట్లనియె నం తవునంతకు మద్గృహంబునం
దునికికి సమ్మతించితి నిజోచితవృత్తిఁ జరింపు నాదునం
దనుల మదీయవల్లభు నుదాత్తమతిం బరికించికొమ్ము నీ
మనమున కెట్టు లూఱట సమస్తము నట్టుల చేసెదం దగన్. 68

క. అని యూఱడిల్లఁ బలికిన, విని తొల్లిటియట్ల యుచితవృత్తి ద్రుపదనం
దన యుండె నట్టియెడ ని,ట్లని మోసిరి జనులు పురమునందును భూమిన్.

చ. విరటు మఱంది కీచకుఁడు విక్రమదుర్దముఁ డన్యసైన్యభీ
కరమహనీయమూర్తి బలగర్వసముద్ధతచిత్తుఁ డెందు నె
వ్వరు సరి లేరు వీని కన [5]వాలినదండిమగండు సూడ న
చ్చెరు వగుచావు నచ్చె నటు సేసినవా రట యెట్టివీరులో. 70

తే. సింహబలుఁడు గంధర్వులచేత నొక్క, సతికిఁగా నిట్లు ఘోరంపుఁజావు నచ్చె
నకట రిత్తకు రిత్త మత్స్యావనీశు, లావు గోల్పోయె సూతకులంబు వాలిసె.

వ. ఇవ్విధంబునం బ్రవర్తిల్లుజనవాదంబు గ్రమక్రమంబున సమస్తదేశంబుల [6]నెరసి చెల్లుచుండె నట్టియెడ. 72

1 బిరుసు లగు. 2 వరగుణ...రెన్ని భంగుల. 3 గారణ (మిది యేమి యేమి) ము ప శేమి యైనఁ. 4 కింతేల యనుచు...టుచితము. 5 వ్రాలిన. 6 నెగసి.

దుర్యోధనుని వేగులవారు పాండవుల వెదకి కానక వచ్చుట.

ఉ. పాతకి యైన సుయోధనుఁడు పాండుతనూజులు సల్పు చున్నయ
జ్ఞాత [1]విధివ్రతంబు గలుషంబుగఁ జేయఁ దలంచి పంచినన్
భూతల మెల్లఁ జూచి మును వోయెడునప్పుడు సెప్పికొన్న సం
కేతపుఁజోటఁ గూడఁబడి ఖేదముఁ బొందుచుఁ జారు లందఱున్. 73

వ. మగుడి వచ్చి హస్తిపురంబు సొత్తెంచి. 74

సీ. వరుస నేనుంగులు గురిసినదానధా, రావలి దగుకలయంపి గాఁగ
రాజులసందడి రాసినతొడవులు, మురిసి రాలినపొడి ముగ్గుగాఁగఁ
గాంతలసంకులగతిఁ ద్రెస్సి తొరఁగిన, హారముల్ పుష్పోపహారములుగ
నే మేమ యని [2]యోలి నెత్తినపరదేశి, దొరలపావడములు తోరణముగ

తే. సహజ మైనయలంకారమహిమ నతిశ,యిల్లి మహనీయవైభవ మెసక మెసఁగ
వఱలునరపతిమందిరద్వారభూమి, సేర నరిగి యా వేగులవారు ప్రీతి. 75

వ. సముచితంబుగాఁ బ్రవేశించి. 76

తే. ద్రోణగాంగేయభానుమత్సూనుకృపసు, శర్మ[3]దుశ్శాసనులు సర్వసైన్యపతులు
నార్యజనములుఁ గొలువ మహార్హకాంచ,నోన్నతాసనమునఁ గొలువున్నవాని.

స్రగ్ధర. మౌళిస్రక్సంగరంగన్మధుకరపటలీ మానసాకృష్టివిద్యా
శాలిస్ఫారాబ్జరేఖాంజలిపుటఘటనాచారుఫాలస్థలత్స్మా
పాలశ్రేణీవిశాలాంబకకుముదవనీ బాంధవాయత్తచంద్ర
శ్రీలీలాగాఢకాంతిస్మితవదనరుచిస్ఫీతు నాగేంద్రకేతున్. 78

వ. కని జయజయశబ్దపూర్వకంబుగా సాష్టాంగదండప్రణామంబు సేసి. 79

క. మొగిచిన చేతులు ముందల, [4]నిగిడించి నితాంతవినయనిరతిం జారుల్
దగ విన్నవించి రిట్లని, జగతీశ్వరునకు నిజప్రచారం బెల్లన్. 80

క. దేవరయానతిఁ బాండవు, లేవురు ద్రౌపదియు నున్నయెడ యే మరయం
గా వెడలి వారు సనినమ,హావిపినం[5]బులకుఁ దొలుత నరిగితిమి వెసన్. 81

వ. అందు. 82

ఆ. [6]పరఁగు పొదరు పొదరు పల్లంబు పల్లంబు, మ్రాను మ్రాను దుర్గమంపుఁజోటు
దుర్గమంపుఁజోటు దొన దొన గుహ గుహ, యాదిగాఁగ నెందు నరసి యరసి.

వ. ఒక్కయెడ నరదంబు లరిగినచొప్పు గాంచి దానివెంబడిం జని చని. 84

క. కేవలసూతులతోడన, పోవుట గని వానిఁ జేరఁ బోవక యవి యిం
కేవంకఁ బోవునొకొ యను, భావనఁ బోయితిమి వానిపజ్జన యేమున్. 85

వ. అవియును ద్వారకానగరంబున కరిగిన. 86

క. అందుల నుండుదు రనునా,సం దెల్లముగాఁగఁ బెక్కుచందంబుల ము

---

1 వృథా. 2 యొగి. 3 గురుసుతశకునిదుశ్శాసనులును. 4 నిగుడించి. 5 బునను. 6 పరఁగ.

ట్టం దిరిగి తడవి కుంతీ, నందనులం గాన లేక నానాభంగిన్. 87

వ. విచ్చి పోయి సమస్తదేశంబులుం గలయం గ్రుమ్మరి కొండొకయు నుపేక్ష లేక [1]వెరవుతోడిదకాఁ బరికించుచు బయలను నాలస్యంబు దక్కి యోలంబునట్ల శోధించుచుఁ గీడయిన నుదాసీనతయు నుడిగి మేలిచందంబునం భావించుచు వివిధప్రకారంబు లయినబహుప్రదేశంబులు రోసి కౌంతేయులం గానక సంకేతస్థలంబునం గూడికొని మావర్తించినతెఱంగు దేవరకు నెఱింగించి యటదివ్యచిత్తంబున నవధరించినభంగి సేయువారమై చనుదెంచితిమి మాకుం జూడఁ బాండవులు పొడవడంగి లేక పోయిరి గాని యీలోకంబున నునికి గలిగిన నగపడకుండ నేర రిది యిక్కార్యంబునున్నరూపు మఱియొక్కవిశేషంబునం బ్రియం బంది వచ్చితిమి చిత్తగింపుము. 88

సీ. మత్స్యదేశాధీశుమఱఁదిఁ గీచకునిఁ బు, ణ్యోజ్జ్వలాకృతి యగునొక్కవనిత
కతమున నడురేయి గంధర్వు లతిరహ, స్యప్రకారంబునఁ జంపి రదియు
నక్కజం బాయుధ[2]వ్యవహార మేమియు, లేదు శిరంబు గాళ్గేలు డొక్క
లోనికిఁ జొరఁ ద్రోచి పీనుంగు ముద్దగాఁ, జేసి వైచిరి దుష్టచిత్తులైన

తే. యతనితమ్ముల నొక్కరి నైనఁ దప్పి, పోవ నీక యారాత్రియ పొదివి చిత్ర
నిహతిఁ దెగఁ జూచి యనిరూపణీయదుర్ని, వారవృత్తిమై నరిగిరి కౌరవేంద్ర.

వ. [3]విరాటుండు పగతుండు గావునఁ దదీయవ్యసనం బెఱింగింప వలయు నని విన్నవించితి మది యట్లుండెఁ బాండవుల నన్వేషించుపని యిట మీఁదం జిత్తగించు తెఱంగానతిచ్చునది యనిన విని యట్ల చేయుదముగాక యని వారలఁ బోవం బనిచి కొంతసేపు చింతాక్రాంతుం డై యమ్మహీకాంతుండు మంత్రులం జూచి యి ట్లనియె. 90

తే. సమయసముచితకృత్యంబు చక్కఁజేసి
పాండవులు రాజ్యమున కాస పడక మున్న
యరసి యెఱిఁగి యరణ్యంబునందుఁ దొంటి
యట్ల యిడుమలఁ గుడువఁ బో నడుపవలయు. 91

క. ఎఱుఁగుట దుర్ఘట మెవ్విధి, నెఱుఁగంగా వచ్చు మీర లెల్లను మీమీ
యెఱిఁగినచందంబున నా, కెఱిఁగింపుఁడు వారి వెదకి యెఱుఁగుతెఱంగుల్. 92

వ. అనిన రాధేయుం డిట్లనియె. 93

ఆ. వివిధదుర్నిరూపవేషముల్ గైకొని, నిఖిలదిశలయందు నిపుణవృత్తి
[4]నెఱుఁగునట్లుగా ననేకులఁ బుచ్చిన, నెల్లి నేఁటిలోన నెఱుఁగఁబడరె. 94

1 పనుపు...గీడు నుదాసీనతయు. 2 వ్యాపార. 3 విరాటుండునుం బ్రతిభటుం డై భంగించుచుండుం గావునఁ దదీయ...యిఁక మీఁద. 4 నేఁగునట్లుగా...నెఱుకపడరె.

క. అనుపలుకులు విని దుశ్శా, సనుఁ డేమియు సరకుగొనక [1]సమద విలాసా
ననుఁడై నిజాగ్రజన్మునిఁ, గనుఁగొని యిట్లనియె గాఢగర్వస్ఫూర్తిన్. 95
చ. వలవదు రోయఁ బాండవుల [2]వారొక యూఁటట లేని త్రిప్పుటల్
బల మఱి వన్యసత్త్వములపాల్పడి చచ్చినచోటఁ బూరియు
న్నోలవదె యింత కింకిట మనోముద మస్ఖలితంబు గాఁగ వి
చ్చలవిడి రాజ్యలక్ష్మిఁ దగుచందమునం గొనియాడు మున్నతిన్. 96
వ. అనిన విని దరహాసితవదనుం డగుచుఁ గుంభసంభవుం డిట్లనియె. 97
ఉ. క్షాత్త్రసమగ్రు లార్యనుతగౌరవదీప్తులు వర్ణనీయసౌ
భ్రాత్రులు దాత్తదైవబలభవ్యులు దివ్యసమాను లాపృథా
పుత్త్రులు వారి నాపదలు వొందునె [3]యోపిన నింక నైన నీ
ధాత్త్రిఁ గడంగి యారయువిధంబులు సెప్పఁడు నేర్పు లేర్పడన్. 98

భీష్ముఁడు దుర్యోధనునితో ధర్మరాజుసుగుణంబులఁ జెప్పుట.

వ. అనిన నాతనిమాట లాదరించి భీష్ముం డిట్లనియె. 99
ఉ. నల్లవొ నిక్క మాడె నృపనందనుముందట ద్రోణుఁ డొక్కఁడుం
దెల్లము వారు బాహుబలధీబలదైవబలంబు లొప్ప వ
ర్తిల్లుదు రమ్మహాత్ముల కరిష్టము లేమిట నెందు నేల పా
టిల్లెడు వారిఁ [4]గాన్పను గడింది తదీయమహానుభావతన్. 100
క. వారలును వీరలును నా, కారయఁగా నొక్కరూప యైనను గార్యం
బీ రెఱిఁగింప వలయు నని, కౌరవపతి నన్న నడిగెఁ గాన యితనికిన్. 101
క. కలరూ పెఱిఁగింపంగా, వలయుం జెప్పెద మదీయవచనములు హితం
బులు గాఁగ నిశ్చయస్థితిఁ, దలఁచి యనుష్ఠింప బుద్ధి [5]దలకొనునేనిన్. 102
సీ. బ్రాహ్మణభక్తియుఁ బరహితోక్తియు, నిర్మలమతియును నీతిరతియు
సత్యభాషణమును సాధుపోషణమును, జిరవితరణమును సేవ్యగుణము
సన్మార్గరతియు నుస్మత్తశీతయు, నంచితోదయముఁ గృపాతిశయము
బంధుసంప్రీతియు భవ్యవిభూతియు, శాస్త్రోపగమము సస్ఖలితదమము
తే. సజ్జనస్తవనీయసౌజన్యములును, ధర్మసంచితబహుధనధాన్యములును
గలుగు నక్షీణపుణ్యాదోహలుఁడు ధర్మ, సూనుఁ డున్న దేశంబున మానవులకు.
క. మఱియును నొక్కవిశేషం, బెఱిఁగించెద నతనియున్న యెడ గోధనముల్
మెఱుఁ గెక్కి పాఁడి [7]నేమిం, గొఱఁతవడక యుండఁ జేఁపి కురియుచు నుండున్.
వ. కావున నిట్టిదేశం బిప్పు డెయ్యది యగు నందుఁ గుంతీతనయుల నరయం బనుప

1 సమ్మదలీలా ; సమదవికాసా. 2 (వారక) యుదుక్కప; యిక్కప; యూఁకప లేని పిమ్మటల్...గొని యేలు. 3 యెందును. 4 గాంచుట. 5 దాక్కొను. 6 యుక్తియు... శాస్త్రా(ధి)నుగమము. 7 నేమిటఁ, గొ,

వలయు ననినఁ గృపాచార్యుం డిట్లనియె. 105

క. అరయఁగ నయ్యేఁడు తెఱఁగుల, నరయుట కార్యంబు వారి నాలస్యము లే
కరయునది పెక్కుభంగుల, నరసినఁ దోఁచెదరుగాక యది యట్లుండెన్. 106

ఉ. వారలు పూనినట్ల వనవాసము సల్పిరి [1]వీరు వేచి త
మ్మారయఁగా బయల్పడనియట్లుగ నుండెడువత్సరంబునుం
జేరువచేరువల్ గడచెఁ జిత్తములుం గలుషంబు లమ్మహా
వీరుల కీనృపాలునెడ వీరికి నూరక యున్కి గర్జమే. 107

క. అలు పైనను బగతునిదెసఁ, దలఁపు గలుగ వలయు ననిన దర్పోజ్జ్వలదో
ర్బలు లగుకౌంతేయుల మన, మెలమికలిమి నచ్చి యిట్టు లేమఱ నగునే. 108

చ. మనబల మెంత యంతయు సమగ్రసముద్యమదుర్దమంబుగా
మునుమును గూర్చి తోడుపడుమూఁకలకుం దగుమైఁ గ్రమక్రమం
బున నెఱిఁగించి రాఁ బనిచి భూరిసముజ్జ్వలసైన్యజృంభణం
బున [2]నెర వొంది యున్కి కురుభూపతి కిప్పటికార్య మారయన్. 109

ఆ. పాండురాజసుతులు బానసమై నడవడి, గడచి కయ్యమునకుఁ గాలుద్రవ్వ
కున్నయట్టు లైన [3]నన్నరనాథుతో, సంధి సేయు టొప్పు సముచితముగ. 110

క. [4]ఏచి చలంబున నొంటికిఁ, జూచిన నప్పటికి మనకుఁ జూడం గార్యం
బేచందంబునఁ దెఱఁ గగు, నాచాలుట కోర్వవలయు నది యట్లుండెన్.

క. వారలు [5]లేరట పో పెఱ, వారలఁ దగుభంగి మనకు వశ్యులఁ జేయన్
భూరిబలయుతుల మగుటయ, కారణ మను టనుమతంబు గాదే మనకున్.

తే. ఇవ్విధంబునఁ దమతమయెఱుఁగు తెఱఁగు
లందఱును జెప్ప విని కురునందనుండు
దగ విచారించి కార్యంబు తెగువ గాంచి
యెలమి వారలఁ గనుఁగొని యిట్టు లనియె. 113

ఆ. సింహబలుఁడు భీమసేనుండు శల్యుండు, హలధరుఁడు సమానబలమువార
లొండొరులను గెలుచునుత్సాహమునుగల, [6]రుద్ధతులును బాహుయుద్ధపరులు.

క. ఈనలువురభుజశక్తుల, తో నెనయఁగఁ జాలునట్టిదోర్బల మెందుం
గానము గావున వీరల, లోనన యొండొరుల కని గెలుపు సమకూరున్. 115

ఉ. తక్కినవార లాతనికి దప్పులచోటులవారు వాయుజుం
డొక్కఁడ యింక సింహబలునుద్ధతి మాన్చిన మాన్చువాఁ డతం
డక్కడ నిల్చెఁ గావలయు నాసతి ద్రౌపది గాఁగ నోపు వే

1 వైరు లేచి...నుండిరి వత్సరం...జేరువ సేరుసం. 2 వెర వొంది; నెఱి వొంది. 3 ని
న్నర. 4 ఏచిన నలమునఁ బోరఁగఁ, జూచిన; ఏచి చలంబున నేటికి.... 5 వేఁటట పో.
6 యు (ర) ద్ధతులు భుజాసమిద్ధబలులు.

ఒక్కరుఁ డాజి గీచకుల నొర్వఁగఁ జాలమి మీ రెఱుంగరే. 116

క. గంధర్వు లను నెపంబున, నంధతమసగూఢవృత్తి ననిలసుతుండు గ
ర్వాంధమతి యైనసూతుస, బాంధవముగఁ జంపెఁ గాక పరులకు వశమే.

వ. పితామహుం డుపదేశించినలక్షణంబు లద్దేశంబునం గలిగి యుండు నని విందుము పాండవులు ప్రచ్ఛన్నవేషంబున విరటుప్రోల వసియించినవారు గావలయు నతండును బ్రతిభటుం డయి భంగించుచుండుం గావున నతనిపయి నెత్తి పోయి తదీయగోధనంబుల గ్రహించిన ధర్మతనయుండును దమ్ములు నడ్డపడం బఱతెంతు రయ్యవసరంబున మనము సమయభంగంబు సెప్పి వారలం గ్రమ్మఱఁ బండ్రెండువత్సరంబులు వనవాసంబు సలుపం బుత్త మట్లైన నప్రతిహతంబుగాఁ జతురంతభూచక్రం బాక్రమించి కీర్తనీయుల మై వర్తిల్లుదుము కుంతీనందను లందు లేకతక్కినమత్స్యపతిసమస్తవస్తువులును జూఱగొందమదియును లాభంబ యెల్లభంగుల నిప్పటి కిదియె కార్యంబు మీకు నందఱకుం జూడఁబోలు నేని దీని కనురూపం బగునుద్యోగంబు సేయుం డనినఁ ద్రిగర్తాధీశ్వరుం డగుసుశర్ముం డాలుతఁ గర్ణదుశ్శాసనులతోఁ గొండొక ప్రసంగించి వారలయనుమతి నవనీపతితో నిట్లనియె. 118

క. కేకయ[1]సాల్వులు దోడుగ, నాకీచకుఁ డాజి నన్ను నపజితుఁ జేసెం
జా కుండ మున్న యొక[2]పరి, నా కాతనితోడ భండనము లే దయ్యెన్. 119

ఉ. భంగముతోడ నున్ననను బంపు [3]విరాటునిమీఁద భూమికిం
జెంగట నుండు నా దయినజీతపుటూళ్లును సంతతంబు వా
నిం గడు గాసిసేయు నతనిం జెఱుపం దఱి యయ్యె ముట్టస
ప్రాంగముఁ జూఱ దెచ్చెద నహంకృతి యెల్ల నడంచి వచ్చెదన్. 120

ఆ. ఉద్దవిడిన పసుల నూఁచముట్టుగఁ దెత్తు, నతఁడు వెనుక వచ్చి యడ్డపడిన
చోటఁ బాండురాజసూనుల నరయుదు, నెల్లభంగి దీని కేస తగుదు. 121

వ. అనవుడుఁ గర్ణుం డిట్లనియె. 122

క. బరవసముమైఁ ద్రిగర్తే, శ్వరుఁ డిట్లను టుచిత మింక జననాయకుఁ డె
ప్పురుసున నానతి యిచ్చెను, దొర లేమని రట్ల చేయఁ దుదిఁ గార్య మగున్.

చ. అనునినసూనుమాట విని యందఱఁ గన్గొని పెద్ద లెల్లని
న్ననుమతి సేయ సైన్యముల నన్నిటిఁ బన్నఁగఁ బంపు రెండుమై
ల నడత మీత్రిగర్తులబలంబుల ముందటఁ [4]బంచి వానిపో
యినమఱునాఁడు పోద మనియెం గురునాథుఁడు దుస్ససేనుతోన్. 124

చ. అనుటయు ఫాలభాగకలితాంజలి యై యతఁ డట్ల చేయువాఁ

1 సాల్వురు. 2 మఱి. 3 విరాటునిభూమిమీఁదికిం...టూళ్లును. 4 బుచ్చి.

డ ననిన మేదినీశుఁడు దృఢం బగునిశ్చయ మెల్లవారుఁ గై
కొనుటకుఁ గార్య[1]బోధమునకుం దగఁ జుట్టల నున్నవారలం
గనుఁగొని యాదరాధికసగౌరవభావనతోడ నిట్లనున్. 125

ఉ. మున్ను సుశర్మ దాను బలముం [2]జని గోవులఁ బట్టువట్టినన్
వెన్నడి వచ్చు మత్స్యపృథివీపతి సేనల నెల్లఁ గొంచు శౌ
ర్యోన్నతి సూపువాఁ డయి సముద్ధతిమై నిట వేఱ కౌరవుల్
గొన్నిటిఁ బట్టఁ గయ్యమునకుం బఱతెంతురు పాండునందనుల్. 126

ఉ. కందువ సెప్పి యొక్కెడఁ ద్రిగర్తులు [3]దాడికిఁ గూడువారు మీ
రందఱు వేఱ యొక్కయెడ నాజికి సేనల గూర్చుఁ డెల్లవాఁ
డుం దనవారిఁ దోకొని కడున్ రభసంబున గూడి వార్తకున్
ముందర పోయి గోధనము ముట్టుకొనన్ వలయున్ మహోగ్రతన్. 127

వ. అని చెప్పి వెండియు సుశర్మం జూపి. 128

క. బహుళాష్టమి నీతఁడు స, న్నహనముతోఁ బసులఁ బట్టు నవమిని మనగో
గ్రహణ మని నిశ్చయించిన, నహికేతనుపలుకులకు మహాహ్లాదమునన్. 129

వ. సమస్తపరిజనంబులును సముద్యుక్తులై రట్టిసమయంబున. 130

ఆ. పాండురాజసుతులుఁ బాంచాలియును దమ్ము, నొరు లెఱుంగకుండఁ దిరుగవలయు
దుష్కరంపుటేఁడు దుది సేరఁ బాఱె నె, వ్వరును దీనిఁ [4]దలఁపవలను లేర. 131

సుశర్మ దక్షిణగోగ్రహణంబు సేయుట.

వ. సుశర్మయు నేలినవానిపనిఁ బూని జోడుపక్కెర కైదువు బిరుదు రవణంబు మొదలైనసవరణంబులం జూడ నక్కజంబు గాఁ గూడి పరదేశం బాపోశనంబు గొనం దమకించుతనబలంబుల గజిబిజి యుడిపికొని గోగణంబులయగపాటూహించి జతనంబుతో నడచుచుండియు వెసగుందక వేగిరంపుఁబయనంబులయ్యును బ్రజల నోలాకుపడ నీక యెత్తైడుచోట్లను విడిదలలయందును లోనుగా నిస్సాణాదులైనయుద్భటచిహ్నంబులు ప్రకటింపక దాడిమెయిం జని వేగులవారివలన విరాటుతోట్టు లున్నయెడ యెఱింగి గ్రద్దనం గదుపుల [5]గార్చిచ్చుచందంబునం బొదివి వెలిచిన. 132

శా. కూడం బాఱి సముద్ధతిం గడఁగి తద్గోపాలకుల్ మూఁక ల
ల్లాడం దాఁకి నిశాతసాయకపటువ్యాపారఘోరంబుగా
నీడం బోక పెనంగినం గని త్రిగర్తేశుండు చే వీఁచుడుం
గ్రీడాఘాతనిరూఢి నాశ్వికులు వారిం దున్మి తూఁటాడినన్. 133

---

1 (భార) ... జుట్లను ... భావలతోడ. 2 గొని ... వెన్నడి వచ్చి ... సూపువాఁ డటు. 3 దాడిగ ... దోడ్కొని ... ముందుగఁ బోయి. 4 దలఁపవెరవు లేర ; దలఁపవల్లను లేదు; దలఁచువారు లేర. 5 గాంతారంబుఁ గార్చిచ్చుపొదువుచందంబున.

వ. [1]వారలలోన. 134

చ. అసదుగఁ దాఁకి మేనఁ దఱచై పోరి నెత్తురు గ్రమ్ముపోటులన్
వస మఱి తూలుచుండియును వారనిభీతిఁ బదంబులం గడున్
[2]వెస కలిమిం బురంబునకు వేగమె కొందఱు వాఱి మత్స్యనా
థుసభకు నేఁగి దీనదశతోఁ బ్రణమిల్లుచు నార్తమూర్తులై. 135

క. కారణ మెయ్యది యగునొకొ, వీరలదురవస్థ కనుచు [3]వెఱఁ గందెడునా
భూరమణుఁడు సభయును విన, నీరెలుఁగు దలంక బల్కి రిట్లని గోపుల్.

చ. హయరథదంతిసంతతి నిరంతరదుర్దమలీలఁ బేర్చి నే
ల యవిసి మూఁగిన ట్లగుబలంబులతోడఁ ద్రిగర్తు లెంతయున్
రయమున గోవులం బొదివి రక్షకు లొక్కట నార్చి తాఁకినన్
భయదమహాస్త్రశస్త్రపటుపాతపరంపరఁ దున్మి యుద్ధతిన్. 137

క. గోవులకు వెనుక నైవెసఁ, బోవుచు నున్నారు గడవఁ బోవక యుండం
బో వలయు నడ్డపడియెడు, దీవస [4]మెదఁ గలిగెనేని దేవర కడఁకన్. 138

వ. అనిన విని విరాటుం డదరిపడి. 139

శా. ఏమీ నిక్కమె మున్నెఱుంగఁడె త్రిగర్తేశుండు మద్గోధన
స్తోమంబుం గొనిపోవు తెంపునకు నుద్యోగించె నే మేలు మే
లామై తోడనె పోవుఁ గాక యని వీరాలాపముల్ వల్కి యు
ద్దామక్రోధశిఖాకలాపవికటోద్యద్భ్రూకుటిస్ఫూర్తి నై. 140

విరటుఁడు సుశర్మమీఁద యుద్ధము సేయఁ బోవుట.

చ. సచివులఁ జూచి యిప్పుడ వెసన్ మన [5]మొద్దక తక్కనం బశు
ప్రచయము దప్పి పోవుఁ దుది భంగము సేగియు వచ్చుఁ గాన మీ
రుచితవిధాన[6]సత్వరత నుద్ధతయోధసమగ్రవాహినీ
ప్రచలితభూమిభాగముగఁ బన్నఁగఁ బంపుఁడు దండనాథులన్. 141

వ. అని నియోగించి. 142

శా. యానప్రక్రమసూచకంబు లగుతూర్యంబుల్ దిశాపాటన
ధ్వానస్వైరవిహారకల్పితసముద్రక్షోభముల్ గా ధరి
త్రీనాథుండు రణోచితోద్యమము సంధిల్లంగ శస్త్రాస్త్రవ
[7]ర్మానీతిక్రమదక్షులం బనిచె నయ్యైవారికిన్ గ్రక్కునన్. 143

ఉ. సారథిఁ జూచి నీవు రభసంబునఁ బూన్పుము ఘోటకంబులం
దేరఁ దదీయవర్మము లతిస్ఫుట[8]బంధముగాఁగఁ బెట్టు నీ
వీరవచోవిలాసములు విందుము మున్నిదె వచ్చెఁ గయ్య మే

1 వారలాలోన. 2 వెస కడిమిం. 3 వెఱ గొందెడు. 4 మేత్తెఱయుఁ గలుగు.
5 మేఁగక. 6 తత్వరత...భాగమునఁ. 7 ర్మానీక. 8 బద్ధము.

పారఁగఁ జూపు నీ దగుసహంకృతికిం దగుధైర్య మియ్యెడన్. 144

వ. అని పనిచి తానును యోధవీరోచితప్రకారంబున సింగారంబు సత్వరంబుగాఁ జేసికొని ఖచితకాంచనబిందు[1]సందోహం బగుసన్నాహంబు వెట్టికొని విరచితాలంకారచక్రంబును బద్ధపరికరకూబరాక్షయుగాద్యవయవంబును [2]బ్రతికల్పితతురంగంబును సన్నివేశితవివిధాయుధంబును సన్నద్ధసారథికంబును నైన రథం బెక్కి గోగణహరణప్రదేశంబు పశుపాలకులం దెలియ నడుగుచు వెడలునప్పు డమ్మత్స్యపతియనుజన్ముండు. 145

శా. లోకస్తుత్యవిభూతి నన్యపృతనాలుంటాకబాహాబల
శ్రీకల్మిఁ రథదంతిఘోటకభటశ్రేణీసముద్దాంతసే
నా[2]కల్పధ్వజవిభ్రమంబున సుహృద్యప్రోద్యముం డై శతా
నీకుం డుద్ధతి నేఁగుదెంచె నఖిలానీకంబు నుప్పొంగఁగన్. 146

ఉ. ఆతనితమ్ముఁ డైన[3]మదిరాశ్వుఁడు గర్ణఝుళంఝుళాసము
ద్ధూతబలోత్థరేణుపరిధూసరితాంబర మైనవారణ
వ్రాతము గొల్చి రాఁ గడఁగి వచ్చె సముజ్జ్వలహేమవర్మని
ర్యాతరుచిచ్ఛటాపటలరంజితహేతిమహోగ్రసైన్యుఁ డై. 147

తే. అతనియనుజుండుసూర్యదత్తాహ్వయుండు,సమదసైనికనానాస్త్రశస్త్రబహుళ
దీప్తిజాలకప్రతిహతదినకరాంశు, రాజి యై చనుదెంచె సంరంభ మెసఁగ. 148

ఉ. తెల్లనిజోడు వెట్టుకొని తీవ్రగతిం జనుదెంచె మత్స్యభూ
వల్లభునగ్రనందనుఁడు వైరిమదాపహవిక్రమ[4]ప్రకా
రోల్లసితుండు వన్యబల ముద్ధతిఁ గొల్చుమృగేంద్రరేఖ శో
భిల్లుచు నుండ శంఖుఁడు విభీషణశంఖనినాద మొప్పఁగన్. 149

వ. మఱియు ననేకయోధవీరులు వివిధవాహనారూఢులై గాఢసన్నాహంబు లగు నిజవ్యూహంబులతో నేతెంచు చుండిరి విరాటుండు బలంబులం గూర్చికొను తలంపునం బురబహిరంగణంబునం గొండొకసేపు నిలిచె నట్టిసమయంబున ధర్మతనయుం డనిలతనయమాద్రీతనయుల నంతంతం బొడసూపి నిలువుం డని నిపుణంబుగా నియోగించి తానును మత్స్యమహీవల్లభునల్లన చేరి యిట్లనియె.

చ. ఒకఋషిచేత నాయుధసముత్కర మెల్లను [5]సప్రయోగమం
త్రకముగ నభ్యసించి సమరంబునకుం గొఱ యైనవాఁడ గో
ప్రకరముల్ మరల్చుటకు బంధులు నీవును బోవ నాకు నిం

---

1 సందోహసుందరం బగు (సన్నాహంబు) మై మఱువు వెట్టికొని విరచితవీరపతాలంకార...బ్రకల్పిత. 2 కల్పోజ్జ్వలవి(భ్ర)క్రమంబున మహోద్యతోత్ప్రోద్యముం డై. 3 మదిరా(స్యుఁ)క్షుఁడు. 4 ప్రభావోల్లసితుం (ప్రకాశోల్లసితుం) డసంఖ్యబల...గొల్వ మృగేంద్రరేఖ... శంఖుఁ డరిభీషణ. 5 సంప్రయోగ.

టికడన యున్కి పాడియె ఘటింపఁగఁ బంపు రథంబు సయ్యనన్. 151

క. అనిన విని యియ్యకొనున, మ్మనుజాధీశ్వరునితోడ మఱియు నతం డి
ట్లనుఁ బవనతనయుఁ గవలం, గొని సమరంబునకుఁ బోవఁ గోరెడుమదితోన్.

సీ. మనవలలుండు లావున బంటుతనమున, జను లెఱుంగఁగ నడిసన్న వాఁడు
మంచిమగండు దామగ్రంథి యసమసం, గ్రామకేళీగాఢకౌతుకుండు
వినుము తంత్రీపాలుఁడును దుర్దమారాతి, మర్దనచాతుర్యమహితభుజుఁడు
మున్నును వీరలు మువ్వురకడఁకల, కొలఁదు లే నెఱుఁగుదుఁ గొంతకొంత

తే. యెక్కుడగునట్టియరదంబు లిచ్చి వీరి, ననికిఁ దోకొని పోక గార్యంబు నాకుఁ
జూడ ననవుడు మేదినీశుండు హర్ష, నిర్భరాత్ముకుఁ డై శతానీకుఁ జూచి. 153

వ. కంకవలలదామగ్రంథితంత్రీపాలురం జూపి యిట్లనియె. 154

మ. రథముల్ మంచివి గాఁగ నాలు[1]గతిశీఘ్రవ్యాప్తిసత్త్వంబులం
బ్రథితం బైనతురంగమోత్కరము సంగ్రామార్హచాపంబు ల
శ్లథవర్మంబులు వీరి కిమ్ము రణలీలాదక్షతక్ మన్మనో
రథముం దీర్పఁగ వీర లోపుదురు దోర్గర్వం బఖర్వంబుగన్. 155

వ. అనిన నతం డట్ల చేయుదు నని వారలం దోడ్కొని చని సమస్తంబును సన్నద్ధం
బు గావించి యంగరాగమాల్యాంబరాభరణంబుల నలంకృతులం జేసిసం గైకొ
ని తమయంతవట్టునుం గూడుకొని సూతకృత్యంబులకుం దార చాలి రథంబులు
దోలికొని చనుదెంచిరి తదనంతరంబ. 156

సీ. గంధదంతావళకర్ణమారుతహతిఁ, గాంతారములు చాఁపకట్టు వడఁగ
రథఘోషమునఁ బ్రతిరవ మిచ్చునద్రులు, భయమున వాపోవుభంగి నుండఁ
దురగఖురోద్ధూతధూళి [2]దన్నెరసిన, వననిధి పిండలివండు గాఁగ
బహుళపదాతిదుర్భరభార మడరిన, నురగకూర్మంబు లొండొంటిఁ బొంద

తే. సైన్యముల నడపించె నుత్సాహలీల, యతిశయిల్లంగ సంరంభ మగ్గలింప
బరవసము మిక్కుటంబు గఁ బసులు సన్న,జాడ గైకొని యమ్మత్స్యజనవిభుండు.

వ. ఇట్లు సని కూడ ముట్టిన. 158

క. విరటుబలంబుఁ ద్రిగర్తే, శ్వరుబలముం జెలఁగ నార్చి వడిఁ దాఁకె భయం
కరనాదమేదురము లగు, శరనిధు లొండొంటిఁ దాఁకుచందం బమరన్. 159

మ. గుణరావంబుఁ గృపాణఘట్టనరవక్షోభంబునుం గింకిణీ
క్వణన[3]వ్యావృతహేషితస్వనములుం ఘంటానినాదార్తపో
షణనానాపటుబృంహితధ్వనియు శశ్వద్గాఢ మై పేర్చినన్
రణనం బించుక దోఁప లేద బహుతూర్యశ్రేణి నాసేనలన్. 160

1 వతి. 2 దన్నొరసిన. 3 వ్యాపి(ప్ర)త...ఘోషణ...దోప దయ్యె బహు.

—విరాటసుశర్మలసైన్యంబులు సంకులంబుగాఁ బోరుట.—

వ. అట్టిసమయంబున. 161

సీ. ఒండొంటితోఁ దాఁకి మండెడునవియును, జిందముల్ పొడిపొడి సేయునవియు
గట్టిమెముఖువులు దట్టముల్ గావించు, నవియును నెఱను నో నాడునవియు
[1]నెట్టపైఁ బడిమేని నెగయించునవియును, దల నేల డొల్లంగఁ దాఁకునవియు
నిరుమెయిఁ దొలిచి బెట్టిలఁ దూఱు నవియును, నలువుర నేవుర నాఁటునవియు

తే. నైనశరములు గనుఁగొని యాడి యాడి, నారదుఁడు విచ్చలింపంగ వీరకేళి
సలిపె నుద్ధతిమై ధనుర్బలము లడరి, లావు వెరవును నెఱయఁ జలంబు మెఱయ.

వ. అప్పుడు సుభటులు గడంగి. 163

ఉ. ఏటుల మ్రొగ్గువారిఁ గని యించుక కొంకక [2]యర్మపెంపునం
బోటులవాతఁ బోవుభటపుంగవులన్ మది మెచ్చుచున్ వడిన్
వ్రేటులఁ గ్రీడ సల్పి పృథివిం బడువీరులఁ ద్రొక్కికొంచు నె
చ్చోటుల నైన నగ్గలికఁ జొత్తురు నెత్తురు వఱ్ఱు సేయుచున్. 164

సీ. ఒక్కఁడు పెక్కండ్రకెక్కిన విచ్చియుఁ, బొదివి [3]చె ఱ్ఱోకపోటు వొడుచునెడలుఁ
బలువు రొక్కనిమీఁదఁ బఱపిన సైరించి, నళికి పైఁబెట్టక నిలుచునెడలు
దళము దళంబుతోఁ దాఁకి యగ్గలికమై, నీడఁ బోవక వ్రేటులాడునెడలు
నోహరిసాహరి నుయ్యాలచేరుగా, వెనుకొంచుఁ దెరలుచుఁ బెనఁగునెడలు

ఆ. నై యనేకభంగి నాశ్వికసేనలు, బొమ్మ లాడినట్లు పోరు చుండె
నమరగణము సిద్ధసమితియు వేడుకఁ, జదల నిలిచి చూచి సంస్తుతింప. 165

వ. ఒక్కయెడ. 166

ఉ. ఒండొరు మీరుకోర్కిమెయి నొక్కట [4]బాసలవారు సొచ్చినన్
రెండయి పాయ యిచ్చినయరిప్రకరంబులు వేఱువేఱ యు
ద్దండభుజాబలం బలరఁ దాఁకిన సంగడిఁ బొఱు చుండఁగా
గండమరంగ నిల్చి చెలికాండ్రయి క్రమ్మఱ వత్తు రిద్దఱున్. 167

సీ. కరశీకరంబులు గరటగళద్దాన, తోయంబులును ధరాధూళి ముంగఁ
[5]బొడవులసడి సన్న యొడళుల దెంచన, మ్ములపెంపు గగనంబు గొలఁదివెట్ట
బృంహితధ్వనులును బృథులఘంటావలీ, రవములు దిక్కుల నవులఁ ద్రోవ
రోషారుణాక్షుల రుచులును సిందూర, కాంతియు రవిదీప్తిఁ గ్రమ్మఱింప

తే. జోదు లొక్కటవాలంపసోనగురియ, రౌద్రరసమాకృతులఁదాల్చిరణమొనర్చు

1 నేటు...నెరియించు...(నిరుమేను లుచ్చి) నిరుమెయి గెలిచి జెట్టిలఁ దూలు...గైకొని. 2 యమ్ము పెంపునం బోటులచేతఁ. 3 చె ఱ్ఱోక (వే ఱోక) ... బఱిపి సైరించిన, (నలఁగి) నలమి పైఁ. 4 బాసటవారు...సందడిఁ బోరు చుండఁగా. 5 బొడువుల...యొడళులుఁ (దెంచియ, మ్ముల) డెక్కియ, మ్ముల.

కరణి నత్యుగ్రముగఁ గరిఘటలు గడఁగి, కలను పీనుంగుపెంటగాఁ గలయ బెరసె.

ఉ. అక్కజ మైనశౌర్యమును నద్భుతసంపద నొందుశక్తులుం
జిక్కనిమేనులుం మొనకుఁ జెల్వగుకైదువులుం [1]దగంగ ను
క్కెక్కినయట్టిమేటిమగ లించుకవారణ లేక ఖేచరు
ల్వెక్కస మంద నొచ్చియుఁ జలింపక పోరిరి పెక్కుభంగులన్. 169

సీ. నొగనొగతోఁ దాఁకి [2]పగులంగ నరదంబుఁ, బఱపి యాతేరిపైఁ గుఱుకువారు
రథ్యముల్ వడ్డ విరథు లయ్యు నసిముద్గ, రాదుల నడరి పోరాడువారు
సారథి నొచ్చినఁ దేరును గడపుచు, నేయుచుఁ గయ్యంబు సేయువారు
నరదంబుపైఁ బ్రాలి యాలోనఁ దెలిసి త, న్నేసినాతనిఁ బడ నేయువారు
తే. నగుచు రథికనికాయంబు లడరి యప్ర, మత్తనిజచిత్తవృత్తు లై మగతనంబు
ఘోరమూర్తులు గైకొని పోరునట్లు, సలిపె సంగ్రామకేళి సంకులము గాఁగ.

వ. ఇట్లిరువాఁగును నరవాయిగొనక పెనంగుచుండ. 171

ఉ. భీకరబాణవర్షముల పెల్లున వైరులు [3]పెల్లగిల్ల మా
ర్వీకృతగర్జితంబు పృథివీవియదంతర మెల్ల నిండ ను
గ్రాకృతికల్పసంక్షయమహాభ్రముచందము నొందుచుం శతా
నీకుఁడు దాఁకెఁ గంకటమణిద్యుతివిద్యుదుపాంతకాంతి యై. 172

తే. అతఁడు నానాప్రకారశస్త్రాస్త్రనిహతి, నతులవిక్రమవిభవ మనర్గళముగ
యోధసారథియుగ్యసంయుతముగాఁగ, నూఱురథములు వ్రేల్మిడి నుగ్గుచేసె.

మ. *మదిరాశ్వుండు గడంగి యన్నకు బలోన్మాదంబు [4]రెట్టింప స
ప్రదరజ్యాలతికాక్రియాసమభిహారక్రీడనం బప్పు డొ
ప్పిద మై యోగవియోగసంధులు నిరూపింపంగ రా కుండఁ గ
ర్ణదళోపాంతము వింత సేయ నడరెం రౌద్రంబు శోభిల్లఁగన్. 174

క. అడరి వడి రథచతుశ్శతి, పొడిసేసి పరాక్రమం బపూర్వం బై యే
ర్పడఁ గరిహయనరనికరము, బడలువడం దఱిమె నలినభశ్చరు లార్వన్. 175

ఉ. మండలచారి యై రథ మమానుషవిక్రమలీల నొప్ప ను
ద్దండభుజాబలంబు ప్రథితంబుగ నత్తఱిఁ దాఁకి సూర్యద
త్తుం డనివార్యశౌర్యగుణధుర్యుఁడు వీఁడ యనంగఁ బేర్చి వే
తండఘటావిపాటనవిదగ్ధతఁ బొల్చె రణాంగణంబునన్. 176

ఉ. అప్పుడు శంఖుఁ డెంతయుఁ [5]బ్రియంబునఁ బెండ్లికిఁ బోవునట్లు మో
మొప్పఁగ నస్త్రశస్త్రములయుల్లసనంబున శత్రునేత్రముల్

1 జెలంగ. 2 పగుల బెట్టిదముగా; పగులంగ బెట్టుగా (పగులంగ బెడిదంబు)...సార థి చచ్చినఁ...యంబు లప్రమత్త, మహితనిజచిత్త. 3 దల్లడిల్ల. * 'మదిరాక్షుండు' సం. భా. 4 సిద్ధింప(సు)సంప్రదర...రౌద్రం బుదగ్రంబుగన్. 5 రయంబున.

గప్పఁగఁ జీకటుల్ రణముఖంబు సమస్తముఁ దానయై రథం
బుప్పరవీదిఁ దోలికొని యుగ్రగతిం బఱతెంచి తాఁకినన్. 177

తే. మందరాచలచటులవిమర్దనమున, ఘూర్ణమానమై గాఢసంక్షోభ మెసఁగఁ
దలఁకుజలనిధి నాఁ ద్రిగర్తక్షితీశు, బలము దిరుగుడువడియె సంకులము గాఁగ.

వ. అయ్యవసరంబునం దక్కినదొరలును దలపడి యతి[1]భీమంబుగా సంగ్రామంబు
సేయం దొడంగిన. 179

చ. అనుజతనూజమంత్రిసుభటాప్తజనంబులపోరు సూచి నె
మ్మనమునఁ బొంగి మై వెనిచి మత్స్యమహీరమణుండు సారథిం
గనుఁగొని [2]యల్ల కంటె మొనఁ గ్రాలుచు నున్నత్రిగర్తనాథు కే
తనమునచక్కటికి మనరథంబు వెసం జననిమ్ము నావుడున్. 180

క. అగ్గలిక నతఁడు హయముల, పగ్గంబులు సడల విడిచి [3]పటురయమున నా
మొగ్గరము దఱియఁ బఱపిన, మ్రగ్గెను రథపంచశతము మత్స్యాధిపుచేన్. 181

మ. అవనీనాయకుఁ జూచి యేచి [4]నలి వీరావేశదుర్దాంతమై
కవిసెక్ గుంతభుశుండితోమరగదా ఖడ్గాదిశస్త్రాస్త్రతి
ప్రవిహారంబు విరోధిదుర్విషహసంరంభంబుగా నొక్కపె
ట్టవడిం దద్బల మెల్ల నారదుఁడు వేడ్కం గుంచె సారింపఁగన్. 182

వ. ఇవ్విధంబున విరాటుండు దానును సేనయుం జేయం గలవారును బరవసంబు
సేసి యొక్కుమ్మడి నడరుటయుం దెరలి మరలిననిజసైన్యంబుదైన్యంబు గలయం
గనుంగొని కోపాటోపంబునం గెంపు గదురులోచనంబులుం [5]బెంపొలయుభుజ
శిఖరంబులుం గలిగి సుశర్మ తానుం దమ్ముండును సంగడంబుగాఁ గోల్తలసేసి రథ
సమూహంబుతో విరాటవ్యూహంబు నెదురుకొని. 183

క. బలవిక్రమములు మెఱయఁగ, దలపడి రథదంతిహయపదాతిచయంబుల్
[6]గలను సుడివడఁగఁ దామర, కొల నేనుఁగు సొచ్చినట్లు గురువుగఁ జొచ్చెన్.

ఉ. ఏలినవానిఁ గాంచి మొన లెల్లను నెంతయు దర్ప మెక్కి యా
భీలనిశాతహేతిరుచి భీకరలీల నెదిర్చి మత్స్యభూ
పాలకసైన్యరాజిఁ దలపడ్డ మహోగ్రతఁ బేర్చి యాసమి
త్కేళి వియచ్చరప్రతతికిక్ వెఱఁ [7]గందఁగఁ జేసె నెంతయున్. 185

తే. కడిమి[8]మెఱయంగఁ బోరుత్రిగర్తనాథు, రథముఁగనుఁగొని కడఁగివిరాటవిభుఁడు
[9]వరపునకు నల్గి నట్టుల సరకుగొనక, యతులరభసాతిరేకత నతనిఁ దాఁకె. 186

---

1 భీషణంబు. 2 యల్ల గట్టి...కేతనమునకై రథంబు వెస దండడిఁ బోవఁగ నిమ్ము నావుడుక్. 3 బలిమి మెఱయ. 4 యతి...గుంతముసుండి. 5 బలు పొలయు. 6 గలఁగి ...గూల్పఁగఁ జొచ్చెక్. 7 బొందఁగఁ. 8 సెఱయంగ. 9 పరువునకు.

విరాటుఁడు సుశర్మమీఁదఁ దనరథంబు తోలించి పోరుట.

వ. ఇట్లు దలపడి. 187

మ. పటువేగం బగుశాతభల్లచయసంపాతంబునన్ మింట మి
క్కుటమై మంట ధగద్ధగద్ధగ యనం గోపంబు రూపంబులై
చటులక్రీడఁ జరించునట్లిరువురున్ శౌర్యోన్నతిం బోరి రు
త్కటదర్పోద్ధతులై పరస్పరజయాకాంక్షం బ్రచండంబుగన్. 188

క. తదవసరంబున నొక్కటఁ, బదియమ్ములు దొడి త్రిగర్తపతివక్షంబున్
వదనంబు నేసి విరటుఁడు, మదమునఁ దురగముల నేసె మఱియుఁ బదింటన్.

క. ఇంచుకయు నీడఁ బోవక, కాంచనపుంఖప్రకాండకాంతి[1]స్ఫాయ
త్పంచాశద్బాణంబులు, నించె నతఁడు మత్స్యమేదినీపతిమేనన్. 190

తే. దొరలు దలపడ్డనాహవదోహలమున, నుభయబలములుఁ దమకించి[2]యొర్వలేక
కలయ బెరసి భూరేణువుకతన రాత్రి, గాక మున్న యొండొరువులఁ గానరైరి.

క. క్షతములఁ బెల్లు దొరఁగుశో, ణితము రజఃపటల మడఁచి నెఱసిన నరుణ
ద్యుతిఁ దమము వాపువేకువ, గతిఁ దత్సమయం బతిప్రకాశత నొప్పెన్. 192

ఉ. దానికిఁ జిత్తవృత్తులు ముదంబునఁ బొందఁగ మేను లుబ్బఁగా
సేనలు రెండు నుద్భటవిజృంభణతన్ వివిధాస్త్రఘట్టన
ధ్వానము దిక్కులం బరఁగఁ దాఁకి రణం బొనరించె నత్తఱిన్
భానుఁడు పశ్చిమాద్రిఁ గనుపట్టెఁ దలిర్చినమావిమ్రోకనన్. 193

క. సమరంబున భటులు గడు, న్శ్రమ మొందిరి తమము గవిసినం గాని సము
ద్యమసంరంభ ముడుగ రిది, సమయం బని తొలఁగినట్లు సవితృఁడు గ్రుంకెన్.

వ. తదనంతరంబ. 195

క. ముఱిముఱిచీఁకటియప్పుడు, నఱిముఱి భటు లుడుగ కడరి యని సేయంగా
నెఱసి తమ మెల్లయెడఁ గ్రి, క్కిఱిసిన మఱి పాసి నిలిచి రింతను సంతన్.

వ. ఇట్లుభయసైనికులు సాంద్రసంతమసంబునం జేయునది లేక సంగ్రామంబు డక్కి
తమకం బెక్క నొక్కింతసే పూర కున్నంత. 197

క. తనమనుములు పాండుతనయు, లని సేఁతకు వేడ్కసేయు టాత్మఁ గని తమం
[3]బునవారు మెఱయ రని వచ్చినక్రియ శశి పూర్వశైలశిఖరం బెక్కెన్. 198

క. వెలుఁగు గని కడఁగి యిరువాఁగులుఁ బోరికి జొచ్చె మత్స్యకుంజరుఁడును స
గ్గల మగుమగఁటిమిసొంపునఁ, దలపడియె సుశర్మతోడఁ దదనుజుతోడన్. 199

చ. తలపడి పోర వారియరదంబు లనేకము లొక్కపెట్ట యి
ట్టలపురయంబునం బొదివి డాసెఁ గడంగి వడిం ద్రిగర్తనా
థులు నిరుదేరుఁ దద్రథముతోఁ గదియించి తదీయసారథిన్

1 స్ఫాయత్పంచాశ. 2 యోట. 3 బున మెఱయ నేర రని.

బలువిడిఁ గూల్చి రథ్యములప్రాణములుం గొని రుగ్రమూర్తులై. 200

వ. ఇవ్విధంబున విరాటుండు విరథుం డగుటయు. 201

చ. అతిరభసంబుమై నడరి యాతనిఁ బట్టి సుశర్మ పెల్చ నా
ర్చి తనరథంబుపై నిడి యశేషబలంబులు [1]నద్దెసన్ భయ
ద్రుతగతిఁ బాఱెనన్ విజయదుందుభు లొక్కట మ్రోయ విక్రమో
ద్ధతివిభవంబునన్ మది ముదం బొలయన్ మరలెన్ మహోద్ధతిన్. 202

వ. అట్టియెడ ధర్మతనయుం డనిలనందను నవలోకించి సత్వరం బగుచిత్తంబుతోఁ
మత్స్యవిభునివలను సూపుచు నిట్లనియె. 203

తే. ఇతనియాశ్రయమున మన మెల్ల బ్రదికి, యున్నవారము గావున నుగ్రరిపుల
పాలువడకుండవిడిపింపఁబాడియితని, నెయిదుమెయిదుమురథరయమెసకమెసఁ [గ.

చ. అనవుడు మేను వెంచుచు మహాబలనందనుఁ డప్పు డన్న కి
ట్లను నిదె సాలవృక్షము రయంబున దీన నరాతిసేన డొ
ల్ల నడిచి యీసుశర్మునిబలంబుఁ జలంబును మాన్పి యవ్విరా
టుని విడిపించెదన్ రణపటుత్వము వైరులు పిచ్చలింపఁగన్. 205

తే. నీవుఁ దమ్ములు నొక్కెడ నిలిచి చూచు
చుండుఁ డని పల్కుటయుఁ బుయిలోటతోడఁ
గీచకారాతిఁ దప్పక చూచి నగుచు
నతని కిట్లని చెప్పె ధర్మాత్మజుండు. 206

క. తరువు వెసఁ బెఱికికొని నీ, వురవడిమైఁ గవిసితేని నుభయబలము న
చ్చెరు వందుచుఁ జూచి వృకో, దరుఁడ వగుట యెఱుఁగ కున్నె తద్విధ మేలా.

వ. కవలు నీకుఁ జక్రరక్షకులుగా లోకసామాన్యంబులైనచాపకృపాణగదాదు
లగునాయుధంబుల విరోధివధం బాపాదించి వేవేగ విరాటు విడిపింపుము.

చ. అనుపలు కంకుశంబునక్రియం గుదియించిన నిల్చి భూరుహం
బున దెస వోక మత్తగజపుంగవుచందమునన్ సమీరనం
దనుఁడు శరీర[2]దోళనవిధాపరిశోభితవిక్రమోద్యమం
బున విలసిల్లి యిట్టు లను భ్రూకుటి ఫాల మలంకరింపఁగన్. 209

క. మీపనిచినట్ల చేసెద, నేపారినవైరిబలము నెల్లను బాహా
టోపమున నోర్చి మత్స్యమ, హీపతి విడిపించి తెచ్చి యిచ్చెద మీకున్.

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు సంతసిల్లి తమయంతవట్టునుం గూడుకొని.

పాండవులు సుశర్మ నోడించి విరాటుని విడిపించుట.

తే. తాను మున్నుగ శాత్రవసేనమీఁద
రథము లొక్కటఁ బఱపిరి పృథివి యద్రువ

1 నద్దెసన్; బద్దెసన్. 2 డోలన.

నుఱక యేచి త్రిగర్తులు నుద్ధతముగఁ
జెలఁగి మార్కొని పొదివి సంకులము గాఁగ. 212

క. ఏయుచుఁ బొడుచుచు వ్రేయుచు, డాయుచు నుద్వృత్తిఁ దఱుముటయుఁ [1]బొడిసేసె
న్వాయుసుతుఁడు రథముల నిరు, వేయిటి రథిరథ్యసూతవితతంబులు గాన్.

తే. ఏడునూఱురథంబుల నేపుమాపె, నకులుఁ డప్పుడు మున్నూటినామ మడఁచె
నతనియనుజుండు గుంతీసుతాగ్రజుండు, రథికముఖ్యులవేవురఁ బృథివిఁ గూల్చె.

వ. అతండు మఱియును. 215

చ. తఱిమి సుశర్ముఁ గిట్టి యతిదారుణభంగి రణంబు సేయ వాఁ
డుఱక నిశాతసాయకము లొక్కమొగిం బది మేనియందుఁ గ్రి
క్కిఱియఁగఁ జేసి నాలుగిట నేసెఁ దురంగములన్ యుధిష్ఠిరుం
డఱిముఱిఁ జంపె సారథిఁ దదశ్వములన్ [2]వరబాణపాణి యై. 216

వ. అయ్యవసరంబున మత్స్యమహీనాథుండు జనితోత్సాహుం డై. 217

ఆ. ఆసుశర్ము తేరియందున్నఘనగదా, దండ మెత్తికొని యుదగ్రవృత్తి
జరఠదేహుఁ డయ్యుఁ దరుణవయస్కున, ట్లవని [3]కుఱికి పోయి యతని వ్రేసె.

క. అట్టిసమయమునఁ గరువలి, పట్టి త్రిగర్తేశురథముపై కుఱికి వెసం
బట్టికొని యతనిఁ బెడగే, ల్గట్టి పెలుచ నార్చెఁ దద్బలము పెల్లగిలన్. 219

వ. ఇట్లు సుశర్ముం బరాజితుం జేసినఁ జక్రరక్షకుం డైనశోణాశ్వుండు మొదలుగా నాప్తభృత్యవర్గంబు ననుజుం డైనసువర్ము లోనైనబంధుజనంబులు నాదిగాఁ గల పరివారంబు పలాయనపరాయణంబగుటయు వెనుకొని యెయిది గోధనవర్గంబు మరల్చి కరితురగరథంబులం దలమిాఱి పొదివి తెచ్చి యన్నపాలికి వచ్చి తాను మున్ను త్రిగర్తేశురథంబుకడ నిలువ నియోగించి యున్నతమ్ములం గూర్చుకొని తమయంతవట్టును నొక్కట విరాటునకుం బొడసూపిన. 220

క. ఆదరము సంభ్రమంబును, మోదంబును దనమనమున ముప్పిరిగొన నా
భూదయితుఁడు వివిధప్రియ, వాదంబుల గారవించె వారల నెల్లన్. 221

వ. ఇట్లు సంభావించి పాండవాగ్రజు నవలోకించి. 222

క. మానముఁ బ్రాణముఁ గాచితి, దీనికి సరి గాఁగ నీమదికిఁ బ్రియ మొసఁగం
గా నాకుఁ జేయ నయ్యెడు, దాని నెఱుఁగఁ గాన మత్పదము గైకొనవే. 223

తే. ఒడలు సిరియును నాకు నీయొసఁగినవియ, కాన [4]దగ సమర్పించెదఁ గరుణ నీవు
సమ్మతించి యిమ్మత్స్యదేశంబుఁ గావు, పంచి పనిగొని నన్ను రక్షించికొనుము.

వ. అనిన విని యజాతశత్రుం డతని కిట్లనియె. 225

చ. మనుజవరేణ్య నావలని మన్నన యట్టిద కాదె శత్రుమ

---

1 పడిఁ జేసెన్...వేయింటిని రథ్యసూతవీతం. 2 పటు. 3 కెఱఁగి. 4 నీకు నర్పించెదఁ గరుణ నీవు; దగ సమర్పించెదఁ గరుణ నీకు.

ర్దన మొనరించి మత్స్యనగరంబున కుత్సవముల్లసిల్ల నీ
చనుటయు నాకుఁ దేజమును సంపదయుం గరిమంబుఁ గాక యి
ట్లనఁ దగునయ్య [1]యే నిచట నైనది యేటిది యింత యేటికిన్. 226

క. అనుపలుకులకును విస్మయ, మును సంతో[2]షమును జిత్తమునఁ బెనఁగొన నా
జనపతి ధర్మతనూభవుఁ, గనుఁగొని యిట్లనియె మఱియు గౌరవ మెసఁగన్.

క. ఉపకారమొ బంటుతనమొ, కృపయో పెంపో సమగ్రకీర్తిప్రియమో
రిపుదుస్సహ మగునీరణ, నిపుణతకుం గారణంబు నెయ్యమొ యెఱుఁగన్.

ఉ. మంటయుఁబోనిశాత్రవసమాజము నించుకయేని శంక లే
కంటఁగఁ దాఁకి [3]వెండి తెగటార్చె మహాద్భుతశక్తిశాలి యీ
వంటలవానిచేసినయవార్యపరాక్రమ మొండుచోటులం
గంటిమె వింటిమే యితఁడ కాఁడె వెసఁ గెలిపించె నన్ననిన్. 229

క. [4]కంధరములు దెగి తలలు వ, సుంధర నతిపక్వతాలసుభగఫలాళీ
బంధురత రాలు దామ, గ్రంథి పగఱమీఁదఁ గినిసి కవిసినయెడలన్. 230

క. ఎక్కడఁ జూచినఁ దా నై, యక్కజ మగుకడిమికలిమి నరిసేనఁ గరం
బుక్కఱఁ దంత్రీపాలుం, డొక్కఁడ [5]పాలియించె నీరణోత్సాహమునన్. 231

క. ఈనలువురు దక్కఁగ మన, సేనల నొక్కరుని నైనఁ జేడ్పడనిభటుం
గానం జెలి కెడ రైనం, బూని [6]తలుగునతఁడ చూవె పురుషుం డెందున్.

ఉ. కావున మీకు దంతిహయకాంచనరత్నవిభూషణంబులుఁ
దేవనితంబినీజనసదృక్షమృగాక్షులు నాది గాఁగ నా
నావిధవైభవంబులు మనంబులవాంఛలకుం దగంగ నీ
కేవిధి నీఁగువాఁడ ఋణ మెయ్యది యేనియు వేఁడుఁ డిచ్చెదన్. 233

క. అనవుఁడు పాండుతనూభవు, లనఘా యిట్లింతయుం బ్రియంబున సంభా
వన నేసితి మా కిది [7]యా, ధనము వడయుదానికంటెఁ దక్కువె చెపుమా.

ధర్మరాజు సుశర్మను సపరివారంబుగా విడిపించుట.

వ. మ మ్మెరవుగాఁ దలంచి యిమ్మెయి నిట్టట్టన వలవదు పురంబున కరిగి యమ్మెయ
నీ కెట్లు ప్రియం బట్లు మన్నింపు మని రందుఁ గంకుండు మఱియు ని ట్లనియె.

క. తగ నొక్కటి వేఁడెద నిను, జగతీశ్వర యిచ్చు టొప్పు సరథగజాశ్వం
బుగ విడిచి పుచ్చు మిప్పుడ, త్రిగర్తపతి నిదియ నాకుఁ బ్రియ మెబ్బంగిన్.

వ. మననగరంబునకు జంఘాలురం బంపుము పురంబున వారలు వోయి భవద్విజయ
ఘోషం బాచరించి శోభనధ్వజోన్నయనంబును మంగళతూర్యనాదంబులును

1 యీ విచట. 2 షంబు నాత్మ ముప్పిరిగొనఁగా. 3 చెండి (వేగ) ...వంటలవాఁడు...విడిపించె. 4 కంధరలు ద్రెవ్వి...రాలె. 5 పొదలించె...హంబుఁ. 6 తలఁగు. 7 యే, ధనము.

బరస్పరగంధసలిలసేచనంబులును గీతవాద్యనృత్తంబులును నాదిగాఁ గలవివిధ శుభాచారంబులం బ్రవర్తింప నియోగింప వలయు ననిన విరాటుండును బనిచినం [1]గాలరులు వేఁగునంతకు వీటికిం జని గెలుపు ప్రకటించి పట్టణాలంకరణప్రముఖనిఖిలభద్రవిధానంబులు సేయించి రిట పాండవులును మత్స్యమహీవల్లభుండును సమస్తసేనాసమేతులై విభవం బెసఁగ విలసిల్లుచు లజ్జావనతాననుం డగుసుశర్మ సపరిచ్ఛదంబుగా విడిచి పుచ్చి గుత్తులకొలందికిఁ గృత్తంబు లయిపడి యున్నపాదంబులవలనం గెందలిరులసెజ్జలచందంబు లగుచోట్లును దునిసి చిక్కువడి యున్న యూరుకాండంబులవలన మదగజంబులు సొచ్చినకదళీవనంబులుం బోనిమెడలును బ్రోవులు గొనియున్న పేవులవలన లావు గలయంచపిండు పేరాఁకలి నతిముఱిం బెఱికినఁ గుఱుకులు గట్టినమృణాళనాళంబుల నొప్పుకమలాకరోద్దేశంబులఁ గ్రేణిసేయు ప్రదేశంబులును నంగుళీయకరుచు లడర నెఱింజాఁగి పడి యున్నబాహుదండంబులవలన నురగనివాసంబుల ననుకరించుతలంబులును గీలాలజలంబులపయిం దేలుచు నవ్వినట్లున్నశిరంబులవలన వికచారవిందదీర్ఘికల విడంబించుతావులును నవయవభేదంబు లడంగునట్లుగాఁ దుత్తునియలై పడియున్న గాత్రంబులవలనం గృతాంతమహానసశాలలపగిది నొప్పునట్లును గలపొలిగలను గలయం గనుంగొనుచు వెడలి చంద్రికాసుందరం బగునొక్కసైకతస్థలంబున నారాత్రి పుచ్చి రని చెప్పిన విని మఱునాఁటివృత్తాంతం బెట్లయ్యెనో యని సాదరంబుగా నవలోకించిన. 237

చ. అపరిమితప్రకార వినిరస్తసమస్తవికార షట్ప్రమా
ణపరమదూర గాఢభజనక్రమగత్యనుభావ్యసార దే
వపితృపథప్రవర్తన వివర్జననిర్మలచిత్త[2]చోర శాం
తిపరమహాత్మసంసరణతీర నిరంజన భక్తరంజనా. 238

క. విజ్ఞానానందరసా, భిజ్ఞహృదయకమలహంస భీమదురితమ
ర్మజ్ఞవివిధాభిధానా, యజ్ఞాత్మకరూప నిశ్చలావ్యయదీపా. 239

మాలిని. త్రిజగదవననిత్యక్రీడనోద్యత్ప్రమోదా
రజనిచరవిఘూతారంభలీలావినోదా
భజననిరతసౌఖ్యప్రాప్తిజాగ్రత్ప్రసాదా
నిజతనువిభవత్వోన్మీలనాచ్ఛిన్ననాదా. 240

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజితిక్కనసోమయాజిప్రణీతం బయినశ్రీమహాభారతంబున విరాటపర్వమునందుఁ దృతీయాశ్వాసము.

---

1 కొలరు లగుచారులు. 2 బోధ.

శ్రీ

గణేశశారదాగురుభ్యో నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## విరాటపర్వము, చతుర్థాశ్వాసము.



మదరేఖవిషాదవి
రామాహితగాఢశమధురానిర్భరని
ష్ఠామర్దితవివిధవికా
రామలచేతోనివాస హరిహరనాథా. 1

### ఉత్తరగోగ్రహణము.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

క. సూర్యోదయావసరమున, దుర్యోధనుబలము ప్రబలదోర్బలలీలా
ధుర్యగతి నడచె భీష్మా, చార్యరవిసుతాదియోధసంఘోద్భట మై. 3

వ. ఇట్లు నడచి మత్స్యనగరంబున కనతిదూరంబున విరాటుపశుగణంబులం [1]బొదివె నట్టియెడ మ్రుక్కడిమూఁకలు సని మొక్క డెక్కడ యని తలపడినం గృపాశ్వత్థామ శకుని దుశ్శాసన కర్ణ వికర్ణ దుర్ముఖ ప్రముఖరథికజనంబులు గోపాలవర్గంబు ననర్గళప్రసారం బగుశరాసారంబునం గప్పినం గని కౌరవబలం బగుట యెఱింగి బెగ్గలించి గవాధ్యక్షుండు రథంబు దోలికొని యాక్రోశించుచుం బురంబున కరుగుదెంచి రాజమందిరద్వారంబుఁ జొచ్చి రథావతరణంబు సేసి యంతఃపురంబున నున్నభూమింజయుం గాంచి ససంభ్రమంబుగా నిట్లనియె. 4

మ. ధరణీచక్రము సంచలింపఁగ సముద్రాంతంబులై గ్రక్కునం
గురుసైన్యంబులు వచ్చి ముట్టికొనియెఁ గోవర్గముఁ వేగమై
మరలం దెచ్చుటకుం గడంగుము రిపుక్ష్మాపాలలోకంబు నీ
శరజాలంబులపాలు సేయుము భుజోత్సాహంబు శోభిల్లఁగన్. 5

ఆ. తేరుఁ బూన్పఁ బంపు తెప్పింపు దృఢతను, త్రాణ ముగ్రచాపబాణపూర్ణ
తూణఘనగదాసితోమరచక్రాదు, లనువుగా నొనర్పు మతిరయమున. 6

చ. విరటుఁడు నిన్ను [2]నెప్డుఁ బదివేవురముందటఁ జెప్పు బాహువి

---

1 బొదివిపట్టె నట్టి. 2 నెప్పుడును వేవురముందఱ.

స్ఫురితుఁడు శౌర్యశాలి కులభూతివిశేషవిధాయకుండు భూ
భరణవిశారదుండు జనభవ్యతపఃఫలసంభవుండు గా
తరపరిరక్షకుం డనుచు దానికి నీడుగఁ జేయు మిత్త్రతతిన్. 7

క. అని కాంతాజనములలోఁ, దను నగ్గించుటయుఁ బొంగి దర్పోద్ధతి ని
ట్లను నుత్తరుండు దనమన, మున సంగరకౌతుకంబు ముడివడు చుండన్. 8

భూమింజయుండు గోవుల విడిపింప గౌరవులతోఁ బోరుటకుఁ బో నెన్నుట.

ఉ. [1]ఎత్తునఁ గొందుఁ గౌరవుల నెల్లను మార్కొనిరేని గోవులం
దెత్తు ముహూర్తమాత్త్రమునఁ దేరికి సారథి లేమిఁ జేసి నా
చిత్తమునన్ విచారదశ సెందెడు నెవ్వఁడు గల్గునొక్కొ నా
కిత్తఱి నేఁ గదా కడప నెంతయు నేర్తు రథం బనం బురిన్. 9

క. తగుసారథి దొరకొనినం, బగతుర [2]భంజించు టెంతపని కదుపుల ద
వ్వుగఁ గొని పోదురొకో యి, ట్లగునె కలండేని సూతు నరయుం డెందున్. 10

చ. కురుపతిభీష్మకర్ణకృపకుంభజముఖ్యులు [3]మత్సముద్యమ
స్ఫురణము సూచి పార్థుఁ డనుబుద్ధిఁ గలంగఁగ బెట్టు గిట్టి సం
గరమున నోర్చి యేఁ బసులఁ గ్రమ్మఱఁ దేరక యున్న నన్ను భూ
వరుఁడు సుహృజ్జనంబుఁ బరివారముఁ జిత్తములందు మెత్తురే. 11

వ. అనునప్పుడు తత్ప్రదేశంబున నునికిం జేసి. 12

క. విని ద్రుపదధరణిపతినం, దన సామర్థ్యాపహాసతరళహృదయ యై
చని తద్వృత్తాంతము [4]మె, త్తనిపలుకులఁ జెప్పె నింద్రతనయునితోడన్. 13

వ. అతండు నజ్ఞాతవాసవత్సరం బతీతం బగుట నిరూపించి పాంచాలి కిట్లనియె నీవు
వోయి వారలతో నిట్లనుము మనబృహన్నలకు సారథ్యంబు సేయుసామర్థ్యం
బు గలదు దొల్లి ఖాండవదహనంబునం బాండవమధ్యమునకు సారథి యై యత
నిచిత్తంబు వడసె మఱియుఁ బెక్కెడలం దదీయం బగురథంబు గడపఁ దాన
యై యుండు నేను నెఱుంగుదుం దత్సాహాయ్యంబునం గురుసైన్యంబుల జయిం
పవచ్చుటకు సంశయంబు వలవ దనుము వారే మనిరేని మఱియుం దగ నాడి
నన్నుం బిలిపించునట్టితెఱంగు గావింపు మన నట్ల చేయుదు నని సైరంధ్రి
యుత్తరయున్నయెడకుం బోయి. 14

చ. జనపతినందనుండు దగుసారథి నారయు చున్నవాఁ డెఱిం
గినపని సెప్పఁగా వలయుఁ గ్రీడి మనంబున మెచ్చునట్టినే
ర్పును భుజశక్తియుం గలిగి రూఢికి నెక్కినసూతవృత్తిమై
నని సడి సన్న యేత్తెఱ బృహన్నలకుం గల దంబుజాననా. 15

---

1 ఎత్తెల; ఎత్తుల; ఎత్తెర...రథంబు నా (నీ) పురిన్. 2 నిర్జించు; సాధించు...నే కలఁ
డేని సూతుఁ డర్హుఁడు నాకున్. 3 మద్భుజాబల. 4 నా, తనిపలుకులఁ.

తే. అర్జునునకు ఖాండవదహనాదు లైన, విక్రమము [1]లాబృహన్నల వెరవులావు
గాదె జయ మొనరించె లోకంబు లెఱుఁగ, నువిద దీని నెఱిఁగింత ముత్తరునకు.

క. అని యమ్ముదితయుఁ దానును, జని యతనికి నత్తెఱంగు సముచితముగఁ జె
ప్పిన నక్కుమారవరుఁ డీ, ట్లనియెం బాంచాలితోడ నల్లన నగుచున్. 17

తే. అకట సైరంధ్రి నన్ను నిట్లాలిగొనఁగ, నేల చక్కఁగఁ గను విచ్చి యేను బేడిఁ
జూడ రోయుదు రణమునసూతకృత్య,భరము దాల్చుట కెమ్మెయిఁబనుచువాఁడ. 19

వ. అదియునుం గాక.

చ. కురుబల మేఁగుడెంచె [2]నటె గోవుల బిట్టఱఁ బట్టె దానిపైఁ
బరిగొని శౌర్యసంపదయు బాహుబలంబును జూపఁ బూని యే
నరిగెద నట్టె తేరికి బృహన్నల సారథి యైన దీని న
వ్వారె పురిలోన నింతకఱవా రథచోదకు లింత యేటికిన్. 20

వ. అనిన విని సైరంధ్రి యతని కిట్లనియె. 21

ఉ. కౌరవసేన గాదు త్రిజగంబులు నొక్కట నెత్తి వచ్చినం
దేరు బృహన్నలావశగతిం జరియించిన గెల్వ వచ్చుఁ ద
ద్వీరగుణంబుసొంపు పృథివీవరనందన మున్నెఱుంగుదుం
గారణజన్మ మై తనువికారము [3]వచ్చినఁ బెంపు దప్పునే. 22

వ. అనవుడు. 23

క. మన మురియాడుచు నుండఁగఁ, దన కొరు లప్పటికి లేమి ధరణీశ్వరనం
దనుఁడు బృహన్నలఁ బిలువం,బనుచుట కొడఁబడినపలుకు వలుకుటయుఁ దగన్.

వ. సైరంధ్రి దేనఁ గనుంగొని యేను బోయి తోడ్కొని వచ్చెద నని పూని. 25

సీ. అడుగులనునుఁగాంతి నయ్యెడ పద్మ రా,[4]గంబులనెలకట్టుకరణి నొప్పఁ
బాలిండ్లు దను వెడ వ్రాలింపఁ జెన్నొందు, ననదుఁగౌఁదిఁగె యల్లాడు చుండఁ
దఱి వేచి వెనువెంటఁదగులుకామాంధకా,రములీలఁ గ్రొవ్వెదగొమరు మిగులఁ
గర్ణభూషణమహా ర్తికప్రభాడోలన, మిాఁఱుణ దీప్తుల నినుమడింప

తే. నందియలమొరపంబున కరుగుదెంచి, ప్రోది రాయంచ రయమునఁ బోవునవ్వి
ధంబు దగ నభ్యసించుచందమునఁ దోన, చనఁగ నుత్తర నర్తనశాల కరిగె. 26

ఆ. మెఱుఁగు[5]మొగిలుసొచ్చు తెఱఁగుననాట్యమం,దిరముసొచ్చితనదుగురువుకడకు
నరిగి నెమ్మి నిట్టు లను నింతి ప్రార్థనా,వినయసంభ్రమములు పెనఁగొనంగ. 27

క. ఇచ్చట నొకకయ్యంబునఁ, జచ్చె మదీయాగ్రజన్మసారథి తగువాఁ
డెచ్చోట లేమి నాతం, డచ్చుపఱుపఁ డయ్యె నీక్రియకు నొండొకనిన్. 28

---

1 లీబృహన్నల. 2 నట...నరిగెద నంట (నట్టె). 3 వొందిన. 4 గములుగట్టినసేల
కరణి...బాలిండ్ల తను పెద...వ్రేఁ గైనవేనలి వెనువెంటఁ దగులుకొ, మాంధకారములీల నతిశ
...లోమలు. 5 మెఱుఁగులు : మెయిలు.

వ. అది యట్లుండె నేఁడు కౌరవులు పసులం బట్టిరని కూయి వచ్చిన [1]నన్న సన్న
ద్ధుం డై వెనుకం దగుల సమకట్టి సారథ్యంబు సేయువాఁడు లేమికి విషాదంబు
నొందిననీకందువ సైరంధ్రి సెప్పినం బ్రియం బంది నిన్నుఁ దోడ్తేర నన్నుఁ బని
చిన నేనును నీపాల నాకుఁ జనవు గలుగుటం జేసి యెల్లవిధంబులం దేర్తు నని
పూనివచ్చితి నీవును నాపలుకులు గుఱుచ సేయక నీపెంపునుం బ్రకటంబుగా
నయ్యుత్తరకుమారునకు రథంబు గడప నియ్యకొని యియ్యాపదఁ దలుగ
వలయు నిట్లొడంబడక తక్కుట నావలనివాత్సల్యంబు గొఱంతపఱుచుట య
నిన నమ్ముద్దియపలుకులు ముద్దు సేసి. 29

క. నగుచు బృహన్నల యిట్లను, జగతీశ్వరపుత్రి నాకు సారథ్యము నే
ర్పు గలదె నీమాటకు నే, మిగులంగా వెఱతుఁ [2]బొదము మీఁద ట్లుండెన్.

క. భవదీయప్రార్థనచేఁ, దివిరి పరమదుష్కరములు దీర్చి యయిన ను
త్సవ మొనరించెద సార,థ్యవిధం బొకఁ డనఁగ నేల యంబుజవదనా. 31

వ. అనుచు సంగీతనిలయంబు వెలువడి సలీలంబుగా మెత్తమెత్తన నడతెంచు
మత్తశుండాలంబునుంబోలె. 32

ఉత్తరుఁడు బృహన్నలను దనకు సారథిఁగాఁ జేసికొనుట.

తే. [3]అరుగుదెంచుబృహన్నల నంత నంతఁ, గని నృపాలసుతుం డను గౌరవమునఁ
గౌరవులతోడఁ గయ్యంబుగలిగె నాకుఁ, గడఁగి నేఁడు రథమ్మీవు గడపవలయు.

క. [4]వేరమ్ము మైమఱువుఁ దొడి, తే రెక్కము దప్పఁ గ్రుంకఁ దీఱదు నీకున్
సైరంధ్రి సెప్పె నీ దగు, బీరమ్మును బెంపు లావు వెరవును మాకున్. 34

చ. అనుటయు నాటపాట గలయప్పటికిన్ ననుఁ గోరి పిల్వఁ బం
చినఁ దగుఁ గాక సంగరము సేఁతకు సారథి గమ్ము రమ్ము నీ
వను టుచితంబె యెల్లెడల నారసి బాహుబలాఢ్యుఁ డైనయొ
క్కని రథ మేడ్తెఱం గడపఁగా నియమింపుము రాజనందనా. 35

వ. అనిన విని వైరాటి గిరీటి కిట్లనియె. 36

ఉ. ఖాండవ మేర్చునప్పుడు దగన్ రథచోదకవృత్తి సల్పి యా
ఖండలసూతికిన్ జయము గల్గ నొనర్చినయట్టిబుద్ధియున్
దండితనంబు నీయెడన తక్కెనె నా దెస మైత్రి పెన్పు మిం
కొండొకమాట దక్కుము రణోత్సహనం బొనరింపు గ్రక్కునన్. 37

తే. అనిన నాతనిమాటకు నడ్డ మాడ, వెఱచినట్టితెఱంగు భావించి యల్ల

1 సమరసన్నద్ధుం...దోడ్తెత్తు నని బూని వచ్చితి. 2 బోము మీఁదె ట్లుండెన్. 3 అరుగుదెంచు నాబృహన్నల నంతంత, గని నృపాలసుతుఁడు గౌరవమున, గౌరవులకు నాకుఁ గయ్యంబు గల దీవు, గడఁగి నేఁడు రథము గడపవలయు. 4 నేరమి (ధీరత) మై మఱు (వుం దొడి) వు దొడిగి...వీరత్వము బాహుబలము.

నియ్యకొనుటయు నమ్మనుజేంద్రసుతుఁడు, దృఢతనుత్రాణ మతనికిఁ దేరఁబనిచె.

క. తెప్పించి తొడుగు మీ వని, యొప్పించిన నిట్టు నట్టు నొఱవలుగా మైఁ
గప్పికొని యాబృహన్నల, యప్పుడు [1]నగుపించె నచటియబలాజనమున్. 39

క. ఉత్తరుఁడు సత్వరంబుగఁ, దత్తనువున మఱువు [2]దొడిగి తానును హృద్యో
దాత్తం బగుకంకట మిడి, చిత్తము పసిఁ గ్రమ్మఱింపఁ జిడిముడిపడఁగన్. 40

వ. బృహన్నల నవలోకించి. 41

క. హయములఁ బూన్పుము రథమున,రయమున సిడమెత్తు మిపుడ రావలయును గో
చయము గొని యస్మదీయవి, జయ మభినందింపఁ బురముజను లెదురుకొనన్.

తే. అనిన నీవేమి పనిచిన నట్ల చేయ, వలయు నీవున్నయెడ నుండ వలయు నీవు
సన్నదెసఁ జనవలయు నాశక్తియెఱిఁగి,పంచిపనిగొని కడిమిమైఁ బగఱగెలుము.

వ. అనిన పలుకుచు మనంబున ముదం బొదవ నాధనంజయుండు. 44

క. కాంచనమాలాలంకృత, చంచత్తనులీల [3]మెఱయ జవనాశ్వములం
బూంచి రథంబున మణిమయ, పంచాననకేతు వెత్తె బంధురభంగిన్. 45

వ. ఇట్లు సన్నాహంబు మెఱసినసారథిం జూచి యుత్తరయుం జెలులు నిట్లనిరి.

క. కురువీరుల గెలిచి తదం, బరములలోఁ జిత్రవర్ణభాసురములు గాఁ
దర మెఱిఁగి లోచనోత్సవ, కరములు గా బొమ్మపొత్తికలకుం దెండీ. 47

క. అనుడు బృహన్నల యిట్లను, జనపాలక నందనుండు జయలక్ష్మిం జే
[4]కొను నటె చీరలు దెచ్చుట, పనియే యటు సూడుఁ డెల్లభంగులఁ దెత్తున్.

వ. అనుచు ధనుస్తూణీరకృపాణముద్గరాదివివిధసాధనంబులు రథంబుపైఁ బదిలంబుగా నిడి నొగ లెక్కి పగ్గంబుల స్రుక్కు సక్కం జేయ నుత్తరుండును బసులం బట్టినదెస [5]గోపాలకు నడిగిన వాఁడు పితృవనంబువలనని చెప్పిన వినుచు రథారోహణంబు సేసి వెడలి పౌరవృద్ధపుణ్యాంగనాభూసురసమూహంబులు బృహన్నలం జూచి తొల్లి ఖాండవదహనంబున నర్జునునకు నీకతంబున నయినమాంగల్యం బెట్టి దట్టిద భవత్సాహాయ్యంబున భూమింజయున కయ్యెడు మని దీవించి సేసలు సల్లం బురంబు నిర్గమించి నిరర్గళపరాక్రముం డయినయాఫల్గునునైపుణంబున వల్గదశ్వం బగురథంబు రయంబునకు మెచ్చుచుం బరేతనిలయప్రాంతప్రదేశంబు సేరం జని. 49

సీ. అభినవజలధరశ్యామంబు లగునెడ, లాకుజొంపంబుల ననుకరింప
సాంధ్యరాగోపమచ్ఛాయంబు లగుపట్లు, కిసలయోత్కరములఁ గ్రేణిసేయ
రాజమరాళగౌరము లగుచోటులు, దఱచుఁబూఁబొదలచందంబు నొంద
హారిద్రరుచిసమానాకృతు లగుతావు, లడరెడు [6]పుష్పాదులట్లు మెఱయఁ

1 నగి(పిం)యించె. 2 దొడిపె. 3 మెఱయు. 4 కొను(టే)డే చీరలు. 5 గోపాలకుల నడిగిన వాడు...వినుచు వలగొని రథా. 6 పుష్పాళ్ళకడిమి.

తే. గలయ నెగసి ధరాధూళి లలితవనము
దివికి [1]నలిఁ గాఁపువోయెడుతెఱఁగు దాల్ప
గోగణము ముంగలిగ నేల గోడివడఁగ
నడచుకౌరవరాజసైన్యంబుఁ గనియె. 50

—ఉత్తరుఁడు గురుసైన్యంబు గనుంగొని భయభ్రాంతుం డగుట.—

క. కని యుత్తరుండు గరుపా, ఱిన మేనును దలఁకుమనము ఱిచ్చవడినచూ
పును నై తొట్రుపడుచు ని, ట్లనియె దిగులు సొచ్చి యాబృహన్నలతోడన్.

శా. భీష్మద్రోణకృపాదిధన్వినికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాపవిసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలబలాత్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్య మిది యేఁ జేరంగ శక్తుండనే. 52

క. అకృతాస్త్రుఁడ బాలుఁడఁ గా, ర్ముకవిద్యాప్రౌఢిమై నిరూఢు లయినయీ
శకుని జయద్రథ దుర్ముఖ, వికర్ణ కర్ణాదియోధవీరుల కెదురే. 53

క. ఇట్టగు టెఱుఁగక వచ్చితి, మెట్టొకొ మనభంగి వీర లిందఱును గదున్
బెట్టిదులు మనకు మార్కొను, నట్టికొలఁది గాదు భీతి యడరెడుఁ దోడ్తోన్.

ఉ. కౌరవసేనఁ జూచి వడఁకం దొడఁగెన్ మదితోన మేను నీ
వూరక పోవు చున్కి యిది యొప్పునె యిప్పటిభంగిఁ జూచిన
న్వీరల నేను మార్కొనమి నిశ్చయ మట్లగుటన్ రయంబునం
దేరు మరల్పు ప్రాణములు దీపన మున్ [2]వినవే బృహన్నలా. 55

వ. [3]అనిన దరహాసితవదనుం డగుచు శతమఖతనయుం డతని కిట్లనియె. 56

చ. అసదృశలీలఁ బొల్చురథికావలిమీఁదఁ జనంగ వెట్టినే
మసలక యామిషంబు గొని మార్గము వట్టినతుచ్ఛసైన్యమున్
వెసఁ జని ముట్టి గోధనము వేగ మరల్తము గాక యిమ్మెయిం
బసు లటు వోవఁగా మరలఁ బాడియె నీకు నరేంద్రనందనా. 57

ఉ. అంతిపురంబులోనఁ గలయంగన లెల్లను నెమ్మనంబులన్
సంతస మందఁగాఁ బసులఁ జయ్యనఁ దెచ్చెద నంచుఁ బూని నీ
వెంతయుమేటి వై యరద మెక్కి రయంబున వచ్చి యిచ్చటన్
దంతితురంగసద్భట[4]కదంబముఁ జూచి కలంగు టొప్పునే. 58

ఆ. అనినపలుకులకు బృహన్నలఁ గనుఁగొని, యెలుఁగు [5]వడఁక నాతఁ డిట్టులనియెఁ
బసుల దయ్య మెఱుఁగుఁ బడఁతులసంతోష, మేల నాకు ననికిఁ జాల నేను.

వ. అనవుడు. 60

---

1 వెసఁగాపు (నరిగాపు). 2 వినమే. 3 అనిన విని మందస్మితముఖుం డగుచు ననిమిషపతితనయుం డతనికి. 4 రథంబు(ను)లఁ. 5 పడఁగ.

చ. తనభుజశక్తియున్ రిపులదర్పము నేర్పడఁ జూచి చూచి యె
ట్లును దెగ కున్నఁ బోక యిది లోకముచక్కటి శూరు లైన దీ
నిని మది మెచ్చ రీబలము నీదెసఁ దేఱియుఁ జూడ దింతకున్
మును భయహేతు వైనవిధముం దగఁ జెప్పుము నాకు నిత్తఱిన్. 61

సీ. దెసలు బీఁటలు వాఱఁ దివురు [1]చిందంబుల, కోలాహలములకుఁ గుదియఁబడక
యురవడి సేనలు దెరలఁ బైఁ దోఁతెంచు, ధూళి పెల్లడరినఁ దూల పోక
చతురంగబల మతిసాంద్రతఁ గవిసిన, యగ్గలికమునకు బెగ్గడిలక
శస్త్రాస్త్రములు రథ్యసారథివర్మాంగ, తతి నాఁటుతఱచునఁ దల్లడిలక

తే. బహువిధంబులఁ బగతుర బరవసమున, నిత్తెఱంగునఁ గలుగుక్రందెల్ల నోర్చి
నిల్చి గెల్చిన సత్కీర్తి నెగడుఁగాక, దవ్వుదవ్వుల నిక్కైన నవ్వ రెట్లు. 62

చ. అనుదివిజేంద్రనందనున కమ్మను[2]జేంద్రతనూజుఁ డిట్లనున్
వినుము త్రిగర్తవాహినులు విక్రమసంపద సొంపు మీఱ గో
ధనములఁ బట్టినం బతి యుదగ్రత సైన్యము లెన్ని యన్నియుం
గొని యట వోయెఁ గాన మనకుం బురి బాసట లేర యెవ్వరున్. 63

తే. ఒంటిఁ దలపడి కురుసేన నోర్చువాఁడ, నే యిదేటికి వెడమాట లిట్టు లాడ
వారు గానక [3]ముందఱ తేరు దోలు,కొని రయంబునఁ బురి కరుగుటయ నీతి.

వ. అనినం బార్థుండు పార్థివనందనున కిట్లనియె. 65

క. [4]వెగ డొంది యిట్లు వలుకఁగ, నగునే పగతురు ప్రమోద మందఁగఁ బసులన్
దిగ విడిచి పురజనంబులు, దెగడంగా మగిడి పోక దీనత గాదే. 66

వ. అట్లుం గాక. 67

మ. నను సైరంధ్రి గడంగి పేర్కొనియె దానం బెంపుమైఁ బిల్చి తో
డని తోడ్తెచ్చితి వీవు బంటుతన మట్లగ్గించి పౌరాలి దీ
వన లిచ్చెం దుదిఁ బోయి కౌరవులు గోవర్గంబుఁ గొంపోవఁగాఁ
గని యేఁ గ్రమ్మఱి రిత్త వోదునె భయోత్కంపంబు నీ కేటికిన్. 68

తే. చిత్తవృత్తి యొక్కించుక చిక్కఁ బట్టు, మిపుడ కౌరవసైనికు లెల్లఁ జూచి
వెఱఁగుపడ వేగమునులావు వెరవు మెఱయఁ, గదుపుఁ బెట్టించిపోదము గ్రమ్మఱంగ.

వ. అనుచు వివ్వచ్చుండు గడంగి తేరు వోవ నిచ్చుటయు నాననంబు పల్లటిల్ల
మానసంబు దల్లడిల్ల నాభూవల్లభకుమారుండు. 70

క. దవ్వుల విఱిగినఁ బౌరులు, నవ్వుదు రౌ మేలుమేలు నను నాఁగకు నీ
క్రొవ్వఱుగ దేనిఁ దలపడు, మెవ్విధిఁ జని తేని యనుచు నెత్తినభీతిన్. 71

క. శరములు శరాసనము న, య్యరదముపై డిగ్గ విడిచి యతిరభసమునన్

1 చిందములకో, లాహలంబులకుఁ గలంగఁ బడక... దెరలుపై దోఁతెంచు. 2 జేశ్వర
సూను. 3 మున్న యీ తేరు. 4 బెగడొంది...(మగుడి).

ధరణికి లంఘించి వెసం, బురిదెసకును లజ్జ వీటిఁ బోవం బాఱెన్. 72

వ. ఇట్లు వాఱినం దనమనంబునం గుత్సించుచు బీభత్సుండు యుగ్యంబులపగ్గం
బులు నొగల ముడిచి రథంబు డిగ్గ నుఱికి లంబకేశభారుండును నాందోళిత
రక్తాంబరయుగళాంచలుండును నగుచు నతనివెనుకం బఱచుసమయంబున
నిలిచి కనుంగొనుకౌరవబలంబునందు. 73

ఉ. అజ్ఞులు కొంద ఱప్పు డపహాసము సేయుచు గూఢరూపరే
ఖాజ్ఞత లేమిఁ దద్వికృతకాయముమీఁదను [1]దృష్టి నిల్పఁగాఁ
బ్రాజ్ఞులు మూర్తిసౌమ్యతయు బాహులదీర్ఘతయుం భటత్వత
త్త్వజ్ఞతయుఁ గతిస్ఫురదుదాత్తతయుం గని సంశయంబుతోన్. 74

తే. ఆఁడుఁజందంబుఁ బురుషసమాకృతియును
గలిగి యున్నది యొప్పు నూష్మలతసొంపు
వికృతవేషా[2]కృతంబులై వెలయ కితఁడు
నివుఱు గవిసిన మెఱయనినిప్పువోలె. 75

ఉ. బాహులచాయయుఁ గమనభంగియు నర్జునునట్ల దీన సం
దేహము లే దితండు దనతేజము డాఁపఁగ మత్స్యభూమిభృ
ద్గేహమునందుఁ బేడి యనఁ గీడ్పడి యుండెనొ కాక యీకురు
వ్యూహముతోడికయ్యమున కొండొకరుం డిటు లొంటి వచ్చునే. 76

చ. విరటుఁడు [3]దక్షిణంబునకు వీరుల సారథులన్ నిజాజికై
పురిఁ గలవారి నెల్లఁ గొని పోయిన నొండులు లేమిఁజేసి యు
త్తరుఁ డిట వచ్చు చుండి యరదంబు దగం గడపంగ నెవ్వరుం
దొరకొన కున్నఁ దా నితనిఁ దోడ్కొని వచ్చినవాఁడు సూడఁగన్. 77

చ. పరి సనుదెంచి గోగణముఁ [4]బట్టి రనన్ విని పిన్న గాన మీఁ
దరయక రాజనందనుఁ డహంకృతిమైఁ బఱతెంచి సైన్యవి
స్ఫురణముఁ జూచి భీతిఁ దనబుద్ధి గలంగినఁ బాఱఁ జొచ్చె ని
ప్పురుషునిశౌర్యసంపదయు భూరిబలంబు నెఱుంగఁ డేమియున్. 78

వ. అనుచు నిశ్చయరహితహృదయు లగు చుండ శుండాలరయలీలాసమరేఖం
బగుగమనంబునం బురుహూతపుత్త్రుండు పదశతమాత్రప్రదేశపలాయితుం
డైనభూమింజయు నెయిది పట్టికొనిన నతండు. 79

సీ. [5]వెలవెలఁ బాఱుచు వెగ డొందుఁ బెదవుల, తడి యాఱ నెంతయుఁ దల్లడిల్లు
జల్లన నంగంబు లెల్లనిండఁ జెమర్చుఁ, బదములుఁ గరములుఁ గుదియ వడఁకు

---

1 దృష్టి...బటుత్వతత్త్వజ్ఞత. 2 వృతంబులై వెలయ కితఁడు. 3 పట్టుదట్టముగ; బెట్టుదిట్టముగ; దండుదట్టముగ...నొండొరు లేమిఁ. 4 బట్టె ననన్. 5 వెలువెల...బెదవులఁ, దడపుచు...గుదులువడఁగ; గుదిలవడఁగ; గుదువవఢఁగ.

హృదయంబు దటతట నదరంగఁ బెలుకుఱు,దీనదృష్టుల మోముఁ దేఱి చూచు
నెలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్చు విడు మని, ప్రార్థించు మాటఁ గీడ్పాటు దోఁప

తే. నిష్కశతశుద్ధహేమంబు నిర్మలోజ్జ్వ
లాష్టవైడూర్యములుఁ దురగాఢ్యరథముఁ
గరటిదశకంబు నొకయూరుఁ బురము సొచ్చి
నపుడ [1]యిచ్చెద నీ కను నార్తుఁ డగుచు. 80

క. నాతోడిప్రేముడిం గడు, నాతుర వై యెదురుచూచునంబకుఁ జేతః
ప్రీతిగఁ జని యాయమఁ బొడ, సూతుం బో నీఁగదే విశుద్ధచరిత్రా. 81

—— అర్జునుఁ డుత్తరునిఁ దనకు సారథిఁగాఁ జేసికొనుట. ——

వ. అని మఱియు నానావిధదీనాలాపంబులం బ్రార్థించు చుండం బార్థుండు నగుచు
నతనిం దేరు సేరం దెచ్చి. 82

చ. వెఱవకు మన్న పోటు కురువీరులతోడ నశక్యమేని న
త్తెఱఁ గది యేల నీ [2]కుడుగు తేరికి సారథి గమ్ము నాకుఁ జి
చ్చుఱపిడు గట్టు ల ట్టడరి శూరులమొత్తము నుగ్గు సేసెదం
బఱపెద సేన రాజుధృతిఁ బాపెద గోవులఁ గ్రమ్మఱించెదన్. 83

క. అనుచు నొడఁబాటు లే కున్నను నయ్యుత్తరుని నొగల నడుమ నిడి తా
నును రథ మెక్కి రథికుఁ డయి, చనియె నరుఁడు జమ్మి సేర సమ్మదలీలన్. 84

వ. ఇట్లు సవ్యసాచి నిక్షిప్తాయుధం బైనశమీవృక్షసమీపంబున కరుగునవసరం
బునం గ్లీబరూపచ్ఛన్నుం డయ్యును బ్రస్ఫురణవిశేషభీషణుం డగునతనిం
గనుంగొని కౌరవసైనికులు గలంగినమనంబులతోడ నివ్వెఱపడి యుండ వా
రలం గనుంగొని తోఁచునుత్పాతంబుల నాలోకించి గురుం డి ట్లనియె. 85

క. మాసె నభోమణి నక్కలు, గూసెం గలయంగ దెసలకుం బలుసాయల్
[3]సేసెం బఱమొయిళు లడరి, మ్రోసెం దమయంతఁ దూర్యము లపధ్వను లై.

క. ఇగ్గజములు మిన్నకయును, మ్రొగ్గెడు నుత్తమతురంగములు బాష్పజలం
బగ్గలము విడుచు చున్నవి, [4]దగ్గెడుఁ గారణము లేక తడఁబడి పడగల్. 87

క. దగ్ధము లైనట్టులు స, మ్యగ్ధైర్యము లెడలె మండె నాయుధచయముల్
దిగ్ధూమం బెసఁగె నసం, దిగ్ధము మన కాజి యగుట దీనికిఁ దగఁగన్. 88

క. మొన [5]లొఱపుగఁ దీర్చికొనుఁడు, దనతనవాహనము లాయుధము లెల్లజనం
బును నునువునేసికొనుఁ డో, పినయంతయుఁ గాచికొనుఁడు బెదరక పసులన్.

వ. అని చెప్పి తా నప్పు డర్జును నెఱింగినవాఁడు గావున నతనికి నజ్ఞాతవాససమయ

1 యిచ్చెద ననుఁ గడు నార్తుఁ. 2 వుడుగు. 3 సేసెఁ బఱమొగులు గీడై. 4 త్రగ్గె
డుఁ గారణ...తడఁబడె. 5 లొప్పుగఁ.

భంగం బగునో యనుభయంబున సురనదీసూనువదనం[1]బు వీక్షించి సన్న 90
వాఱ నిట్లనియె.

చ. [2]వెరవరి గాక వీఁడు కురువీరులకుం బొడసూపువాఁడె య
చ్చెరు వొక మాఱినిపేర నిట సేరఁగ వచ్చుచు నున్నవాఁ డహం
కరణమ కాని యొం డొకటి గానఁడు మూర్తివిశేష మారయన్
సురపతియట్ల వీనిమదిచొప్పది యెట్లొ యెఱుంగ నయ్యెడున్. 91

క. అనిన విని యెఱిఁగికొని యా,తనిమది సందియము మాన్పఁ దలఁచి నరేంద్రుం
గనుఁగొనుచు నతనితోఁ జె,ప్పినభంగి నిగూఢవృత్తి భీష్ముఁడు వలికెన్. 92

క. తలఁపఁగ రిపులకు నిమ్మగు, కొలఁది గడచి వచ్చితిమి యకుంఠితబాహా
బలము నెఱపఁ దఱి యయ్యెను, జలింప వల దింక మనకు శత్రులవలనన్. 93

వ. అనవుడు నాచార్యుం డయ్యర్థంబు [3]గనికొని పార్థునకు సమయభంగంబువలని సంకటంబు లేకునికి మనంబునం బ్రియం బంది మొగంబునం దోఁప నీక ఫుయిలోట దక్కి యిట్లనియె. 94

శా. సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతారనివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్. 95

ఉ. ఈతనితోడికయ్యమున కియ్యకొనం దగువార లస్మదీ
యాతతసేనలోఁ గలుగు టారయ [4]సంశయ మెల్లభంగి గో
వ్రాతనివర్తనంబు సుకరంబ కిరీటి కితండు రుద్రునిం
బ్రీతునిఁ జేసె నా వినమె పెం పెస లారెడుబాహుసంపదన్. 96

వ. అనుపలుకు లాకర్ణించి కర్ణుండు గటకటంబడి కుంభసంభవున కిట్లనియె. 97

ఉ. పాండవపక్షపాతమునఁ బ[5]ల్కుదు నోరికి వచ్చినట్లు ని
న్నొం డన రామిఁ జేసి యిది యొప్పునె కౌరవసేన కెల్ల నొ
క్కండవ మేటి వీబలము గర్వముఁ గుందఁగ నిట్లు శత్రుదో
శ్చండిమ కోహటించితి నిజంబునకున్ నరుఁ డింతయెక్కుడే. 98

ఆ. అతఁడు వచ్చెనేని నస్మచ్ఛిలీముఖ, పాతచలితహృదయపద్ముఁ జేసి
వెగడుపఱిచి యోధవీరుల కెల్ల ను,త్సవ మొనర్తు బాహుదర్ప మొప్ప. 99

వ. అనిన విని సుయోధనుండు రాధేయున కిట్లనియె. 100

ఆ. తప్పఁ బలికి తీవు సెప్పెద విను మిత్ర, డర్జునుండ యేని నడవి కేఁగి
భ్రాతృయుతము గాఁగఁ బండ్రెండువత్సర,ములును నంద నిలువవలయు మగుడ.

క. ఒరుఁ డయ్యెనేని మామక, శరాసనక్షిప్తదీప్తసాయకపంక్తిం

---

1 బుపలక్షించి. 2 వెరవిఁడి...మ్రానిసేరి యిట. 3 గనుంగొని. 4 దుర్లభ. 5 ల్కెదు.

బరిమార్చెద వేర్మిడి న,చ్చెరువుఁ బ్రమోదంబు నొంది సేనలు వొగడన్.

క. అనుపలుకులకును భీష్మం,డును ద్రోణుఁడు ద్రోణసూనుఁడును గృపుఁడును మే
లని యియ్యకొనిరి హృదయా, ననురూపము లైన[1] తెలువు లాస్యముఁ బొందన్.

అర్జునుఁడు శమీవృక్షనిక్షిప్తం బైనగాండివంబు గొనుట.

వ. అట్టియెడ శమీవృక్షసమీపంబున నరదంబు నిలుపం బంచి పార్థుం డుత్తరున
కి ట్లనియె. 104

క. ఇన్నగమునందు గాండివ, మున్నది యది గాని మద్భుజోద్రేకవిలా
సోన్నతి కోర్వవు పెద్దయు, నన్నువ లీవిండ్లు గుఱుచ లలఁతిబలంబుల్. 105

క. ఇవి నీ తెగకొలఁదివి వీ,రవినోదము నప్పు డధికరభసము లగుమ
ద్వివిధాటోపములకుఁ జా,లవు విల్లది నూఱువేలలా వరయంగన్. 106

క. [2]వీనిఁ గొని గట్టిమెమఱు, వేనుంగును మఱియు నెట్టి వేనియుఁ దునియం
గా నేయ నగు నె కైదువు, లేని [3]యలవుకలిమి పోర లెస్సె యున్నే. 107

వ. కావున నిమ్మహీరుహం బెక్కి యమ్మహనీయచాపంబు దెచ్చి యిమ్ము ధర్మజ
భీమార్జుననకులసహదేవులు దమతమసమస్తాయుధంబులుఁ గూడం గట్టి యిందుఁ
బెట్టినవా రాకట్ట విడిచి యందు గాండీవంబు పుచ్చికొని [4]తక్కటియవి యెప్పటి
యట్ల బంధింపు మని చెప్పి శవాకారంబున నున్న శస్త్రాస్త్రసంచయంబు సూపి
న భూమింజయుం డతని కి ట్లనియె. 108

క. వీనుఁగు నంటఁగ నగునే, భూనాథతనూజుఁ డనక పుయి లోడక న
న్నీనీచపుఁబనిఁ బనుపం, గా నీకుం దగునె పాపకర్మము గాదే. 109

వ. అనిన విని ధర్మనందనానుజుం డత్యాదరంబున. 110

ఆ. మనుజు లంట కుండ మఱువడఁ జేసిన, యస్త్రశస్త్రసంచయంబు గాని
శవము గాదు మత్స్యజనపాల[5]తనయయే, నట్టి దైనఁ బనుతు నయ్య నిన్ను.

క. నమ్ముము కైదువుమోపగు, జమ్మి వెసం బ్రాఁకి విడిచి చాపము నా కం
దిమ్మనుడుఁ జేయునది లే, కమ్ముగ్ధుం డమ్మహీజ [6]మలసత నెక్కెన్. 112

వ. ఇట్లుత్తరుండు సమారూఢశమీవృక్షుం డగుటయు నరదంబుపయి నిలుచుండి
పాండవమధ్యముండు వేవేగ విడువు మనవుడు నతండు నాయుధసంచయబంధం
బెడలించిన. 113

క. మెఱసి యుదయించుగ్రహముల, తఱచుప్రభలఁ గ్రోణిసేసి దశదిశలం గ్రి
క్కిఱిసి వెడలె [7]నావిండ్లక్, మెఱుఁగులు నృపతనయుదృష్టి మిఱుమిట్లుగొనన్.

వ. అట్టియెడ నయ్యాయుధంబులు. 115

1 తెలుపు. 2 దాని (దీని)... నేయ నగును. 3 యెలవు. 4 తక్కిన. 5 పుత్ర. 6 మల్లన.
7 నావిండులు.

క. పెనుఁబాములచందంబున, నునికికి భయ మంది వడఁకునుర్వీశసుతుం
గని తగుమాటలఁ గుంతీ, తనయుఁడు వెఱ వాపుటయు నతం డచలితుఁ డై.
వ. [1]పొదువు విరియం దట్టి కనుంగొని నిరూపించి సారథీ యని సవ్యసాచిం బిలిచి
యి ట్లనియె. 117
క. ఇది యొకచాపము విస్మయ, మొదవించుచుఁ గొండచిలువయొకో నాఁ దగి యు
న్నది ఖచితకనకకమలస, ముదయద్యుతిసముపగూహనోజ్జ్వల మగుచున్. 118
వ. దీనిం బాండవులయం దెవ్వరు ధరియింతు రని మఱియు బహువిధంబు లగు
నాయుధంబు లుపలక్షించి వేఱువేఱ వానిచందంబు లుపన్యసించి యివి యెవ్వ
రెవ్వారి వని యడిగిన నర్జునుం డి ట్లనియె. 119
తే. తొలుత నీవు న న్నడిగినదొడ్డవిల్లు, గాండివము ఫల్గునున కేదుగడయు నదియ
సమరమున దేవదానవసమితి నైన, గెలుచు న శ్రమమున దానివలన నతఁడు.
క. ఆద్యపురుషోపలాలిత, ముద్ద్యోతితరోచిరుద్గమోగ్రం బరిని
ర్భేద్యము దివ్యజనన మన, వద్యం [2]బిది కార్ముకైకవరము కుమారా. 121
వ. [3]ఇమ్మహనీయచాపంబు బ్రహ్మ శతసహస్రవర్షంబులు ప్రజాపతి చతుష్షష్టిసహస్ర
వర్షంబులు నింద్రుండు పంచాశీతిహాయనంబులు సోముండు పంచశతాబ్దంబులు
వరుణుండు శతశరత్సమితియుఁ గ్రమంబున ధరియించిరి వరుణుచేత నగ్ని దేవుఁ
డు వేడుకపడి పుచ్చికొని పదంపడి ఖాండవదహనంబున నద్భుతకర్మంబునకు
మెచ్చి వివ్వచ్చున కిచ్చె నతండును నఱువదే నేండ్లు ధరియింపం గలవాఁ
డి ట్లిది త్రిలోకపూజ్యమహిమ నొప్పుచుండు. 122
సీ. నీలోత్పలచ్ఛాయ నెరసి సౌవర్ణవృ, షావలి నొప్పుబాణాసనంబుఁ
దాళప్రమాణసుందర[4]మునై భర్మశా, ఖామృగాంచిత మగుకార్ముకంబుఁ
దీవ్రకృశానుసందీప్తాకృతియుఁ గన, త్కనకమత్స్యంబులుఁ గలుగుధనువు
మెఱుఁగారుసారంబు మెఱయుకాంచనమయూ, రములశోభిల్లుచాపమునువరుసఁ
ఆ. బాండవాగ్రజుండుఁ బవనపుత్త్రుఁడు నకు, లుండుఁ దదనుసంభవుండుఁ బట్టు
నవి కుమార యగ్గవాజినకోశము, హాశరంబు పార్థునదియ చూవె. 123
క. ఎద్దెసలం దనరుచులు స, ముద్దీప్తము లగుచు నుండ నుజ్జ్వల మగున
య్యుద్దండగదాదండము, పెద్దయు [5]నెడ మెచ్చి పట్టు భీముఁడు పోరన్. 124

అర్జునుఁ డుత్తరునకుఁ దన్నెఱిఁగించుట.

వ. అని చెప్పి మఱియు బాణకృపాణతనుత్రాణాదు లగువివిధసాధనంబులు వేఱు
వేఱ నిరూపించి గ్రక్కున నెఱింగించె నప్పుడు మహాత్ముం డగునయ్యుత్త
రుండు పాండవోత్తము నెఱుంగమి ని ట్లనియె. 125

1 పొది. 2 బది. 3 అమ్మహనీయ. 4 మైన...ఖామృగఖచిత మౌ (ఖావృతాంచిత మగు) ...మెఱయఁగాంచన...నతని యవరజుండు బట్టు. 5 నెద.

క. ఈయెడ నిట్లిమ్మహనీ, యాయుధమును వెట్టి యెచటి కరిగిరి మనకౌం
తేయులు బృహన్నలా తగ, నీయెఱిఁగినయంతవట్టు నిక్కము సెపుమా. 126
వ. అని సస్నేహంబును సగౌరవంబును సవిషాదంబునుం గా మఱియును. 127
క. ఏ నమ్మహానుభావుల, మేనల్లుఁడ వార లార్యమిత్త్రులు శత్త్రు
క్ష్మానాయకగర్వతమో, భానులు బంధుహితకార్యపరతంత్రాత్ముల్. 128
తే. అయ్యుధిష్ఠిరుఁ డెచ్చట నడఁగి యున్న,వాఁడొ భీమునిపార్థునివర్తనంబు
లెయ్యెడల నేమిచందంబులయ్యె నక్కటా విధాత్రుండ కవ లెందు డాఁగిరొక్కొ.
క. భూపాలవల్లభాజన, దీపిక యనఁ జాలుద్రౌపదికి నెయ్యెడలం
దేపాటులు వాటిల్లెనొ, కాపురుషులవలన నిట్టి కాఱియ వుట్టెన్. 130
క. కపటద్యూత మొనర్చిన, నృపతియు దుర్యోధనాదినీచుల[1]వలఁ బా
ఱి పడియెఁ గడుఁ బెక్కిడుమల, రిపుమర్దనవీర్యభుజగరిష్ఠుం డయ్యున్. 131
క. వినఁబడ రెచ్చోటను దమ, వినుతమహీరాజ్యమహిమ విడిచి చనుట నే
మని వినియెదనో నీచే, ననుడు నతం డిట్టు లనియె నాతనితోడన్. 132
వ. వారలకు వగవ వలవదు విధివశంబున వచ్చినయాపదకు నోర్చి బాస దప్పక తారును బాంచాలియు నొక్కటఁ బండ్రెండేండ్లు వనంబున వసియించి పదుమూఁ డగునేఁ డజ్ఞాతవాసంబు సలుప వలయుట నిట వచ్చి మనవీట [2]నవ్యాపన్నులై యున్నవారు వినుము వారి నెఱింగించెద. 133
క. కంకుఁడు ధర్మసుతుఁడు వల, లాంకుఁడు భీముండు గవలు హయశిక్షకగో
కింకరులు సెప్పఁ దొడఁగితి, నింకఁ గొఱఁత వెట్ట నేల యే నర్జునుఁడన్. 134
తే. అధిపనందన మాలిని యనఁగఁ బరఁగు, కాంత ద్రౌపది దానికై కాదె సింహ
బలునిఁ దమ్ముల గంధర్వపతులు సంపి,రనఁగఁ జంపె మహోగ్రత ననిలసుతుఁడు.
వ. అనిన విని భూమింజయుండు సంభ్రమాశ్చర్యసంశయంబులు మనంబున ముప్పిరిగొనం దప్పక చూచి సవ్యసాచికి వెండియు నిట్లనియె. 136
క. చిరకీర్తిప్రియుఁ డగున, న్నరునకుఁ బది గలవు భవ్యనామములు మనో
హరముగ నవి సెపుమా యెం, డరయక యే నమ్మెదను బృహన్నల నిన్నున్.
వ. అనుడు నతండు సస్మితాననుం డగుచు నర్జునుండు ఫల్గునుండు పార్థుండు కిరీటి శ్వేతవాహనుండు బీభత్సుండు విజయుండు జిష్ణుండు సవ్యసాచి ధనంజయుండు నను నివి పదియును నాపేళ్లనవుడు నుత్తరుండు పాండవమధ్యమున కిట్లనియె.
.క [3]ఏమిగతంబున నిట్టీ, నామంబులు సంభవిల్లె నరునకు నవి చే
తోమోదంబుగఁ జెప్పుము, నీమదిఁ దత్తద్విధంబు నిశ్చితమేనిన్. 139
వ. అనుటయు నట్లచేయుదు నని యతం డిట్లనియె. 140
ఆ. ధరణి యెల్ల గెలిచి తగ ధనంబులు గొని, యునికి నే ధనంజయుండ నైతి

1 చేనోటు (భార; బాధ) పడియె. 2 నత్యాస(ప)న్నులై. 3 ఏమేమికతంబుల నీ.

నెట్టివారి నైన నెదిరినఁ బోర జయంబు గొనుట విజయుఁ డండ్రు నన్ను. 141

తే. తెలుపు లగువాహనములు నా[1]తేర సమర
భూములం దెప్డు నియతిమైఁ బూన్కిఁ జేసి
శ్వేతవాహననామవిఖ్యాతి నాకు
సకలజనసమ్మతంబుగ సంభవించె. 142

చ. రవి యుదయించినట్లు సమరంబున నాతలమీఁదఁ గాంతిమూ
ర్తి వెలుఁగు నింద్రుఁ డిచ్చినకిరీట మభేద్యమహోగ్రసుస్థిర
త్వవిభవరూఢిమై జనులు దానన నన్నుఁ గిరీటినామసం
స్తవనవిశేషపాత్రముగ సమ్మతిఁ జేసిరి మాత్స్యనందనా. 143

తే. వీరులకుఁ జూడ బీభత్సవిధము గలుగ, నట్టికార్యంబు [2]సేఁతకు నెట్టిసమర
భంగులను దడఁబడక బీభత్స సేయ, దాన బీభత్సుఁ డనునభిధాన మయ్యె.

క. భండనమున నిరుగేలను, గాండీవము దివియ నేర్పు గలిగిన నందు
ద్దండ మగుసవ్యకరముప్ర, చండతఁ బరఁగుదును సవ్యసాచి యనంగన్. 145

తే. ధరణి దుర్లభ మగునవదాతవర్ణ, మారఁ గలుగుట నర్జునుఁ డండ్రు నన్ను
ఫల్గునాహ్వయ ముత్తరఫల్గునీవి,శిష్టకాలసంజననతఁ జేసి కలిగె. 146

క. అని మొన మార్కొని వ్రణ మేఁ, గనుఁగొన ధర్మజుని మేనఁ గావింపఁగ న
య్యనిమిషులుఁ జాల రెవ్వరుఁ, జెనకినఁ బరిమార్తుఁ గాన జిష్ణుఁడ నైతిన్.

క. పృథ యనుపేరు మదంబకుఁ, బ్రథితం బై యునికిఁ జేసి పార్థుఁడ నైతిఁ
వృథయుఁగఁ బలుకుదునే యవి, తథవచనుం డైనధర్మతనయుననుజుఁడన్.

వ. ఈపదిపేళ్లును నివి కారణంబులుగాఁ బ్రకాశంబు లయ్యె సకలసురనికరంబు లడ్డపడినం బుండరీకాక్షసహాయుండ నై ఖాండవం బేర్చినప్పుడు మెచ్చి భద్రమూర్తు లైనరుద్రవిరించులు సన్నిధిసేసినం బెన్నిధి గన్న పేదచందంబున సంభ్రమించునాకుం గరుణించి కృష్ణుం డనునేకాదశనామంబును నప్రతిహతబాణంబు[3]లు నొసంగిరి వారలయనుమతి నింద్రాదు లయినవిబుధులును వివిధంబు లగుదివ్యాస్త్రంబు లిచ్చిరి పదంపడి గీర్వాణులకు నోర్వరానియట్టివారి వరదానగర్వితుల నివాతకవచు లనియెడు దైతేయుల మాతలిసారథికం బగు నైంద్రస్యందనం బెక్కి యొక్కండన మూఁడుగోట్ల నిర్జించితి దుర్జయు లగు హిరణ్యపురనివాసుల నఱువదివేవురు దేవారాతుల వారాశితీరంబునం బరిమార్చితి నప్పుడు ప్రీతుం డై కదా గిరిభేది గిరీటం బొసంగె దేవసంఘంబు శంఖం బిచ్చె నది గతంబుగా నచ్చిందంబు దేవదత్తం బనం బరఁగె మఱియు నెయ్యెడల నెవ్వరు దొడరినం బొలివోనిబలిమికలిమి వెలుంగుదు గాంధారీ

1 తేరు...నియతమైఁ. 2 సేఁత కే నట్లు సమర...బీభత్సుఁ జేయు. 3 లక్షయతూణీరంబు లొసంగిరి...నమ్ఘతహర్ష లజ్జలు.

నందనుండు గంధర్వరాజుచేతం బట్టువడినయప్పుడు పదునాలుగువేల గంధర్వుల జయించి యతని విడిపించితి నీవోడకు మీకూడినకురుబలంబుల గెలిచి కర్ణగాంగేయకృపద్రోణద్రౌణిదుర్యోధనులు గనుంగొను చుండఁ గదుపులం గ్రమ్మఱించెద నని సత్వరంబుగాఁ జెప్పిన విని యుత్తరుండు చిత్తంబున నద్భుతహర్షంబులు వొదువ మ్రాను డిగ్గనుఱికి సర్వాంగసంగతోర్వీతలం బగుదండప్రణామం బాచరించి చేతులు మొగిచి నిలిచి యిట్లనియె. 149

ఉత్తరుఁడు బృహన్నల నర్జునుఁగా నెఱుంగుట.

ఉ. బాహుసమగ్రశత్రుమదభంజనశౌర్య సమస్తలోకచే
తోహరమూర్తి నీ విటులు దోఁచుట నాకుఁ బ్రసన్నవిస్ఫుర
ద్దేహముతోడ భాగ్యమయదేవత సన్నిధిసేఁత గాదె స
మ్మోహము వాసెఁ జిత్తము ప్రమోద[1]రసత్వముఁ బొంది పొంగెడున్. 150

నిన్నెఱుఁగక [2]యే నేమే, నన్నపలుకు లెల్ల మఱచి యాశ్రితరక్షా
సన్నద్ధభావ మేర్పడ, నన్నుం గృపఁ జూడవే సనాథుఁడ నగుదున్. 151

[3]అన వినుచుఁ దేరు డిగి గ్రక్కునఁ గౌఁగిటఁ జేర్చి విరటుకొడుకును గుంతీ
తనయుఁడు సమ్మదమునఁ దన, కనుఁగవఁ గడు నశ్రువారి గడలుకొనంగన్.

ఇట్లు సమాలింగితుండై. 153

మనము కలంక దేఱె రిపుమర్దనవిక్రమ యొక్క తేరు నీ
ఘనభుజశక్తిప్రాపున నఖండితశౌర్యమహోన్నతుండనై
యనిమొన సారథిత్వముమహత్త్వము వైరులు మెచ్చఁ జూపెదఁ
ననుఁ బనిగొమ్ము లెమ్ము కురునాథు [4]నదల్పు మరల్పు గోవులన్. 154

మనమునఁ గోరుదు నే నర్జునునకు సమరమున రథ్యచోదకభావం
బున బనిసేయ వలయు నని, యనిశము విధికరుణ నాకు నది సిద్ధించెన్. 155

అని పలుకునుత్తరు నత్యాదరంబునం జూచి సవ్యసాచి యతని కిట్లనియె.

ప్రియ మక్షీణము నాకు నీదెస మదిఁ భీతి [5]ప్రదోద్వేగసం
శయముల్ సేరఁగ నీను నీకు ఘనరక్షాకల్పనాబుద్ధిని
శ్చయసంపాదిని నాదుదృష్టి నిను నశ్వవ్రాతముం జోఁక గా
లియు రా నీను దృణీకరింపు రిపు దోర్లీలాసముల్లాసమున్. 157

అనిన విని భూమింజయుండు సవినయంబుగా నిట్లనియె. 158

నిను నర్జునుం డని యెఱింగినయంతన పాసె నెల్లకిల్బిషములు నీ
తను వేల షండభావం, బునఁ బొందెనో యెఱుఁగ వలయుఁ బుంస్త్వాభరణా.

---

1 రసంబునఁ. 2 లేక యమ్మెయి; యే నమ్మెయి...సనాథుఁడ నైతిఁ. 3 అనిన విని
...రు...కనుఁగవ పై నశ్రువారి; కనుఁగొన బ్రమదాశ్రువారి. 4 దెరల్పు మరల్పు. 5 భ్రమో
...గ...దృణీకరింతు.

చ. అనవుడు నాతఁ డిట్లను మదగ్రజుపంపున బ్రహ్మచర్యవ
ర్తనకయి పూర్వశాపవిహితం బగురూపముఁ దాల్చి యేకహా
యనపరిపాలనీయ మగునట్టివ్రతంబు సమాప్తిఁ బొందఁ జ
ల్పినజతనంబు లోకులకుఁ బేడితనం బయి తోఁచె నిమ్మెయిన్. 160

వ. అదియును నిట మీఁద లే దనినఁ బ్రమోదమానమానసుం డయి మత్స్య
పతిసూనుండు పాండుసూనున కిట్లనియె. 161

ఆ. ఇట్లు దెలియఁ జెప్పుటెల్ల నాదెస దయ, పెంపుతోడికూర్మి పేర్మిఁ గాదె
యింక సురల కైన శంకింతునే భవ, ద్బాహువప్రగుప్తి [1]బలుపు గలుగ. 162

వ. నాకుం బని యెయ్యది పనుపు మనిన నతండును గాండీవంబును గాంచనపుం
ఖంబు లగు[2]బాణంబులు గలతూణీరయుగళంబును మదీయతనుత్రాణకృపాణం
బులును బుచ్చికొని తక్కినవాని నెప్పటిభంగిన కట్టి పెట్టి రమ్మని నియోగించిన
నాతండు నట్ల చేయుటయు నమ్మహాత్ముండు నియతాత్ముం డయి యధిదేవత
లకుం బ్రణమిల్లి భక్తితోడ దివ్యకోదండాదు లగుసాధనంబులు గైకొని నవి
శేషస్ఫూర్తియగుమూర్తి నత్యంతదర్శనీయత్వంబు నొంది. 163

క. బలరిపుఁ డిచ్చినకుండల,ములు నుష్ణీషంబుఁ జిత్తమున భక్తిమెయిం
దలఁప నవి వచ్చె వెండ్రుక, [3]లలవడఁగాఁ బాచి ముడిచె నమర దృఢముగన్.

క. తలచుట్టు [4]చుట్టెఁ గుండల,ములు వెట్టెను ద్రిండు గాఢముగఁ గట్టెఁ గరం
బుల వలయంబులు గనుఁగొని, యెలన వ్రాలయుంగ నెక్కె నేడ్తెఱ రథమున్.

వ. అట్టియెడ వరదానమహానుభావంబునం జేసి. 166

క. పెట్టక కట్టక మూళిం, బుట్టినక్రియ దీధితులు నభోభాగంబుం
ముట్టి వెలుంగఁగ నింద్రుని,పట్టి కిరీటంబు వొలిచెఁ బ్రస్ఫురితం బై. 167

వ. ఇవ్విధంబున సన్నద్ధుం డై యతిరథశ్రేష్ఠుండు రథం బెక్కి యం దాయుధం
బులు పదిలంబుగా నిడి తనుత్రాణతలత్రాణంబులు దాల్చి కవదొనలం బూని
గాండీవంబుఁ బుచ్చికొని యెక్కువెట్టి ముష్టి నలవరించి గుణధ్వని సేసిన.

తే. పక్షిమృగజాతు లెల్లను బ్రమసి యిట్టు,నట్టుఁ గలగొనఁ జెదరె వృక్షాళియదరెఁ
గురుబలంబును బెదరె నంబరముదిశలు,బూరటిల్లంగఁ [5]దొడఁగెఁ దదారవమున.

వ. తదనంతరంబ యగ్నిదేవుం దలంచిన నతండును దనవరంబున మున్న కలిగి
విశ్వకర్మనిర్మితంబును మాయామయంబును వానరాకారంబును నగుమహో
గ్రకేతనంబును దదాశ్రితంబు లైనవికృతాభీలనానావిధభూతంబులఁ బుత్తెంచిన
నుదాత్తచిత్తుం డయి యుత్తరుసింహపతాక శమీవృక్షంబునం బెట్టించి నిజ
ధ్వజంబు రథంబునం గట్టించి దివ్యంబు గావున దేవదత్తంబు చిత్తజ్ఞత్వంబున

1 బలము. 2 బాణంబులతూణీర; బాణంబులపొదియుఁ దూణీర. 3 లలవడఁ బాచి ము
డివెట్టె. 4 చుట్టి...గట్టి. 5 జెలఁగెఁ, 6 పతాకంబు.

సన్నిధి సేసిన సవినయంబుగాఁ గైకొనియె నక్కుమారుండును నాయితం బై
నొగ లెక్కి పగ్గంబు లమర్చికొని యగ్గలికతోడం దురంగంబులయంగంబులు
దొడయుచు వానిజవసత్త్వంబులు వేఱువేఱ వర్ణించిన. 170

అర్జునుఁ డుత్తరసారథికం బైనరథం బెక్కి దేవదత్తంబు పూరించుట.

చ. తడ వగుదెంచె జమ్మికిఁ బ్రదక్షిణవృత్తిగఁ దేరు వోవ ని
మ్మెడ గలుగంగఁ బోయెఁ బసు లిప్పుడ కూడుద మన్న నాతఁడున్
నడపఁ దొడంగుడున్ మనమునన్ రణకౌతుక ముల్లసిల్లఁగాఁ
బిడుగులపిండు బిట్టులియు [1]పెల్లునఁ బార్థుఁడు శంఖ మొత్తినన్. 171

మ. కలఁగెం దోయధిసప్తకంబు గిరివర్గం బెల్ల నూటాడె సం
చలతం బొందె వసుంధరావలయ మాశాచక్ర మల్లాడెఁ గొం
దల మందెం ద్రిదశేంద్రుపట్టణము పాతాళంబు ఘూర్ణిల్లె నా
కుల మయ్యెన్ గ్రహతారకా[2]కులము సంక్షోభించె నవ్వేధయున్. 172

తే. అపుడు నిశ్చేష్టితంబు లై హయము లవనిఁ, జాఁపకట్టుగఁ బడియె మత్స్యక్షితీశ
నందనుండును నొగలపై వ్రందినట్లు, [3]మ్రొగ్గతిలఁ జాఁగిబలితంపుమూర్ఛఁ బొందె.

చ. కనుఁగొని ఫల్గునుండు దురగంబులవాగెలు వట్టి యెత్తి త
త్తనువులు నూల్కొనన్ నివిరి తత్పరతం దగ మత్స్యభూమిభృ
త్తనయుని నూఁది పట్టి వికృతం బగురూపము చక్కఁ జేసి నె
మ్మన మొకభంగిఁ దేర్చి గరి[4]మంబుగఁ గౌఁగిటఁ జేర్చి యి ట్లనున్. 174

తే. శంఖభేరీరవంబులు సామజముల, బృంహితంబులు వింతలే పృథులసైన్య
పరిచయోదాత్తు లగునరపాలసుతుల, కెలమిఁ బొందుము దీనికి నింత యేల.

చ. అనవుడు మత్స్యరాజసుతుఁ డాతని కి ట్లనుఁ దొల్లి శంఖని
స్వనములు విందు భేరులరవంబులు విందుఁ గరీంద్రబృంహిత
ధ్వనులును విందు నద్భుతవిధంబుగ ని ట్లవి యెల్లఁ జిత్తమో
హన మొనరింపఁ జాలునె మహానినదం బిది యోర్వ వచ్చునే. 176

చ. చెవు లవిసెన్ దిశల్ దిరిగెఁ జిత్తము నీఱయి పోయె నాకు నీ
రవమున నిమ్మహోగ్రకపిరాజపతాకయుఁ జూడ్కిఁ జీఁకటుల్
గవియఁగఁ గ్రాలెడున్ భవదఖండితతేజము పర్వి యాత్మకున్
వివశతఁ జేయుచున్నయది విహ్వలభావము మాన నేర్చునే. 177

క. అన విని తగుమాటల నా,తనిగొందలపాటు పాండుతనయుండు క్రమం
బున డిందుపఱిచి యరదము, సనఁగా నెఱిఁగించి పట్టె శంఖము మఱియున్.

వ. ఇత్తెఱంగున నయ్యుత్తరకుమారు ధీరుం గావించికొని పాండవవీరుండు రథనేమి
నిస్వనజ్యానాదమేదురం బగుశంఖారవంబు సెలంగ నడచుసమయంబున నాచా

1 బెట్టుగఁ. 2 గణము. 3 మ్రొగ్గడిలఁ. 4 మంబున.

ర్యుండు దుర్యోధనున కిట్లనియె. 179

సీ. శ్రవణపుటంబులు వ్రయ్యంగఁ దాఁకి సం,క్షోభంబు [1]గావించె గుణముమ్రోఁత
బ్రహ్మాండభాండంబు వగిలించి భూతని,శ్చైతన్య మొనరించె శంఖరవము
గగనభాగం బెల్లఁ గప్పి క్రాలుచు బెగ,డడరించె నుగ్రంపుఁబడగపఱపు
మిఱుమిట్లు గొని చూడ్కి పఱివోవ వెలిఁగి ప,రిభ్రాంతి సేసెఁ గిరీటకాంతి
తే. తెల్ల మిది గాండివంబును దేవదత్త, మును గపిధ్వజమును వాసవునివరముఁ
గన్నమకుటంబు నగు వేఱకొన్ని యైన,నుజ్జ్వలాద్భుతభంగులై యున్నెయిట్లు.

ఉ. అచ్చెరు వైనవిక్రమమునగ్గలికన్ సమరంబు గోరి యీ
వచ్చుచు నున్నవాఁడు బలవద్రిపుభీషణ[2]బాహుఁ డైనవి
వ్వచ్చుఁడ యింక మిన్నక వివాదము సేసినఁ బోవ దియ్యెడం
బొచ్చెము లేనిబల్మిగలఁ బోరి కమర్పుము దర్ప మేర్పడన్. 181

వ. అని కృపాశ్వత్థామాదియోధ[3]ముఖ్యుల నవలోకించి. 182

క. మన మొనల దుర్నిమిత్తము, లనేకములు వుట్టఁ దొడఁగె నట్లగుట జయం
బనుమానం బొకకార్యము, వినుఁడా మీ కెల్లఁ జూడ వెర వగు నేనిన్. 183

ఉ. ముందర రాజుఁ బుచ్చి జలముల్ గలయంబడి గోవ్రజంబులన్
దందడివెట్టకుండఁ బిఱుఁదన్ నడపింపఁగఁ బంచి గట్టిమై
నందఱు నింతకున్ వెనుకయై మొన లేర్చి చనంగ నెప్డు సం
క్రందనసూతి డగ్గఱియెఁ గయ్యము సేయుట కప్పు డిమ్మగున్. 184

వ. అనినవిని సుయోధనుండు భీష్మ కృప కర్ణ వికర్ణులదెసం గనుంగొని [4]మున్ననుం జెప్పితిన కాదె జూదంబునం బరాజయం బొంది పాండునందనులు పండ్రెండు వత్సరంబులు వనంబున వసియింపను బదుమూఁడగునేఁడు జనపదంబున మన మెఱుంగ కుండఁ జరియింపనుం బూని కాదె భూమి వెలువడిరి యీపదుమూఁడవయేఁటి కొలంత గలుగం బార్థుండు దన్నెఱింగించికొనియె నేని నెప్పటి యట్ల వనవాసంబునకుం జన వలయు [5]నిది మనము మోహంబునం గానమి నొండె వారు లోభంబున వచ్చుట నొండె నగుం గావున నెక్కువదక్కువలు నిరూపించి భీష్ములు దీని నిశ్చయింప నర్హులు రిత్తయుత్తరుండ కాక గాండీవియు నగుట మనకార్యంబు సఫలంబు సుశర్మ నక్కడ గోవులం బట్టం బనిచి యిక్కడ మనమును బట్టుట మత్స్యనగరంబునం గౌంతేయు లున్నవారని శంకించి వారలు గూయివచ్చినం గనుటకుం గాదె యిట్లు నిశ్చయించి చేసినపనికి నిపుడు విచారం బేల యని పలికి వెండియు నిట్లనియె. 185

ఉ. అర్జునుఁ డైన నేమి సుర లైనను నే మగు విద్విష[6]చ్ఛిదో

---

1 నొందించె...ది,గ్భ్రాంతి సేసెఁ గిరీటకాంతిసొంపు. 2 రోషు. 3 వీరుల. 4 మున్న చెప్పితిం గాదె. 5 నది...గానమి యొండె...వచ్చుట యొండెఁ గావఁయుం గావున ..గాండీవియు వచ్చుట. 6 చ్ఛిరో.

పార్జిత మైనగోగణముఁ బట్టితి మెవ్వరు వచ్చి రేని వి
స్ఫూర్జితబాహుసంపదలు సూపుద మొండొరు మీఱి నిర్మలా
త్యూర్జితకీర్తికారణరణోద్ధతి వెల్వెలఁ బాఱ నేటికిన్. 186

చ. [1]మనసుల నూలుకొల్పి యనుమానము లెల్లను బాచి యేచి వా
హనములు నాయుధంబులును నాయిత మయ్యెడుభంగిఁ జేయుచున్
మొనలకు హెచ్చుగా మనము మున్న గడంగినఁ గాక శత్రులం
గనుఁగొని యిట్లు లొండొరుమొగంబులు సూచుచు నున్నఁ బోవునే. 187

దుర్యోధనుఁడు ద్రోణాచార్యుల నధిక్షేపించుట.

ఆ. హరులహేషితములు ననుకూలవాయుసం, చారములును మనకు జయముకలిమిఁ
దెలుపు చున్నయవి యుధిష్ఠిరానుజుఁ డొక్కఁడ, డీబలంబు గెలువ నెట్లు నేర్చు.

క. ఎవ్వరు వినినను దీనికి, నవ్వుదు రని యెఱుఁగఁ డకట నాయెదు రెదురన్
వివ్వచ్చుఁ జూపి సేనలు, గ్రొవ్వఱఁ బలుపలుకు లిట్లు ద్రోణుఁడు వలికెన్. 189

తే. రోష మొండెను రాజ్యాభిలాష మొండెఁ, గాక యీతనిరాకకుఁ గారణంబు
[2]పెఱయెఱుంగమ యెదిరిని బెద్దఁ జేసి, పూని వందివిధంబునఁ బొగడ నేల. 190

వ. [3]ఆచార్యులైనవారలు కార్యంబు దవ్వులం గనియెడువారు గాన కయ్యంబు తెఱంగువారల నడుగ వలవదు బుద్ధిమంతు లిండ్లకడనుండి భోజనావసరంబుల నాయుధశ్రమసమయంబుల నీతిశాస్త్రగోష్ఠీకాలంబుల నుచితాలాపంబులు వలుకుదురుగాని పోట్లాడెడువారు గారు వారిం గలనం గలసి నిలువనీక పిఱుంది దెస నిలిపిన మనకు వారు విజయంబు గోరుచుండుట లెస్స యనిన విని యశ్వత్థామ యతని కిట్లనియె. 191

ఉ. కావలివారిఁ దోలి యొసకంబున గోవులఁ [4]బట్టికొంటి నం
చీవెడమాట లేల ధరణీశ్వర యుద్ధతకు మున్న వీటికిం
[5]బోవవు శత్రునే పుడిపి పోయెడువాఁడవు గావు నీవు సై
న్యావలి నైనఁ జేడ్పడక యాతల కెయ్దుట లేదునేనియున్. 192

క. సమరమున గెల్చి యొరురా, జ్యము గొనియును సుజనుఁ డిట్టు[6]లాడఁడు సిరి జూ
దమునఁ గొని రజ్జు లేటికి, సమయం బరుదెంచెఁ దొంటిచందము గలదే. 193

ఉ. పాండవవీరులం గలన బాహుబలంబున నోర్చియే సము
ద్దండత నీవు దొల్లి ద్రుపదక్షితిపాత్మజుఁ గొల్చ్వాలోనికిం
దెం డని పుచ్చి తద్దెసకుఁ దెచ్చుట సౌబలునీతిఁ గాదె యా

---

1 మనముల...నుబ్బగా మనము...నుండఁబోలునే. 2 బీర మెఱుఁగమి. 3 ఆచార్యులు దవ్వులఁ గార్యంబు తెఱంగుఁ గనియెదు...కయ్యం బిచ్చు తెఱంగు విజయంబు (గోరుచుందు రది; గోరుట; గోరుదు రది) లెస్స. 4 దెచ్చికొంటి. 5 బోవవి...బాల్పడక యాతల (కేదుట) లేదయేనియున్. 6 లాడునె.

తండ మరల్పుఁగాక సముదగ్రత వచ్చువిరోధి నిప్పుడున్. 194

వ. అబ్బంగి నవమానింపంబడినవాఁ[1]డు గావున ధార్తరాష్ట్రకులధూమకేతు వగు కపికేతనుండు దోఁచె నీకు దుర్మదంబున ద్రోణాచార్యుల నధిక్షేపింప వచ్చు నంతియకాక దేవదానవుల కయినను దుర్జయుం డగునర్జునునకుం దలసూప వచ్చునే నయవిక్రమంబుల నతిలోకుం డగునతని నెవ్వరి కేనియుం బొగడ వలయు ననినం బుత్రనిర్విశేషుం డగునిజప్రియశిష్యుని నగ్గించుట గురునకుం గొఱంతయె యింక సిగ్గుమాలి రణంబు సేసెనేనియు ద్రోణుండ సేయుం గాని యే నిట్టిదాని కోర్వ నదియునుంగాక. 195

క. ప్రళయాంతకుండు బడబా, నలమును మృత్యువును నెదిరినం గొఱఁతవడక్ నిలిపినను నిలుపు మార్కొని, చెలఁగిననరుశరము [2]లనవశేషము సేయున్.

ఆ. కుటిలబుద్ధు లిచటఁ గొనవు నెట్టన ఘన, దోర్బలంబు మెఱసి తొడర వలయు నతఁడు గాండివమున నడ్డసాళులు వైవఁ,[3]డురుల నంపవాన గురియుఁ గాని.

క. విను మట్టులు గా కున్నం, దనగోవులవెనుక మత్స్యధరణీశుఁడు వ చ్చిన [4]మార్కొందుము నరుఁ డేఁపున ముట్టిన నతనిపొంతఁ బోదుమె యధిపా.

వ. అనిన విని రాధేయుండు సక్రోధుం డై యోధవీరలోకంబు నాలోకించి. 199

చ. వడిగొని గోగణంబుఁ బొదువం బఱతెంచితి రెల్లవారు ము
న్నొడఁబడి పాండునందనులయున్నెడ యిమ్మెయిఁ గాన వేఁడి యి
ప్పుడు నరుఁ గాంచి మీ రతనిపోటు నుతించుచు భీతి నిట్లు [5]వా
విడిచి యనేకభంగిఁ బృథివీపతి పేఱిఁడిఁ జేయు టొప్పునే. 200

చ. వెఱచితి రేని నిల్వుఁ డొకవీరున కొక్కఁడ చాలుఁ గాక యెం
దఱు వలయుం గపిధ్వజము దవ్వుల వ్రేల్మిడిఁ ద్రుంచి వైచెదం
బఱపెదఁ దత్పిశాచముల భగ్నముసేసెదఁ దేరు సారథిన్
నెఱఁకులు నొంచెదం బొదులు నించెద నర్జునుగాత్ర[6]శాలలోన్. 201

శా. జ్యాఘోషం బతిభీషణం బయి దిశాచక్రంబు నిండన్ శర
వ్యాఘాతంబున శాత్రవుండు వికలస్వాంతుండు గా నారద
శ్లాఘాపాత్రము నై యనర్గళభుజాసంరంభతన్ రౌద్రరే
ఖాఘోరాకృతి యేన [7]చూపెద నశంకం జూడుఁడీ యేర్పడన్. 202

క. క్రోధజ్వాలలు నిగుడ వి, రోధిబలేంధనముఁ బొదువుక్రూరత మై దు
స్సాధ మగునర్జునాగ్నిని, సాధించెద [8]నేన పూని శరవర్షమునన్. 203

వ. పాండవమధ్యముండు పదుమూఁడువత్సరంబులు పూఁచి పట్టి కయ్యంబునకు వచ్చె నతనిలావును బీరంబును లోకంబునకు నెక్కి యున్నయవి యేనును గురు

---

1 వాఁ డగుటంజేసి ధార్త...కపికేతువు. 2 నిరవశేషము. 3 డరుల. 4 మార్కొందము. 5 వో విడిచి...జేయఁ బాడియే. 6 శాలలన్. 7 చూపెదను జక్కం. 8 నేన యనిని.

సేనయందు శక్తిశౌర్యంబులు గలవాఁడనపోలె వర్తించెదం గావున నే మిరువురము నొండొరులకు బాహుబలవిలాసంబును విక్రమక్రీడాకౌశలంబును బ్రకటించుట యుచితంబు గాదె యని వెండియు ని ట్లనియె. 204

సీ. అనుదినంబును నంత కంతకుఁ [1]బెరిఁగెడి, యధిపతిమన్ననయప్పు దీర్ప
నర్జును నోర్చెద ననిలోన నే నని, యతనితోఁ బలికినప్రతిన నెఱపఁ
గర్ణార్జునులయందు ఘనుఁ డెవ్వఁడగునొక్కొ,యనుజనంబులసందియంబు మాన్ప
జమదగ్ని సుతుకృపాశ్రయమునఁ బడసిన, విలువిద్యగలరూపు వెలయఁజేయఁ
ఆ. గనుట నేఁడు పుణ్యదిన మయ్యె నాకు మీ, కెల్లఁ బోరు సూడ నిష్టమేనిఁ
జూడుఁ డట్లుగాక వేడుక లేదేని, సంతసమునఁ బసులఁజాడఁ బొండు. 205

వ. అనిన నమ్మాటలు విని కృపాచార్యుం డతని కి ట్లనియె. 206

ఆ. కయ్యమునక యెపుడుఁ గాలుద్రవ్వుదు కార్య,గతికిఁ జొరవు నీతియుతులు సమర
మధమసాధనముగ నాడుదు రర్థసం, సిద్ధిఁ బొందు తెఱఁగు సేయునెడల. 207

క. అగు దేశకాలబలయుత, ముగఁ జేసినపోర నర్థములు మోఱకులై
తెగఁబాఱి తమ్ము నెదిరిని, వగవక తొడరుటలఁ గీడు [2]వర్తిల్లుఁ దుదిన్. 208

వ. అక్కిరీటి యొక్కరుండ కాఁడె యని తలంతుమేని. 209

సీ. శక్రాదిసురులతో సంగ్రామ మొనరించి, ఖాండవం బేర్చె నొక్కరుఁడ కాఁడె
యాదవబల మెల్ల [3]నాఁగఁ ద్రోచి సుభద్రఁ, గడిమిమైఁ దెచ్చె నొక్కరుఁడ కాఁడె
దిగ్విజయంబునఁ దేజంబు సేసె ని, క్కురువంశమునకు నొక్కరుఁడ కాఁడె
బలముతో గంధర్వపతి నోర్చి విడిపించెఁ, గౌరవేశ్వరుని నొక్కరుఁడ కాఁడె
ఆ. యని నివాతకవచులనుదానవుల నాతఁ, డొక్కరుండ కాఁడె యుక్కు మడఁచె
నమరులకు నజేయు లగుకాలకేయుల, నొక్కరుండ కాఁడె యొడిచెఁ గర్ణ. 210

క. భూవరు లెల్లను నొక్కట, ద్రోవదికై తొడరి యతనితోఁ బెనఁగి కడుం
జేవ సెడి పోవు నప్పుడు, నీ వచ్చటఁ గలవొ లేవొ నిక్కము చెపుమా. 211

శా. కుంతీనందను లొక్కఁ డొక్కఁడ రిపుక్షోభంబు సంధిల్ల దు
ర్దాంతస్వైరపరాక్రమంబులు మహోత్సాహంబునం జేసి ర
త్యంతోదగ్రతఁ బల్కెదీ విచట బాహాశక్తి యిమ్మేదినీ
కాంతుం డియ్యకొనంగఁ [4]బూనితి వృథాగర్వంబు నీ కేటికిన్. 212

తే. ఏచి మున్నీరు సేయీఁత నీఁద నగ్ని, నుఱుక వాసుకికోఱలు వెఱుకఁ గడఁగి
నట్లు గాదె రాధేయ నీవర్జునునకుఁ,బోర నెక్కటి మార్కొనఁబూను టరయ.

క. బలుగాలిఁ బేర్చుదావా, నల మొక్కరుఁ డార్పఁ బోయినను దీఱునె నీ
చల ముడుగు సాహసమునం, గల దే మె ట్లు నధిపుఁ గావఁగ వలదే. 214

---

1 నెక్కుడు, నధి...మీ, కేల పోరు. 2 వాటిల్లుఁ. 3 నాఁగి త్రోచి...యుక్కు మడిచె.
4 జూపుము; జూపితి; జెప్పితి.

తే. కురువిభుండును భీష్ముండు గురుఁడు గురుత,నూభవుండును నీవు నేనును గడంగి
కూడుకొని తాఁకుదము గాక క్రీడితోడ, నొంటి మార్కొన వశమె ముక్కంటికైన.

కర్ణుఁడు కృపాచార్య నధిక్షేపించి పలుకుట.

క. అని పలికిన సంరంభం,బున నినసుతుఁ డిట్టు లను రిపులయెడఁ జిత్తం
బున నీవు ప్రియము గలుగుటఁ, గని కని నినుఁ దోడు పిలువఁగా బతి బేలే.

క. ఏలినవానిధనంబులు, బాలురు బంధువులుఁ దారు బ్రదికినదినముల్
[1]వేలారిచి తిం డ్రాతని, యోలము గని పిదప భీతి నొదుఁగుదు రాజిన్. 217

క. జన్నములు సేయునెడఁ బ, క్వాన్నంబులు గుడుచు [2]చుండు మధిపతి నిన్నున్
జన్నియ విడిచె రణముతఱి, మిన్నక కినువడక పొమ్ము మీగృహమునకున్. 218

తే. ఏను విల్లందుకొనిన నీరేడుభువన, ములును వడవడ వడఁకు నాయలఘుబాహు
బలముఁ దలఁపక పలికితి పార్థుఁ డనఁగ, నెంతవాఁ డొక్కరథికున కింత యేల.

వ. అనియె ని త్తెఱంగున నందఱుఁ బలుకుపలుకు లెల్ల వినుచు గాంగేయుండు
గౌరవేశ్వరు నుద్దేశించి ధర్మార్థసంగతంబును సువిహితంబునుగా నిట్లను ద్రోణా
చార్యుండు నీతిపథంబునం బలికె నాచార్యతనయువచనంబు లుచితంబులు కృపా
చార్యుం డాడినచందంబును దెఱంగు వడియున్నయది మన్నన గలమానిసి
యగుట నంగరాజునకు సంగరపాటవంబుమాటలు దగుం గాక మాన్యుల నధః
కరింప నగునే యని వెండియు. 220

ఆ. నేల ప్రొద్దెఱింగి చాలుమానిసి రణో, ద్యమ [3]మొనర్చి కాక తగినవారి
చెవికిఁ జేదు గాఁగ నవమానవాక్యంబు, లుడుగ కిట్లు వలుకు టొప్పునెట్లు.

క. బీరము లావును [4]మిగులఁగ, వైరులు దఱి యైనఁ దొడర వచ్చినచోటన్
దూరమున వెరపుతోడివి, చారము గలుగుటది దగదె సద్బుద్ధులకున్. 222

ఆ. అరులగుణము లైన నగ్గింతు రెప్పుడుఁ, [5]గలయ బెరసినపుడు గలితనంబు
మెఱయుదురు మహాత్ము లెఱుఁగఁడు తుదిమొద, లెట్టివారి నితఁడు బెట్టు పలుకు.

వ. ఆచార్యులైనవారలు పూజావాక్యంబుల కర్హులు గాక గర్హించుటకు విషయంబె
యనుచుఁ గృపాశ్వత్థామలకరంబులకు నిజపాణిపుటంబులు సాఁచి యిట్లనుఁ బని
పాలినంత గలదు వివ్వచ్చుండు వచ్చుచున్నవాఁడు విరోధంబునకు సమయంబు
గాదు మన మందఱముం గూడికొని కయ్యంబు సేయుదము బలవద్వ్యసనంబు
నందు భేదంబు గలుగుటొప్ప దని బుధులు సెప్పుదురు వేదంబు లొక్కవలనను
ధనుర్వేదం బొక్కవలనను గలమీయట్టిమహానుభావు లెందునుం గలరె కురుబ
లంబున [6]కొకటి వుట్టినం బ్రసిద్ధులరు గావున నదిమీతలన నిలుచునట్లగుటం జేసి.

క. క్షమియింప వలయు నొకఁ డెఱుఁ, గమి నేమే నన్న నంతఁ గటకటఁబడి భూ

---

1 మేలనుకొని..., మే లరసి తిందు రాతని. 2 చుండ నధిపతి...కినుక వడక చను. 3 మొనర్చుఁగాక. 4 గలిగెడు, వైరులు పో టొడ్డి తొడర...సద్భటులకునున్. 5 గలన. 6 కొకకీడు.

రమణునికార్యస్థితి చి, త్తములం దెడ సేయునట్టితరమే [1]మీరల్. 225
వ. అనిన విని వార లి ట్లనిరి. 226
క. క్షమియింప నెవ్వరము భూ, రమణునికార్యమున కెవ్వరము ద్రోణులచి
త్తము శాంతిఁ బొందఁ జేయుట,మముఁ దెలఁచుటయిట్టు లేల మాకొలఁదులకున్.
వ. అనిన విని గాంగేయకర్ణులం గూర్చికొని కురుపతి గురునిం బ్రార్థించి యశ్వ
త్థామను వేఁడికొని కృపాచార్యులం దేర్చినం బ్రసన్నుం డయి యోధవీరులం
గలయం గనుంగొని ద్రోణాచార్యుం డి ట్లనియె. 228
తే. అలుక భీష్ముని[2]పలుకులయపుడ పోయె.మీఁదికార్యంబు నడపుఁడు మీర లింక
మోహసాహసములఁ గురుముఖ్యుదెసకుఁ,గీడు రాకుండఁ దగఁ బరికింపవలయు.
క. వాసవనందనుఁ డెంతయు, గాసిలి యున్నాఁడు మనలఁ గని యించుకయుం
దా సైరణ సేయఁడు గను, మోసము లేకొక్క మొగిన [3]మొనరఁగవలయున్.
వ. అప్పుడు కురుపతి సమయకాలవిషయంబుగా నాడినమాటయుం గలదు దాని
నిరూపించి యున్నరూపు గాంగేయుండు సెప్ప నర్హుఁ డనిన నతండు దుర్యో
ధనున కి ట్లనియె. 231

భీష్ముఁ డర్జునునజ్ఞాతవాసవత్సరవ్యాప్తి నిష్కర్షించుట.

సీ. రెండవయేఁట నొక్కండు దధిమాస మి, ట్లొక్కనయన్నెల లెల్లఁ గూర్చి
కొనఁ బదుమూఁడు హాయనములు దప్పక, నిన్నటితోడన నిండె నింత
యెఱిఁగియ తమప్రాన్కయెల్లను దీర్చితి, మని పొడసూపె నర్జునుఁడు నేఁడు
పాండుపుత్రులు ధర్మపరులు ధర్మాత్మజుం, డేరి కధిష్ఠాత వారు ధర్మ
తే. పథము దప్పుదు రే యన్నిపాటు లట్లు, పడినవారలు దఱియంగఁ బాఱ నేర్తు
రెట్లు దమకించి నీతివిహీనవృత్తిఁ, దమకు నొకకీడు వచ్చువిధంబు గాఁగ.
ఉ. అట్టిద యైన నాఁడ తఱియంబడి మూర్ఖతనంబు సేయరే
నెట్టన ధర్మపాశముల నిచ్చిరి కాలము వేచి యుండి రిం
కెట్టును[4]వారు గొంత తమయేడ్తెఱ సూపక మాన నేర్తురే
ముట్టఁగ వచ్చి రేని మనముం దగ నోర్తము గాక దానికిన్. 233
ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగ రాదు రా
లచ్చికి నైన పెనంగినబలంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చుగుఁ గుం దగుం దొడరు టెల్లవిధంబుల [4]కోర్చు టట్లు గా
కిచ్చఁ దలంచి యొక్కమెయి నిత్తఱిఁ బొం దగుచేఁతయుం దగున్. 234
వ. అనిన విని కురుపతి దరహాసితవదనుం డగుచు ని ట్లనియె. 235
ఆ. మనకుఁ బాండురాజతనయవర్గమునకు, నెట్లు పొందు [5]గలుగు నేను రాజ్య
భాగ మీను సమరభంగిక విక్రమ, నిరతిఁ బూను టిదియ నిశ్చయంబు. 236

---

1 మీపుణ. 2 పలికినయపుడ. 3 మూఁగఁగ వలయుణ. 4 కోర్చుఁ డట్లుగా. 5 పొసఁగు.

వ. అనిన నయ్యిరువురవచనంబు లాకర్ణించి గురుం డిట్లనుఁ గార్యగతియును గయ్యంబు భంగియు భూపతికంటె మిగులం గనియెడువారు లే రయినను నా యెఱింగిన యంత నొక్కతెఱంగు సెప్పెద నీబలంబున నాలవపాలు గొని మహీపాలుండు సత్వరంబుగా ముందర పోవ వలయు నంతియ సేన తదనంతరంబ కదుపులం బొదివికొని చన వలయుఁ దక్కటిసగంబుతో మనము నిలిచి మోహరించి యల్లనల్ల నరుగ వలయుఁ గవ్వడి యెయ్యెడం గవిసె నయ్యెడన తలపడ వలయు నిట్లైన మానవేశ్వరుండు సురక్షితంబుగా నందడిం బడక నడచు గోవులు [1]నిన్నెలం గడచు మనమును ధనంజయునకుం జాలినయప్పుడ యట దోడుపడ నెవ్వరు గలిగినను వారికిం జాలి నిలుత మనిన విని సురనదీసూనుండు దాని కియ్యకొని రాజన్యునకు సైన్యంబు బంచి యిచ్చి పుచ్చి పసులకుం దోడగుభాగంబునుం బంచి యున్నంత వట్టు చతురంగంబుల నియతి సేసికొని యాచార్యుండు నడుమను గృపాచార్యుండు వలపటను నాచార్యపుత్త్రుండు దాపటం గర్ణుండు ముందట వికర్ణ దుశ్శాసన శకుని సైంధవ సోమదత్త బాహ్లిక భూరిశ్రవః ప్రభృతియోధవీరు లెల్ల నెడ నెడం గలయ నిలుచు నట్లుగా మోహరించి మహోత్సాహంబున సన్నాహసౌందర్యంబు నొంది తాలధ్వజం బెత్తించి మెఱసి తాను వెనుక యయి నడపించుచుండె నట్టి సమయంబున. 237

చ. అరుదుగ నిట్టు లొక్కనికి నంతబలంబునకున్ మహోగ్రసం
గర మగుడున్ మనం బతులకౌతుక మొంది కనుంగొనన్ సురే
శ్వరుఁడు సుదర్శనం బనఁ బ్రశంసకు నెక్కువిమాన మెక్కి యం
బరగతి వచ్చె దేవమునిపంక్తులు సిద్ధగణంబుఁ గొల్వఁగాన్. 238

వ. అద్దివ్యయానరత్నంబునందు. 239

తే. స్వర్గమున నున్న రాజులుఁ జక్రవర్తు, లును[2]యథోచితచ్ఛత్త్రంబులును నిజార్హ
చామరంబులుఁ జెలువొందఁ జారులీలఁ, గొలిచియుండిరి వేడ్కలుగొనలునిగుడ.

క. పాండుమహీపాలుండా, ఖండలుచేరువన పెద్దగద్దియ నమరీ
మండలి వీచోపు లిడఁగ, నుండి కనుంగొనుచు నుండె నుజ్జ్వలభంగిన్. 241

వ. అంత. 242

సీ. దేవదత్తాభీలరావంబు వెసఁ [3]గర్ణ, ముల దీటుకొన లేటమొగము వడుచు
రథనేమిదళితధరాధూళి యంగంబు, లెల్లఁ గప్పఁగ వెలువెల్ల నగుచు
బహుళకపిధ్వజప్రభలు లోచనములు, మిఱుమిట్లు గొనఁ బర్వ మేదుపడుచు
నుద్భటాకారసముద్ధతి మనము లు, త్తలపాటు దోఁపంగఁ దల్లడిలుచు

1 నిన్నెలవు...జాలుద (జాలితి; జాలింత) మనిన. 2 నిజోచితచ్ఛ. 3 కర్ణ, ములు... వెలవెల్ల...బర్వ మెందుకొనుచు...లు, త్తలపడఁ.

తే. నడచుకౌరవరాజసైన్యంబుఁ గదిసెఁ, దీఁగ దిగిచినగతిఁ దన తేరు మెఱయ
రయముమైఁ జని ప్రళయభైరవసహస్ర, [1]గర్జనోదగ్రతర్జనుఁ డర్జునుండు. 243

వ. ఇవ్విధంబునఁ గురుబలంబులఁ [2]గ్రోశద్వయంబునం గూడ ముట్టి క్రీడి తల యెత్తిచూచి యుత్తరున కిట్లనియె. 244

చ. ఇది యొకపెద్దగట్టిమొన యీమొనముందట గోగణంబుతో
నదె యొకయల్పసైన్య మట [3]యాతల వే ఱొకకొంతసేన య
ల్లదె యిటు వంచి పెట్టఁ జనునంతటిలోన వృథాభిమానదు
ర్మదబహుభాషి యైనకురురా జెచటం జనుచున్నవాఁడొకో. 245

క. అరయుదము గాని యిమ్మో, హరమునకును డాపలించి యరదముఁ బో ని
మ్మురవడి నతనిక యుఱికెద, నరుదుగ నెబ్భంగి నెవ్వ రడ్డం బైనన్. 246

ఉ. ఆతఁడు సిక్కెనేని బల మంతయు విచ్చు మరల్ప వచ్చు గో
వ్రాతము [4]నట్ల యైన సుకరంబుగ నంతట నెల్లఁ దీఱు నీ
యాతతసేనయం దతని నారసి కానక యున్న వీరి ని
ట్లీతల డించి యాకదుపు నెయ్యఁగఁ బోదము గాక వ్రేల్మిడిన్. 247

క. విచ్చి చన కుండఁ బసులం, దెచ్చుట మునుమున్న వలయు తెఱఁ గాపనికిం
జొచ్చి యది చక్కఁ బెట్టఁగ, నచ్చోటన దాయ మనకు నగపడెడు బలే.

క. అనిన విని యుత్తరుం డ, మ్మొనవలపటఁ బెట్టి యరదమును బోవఁగ ని
చ్చిన సరస కరిగి కవ్వడి, కను విచ్చి బలంబు నెల్లఁ గలయఁగఁ జూచెన్. 249

వ. ఇట్లు గలయం గనుంగొని మధ్యదక్షిణవామాగ్రపశ్చిమోత్తరభాగంబుల నిట్టిట్టివారలు నడచు చున్నవా రని సారథితో నేర్పడం బలికి వీరలలో నురగకేతనుండు లేఁ డతండు గోవులం గొనిపోవనోపు [5]నిరామిషం బైనయీసేనతో నని సేయం బని లేదు వీర లెయిది యడ్డపడి తడవు సేయకుండునట్లుగా ముట్టికొని పసులఁ బెట్టించి దొరయును నెల గడవం బోవక యుండఁ బోదువ వలయు నని చెప్పి యతని నద్దెసకుఁ దేరు వఱుపం బనిచి గురుకృపగాంగేయులకుఁ జరణసమీపస్థలంబుల నిలువ రెండును గర్ణాభ్యర్ణప్రదేశంబులం జన రెండునుగా నాలుగేసి యమ్ము లేసిన నాసవ్యసాచిం జూచి యాచార్యుండు పరిసరవర్తు లగునాప్త జనంబులతో నల్లన యర్జునుం డింత యొప్పి యుండునే యని యగ్గించి వెండియు.

ద్రోణాచార్యుఁ డర్జునుం జూచి ప్రశంసించుట.

మ. విలసద్గాండివచాలనోద్ధతి గనద్విద్యుల్లతాలీల గా
నలఘుస్ఫారకపిధ్వజధ్వని సముద్యద్గర్జచందంబు గా

1 గర్జనోగ్రతర్జనుఁ డగునర్జు. 2 క్రోశద్వయమాత్రంబునం. 3 యావల...జనె నన్నిటిలోన. 4 (నట్టు లైన) సుకరం బగు. 5 నిరామిష యైన ... వీ రియ్యెడనె యిది ... దొరయును గడవం.

జలదాకారత [1]నొందెఁ దేరితఁడు పర్జన్యాకృతిం బొల్చె దో
ర్బలతీవ్రారినిదాఘదుర్విషహగర్వస్ఫూర్తి నిర్మూర్తిగాన్. 251

వ. ఇప్పుడు నాకుఁ బ్రణామంబులుగాఁ బాదంబులమొదలం బడ రెం డమ్ము లేసి పెద్దకాలం బేనిఁ బాసి యున్నవాఁడు గావునఁ గుశలప్రశ్నంబుగాఁ జెవులు సోఁకియుం జోఁకములుగా రెం డమ్ము లేసె నని పలికి వెండియు నిట్లనియె.

క. ఇడుమలఁ బడుమూఁ [2]డేండ్లుం, బడి కడుఁ గోపించి వచ్చె బలువిడి నీక
వ్వడి దఱియ నుఱికి వడి ని,ప్పుడ యిమ్ములుప్రోవు నెల్లఁ బొరిగొనెడు బలే.

తే. విపినవాసంబు నజ్ఞాత[3]విధమువర్త
నంబు గడపి నవాభ్యుదయంబు నొంది
రాత్రిఁ బుచ్చి తోతెంచుమార్తాండుమాడ్కిఁ
జూడ నుజ్జ్వలుఁ డగుచు నర్జునుఁడు వొలిచె. 254

వ. అనియెఁ గృపాచార్యభీష్ములు పార్థబాణపాతప్రకారంబులు ప్రణామకుశలప్రశ్నంబులుగా నంతరంగంబులం గనికొని సంతసిల్లిరి ధనంజయుండును దక్కినవారికి దుర్నిరీక్ష్యుం డగుచు నమ్మోహారంబుదెస ననాదరంబు సేసి గోవుల పజ్జం బోవు చుండె నతనిం జూచి సురనదీసూనుండు కురువీరులతో నిట్లనియె.

క. చిరకాలమునకుఁ గంటిమి, నరు నక్కట వీఁడు సజ్జనప్రియుఁడు సుహృ
త్పరతంత్రుఁడు బాంధవహితుఁ, డరిభీకరుఁ డిట్టివార లవనిం గలరే. 256

క. మనచూడ్కికి వ్రేఁగయి యీ,తనియతులితమూర్తి యత్యుదాత్తతఁ గడునొ
ప్పినయది గంటిరె జగ మె,ల్లను నేలఁగఁ దగుసముజ్జ్వలత యూహింపన్.

క. వెనుకదెస వచ్చి కదిసియుఁ, దనరథము దొలంగ నిచ్చి తఱియఁ బడుట కొ
ల్లనితలఁపు గలిగి క్రేఁగం,టన మనలం జూచుచుం గడచి యట నడచెన్.

క. మొనఁ గలయఁ జూచి యూరక, చను టధిపతి నరసి తా నిచటఁ గానక యా
తనిపజ్జ నరుగు తెఱఁ గగు, ననుమానము లేదు క్రోధ మగ్గలము మదిన్. 259

చ. మనకును గౌరవేంద్రునకు మధ్యముఁ జొచ్చినయేని నాతఁ డ
ర్జునునకు [4]నొంటి సాలఁ డని రుద్రుఁడు నెక్కటి మార్కొనంగ లేఁ
డనిన నొరుండు శక్తుఁడె రయంబుమెయిన్ మన మెల్ల నిప్పు డా
తనికడ సేరఁగాఁ జనుట దప్పినఁ గార్యము దప్పు నెంతయున్. 260

ఆ. వాసవాత్మజుండు వసుధేశనందను, ముట్టికొనిన నొకటి పుట్టెనేని
మనప్రయోజనంబు మఱియేమి పసు లవి, యేటి కొండుధనము లెల్ల నేల. 261

వ. అని పలికి *బలంబుఁ బురికొల్పికొని యతండు రాజరక్షణతత్పరత్వంబున నర

---

1 నొప్పెఁ...స్ఫూర్తి (ను) మనూర్మూర్తిగాన్. 2 డేఁడులు, వడి... యి మ్ములుఁ బ్రోవు (మ్మఱి ప్రోవు). 3 వివిధవర్త. 4 నొంటిఁ జాలఁ. * 'బలంబు' (కొన్నిప్రతులలో లేదు).

దంబు సత్వరంబు సేసిన [1]సేనాపతిం గని సైనికనికాయంబులుం గడఁగి చనం దొడంగె నిప్పాట నమ్మేటిమొనయును వెసం బోవ గోవులకావలిమూఁకయు వానిం దఱిమికొని యతిరయంబున నరుగం దానును గెలనఁ గ్రోశద్వయమాత్రంబు నడచి పురుహూతపుత్త్రుం డుత్తరున కిట్లనియె. 262

మ. ఇదె గోవర్గము సేర వచ్చితిమి పో నిం కేల సైన్యంబులుం
గదియన్ వేచను దెంచె రెంటినడుమం గాఁ జొచ్చి యీవచ్చును
న్మదవీరావలికిన్ భుజావిభవవిన్యాసంబు గాన్పించి మా
న్చెద గర్వంబు మరల్చెదం బసుల నాచేఁ జిక్కు రా జెమ్మెయిన్. 263

యుద్ధారంభము.

క. అనుటయు విరాటతనయుఁడు, మొన కడ్డముగాఁగఁ దూర్పుమొగమై రథముం
గొని కట్టెదిరికిఁ బోయినఁ, దనమూఁపులు రెండు నపుడు దలకుం గడవన్. 264

వ. తేరు సమ్ముఖంబు సేయించి పేరు వాఁడి క్రీడి కరతలం బెత్తి నిలునిలు మని యదల్చిన ఘోషంబుతోడన వెడలు నిశితశరపరంపరల దట్టంపుఁబఱపున నంబరంబు నీరంధ్రం బగుటయుఁ దదంధకారంబును భయతిమిరంబునుం గవిసి గుండియ లవిసి కురుబలంబు లెదురు నడవను మరలం బఱవను మఱచి వెఱచఱచి హరితనయహస్తలాఘవప్రశస్తి దక్కం దక్కినచేష్టలు దక్కియుండె నతండు గోవులవెనుకం బోవు నల్పబలంబు బెదరి తూర్పుదెసకుం [2]జెదరు నట్లుగా నరదంబుఁ బఱపించి తెఱపి సూపి వెలిచీర సారించి దేవదత్తంబు పూరించినం గేతుకపి గర్జిల్లం దదీయభూతంబు లార్వ నార్వరవంబును రథనినదంబును బ్రతిపతాకినీతుములంబును గగనంబునం బొగడునమరులమెలుంగులును నొక్కటఁ జెలంగ సముదితసాంద్రసంరావంబు రోదసీకుహరంబు నిండిన నొండొండ మట్ట లెత్తుకొని నేల మట్టవియుచు నద్రువం బసులు వెసం దిరిగి మున్ను వివ్వచ్చుండు వచ్చినజాడ గైకొని దక్షిణదిశకుఁ గెరలు వొడుచుచుం దెరలం బాఱిన. 265

క. గోవులతోఁ బొదువంబడి, పోవుచు నున్నట్టిగోపపుంజంబు దదీ
యావసరంబున సరభస, మై వానిపిఱుందఁ [3]దిరిగి యమ్మెయిఁ బఱచెన్. 266

ఆ. అప్పు డర్జునుండు దప్పక చూచి యీ, బలము పసుల కడ్డపడక యుండ
నెడ సొరంగ వలయు నిట [4]యెద్దుకొను మని, పనిచె మత్స్యభూమిపాలసుతుని.

క. పనిచిన నాతఁడు నమ్మెయిఁ, జన నిచ్చె రథంబు గోపసంఘముఁ దిరమై

1 సేనాపతి సైనికనికాయంబులం గడచి చనం... గెలపట; గెలనిపట్ల క్రోశ. 2 జేరునట్లు ...విలునారి సారించి...,మంట లెత్తుకొని నేలమ ట్టవిసి యద్రువం...దెరలుపొడుచుచుఁ, జెరలు వొడుచుచుఁ; జిఱ్ఱులువొడుచుచుఁ. 3 దగిలి. 4 యెదుర్కొను మని.

కొని పొందు పసుల నోడక, యని తా [1]నెలిఁగించి వీటికై నూల్కొలిపెన్. 268

వ. అట్టిసమయంబున. 269

క. కరితురగసమితిఁ [2]గార్కొని, కురువీరుల మొనలు మొగులు కొమరునఁ గవియన్
శరవేగంబున నరుఁడు, ద్ధురమారుతచండభంగి దోఁపఁ దెరల్చెన్. 270

క. కదిసినబలములు విచ్చినఁ, గదుపులఁ జెదరంగ నీక గాండీవి వెసం
బొదివి యట కడపె నవియును, గొదగొని తమపొలము సొచ్చె గోపాలురతోన్.

వ. అని చెప్పిన విస్మయంబు నొంది. 272

ఆ. పసులు వట్టువడినపదపడి నరుఁ డెద్ది, యాచరించెఁ గౌరవాధినాథుఁ
డేమి సేసె బలము లెట్లయ్యె భీష్మాది, వీరు లెవ్విధంబువార లైరి. 273

వ. అనవుడు. 274

మ. నవతాదూర పురాణతానుపగతా నానాత్వ సం[3]శోభితా
వివిధత్వాపగమోజ్జ్వలా బహుకళావిర్భావశాలీ సము
ద్భవరాహిత్యనిరూఢ సూక్ష్మతర సంభాసా మహాస్థూలమూ
ర్తివిశేషా నిరుపాధికా గుణమయా ధీవర్తకా నిష్క్రియా. 275

క. అంతఃకరణచతుష్టయ, శాంతిసముద్యద్వివేకసంపద్వేద్యా
చింతాతంతుత్రుటనా, త్యంతవిదగ్ధైకభజనతత్పరహృద్యా. 276

మాలిని. ప్రణమదవనవిద్యాప్రౌఢసంరూఢకాంతి
ప్రణుతచరణపద్మా పద్మజాతిత్యసత్పో
షణచతురదయావిస్ఫారితాలోక లోకా
పణనిపుణజనాంచద్భక్తివిక్రీతమూర్తి. 277

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున విరాటపర్వంబునందుఁ జతుర్థాశ్వాసము.

---

1 నెలుఁగిచ్చి. 2 గా (దా) ర్కొని, కురువీరులు మొగులగములకొమరున ; గూర్కొని ... మొగులు గవియుకొమరున. 3 బోధితా ... సూక్ష్మతరసం (భాషా) భావా ... ధీవర్తనా (నిర్వర్తకా).

శ్రీ

గణేశశారదాగురుభ్యో నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## విరాటపర్వము, పంచమాశ్వాసము.



శ్రీ సంపాదనచాతు
ర్యా సేవ్యపదారవింద యోగికవిద్యో
[1]ద్భాసితమూర్తిమయాత్మ
వ్యాససమానైకరూప హరిహరనాథా. 1

అర్జునుఁ డుత్తరునకు గౌరవవీరుల వేఱువేఱ నిరూపించి చెప్పుట.

దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నివ్విధంబున విరోధివర్గం బుక్కు దక్కి వెక్కసపడి చూచుచుండ నిరర్గళభుజార్గళసంరంభవిజృంభణంబు శోభిల్లఁ బసులఁ బెట్టించి యనతిదూరవర్తి యగుకౌరవచక్రవర్తిదెసం గనుంగొని ధనంజయుండు భూమింజయు నక్కడఁ దేరు వఱుపం బనుప నప్పళించునప్పుడు కురువీరులు గూడుకొని మూఁడువేలరథంబులతోడను గాంగేయకర్ణులొక్కొక్కరుండు వేయింటితోడను దలకడచి రాజున కడ్డపడి కవ్వడిదిక్కు మొగంబుగాఁ దిరిగి రట్టియెడఁ గదుపులు వట్టువడుటకు నిట్టూర్పు [2]నిగిడించుచు మగిడి మనుజపతియు ననుజసహితుండై సహస్రస్యందనంబులతోడ వెన్నుదన్ని నిలిచె నంతఁ దక్కటిబలంబులు నెయిదికొని యమ్మెయిన దళంబుగాఁ గవిసిన. 2

కనుఁగొని యెలన [3]వ్వాలయు వదనమున గరువంపుఁజెన్ను దలకొనఁగా న
ర్జునుఁడు విరాటసుతున కి, ట్లనుఁ గేవలవీరరసమయాత్మకుఁ డగుచున్. 3

కాంచనమయవేదికాకనత్కేతనో, జ్జ్వలవిభ్రమమువాఁడు కలశజుండు
సింహలాంగూల[4]భూషితనభోభాగకే, తుప్రేంఖణమువాఁడు ద్రోణసుతుఁడు
కనకగోవృషసాంద్రకాంతిపరిస్ఫుట, ధ్వజసముల్లాసంబువాఁడు కృపుఁడు
లలితకంబుప్రభాకలితపతాకావి, హారంబువాఁడు రాధాత్మజుండు

---

1 ద్భాసితమూర్తిమయాసం (శ్రీ; సద్) వ్యాససమానైకరూప; ద్భాసితమతి (గుణ) మూర్తి యా వ్యాససమానైకరూప; ద్భాసి...యాత్మవ్యాస...నైకరూప. 2 నిగుడించుచు మగుడి... మెమ్మయి సరభసంబుగాఁ;యమ్మెయిన దళం. 3 వ్వాలయ. 4 భాసిత...కాంతిపరిస్ఫుర, ధ్వజ.

తే. మణిమయోరగరుచిజాలమహిత మైన, పడగవాఁడు కురుక్షితిపతి మహోగ్ర
శిఖరఘనతాళతరు వగుసిడమువాఁడు, సురనదీసూనుఁ డేర్పడఁ జూచికొనుమ

క. గురునకుఁ బ్రదక్షిణంబుగ, నరదముఁ బోనిత్త మిమ్మహాపురుషునెడం
బరిభవము వలవ దీతఁడు, కురుకులనృపతనయశిక్షకుఁడు సుమ్మనఘా.

క. శస్త్రప్రకారనిపుణుం, డస్త్రవిదుఁడు దూరపాతనాభీలుఁడు వ
ర్చస్త్రాసితరిపుఁడు ధను, శ్శాస్త్రపరిజ్ఞానఘనుఁ డసదృశుఁడు శక్తిన్.

ఉ. ఈతనితోడికయ్యమున కియ్యకొనం దగ దేను దుష్పథ
ద్యూత[1]జయోద్ధతుం డగుసుయోధనునిం బరిమార్పఁ బోవుచో
శాతశరోత్కరం బితఁడు చక్కఁగ నేయునొ నన్ను నేయఁడో
చూతము దాన మున్ననికిఁ జొచ్చినఁ జొత్తముగాక పిమ్మటన్.

క. గురుపుత్త్రుఁడు తేజోనిధి, సురాసురుల కైనఁ దేఱి చూడ నరిది సం
గరమున [2]నీతని నీశ్వర, వరజనితుఁడు మేటి కౌరవవ్యూహమునన్.

క. [3]ధైర్యధనుఁ డితఁడు ద్రోణా, చార్యుల కెన వచ్చుదివ్యశరవిదుఁడు కృపా
చార్యుఁడు మత్పితృసఖుఁ డా, చార్యక మొనరించె మాకు శైశవముతఱిన్. 9

తే. వీర లిరువురు మాన్యులు వీరితోడి, కయ్యమున కిప్డు మన మంత గాలుద్రవ్వ
వలవ దెచ్చోట నెదురుగా మెలఁగి రచట, మనరథం బల్ల నల్లన చనఁగ నిమ్ము.

శా. యోధాగ్రేసరుఁ డిద్ధతేజుఁడు రణోద్యోగానురక్తుండు దు
స్సాధప్రక్రమబాహువీర్యుఁడు గురుష్మోపాలవాల్లభ్యల
క్ష్మీధామాత్ముఁడు జామదగ్న్యకలితశ్రేష్ఠాస్త్రవిద్యాఢ్యుఁ డీ
రాధేయుం డోకచీరికిం గొనఁడు వీరవ్రాతముం బోరులన్. 11

క. శౌర్యాటోపంబున దో, ర్వీర్యంబున నస్త్రశస్త్రవిత్త్వమునను మా
త్సర్యంబు సేయు నాకును, దుర్యోధనుఁ డెపుడుఁ ద న్నెదురు సేయంగన్. 12

చ. అతిదృఢవేది పేరు గలయట్టిమగండు రణంబు గల్గ నేఁ
డితనికి నాకుఁ దెల్లముగ నిట్టియెడం బరికించి చూడుమీ
మతి గలఁగంగనీక యనుమానము వాయఁగ నీవు సాయకో
ద్ధతిఁ బ్రకటించుచో బహువిధంబుల నిద్దఱతారతమ్యముల్. 13

క. [4]ఈయెడ ననుఁ గని వారణ, సేయుడు నితఁ డగ్గ మైనఁ జిచ్చుఱపిడు గై
పోయి పయిఁ బడుదు నీ వర, వా యించుక లేక పఱపవలయు రథంబున్. 14

ఉ. ఉగ్రుఁ డనూనమానమహిమోన్నతచిత్తుఁ డజయ్యవిక్రమో
దగ్రుఁడు హస్తలాఘవసమన్వితుఁ డేయునెడన్ సమగ్రకో
పాగ్రహబుద్ధి మాదెస ననార్యుఁడు గార్యమునందు ధార్తరా
ష్ట్రాగ్రజుఁ డీతనిం గదిసినప్పుడు పండువు నాకు నుత్తరా. 15

1 జయోన్నతుం. 2 నీతం డీశ్వర. 3 శౌర్యఘనుఁ. 4 ఈయన ననుఁ గని వారణ, సేయం డితఁ.

తే. అరసికొని యెన్నిభంగులనైన నితని, తేరు మనవారి కగపడు తెఱఁగు గాంచి
యడరిబాసటయైయెవ్వరడ్డపడిన, [1]మెఱపుమెఱచినచాడ్పునఁ దఱియఁ జొరుము.

క. అస్మత్పితామహుం [2]డతి, విస్మయజననప్రతాపవిభవాగ్నిశిఖా
భస్మీభూతప్రతిప, క్షస్మయకాననుఁడు ప్రథమగణ్యుఁడు బుద్ధిన్. 17

క. బహుమహితాయుధవిద్యా, రహస్యసంవేది ధార్తరాష్ట్రులకును మా
కు హితంబ కోరు సముఁడై, [3]సహాయ మగు వారలకు నచటఁ దా నునికిన్.

క. వివిధము లగులక్ష్యంబుల, నవలీలం దునియ నాఁట నవియఁగ [4]నేయున్
భువనైకధన్వి నత్యుగ్రవిచేష్టితు నోర్చెఁ బరశురాముం బోరన్. 19

క. శంతనునందనునరదము, పొంతం బో వలవ దలుక పుట్టి యతఁడు భూ
[5]కాంతునకు సైన్యమునకుం, జెంతలఁ జేరంగ నీక సిలుగులఁ బెట్టున్. 20

వ. అని యిట్లు వేఱువేఱ చూపి క్రమంబున నేర్పడం జెప్పి సవ్యసాచి సమరోన్ము
ఖుం డగుసమయంబున [6]సస్మితుం డగుచు నశ్వత్థామ రవితనయు నవలోకించి
యిట్లనియె. 21

క. నిను నీవ పొగడికొని పలికినపలుకులు పెక్కు గలవు క్రీడి యనికి వ
చ్చినవాఁ డిదె పులివలె మార్కొన [7]రాదే కర్ణ సేనకుం బ్రియ మెసఁగన్.

క. తలఁకు గల దేని శకునిం, బిలిచి విచారింపఁ బొమ్ము పృథివీపతి నీ
తలన మనకార్యఖడ్గం, బులమో పెక్కించె రిత్త వోవునె నీకున్. 23

వ. అనిన విని యతండు క్రోధఘూర్ణమాన[8]తారకుం డగుచు నిట్లనియె. 24

చ. తలఁకెడువానికిన్ [9]మగఁడఁ దా నటె నన్నడిఁకించువాఁ డిసీ
పలుకకు భీతున ట్లొదుఁగఁ బాఱునె శూరుఁడు నిన్ను నచ్చియే
కలనికి వచ్చితిన్ నరుఁడ కాఁ డట వాసవుఁడైన నేమి నా
బలముఁ జలంబు నేరిమియు బంటుతనంబును నీవ చూడుమీ. 25

క. అని [10]కడఁగునినసుతునకు, న్నను ద్రోణుఁడు ద్రోణనందనుఁడుఁ గృపుఁడును శాం
తనవుఁడుఁ గడఁగుట దుర్యోధనుఁ డవలోకించి యత్యుదగ్రతఁ గడఁగెన్. 26

వ. ఇవ్విధంబున నయ్యేవురుదొరలును ధరణీశుండును సరభసంబుగా బరవసంబు
సేసిన దుశ్శాసన దుష్ప్రహ దుర్ముఖప్రముఖనిఖిల కురుకుమారనికాయంబును
శకునిసైంధవప్రభృతిబంధునివహంబును బాహ్లీకసోమదత్తాదిసామంతనికురుం
బంబును మఱియునుం గలవివిధయోధవీరనిచయంబును నొక్కటఁ గరటిఘటా
ఘోటకధట్టరథయూథ పదాతి వితతి సంరంభశుంభ త్సేనాసమూహసహితంబు
గాఁ ద్రోచి నడచిన. 27

---

1 మెఱుఁగుమెఱసిన. 2 డరి. 3 సహాయుఁ డగు నచటఁ దాను సన్నిధి యగుటన్.
4 నేయన్. 5 కాంతుదెస...జెంతం. 6 మందస్మితాననుం. 7 వలదే. 8 మానసుం. 9 మగఁడు తా నటె...భీరున ట్లొ...ధీరతయు బంటు. 10 కడఁగెడునినజునకున్...దగ్రత నడరెన్.

చ. ధరణి వడంకె ధూళి దివిఁ [1]దన్నిన భానుని గానరాద బం
ధురవివిధప్రకారపటుతూర్యరవంబులఁ బొంగె దిక్కులా
స్ఫురితమహాయుధోగ్రరుచిపుంజవిజృంభణఘోర మయ్యె నం
తరము సహస్రనేత్రముఖదైవతమండలదుర్నిరీక్ష మై. 28

అర్జునుఁడు గౌరవసైన్యంబుల నుఱుమాడుట.

వ. అట్టియెడ నుద్భటహాసోల్లాసభాసురముఖుం డగుచు శతమఖతనయుండు. 29

చ. గుణమున లస్తకంబునను గోటియుగంబునఁ [2]గేలఁ దారభీ
షణముగ నుప్పతిల్లి రభసంబున రేఁగినమాడ్కిఁ దీవ్రమా
ర్గణనికరంబు లొక్కట నరాతిబలంబులఁ గప్ప గాండివ
క్వణనము రోదసీకుహరకర్పరముం బగిలింప నుగ్రతన్. 30

క. తలపడి తలమిఱినకా, ల్బలములఁ బొడిసేయు మఱియుఁ బైపైఁ బీనుం
గులద్రొక్కికొనుచు వెస ముం, గలిమొనఁ [3]గవియుటకు వేడ్కఁగడలుకొనంగన్.

క. తనదృష్టియు ముష్టియుఁ దగు, ననువున మున్నెత్తి యేయునతఁ [4]డప్పుడు డిం
చినగాయముల సపాటం, బునఁ బదియుఁ బదేను నుచ్చి పోయెం గోలల్. 32

చ. ఉడుగక నెంచియుఁ సుభటు లొక్కమొగిఁ వెస నంటఁ దాఁకి క
వ్వడిపటుబాణభాస్వదనివార్యసముద్ధతిఁ జేసి మంటలో
మిడుతలు సొచ్చిన ట్లయిన మేటిమగల్ గని యీడఁబోక బ
ల్విడి మఱియుఁ వడిం బొదువ వ్రేల్మిడిఁ ద్రుంచె నతండు దోడుతోన్. 33

తే. అంత కంతకుఁ గదిసి సైన్యములు సుట్టు, ముట్టి శస్త్రాస్త్రసంచయమున నభంబు
దీటుకొనునట్లు సేయఁ గిరీటి గాండి, వంబు పరిచాలనం[5]బు దీవ్రంబు గాఁగ.34

సీ. గోరఁ [6]బోఁజినమాడ్కిఁ గొన్నింటిఁ జక్కసాఁ, బాలుగా వ్రయ్యలు వాపి వాపి
బాడిస నఱికినభంగిఁ గొన్నింటిఁ దు,త్తునియలుగా బిట్టు త్రుంచి త్రుంచి
వెస నంపమున నిడ్డవసిగఁ గొన్నిటి నిను, మంతలుగా నుఱుమాడి యాడి
పనివడి ఱోలఁ గొట్టినలీలఁ గొన్నింటిఁ, జిఱునుగ్గుగాఁ బొడిసేసి చేసి

తే. యడరిపొదివినబలమునానాయుధములఁ,బ్రతిహతంబులఁ గావించెనతిరయమున
నక్షతధ్వజసూతహయత్వలసద, ఫల్గురథవల్గనుం డగుఫల్గునుండు. 35

క. ఆమెయిన వివిధ[7]వర్మ, స్తోమం బఱువుల్లు సేసి సునిశితబాణో
ద్దామప్రసారవిభవ, శ్రీ మార్తుర కద్భుతంబు సేసెం గడిమిన్. 36

క. గర్జద్గుణుఁ డై పగతుర, జర్జరితాంగులుగఁ జేసె సాయకజాల
స్ఫూర్జన చూపఱు వొగడఁగ, నిర్జరవరనందనుండు నిమిషార్ధమునన్. 37

1 దన్కిన (దాఁకిన; దాఁకెను) భానుఁడు గానరాఁడ. 2 గ్రేల్లు వాఱ; కేల ధార. 3 గదియుటకుఁ గడఁక. 4 డపుడు ని(గు)గి, డ్చిన. 5 బుదగ్రంబు. 6 జీరిన...(వ్రక్కలు)... (బాడిత(ద)నఱికిన)...బెట్టు త్రుంచి...నిడ్డవసినఁ; నిడ్డపసగఁ. 7 మర్మ.

శా. శక్తిస్ఫారధనంజయాయతభుజాసంరంభగాండీవని
ర్ముక్తక్రూరశరావలీదళితశత్రువ్రాతముల్ శోణితా
సిక్తాకారతఁ బొంది సాంద్రకుసుమశ్రేణీవికాసోల్లస
ద్రక్తాశోకతరువ్రజంబులక్రియన్ రంజిల్లి యొప్పెం గడున్. 38

చ. తదవసరంబునన్ దొర లుదగ్రతఁ ద్రోచిన [1]వజ్రఘట్టముల్
మదమున నొక్కపెట్ట బలమర్దనుసూనురథంబు గ్రక్కునం
బొదివెఁ దురంగకింకిణులభూరిరవంబుఁ గరీంద్రఘంటికా
భ్యుదితనినాదముల్ రథవరోత్థితఘోషము నుత్కటంబుగాన్. 39

తే. అట్టియెడ వేల్పు [2]వచ్చినయట్ల మేను, వొంగ నలిరేగి పాండవపుంగవుండు
మత్స్యనృపనందనునిబలుమాటతోడి, యేపు సెవికిని జూడ్కికి నింపు నొసఁగ.

క. మేదురదీర్ఘతరం బగు, నాదం బెడతెగక గుణమునను వడి [3]నిగుడం
గోదండము సంతతవల, యోదాత్తస్ఫురణ వెలుఁగు చుండఁగ నేసెన్. 41

మ. ఒకమాత్రన్ వితతప్రసారనిబిడాత్యుగ్రాస్త్రసంతానముల్
సకలానీకములందుఁ బర్వ నరుభాస్వన్మూర్తి శోభిల్లె దీ
ప్తికలాపంబులు లోక మంతటను విస్తీర్ణంబులై యాగప
ద్యకృతవ్యాప్తి వెలుంగ నొప్పెసఁగుమార్తాండున్ విడంబించుచున్. 42

క. నరు లారులు దృశ్యములపైఁ, బరఁగింపఁగఁ జూడ్కు లెట్లు వడుఁ దప్పక య
ప్పరుసున నరుఁ డేయునిశిత, శరములు లక్ష్యములు దప్పి చన వించుకయున్.

క. గజఘోటకరథసూత, ధ్వజకంకటయోధగాత్ర[4]తతియం దెచటన్
విజయధనుర్ముక్తశర, వ్రజములు దవులంగఁ బడ కవారణ నిగుడున్. 44

చ. కవదొన లేల పూనునొకొ కవ్వడి నా వల దుగ్రసంగరో
త్సవమున సవ్యపాణి నపసవ్యకరంబున మార్చి మార్చి గాం
డివము ధరింపఁగా శరపటిష్ఠతయుం బొరిఁ జేయి మార్చి చూ
పు వెరవుతోన వీడ్వడక పొం దొడఁగూడెడు [5]నెప్డు సూచినన్. 45

క. సమవిషమవినిమ్నోన్నత, సమీపదూరస్థలములు సదృశములు గఁ [6]జి
త్రముక్రియ నవిహతగతులను, సమరమహిం గ్రీడిరథము సను నవితథమై. 46

వ. వెండియు నతండు. 47

మ. బల మెల్లన్ [7]వెఱ రెండుపాయలు గ శుంభద్వేగుఁడై చొచ్చి యా
వలగా నడ్డము వచ్చి నాలువు గ దుర్వారోద్ధతిం బోయి మూ
లల నానాశకలాకృతిం బొరయ లీలాయానదుర్దాంతుఁడై

1 పోల్చుఘట్టముల్...మర్దనుసూతి...రోద్ధత...నుద్భటంబుగాన్. 2 సోకిన; వట్టిన. 3 నిండం. 4 (తతులం దెల్లన్)...దవులంగఁ బడవ...డన్. 5 నెప్డు నూడఁగన్; నేపు సూచినన్. 6 జిత్తముక్రియ (నవహిత). 7 వెస.

వలయంబుల్ సని చించి చిక్కువ చుఱ వైకల్యసంపాదులై. 48

వ. ఇవ్విధంబున నంబుధిలోన మహామత్స్యంబు విహరించుచందంబునఁ దదీయ రథంబు గౌరవసైన్యంబునందు సంచరించునయ్యవసరంబున. 49

ఆ. రత్నకేతనములు రాజిత[1]శేఖరం, బులును రుచిరఘంటికలును బార్థు
బాణనిహతిఁ దునిసిపడుఁ గౌరవులచేటు, దెలుప దుల్లు నుల్కకలునుబోలె. 50

క. నరు[2]భల్లంబుల నగ్రిమ, చరణంబులు ద్రెస్సి మ్రొగ్గుజవనాశ్వంబుల్
కరుణమెయి రాహుతులకుఱ, శరణం బగు మనుచు మ్రొక్కుచందం బొందెన్.

క. దంతిఘటాసంతానము, కుంతీసుతునారసములఁ గూలినతఱి న
త్యంతనిబిడాభ్రముల దివి, యెంతయు సొంపారుభంగి నిల సెలు వొందెన్.

క. పలుపులుఁ [3]గాండ్లుం బగ్గం, బులుఁ దనయస్త్రంబు లడరి పొడిసేసిన వి
చ్చలవిడిఁ బాఱెడురథ్యం, బుల నేయఁడు దివిజరాజపుత్త్రుఁడు గృపతోన్. 53

ఆ. అర్జునాస్త్రఖండితాతపత్త్రధ్వజ, చామరములు గాలిఁ జెదలఁ దూలఁ
జిహ్నములవిభూతిఁ జెందంగఁ గని యొప్పె, నప్పు డాడుచున్నయట్ల లచట.

క. ఒకమరి కిరీటికట్టెదు,రికి [4]నుఱుమునఁ బోయిరేని రెండవమాఱ
య్యకొనుట కోర్వఁగ లేరై, రొకళ్లుఁ గురురాజుసేన యోధులలోనన్. 55

సీ. మండితధ్వజదండమండలంబులఁ గిట్టి, [5]విటతాటనంబుగా విఱిచి విఱిచి
చటులఖురోద్భటాశ్వశ్రేణిఁ బొదివి ర,యంబునఁ దునిమి తూఁటాడి యాడి
రాజితబహువిధరథసమూహముఁ జొచ్చి, గలిబిలి యగునట్లు గలఁచి కలఁచి
మదభరభీషణమాతంగముల ముట్టి, చిందఱవందఱ చేసి చేసి

ఆ. పటుపదాతిచయముపై రౌద్రరసమహో,గ్రముగ నడరి నేలఁ జమరి చమరి
సవ్యసాచిబాణసంఘంబు మత్తశుం,డాలఘోరలీలఁ గేలి సలిపె. 56

ఉ. శిక్షితచిత్రసంగరవిశేషములం బ్రతిహేతిఖండనా
దక్షతపెంపుసొంపునను దైవబలంబున నత్తఱిఁ సహా
స్రాక్షతనూజుసారథిరథాశ్వచయధ్వజముల్ పరాస్త్రశ
స్త్రక్షతి లేక యొప్పెఁ గురుసైన్యము [6]వెక్కస మంది బెగ్గిలన్. 57

క. తేజోధనుఁ డగునరుఁడు, ద్భ్రాజితగతి నడుమ మెఱసి బడబాగ్ని దళం
బై జలనిధిఁ ద్రెక్కొనియెడు, నోజం గురుబలము పేర్చి యుడిపెం దోర్త్రోన్. 58

తే. కాలపక్వంబులైనలోకముల జముఁడు, బారిసమరెడుచాడ్పున మారి మసఁగి
యుగ్రరూపుఁడై శౌర్యసమగ్రబాహు,సంపదుద్దాముఁ డగుక్రీడి సంపె రిపుల.

1 శిఖరంబు, లును సురుచిరఘంటలును గిరీటి...(నుల్కములును). 2 బాణంబుల తాఁకు నఁ ..దునిసి మ్రొగ్గు...(రావుతులకుఱ). 3 గాడులు...(పుత్త్రుండు గృపఱ). 4 నఱుమఁ గఁ; నఱిముఱిఁ; నిమ్మగఁ. 5 వీటతాటంబుగా...గజిబిజి యగు... 6 నివ్వెఱఁ గంది.

వ. అట్టియెడ మున్ను తురంగమ[1]ఖురాదులం దూలిన కెంధూళియుం బైపయి నెగయఁ బరబలంబు నెత్తుట జొత్తిల్లుచు నుచ్చి చను వివ్వచ్చు నిశితశరపరంపరలు సైనికశరీరంబులపై సుడిసి తడిసి రుధిరశీకరనికరవికీర్ణ రవికిరణపరిణతం బగు సమీరణంబును, ధారాళకరాళరక్తపరిషిక్తవిశ్వంభరాభాగంబునుం గలయం గెంపు సంపాదించి యకాలసంధ్య నావహించినం దదుచితవ్యాపారపారంగతంబులై పొడసూపిన యుడుగణంబులుం బోలెఁ బొలుచు ధనంజయసాయకదళితకుంజరకుంభవికీర్ణమౌక్తికవిసరంబులవలనను; సముదీర్ణమదవేగదుర్నివారవారణవిదారణంబు లగు నర్జునాస్త్రపాతంబుల బెదరి తేం ప్లెగయుట పొగ లెగయుటయుం, బ్రతిభటబాణఘట్టనంబునం బాండవమధ్యము కాండప్రకాండంబుల నిబిడజ్వాలలు నిగుడుట మంటయునుగా, మూర్తం బగు తదీయక్రోధదవానలంబు చటచ్చటాశబ్దంబుల చాడ్పునం జెలంగుచున్న యుధిష్ఠిరానుజు నతినిష్ఠురభల్లభజ్యమానబలవదరాతిఖరాస్థినిస్స్వనంబులవలనను; దొట్టి తొట్టి యెడనెడ మడువులు గట్టు శోణితంబు నీళ్లునందుఁ బడి తేలాడు వెలిగొడుగులు పుండరీకంబులును, వింజామరలు మరాళపుంజంబునునై కొలంకుల చందంబు నొంద వానికెఱఁగెడు కొదమతుమ్మెదపదువుల పగిదిఁ దొరఁగు నాఖండలతనయఖండితపరశిరకాలాయసనారాచశకలంబులవలనను; గిరీటిశరపాటవపరిస్ఫోటితరిపుకపాలగళితమస్తిష్కపలలపంకంబునను, నలుదెసల నంతంతఁ గదియం జాఁగి పడియున్న కృత్తకరచరణంబులను, వెదపదనికి రొంపి గలంచి వరుజులు పదిలంబుగా నమర్చిన కేదారంబు తెఱంగు దోఁచుటకు నీడై చతురహాలికుండు సల్లు పరువంపు మొలకల చెలువునఁ బెల్లు దుల్లు ఫల్గునాశుగసంతాడనవికీర్ణశత్రుశేఖరవజ్రవ్రజంబులవలనను; సంగ్రామం బభిరామం బయ్యును ఘోరప్రకారం బయ్యె నమ్మహాభయంకరసంకులసమరంబున. 60

చ. ఉఱక విరోధిసైన్యముల నుక్కుమడంగఁగ నుల్లసద్గతిం
బఱప రథద్విపాశ్వములు పాండవమధ్యము తేరివీథియం
దఱవఱలై పడం గని భయంపడి యిద్దెస వచ్చెనేని న
త్తెఱఁ గయి పోమె యంచు [2]నెడ తెంపిగఁ గొందఱు వాయఁ బాఱఁగన్. 61

క. వాలమ్ములు దాఁకి ధరన్, వ్రాలు భటులఁ జూచి [3]మెదలు వడఁకఁగ మేనుల్
దూలఁగఁ దముఁ దాఁకకయును, నాలము సాలించి కొంద ఱవలఁ జనంగన్.

తే. ప్రొద్దు గ్రుంకిన మఱి కాని పోవఁడొక్కొ, క్రీడి యని కొంద ఱాజికి నీడఁబోవ
బలము నెల్లను దెగటాఱఁబఱపి కాని, తక్కఁడెట్టులు ననుచుఁ గొందఱు చలింప.

---

1 ఖురంబులం...శితవిశిఖపరంపరలు...లయకాలసంధ్య...కరగెడు కొదమ...నికృత్తచరణంబు లను...పటలంబునను. 2 నెడ తెంపుగఁ; నెడ త్రెవ్వఁగఁ...పాయవాఱఁగన్. 3 యొదలు...అవుల చనంగన్.

క. తరతరమ ప్రజలఁ దునిమెడు, నరునప్పటియెత్తికోలునకు సురవిద్యా
ధరఖేచరులును భీతిం, బొరసిరి తమదెసకు నేమి పుట్టునో యనుచున్. 64
క. తమతమయొద్ది బలంబులు, గ్రమవిరళము లైన దొరలు గాండివిపై ను
గ్రముగఁ దఱుముటయు నాతఁడు, సమరోల్లాసమున దివ్యశరతత్పరుఁ డై. 65
సీ. ఆచార్యు డెబ్బది యమ్ముల నాచార్య, పుత్త్రు నేడింటఁ గృపునిఁ బదింట
దుష్ప్రహుఁ బండ్రెంట దుశ్శాసనునిఁ బది, యేనింట సౌబలు నెనిమిదింట
నమరనదీసూను నఱువదింటను నేసి, రవిసుతురథ్యసారథుల నొంచి
వర్మమంతయుఁ ద్రుంచి వైచి మర్మాస్థిబం, ధములు భేదించి విక్రమము నెఱపి
ఆ. యిట్లు దొరలు నొవ్వ నేర్తెఱఁ దనచేతి, కొలఁది సూపి క్రీడి సెలఁగి దేవ
దత్త మొత్తుటయును దత్సైన్యములు సెడ, విఱిగి పాఱె భీష్ము మఱువుసొచ్చె.
క. గాంగేయుఁ డవష్టంభో, త్తుంగతనుం డగుచు నిట్లు దూలినకురుసే
నాంగంబులఁ బురికొలిపి సు,సంగతములు సేసె సమరసమ్ముఖములుగాన్. 67
వ. ఇట్లు భగ్నబలసమాశ్వాసనోద్భాసి యగుభీష్మభుజబలంబుప్రాపున [1]మాతంగ
తురంగస్యందనసందోహంబులతోఁ గుంభసంభవకృపాశ్వత్థామకర్ణవికర్ణప్రము
ఖనిఖిలయోధజనంబులు సుయోధనుముందటఁ బన్ని నిలిచినం జూచి సవ్యసాచి
ప్రత్యేకప్రధనకుతూహలాయత్తచిత్తుం డగుచు నుత్తరున కిట్లనియె. 68
ఉ. కందము లప్పళించి తురగంబుల నించుక నిల్పు వైరిసే
నం దెలియంగఁ జూడుము ఘనప్రకరంబునుబోలెఁ గాఱుకొం
చుం దఱి చైనదంతి[2]భటసుందరకేతనరాజి గ్రాలఁగా
ముందట నిల్వఁ గట్టెదిరి మోహర మున్నవిధంబు గాంచితే. 69
ఆ. కర్ణుకేతనంబు గ్రాలెడు [3]నల్లదె, యాతఁ డాజికేళికౌతుకమునఁ
గడఁగి వచ్చుటయును గలిగియున్నది మున్న,తొడరవలయు నతనితోడమనము.
వ. అని మఱియును. 71
చ. రయమునఁ గిట్టి [4]యీతనిపరాక్రమలీల యడంచి నొంచి దు
ర్జయుఁ డని నమ్మి యున్నకురురాజునకున్ వగ పుట్టఁ జేసెదన్
హయములఁ బోవ నిమ్మనుడు నాతఁడు నాతనిలావు నచ్చి ని
ర్భయమునఁ దేరు వోఁ బఱపె భాస్కరసూతికి సమ్ముఖమ్ముగన్. 72

అర్జునుఁడు చిత్రాంగదప్రభృతికురుకుమారుల నిర్జించుట.

వ. ఇవ్విధంబున వృషభంబున కాదికొనుబెబ్బులియునుంబోలె రాధేయుదెస నడచు
కవ్వడిం గని చిత్రాంగదుండును జిత్రరథుండును సంగ్రామజిత్తును దుష్ప్రహుం

1 నేచి మాతంగ ... వికర్ణదుర్ముఖప్రముఖ. 2 రథ; ఘట ... ముందర నిల్చి కట్టెదిరి; ముందర గట్టి మై నిలిచి. 3 జూచితె (నిందిదె), యీతఁ...నితని (వీని) తోడ. 4 యీతని ...దేరు వే నడపె.

డును జిత్రసేనుండును వివింశతియును దుర్ముఖుండును దుర్జయుండును వికర్ణుం
డును శత్రుంతపుండును దుశ్శాసనుండును లోనుగాఁ గలకురుకుమారవర్గంబు
నిరర్గళప్రకారంబు లగురథచిత్రప్రచారంబులు మెఱయ మొనకుం దలకడచి
చటులపటుబాణవేణికాపరంపరలు నిగుడ నొక్కపెట్ట కవిసిన నతండును
గుణధ్వని తంత్రీనాదంబుగా నావిండ్లవా రొత్తుకారుగా గాండీవంబు వీణగా
వినోదంబు సలిపె నట్టియెడ వికర్ణుండు. 73

క. తలమీఱి నిశితశరమం, డలిఁ గప్పెం బార్థు నుత్కటక్రోధమునన్
విలు విఱుగ నేసి యతనిం, దొలఁగంగాఁ జేసె నరుఁడు దోర్బలలీలన్. 74

క. [1]ఇంతయుఁ గనుఁగొనియును శ,త్రుంతపుఁ డోసరిల కాజి దోహాల మలరం
గాంతేయుతోడఁ దలపడి, వింత లయినకూర్మనఖరవిశిఖము లేసెన్. 75

వ. అర్జునుండును. 76

క. సూతుఁ బదింటను నైదిట, నాతనియంగంబు నొంచి యంత నిలువమిన్
[2]శాతఘనశరము వేకొని, యాతల వెడలంగ నేసి యసువులఁ బాపెన్. 77

తే. ఇట్లు శత్రుంతపునిఁ ద్రుంచి యివ్విధమున
నొక్కఁ డొక్కఁడ తలపడు టుడుపఁ దలఁచి
వివిధబాణపరంపర వెల్లిగొలిపె
భయరసమువట్టుపెట్టునఁ బగఱు వాఱ. 78

క. అందఱు రథికులు పఱవఁగ, నిం దేటికి మున్ను వచ్చి [3]తిస్సీ యని సం
క్రందనసుతు మార్కొనియెఁ ద,గం దెగి సంగ్రామజిత్తు గర్వోద్ధతుఁ డై. 79

క. తలపడి వాలమ్ములు పై, నల వేర్పడ నినుచుటయును నలుక వొడమినం
దల దునిమి వైచె నాతని, బలసూదనసూనుఁ డొక్కపటు[4]భల్లమునన్. 80

తే. అపుడు రాధేయుఁ డిమ్మెయి ననుజుపాటుఁ, జూచి యేనుంగునకు సిల్లు సూపినట్లు
గవిసిహయముల మత్స్యభూకాంతుతనయు, నేసి పండ్రెండుశరములనేసెనరుని.

ఉ. కేసరివిక్రముండు కపికేతనుఁ డత్తఱి వైరివీరసం
త్రాసకరప్రకార మగుదర్ప మెలర్పఁగ బాణజాలవి
న్యాసమునన్ వెసం బొదివె నర్కసుతున్ గరుడుండు పాము ను
ద్భాసితపక్షుఁ డై పొదువుభంగి సురావలి పిచ్చలింపఁగన్. 82

క. ఇరువురు వీరులు నిట్లొం,[5]డొరువులఁ దలపడుట సూచి యుత్కట మగున
చ్చెరువాటుఁ గౌతుకంబు న,డర నూరక యుండె నయ్యెడం గురుసేనల్. 83

మ. ప్రళయాంభోధరముక్తసాంద్రవిసరత్పాషాణవర్షంబు మి
క్కిలి యై శైలముఁ గప్పునట్లు నరు నక్షీణాస్త్రసంతాన మి

1 అంతయుఁ...దోహాల మడరం. 2 శాతఘనశరము చేకొని; శాతశర ముద్ధతిం గొని, యాతత వేగమున నేసి. 3 రిస్సీ. 4 బాణమునన్. 5 డొరులం...యుండి రయ్యెడం గురువీరుల్.

ట్టల మై కప్పినఁ దీవ్రమారుతము గాఢవ్యాప్తిజీమూతమం
డలిఁబోలెన్ విరియించె భానుజుఁ డవష్టంభోజ్జ్వలాకారుఁ డై. 84

క. విల్లును దానును శిఖ రా,జిల్లఁగ వెలుఁగొందువహ్ని చెలువంబున శో
భిల్లుటఁ గని కురుసైన్యము, లెల్లను దూర్యములు మ్రోయ నేడ్తెఱఁ జెలఁగెన్.

క. రవితనయుబాణములు వా,సవనందనుఁ బొదివినపుడు సంతోషముఁ ద
ద్వివిధాస్త్రము లాతనిపైఁ, గవియ విషాదంబు నొందుఁ గౌరవసేనల్. 86

వ. ఇవ్విధంబున నెట్లాడుచుం గదిసి గాండీవి గర్ణున కిట్లనియె. 87

ఆ. సభలఁ బలుకు దీవు సరి [1]లేరు నాకని, యిదె రణంబు వచ్చె నెల్లవారి
కెఱుఁగవచ్చు దీనఁ బెఱచోట రజ్జైన, యట్లు పూరగింప నగునె యిచట. 88

క. మాటలు పెక్కాడితి వీ,పోటుమగలు వినఁగ నింకఁ బోవుట దగదె
ప్పాట నది గాక తమ్ముని, పాటును గన్నారఁ గంటి పాఱకు మింకన్. 89

ఆ. పలుక వచ్చుఁగాక పలికినయట్టుల, చేయ వచ్చునెట్లు దాయ యెందుఁ
బోమె దట్లు ద్రుపదపుత్రికఁ [2]బఱుపంగఁ, గాంచి నగినఫలము గందు గాక.

క. ఏ నపుడు ధర్మపాశా,ధీనుఁడ నై కోపమునకు దీకొనరింపం
గా నేరకున్న మెయిమెయిఁ, బో నయ్యెం గాక యింకఁ బొమ్మా యిచటన్.

వ. అనిన విని రాధేయుం డిట్లనియె. 92

ఉ. అప్పుడు ధర్మహానికి భయంపడి [3]నిల్చితివో కడంకతో
నిప్పుడు వచ్చినాఁడ విట యెల్లను జేయుదుఁ గాక యన్నపైఁ
దప్పు ఘటించి నీవు నొకతాలిమి గల్గినవాఁడ వై నెపం
బొప్పినఁ జెల్లె నీదునిలుపోవును జూతము గాక యిచ్చటన్. 93

క. సమయంబు నడపినను రా,జ్యముభాగం బీరె [4]యెట్లు ననునాస నర
ణ్యమున వసించితి గాక ని,జమునకు నీయందు ధైర్యసారము గలదే. 94

క. మును నీ వచట నచటఁ జే,సినబంటుతనంబు లెల్లఁ జెప్పఁగ విందుం
గనినఁ గదా నమ్ముదు నవి, యనుమానము నాకు నీభయస్థితిఁ గనుటన్. 95

కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము.

వ. అనుచు వాలమ్ములు గురిసిన నర్జునుండును [5]గుపితుం డై గాండీవవిక్షేపక్షోభిత
నభోభాగుం డగుచుం గానీనుపై నానానిశితవిశిఖంబులు నినిచె నట్లయ్యిరువు
రును దేవాసురసంగ్రామసాదృశ్యవిక్రమప్రక్రియం బొలిచి రట్టిసమయంబున.

క. రవిదీప్తులు సొర నేరమిఁ, గవిసెం జీఁకట్లు పవనుగమనం బడఁగెన్
వివిధాస్త్రంబుల నంబర, మవిరళముగఁ బొదువఁబడుట నద్భుతభంగిన్. 97

ఉ. అప్పుడు కర్ణుసైన్య మమరాధిపనందనుఁ జుట్టు ముట్టెఁ దే

---

1 నాకు లే రని. 2 నొలువంగ. 3 నిల్చితిపో...నీనిలువు (పు) నోపును. 4 యనుచు నాసమెయి నర...ధర్మసారము. 5 బ్రీతుం డై.

రుప్పరవీథి మై వలయ మొప్ప వెసం బఱపించి క్రీడి పెం
గుప్పలుగా రథావలిని ఘోటతతిం గరిరాజిం గూల్చుచుం
దప్పక భానుసూనుమెయి దాఁకఁగ నేయుచు నుల్లసిల్లినన్. 98

వ. రాధేయుండును. 99

క. తఱిమి పయి నడరుటయు విలు, విఱుగంగా నేసె నరుఁడు విక్రమలీలం
గొఱఁతవడ నీక కర్ణుఁడు, మెఱుఁగు లడరుశక్తి సురలు మెచ్చఁగ వైచెన్.

ఆ. వైచుటయును సవ్యసాచియుఁ గౌరవుల్, విస్మయంబుతోడి వెఱపు వొంద
నధికరయము మెఱయ నది పెక్కుదునియలు, చేసె నంతరమున శితశరముల.

వ. అట్టియెడ నినతనయు మన్నించుజోదులు దెగి[1]పయిం బడినఁ గ్రోధారుణనయ
నపల్లవితంబును దంతకాంతిస్తబకితంబును గుంభస్థలఫలితంబును నగుతదీయ
కరటి ఘటావికటవిటపిపటలంబు నాత్మీయవిశిఖవ్యాపారమహావాతంబునఁ
బడలువడం గూల్చి చండమూర్తి దాల్చి శోభిల్లుబీభత్సుం గని యతండు
బొమ ముడివడ నెక్కొని వేఁ డొక్కవిల్లెత్తికొని. 102

క. తురగముల నాలుగిట ను,త్తరు నాఱిట నెనిమిదిట రథముఁ బదిటను వా
నరు నఱువదిశరముల న,న్నరునంగంబులను బెలుచ నాఁటఁగ నేసెన్. 103

వ. ఇత్తెఱంగున. 104

సీ. రోషంబు భీషణరూప మై చెలు వొంద, నతుల కేతువు శిఖ యై వెలుంగ
శరజాలములు పటుజ్వాల లై నిగుడ న,ర్కతనూభవోగ్రాగ్ని [2]ప్రజ్వరిల్లు
నుద్ధతి సైఁపక యుజ్జ్వలదివ్యప,తాక మెఱుంగు గా దళితధరణి
రథనేమిరవము గర్జనము గ శరపరం,పరలు ధారలు గాఁగఁ బరఁగి యడరె

తే. నర్జునాంబుదం బనన్యసామాన్య,ముద్యమమున ముఖపయోరుహముల
కాంతి దఱిఁగి యపుడు కౌరవసేనాస,రోవరంబు దీనభావ మొంద. 105

. వెండియు నుడుగక రవిసుతుఁ, డొండొండ నిశాతసాయకోత్కరము సము
ద్దండతఁ బై నించిన నా,ఖండలనందనుఁడు గెంపు గనుఁగవఁ గదురన్. 106

. శిరము లలాటంబును గం,ధరమును బాహువులు నురము దండడి వ్రయ్యన్
గిరిపైఁ బిడుగులు దొరఁగెడు, పరుసున దృఢదీప్తశాతభల్లము లేసెన్. 107

. అఱిముఱి నంగము లెల్లను, నుఱుముగ నిట్లడరు నర్జునునియమ్ములకున్
వెఱచఱచి సూతపుత్త్రుఁడు,పఱచెఁ బుడమి యద్రువమత్స్యపతిసుతుఁ డార్వన్.

. ఇట్లు కర్ణుండు [3]గయ్యంబు విడిచి పాఱినఁ బార్థుండు దేవదత్తంబు పూరించి
యుత్తరున కిట్లనియె. 109

. వీఁ డొకఁడు కురుబలంబున, వాఁడిమగం డనఁగఁ జాలువాఁ డిబ్బంగిం

1 తఱిమి పయిం. 2 ప్రజ్వరిల్లు. 3 కయ్యంబున లజ్జ విడిచి.

బోఁడిమి సెడియెను ద్రోణుల, వేఁడిమి [1]యిట మనకుమునుమువిక్రమమునకున్
వ. అనుచు వీరావేశంబునఁ గౌరవానీకంబు నాలోకించునప్పు డుత్తరుండు. 11
ఉ. వెక్కసపాటు భీతియును విహ్వలభావము నొంది యిట్లను
న్నిక్కలి యైన[2]శౌర్యమును నిర్భరతేజము నంత కంత కి
ట్లెక్కుడులావుఁ జూచి మది యెంతయు బెగ్గిలె మేను చేష్టలం
దక్క నశక్య మింకిట రథవ్యవహారము నిర్వహింపఁగన్. 11?
ఆ. పుట్టినంతనుండి [3]యిట్టివి యెన్నఁడుఁ, గాన నెందు నట్లు గాన చోద్య
మంది యంతరంగ మవశతఁ బొందిన, కతన నింద్రియములకడఁక దక్కె.
తే. అనినఁ గొండొకన వ్వాలయంగఁ జూచి, యింద్రనందనుఁ డాతని కిట్టు లనియె
నేను గలుగంగ నీ కేమి యెలమివాహ,నముల కుబ్బుగ సం[4]చోదనంబు సేయు.
క. అనుటయు నాతఁడు దగ నూ,ల్కొనినం దా నుదితనినదకోదండుం డై
యనితరసులభోద్యమమున, ధనంజయుం డిట్టు లను నతనితో మఱియున్.
క. అరుణాశ్వంబులఁ బూనిన, యరదంబున పీఁడె నిడుపులగుచేతులు బం
ధురకంధరంబు వెడలుపు, టురమును నై ద్రోణుఁ డొప్పె నుత్తర కంటే.
వ. అని చూపి వెండియు ని ట్లనియె. 117
ఆ. సకలకురుకుమారచాపశిక్షాచార్యుఁ, డాజిదుస్సహుండు సాంగవేద
వేది నీతిశాస్త్రవిదుఁడు దివ్యాస్త్రకో,విదుఁడు సుజనహితుఁడు విమలబుద్ధి.
వ. అని యగ్గించి. 119
క. తనతనయుకంటె నెమ్మన, మున నాకుం గూర్చు [5]భావమున గురులకు మా
ర్కొనియెదము రాచధర్మం, బునకీడునఁజేసి యింత వుట్టఁగ వలసెన్. 120
చ. ఎదురుగఁ బోవ నిమ్ము రథ మీతని తేరికి నన్న నాతఁడుం
బదిలముతోడ రథ్యములపగ్గము [6]లేర్పడి నూలుకొల్పి యు
న్మదగతి నట్ల చేసిన నమానుషవిక్రముఁ డైనద్రోణుఁడుం
గదిసి యిభం బిభంబుఁ జెనకం జనుదెంచినలీల వచ్చినన్. 121
వ. నరుఁడు నమస్కరించి గురున కిట్లనియె. 122
క. అడవులఁ బెద్దయుఁ గాలం, బిడుమలఁ గుడిచితిమి మాకు నిది దఱి యని యి
ప్పుడు వచ్చితిమి విపన్నుల, మెడఁ గృప సేయుటయ లెస్స [7]యీ రలుగకుఁడీ.

అర్జునుఁడు ద్రోణాచార్యులతో యుద్ధంబు సేయుట.

క. మును వెఱతు నేయ మీరలు, నను నేసినఁ గాని యనుడు నాకేశసుతుం
ధనురాచార్యుం డిరువది, సునిశితబాణముల నేసెఁ జూపఱు వొగడన్. 124

---

1 యిఁకమీఁద మనకవిక్ర. 2 ము న్నరుస నిర్భర... ట్లెక్కుడు. 3 యిట్టిది ... జూడ నట్లు గాన... యంతరంగ మిప్పు డవశతబొందిన...(కణఁక(యఁడిగె)దఱిఁగె). 4 బోధ. 5 బాపమున. 6 లేర్పడ...గదలి. 7 యిపు డలు.

ఆ. అర్జునుండు వాని నన్నింటి నడుమన, తునియ నేయుటయును ద్రోణుఁ డడరి
శతసహస్రసంఖ్య శరములు గప్పిన, నతఁడు నతనిఁ గప్పెఁ బ్రతిశరముల. 125

చ. అతిరథు లస్త్రశస్త్రవిదు లద్భుతబాహుబలుల్ పరాక్రమో
ర్జితయశు లిట్లు దాఁకి గురుశిష్యులు గౌరవసేనలోనిభూ
పతిసుతకోటికిన్ వెఱఁగుపా టొనరించిరి బాణజాలసం
వృతగగనాంగణం బగునవీనమహాహవ[1]విక్రమంబునన్. 126

వ. అట్టియెడఁ గురుసైన్యంబుజనంబులు. 127

క. [2]గురుఁ డొక్కరుండు దక్కఁగ, నరుఁడు గడఁగినపుడు మార్కొనం జాపధరుం
డొరుఁడు గలఁడె మఱి వెదకిన, హరుఁడు గలం డింకఁ గలుగు నన రా దెందున్.

క. ద్రోణుఁడు రయమున నేసిన, బాణము లెడ తెగక యొక్కబాణముపోలెన్
శ్రేణి యయి పోవఁ బార్థుఁడు, రేణువు గావించుఁ గంటిరే చిత్రగతిన్. 129

క. గురుశరములు సితపక్ష, స్ఫురణంబున నంచపిండుపోలుపు వహించెన్
నరుబాణతతి ఘనావలి, కరణి మిగుల నొప్పె నల్లగఱులచెలువునన్. 130

వ. అనుచుం గనుంగొను చుండ. 131

శా. శ్రావ్యం బై చెలఁగన్ గభీరమధురజ్యానాద ముద్దామవీ
రవ్యాపారనిరూఢతం బ్రతిశరారంభంబు మర్దించుచున్
సవ్యప్రౌఢి దృఢాపసవ్యగతి నాశ్చర్యంబుగా నేయుచున్
దివ్యాస్త్రంబులఁ బోరి రిద్దఱును సాదృశ్యం బదృశ్యంబుగన్. 132

వ. ఇంద్రాగ్నివాయువరుణదైవత్యంబు లగుశరంబులు గురుం డేసిన నరుండును దత్తద్దేవతాకంబు లగునంబకంబులఁ బ్రతిహతంబులు సేయుచు వచ్చె నయ్యిరువురుఁ బెల్లేయుసాయకంబు లంతరిక్షంబున దలంబై సంతమసంబు గలిగి యునికి నేబాణం బెక్కడఁ బాఱుటయుం దోఁప కుండె నట్టియెడఁ గుంభసంభవు బలంబు సరభసంబుగా నతని కడ్డంబు సొచ్చిన వివ్వచ్చుండు వ్రేల్మిడిం బొడిసేసి సకేయూరంబు లగుబాహుదండంబులను సకుండలంబు లగుకర్ణపాశంబులను సకిరీటంబు లగుశిరోభాగంబులను భూభాగం బలంకరించి యప్పు డావహిల్లిన రుధిరసాగరంబునకు రత్నాకరత్వం బలవరించె నిట్లు దుర్జయుం డగునర్జునుండు సైన్యంబు దైన్యంబు నొందించుచు నాచార్యునకు భరంబుగ నేట్లాడు చున్నం జూచి యతండు విస్మితుండై. 133

క. అర్జునుని నాహవంబున, నిర్జింపఁగ [3]నగునె ఫాలనేత్రున కైనం
బర్జన్యసుతుఁడు శరవ, ర్షోర్జితమూర్తి యగు టరయ నుచితమ కాదే. 134

వ. అని మఱియును దగినపలుకుల నగ్గింప నిలింపనికరంబు. 135

తే. ఇంతప్రొద్దు కిరీటికట్టెదుర నిలువ, వెఱవ కున్నప్డు ద్రోణుండ వింటివాఁడు

1 విభ్ర. 2 నరుఁ...గురుడు...మాఱుకొనఁ జాప...(మఱి గలఁడె వెద). 3 వశమె.

నల్లవో తనయున్న సేనకు నొకండ,బలిమిఁ దలమీఱు నే యిట్లు నిలువ వలదె.
మ. అను చుండం ద్రిదశేంద్రసూనుఁడు రయం బత్యంత ఘోరంబుగా
ఘనశాతోజ్జ్వలదుర్నివారవిలసత్కాండంబులన్ ద్రోణువా
హనసూతధ్వజదేహముల్ వొదివె నిట్లస్త్రాబ్ధినిర్మగ్నుఁ జే
సిన హాహానినదంబు లొక్కమొగిఁ బేర్చెన్ సర్వసైన్యంబులన్. 137
క. ఈమెయి నిజజనకుభుజో, ద్దామబలము దోడుతోడఁ దఱుఁగుటయు రథ
స్తోమంబుఁ దాను నశ్వ,త్థామ వెసం దాఁకెఁ బాండుతనయునితోడన్. 138

అర్జునుఁ డశ్వత్థామతో యుద్ధము సేయుట.

చ. అతఁడును దీవ్రబాణముల నాతనిఁ గప్పుచు మాఱుకొన్న నా
శతమఖవృత్రసంగరముచందము దోఁచె వడిం జటచ్ఛటా
యితరవ మప్డు వేణువులనేర్చుదవానలు మ్రోఁతభంగి ది
క్తతిఁ బరఁగెన్ మహాద్భుతముగౌరవసేనకు నావహిల్లఁగన్. 139
వ. అట్టియెడ. 140
చ. ఉఱక నరుండు ద్రోణసుతుయుగ్యములన్ వెస నొంచె నాతఁడుం
దెఱపి యొకింత గాంచి ఘనతీవ్రశరంబున నారిఁ ద్రుంచి క
న్గిఱిపినమాత్రలోన నతనిం బటుబాణచతుష్కయుగ్మ మే
డ్తెఱఁ దొడి మౌర్వి గ్రమ్మఱ ఘటించు నెడన్ వడి నేసి యార్చెనన్. 141
క. కురుసేనలోన నిట్లి,వ్వరుఁ జేసిన వారు లే రవార్యభుజావి
స్ఫురణోద[1]గ్రుండు గదే, గురుపుత్త్రుం డనుచు నమరకోటి నుతించెన్. 142
చ. చెఱునగ వొప్ప గాండివము సెచ్చెర సజ్యము సేసి సేన లు
క్కఱ రభసంబుమై నడరెఁ గవ్వడి ద్రౌణియు నీడఁబోక య
త్తఱిఁ దఱుమంగ నస్త్రములు దండడి [2]మార్కొని మండు చుండెఁ జి
చ్చఱపిడుగుల్ వడిం దొరఁగుచాడ్పున నంబరవీథి నుగ్రమై. 143
వ. ఇవ్విధంబున ధనంజయుం[3]డు రయంబున నేయ వేగంబున నేయుద్రోణతనయు
తూణీరంబులు శరశూన్యంబు లయ్యెఁ దనతూణీరంబు లక్షయబాణంబు లగు
టం జేసి యంతకంతకు నతిశయిల్లుపెల్లున నేయుచు నధికుం డగునప్పాండవమ
ధ్యముం గనుంగొని కృపాచార్యుండు సెంగటం దలమీఱిన. 144

అర్జునుఁడు కృపాచార్యునితో యుద్ధము సేయుట.

క. గురుపుత్త్రునిరథము విడిచి, సరభసముగ నందు సవ్యసాచి గవియుడుం
దిరమై యాతఁడు శితశర, పరంపరలు గురిసె నుగ్రబంధుర[4]గతులన్. 145
వ. పాండుపుత్త్రుండును జిత్ర[5]సంచారంబుల మెఱయుచు. 146

1 గ్రుఁడు గదె యీ, గురు. 2 దార్కొని ... జి, చ్చఱ ... చొప్పున నంబర. 3 డేయ వేగంబున నేయుటయు ద్రోణ. 4 భంగిన్. 5 ప్రచారం,

క. పటువిశిఖపంక్తి [1]యత్యు, త్కటరయమున నిగుడఁ జేయఁగా నవ్విధ మూఁ
దుట యైన మండె దీప్తో, ద్భటభంగిఁ గృపానలంబు బలములు వొంగన్. 147

వ. ఇట్లు [2]మండి శిఖింబోలెడికనకలిప్తఘనబాణంబు వనచరకేతువుం దాఁకించి వేఁడిమి సూపి వివిధాస్త్రజ్వాలలు గవియించి దిక్కులు సెలంగ నార్చినం గోపంబున నాటోపంబు మిగిలి బలసూదనసూనుం డతనికేతనంబు దునిమి తరణికిరణానుకారపారంగతంబు లగునారాచంబులు దదీయాంగంబుల నినుపం దొడంగిన రథచక్రరక్షకు లగుచంద్రకేతుండును జిత్రాశ్వుండును మణిమంతుండును మంజుమాళియు హేమవర్మయును సురథుండును సుషేణుండును నరిష్టుండును సుకేతుండును నుక్కు మెఱయ నొక్కటం దాఁకిన. 148

ఆ. అన్ని వెడఁదవాతియమ్ము లద్భుతముగ, నొక్కముష్టిఁ దొడిగి [3]గ్రక్కునంగ
నతఁడు లీలఁ దునిమె నందఱతలలును, ఘోరభంగి రక్తధార లెగయ. 149

సీ. తునిమి తోడన యొక్కసునిశితశరమునఁ, గాఁడియు రెంట నక్షములఁ ద్రుంచి
హరుల నాల్గిటఁ జంపి యాలంపుఁ[4]గోలతో, నొగలు మూఁడమ్ముల నుగ్గుసేసి
ధనువును సూతునితలయుఁ జెఱొక్కట, నఱికి లోచనముల నవ్వు నెఱయఁ
గృపుని నాలోకించి క్రీడి తద్వక్షఃస్థ, లంబునఁ గ్రూరభల్లంబు నాఁట

ఆ. హతరథుండు నిపతితాశ్వుండు సంఛిన్న, చాపుఁడును నికృత్తసారథియును
నయ్యు నొచ్చియును భుజార్గళసంరంభ, మతిశయిల్ల శక్తి నతఁడు వైచె. 150

ఉ. మండుచు [5]వచ్చుదానిఁ బదిమార్గణముల్ గొని వేగ మొప్ప నా
ఖండలనందనుండు గడికండలు సేసినఁ జూచి యప్పు డా
తం డుడివోక లేక సమదంబున ఖడ్గము ఖేటకంబు ను
ద్దండతఁ గొంచుఁ దేరు డిగి తాఁ గవిసెన్ రయ ముల్లసిల్లఁగన్. 151

వ. ఇట్లు గవిసిన. 152

క. పలుకయు వాలును నింతిం, తలు దునియలు సేసె బాణతతిఁ బాండవుఁ డి
ట్టల మైనవెఱఁగుపాటున, నిలిచి కృపుఁడు ద్రోణపుత్రునిరథం బెక్కెన్. 153

ఆ. అప్పుడే పడంగి యన్నిసేనలు భీష్ము, రథముపొంత కొదిఁగె రౌద్రరసవి
నోది యైనయర్జునుఁడు ధనుశ్చాలన, దీప్తమూర్తి యగుచుఁ దిట్ట కుఱికె. 154

వ. ఇత్తెఱంగున నుఱక తఱియ నుఱికిన. 155

క. బలములు దొరలుఁ బొదివి సం, కుల[6]యుద్ధము సేయ గ్రోధఘోరాకృతి యై

1 యం దుత్కట...యై మండెం దీప్తో. 2 మండెడు శిఖివోలెఁ గనలి దీప్తఘన; మండెడు శిఖిబోని కనకదీప్తఘనబాణంబులఁ గపికేతువుం...దిక్కులు (గలంగ) పెల్లగిల్ల...నొక్క మెయిం దాఁకిన. 3 యుక్కు మెఱయ...ధార లులియ. 4 బెలుఁగుతో...తలయు (వేఱొక్కట) నొక్కొక్కట. 5 బోవుదానిఁ...వోక యొక్కడుమదంబున; వోక వెక్కసము దక్కఁగ. 6 సమరము.

యిలఁ బ్రోవుగఁ జతురంగంబుల వ్రేల్మిడిఁ బాండురాజపుత్త్రుఁడు గూల్చెన్.

ఉ. చేతులతీఁట వోనిటు లశేషబలంబుల నుగ్గునేసి మాం
సాతతపంక మై బహువిధాయుధమీనము లొప్పఁ జామర
వ్రాతము ఫేనభంగి గ నిరంతరవీరశిరస్సరోరుహ
స్ఫీతవిభూతిఁ బొల్చునది సేసె రణస్థలియందు నెత్తుటన్. 157

తే. ఇట్లు కౌరవానీకంబు నెల్లఁ గలఁచి, యాడి భీష్మునిదెసఁ [1]బోవుక్రీడిఁ దాఁకెఁ
గొండతోఁ దాఁకుతగరునుద్దండవృత్తి,దోఁప వృషసేనుఁ డాహవదోహలమున.

వ. విజయుండును. 159

తే. భల్ల మొక్కట నాతనివిల్లు దునిమి, యైదునారసములు వక్షమూఁద నేసె
నతఁడు సైరింప రానినొవ్వఁడరుటయును, బెగ్గలంబున నరదంబు డిగ్గి పాఱె.

వ. అట్టియెడ దుశ్శాసనశకునిదుర్ముఖవివింశతి[2]వికర్ణులు దన్నుం బొదివికొనిన వా
రలరథరథ్యకేతువర్మంబులు జర్జరితంబులుగా నేసి గాసిచేసిన నందఱుం గనుక
నిఁ బఱవం దొడంగినఁ బార్థుండును బ్రహాసోల్లాసభాసి యగుచు నుత్తరుం
గనుంగొని. 161

తే. కనకమయతాలకేతువు గ్రాలఁ జిరత, టిల్లతాలీలఁ గలిగి శోభిల్లునంబు
దంబుచాడ్పున సురనదీతనయుఁ డున్న,వాఁడుసూచితె మత్స్యభూవరతనూజ.

అర్జునుఁడు భీష్మునితో యుద్ధంబు సేయుట.

క. బలువిడి [3]మనదివ్యాస్త్రం,బులచవి సూపంగవలయుఁ బో నిమ్ము రథం
బలసగతి నతనిదెస కని, పలికిన నతఁ డట్లు చేసెఁ బరమప్రీతిన్. 163

ఉ. శాంతనవుండు నప్డు నిజశంఖము గౌరవరాజసైన్యముల్
సంతస మంద నొత్తుచు ససంభ్రమలీల నెదుర్కొనంగ దు
ర్దాంతభుజాబలప్రకటదర్ప మెలర్ప నరుండు నొత్తె ది
గ్దంతినికాయకర్ణపుట[4]దారణవిత్తము దేవదత్తమున్. 164

తే. మలసి ఱంకెలు వైచుచు మాఱుకొనిన
వృషభములభంగి నక్కురువృషభు లిట్లు
సమదగతిఁ జేరునెడఁ జూచి రమరు లర్థి
ననిమిషత్వంబు దమ కప్పు డచ్చుపడఁగ. 165

వ. ఇవ్విధంబునం గనుంగొనుచు వారలు దమలోన. 166

క. మనలను దానవులను గడ,చినయవి భుజబలము లస్త్రశిక్షావిధముల్
గొనియాడఁ గొలఁది గా [5]దీ,తని నాతఁడ యతని నితఁడ తగుఁ జెనయంగన్.

---

1 బోవ. 2 వికర్ణులు మొదలుగాఁ గలవారలు... బ్ర(హాసో)హర్షోల్లాసభాసురముఖుం డగుచు. 3 నాదివ్యా. 4 దారుణవృత్తము. 5 దీ,తని కొతఁడ యతని కితఁడ తగుఁ.

సీ. అనుచుండ సైన్యంబు లార్పులుఁ బెడబొబ్బ, లును దూర్యనాదంబు [1]లుల్లసిల్లఁ
బేర్చి యొక్కుమ్మడి భీష్ము నగ్గింపంగ, నతఁడు నిశాతబాణాష్టకమునఁ
బడగపై హనుమంతునొడలను బహుశరం,బుల నందుఁ జెలఁగెడుభూతములను
దశవిశిఖములరథ్యములను సారథి, నేసె వాసవియును నెసక మెసఁగు
తే. నగ్గలిక గాండివంబు చక్రాకృతిప్ర, కాశవహ్నిస్వరూపత గలిగి విడుపు
తెఱపి గానంగ రా కుండ మెఱసి యొప్పు,సాంద్రసాయకతతి నాకసంబు గప్పె.
తే. [2]అర్జునుండు గవించిన యంప మూడ, మంచు దళముగఁ గప్పినమార్గణాంశు
జాలముల వెస విరియించె శాంతనవప,తంగుఁ డుద్ద్యోతమానప్రతాపలీల. 169
క. అమరేంద్రతనయుఁ డుగ్రా, స్త్రములు [3]వడిం గురియఁ గురియఁ దరమిడి వానిం
దుమురుగఁ జేయుచు వచ్చెను, సమరోల్లాసంబు మెఱయ శంతనుసుతుఁడున్.
క. అర్జునుఁడు దివ్యబాణ, స్ఫూర్జితదోశ్శక్తి దనకుఁ జూపిన నతఁ డ
తూర్జితబలుఁ డై నియమో, పార్జితఘోరాస్త్రవితతిఁ బ్రతిహతిఁ జేసెన్. 171
క. కవ్వడి యెమ్మెయి నేసిన, నవ్విధమున [4]నాశరంబు లన్నియు దాదా
దవ్వులన నిలువరింపఁగ, నివ్వచ్చుఁడు గినిసి యేసె విలు విఱుగంగన్. 172
మ. తనకోదండము ఖండితం బగుడుఁ గ్రోధంబార మందాకినీ
తనయుం డప్డు సటా[5]విలుంఛనసముద్యత్క్రోధసింహాకృతిన్
ధను వొం డుద్ధతలీల నెత్తికొని యస్త్రశ్రేణిఁ బర్వించె న
ర్జునుపైఁ దాఁకిరి చక్రరక్షకులు నార్పుల్ నింగి ముట్టన్ వడిన్. 173
చ. విజయుఁడు వారినెల్ల నొకవ్రేల్మిడిఁ ద్రుంచియు భీష్మసాయక
వ్రజము నడంచియున్ రథమువాజుల నొంచియు నాజికేళియం
దజితవిలాసముల్ మెఱయ నప్పుడు విస్మయ మందు చుండఁ గుం
భజముఖయోధవీరతతి ప్రస్తుతి సేసిరి సిద్ధఖేచరుల్. 174
క. కొండొకయెడఁ గని శాంతన,వుం డాఖండలతనూభవునిడామూఁ పు
ద్దండభుజబలము మెఱయఁ బ్ర,చండాస్త్రక్షతము సేసె సరభసవృత్తిన్. 175
చ. కినుక మనంబునం గదిరి క్రీడి పితామహువిల్లు వ్రేల్మిడిం
దునిమి [6]నితాంతగాఢరయదోర్విభవంబున నొండువిల్లు గై
కొనియెడుసందునన్ నినిచెఁ గ్రూరశరంబు లురంబునందు గ్ర
క్కున నతఁ డొల్లఁ బోయి రథకూబర మూఁతగ నిల్చె సోలుచున్. 176
క. కనుఁగొని సూతుం డరదముఁ, గొనిపోయెం దొలఁగ నపుడు కుంతీతనయుం
డనిఁ దనివి సనక గుంపులు,గొని యున్నెడ లరసెఁ గలయఁ గురుసైన్యమునన్.

---

1 లును జెలంగ...రూపత గడల విద్రువు (వ). 2 అర్జునుఁడు గవియించిన యంపమూఁ
ప. 3 వడిం దొరఁగ జేయ ; వడిం గురియ నడుమఁ. 4 నారసంబు లన్నియు నతఁడున్.
విలుం (ట) తన. 6 నిశాతకాండరయ.

వ. ఇట్లత్తఱి చూచి గాండీవంబు దొడసి గుణంబు సారించి కవదొనలు బిగియించి.

క. ఆచార్యసూర్యతనయకృ, పాచార్యప్రభృతిరథికు లందఱు [1]దన్నుం
జూచుచు నుండఁగ నద్దెస, కేచి భుజాబలము మెఱయ నింద్రజుఁ డరిగెన్. 179

వ. అప్పు డశ్వత్థామ కర్ణున కిట్లనియె. 180

ఆ. [2]వీఁడె వచ్చు చున్నవాఁడు పార్థుఁడు మన, మేమి సేయువార మిూవు దక్క
నొరులు నిలువరింప నోపెడువారు లే, రోట లేక తాఁకి యోర్వవలయు. 181

క. అని తను నుల్లస [3]మాటకుఁ, గినిసి యినతనూజుఁ డేను గ్రీడి నిచట మా
ర్కొనువీఁకఁ గన్నులారం, గనుఁగొనుమీ నిలిచి యనుచుఁ గవిసెం బెలుచన్.

క. దొరలును సుభటులుఁ గర్ణుని, యరదమునకు మున్న పొదివి రర్జును నచటం
గరి [4]సొచ్చుతుంగమదువున, పరుసున మొన చాఁపకట్టు వడియె నతనిచేన్. 183

తే. ఇవ్విధంబునఁ బోరెడు నింద్రతనయు, నుక్కు లావును నంతంత కెక్కుడయ్యె
[5]నలసి మేనులు దూలాడ నిలిచి రంత, నంత నయ్యోధముఖ్యు లాహవము దక్కి.

వ. అట్టియెడ నుత్తరుండు నరున కిట్లనియె. 185

చ. [6]ఉడుకువ లేనికయ్యమున కోర్వఁగ వచ్చునె నాకు డప్పి వు
ట్టెడు నొకమాటు నాగ్రహము డింపవు నీవును జక్క సేసి ప
చ్చడి గలపంగ వెండియును జండితనంబున వచ్చి వచ్చి పో
రెడు మొన లింకఁ జాల నొనరింప భవద్రథసూతకృత్యమున్. 186

వ. అనిన విని కవ్వడి నవ్వుచు నేను గలుగ నీకు నోహటింప నేల యంతియ వలసి నం దురంగంబులఁ దోడు గడపెద నించుక సైరించి నిలువ వలయు నెల్లపనులును జక్కనయ్యె రా జొక్కరుండు గొఱంత [7]యాతం డభిమాని మనలం గని సరకు గొనఁ డిప్పు డున్నచందంబు మనతోడం దలపడం గడంగుట దోఁచుచున్నయది తమ్ములు నాప్తభృత్యులు నిరుగెలంకుల నగ్గలిక మెఱసి డగ్గఱి యున్నవా రని కౌరవేశ్వరునిగట్టి మోహారంబు సూపి యతనిం బురికొల్పి యద్దిక్కు దేరు వోవని మ్మనుటయు నతండును దలకొని యట్ల చేయ నడరి యెడనెడ నడ్డపడుకురువీరులం జిఱునగవు గెడ నిగుడ మెఱుంగు వాలమ్ములఁ దూలంగ జడియుచుం గదిసిన నమ్మేదినీవల్లభుండు. 187

అర్జునుఁడు దుర్యోధనునితో యుద్ధంబు సేయుట.

క. పులి గోల వేసినట్టి, ట్టలపురయంబునఁ గడంగుటయుఁ దద్వక్ష
స్స్థలమునఁ గిరీటి రెం డ, మ్ముల నాఁటఁగ నేసె బొమలు ముడివడు చుండన్.

---

1 మోప్రిడై; ప్రోవై. 2 చూడు వీఁడె వచ్చుచున్నాఁడు పార్థుఁ డే, మేమి సేయు... (వారలే, యోట లేక తాఁకి) వారు లే, రోర లేక తాఁకి. 3 మూడినఁ. 4 సొచ్చినతుంగమదువు, పరు. 5 (సొలసి) మేనులు తూఁగాడ. 6 ఉడుగ ఏదేమికయ్యమున కోపఁగ. 7 యాతండు దురభిమాని.

క. కుతములఁ బెల్లు దొరఁగుశో, ణితధారలు మదముగా [1]వినిర్గళకరియా
కృతిఁ గవిసి యతం డేసెను, శతమఖసుతుఫాలతలము శాతశరమునన్. 189

తే. [2]రక్తధారయు వెడలంగ రశ్మి వెలుఁగఁ
బొలుచు బాలార్కుచాడ్పునఁ జెలువు మిగిలి
ఫల్గునుండు ప్రతాపసంభరితమూర్తి
యగుచు శరకిరణంబులు నిగుడఁ జేసె. 190

శా. వానిం దీవ్రశరంబులం దునిమి గర్వం [3]బెక్కి నానాస్త్రసం
తానంబుల్ గురిసెన్ సుయోధనుఁడు దుర్దాంతాకృతిన్ గోత్రభి
త్సూనుండుం బటుసాయకోత్కరమునం జూపెన్ భుజాటోప మి
ట్లేనుం గేనుఁగుఁ దాఁకునట్లు సమరం బేపారఁగా నయ్యెడన్. 191

తే. హస్తిపురిఁ బేరు గల [4]మదహస్తి నెక్కి, క్రాలుకావలిరథములు గవియు దేర
నభ్రగజముపైఁ బర్జన్యుఁ డనఁగ నంప, వాన పరఁగ వికర్ణుండు వచ్చి తాఁకె.

ఉ. వీఁక నెదిర్చి యిట్లు కురువీరులకుం బ్రమదం బొనర్చుచుం
దాఁకినఁ గ్రోధవేగసముదగ్రత నెఱ్ఱనిచూడ్కిఁ జూచి పే
రాఁకలితోఁడ నున్నజమునాకృతి భీషణరేఖ యొప్పఁగా
వ్రేఁకనినారసంబు దొడి క్రీడి కరిన్ దృఢముష్టి నేసినన్. 193

ఆ. ఫాలకుంభసంధిఁ బడి వాలమున [5]దెస, నుచ్చిపోవుటయును నుర్వి యద్రువఁ
గూలె నగ్గజంబు కులిశచండాహతిఁ, బడుమహానగంబుభంగి దోఁప. 194

క. అరుణమణిమాలికావి, స్ఫురణంబున దంతితనువు సూడఁగ నొప్పెన్
[6]ధరణిఁ బడియున్న బహుముఖ, పరిగతదావాగ్నిఁ బొల్చు పర్వతము క్రియన్.

వ. ఇవ్విధంబున నేనుంగు పీనుంగైన వికర్ణుండు వెఱచఱచి పఱచి వివింశతిరథం
బెక్కె నాలోనన యట్టినారాచంబున రారాజునురంబు నొనాట నేసినఁ గరీం
ద్రుండు వడుటయు నరేంద్రుండు నొచ్చుటయుం గని ఱిచ్చవడురథికుల విప్వ
చ్చుం డనర్గళప్రసారం బగుమార్గణాసారంబున ముంచిన వెగడుపడి విఱిగి పాఱి
రిత్తెఱంగునఁ దనచుట్టును బయ లైన నయ్యురగకేతనుండును మరలె నిట్లు
[7]దొరయును విఱిగి కలను వాసి కాలుద్రోసిపోవుటయు నతిరథమహారథు లెల్లం
జెల్లాచెద రగుటయుం జూచి సైన్యంబు లున్నవి యున్నచోటన తెరలి కనుకనిం
బఱవం దొడంగిన. 196

తే. యూథపతితోడిదంతిసముత్కరంబు, వెనుకఁ దగిలెడుసింగంబువిధము దోఁప

---

1 వినిద్రకరీంద్రాకృతి; వినిర్గతకరియాకృతిఁ ... శాతశరములన్. 2 రక్తధారలు వెడలంగ (రక్తధార వెడల నొక) ...బాలార్కు బింబంబు చెలువు మిగుల...యొగచి శర. బెక్కు. 4 మదహత్తి...కావలిమూఁకలు ; కావలిరథికులు. 5 వెస ... కులిశధారా ఘాతిఁ. 6 ధరఁ బడియున్నను. 7 దొరలును విఱిగి (దొర విఱిగి) కాలు మూసి.

నార్పు నాదంబుగా నరుఁ డంటఁ దాఁకె, రాజుఁ దారును బాఱెదురథికవరుల.

క. వెనుకొని కర్ణునిపెడతల, యును దుశ్శాసనునివీఁపు నొక్కొక్కశరం
బున నేసె నప్పు డయ్యిన,తనయుం డి ట్లనియె నతిరథశ్రేష్ఠులతోన్. 198

ఆ. కూడి ముట్టెఁ గ్రీడి కురువంశమున కెల్ల, మూలకంద మీనృపాలుఁ [1]డతని
నిచటఁ గాచికొనుట యెల్లపౌరుషములుఁ, జేత నిలిచి లావు సేయవలయు.

క. అనవినుచుఁ గురుపితామహుఁ,డును ద్రోణుఁడు ద్రోణపుత్త్రుఁడును గృపుఁడును గ
ర్ణునిమాట సరకు సేయక, చను చుండఁగ దీనవృత్తి జనపతి వలికెన్. 200

క. లోకంబుతోడివారుగ, మీకుం జనునయ్య మగఁటిమికి గుఱి గాదే
నా కెడ రైనయెడం దగఁ, జేకొని యది [2]మీరు చక్కఁ జేయుట యరయన్.

వ. అనిన విని వారలు వెనుక నై యాశ్వాసవచనంబులు వలుకుచుం బోవం
బోవుచున్నయన్నరేంద్రు నెలుం గెత్తి పిలిచి పార్థుం డి ట్లనియె. 202

అర్జునుఁడు దుర్యోధను నుపాలంభించుట.

ఉ. క్షత్త్రియుఁ డోడునే తగదు కౌరవరాజ యొకండ నేఁ బృథా
పుత్త్రులలోనఁ బిన్న నినుఁ బోరికిఁ బిల్వఁగ [3]మాని నాఁగ ని
ద్ధాత్త్రిఁ బ్రసిద్ధి కెక్కి బలదర్పసమగ్రుఁడ వైననీవు నీ
మిత్త్రులుఁ గూడ ని ట్లయిన మెత్తురె వత్తురె కొల్వ భూభుజుల్. 203

సీ. ఏనుంగు నెక్కి పె క్కేనుంగు లిరుగడ, రాఁ బురవీథులఁ గ్రాలఁ గలదె
మణిమయం బైనభూషణజాల[4]ముల నొప్పి, యొడ్డోలగంబున నుండఁ గలదె
కర్పూరచందనకస్తూరికాదుల, నింపు సొంపార భోగింపఁ గలదె
యతిమనోహర లగుచతురాంగనలతోడి, సంగతి వేడ్కలు సలుపఁ గలదె

తే. కయ్యమున నోడి పోయినఁ గౌరవేంద్ర, వినుమునాబుద్ధిమరలి యీతనువు విడిచి
సుగతి వడయుము తొల్లింటిచూఱ గలదె,జూద మిచ్చట నాడంగరాదుసుమ్ము.

వ. అని వెండియు. 205

క. నీయట్టివాఁడు నిస్సీ, పోయెడిదే యిట్లు వోకు పోక్కు మనుడు భూ
నాయకుఁడు మరలి పటుకో,పాయత్తతఁ ద్రొక్కఁబడ్డయహిగతిఁ గవిసెన్.

వ. ఇట్లు గవిసి రథంబులం గడచి కవ్వడిం దలపడియె భీష్మద్రోణాదియోధవీరులు
నొక్కుమ్మడి మగిడి యధిపతితోడన నిగిడి క్రీడియరదంబుఁ బొదివిరి తక్కిన
బలంబులు నంతకు మున్న కౌంతేయుదెస మరలి చూచుచుం బాఱు చునికిం
జేసి యేలినవాఁ డఱుముటయును దొరలు దెగి తిరుగుటయుం గని తెంపు
సేసి కూడికొని రభసంబునం జుట్టు ముట్టి యతనిపైఁ గ్రందుకొన నడరె నివ్వి

1 నితని. 2 మీకుఁ. 3 బోక పాడియే ధాత్రిఁ...భూజనుల్. 4 ములు దాల్చి, యొనరఁ బేరోలగంబుండఁ గలదె...నోడి పాఱినఁ.

ధంబున వివిధవ్యూహంబు లగుబహుయోధ[1]యూథంబులుగురిసినయనేకాస్త్ర
శస్త్రంబులు నానాప్రకారంబులఁ గుప్పంగూరలుగాఁ దొరఁగినం బెరిఁగినశౌ
ర్యసంరంభంబున విజృంభించి విజయుం డాశ్చర్యధుర్యనిరతిశయరయభరితకర
యుగళుం డయి రథరథ్యసారథిస్వాంగంబులు గాచికొని తనతోడంబుట్టువుల
ప్రతిన లూహించి యొండుసేయ నొల్లక సపరివారంబుగా ధార్తరాష్ట్రుల
భంగపెట్టం దలంచి యింద్రదైవత్యంబును సత్యసంవాదనంబును నరాతిసైన్య
దైన్యసంపాదనంబును నగుసమ్మోహనాస్త్రింబుఁ బ్రయోగించిన. 207

ఆ. ఆయుధములువిడిచియంగముల్ సోలంగఁ,దలలుమెడలుఁ [2]జక్క నిలువకొఱగ
నెల్లవారు నెఱుక నెడలి చొక్కిక్కి ని,ద్రాతిశయము గూరినట్లు లైరి. 208

వ. అప్పుడు పాండవోత్తముం డుత్తరమాటలు దలంచి యుత్తరుం గనుంగొని.

సీ. ఇక్కురుసైన్యంబుసొక్కు దక్కకమున్న, గ్రక్కునఁ జనుము రారాజు ద్రోణ
తనయుండుఁ జుట్టినతలచుట్లు నల్లని, యవి సూతపుత్త్రుశిరోంబరంబు
[3]పచ్చనియది కుంభభవ కృపాచార్యుల, యుష్ణీషములు వెల్ల లుఱక నీవు
దెమ్మింతవట్టును దేవనదీసూనుఁ, డియ్యస్త్రిమునకు మా తెఱుఁగుఁ గాన

ఆ. యతఁడు దెలిసియుండు నాతనిదెస వోకు,మనిన మత్స్యరాజతనయుఁ డెలమి
దొలఁక నొగలఁ బగ్గములు గట్టి చని వాని,నెల్లఁదెచ్చి యరద మెక్కుటయును.

వ. ఈరథబృందంబులయిఱకటంబు వెడలి నిలుతమని కదలినం గిరీటిం దాఁకి
గురుపితామహుండు శరవర్షంబులు గురిసిన. 211

క. ఆతనిరథ్యంబులఁ ద,త్సూతుని నొప్పించి సాంద్రసునిశితబాణ
వ్రాతంబు మేన నించి పృ,థాతనయుఁడు నిలిపి వెడలె దర్పో[4]జ్జ్వలుఁ డై. 212

వ. [5]ఇవ్విధంబున నరదంబులయిఱకటంబు గడచి యెడ గలుగ నిలిచి రాహు
నిగ్రహనిరాసభాసురుం డగుభానుండునుం బోలె వెలుంగు చున్నంత బలం
బులు దెలిసిన. 213

ఆ. కౌరవేశ్వరుండు గను విచ్చి దిక్కులు, గలయఁ జూచి పార్థుఁ గాంచి కడఁగి
యదరఁ జూచుటయును నమరనదీసూనుఁ, డతని కిట్టు లనియె నల్ల నగుచు.

క. ఇంత యెఱుంగవు సైన్యము, లింతవడిం దలలు చీర లెఱుఁగక మోహా
క్రాంతంబు లయ్యెఁ బని దెగుఁ, గౌంతేయుఁడు సొరఁడు గాని క్రౌర్యంబునకున్.

క. మెడ యొఱగఁ జేతికై దువు, వడ నిను నీ వెఱుఁగ కున్నభంగి గవియుఁ గ
వ్వడి యూర కుండు నటె చె,ప్పెడుకొలఁదియె వానికరుణపెంపు కుమారా.

వ. అతండు మనప్రాణంబులపై రానొల్లక నిలిచిన మన మింతట నిలుచుట కార్యంబు.

1 యూథంబులు గవిసి యనేకాస్త్ర...గుప్పఁగూరుగాఁ దొరఁగించినం...భుజయుగళుం.
2 గాల్లు...నెఱుక యె(లె)డలి. 3 పచ్చన కుంభసంభవ. 4 ద్ధతుఁ డై. 5 ఇత్తెఱంగున
...రాహుగ్రహణ.

ఉ. మోహనబాణపాతమున [1]ముం దలచీర లెఱుంగ కున్నయా
బాహుబలంబుతోఁ గడఁగి పార్థునిఁ దాఁకెడుబుద్ధి గ్రమ్మఱన్
సాహసవృత్తిఁజేసి యవిచారతఁ బోయితిమేని వాఁడు పూ
ర్ణాహుతి సేయఁడే మనల నందఱ నొక్కట మార్గణాగ్నికిన్. 218

వ. కావున. 219

క. మనదేశమునకుఁ బోదము, మన [2]మల్లన తెరువు వట్టి మత్స్యవిభునిగో
ధనముఁ గొని యతఁడు ప్రీతిం, జనుఁ గా కటు మనకు నంతచల మేమిటికిన్.

దుర్యోధనుఁడు పరాజితుం డై మరలి తనపురంబునకుఁ బోవుట.

వ. అని చెప్పినపితామహుహితవచనంబు లాకర్ణించి సంగ్రామాతికామియుం గోపాటోపఘూర్ణమానమానసుండు నగునమ్మానవేశ్వరుండు నిట్టూర్పు [3]నిగిడించి యుద్రేకంబు దక్కి నిలిచెం దక్కటివారలు నూర్జితం బగు నర్జునాననంబు నాలోకించి ధార్తరాష్ట్రరక్షణతాత్పర్యంబున శౌర్యంబు సాలించి భీష్మవాక్యప్రకారంబు సేసి రి ట్లందఱు ముందర దమవచ్చినవంకన తిరిగి యరుగు చున్నం గని కిరీటి శంఖరవజ్యానాదంబులు సెలంగఁ గొండొకదవ్వు వెన్నడిం దఱిమి బిరుదులతోడిగొడుగులును నడియాలంబులతోడిసిడంబులును వైపించుకొని తృప్తిం బొంది మరలువాఁడై యెల్లవారును వినం బెద్దయెలుంగునం బోయి వచ్చెద నని చెప్పి గాంగేయద్రోణకృపాచార్యులకుఁ బ్రణామబాణంబు లేసి వారివీడ్కొనినవాఁడై మిట్టకోలల రారాజుమకుటంబుమణులు డులిచి యతనికిం జెప్పినవాఁడై యఖర్వబాహాగర్వనిర్వహణంబు మెఱయ నప్పుడు మధ్యందినమార్తాండప్రచండుం డగుచుండఁ గౌరవవీరు లతనిం దేఱి చూడనుం జాలక చని రతండును జూపఱం దోలి నిలిచిన[4]మదపుటేనుంగుచందంబున నిలిచి విరాటతనయున కి ట్లనియె. 221

ఆ. పసులు మరలె శత్రుబలములు పీనుంగు, పెంట లయ్యె రాజుఁ బెద్దదొరలుఁ
జీర లొలువఁ బడిరి సిగ్గఱి బిరుదులు, వైచి రింక మగుడ వలదె మనకు. 222

క. హయముల మరల్పు మీత,ల్లియు బంధులు నెడలు సంచలింప గుమురు గ
ట్టి యెదురుసూతురు వారికిఁ, బ్రియముగ శీఘ్రమ్మునం బురికిఁ బో వలయున్.

వ. అనిన నతండు రథంబు [5]మగిడించినం జని చని. 224

తే. కాలుతక్కువ[6]వారలుగలయఁజెదరి, వెనుకఁబడిపోవునెడఁదన్నుఁగనిభయమునఁ
బ్రాణదానంబు వేఁడినఁబార్థుఁడభయ,హస్తమిచ్చుచుదయపెనుపారఁబలుకు.

వ. ఇట్లు నానావిధదీనదశాదందహ్యమాను లగుకృపణులం దనకృపామృతంబునం దడిపినం దేఱి వారు దీవించుచుం బ్రణమిల్లుచుం బొగడుచుం బోవు చుండ

---

1 ముంచిన లజ్జ. 2 మియ్యెడ మసల నేల మత్స్య. 3 (నిగుడించి) నర్జునానలంబు.
4 మదము నేనుంగు చందం. 5 (మగుడించినం). 6 గలవారు.

ధనంజయుండు భూమింజయుం జూచి. 226

ఆ. కురుబలంబు గెలిచి గోవులఁ గ్రమ్మఱఁ, దెచ్చు టెల్ల నీయుదీర్ణబాహు
బలము కాఁగ నీవుపలుకుము వెలిఁ బుచ్చు, టుడుగు మధిపుపాల నొండు దెఱఁగు.

క. అనవుడు నీచేసినయీ, పని నాచేఁగాక యునికి పతి యెఱుఁగఁడొకో
జనులు నిజము సేయుదురే, నిను నెఱిఁగింపకయ చెప్ప నేర్తునె పొసఁగన్.

వ. అని యుత్తరుండు మఱియును. 229

క. నీ[1]వలచినయప్పుడ ధాత్రీవల్లభుఁ డెఱుఁగునట్టి తెఱఁగు నడపెదఁ
దేవేంద్రపుత్ర యే ననఁ, గా వేఱొక పేరు గలదె కార్యము నడపన్. 230

వ. అనువచనంబు లియ్యకొనుచుం జని శమీవృక్షసమీపంబున నిల్చి గాండీవాది సాధనంబులు పూర్వప్రకారంబున నిక్షేపింప నియోగించి కపిధ్వజదేవదత్తకిరీటాది దివ్యపరికరంబుల సవినయంబుగాఁ బ్రార్థించి యంతర్ధానంబు సేయించి యెప్పటిసింహపతాక రథంబున బంధింపం బనిచి విరాటతనయుండు నిజాయుధంబులు గైకొని రథికుం డయి వచ్చునట్లుగాఁ జేసి తొంటిచందంబునం దలచీర యలవరించికొని సారథి యై సవ్యసాచి నొగ లెక్కి నట్టిసమయంబునఁ బురందరాది బృందారకులును దేవమునిసిద్ధగంధర్వాదులును బాండుప్రముఖరాజలోకంబును నాశ్చర్యహర్షాయత్తచిత్తు లయి సమరవిషయంబు లయినమాట లాడుచు నిజనివాసంబుల కరిగి రట నరుండు నుత్తరు నాలోకించి నీవిజయంబు పురంబున ఘోషింప గోపాలురం బుచ్చు మనిన నతం డది దెఱంగుగాఁ గైకొని యట్లచేయ నిట్లు నిగూఢంబుగాఁ బట్టణంబునకుం జనుచుండ నంతకు మున్న మత్స్యమహీవల్లభుం డాహవజయదర్పితవాహినీపరివృతుం డై నగరంబు సొత్తెంచి. 231

తే. మందిరాభ్యంతరమున కానందలీలఁ, బాండుపుత్రులుఁ దక్కటిబంధుజనులుఁ
దానుఁ జని విప్రులును వనితా[2]జనంబు, నేస లొలుక సింహాసనాసీనుఁ డయ్యె.

వ. ఇవ్విధంబునం దనవిజయంబు గొనియాడ వచ్చిన వారి నెల్ల నభినందించి యుత్తరుం డెచ్చట నున్నవాఁ డని యడిగి వారలవలనం గురునాథుండు భీష్మద్రోణకర్ణకృపాశ్వత్థామాదియోధవీరులు బెరసినబలంబులతోడ నడచి యుత్తరంబునఁ బసులం బట్టిన నతండు బృహన్నల సారథింగాఁ గైకొని యొక్కరుండ కుయివోవుట విని విషాదవేదనాదోదూయమానమానసుం డగుచు మంత్రుల మొగంబు సూచి యి ట్లనియె. 233

—విరాటుఁ డుత్తరుఁడు గురుసైన్యంబు గెలువఁ బోవుట విని చింతించుట.—

చ. అసమున మీఁ దెఱుంగక మహాగ్రహవృత్తిఁ గడంగి చెచ్చెరం

1. వలసిన... వేఱొక(మాట)పట్టు గలదె ; వేఱొక్కఁడనె తలఁపఁ గార్య. 2 గణంబు.

బసులకుఁ గూయిగాఁ జనియెఁ [1]బాపఁడు కౌరవసేన యేడ యొం
టి ననుట యేడ నా కిది గడిందివిచారము పుట్టె సైన్యముల్
వెసఁ జని తోడు గావలయు వేగమ పంపుఁడు సాలునట్లుగన్. 234

చ. అనుటయుఁ గంకుఁ డిట్లనియె నక్కడ వచ్చి సుశర్మ యోడెఁ గా
వున విట వీరికిన్ జయ మవున్ వెఱ పేటికి నీకు నుత్తరుం
డని నొకరుం[2]డు నాకుము బృహన్నల సారథి గాన గెల్చు న
య్యనిమిషకోటి నైన నతఁ డద్భుతవిక్రమజృంభణంబునన్. 235

చ. అన వినుచుం గలంగుహృదయంబునఁ దాపము నివ్వటిల్ల ని
ట్లను మఱియున్ విరాటుఁడు రణావనియందుఁ ద్రిగర్తసేనచే
ననయము నొచ్చినట్టిజను లందఱుఁ దక్కఁగ [3]నేటుఁ బోటుఁ దాఁ
కని ఘనయోధకోటి సనఁగా వలయున్ బలుమై రయంబునన్. 236

క. చని యక్కుమారుఁ డేమ,య్యెనొ యత్తెఱఁ గెఱఁగి మనకు నెయిదించుట పు
ట్టినకార్యమునకుఁ దగియెడు, పని యట విధి [4]గెలువ వసమె బ్రహ్మకు నైనన్.

వ. అనుచు నుత్తలపడునయ్యవసరంబున నుత్తరుండు పుత్తెంచినగోపాలురు పఱ
తెంచి యతనిం గాంచి. 238

చ. కురుబలమున్ జయించి మనగోవుల నెల్లను గ్రమ్మఱించి యు
త్తరుఁ డిదె తాను సూతుఁడు నుదగ్రత వచ్చుచు నున్నవాఁడు త
త్తురగరథధ్వజాలి నొక తుప్పుడు రాలదు మమ్ముఁ బిల్చి వే
పురి [5]నెఱిఁగింపుఁ డన్న నృపపుంగవ వచ్చితి మేము నావుడున్. 239

తే. అంతరంగంబు నిండి రెండలువులందు
వెడలుసంతోషపూరంబువిధము దోఁపఁ
గన్నుఁగవ సమ్మదాశ్రులు గడలుకొనుచు
గండపులకాంకురములతోఁ గ్రమ్ము దేర. 240

క. ఏమేమీ యని గోప, స్తోమముఁ బలుమాఱు నడుగుచున్ మెయి వొదలన్
భూమీశుఁ డపుడు మంత్రుల, మోములు గనుఁగొని సగర్వమున నిట్లనియెన్.

శా. వీటన్ వీథుల నెల్ల నేనుఁగులపై విస్ఫారఘంటాధ్వనిం
జాటం బంపుఁడు పేర్మి నుత్తరుజయాశ్చర్యంబుఁ బుణ్యాంగనా
కోటిం బుచ్చుఁ డెదుర్కొనంగ మహితక్షోణీసురవ్రాతమున్
ఘోటస్యందన[6]వారణప్రతతులం గూడన్ సతూర్యంబుగన్. 242

క. ఉత్తమకన్యాజనములు, నుత్తరయును గంధమాల్యయుక్తముగఁ గుమా

1 (బాతఁడు). 2 డ నాకుము; డు కాకల. 3 నాటుఁ బోటు...బలు (ప్లై) వై. 4 గడవ వశమె (నగునె) బ్రహ్మాదులకున్. 5 కెఱిఁగింపుఁ. 6 హస్తిసైన్యతతులం; చారణ ప్రతతులం.

రో త్తము నెదుర్కొనం దగు, నత్తెఱంగున సంఘటింపుఁ డభిరామము గాన్.

వ. అని నియోగించి గోపాలురకుం గట్టనిప్పించి కంకు నాలోకించి నెత్తం బొకపలుక యాడుదమే యని యుబ్బుమై మాటగాఁ బలికి నతండు నీవు [1]సుమాళంబున నున్నవాఁడవు నేఁడు నీతోడ నాడి జయింప రాదు వెఱతు ననిన విరాటుండు నగుచుఁ దత్ప్రదేశంబున మెలంగు సైరంధ్రిం గనుంగొని సారెలు దెమ్మని పనిచి పలుక ముందటికిఁ దిగిచికొనుచు నిందు రమ్మనవుడుఁ బాండవాగ్రజుండు జూదం బాడుట యెంతలెస్స యనుచుం జేరి యాడం దొడంగునప్పుడు మఱియు నిట్లనియె. 244

ఆ. జూద మాడి ధర్మసూనుండు రాజ్యంబు, ననుజులను బ్రియాంగనను బణంబు
గాఁగ నొడ్డి యాడి కాఱియఁ బడఁడె య, ట్లగుట దీనితోడి [2]యర్థి గీడు. 245

వ. అని పలికి యాడు చుండుసమయంబున. 246

మ. నరనాథుండు ప్రమోదసంపదుదితోన్మాదంబుమై నిట్లనుం
గురుసైన్యంబుల ముట్టి గెల్చి యెలమిన్ గోవర్గముం దెచ్చె ను
త్తరు బాహాబలశౌర్య[3]సారము లుదాత్తంబుల్ గదే యెందు నె
వ్వరు నెక్కాలము నిట్లు సేసిరె కులైశ్వర్యం బవార్యంబుగన్. 247

వ. అనిన విని కంకుం డతని కి ట్లనియె. 248

చ. కురుపతి భీష్మకర్ణ కృప కుంభజముఖ్యమహోగ్రయోధవి
స్ఫురణము నోర్వఁ జాలి రణభూమి భుజాబల ముల్లసిల్ల ను
త్తరుఁడ జయించెనేని వసుధావర యింతటికంటె నింక న
చ్చెరువును గల్గునే ధరఁ బ్రసిద్ధికి నెక్కుఁడె యాతఁ డొక్కఁడున్. 249

తే. అనినఁ గటకటఁబడి యిట్టు లాడు టెల్ల, నతనివిజయము సందియ మనుటగాదె
యింతవట్టును సైరించి తీవు గాన, యింక నీమాట లుడుగుము కంకభట్ట. 250

వ. అనుచు విరాటుండు గటంబు లదరఁ గన్నులఁ గెంపు గదురఁ బలుక చప్పుడగ్గలంబుగా నాడుచున్న సరకు సేయిక యుధిష్ఠిరుండు వెండియు నిట్లనియె. 251

చ. కురుబల మేల దైత్యసురకోటులు వచ్చిన గెల్వ రాదె యు
త్తరునకు నాబృహన్నల రథంబుపయిం బరవాహినీభయం
కరభుజసారమున్ మెఱయఁ గాఁ దఱి [4]గాంచితి నంచు విక్రమో
ద్ధురగతి నాజికేలినిరతుం డయి దుర్దమలీల నుండఁగన్. 252

వ. అనిన విని సక్రోధహాసోల్లాసవికృతాననుం డై మత్స్యమహీనాథుండు. 253

ఉ. వింతలు సాల నీవలన వింటిమిగాని ధరిత్రి నెందు నే
మింతకు మున్ను సారథుల నెవ్వరిఁ జూడమె వైరివీరదు
ర్దాంతభుజావిలాస మలరం దెగి పోరుల నస్త్రశస్త్రవి

1 సుమాణంబున. 2 దధిప గీడు. 3 సంపద. 4 గాంచి మహోగ్రవిక్రమో.

క్రాంతిఁ గడంగువారి నని కన్నుల నిప్పులు రాలు చుండఁగన్. 254

క. నాకొడుకు[1]పోటుమాటలు, నీకేటికిఁ బొసఁగ నాడ నేరవు మార్గో
ద్రేకమునఁ బలుకు చుండుట, మాకు సహింపంగ రాదు మానుము విప్రా.

క. అనినం జలమునఁ గుంతీ, తనయాగ్రజుఁ డిట్టు లనియె దరహాసం బా
ననమున ముసుఁగువడఁగ న, జ్జననాయకుతోడ [2]నిట్లశంకితభంగిన్. 256

ఉ. ఆహవకేళి వేడుక బృహన్నలచిత్తమునం [3]దెలర్చినన్
సాహసవృత్తి నుత్తరుని సారథిఁగాఁ గొనిపోయి కౌరవ
వ్యూహము నొర్చి నీపసుల నొక్కఁడుఁ దక్కక యుండ సత్వరో
త్సాహతఁ దెచ్చెఁ గా వలయుఁ దప్పదు నాపలు కట్ల చూడుమీ. 257

క. అని యంతట నిలువక య, మ్మనుజేశ్వరు మొగముఁ జూచి మఱియును నతఁ డి
ట్లనుఁ బురములోనఁ జాటం, బనుపు బృహన్నలజయంబు భవ్యవిచారా. 258

విరాటుండు గంకుని సారెగొని వ్రేయుట.

ఆ. అనిన రౌద్రరసము మనమున నడరంగఁ, బడగ యెత్తునురగ[4]పాలు రేఖ
నెనయు చేతిసారె గొని వ్రేసెఁ బతి పేడి,గడన యుడుగు మన్న నుడుగ వనుచు.

వ. ఇవ్విధంబున వ్రేటువడి యజాతశత్రుం డలుక గదురనిహృదయంబుతోడం బాంచాలిదెసం జూడ్కి మలఁగ నూర కుండె నన్నారీరత్నంబును రయంబునం జేరి వ్రేటుగంటిం దొరఁగురుధిరంబుఁ దనయుత్తరీయంబున మెత్తన యొత్తి యచ్చేరువ నున్న కనకకలశంబుజలంబులం గరతలంబు దడిపికొని తుడుచునప్పుడు మత్స్యమహీవల్లభుం డీశోణితంబు పైఁ జీరం బట్టుటకుఁ గతం బేమి యని తన్నడిగిన నతని కిట్లనియె. 260

తే. విమలవంశంబునను బుణ్యవృత్తమునను, వఱలునీతనిరక్తంబు వసుమతీశ
ధరణిపై నెన్ని బిందువుల్ దొరఁగె నన్ని, [5]వర్షములు గల్గు నిం దనావర్షభయము.

వ. అని చెప్పి యుత్తమద్విజలోహితపాతం బెట్లునుం గీడు గావున నీకు నొకహాని పుట్టుటకుఁ జాలక యిబ్భంగిం జేసితి నని వెండియుఁ గొండొకకీలాలంబు దొరఁగం దొరఁగం దుడుచు చుండె నంత నట యుత్తరు నెదుర్కొనం బోయి.262

క. మంగళతూర్యరవములు సె, లంగఁగ మౌక్తికవిమిశ్ర[6]లలితాక్షతవృ
ష్టిం గురిసిరి విప్రులుఁ బు, ణ్యాంగనలును భద్రవాక్చయంబులతోడన్. 263

ఉ. అత్తఱిఁ గన్యకాజనసహస్రముఁ [7]దానును జేరి వేడ్కమై
నుత్తర చందనార్ద్రకుసుమోత్కరముల్ నవరత్నసంచయో
దాత్తసువర్ణపుష్పములు దండడి చల్లెఁ గిరీటిమీఁద న

1 నోపు. 2 ఁదగ నశంకితబుద్ధిన్; ఁదగ నశంకితభంగిన్. 3 దలిర్చినన్...నొక్కటి ద్రిక్కక యుండ...నావచనంబు జూడుమీ. 4 ఫాలరేఖ. 5 వర్షము లగు ననావృష్టివలని భయము. 6 లాజాక్షత. 7 గొల్వఁగ.

య్యుత్తరుపైఁ బ్రమోదకలనోత్కటసంభ్రమసంభృతంబుగన్. 264

ఉ. తక్కటివారలుం గని ముదం బలరారఁగఁ గౌఁగిలించుచున్
మ్రొక్కుచు నాదటం దనదుమోముపయిం దనివోనిచూడ్కులం
గ్రిక్కిఱియించుచుం బొదివి గెల్పు నుతింపఁగ రాజపుత్త్రుఁ డ
[1]య్యెక్కుడుమాట కోరువక యిట్లను సర్వజనంబుతోఁ దగన్. 265

చ. కురుబలమున్ జయించుటయు గోవులఁ దెచ్చుటయున్ బృహన్నలా
స్ఫురితభుజాబలంబునన చూవె నిజం బిది నాక యేల [2]యె
వ్వరికిని నెవ్వరిం గెలువ వచ్చున యిట్టిసహాయసంపదం
బొరయక యున్న మీ కెఱుఁగఁ బోలునె నాబ్రదు కెట్టిభంగియో. 266

వ. అని సారథ్యప్రశంసాప్రకారంబుగా నక్కుమారుం డత్యుపచారవచనంబుల చందంబున సంక్రందననందను నుతించుచుం జనుదెంచి రాజమందిరద్వారంబుఁ జేరునవసరంబునఁ బ్రతిహారి ససంభ్రమగతిం జని భూవల్లభునకుం బ్రణమిల్లి భూమింజయప్రవేశంబు తెలుఁగు విన్నవించిన నారథికసారథులం జూచువేడ్క మనంబు వేగిరపెట్టెడు నయ్యిరువురనియ్యెడకుం జయ్యనఁ దోడితెమ్మనువిభుని పలుకులు విని ధర్మతనయుండు పణిహారితో నల్లన యిట్లనియె. 267

క. ఇన్నెత్తురు గనుఁగొనిన బృహన్నల గోపించు నన్ను నతిభక్తిమెయిన్
మన్నించుఁ గాన రాజుం, దన్ను విచారింప కేమి [3]దప్పఁ దలఁచునో. 268

వ. ఇది లెస్సగాఁ దుడుచునంతకుఁ దదీయప్రవేశం బించుకవడి వారింపుము పదంపడి రా నిత్తు గాని యంతకు నుత్తరుం డొక్కరుండు వచ్చునట్లుగాఁ జేయుము. 269

క. అని చెప్పి హర్షసంభ్రమమున నజ్జననాయకుండు మునుఁగుట నది యే
మని యడుగఁ దలంపమిఁ దన, [4]కను వై కార్యము ఘటించి యతనిం బుచ్చెన్.

చ. అతఁడును బార్థు నిల్పి వినయంబున నుత్తరుఁ దోడితెచ్చినం
బితృచరణాంబుజంబులకుఁ బ్రీతిమెయిం బ్రణమిల్లె నాతఁ డా
పతియును జిక్కఁ జేర్చి గరుపాఱెడుమేనును హర్షబాష్పసం
ప్లుత మగునాననంబు నయి పుత్త్రునిఁ బెద్దయుఁ బ్రొద్దు గౌఁగిటన్. 271

వ. ఇవ్విధంబున నాలింగితుం డయి భూమింజయుండు పునఃపునఃప్రణామంబు సేసి కంకునిం గనుంగొని సగౌరవంబుగా నమస్కరించి మొగంబుగంటిసూచి యిది యేమి యని యడిగిన. 272

క. ఏ నీవిజయము వొగడఁగఁ, దా నప్పుడు పేడిఁ బొగడె దానం గోపం
బూనిన సైరింపక నా, చే నడిచితి సారెగొని విశృంఖలవృత్తిన్. 273

---

1 య్యెక్కువమాట. 2 నెవ్వరికిని గెల్వ వచ్చునె ధ్రువంబుగ నిట్టి; నెవ్విధిం గెలువ వచ్చునె (వచ్చునటె వారక) ...బొరయఁగఁ గన్న. 3 దప్పఁ. 4 కను వగు.

క. [1]అని పతి పలికిన విని నెమ్మనమున భయసంభ్రమములు మల్లడిగొన న
మ్మనుజేంద్రనందనుం డిట్లను నత్యాదరము మెఱయ నాతనితోడన్. 274
తే. తప్పు సేసితి రిట్టులు దగునె వీర, లేమిగతిఁ బల్కినను నది యెల్ల మనము
గైకొనవలయుఁ గాకిట్లు గాదు గూడ, దని నిషేధించు టొప్పునె మనుజనాథ.
వ. అని మఱియును. 276
క. సవినయముగఁ బ్రార్థింపుఁడు, పవిత్రచారిత్రులైనపరమద్విజు లి
ట్లపమతులై కోపించిన, నవనీశుల కేల కల్గు నాయువు సిరియున్. 277
వ. అనిన విని యమ్మాటలు పాటిగాఁ బట్టి విరాటుండు భయభక్తియుక్తంబుగా వేఁడికొనినం బాండవాగ్రజుండు నగుచు నాకు నలుక యెక్కడిది యితండును గీడు దెరువువాఁడు గాఁ డిది యొక్కప్రొద్దు [2]కీడున నయ్యెం గాని యది తాను రాజు దెసఁ బ్రసన్నుం డగుట దెలియునట్లుగా నుత్తరుతోడం బలికిన నమ్మహీవల్లభుండు సంతసిల్లి తదవసరంబునఁ బ్రవేశించి కాంచినయాబృహన్నల నాదరించి నిజనందను నాలోకించి యిట్లనియె. 278

విరాటుఁ డుత్తరుని సమరప్రకారం బడుగుట.

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణుఁడుం బశు
త్రాణపరాయణత్వమున [3]దర్పసముజ్జ్వలభంగి నుల్లస
ద్బాణపరంపరల్ గురియఁ బార్థివుఁడుర్వెను దన్ని చూడ న
క్షీణజవంబునం గవియుసేనకు మాఱ్కొన నగ్గలించితే. 279
ఉ. బాసట లేదు క్రొవ్వడర బంటుతనంబునఁ దాఁకి తేనియుం
బాసినచోట వాయుఁ బెఱపట్టులవీరు లుదగ్రవృత్తిమై
మూసికొనంగ వత్తు రొకమోహర మమ్ముల మ్రగ్గెనేని నా
సాసల నొక్కరుండ యనునాగ్రహవృత్తి బలంబు పైఁ బడున్. 280
ఆ. ఒకఁడు పరశురాము నోర్చినవాఁ డొక్క, రుండు ధనువునకు గురుండు దాన
హరువరమునఁ బుట్టి యక్షీణబలవిక్ర, మముల నొక్కఁ డొప్పు మాఱు లేక.
ఉ. తక్కటివారలున్ సురుల దైత్యుల నైనను బోర గెల్చువా
రక్కురుసేన మేటిమగ లాధృతరాష్ట్రతనూజు లాజి నొ
క్కొక్కఁడ ధాత్రి యంతయును నోర్వఁగఁ జాలుదు రట్టివారి నీ
వెక్కటి దాఁకి నొవ్వకయు నెమ్మెయి గెల్చితి నాకుఁ జెప్పుమా. 282
ఉ. గోవుల నెట్టు లాఁగితి వకుంఠితవిక్రముఁ డైనరాజరా
జేవిధి మానభంగమున నెల్లను నోర్చి పలాయమానుఁ డై
నీవిజయంబు సైఁచి ఘననిందకు నియ్యకొనంగఁ జాలెఁ బు

1 అని యిట్లు నృపతి పలికిన, మన; అని పలికిన విని తన నెమ్మన. 2 కారణంబున; గుణంబున. 3 దర్ప మెలర్పఁగ జే(ర్చి)రి యుల్లస.

త్రా వెఱఁ గయ్యెడున్ రణవిధం బఖిలం[1]బు నెఱుంగఁ జెప్పుమా. 283
చ. అనవుడు నాతఁ డిట్లనియె నక్కురుసేనల నేను గెల్వ గో
ధనమును నే మరల్ప మనదైవబలంబునఁ జేసి దేవసం
జనితుఁడు నాఁగ నర్హ మగుచందమువాఁడు మహాత్ముఁ డొక్కరుం
డని ననుఁ గాచెఁ గౌరవుల నందఱ గెల్చె మరల్చె గోవులన్. 284
వ. అత్తెఱంగు వివరించి విన్నవించెద నవధరింపుము. 285
తే. ధూళి పెల్లుగ నెగయంగ నేల గోడి, వడఁగఁ జనుమూఁకఁ గని వడవడ వడంకి
పాఱు తేరంగ నమ్మహాభాగుఁ డప్పు, డోడ కోడకు మని నన్నుఁ గూడ వచ్చి.
వ. పట్టుకొని మగుడం గొనిపోయి రథంబుపైఁ బెట్టిన నే నతనియాజ్ఞకు మిగుల
కుండితి. 287
ఉ. కౌరవసేన గోగణముఁ గైకొని పోవ నతండు ముట్టి యం
దారసి రాజుఁ గానక యుపాంతమునం దొలఁగించి వేగ నా
తే రట దోలి యడ్డపడి తీవ్రశరంబుల నబ్బలంబుదు
ర్వారరయంబు మాన్చి పశువర్గము నిద్దెస వెల్చె నార్చుచున్. 288
ఆ. చెదరకుండఁ బసులఁ బొదివి యించుక మేర, యిక్కడరుగు దెంచి యెలమి[2]మగిడి
కడచి పోవుచున్న కౌరవపతి ముట్ట, నడరినంత సేన లతనిఁ గూడె. 289
మ. కురురాజున్ సబలంబుగాఁ గవిసినన్ ఘోరాహవం బయ్యె నం
దరదంబుల్ నుఱు మయ్యె నశ్వములు నుగ్గయ్యెం గరివ్రాతముల్
ధర దంతంబుల యూఁతగా నొఱగె నుద్యద్బాహుదృప్యద్భటో
త్కరముల్ దిట్టినయట్లు గూలెఁ గలయం దద్బాణపాతంబులన్. 290
క. శత్రుంతపాదు లగునృప, పుత్రులుఁ బేరు గలయోధపుంగవులును ద
చ్చిత్రశరనిహతి సంగర, [3]ధాత్రిఁ బడిరి వారి నెన్నఁ దడ వై యుండున్. 291
తే. మొనలు దెరలినఁ గర్ణుండు ముంచి తాఁక
నమ్మహావీరుఁ డాతని[4]తమ్ముఁ జంపి
హరుల నొప్పించి సూతు నో నాడ నేసి
యంగముల బాణములు నించి యతనిఁ బఱపె. 292
క. గురుఁడు దలపడిన నతఁ డ,చ్చెరువుగ దివ్యాస్త్రవితతిఁ జిక్కువఱిచి త
ద్వరసుతుఁడుఁ గృపుఁడుఁ దాఁకినఁ, దెరలిచి భీష్మునకుఁగవిసె దృఢరభసమునన్.
మ. అతనిం దీవ్రశరంబులం బొదివి నానాస్త్రంబు లేసెన్ నదీ
సుతుఁడుం దత్సమయంబునం [5]గినిసి యాశూరుండు చాపంబు ద్రుం

1 బును మాకుఁ జెప్పుమా. 2 మగుడి. 3 ధాత్రిం బడి రెన్నఁ జూడఁ దడ. 4 య
నుజుఁ. 5 గదిసి.

చి తదీయాంగము నొంచినఁ వివశుఁ డై చేడ్పడ్డచో సూతుఁ[1]డు
ద్గతభీతిం బొలఁగంగఁ దోలె రథముం దత్ప్రాణరక్షార్థి యై. 29

క. తమతమబలములతో ని, ట్లమితభుజావీర్యు లైనయారథికవరుల్
గ్రమమునఁ దలపడి యోడిన, సమరవిహారమునఁ దనివి సనక యతండున్.

మ. ధరణీనాథుఁడు దానుఁ దమ్ములును దుర్దాంతోద్ధతిం గూడి మో
హర మత్యూర్జితభంగి నేర్చికొని యుద్యద్విక్రమం బొప్ప బం
ధురసంరంభత నున్నఁ జూచి [2]బలవద్దోస్తంభలీలాభయం
కరరేఖావలమానచాపుఁ డయి వీఁకం దాఁకె నాసేనతోన్. 296

క. కౌరవపతియనుజన్ముల, దూరమునఁ విశిఖ[3]నిహతిఁ దొలఁగ జడియుచుం
జేరి వికర్ణునికరి నొక, నారసమునఁ గూల్చి కదిసి నరపతి నేసెన్. 297

తే. రాజు నొచ్చిన విఱిగిరి రథికవరులు, విభుఁడు దోడన [4]తిరిగ నవ్వీరుఁ డపుడు
దోలి యాచిక్కుమూఁకలతోడఁ గూడ, నతని దవ్వుల నడవికి నడిచి మగిడె.

వ. ఇది యమ్మహాపురుషుచేసినవిధం బనిన విని యచ్చెరు వంది విరాటుండు. 299

ఆ. ఆతఁ డెవ్వఁడొక్కొ యమ్మహాత్మునిఁ గనుం, గొనఁగఁ గౌఁగిలింప వినయ మొప్ప
నర్ఘ్యపాద్యవిధుల నర్చింప భక్తిసం, యుక్తి నెపుడుఁ గొలిచి యుండ వలయు.

క. ఎచ్చోట నున్నవాఁ డతఁ, డిచ్చోటికి నేల రాఁడొ యిప్పు డనుడుఁ దా
నచ్చట నంతర్హితుఁ డై, యిచ్చఁ జనియెఁ దోఁచు నేఁటియెల్లిటిలోనన్. 301

ఉ. దేవకుమా[5]రకుండ యగుఁ దేజముచందము సూడ నాతఁ డీ
గోవులఁ గ్రమ్మఱించుటకుఁ గూడినయంతియ కాదు నాకు సం
భావన సేయువత్సలతభంగులఁ దా మనవంశ మంతయుం
గావను బ్రోవనుం దలఁపు గల్గుట దెల్లముసేసె నెంతయున్. 302

వ. అనిచెప్పి యుత్తరుం డతనిం బ్రమోదాయత్తచిత్తుం జేసె నట్టిసమయంబునఁ గాంతేయాగ్రజుండు ముఖప్రాంతంబు పైచీరచెఱంగునం బొదివికొని ధనంజయునిఁ జక్కం జూడక యుండె విరాటుండు గిరీటిపరాక్రమంబు గ్రమంబున నిట్లు దనతనయునివలన వినియునుం దెలియక యెప్పటినపుంసకత్వబుద్ధితోడన సంభావించి పోవం బనిచిన బృహన్నలయును జతురంబుగాఁ బలికి తిదియ తెఱంగు ధర్మనందనునకు నింతకు మిక్కిలి యెఱింగింప కుండునది యని వైరాటితో నల్లన చెప్పుచుం జనియె నజ్జననాయకుండును గంకునిం బొమ్మని యుచిత పరివారవృతుం డయి భూమింజయు నంతిపురంబునకుం దోడ్కొని యరిగి సుదేష్ణాసందర్శనసమాచరణంబు నడపి యతం డడుగఁ ద్రిగర్తపతి నొర్చిన తెఱం గెఱింగించె నట నరుండు నాట్యశాలకుం బోయి. 303

---

1 డుద్ధతభీతిం. 2 ప్రచల. 3 తతులఁ; పంక్తిఁ. 4 (నరిగె)...దోలఁబడి(దోడు డి)...దవ్వుదవ్వుల నతనినిఁ దగిలి మగిఁ(గు)డె. 5 రుఁ డాతఁ డగుఁ.

—⟹ అర్జునుఁ డుత్తరకు బొమ్మపొత్తికలుగా గురువీరులశిరోంబరంబు లిచ్చుట. ⟸—

తే. చెలులు దానును నుత్తర యెలమిఁ దన్నుఁ
గాంచుట[1]యుఁ బ్రీతి యెసలార గారవించి
బొమ్మపొత్తిక లడిగితి కొమ్మ యింద
మనుచు నిచ్చెఁ దాఁ దెచ్చినయంబరములు. 304

వ. ఇవ్విధంబునఁ గృతకృత్యుం డయి యథాపూర్వంబుగా మజ్జనభోజనంబులు సలిపి ధర్మతనయునివాసంబునం దేకాంతస్థలంబునఁ దా రేవురును ద్రౌపది యును గూడఁబడునట్టితెఱంగు సంఘటించి సమాగమసముచితప్రకారంబు నడపి గోగణనివర్తనంబును రణప్రవర్తనంబును నన్యోన్యవిదితం బైనయనంత రంబ యగ్రజు నుద్దేశించి బీభత్సుండు భీమసేనున కిట్లనియె. 305

క. మొగ మొప్పదు నాదెస నీ, జగతీనాథునకు నే విచారించియునుం దగ దీనికిఁ గారణ మిది, యగు నని యేర్పఱుప నేర [2]నయ్యెడ నెట్లున్. 306

వ. అనిన విని యుధిష్ఠిరుం డతని కిట్లనియె. 307

క. ఒం డేమియు లేదు విరా,[3]టుం డాత్మతనూజుఁ బొగడుడును దుర్దమదో ర్దండత గల్గుబృహన్నల, యుండఁ గొఱఁత యేమి పగఱ నోర్చుట కంటిన్.

ఆ. అనినఁ బేడిఁ [4]బొగడె దని యవివేకి యై, కోప మడర సారె గొని యతండు వ్రేసె నెత్తు రపుడు వెడలఁ బోయినఁ జీరఁ, గప్పికొంటి నీవు గాన కుండ.

క. అని చెప్పి గంటి సూపిన, ననిలతనూభవుఁడు గనలి యాదుష్టాత్ముం దనయాదిబంధుయుతముగ, ననిచెద జముప్రోలి కనియె నంగము వొంగన్.

వ. కిరీటియుం గోపించి. 311

క. తనకొలఁది యెఱుంగనియి, మ్మనుజాధము నిపుడ పట్టి మర్దింపక త క్కినఁ గాదు వీనిరాజ్యము, నిను నంతయుఁ జేరుఁ గా కనియె ధర్మజుతోన్.

చ. అనవుడు నాతఁ డిట్టు లను నక్కట యింతకు ముంద రేమియున్
మనల నెఱుంగఁ డవ్విభునిమాటునఁ బూనిక దీర్చికొంటి మా
తని కొక[5]యెగ్గు సేఁత యుచితం బె యెఱింగెడునట్లు గాఁగఁ బో
యినఁ గనియున్ దురుద్ధతి వహించినఁ జూతముగాక పిమ్మటన్. 313

వ. అని పలికి వారల [6]కందు మాన్పి యిది యట్లు కాక యొండు దగునే యనుచుఁ దక్కినవారిదెసయుం గనుంగొనిన నెల్లవారు నుపశమించిరి తదనంతరంబ తమ్ము నెఱింగించు తెఱంగు దలపోసి తారందఱు విరాటుకొలువుకూటంబునకుం బోయి బయలుమెఱసి యుండువారుగా నిశ్చయించి యారాత్రి గడపి వేగుటయుం

1 యును బ్రియంబున. 2 నయ్యెడ. 3 టుండు దనతనూజుఁ. 4 బొగడె దని. 5 కీడు...మదోద్ధతి వహిం. 6 నందు.

గృతస్నాను లయి పాండుసూనులు సమయవిహితాచారంబులు నడపి యుచిత ప్రకారంబున. 314

క. తెలుపు లగుచీరలను బూఁ,తలఁ బువ్వుల నొప్పి రాజతనయానుగుణో
జ్జ్వలమాననీయవేషము, లలవడఁ గూడుకొని నగరి కరిగిరి ప్రీతిన్. 315

క. చని ధర్మసుతుఁడు సింహా, సనమున భీమాదు లాత్మసముచితరుచిరా
సనముల సభాస్థలిం గయి,కొని పంచాగ్నులునుబోలెఁ గూర్చున్నంతన్. 316

తే. వేడ్కఁ దోడి పూసి కట్టి యవ్విరటుఁడుత్త,రుండుదోఁ జనుదేరఁగొల్వుండుబుద్ధి
నచటి కేతెంచి కని విస్మయంబు[1]నొంది,యెల్లిదంబుగఁ దలఁచుచు నిట్టులనియె.

క. ఇది యేమి కంక నీ వు,న్మదవృత్తిని శంక దక్కి [2]నాగద్దియపైఁ
బదిలంబుగఁ గూర్చుండితి, వదియును గా కిపుడు డిగ వహంకారమునన్. 318

వ. అనిన విని మందహాసంబు సేసి సంక్రందననందనుం డతని కి ట్లనియె. 319

సీ. నడదివియలు సేసె నగరికి మాణిక్య, మకుటముల్ పూనినమనుజపతులఁ
దగునాజ్ఞ[3]సూయాణముగ నొనరించె మం,చిగ నేలనాలుగుసెఱఁగులకును
బ్రీతార్థిజనుల సచేతనత్యాగధ్వ, జములుగా నన్ని దేశములఁ బఱపె
దిక్కు లన్నింటను దెలు పారుపూఁత గా,వించె నుజ్జ్వలయశోవిభ్రమంబు
తే. రాజసూయాధ్వరప్రవర్తకుఁడు నిత్య, సత్యభాషామహావ్రతశాలి పాండు
రాజదుగ్ధపయోనిధిరాజు ధర్మ,రాజు సుమ్ము మత్స్యావనీరమణ యితఁడు.

ఉ. ఈతఁ డజాతశత్రుఁడు మహిం దగ దిగ్విజయంబు సేసె [4]వి
ద్యాతిశయార్థి వాసవుమహాసన మైనను నెక్క నర్హుఁ డు
ద్ద్యోతితమూర్తి గౌరవకులోద్వహుఁ డార్యనికాయసంతత
ఖ్యాతచరిత్రుఁ డీచిఱుతగద్దియకుం దగఁడే నరేశ్వరా. 321

అర్జునుఁడు విరాటునకుఁ దమ్మెఱింగించుట.

వ. అనిన విని యతండు విస్మయసంశయంబులు మనంబునం బెనంగొన నితండు ధర్మతనయుండయేని భీమార్జుననకులసహదేవులుం బాంచాలియు [5]వేరి యని యడిగినఁ గవ్వడి యి ట్లనియె. 322

చ. వలలుఁ డనంగ నీనగరవంటలవాఁ డయి నిల్చి వేడ్కకుం
బులిఁ గరిఁ గేసరిం దొడరి పోరఁగఁ బంచినఁ బోరు జెట్టిమ
ల్లుల విఱుచుం గడంగి ప్రబలుం డనఁగాఁ జరియించు చుండు వి
చ్చలవిడి భీముఁ డీతఁ డవిషహ్యపరాక్రమదుర్దముం డనిన్. 323

1 దోఁప. 2 మాగద్దియ. 3 చెల్లించె ధర్మైకనిరతి మం,చిగ... చెఱఁగులందు... దేశముల నిలిపె దిక్కుల నన్నింట... పాండురాజవంశపయోనిధిరాజు......, వంశజలనిధి పూర్ణజైవాతృకుండు, రాజవరుఁడు మత్స్య. 4 వీర్యాతిశయా... సమ్మతఖ్యాత. 5 నేరి.

తే. బకమహాసురు [1]నిర్జించి బ్రాహ్మణులకుఁ
బ్రీతిఁ గావించెఁ గిమ్మీరుఁ బేరడంచి
వనము నిష్కంటకము సేసె ఘను హిడింబుఁ
గూల్చి యాతనిచెలియలిఁ గొనియె నితఁడు. 324

క. నీమెచ్చువారువంబులఁ, దా [2]మచ్చిగ నరయు నిత్యతాత్పర్యమునన్
దామగ్రంథి యనఁగ నొక, నామము ధరియించె నితఁడు నకులుం డధిపా. 325

క. శత్రునృపకాలకూటము, మిత్రామృతవృష్టి బుధసమీహిత [3]సిద్ధి
క్షేత్రము సజ్జనసంస్తుతి,పాత్ర మితఁడు మాద్రితొలుతపట్టి నరేంద్రా. 326

క. నీపాలికి వచ్చి నిఖిల, గోపాలకముఖ్యవృత్తిఁ గొలువు వడసి తం
త్రీపాలుఁ డనఁగ మత్స్య, క్ష్మాపాలక మెలఁగు వీఁడె సహదేవుండున్. 327

క. సుకుమారమానసుఁడు గొం,తికిఁ [4]బ్రాణము ప్రాణ మితఁడు తేజోగణ్యుం
డకుటిలుఁడు రాజనీతి, ప్రకారసంవేది వంశపావనుఁడు నృపా. 328

వ. అని యిట్లు ధర్మజభీమనకులసహదేవులం గ్రమంబునం జూపి చెప్పి మఱియు
నిట్లనియె. 329

క. విను సైరంధ్రీవేషం,బున మాలిని యనఁగఁ బరఁగి పూతచరిత్రం
బునఁ గేకయభూవరనం, దనకడ మెలఁగుసతి ద్రుపదతనయ [5]మహీశా. 330

క. ఆచపలాక్షికిఁగా మన,[6]కీచకు లందఱను రాత్రి గీటడఁచె రహ
స్యోచితవిధమున గంధ, ర్వాచరణము పేర భీముఁ డతిభీమముగాన్. 331

విరాటునకు భీముఁ డర్జును నెఱింగించుట.

వ. అనియె నప్పుడు వృకోదరుండు. 332

సీ. షండరూపమునఁ బ్రచ్ఛన్నుఁడై వచ్చి క,న్నియలకు నెల్లను నృత్తగీత
వాద్యనైపుణ మనవద్యశిక్షావిధి, నలవరించుచు బృహన్నల యనంగఁ
బరఁగునీతండు బీభత్సుండు సుమ్మని, చూపి యమ్మత్స్యరాజునకుఁ జెప్పి
వెండియుఁ బలుకు నాఖండలు నోడించి, ఖాండవ మేర్చె నాతండు దన్ను

తే. గారవించిన నెక్కటి కాలకేయ, వర్గములఁ బరిమార్చె నివాతకవచ [డు.
సంఘముల నోర్చె గంధర్వసమితి గెలిచి,ధార్త[7]రాష్ట్రాగ్రజుని చెఱఁదలిగె నితఁ

వ. అనిన విని యద్భుతరసాక్రాంతం బగునంతరంగంబునం గలుగుసందేహావేశంబు
వినయసంభ్రమంబుల నిగుడనీకునికిం జేసి చిక్కువడి యున్న నిజజనకునకు
నర్జునుం జూపి యుత్తరుం డిట్లనియె. 334

తే. ఈతఁ డింతకు మీకుఁ దన్నెఱుఁగఁ జెప్ప

---

1 మర్దించి...బ్రియము గావించి. 2 మెచ్చుగ. 3 సిద్ధ; బుద్ధి. 4 బ్రాణం బితఁడు
సగుల; బ్రాణము దలఁప నితఁడు...డకుటిల మతి నృప నీతి,...డధిపా. 5 నృపాలా. 6 కీచ
తతిఁ బట్టి. 7 రాష్ట్రుని విడిపించెఁ దగ నితండు.

వలవ దని నియమించినఁ దెలియఁ బలుక
నలికి యొకదేవసన్నిభుం డంటిఁ గాని
నిన్న నంతయుఁ దాఁ గదా నిర్వహించె. 335

చ. ఒకరుఁడ తాను భీతి వెగ [1]డొందెడు రెండవవన్ను నెట్టకే
లకుఁ దగఁ దేర్చునప్పుడు బలంబులతోఁ గురురాజు సూడ దా
నికి మదిశంకలేమి మహనీయపరాక్రముఁ డైనయీకిరీ
టికిఁ జనుఁ గాక యివ్విధము డెప్పర మన్యుల కోర్వ వచ్చునే. 336

చ. తము నెఱిఁగించి యల్ల నుచితప్రియభాషల నన్ను సూతకృ
త్యమునకుఁ జొన్ప నేను భ్రమదంబున [2]నప్పటి కియ్యకొంటి లో
కముసమరంబులట్ల యని కయ్యముతీవ్రతకుం దగంగ ర
థ్యములఁ జరింపఁ జేఁత భర మై తుదిఁ బల్కుఱు నోహటించితిన్. 337

క. మొగ మోడఁ డితఁడు గారవ,జగతీ[3]శుఁడు విఱిగినపుడు జవమున వెనుకం
దగిలి యిది జూద మాడఁగ, నగునెడగా దఱుమ వలయు ననియె నతనితోన్.

ఆ. అనిన [4]నతఁడు వెఱపు నత్యాదరంబును, సంతసంబు మానసమున బెరయ
నవయవముల సంభ్రమావేశ మేర్పడ, గారవమున విజయుఁ గౌఁగిలించె. 339

క. వినయంబు మిగులఁ గుంతీ, తనయాగ్రజుపాదపీఠతలమున ఫాలం
బును బొందఁ జాఁగి మ్రొక్కి య,తనికౌఁగిలి వడసె సమ్మదము దళుకొత్తన్.

ఆ. ప్రీతి [5]నలుమడింప భీముని గవల నా,లింగనంబు సేసి యంగకములఁ
బులక లెగయఁ గేలు దల మోడ్చి ధర్మజు, నాననమున దృష్టి యడర నిలిపె.

ఉ. అత్తఱి లేచి వచ్చి తనయన్నలఁ దమ్ములఁ గానిపించె న
య్యుత్తరు నర్జునుండు [6]దగ వొందఁగ నప్పుడ పిల్వఁ బంచె మా
త్స్యోత్తముఁ డార్యమిత్త్రసచివోత్కరసోదరవర్గపుత్త్రకో
దాత్తభటాదియోగ్యుల ముదంబునఁ బాండవదర్శనార్థ మై. 342

వ. ఇట్లు సమస్తజనసమేతంబుగా ధర్మతనయసేవాతత్పరుం డై తదనుమతి సముచిత రుచిరాసనంబున నుండి విరాటుం డంతఃపురవర్తులం బిలిచి యంతయు సుదేష్ణ కెఱింగింపం బనిచి పాంచాలిం దగినతెఱంగున గారవించునట్లు గావించె నట్టియెడ ధనంజయుం డతని కిట్లనియె. 343

తే. చాల దుస్తర మైనయజ్ఞాతవాస, వత్సరంబు భవద్గర్భవాసగుప్తి
వలనఁ గడపితి మతిసుఖావాప్తచిత్త, వృత్తి నేము నిర్భయుల మై విందులట్ల.

వ. అనిన విని విరాటుం డతని కిట్లనియె. 345

1 డొందఁగ రెండవయేను; డొందెడు రెండవు నేను...ననుఁ దేర్చు...మది లెక్కలేమి (శంకలేక)...కిరీటికి చనుఁ. 2 నప్పని. 3 పతి...దరుగు మనియె నాతనితోడన్. 4 విరటుఁ డపుడు న. 5 యినుమడింప...దృష్టు లడర. 6 నలు వొప్పఁగ.

ఉ. ఏనన వేఱ యొక్కఁడనె యిట్లనఁగాఁ దగునయ్య యిమ్మెయిం
గానన దేశవాసములఁ గాఱియ క్రోర్చి యడంగి యుండి మీ
పూనిక దీర్చి మీ రెలమిఁ బొందుట యెల్లను బుణ్యదేవతా
నూనదయాసమృద్ధి వను నొందుట గాదె సురేంద్రనందనా. 346
వ. అని పలికి ధర్మనందనుం జూచి. 347
చ. ధరణియుఁ బట్టణంబు హయదంతిరథంబులు గోవులుర్ భటో
త్కరము నమాత్యవర్గమును గాఁ గలరాజ్య మితండ యేలు ని
ర్భర[1]మున నేనుఁ బుత్త్రులును బంధులుఁ దమ్ములుఁ గొల్చి యుండెదం
గరిపురి కెత్తునట్టిపని గల్గిన నోపినయంత సేసెదన్. 348
వ. అన విని యుత్తరుండు దగ నజ్జనపాలకుతోడ నిట్లను
న్మన కొకరాజ్యముం గలదె నన్నును నిన్నును నిన్న మొన్న వీ
రనితరసాధ్యశత్రువిజయంబునఁ గాచినయప్డు గల్గఁ జే
సినయది దక్క దాని మఱి సెప్పఁగ నేటికి నింతవింతగన్. 349
వ. [2]అది సిద్ధం బట్ల చెల్లుం గాక యించుకవిశేషంబు గలదు వినుము. 350
చ. సవినయవృత్తిఁ గొల్వ మిట చన్నదినంబుల వీరు నీఱు పైఁ
గవిసిననిప్పులట్ల యధికం బగుతేజము [3]దోఁప కున్కి న
ట్టివిధముసాపరాధతను డెందము లూఱటఁ బొంది యుండ నే
రవు మన కట్లు గాన తగఁ బ్రార్థన సేయుట యుక్త మిత్తఱిన్. 351
వ. అదియునుం గాక. 352
క. ధనవర్గంబులు వీ రిచ్చినయవి య ట్లగుట వేడ్క సేయవు తగ నూ
తన మగుకానిక యీవల, యును వే తోడ్తెరఁ బనుపు ముత్తరఁ బ్రీతిన్. 353
వ. అనిన విని మత్స్యమహీవల్లభుండు మనం బలర మంత్రులమొగంబు సూచి కుమారిక నలంకరించుకొని తెం డని నియోగించిన వారును ప్రియంబునం జని తత్కార్యశ్రవణసంప్రీత యగుసుదేష్ణయనుమతం[4]బున. 354
క. పదనికి రాఁ బులు గడిగిన, మదనాస్త్రముశేఖ గలిగి మానినిమెయి సె
న్నొదవఁ గయిసేసి రప్పుడు, ముదితాజనములు ప్రమోదమున లలితముగన్.

విరాటునిమంత్రి లుత్తరను బాండవులయొద్దకుఁ దోడ్తెచ్చుట.

వ. ఇట్లు శృంగారంబు సేసినయమ్ముద్దియకు ముక్తాఫలప్రాలంబమాలికలతోడిగొడుగులు వట్టించి యత్యాదరంబున నయ్యమాత్యులు దోడ్తేర ధారాధరనికర మనోహర యగుపర్జన్యలక్ష్మియుంబోలె వచ్చు చున్నం గని విరాటుం డెదురు వోయి పురోహితులును బంధుజనంబులుం దానునుం బొదివికొని పాండవా

[1] తను...బంధులు నిప్పుడు (నుం దగఁ)...దీర్చెదన్. [2] ఇది...దనధరింపుము. [3] దాఁచి యున్కి నిట్టి. [4] బు నొందిన.

గ్రజునగ్రభాగంబునకుం దెచ్చి యచ్చెలువ నిలిపి సపరివారంబుగా దండ
ప్రణామంబు సేసి చేతులు మొగిడ్చి యి ట్లనియె. 356

క. ఎఱుఁగమి [1]చీఁకటి నీపె, ద్దఱికంబు దలంప నేమితప్పు గలిగిన౯
మఱచి దయఁ జూడు మిట్లం, దఱు నీకుం బనులు సేయఁ దగుదురు వీరల్.

వ. [2]అని నిజానుజతనూజులం జూపి మఱియును. 358

క. ఇమ్ముద్దియ యర్జునునకు, ని మ్మ్రాపని బంధుజనుల కిందఱకుఁ గడు౯
సమ్మత మెల్లప్రజకు నే, నిమ్మెయి [3]నినుఁ జేరి బ్రదుకు టిష్టం బధిపా. 359

క. అని పలికిన విని కుంతీ, తనయాగ్రజుఁ డింద్రసుతువదన మాలోకిం
చిన నాతఁ డిట్టు లను న, మ్మనుజేంద్రుఁడు వినుచు నుండ మత్స్యాధిపుతోన్.

క. ఈకన్నియఁ గోడలిఁగాఁ, గైకొనియెదఁ గాని యిది దగ [4]దుచితవృత్తి౯
నాకడన యబల మెలఁగుట, లోకము శంకించు నన్ను లోలాత్మునిఁగాన్. 361

వ. అదియునుంగాక నృత్తగీతాదులయెడ నిక్కోమలికి గురుండ నైననాకు నివ్వి
ధంబు ధర్మంబు గాదు గావున. 362

మ. హరిమేనల్లుఁడు బాహువీర్యపటుశౌర్యస్ఫూర్తి త్రైలోక్యసుం
దరుఁ డాచారపవిత్రుఁ డంచితకళాదక్షుం డుదారుండు గా
తరసంరక్షకుఁ డార్యసమ్మతుఁడు విద్యావైభవోల్లాసి య
త్యురుతేజుండు వరించుఁగాక యభిమన్యుం డీసరోజాననన్. 363

వ. అనిన విని మత్స్యమహీకాంతుం డత్యంతసంతుష్టాంతరంగుం డై. 364

తే. అర్జునునివియ్య మనియెడునంతకంటెఁ, గడవఁ బెంపు నా కెయ్యది కార్యనిశ్చ
యంబు ధర్మతనూభవుం డానతిచ్చు,వాఁడు మనమెల్లఁ గావించువారమదియు.

ఆ. [5]అనుడు నతనికిట్టు లనుఁ బాండవాగ్రజుం,డింద్రతనయుఁ డుచిత మెఱిఁగి పలికె
నిట్లు సేయువార మిప్పుడు. సుట్టాల, కెల్లఁ జెప్పి పుచ్చుఁ డీశుభంబు. 366

వ. అని నిశ్చయించి పలికిన విరాటుండును గౌరవాన్వయసంబంధంబున మాత్స్య
వంశంబు పావనం బయ్యె నని పలుకుచు ధర్మజభీమార్జుననకులసహదేవులకుఁ
గ్రమంబున నుత్తరఁ బ్రణామంబు సేయించిన వారు దీవించి యంతఃపుర
గమనంబునకు ననుజ్ఞసేయ నచ్చెలువ నెచ్చెలులుం దానును దత్సమయసము
చితపరివారపరివృత యై యరిగినయనంతరంబ మౌహూర్తికుల రావించి లగ్న
నిరూపణంబు సేసి యాదవపాంచాలాదిబంధుజనంబుల నెల్లఁ బెండ్లికిం బిలువ
రెండుదెఱంగులవారును గాలరులం బనిచి రజాతశత్రుండును విరటు గారవించి
తా రతనిపాల నజ్ఞాతవాసంబు సుఖవృత్తి నడపికొనుట వాక్రుచ్చి పలికి యతని

---

1 నిం కిట నీ పెద్దఱికంబుఁ దలంచి యేమిదప్పు...మి ట్లం,దఱమును నీపనుపు సేయఁ దగుదుము తలఁప౯. 2 అని నిజతనూజం జూపి యి ట్లనియె; అని పలికి యక్కన్నియం జూపి మఱియును. 3 మిముఁ. 4 దు శిష్యగతి౯; దు శిశువృత్తి౯. 5 అనిన.

గుణంబులు గొనియాడి నీవు మాకు వాసుదేవునట్లు కాక సామాన్యబంధుం
డవే యని సంభావించి వినయసంభృతుం డగునతనిం దిగిచి పునఃపునరాలింగ
నంబు సేసిన నతండును ససంభ్రమపరిజనసముపనీయమానంబు లగునానా
విధోపకరణంబులం గాంతేయులకు వివిధోపచారంబు లాచరించి మహార్హ
మజ్జనభోజనంబులు నడపె నంత నక్కడ దుర్యోధనుండు నిజపురంబునకుం జని
చని నడుమ విడిసినయెడం గర్ణశకునిదుర్మంత్రంబువట్టి గాంగేయునివచనంబు
లప్రమాణంబులు సేసి ధర్మతనయుం డసత్యంబున కియ్యకొనమి యెఱింగి
యాతనిపాలికి దూతం బుత్తెంచిన వాఁడు నేతెంచి కాంచి యి ట్లనియె. 367

తే. [1]వాలి యజ్ఞాతవాససంవత్సరంబు, నిండ కుండంగ మున్న పార్థుండు బయలు
మెఱసి సమయంబు దప్పె నీ వెఱిఁగి దీని, కేది దగు నది సేయుము మేదినీశ.

వ. అని పునర్వనవాసకరణంబు దోఁప నాడిన నవ్వి యధిష్ఠితసత్యవ్రతుం డయిన
యుధిష్ఠిరుం డతని కిట్లనియె. 369

క. నిండె సమయాబ్దములు నిం, కొండ డన లే దిపుడ చని సుయోధనుతో భీ
ష్మండును గురుఁడును వినఁగా, [2]నిండె ననుము నిండె నిండె నిక్కంబునకున్.

చ. అని తగఁ జెప్పి పుచ్చఁ జని యాతఁడు దప్పక చెప్పె నంతయున్
విని ధృతరాష్ట్రసూనుఁడు వివేకవిహీనత నాఁటిరాత్రి కొ
ల్వున గురుభీష్మకర్ణకృపులుం దనతమ్ములు నుండ ధర్మనం
దనునకు దూతఁ బుచ్చినవిధంబు ప్రకాశము సేయ కిట్లనున్. 371

ఆ. మనము మోసపోయి యనిమిషపతిసూతి, తోడఁ బోడిచితిమి యదోషవృత్తి
నతఁడు సమయకాల మంతయుఁ గడచిన, వచ్చెనో యెఱుంగవలయు నిజము.

క. అనిన విని యేటిమాటలు, వినువారలు నగరె యేను విన్వచ్చుఁడు వ
చ్చినయపుడ తెలుపనే వల, దనుమానము సమయకాల మట మును కడచెన్.

క. అనవుడు భీష్మునిపలుకులు, విని యందఱు సమ్మతించి [3]వెరవిఁడియే ఫ
ల్గునుఁ డనిరి పతియుఁ బురికిం, జనియెను మఱునాఁడు విరళసైన్యంబులతోన్.

శ్రీకృష్ణుఁడు బలదేవాదులతోఁ బాండవులఁ జూడ వచ్చుట.

వ. ఇవ్విధంబునం బ్రకాశులై పాండునందనులు శమీవృక్షనిక్షిప్తసమస్తసాధ
నంబులుఁ బూజాపూర్వకంబుగాఁ దెచ్చికొని యుపప్లావ్యంబున వసియించి
మత్స్యమహీనాథుండు పంపు సేయం బెంపు మిగిలి పౌరజానపద (సమానీత)
నానావిధోపహారంబులు గైకొనుచు బహురత్నంబులకు భాజనంబులై మహ
నీయవిభూతి శోభిల్లుచున్నంత వాసుదేవుండు బలభద్రపురస్సరంబుగా సాత్యకి
సమేతుం డై సుభద్రాభిమన్యులం దోడ్కొని కృతవర్మయుఁ బ్రద్యుమ్నుండును

1 సాగి...వత్సరదినములు, నిండ కుండంగఁ బార్థుండు నిన్న బయలు. 2 నిండె ననుము
ండె ననుము నిక్కం. 3 వీఱిఁడి.

సాంబుండును యుయుధానుండును రుక్మిండును నక్రూరుండును నింద్రసేనాది
పాండవసారథులును రథారూఢులై కొల్చి రా మఱియు ననేకయాదవకుమా
రులును గరితురగస్యందననిబిడంబు లగుబలంబులతోడ నిరుగెలంకుల నడవం
జనుదెంచి. 375

తే. భవ్యవిభవంబుతో నుపప్లావ్యపురము, సొచ్చి సంభ్రమమునఁ బాండుసుతులు దనకు
నెదురు వచ్చిన నాహ్లాద మెసకమెసఁగఁ, దత్సమాగమయోగ్య[1]విధంబు నడపె.

వ. బలదేవప్రముఖులకును దదీయసందర్శనసముచితసమాచారంబు లొనర్చి సుభ
ద్రాభిమన్యులం బాంచాలిపాలికిం గొనిపోవ నభ్యంతరజనంబుల నియోగించి.

క. లలిత[2]మణిమయవిభూషణ, ములు రుచిరాంబరములును బ్రమోద మెదల ని
ట్టలముగ హరి గుంతీపు, త్రుల కెల్లను నిచ్చి పిదప ద్రోవది కిచ్చెన్. 378

వ. ఇట్లు గట్ట నిచ్చి వేలువేల రథకరితురగదాసదాసీజనంబుల నొసంగి పద్మనా
భుండు పాండవులుం దానునుం గలసి సంతసంబున నలరారు చుండెఁ దదనం
తరంబ. 379

సీ. ద్రుపదభూవిభుఁడు పుత్త్రులుఁ దానుఁ జతురంగ, బలములతో వచ్చి పాండుసుతులఁ
గాంచి వారలు దన్నుఁ గరము సంప్రీతిమై, గారవింపఁగ నుండెఁ గాశిరాజు
శైబ్యుండుఁ బదపడి సైన్యసమేతు[3]లై, చనుదెంచి ధర్మనందనునిచేయు
సత్కారముల గాఢసమ్మదంబునఁ బొంది, రవ్విరాటుండును నంతవట్టు
తే. వారలకుఁ దత్తదుచితప్రకారములఁ బ్రి
యంబుఁ దలకొన సంవిధానంబు సేసె
మఱియు బహుదేశములబంధుమాన్యమిత్త్ర
వర్గములు వేడ్కఁ బెండ్లికి వచ్చెఁ గలయ. 380

వ. ఇవ్విధంబున రెండుదెఱంగులచుట్టంబులు నైనభూపతులు దమతమవిభవంబు
లు మెఱసి వచ్చి యుండ విరాటుండు పురంబున నుత్సవంబు సాటించిన. 381

క. [4]కలువడములు మణితోరణ, ములుఁ గట్టిరి క్రముక కాండమోచాస్తంభం
బులు నాటిరి కుంకుమమునఁ, గలయ నలికి ముగ్గు లిడిరి కర్పూరమునన్.

క. వివిధాలంకరణంబుల, నవకాంతి వహించి పట్టణంబు వివాహో
త్సవమాధవలక్ష్మికి లలి, తవనం బై యెలమికలిమితావల మయ్యెన్. 383

ఉ. తాను సుదేష్ణయుఁ సుతులుఁ దమ్ములు బంధులు గంధమాల్యనా
నానవరత్నభూషణమనఃప్రియమాంగలికప్రసాధనా
నూనవిభూతి మత్స్యవిభుఁ డుజ్జ్వలలీల వహించి భూమిదే
[5]వానయనాదికృత్యపరులై నజనంబుల గారవించుచున్. 384

1 వర్తనము. 2 ము లగుమణిభూషణ,...ప్రమోదం బెద నిట్టల...ద్రుపదజ కి. 3 తుఁ డై.
4 కలువడఁగులు...మోచాస్కంధం. 5 వానున్నయాద్ధి.

వ. గరువంపుసంభ్రమంబులతోడ నిజమందిరంబునందు. 385
సీ. [1]అమలరత్నప్రదీపావలి మెఱుఁగిడఁ, బనిచి మణిస్తంభపంక్తిఁ గ్రొత్త
జిగి దళుకొత్తునట్లుగఁ దొడయించి వి,చిత్రవితానముల్ సెలువు మిగులఁ
గట్టించి నూత్నముక్తాదామములతోడఁ, గుసుమమాలిక లెడ గ్రుచ్చి వ్రేలఁ
గీలింప నియమించి కేవలమంగళ, భూరుహపల్లవతోరణములు
తే. సంఘటింప నియోగించి చందనమునఁ,బరిణయాగార మలుకంగఁ బాణి యాణి
గలుగుముత్తియముల మ్రుగ్గుగా నొనర్పఁ, జతురపుణ్యాంగనాజనతతిఁ బొనర్చె.
క. వైదికలౌకికవిధిసం, పాదితవివిధార్హవస్తుభరితత్వమునన్
వేదిక పొలుపగునట్లుగ, మోదమునఁ బురోహితుండు మునుకొని చేయన్.
క. ఉత్తర నలంకరింప ను, దాత్తాభరణాదివస్తుతతి యొసఁగి నరేం
ద్రోత్తముఁడు నేర్పు గలచెలి, కత్తియలం [2]బుచ్చెఁ బ్రీతి గడలుకొనంగన్. 388

అభిమన్యుని వివాహమహోత్సవము.

వ. ఇట్లు వైవాహికవర్తనసంవిధానసావధానుం డగుమత్స్యమహీనాథుండు మౌహూర్తికాదిశిష్టజనులు పరివేష్టింప నుండి లగ్నం బాసన్నం బగుచు వచ్చె నని ధర్మతనయున కెఱింగింపం బనిచిన నతండు ననుజతనుజసహితంబుగా నలంకృతుం డై వివిధప్రసాధనశోభితు లగుసమస్తబంధుజనంబులం గూర్చికొని యభిమన్యునకు శృంగారంబు సేయించి భద్రగజారూఢుం జేసికొని యేనుంగులం బేరు గలవారువంబులను [3]మట్టపుదట్టంబు సేసికొని మణిగణంబులు నంబరనికరంబులుఁ బుష్పపుంజంబులు ఫలప్రచయంబులు లోనుగాఁ గలయోగ్యవస్తువుల విస్తరిల్లినక్రంత నడవ మంగళతూర్యనాదంబులు విప్రాశీర్వాదంబులు మాగధగానంబులు వందిజనవాక్యసంతానంబులుఁ జెలంగ వాసుదేవపురస్సరంబుగా విరాటుమందిరంబున కేతెంచి శంఖజయఘంటాపణవాదినిక్వాణంబులతోడ నెదుర్కొని చల్లునేసలు గైకొనుచుం జొత్తెంచిన. 389
విరటుఁడు సంభ్రమమును నా,దరమును భక్తియును నాత్మఁ దలకొనఁ బూజాపరుఁ డై సమయసముచితా, చరణంబులు నిర్వహించె సమ్మదలీలన్. 390
విహితపరిపాటితో విప్రవృద్ధజనులు, పుణ్యకర్మపరంపరఁ బూని నడప
[4]నర్థిఁ గృష్ణయుధిష్ఠిరపార్థమత్స్య, వరులు దెరయొద్ద నవ్వధూవరుల నిలిపి.
సాంవత్సరికదత్తకాలకళావిశేషంబులమంగళతూర్యంబులు సెలంగ నత్తెర యొత్తించిన. 392
వీనులఁ దియ్యము మెక్క మును [5]విన్కిఁ బరస్పరరాగవృత్తి లో
నూనినఁ జూచువేడుకల నువ్విళు లూరెడునెమ్మనంబు ల

---

1 అతుల. 2 బనిచెఁ. 3 మట్టంపువస్తువులు విస్తరిల్ల బుణ్యాంగనాజనంబులు క్రంతప. 4 పరఁగఁ. 5 విన్నవిధంబులఁ జిత్తవృత్తి లో.

చ్చో నొకయింతసేపు నెడసొచ్చుట కోర్వక యుండ నున్నయ
మ్మానినియుం గుమారుఁడును మారవికారము లంకురింపఁగన్. 393

వ. అన్యోన్యావలోకనంబు సేయునప్పుడు. 394

సీ. వరుచూడ్కి ముద్దియవదనంబుపైఁ బాఱి, తివుటమై నునుఁగాంతితీపు గ్రోలు
సుందరీరత్నంబుచూపు మనోరము, నడుగులయొప్పుపై నల్ల నడరుఁ
బతివిలోకనములు పడఁతుకమైఁదీవఁ, గలయంగఁ బలుమఱు మెలఁగుచుండు
చెలఁదికటాక్షముల్ విభునిపైఁ గ్రమమున, నెగసి మోమునఁ జోఁకి మగిడివచ్చు

తే. నొండొరువులలేఁజెమటల నూని[1]వ్రేఁగు, పడినచాడ్పున నవయవభంగులందుఁ
దగిలి మఱపునఁ దడయు నిద్దఱివిశాల, నయనదీప్తులు నెఱుకువ బయలుపడఁగ.

వ. తదనంతరంబ. 396

తే. ఒండొరులదోయిళుల నినుపొందఁ జేయు, నక్షతప్రకరంబు లన్యోన్యమస్త
కములఁబోసిరి మందారకల్పలతలు, [2]విరులుగమియనొండొంటిపైఁగురియునట్లు.

చ. లలితతనూవిలాసముల లజ్జకతంబునఁజేసి మున్ను వి
చ్చలవిడిఁ [3]బట్టఁగా వెరవు సాలక యోరలు వాఱుచూపులన్
లలిఁ దలఁబ్రాలు వోయునెడలం దగ నొందిన నూలుకొల్పి యి
మ్ములఁ బచరింతు రొండొరులమోహనమూర్తులపై వధూవరుల్. 398

తే. చిత్తమున గాఢరాగంబు చేతఁ జూపు, తెఱఁగు దోఁపఁ గెంపారెడు[4]తీఁగబోఁడి
మృదులపాణిఁ గుమారుండు మెలపుమై గ్రహించెఁ బల్లవాలంబిమత్తేభలీల.

వ. ఇట్లు పాణిగ్రహణం బాచరించి. 400

క. పెనుఁగుదుట నిడినచూతం, బును నవమాలికయుఁబోలెఁ బొలుపొందిరతం
డును నమ్ముగ్ధయు నేకా, సనమున నున్నపుడు నూత్నసౌభాగ్యమునన్. 401

సీ. కోర్కులు గెడఁగూడుకొని పార[5]మెయ్యంగఁ, జిత్తంబు లూఱటఁ జిగురులొత్తఁ
బులకాంకురములకుఁ దలతాఁకుడై యిరు, మేనను మవ్వంబు మిగిలి పొదలఁ
దఱి వేచి చనఁబోయి తడఁబడి మార్గతి, వడి చూపు లాదట బయలుపఱుపఁ
జెమటలతావులు తమలోనఁ గలసి వే, ఱొక్కసౌరభ మయి చొక్కు సేయ

తే. గాఢసంస్పర్శభంగులు గలుగునట్టి, హోమసమయకృత్యంబుల నొదవి సౌఖ్య
రసము పెన్నిట్ట పొరిఁబొరిఁ గ్రమ్ముదేర, సమ్మదాంబుధిఁ దేలిరి పతియుఁ బతియు.

వ. ఇవ్విధంబున వివాహంబు నిర్వహించి మత్స్యమహీనాథుండు మణిభూషణంబులు రుచిరాంబరంబులుఁ గర్పూరాదిసుగంధద్రవ్యంబులుఁ దాంబూలంబులతోఁడిపళ్లెరంబులఁ బచరించి పాండవులకు వాసుదేవపూర్వకంబుగాఁ బురో

1 వ్రేఁక...మఱువునఁ దడయు...నెఱుకలు బయలు. 2 విరులగమియు; విరులగములు.
3 బర్వఁగా...యిమ్ములఁ బరఁగింతు. 4 మెఱుఁగుఁబోఁడి. 5 మెద్దునఁ; మేదినఁ,...మే

హితప్రకరంబునకుం గట్టనిచ్చి యాజ్ఞసేనీసుభద్రలకు ననురూపాభరణపరిధానంబు లంతఃపురవర్తులైనయర్హజనంబులచేతం బుచ్చి సౌభద్రునకు భద్రసామజసప్తశతియును లోకోత్తరతురంగదశసహస్రంబును సలక్షణగోపంచలక్షయు రథంబులు రెండువేలును దాసదాసీజనంబు లక్షయు మఱియు నానాప్రకారంబు లగుధనంబులు నరణం బిచ్చె నమ్మహనీయమహోత్సవంబు మంగళసంవిధానసావధానపుణ్యాంగనలవలనను నృత్తగీతాదివైచిత్ర్యమనోహరవారనారీజనంబులవలనను వినూత్నరత్నమయభూషణాది [1]దీప్తవేషవిరాజమాను లగు కుమారులచతురపరిహాసాదివిలాసంబులవలనను బ్రభూతవిభవవిభ్రాజితు లగు రాజసూనులమాననీయగరిమలలితవిహారవిశేషంబులవలనను బాంచాలయాదవకేకయాదిబాంధవమహితమహిమాంచితసంచరణంబులవలనను నానందనిష్యందిపాండునందనసౌహార్దంబువలనను మత్స్యమనుజపతిమందిరంబు పరమసంపద్భరితం బై యుండె నని చెప్పిన విని వైశంపాయనునితో జనమేజయుండు.

క. కుంతీనందను లట్లు,త్యంతవిభవ మెసఁగఁ బరిణయము సేసి సుహృ
త్సంతోషోజ్జ్వలు లై తద, నంతర మెబ్బంగి నడచి రనవుడుఁ బ్రీతిన్. 404

చ. అమృతమయాత్మ భక్తి [2]సుగమానుభవోజ్జ్వలదివ్యవర్త్మ ష
ట్సమయగతానుభావ పురుషత్రయతావివృతస్వభావ ని
ర్మమహృదయైకవాస మునిరంజననిత్యవిలాస దోషసం
గమవినికర్తనా పరమగౌరవధుర్యపదప్రవర్తనా. 405

క. దుర్వహపటుతాపత్రయ, నిర్వాపణ[3]కరణ బోధనిర్మలజనహృ
త్పర్వాచరణ మహాసుర, గర్వాపహరత్వసంప్రకాశైకరణా. 406

మాలిని. నిగమకుసుమగంధోన్మేషభూతాభిధానా
సగుణవిగుణలీలా [4]సౌమ్యసాక్షిత్వనానా
జగదవనవిధానస్థైర్యదత్తావధానా
నగశరధినివాసానందసంస్తూయమానా. 407

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయినశ్రీమహాభారతంబున విరాటపర్వంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

విరాటపర్వము సమాప్తము.

---

1 దీప్తివిశేషవిరాజమాను ...మత్స్యనగరంబు. 2 నిగమా ... త్రయతావృతనిస్స్వభావ.
3 నిపుణ ... గర్వాపహతత్త్వసంప్రకాశనమూర్తీ ; గర్వహరణతత్త్వసంప్రకాశనకరు (ర) ణా.
4 సౌమ్య (స్వామ్య)...దవనవిధాన...సంస్తూయమానా (సంధార్యమాణా).

శ్రీ

గణేశశారదాగురుభ్యో నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఉద్యోగపర్వము, ప్రథమాశ్వాసము.



శ్రీగౌరీ[1]పల్లవపుట
యోగాశ్రయమంజరీసముజ్జ్వలమూర్తీ
యోగీంద్రసంతతాంత
ర్యాగపరీపాకరూప హరిహరనాథా. 1

దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

తే. ఎలమి నభిమన్యుపెండిలి యివ్విధమునఁ, జేసి యుల్లాసలక్ష్మి గైసేసి మత్స్య
మనుజపతియన్వయంబు పావనము సేసి, దినచతుష్టయానంతరమునఁ బ్రియమున.

ధర్మతనయుండు దమ్ములుం గొడుకులుం [2]బరివేష్టించి యుండ విశాలరమణీయం
బగు విరాటుకొలువుకూటంబున కరిగి యందు. 4

విరటుఁడుఁ బాంచాలుండును, హరియును రాముండు వారియనుజతనూజుల్
పరిణయసమాగతాఖిల, ధరణీశులు [3]బలసి యుండఁ దద్దయు నెమ్మిన్. 5

ఉన్నసమయంబున సభాసదులైన మానవేంద్రులు నానావిధంబులఁ గృష్ణయుధి
ష్ఠిరులతో సంభాషణంబులు సేయుచుండఁ బాండవకార్యార్థి యై కృష్ణుండు
తదీయవచనంబులు వారించి వారలఁ గలయం గనుంగొని యిట్లనియె. 6

కపటద్యూతమునందు సౌబలునిచేఁ గౌంతేయులాత్మీయరా
జ్యపదభ్రంశముఁ బొంది [4]సత్యనిరతిన్ శక్తాత్ములై యుండియుం
గుపితస్వాంతులు గాక తత్సమయసంక్షోభంబు గాకుండఁగా
విపినావాసము గూఢచర్యయును గావింపం దలం పొప్పదే. 7

తలఁచినట్ల వ్రతము సలిపి యమ్మాడ్కిఁ బం, డ్రెండువత్సరములు పాండవేయు
లకట క్రూరసత్త్వయాతుధానావలి, తోడఁ గాననమునఁ గూడి మనరె. 8

---

1 వల్లభ పటు...ర్యాగమపరిపాక. (ర్యాగమపరిపాకరూఢ). 2 బరివేష్టించి చనుదేరఁ. 3 గొలిచి యుండఁ; బలసి కొలువఁ. 4 ధర్మనిరతిన్ (సత్యాత్ములై).

క. పదపడి దుస్తర మగునీ, పదు[1]మూఁడగునేఁడు గడవఁ బడుట యరిది త
మ్మెదు రెఱుఁగమికై యాపద, లోదవిన సైరించి రిట్టియునికియుఁ గలదే. 9

క. [2]మీరలు ధర్మజువర్తన, గౌరవ మెఱుఁగుదుర కాదె కావున నాగాం
ధారీతనూభవులకును, వీరలకును హితమ కా వివేకప్రౌఢిన్. 10

తే. ధర్మమార్గంబు [3]దప్పక తలఁపుఁ డొక్క, తెఱఁగు ధర్మువు దప్పి యుధిష్ఠిరుండు
వడయ నోడఁబడఁ డయ్యైంద్రపదవి యైన, నుచితగతి నెంత వడసిన నుల్లసిల్లు.

వ. కావునఁ బాండవులకుఁ బితృధనం బగు రాజ్యంబు [4]గపటద్యూతంబున దుర్యోధనుం డపహరించుటయు నది వీరలు దిగ్విజయంబుఁ జేసి యలవరించికొన్నపదం బగుటయు ధర్మసూనుమహానుభావంబు విచారింపక ధార్తరాష్ట్రులు పరిభవించినం దెగి యితండు వారలకుం గీడురోయమియు నీ రెండు దెఱంగుల వారికిం బంచి కుడువం దగుటయుం దలపోసి తగినకార్యంబు సెప్ప నర్హుల రేనును నాకన్నంత సెప్పెద వినుండు. 12

క. కుంతీతనయులు సమయము, [5]శాంతతమై నడపి తమభుజాబలమును దు
ర్దాంతోద్యమశౌర్యము నెఱిఁ, గింతు మనుచు నున్నవారు గిను కెడఁ గదురన్.

క. వీరితలం పెఱిఁగిన గాం, ధారీతనయుఁడు సుహృద్వితానముఁ [6]గూర్చుం
బోరఁ బరిమార్తుఁ గొంచెపు, వారై యున్నెడన యని యవశ్యముఁ గడఁకన్.

క. [7]అలఘుబలవిక్రమోదా, త్తుల కైనను బలము లేక దోర్గర్వముమై
గెలువఁగ వశమె సహాయము, కలిమి ననంతంబు లగు పగఱసైన్యములన్. 15

క. కావునఁ బాండవపక్షము, భూవల్లభకోటి యిచటఁ బ్రో వగు నిమ్మై
నావీరులు నీవీరులు, దేవాసురులట్ల యనికిఁ దెగుదురు గడిమిన్. 16

వ. [8]ఇది యిక్కడి తెఱంగునకుఁ దోఁచినతలం పక్కడివారిచిత్తవృత్తి యెట్టిదగుట యెఱుంగ మెదిరిమతం బెఱుంగక యెట్టికార్యంబు నిశ్చయింప నెర వగునే కావున నియ్యవసరంబునం దగిన మానిసి నందులకుం బుచ్చవలయు దుర్యోధనుండు వీరికి రాజ్యంబుపా లిచ్చిన మే లగుఁ గాక తక్కిన నప్పటికిఁ బోలిన

---

1 మూఁడవయేఁడు...రెఱుఁగకుండ నాపద, లోదవఁగఁ జరియించి రిట్టి. 2 ఆరయ...(హితముగా). 3 దప్పఁగఁ దలఁపఁ డొక్క, తెఱఁగు నైకొని సేయ యుధి (మూలవిపర్యస్తము). 4 గపటంబున...గీడుసేయ రోయమి...కుడువం దగుపొం దగుటయుం ...నర్హుల రేనును నాయెఱింగినంత; నర్హుల రైనను నాకన్నంత. 5 సాంతంబుగ...గిను కెడ. 6 గూర్చుం ...గడకన్. 7 అలఘుతర...దోడు (దళము) లేక దోర్దర్పముచే..., కలిమిన గెలువంగ నగు పగఱ ; కలిమి ననంతంబులుగ పగఱ గెల్వ నగున్. 8 ఇది యొక్క తెఱంగునం దోఁచినతలం; ఇది యిక్కడి కార్యంబునకుఁ దోఁచిన తెఱం; ఇది యిక్కడి తెఱంగు మనకుం దోఁచినతలం పక్కడివారిచిత్తవృత్తి యెద్దియేని యెఱుంగక కార్యంబు నిశ్చయింప నగునె...వృత్తి యట్టిద యగుటయు నెఱుంగుదుమె... (మెదిరితలం పెఱుంగక యిట్టికార్యంబు నిశ్చయింప నేర నగునే)...మేలట్లు గాక తక్కినప్పటికి.

పని సూచుకొంద మని పలికిన విని బలదేవుం డియ్యకొని రాజలోకంబు
నాలోకించి యి ట్లనియె.

క. హరివాక్యము వింటిరె [1]యిది, యిరుదెఱఁగులజనములకును హితమును ధర్మో 17
త్తరమును నై యున్నది యీ, వెరవున శక్యంబు మనకు వీరలఁ దీర్పన్. 18

చ. తమసగపాలు గోలుపడి దానిన యిప్పుడు గోరువీరికిన్
సముచితవృత్తి నిచ్చి తమసామున సంతస మంది యున్కి యు
క్తము ధృతరాష్ట్రసూనునకు దాన నపాయము లేక యుండుఁ గో
ప ముడిగి వీరు సేయుదురు బాంధవ మిజ్జగముం బ్రియం[2]పడున్. 19

వ. కావున [3]నిక్కార్యం బెడ సేయక యొక్కరుం బనుప వలయు వాఁడునుం జని
యభిమతంబు సాధించునప్పుడు.

ఆ. మాటపొం దెఱింగి [4]యోటమై నల్లన, చేరి కౌరవేంద్రుచిత్తవృత్తి 20
కనుగుణంబు గాఁగ నానతుం డగుచుఁ బ్రా, ర్థించి యడుగకున్నఁ దెఱఁగుపడదు.

వ. అది యె ట్లనిన ధర్మనందనుం డతనియుద్ధతికిం [5]బుయిలోడి మెయివడి గల
నడవడిం బ్రవర్తిల్లు చుండియు జూదంబువెంట మోసపోయి తొడరి చిక్కనం
బడియె నదియును నతం డక్షవిద్యాపాటవంబు దనకు మిగుల లేమిం జేసియు
బంధుజనంబులు దన్ను వారించుటయుఁ దా నాడుట మాని గాంధారరాజు
నియమించినం దత్కళాకౌశలంబునం బరిణతుండు గావున నాశకుని యాడి
యుధిష్ఠిరుం డొడ్డినయొడ్డిమియు గెలుచుచు వచ్చి నట్లగుట నాతనియందును
గొఱంత లే దిత్తెఱంగున వార లధర్మపరు లని నిందింప రా కునికి కారణం
బుగా వీరలు వుచ్చినమానిసి వినయంబుతోన యిక్కార్యంబు దీర్చికొని రా
వలయు ననిన సాత్యకి గోపించి యి ట్లనియె. 22

సాత్యకి దుర్యోధనుకడకు దూతం బంపఁ గూడ దని చెప్పుట.

తే. ఇట్టు లాడఁ దగునె యిది నీక పోలు ని, న్నే మనంగ నేర్తు నిత్తెఱంగు
పాడి గాఁగఁ బూని పలుకంగఁ [6]జెవి యొడ్డి, యాదరించువారి నందుఁ గాక.

క. వేడుక వుట్టిన జూదం, బాడెనె ధర్మజుఁడు వారలందఱుఁ [7]దమలోఁ
గూడికొని పిలిచి బలిమిన, యాడి కపటజయము గొనుట యది దగ వగునే.

క. ధర్మతనూభవుదెస దు, ష్కర్మము రూపించి సభ నొకండును మైమైఁ
బేర్మి సెడక పో నేర్చునె, ధార్మికు లిం [8]కెట్టివారు తథ్యం బరయన్. 25

వ. పలికినచందముల్ నెఱపి పైతృకమై చను[9]రాజ్యభాగ మి

---

1 యది...(యే, వెరవున శక్యంబు). 2 పడన్. 3 నిక్కార్యంబున కెడ. 4 యోట
తే కల్లన) మై నల్లన. 5 బుయిలోట గలుగునడవడిం బ్రవర్తిల్లుచు... గెలుచుచు వచ్చె...నిషే
ంప రా కునికి. 6 జెవు లొడ్డి (జెవి యొగ్గి), యాలకించువారి. 7 సభలోఁ. 8 కేటివారు.
నాత్మభాగ.

ష్ములఁ బడయం దలంచి బలముం జలమున్ నెఱపం గడంగువీ
రలు నోరు వేఁడఁ బోదు రె యరాతులు సాధుల మెత్తురే రణం
బుల జయలక్ష్మిఁ జేకొనుటఁ బోలునె యొండొకరాజధర్మముల్. 26

తే. సముచితము లగుమాటలఁ జక్కఁబడక, తక్కె నేనుక్కివుం డగుధార్తరాష్ట్రుఁ
గ్రూరశరముల నే నియ్యకొలుపువాఁడ, [1]నవని గౌంతేయులకు నిచ్చునట్లుగాఁగ.

క. భీమార్జునులకు రణమున, నేమగలును [2]బ్రతియె వీరు నేనును సైన్యో
ద్దాముల మై నడచిన నే, భూమీశులు నెదిరి బ్రదికి పోవం గలరే. 28

ఆ. కవలవారుఁ గొడుకుగమియుఁ బాంచాలవ,ర్గంబు వృష్ణివరులుఁ గడఁగిరేని
నొక్కమాత్రలోన నువ్వెత్తు గొనరె దు,ర్యోధనాదిశతము [3]నుద్దవిడిన. 29

క. ఈమత్స్యపతి [4]సహాయము, గా మాకుం దీర్ప రానికార్యము గలదే
సామాద్యుపాయపరుఁ డు,ద్దామభుజాబలయుతుం డితఁడు కేవలుఁడే. 30

క. నామతమునఁ గార్యము సం, గ్రామము [5]సేయుటయ యిట్లు గా కీలోనన్
సామవచనంబు లక్కఱు, భూమీశ్వరుతోడ నాడఁ బుచ్చెద రేనిన్. 31

ఉ. దైన్యము దక్కి దూత యుచితంబుగఁ బాండునృపాలుపాలు రా
[6]జన్యవరుండు ధర్మజుఁడు సమ్మతి వేఁడెడు నన్న లోకసా
మాన్యవిధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చికొంద మ
న్యోన్యవిరుద్ధభాషణము లాడినఁ దత్ఫల మాతఁ డందెడున్. 32

వ. అనిన ద్రుపదుం డిది వోలు బలదేవు[7]మాట మాట గాదు బలపరాక్రమవంతుండును సహాయసంపన్నుండును దుష్టాత్ముండును నైనదుర్యోధనుండు ప్రియవచనంబుల రాజ్యంబుపా లిచ్చుట కియ్యకొనమి సిద్ధంబు యుద్ధంబునం గాని చక్కంబడఁ డని పలికి మఱియు ని ట్లనియె. 33

క. మృదుభాషణముల దుర్జన, హృదయములు ప్రసన్నతామహిమఁ బొందునె యె
ల్లిదముగఁ గొని యంతంతకు, మద మెక్కుంగాక దురభిమానము పేర్మిన్.

వ. అదియునుం గాక. 35

తే. కూటికై ద్రోణభీష్ములు గుమతి యనక
యనుసరింతురు ధృతరాష్ట్రుఁడును దనూజు
తృష్ణ నూనినవాఁడు రాధేయుబోఁటి
తులువ లెల్లను [8]నతని సద్బుద్ధి యంద్రు. 36

వ. కావున నతండు దుర్వినీతుం డై యుండు నెల్లభంగుల సంగరంబు గాఁ గల

---

1 నరసి. 2 (సరియె వీరు నేమును) శౌర్యో. 3 నుద్దవడి(ని)న. 4 సహాయుఁడు, గా...,ద్దామయశోబలయుతుం. 5 సేయుటయ యట్లు; సేయుటయ లెస్స యటు గాకున్నన్, సామవచనములు నక్కఱు,...తోడఁ జెప్పఁ. 6 జన్యవిభుండు; జన్యుఁడు ధర్మనందనుఁడు..., డొందెదున్. 7 మాటలు పాడిగావు; మాట పాటిగాదు...వీరికి రాజ్యంబు. 8 వాని.

యది యీసమయంబున బలంబులం గూర్చికొని పిలువం దగురాజులం [1]బిలిచి
పుచ్చవలయు సుయోధనుండును దో డాసపడి పుచ్చు నుచితపరు లగునరపతులు
దొలుతఁ జెప్పినవారిక సహాయత్వంబుఁ జేయం జూతురు మనము వెస గల
కాలరుల వేగంబ పుచ్చి శల్యకేకయధృష్టకేతుజరాసంధతనయప్రభృతు లయిన
భూపతులకును వారివారిబంధుమిత్త్రజనంబులకును నెఱింగించి పుచ్చుట కార్యం
బిది నాకుం బోలినతెఱం గని పలికి తనకెలన సముచితాసనంబున నున్న
విప్రవరుం జూపి. 37

క. ఇతఁడు మదీయాగ్రపురో,హితుఁ డితనికి నెల్లపనులు నెఱిఁగించి తగన్
ధృతరాష్ట్రుకడకుఁ బనుపుఁడు, చతురవచనరచనఁ గఱపి సంప్రీతిమెయిన్.

ఉ. ఆతనిసమ్ముఖంబునఁ దదగ్రతనూజుకడన్ [2]మరున్నదీ
జాతునిసన్నిధిం గలశసంభవునొద్దఁ గ్రమోచితంబుగా
నీతెఱఁ గిట్టు లాడు మని యేర్పడ నంతయుఁ జెప్పి పుచ్చఁగా
నీతిమెయిం దగం బలుక నెయ్యము లాభముఁ బెంపుఁ జొప్పడున్. 39

వ. అనిన వాసుదేవుండు పాంచాలపతివచనంబు లుచితంబు లయి యున్నయవి
యిబ్భంగిన చేయవలయు నని పలికి మఱియు నిట్లనియె. 40

క. [3]కౌరవులకుఁ బాండవులకు, నారయ నే నొక్కరూప యట్లగుటఁ దగన్
వారును వీరును దమతమ, నేరిమిమెయి ధరణి యేలి నెగడఁగఁ జూతున్. 41

తే. [4]పెండ్లి కని పిల్వఁ బంచినఁ బ్రియముతోడ, నేఁగుదెంచితి మిన్నాళ్లు నెల్లయొప్పి
దములఁ జూచితి మియ్యెడఁ దడవుగాఁగ, నిలువఁ దీఱదు పోయి రావలయు మాకు.

వ. అని పలికి ద్రుపదు నాలోకించి మీరు మా కెల్లవారికి గురుస్థానంబు మీమాట
యనిన ధృతరాష్ట్రుండు బహుమానంబు సేయు మిమ్ము శాంతనవుండునుం గొని
యాడు మీయందు ద్రోణ[5]కృపాచార్యులు సఖ్యంబు వాటింతు రట్లగుటం జేసి.

తే. పాండవార్థమై యొక్కరుఁ బనుప మీక, భరము మీపలు కందఱపలుకు మీరు
తెఱఁగుపఱుపంగ [6]మిగిలి యుద్రేకు లైన, వార చెడువారు విమలవిచారవిభవ.

పొం దైన లెస్స [7]విరసపుఁ, గ్రం దయ్యెడుచంద మైన రాజుల నెల్లన్
ముందర రావించి క్రమం, బొందఁగ మముఁ బిలువఁ బంపుఁ డొయ్యన పిదపన్.

మీపనుపున రాజ్యముపా, లీపాండుతనూభవులకు నీ కున్న [8]భుజా
టోపభయంకరుఁ డర్జును, కోపానల మడరి ముట్టికొనదే వారిన్. 46

వ. అని గమనోన్ముఖుం డయి మురాంతకుఁ డాద్రుపదుండు ధర్మనం

1 బిలువం బంచి యుద్ధసన్నద్ధుల మయి యుండ వలయు...పిలిచి పుచ్చనుచిత; పిలువం
చ్చ నుచిత. 2 వియన్నదీ...నెయ్యము తియ్యముఁ. 3 కౌరవులును బాండవులును, నారయ
కొక్కరూప..., నేరుపుమెయి. 4 పెండ్లికిని బిల్వ ... నెలమి యొప్పి. 5 కృపాచులు
(బూని) మీఱి...చెడుదురు...హృదయ. 7 విసరపుఁ ; వీరపుఁ ; కయ్యపుఁ. 8 జయా.

దనుఁడు వృకోదరాదు లగుతమ్ములు మత్స్యమహీవిభుండుఁ ద
న్ననుప హాలాయుధప్రభృతియాదవలోకము తోడ రా ముదం
బున నిజపట్టణంబునకుఁ బోయె సముజ్జ్వలవైభవంబునన్. 47

వ. వివాహమహోత్సవంబునకు వచ్చినతక్కటిరాజులును సంగ్రామసన్నాహంబున
కై తమతమపురంబులకుం జనిరి తదనంతరంబ. 48

క. సమరమునకుఁ దగునుద్యో, గమునఁ బ్రవర్తిల్లి రెలమిఁ గాంతేయులు మ
త్స్యమహీనాథుఁడు [1]సన్నా,హము సేసెఁ ద్రుపదవిభుఁడు నాయిత మయ్యెన్.

వ. ఇట్లు సన్నద్ధులై [2]వెలివీడు విడిసి తమకు ననురక్తులైనరాజులపాలికిం దగు
దూతలం బుచ్చి రట దుర్యోధనుండు వీరలచందంబు విని తానును దనబంధు
మిత్త్రగణం బైనరాజలోకంబు నెల్ల రావించిన. 50

క. ఇభతురగస్యందనగతి, రభసంబునఁ బృథివి యద్రువ రాఁ దొడఁగిరి భూ
విభులు నలుదిక్కులను లో,కభయంకరలీల నుభయకటకంబులకున్. 51

ద్రుపదుఁడు దనపురోహితుని దుర్యోధనుకడకు దూతఁగాఁ బంపుట.

వ. అట్టిసమయంబున నజాతశత్త్రునసుమతి వడసి పాంచాలపతి వయోజ్ఞానవృద్ధుం
డైనతనపురోహితుం గురుపతిపాలికిఁ [3]బుచ్చువాఁడై యతని రావించి. 52

క. హితుఁడవు మతిమంతుండవు, చతురవచనకోవిదుఁడవు [4]సమయజ్ఞుఁడ వు
న్నతవంశవర్ధనుఁడ విం,గితవేదివి నెచ్చెలివి సుకృతి వట్లగుటన్. 53

తే. నాకుఁ గర్తవ్య మగుపని నీకుఁ జేయఁ, దగవు గావున నెల్లవిధములఁ బూని
పాండవార్థంబు ధృతరాష్ట్రుపాలి కరిగి, నేర్పు వాటించి కార్యంబు దీర్పవలయు.

వ. అని చెప్పి యొడంబఱిచి యతనితో మఱియు ని ట్లనియె. 55

క. విను కొడుకు గొన్న వేఁదుఱు, కొని [5]కొట్టినతిండికాఁడు కుటిలుం డతఁ డా
జనపతిచందము ధర్మజు, ననుపమశీలంబు నెఱుఁగు దది యట్లుండెన్. 56

తే. పుడమిపాలు పాండవులకు నడుగఁ బోయి
నీవు ధృతరాష్ట్రుతో ధర్మనిష్ఠ మైన
యుచిత మాడిన నందుఁ బో టొడ్డి యున్న
దొరలభృత్యులమనములు దిరుగఁబడవె. 57

క. గురుభీష్మాదులమనములు, దురమునకుం జొరక యుండ దుర్యోధనుఁ డా
తురుఁడై యొడఁబఱుపఁగ ని,ష్పరుసున నెర వైన ఱిచ్చవడు బల మెల్లన్.

ఉ. పాండుతనూభవుల్ వడినపాటులు బంధుల కెల్లఁ దెల్పుచుం
బండితవృద్ధసజ్జనులపాలికిఁ బోయి కులోచితంబు గా
కుండుట సూపి చెప్పుచుఁ బ్రియోక్తులఁ దక్కటివారి [6]నిట్లు మే

1 సన్నాహము సేసెను. 2 వెడలి వీడు (వడసి) విడిచి ... బనిచి రంత. 3 బనుచు. 4 సర్వజ్ఞుఁడ (వున్నతవంశవర్ధనుఁ). 5 కొట్టినతీఁటుకాఁడు; క్రొవ్విన...కుజనుం డతఁ. 6 కెల్ల.

లొండొకచంద మొప్ప దని యుల్లములం దలపోయఁ జేయుచున్. 59

వ. మఱియు సమస్తజనంబులమనం[1]బులు నిక్కడ వ్రాలునట్టియుపాయంబు లెన్ని గల వన్నియు నప్పయ్యతగవులమై నాచరించుచుఁ జరియించునది యిచ్చట విరాటునిగొలువుకూటంబునం బుట్టినకృష్ణాదులసంవాదంబు తెఱంగును మన యెఱింగినయదియ తదనురూపంబుగాఁ బలికి పాండవులకుఁ దేజోలాభంబుం గావించుట కర్తవ్యంబు నీవు కరినగరంబున వసియించి ధృతరాష్ట్రధార్తరాష్ట్రగాంగేయవిదురగురుకృపాదులకడ కరిగి నానాఁటికి వారివారిచిత్తంబుల తెఱంగెఱింగి ప్రవర్తింపుము దైవగతింజేసి నీ యొడ్డినసూత్రంబునకు సుయోధనుం డొడంబడియె నేనియు నదియ సకలజనసమ్మతం బయినవిధం బగు దాన నజాతశత్రుండును బ్రీతుం డగుఁ బోయి రమ్మని నిశ్చయంబు సేసిన నమ్మహీసురవరుండు.

క. మును పాంచాలవిభుని వీడ్కొని ధర్మజు భీము నరు నకులు సహదేవుం
గని [2]యనుమతుఁ డై యందఱు, ననుపఁగ మన్ననలు వడసి యరిగెం బ్రీతిన్.

వ. అంత నక్కడ దుర్యోధనుండు సకలరాజన్యసామాన్యంబుగా గోపాలదేవుపాలికి దూతం బుచ్చుట దగ వగు నే యని విచారించి. 62

క. వెరవుమెయిఁ దాన కతిపయ, పరిజనసహితముగ నరిగెఁ [3]బటుతురగగతి
స్ఫురణానుమోదలీలా, భరితుఁ డగుచు వేగిరంపుఁబయనములఁ దగన్. 63

వ. చని తదీయపురప్రవేశంబు సేసె నాదివసంబున ధనంజయుండును గోవిందుం గాన వచ్చె నట్టియెడ. 64

తే. [4]అతఁడు పవడింప మును కౌరవాధినాథుఁ, డరిగితలయంపిదెస నున్న తాసనమున
నుండెఁ బదపడి కాల్కడయొద్ద కల్లఁ, జని వినమ్రుఁ డై నిలుచుండె సవ్యసాచి.

వ. అంత. 66

క. మేలుకని కృష్ణుఁ డర్జును, నాలోకించి మఱి కౌరవాధిపుఁ గని త
త్కాలోచిత[5]బహుమతిమైఁ, జాలఁ బ్రియం బిరువురకుఁ బ్రసన్నతఁ జేసెన్.

వ. తదనంతరంబ. 68

ఉ. వారలఁ జూచి కేశవుఁడు వచ్చినకార్యము సెప్పుఁ డన్న న
క్కౌరవనాథుఁ డిట్లనియెఁ గయ్యము [6]సేయువరగ్ సహాయముం
గోరి భవత్సకాశమునకుం జనుదెంచితి మేము వీరు నీ
కారయ నొక్కరూప హృదయంబునఁ బేర్చినబాంధవంబునన్. 69

క. ము న్నేను గాన వచ్చితి, నిన్ను సుజను లైనవారు నెమ్మిని మునుమున్

---

1 బులుం బ్రియోక్తుల నిక్కడ...కృపాదులయిండ్ల ...నీయాడిన. 2 యందఱు వేడుకతో. 3 బటుతరగతి విస్ఫురణానుమోదలీలా, పరిణతుఁ డయి. 4 గణఁక నున్న పదంపడి కా(లి) క్కడకు, నుండె...కాల్కడ కొయ్య నొయ్య. 5 బహుగతి; కృతమతి యై, చాలఁ. 6 సేయు నెడన్; సేయఁదగన్; సేయు నుపాశ్రయంబునన్ ...(భవత్ప్రకాశ) భవత్ప్రసాదమునకుం.

[1]గన్నం దగఁ గైకొంద్రు స, మున్నతసౌజన్యసారయుతుఁడవు నీవున్. 70

వ. కావున లోకంబుపాడి విచారించి నాకుం దోడు గావలయు ననిన వాసుదేవుం
డి ట్లనియె. 71

ఉ. నీ విట మున్న వచ్చి [2]తిది నిక్కము పార్థునిఁ దొల్తఁ గాంచితిం
గావున మీకు నిద్దఱకు గౌరవ మొప్పఁగఁ దోడుపాటు స
ద్భావము దీనికిం దెఱఁగు దప్పక యుండఁగ నేర్పరించెద
న్మీవల పెట్టు లట్ల తగ నీవును నీతఁడుఁ గోరికొం డొగిన్. 72

క. నాపాటియ పదివేవురు, గోపాలురు గలరు సమరకోవిదబాహా
టోపాభిరామమూర్తులు, చాపాద్యాయుధకళావిశారదచిత్తుల్. 73

క. నారాయణాభిధానులు, వారలు గయ్యంబు [3]సేయువా రొక్కఁడ నే
నూరక నిరాయుధవ్యా, పారతమై నుండువాఁడఁ బరమాప్తుఁడ నై. 74

క. వా రొకతల యే నొకతల, యీరెండుదెఱంగులందు నెయ్యది ప్రియ మె
వ్వారికిఁ జెప్పుఁడు దొలితొలి, గోరికొనఁగ బాలునికిఁ దగుం బాడిమెయిన్.

—— అర్జునుఁడు శ్రీకృష్ణునిం దనకు సహాయునిఁగాఁ గోరికొనుట. ——

క. అని పలికి హరి గిరీటిం, గనుఁగొని [4]కొండొకవు నీవు గావున నీకుఁ
మును గోరఁ బాడి యనవుడు, విని కృష్ణునిఁ గోరికొనియె విజయుం డెలమిన్.

ఆ. దాని కాత్మఁ బొంగి ధార్తరాష్ట్రుఁడు వారి, నపహరించికొనినయట్ల కాఁగఁ
దలఁచి చెన్ను [5]మీఱి బలములఁ గైకొని, చనియెఁ బ్రీతి రాముసదనమునకు.

వ. చని యతనిం గని సమ్మానంబు వడసి తనవచ్చినకార్యం బెఱింగించిన దుర్యో
ధనునకు బలదేవుం డిట్లనియె. 78

క. అభిమన్యువివాహమునకుఁ, బ్రభువర్గం బెల్లఁ గూడఁబడి యుండఁగ నా
సభ నీకై యేఁ బలికితి, నిభపురమున మాట వుట్ట[6]దే యీవు వినన్. 79

వ. దానికిఁ గొంద ఱసహ్యపడి పాండవపక్షపాతంబునం బ్రతికూలవచనంబులు
వలికిన నవి కృష్ణునకుఁ బ్రియంబు లై యుండె నట్లగు[7]టం జేసి. 80

తే. అతనిఁ బాసి యొక్కింతప్రొద్దైన నిలువఁ, జాలమియుమూలముగ విరసంపుమాట
లాడ నొల్లమి నేమియు ననక యంత, నుండి యొకనిశ్చయమ్ముమై నున్నవాఁడ.

వ. అది యెయ్యది యంటేని. 82

క. మీరును వారును జలమునఁ, బోరెదు నెడ [8]నెద్ది యెట్లు వోయిన నెఱి నే
నూరక యుండుదుఁ దోడె, వ్వారికిఁ బో నింత నిక్కువం బెబ్బంగిన్. 83

వ. అనిన విని దుర్యోధనుండు దాని కియ్యకొని సవినయంబుగా బలదేవుని వీడ్కొని

1 గన్నంతనె కైకొం. 2 తది...తోడ నెంతయును దప్పక...; దీనికిం దగవు తప్పక రెం డుగ నేర్పరించెదన్. 3 సేయు వలను గలరు నే; సేయు వా రొక్కఁడ నే. 4 కొండికవు. 5 మిగిలి దళములఁ. 6 దె(ది)ట్లీవు వినన్. 7 ట యెఱింగి. 8 నెవ్వ రెట్లు; నెవరివంకఁ బో.

వాసుదేవు నామంత్రణంబు సేసి కృతవర్మపాలికిం జని యాతం డొక్కయక్షౌ
హిణితోడం దన్నుం గలయ వచ్చువాం డయి యూఱడం బలికినం బ్రియం
బంది నిజపురంబున కరిగెం దదనంతరంబ కృష్ణుం డర్జునున కిట్లనియె. 84

క. నారాయణగోపాలుర, భూరిపరాక్రములం గురువిభుండు గొన సంగ్రా
మారంభరహితు నన్నుం, గోరికొనుట నీకు మే [1]లగునె తలపోయన్. 85

క. [2]అనుటయు నాతండు హరి కి, ట్లను నేను రణంబునకు సహాయం బొల్లన్
విను సుప్రసిద్ధుండవు నీ, వని సేసినం బేరు నీక యగు నెప్పాటన్. 86

వ. నీ కెదు రై జయంబు గొన రా దట్లగుటం జేసి విజయమూలం బగునీతోడును
వలయు నీవు సమరంబు సేయ [3]కునికియుం బ్రియంబు కావున నిన్నుం గోరి
కొంటి నని చెప్పి మఱియు నిట్లనియె. 87

క. సారథ్యం బొనరింపు మ, పారకృపాలీల నెల్లభంగుల [4]నా కీ
గౌరవమును జిరకాలము, గోరినయది దీని నిమ్ము గుణరత్ననిధీ. 88

క. అనినం గిరీటికి హరి యి, ట్లను నీ దగుకోర్కి దీర్చు టది నాకు వ్రతం
బనఘా తగ సారథ్యం, బొనరించెద నీకు [5]నసమయుద్ధక్రీడన్. 89

క. అని యూఱడించి నరుం దో, డ్కొని ధర్మతనూజునొద్దకుం బ్రియ మెసంగం
జనుదెంచెం గార్యాలో, చనమును దగం జేయు బుద్ధి శౌరి గడంకన్. 90

వ. అంత నట శల్యుపాలికిం బోయినదూత లతనిం గని సముచితాలాపంబుల సమర
సహాయత్వంబునకుం గోరి పిలిచినం బ్రీతుం డై యతండును బుత్త్రమిత్త్రసమే
తంబుగా నానాసేనాతిసంకులంబుగాం గదలి పాండవు లున్నయెడకు నిత్యప్ర
యాణంబుల నడచుసమయంబున. 91

దుర్యోధనుండు శల్యసాహాయ్యంబు గోరుట.

తే. ఇంతయును విని కౌరవాధీశ్వరుండు, దక్షు లగునాప్తజనములం దత్క్షణంబ
మద్రనాథునిచనియెడు మార్గమునకుం, బుచ్చియెడనెడి నతులవిభూతి మెఱయ.

సీ. అరుదారుమేలుకట్లాయితం బై చూడ, నొప్పారి తనుపగుచప్పరములుం
[6]బర పైనచెలువంబు గరగరికయుం దియ్య, తెలిసీరుం గలిగినదీర్ఘికలును
బొడ వైనముప్వంచం బొలుచునట్లుగ నేనుం, గులకు గుఱ్ఱములకుం గొట్టములును
ముందర బయలైనచందంబుం జతురాభి, మత మైనయాస్థానమండపములు
బియ్యములును నేయుం బెరుంగును గూరగా, యలును వంటకట్టియలును గడ్డి
కవణములును బెల్లుగా నొడం గూర్చి ని, గూఢవృత్తిం దానుం గూడ నడచె. 93

1 లౌకో. 2 అనవుడు...సహాయత యొల్లన్, విను నీవు సుప్రసిద్ధుండ, వని. 3 కునికి ప్రియం. 4 ననికిన్ గౌరవమునం. 5 నతుల. 6 బరవు లై చెలువంబు...,(బొడవు లై) ...డవు లై ముప్వంచం...,మతము లౌ నాస్థాన...(ఖాణములును బెల్లు గా నొడం).

వ. ఇవ్విధంబున విడిదలపయనంపుసంపదలు వొంపిరివోవం దనకు సమకట్టినసమస్త వస్తువులయవైకల్యంబునకు శల్యుండు సంతుష్టాంతరంగుండై నిజపరిజనంబులం జూచి యిట్లు చతురంబుగా మనకు వలయువాని సంపాదించుటకుం బ్రవర్తకులై నయధిరామాత్యు లెవ్వారు వారలం దోడ్కొని రండు వారలు ప్రసాదదానంబున కర్హు లని పలుకునవసరంబున నటమున్న పలువెఱంగులం బనులు సేయుచున్న తనపల్లాయనంబువారిలోం గలసి మఱువడి యున్నకౌరవేశ్వరుం డమ్మాటలు విని యతనికిం బొడసూప నిదియ సమయం బని సముచితప్రకారంబునం దన్నెఱింగించికొని వినయంబునం గనిన నతండును సంభ్రమంబునం గాఢాలింగనంబు సేసి కనకాసనంబున నునిచి యింతయు నిమ్మహాత్మునుద్యోగంబున నయ్యెం గావలయు నని తలంచి విస్మయం బంది నీ కెయ్యది యిష్టంబు గోరు మిచ్చెద ననిన గాంధారీనందనుండు పరమానందంబునం బొంది యిట్లనియె.

క. సత్త్యసరస్వతి వగు[1]మా, చిత్త్యవిశారదము నీదుచిత్తము నియమా
దాత్త్యంబు మెఱయ నాకు న,మాత్త్యుండ వై పూని నడపు మత్సైన్యంబున్.

ఆ. తలంపం బాండవులును ధార్తరాష్ట్రులు నీకు, నొక్కరూప భక్తి యుక్తిం జాల
నీవు నన్ను [2]మాననీయుండు గాంగ న,నుగ్రహించి తగం బరిగ్రహింపు. 96

చ. అనవుడు శల్యుం డియ్యకొని యట్టిద కాదె విభేద[3]వృత్తి నా
మనమున లేదు పాండవసమాజము మీరును నొక్కరూప కా
వున నిది లెస్సమాట దగవుం దలపోయంగ మున్ను ప్రీతిం గాం
చిన నిను నెమ్మిం గూడుటయ చేయుదు నిట్టుల యెల్లభంగులన్. 97

ఉ. దానం గొఱంత లే దభిమతం బిది గాకయుం గల్గెనేనియుం
బూని యొనర్తు నన్నుం గురుపుంగవుం [4]డెంతయుం బొంగి నీవు స
మ్మానము సేసి నా కిటు లమాత్యుండ వై నపదంబుకంటె మే
లై నుతి కెక్కుకోర్కి యెటు లారసి చూచిన నొండు గల్గునే. 98

వ. అనిన విని వికచవదనుం డగుచు మద్రేశ్వరుండు. 99

క. చను నీవు హస్తినగరం, బున కేనును బాండుభూపపుత్త్రులం బ్రీతిం
గని యట వత్తు నవశ్యం, బును వారలం జూడ వలయుం బోయెద [5]ననినన్.

ఆ. అట్ల కాక వేగ మట నోయి వారలుండు, వరము మఱవ కుండవలయు మిమ్ముం
జేరి నెగడువాండం గారుణ్యమున నిట,యరసి యుండుం డనియెం గురువిభుండు. 102

వ. అనవుడు.

క. దరహాసముతో మద్రే, శ్వరుం డాలింగనము సేసి సందియపడ కీ

1 దా,చిత్త...నీయాదాత్త్యంబు. 2 మాననీయునిం గాంగ; మాననీయుం గాగ ననుగ్ర,హించి తగం బరిగ్రహింపవలయు. 3 బుద్ధి...నిట్టు లనేకభంగులన్. 4 డెంతయుం బ్రీతిం బొంగి...వరంబుకంటె...చూచినం గల్గ నేర్చునే. 5 ననుడున్.

వరుగు మని పలికె నాతఁడు, కరిపురికిం జనియె మది వికాసముఁ బొందన్. 103

శల్యుఁడు పాండవులం జూడ నుపప్లావ్యంబునకు వచ్చుట.

వ. అంత శల్యుండు నుపప్లావ్యంబునకుం జని [1]స్కంధావారంబు దఱియం జొచ్చి ధర్మనందననివాసంబున కరిగిన నతండు దమ్ములుం దానును ద్రౌపదీసుభద్రలు నభిమన్యుప్రభృతిపుత్రవర్గంబును నెదురు వచ్చి కృతప్రణాములై తోడ్కొని పోయి కాంచనాసనంబున నునిచి యర్ఘ్యపాద్యంబు లిచ్చి కుశలం బడిగిన సర్వం బును గుశలసంపన్నంబ యని వారల నందఱ నభినందించి యుధిష్ఠిరుం బున రాలింగనంబు సేసి యి ట్లనియె. 104

క. జనరహితం బగువనమున, ననుజన్ములు ద్రుపదభూవరాత్మజయును నీ వును నింతకాల మలయక, [2]యునికి కడుఁ దుష్కరము మహోదాత్తమతీ.

ఆ. దానికంటె నరిది దలపోయ నజ్ఞాత, వాస ముజ్జ్వలాంగభాసమాను [3]లైనమీకు మీఁదయాసూనృతాదుల, పెంపు మిమ్ముఁ గడవఁ బెట్టకున్నె. 106

క. ఇమ్మహి యెల్లను [4]నీమది, యుమ్మలికకుఁ జాల నొచ్చె నుర్వీవర నీ విమ్మెయి నిప్పు డఖిలదురి, తమ్ములుఁ గడచుటకు సమ్మదమ్మునఁ బొదలెన్. 107

వ. అని యుచితసంభాషణంబులు సేసి దుర్యోధనుండు దన్నుం గాంచినవిధంబు ను నతండు ప్రార్థించినతెఱంగును దానికిఁ దా నియ్యకొనుటయుం జెప్పిన ధర్మ నందనుం డతని కి ట్లనియె. 108

తే. మేలు సేసితి [5]రొక్కరి మెచ్చి వారి, కోర్కి దీర్చుట పెద్దలగుణమ కాదె యది మదీయచిత్తమునకు హర్షకరమ, తివిరి యొక్కటి వేఁడెద నవధరింపు.

వ. పార్థునకుఁ గృష్ణుండు సారథ్యంబు [6]సేయువాఁడై యున్నవాఁడు కర్ణుండు పార్థుతో నెప్పుడు మచ్చరించుచు నుండు నీ రిరువురకు సంగ్రామంబైనయప్పుడు కృష్ణునకుఁ బ్రతిసారథ్యం బొనరింప మీరకాని యక్కడం దక్కొరుండు లేఁడు గావున నవశ్యంబును మీకుం గర్ణసారథ్యంబు గర్తవ్యంబు గాఁగలయది సమర సమయంబున నిరాకరించి పలికి కర్ణుచిత్తంబునకుం గలంక వుట్టించి పార్థు రక్షింపవలయు నకృత్యం బని యనుమానింపక మత్ప్రార్థనంబున నెల్లభంగుల నివ్విధం బనుష్ఠింపవలయు నని యభ్యర్థించిన సమ్మతించి శల్యుం డి ట్లనియె.

క. అగు నిది [7]హోలును నాకుం, దగ వట్టిద కర్ణునకు రథంబు గడప నీ

1 పాండవస్కంధా ... నావాసంబునకుం జనిన...ప్రణాముఁడై. 2 యుని కిది దుష్కరము కడు (మహోదాత్తమతిక్). 3 లైనయట్టిమీఁదయాసుకృతాదుల; లైన మీకు మీఁదయాసు కృతాదుల. 4 నీదగు, నుమ్మలికకుఁ (జాలనొర్చి యుర్వీపర). 5 రొక్కట మెచ్చి వారి; రొక్కని (రొక్కరు) మెచ్చి వాని..., యది మదీయచిత్తమునకు నర్హమతిమ; యైన నొక్కటి వేఁడెద నవధరింపు. 6 సేయ నున్నవాఁడు...ప్రార్థనం బంగీకరించి యెల్ల. 7 వోలున (నాకుం, దగు నట్టిద).

వగు దని కోరినకౌరవ, జగతీశ్వరుప్రార్థనంబుఁ [1]జలుపఁగ వలయున్. 111

క. కర్ణునిసారథి నైనను, నిర్ణయమున కేను ఫాల్గునిం గాచెద నా
దుర్ణయవిచారు నెమ్మెయిఁ, గర్ణకఠోరంబు లాడి కలఁతుం బోరన్. 112

తే. దర్పమును దేజమును మాయఁ [2]దలరఁ బలికి, చిక్కువఱిచిన నేయంగఁ జేతులాడ
కునికి రాధాతనూజు నర్జునుఁడు దీవ్ర, బహుళబాణపరంపరపాలు పఱుచు.

చ. ఇది యొకఁ డేల నీవు మది నెయ్యది గోరినఁ జేయువాఁడ నాఁ
డదయత సూతసూతి సభ నాడినమాటకుఁ జాల [3]నొచ్చి మా
హృదయము లెల్ల నీవలన నెంతయుఁ బఱుము సేయు నక్కటా
యదియునుగాక మీపడినయాపద లెవ్వరి నొవ్వఁ జేయవే. 114

ఆ. ఇట్లు వడితి ననుచు [4]నెద నీవు వగవకు, గారవమున నీమనోరథమ్ము
ఫలము వొందు నెల్ల భంగుల దేవత, లయినఁ బడుదు రొక్కయవసరమున.

క. వాసవుఁడు దొల్లి నిజకాం, తాసహితము గాఁగ నధికదైన్యము వొందెఁ
మీసంపద పెద్దయె విధి, సేసినగతిఁ [5]బడక యుండ శివునకు వశమే. 116

వ. అనిన విని ధర్మనందనుం డింద్రుండు శచీసమేతంబుగా [6]నట్టిదురవస్థ యేమి
కారణంబున నెత్తెఱంగున ననుభవించె నని యడిగిన మద్రపతి దొల్లింటియితి
హాసంబు సెప్పెద విను మని యి ట్లనియె దేవతలయందు మాన్యుం డై త్వష్ట
యనుపేరం బరఁగువాఁడు వాసవునకుం గీడు దలంచి మూఁడుదలలవాని
నొక్కని సృజియించి విశ్వరూపనామధేయుం జేసిన నతం డింద్రపదవిం గోరి
ఘోరతపంబు సేయుచున్న దానికి భయం బంది నిలింపపతి యప్సరస్త్రీలఁ
దత్తపోభంగంబు సేయుండని నియమించి పంచిన. 117

క. వారివిలాసంబులను వి,హారముల విలోకనముల నాలాపములన్
మార [7]వికారం బాతనిఁ, జేరద యన్నాకపతియు సిగ్గిదఁ గదురన్. 118

తే. [8]తలరి యమ్మునిఁ దెగఁజూచి ధర్మరహితుఁ
డగుట యెవ్వరు నెఱుఁగనియట్లు గాఁగ
నేడుగాలంబు గడపిన నెఱిఁగి భూత
గణము లాక్రోశ మొనరింపఁగా నతండు. 119

వ. తనదుష్కర్మంబు ప్రకటం బగుటకు రోసి యొక్కవిషమవ్రతం బాచరించి
సముద్రతరుధరణీస్త్రీజనంబులయందు బ్రహ్మహత్య విభాగించి పెట్టి నిజకల్మషం
బుఁ బాపికొని మునిగణసేవితుం డయి సముల్లాసంబునం బొంది [9]యునికిఁ
ద్వష్ట గోపించి. 120

---

1 (స) జలుపన వలయున్. 2 దనర. 3 నొచ్చె...సేయ నక్కటా ; సేయు నల్లవో ...మీపడినయక్కట. 4 నెడదను (వగవకు). 5 బడయ కుండ. 6 నెట్టి...నేమికార ణం. 7 వికాసం...సిగ్గిడఁ. 8 తలఁకి; 9 యునికిం గని త్వష్ట.

తే. అనపరాధుఁ దపోనిధి [1]నధికశాంతి, యుక్తుఁ జంపినపాపాత్ము నుఱక పట్టి
మ్రింగఁజాలెడువాని నుత్తుంగదేహు, నేను సృజియింతుఁ జూడుఁడీ యాక్షణంబ.
చ. అనుచుఁ గడంగి నిష్ఠమెయి నగ్నిముఖం బొనరించి వేలిమిం
[2]దనయు సృజించి లోకవిదితంబుగ వృత్రసమాఖ్య యిచ్చి మ
ద్వినుతతపోబలంబునఁ బ్రదీపితతేజుఁడ వై జయింపు నీ
వని నియమించి పంచె నమరాధిపుతో సమరంబు సేయఁగన్. 122

ఇంద్రుఁడు వృత్రాసురునితో యుద్ధంబు సేయుట.

చ. పనిచిన నాతఁడుం జనియె బాహుబలంబున [3]నేచి వాసవుం
డని కెదురేఁగుదెంచె నిటు లద్భుతసంగర మైనచోట న
య్యనిమిషనాథుఁ బట్టుకొని యంగద వృత్రుఁడు మ్రింగె దేవత
ల్మనమున బెగ్గలింపఁగఁ జలంబు బలంబును జూపి యుగ్రుఁ డై. 123
వ. ఇట్లు మ్రింగినం ద్రిదశగణంబులు దత్క్షణంబ యాదైత్యునకు నావులించు నట్టి
యాలస్యం బావహించిన. 124
తే. అసురనాథుండు నలసత [4]యడర నీల్గి, యావులించిన నత్తఱి నమరవిభుఁడు
దనశరీరంబు సంకుచితంబు సేసి, కడు జవంబునఁ గుప్పించి వెడల నుఱికె.
క. [5]వెలలి బలరిపుఁడు చలమునఁ, గలహమునకుఁ జొచ్చె వృత్రుఘనబాహుబలం
బలవికి మీఱెను దండ్రి వి,మలతపమునఁ జేసి సురలమనములు దలఁకన్.
వ. ఇ[6]ట్లధికబలుం డైనవృత్రునాటోపంబు సహింపం జాలక సురపతి దెరలి మరలి
పఱచి మందరగిరిశిఖరంబున కరిగినం గనుకనిం జని యనిమిషు లతనిం గూడు
కొని వృత్రవధోపాయంబు విచారించునెడ నవ్వాసవుండును దనమనంబున
నిశ్చయించి. 127
క. హరిఁ గాంచి యతనిచెప్పిన, పరమోపాయంబు సేసి బ్రతుకుద మనిరౌ
సుర లదియ కర్జ మని య,మ్మురమర్దనుకడకుఁ జనిరి మునులుం దారున్. 128
వ. ఇట్లు దివిజానీకంబును మునిలోకంబును బాకశాసనుం బురస్కరించుకొని.
మ. చని యాదైత్యుతెఱంగు సెప్పి యతులోత్సాహంబుమై నెప్పుడుర్
దనుజవ్రాతముత్రుళ్లడంచి దివిజేంద్రశ్రీవిలాసంబు పెం
పునఁ బొందించుట నీకు నైజము గదా భూతేశ ఘోరారిమ
ర్దనసంక్రీడ యొనర్పు లోకముల కత్యంతప్రమోదంబు [7]గాన్. 130
క. [8]అనిన విని యొకటి సెప్పెద, వినుఁ డాతనితోడ నమరవిభునకుఁ దగఁ బొం

---

1 నధికశక్తి. 2 దనుజు...నని సేయఁ బోవఁగఁ౯. 3 (బేర్చి...నటు లద్భుత...య
ప్పుడు వృత్రుఁడు (యద్దనుజేంద్రుఁడు) మ్రింగె. 4 యడరి...యంతనె యమర. 5 వెలువడి
శక్రుఁడు) బలారి (యింద్రుఁడు) చలమున...గలఁగ౯. 6 ట్లవికలబల్మిం. 7 న౯. 8 అను
ఁయముఁ గేశవుఁ డిట్లను.

దొనరింపుఁ డొక్కసమయం, బున [1]నడఁకువఁ గులిశధారఁ బొందెద నేనున్.

వ. మదీయతేజోవిశేషంబున నప్పురుషహూతున కుత్సాహంబు సంభవింపం గల యది యప్పు డనాయాసంబునఁ బగతు వధియింప నగు నని గదాధరుం డూఱడిలం బలికిన బలసూదనప్రముఖనిఖిలసురలోకంబును సంతసిల్లి మగిడి వచ్చి వృత్రుకడకు మునిజనంబులం బుచ్చిన వారును జని యతని కిట్లనిరి. 132

క. భుజబల[2]దుర్జయుఁ డింద్రుం, డజయ్యుఁడవు నీవు నీకు నతనికి మీాలో విజయము దక్కదు మీా రేచి జగంబులు నొవ్వ రణము సేయఁగ నేలా. 133

క. [3]మైత్త్రీసౌఖ్యముఁ బోలునె, శాత్త్రవ మెమ్మెయిఁ దలంప శక్రశ్రీకిం బాత్త్రమ వై యింపుగఁ ద, న్మిత్త్రుఁడ వగు మిదియ మేలు మీాయిద్దఱకున్.

వ. అనవుడు వృత్త్రాసురుండు తేజంబువాసికి నాస పడియెడుమాయిరువురకు సఖ్యంబు సమకూర నేర్చునే యనుటయు నమ్మునులు సత్పురుషసాంగత్యంబు సంభవించినం జేయమి నీతి గాదు మహేంద్రుండు సకలలోకసమ్మతసద్భావుండు గావున నతనితోడిచుట్టఱికంబు మే లనిన నొడంబడి యతండు వారల కిట్లనియె. 135

క. ఏ నొక్కతెఱఁగు సెప్పెద, దానిం గా దనక చేసి తగ మీారలు సంధానము దృఢముగఁ జేయుం, డానాకేశునకు నాకు నధికప్రీతిన్. 136

వ. అది యెయ్యది యనిన నార్ద్రిం బగుదానను శుష్కం బైనసాధనంబునను దరువునం బాషాణంబున శస్త్రాస్త్రంబుల దివంబున రాత్రియందును నేను వధ్యుండఁ గాకుండ వలయు ననిన వారును దానికి నొడంబడి యవ్వారంబు లొసంగి వృత్రవజ్రధరులకు మిత్రభావం బొనరించి మగుడం జని యత్తెఱంగు వాసవున కెఱింగించి నిజనివాసంబుల కరిగిరి సురనాథుండు సుఖం బుండి పెద్దకాలంబునకుం దనమనంబునఁ బాయనివైరంబు సైరింపం జాలక దామోదరునిపూనికయు మునిజనంబు సేసినసంధివిధంబును నిరూపించి రిపుం [4]బరిభవింప రంధ్రాన్వేషణంబు సేయుచుండి యొక్కనాఁడు. 137

చ. జలనిధితీరభూమిఁ దనశత్త్రుఁ గనుంగొని వీని నిష్ఠు దో
ర్బల మెసఁగంగ నాదుభిదురంబునఁ ద్రుంచెద రాత్రి గాదు తాఁ
దలఁప దివంబు గా దిది యుదగ్రపరాక్రమయోగ్యసంధ్య నా
యలవుఁ జలంబుఁ జూప నెప మై తగుసాధన మెద్ది గల్గునో. 138

క. అని తలఁచుచు నచ్చట నొక, వననిధిఫేనంబుఁ జూచి వాసవుఁ డార్ద్రింబును శుష్కంబును గా దిది, యనుచుం గులిశమునఁ గూర్చి యధికరయమునన్.

తే. దాన వృత్రుని [5]వ్రేయ నత్తఱి మురారి
యందుఁ దగ సంక్రమించి యయ్యసురఁ జంపె

1 దేపువఁ గులిశ. 2 దుర్దముఁ...నతనికి ననిలో. 3 వృత్త్రా...యొప్పఁగ ద, న్మిత్త్రుఁ డ...మీాకిద్ద. 4 బరిమార్చుటకు. 5 వైవ.

జిష్ణుఁ డతిభక్తి విష్ణుఁ బూజించె నాత్మ
నఖిలలోకంబులకు మోద మావహిల్లె. 140

వ. ఇవ్విధంబునం బగతుం బరిమార్చి పేర్చి యింద్రుండు నిజపురంబునకుం జనియె
మఱియును భూతసంఘం బిట్లు బ్రహ్మహత్య సేయం దగునే యని యతని
నిందించినం బ్రభుత్వసంపద సెడుటయు. 141

ఆ. నీచదశకు వచ్చి నిషధాచలంబున, కరిగి సురవరేణ్యుఁ డడఁగి యుండె
నమరు లెల్లఁ గలఁగి యన్యోన్యపీడన, భయముఁ బొంది కూడఁబాఱి తమకు.

క. కావలి యై సురరాజ్య, శ్రీ వాలింపంగఁ దగువిశేషంబున సం
భావితుఁడు నహుషుఁ డని చని, యావిభుఁ గని తారు మునులు నతనికి నెమ్మిన్.

→ దేవతలు నహుషుని సురరాజ్యాభిషిక్తునిం జేయుట. ←

వ. పాకశాసను తెఱం గెఱింగించి యిట్లనిరి. 144

క. రక్షింద్రపదవి సేకొని, మమ్మెల్లను [1]నరయు మనిన మానవపతి నా
కమ్మహిమకుఁ దగుమాహా, త్మ్యమ్ము గలదె నన్ను నేల యలఁచెద రనినన్. 145

వ. అంత నిలువక యత్యంతప్రార్థనంబు సేసి. 146

క. యమవరుణాదిత్రిదశులు, దమతమశక్తిప్రభావదర్పంబులు భూ
రమణునకుఁ బంచి యిచ్చిరి, ప్రమోద మెసఁగంగ మునిసభామధ్యమునన్.

వ. ఇవ్విధంబున నిచ్చి యధికబలసమన్వితుం గావించి తోడ్కొని పోయి పూజ్యం
బగు దివిజరాజ్యంబున కభిషిక్తుం జేసిన నతండును బరమధర్మపరుం డై కిన్నర
కింపురుష గరుడ గంధర్వ సిద్ధ విద్యాధ రాదిసమస్తదేవయోనులవలనను దేజో
భాగంబులు పుచ్చికొని మహానుభావుం డై దివ్యమునిసేవ్యుం బై నయద్దేవేంద్ర
పదంబు సేకొని తుంబురునారదాది[2]వినోదపాత్రంబులును రంభాద్యప్సరోగ
ణంబులుం గొలువ నభిమతభోగంబు లనుభవించుచు మదంబు మిగిలి మన్మ
థాధీనుం డై వర్తిల్లుసమయంబున నొక్కనాఁడు. 148

తే. మహితలావణ్యమున నసమాన యనఁగఁ
జనినపౌలోమి యానహుషునకు నయన
మార్గగోచర యగుటయు మదనబాణ
భిన్నహృదయుఁ డై ధృతిఁ బాయఁ బెట్టి యతఁడు. 149

. సురలోకరాజ్య[3]పదవిన్, గరిమంబున నున్ననన్నుఁ గవయం బరమా
దరలీలఁ జతుర యగు నీ, సరసిజముఖి రామి యేమిచందమొ తలఁపన్. 150

. అని యప్పాలఁతిం [4]బిలిపిం, చిన నదియును భయము నొంది శీఘ్రమ దేవే
జ్యునిసదనమునకు శరణం, బనుచుం జనుటయును వాసవాచార్యుండున్. 151

1 బ్రోవు. 2 వీణానాదంబులం దేలుచు వినోదపాత్రంబు లగురంభా. 3 పదవీ,
రిమం...జతురముగ నీ...రామి కేమి. 4 బిలుపిం...[చరణములకు] శరణం.

వ. పరమాదరంబున నద్దేవిని గారవించి నిన్ను నహుషుదుర్వినయంబుఁ బొరయ
కుండ నరయువాఁడ నాఖండలుండు నాయత్నంబున నవశ్యంబును దడయక
వచ్చు నని యూఱడించిన. 152

క. అది యెల్ల నెఱిఁగి కోపం, బొదవఁగ నహుషుండు గురున కుచితమె యే న
మ్ముదితం [1]బిలిపింపఁగఁ దన, సదనంబున నునుచు టనియె సంక్షుభితుం డై. 153

చ. అనుడు మునీంద్రులున్ సురలు నక్కట నీమహనీయగౌరవం
బునకుఁ బరాంగనం గవయుబుద్ధి [2]జనించుట యీడు గాదు నా
విని మును పూని యిమ్మెయి వివేకము గౌతముభార్యఁ బాకశా
సనుఁ డెడఁ గోరుచోఁ గఱపఁ జాలర మీ రది యెట్లు సెప్పుఁడా. 154

వ. అనుచు నతండు గడుఁ గోపించిన భయంబుఁ గొని వార లాపౌలోమి నతని
పాలికిం దోడ్కొని వచ్చువా రై పూని బృహస్పతికడకుం జని యద్దేవియు
వినుచుండ ని ట్లనిరి. 155

క. నహుషుఁడు మహేంద్రపదవీ, సహితుఁడు శచికిన్ వరింపఁ జను నాతని లో
కహితంబు గాఁగఁ బుచ్చుము, మహాత్మ [3]తచ్చిత్తమునయమర్షం బడఁగన్.

క. అనవుడు శోకం బడరఁగ, ననిమిషగురుఁ జూచి యిట్టు లను శచి [4]యటు వు
చ్చిన దూఱు రాదె నను శుచి, యని మీకొనియాడు టెల్ల ననృతము గాదే.

వ. అనిన విని దరహసితవదనుం డగుచుఁ బురుహూతపురోహితుండు. 158

క. నహుషుండు పనుచువాఁ డటె, విహితానుష్ఠానపరులు వీ రటె [5]తా లో
కహితం బటె యిది మనకున్, మహనీయమ కాక యెట్లు మానఁగ వచ్చున్.

వ. అని యుల్లసం బాడి యనిమిషులను ఋషులను జూచి యి ట్లనియె. 160

తే. శరణు సొచ్చిన రక్షింపఁ జాలి యుండి, కడపి పుచ్చిన నూర్ధ్వలోకములు దప్పుఁ
బుణ్యకర్మంబు [6]లఫలతఁ బొందు ననఁడె, కమలగర్భుండు దొల్లి జగద్ధితముగ.

వ. అని యనురూపాలాపంబుల నిషేధింప వార లట్లనిఁ గర్తవ్యం బెయ్యది
యూహింపు మనిన నద్దేవి నహుషు[7]కడకుం జని సముచితంబుగాఁ దదీయ
సాంగత్యంబున కెడ వలికికొని వచ్చునది యటమీఁద మనమందఱముం
బురందరున కభ్యుదయం బగు తెఱం గాచరించువార మనుటయు వాచస్పతి
వచనంబులకు సంతసించి సురసంయమిసంఘంబు లరిగినయనంతరంబ. 162

క. పౌలోమియు నానహుషుని, పాలికిఁ జనుటయు నతండు భావజవికృతి
వ్యాలోలమానసుం డయి, లీలా[8]సంభావనాలలితముఖుఁ డయ్యెన్. 163

---

1 బిలుపింపఁగఁ...నునుచుడనియె (వ్రాఁతప్రతులు పెక్కింటిలో భావార్థకటవర్ణమునకు మాఱుగా డువర్ణకమే కానవయ్యెడి). 2 జలించుట కాదు కీడు. 3 నీచిత్త. 4 యిటు (వంచిన) దూఱు గాదె. 5 పో. 6 విఫలతఁ. 7 పాలికిం. 8 రసభావనా.

వ. అట్టియెడ. 164

ఉ. అల్లన యింతి యిట్లనియె నారసి వాసవుకల్మి [1]లేమియుం
దెల్లముగా నెఱింగికొని తేఁకువ లేకిట వచ్చు టొప్పు నా
యుల్లము శంకితం బగుచు నుండఁగ వేగురపాటు మేలె నీ
వెల్ల నెఱుంగు దిప్పు డెడ యిచ్చుట యుక్తము నాకుఁ జూడఁగన్. 165

వ. అని యొడంబఱిచి కొండొకకాలం బెడ వలికికొని యింద్రాణియు మగుడం జనుదెంచె నమరగణంబును మునిజనసహితంబుగా విష్ణుదేవుపాలికి రహస్యవృత్తిం బోయి జిష్ణునిదురితంబు వాపుటఁ గోరిన శౌరి గరుణాయత్తచిత్తుం డై.

క. హయమేధంబున నాకుం, బ్రియ మొనరింపంగ వృత్రభేదికిఁ బుణ్యో
దయ మగు నావుడు వారలు, రయమునఁ జని రందఱుం బురందరుకడకున్.

ఇంద్రుఁడు నహుషు తేజోవిశేషంబు సూచి మఱుఁగుపడుట.

క. చని యతని నశ్వమేధం, బునఁ గల్మషరహితుఁ జేయఁ బురుహూతుండుం
దనపురికి నరిగి నహుషుం, గని తత్తేజోవిశేషకంపితుఁ డయ్యెన్. 168

వ. ఇట్లు వృత్రారి దనబ్రహ్మహత్య వాయుటయే కాని నహుషునంతబలంబు లేమిం జేసి భయాకులితచిత్తుం డై. 169

క. ఎందేనిఁ జనియె నాతని, సుందరియును నెమ్మనమున శోకోద్రేకం
బొంది పురందరుఁ డరిగిన, కందువ [2]యే నిప్పు డెట్లు గాంతునో యనుచున్.

వ. నిశాసమయంబున నుపశ్రుతి నారాధించినఁ దదీయాధిదేవత [3]నీసత్యంబువలనం గను దని చెప్పి యనంతరంబ సాకార యై పొడసూపినఁ బౌలోమి నీ వెవ్వరవని యడిగిన నదియును భవత్పాతివ్రత్యసత్యశౌచంబులకుఁ బ్రియం బంది వచ్చితి నుపశ్రుతి నని చెప్పి నీకుం బాకశాసనుం జూపెద రమ్మని తోడ్కొని హిమవంతంబునుత్తరంబున మంజుమంతం బనుమహాశైలంబున కరిగి దానియందు శతయోజనవిస్తీర్ణం బైనయొక్కసరోవరంబు సొచ్చి యచ్చట నుల్లసిల్లుపంచవర్ణకమనీయంబు లగుకమలంబులలో నొక్కనాళంబు భేదించి ముందటఁ బ్రవేశించె నింద్రాణియుం దోడన చని తదీయతంతుమధ్యంబున సూక్ష్మరూపంబున నున్నసురపతిం గన్నంత నయ్యుపశ్రుతి యదృశ్యం బగుటయు.

క. పతిసన్నిధి వడసి మహా, ద్భుత మందెడుశచి తదీయపూర్వసుకర్మ
స్తుతి సేయుచు నిలిచిన నతఁ, డతివం గని [4]సంభృతాదరాత్ముం డగుచున్.

ఉ. ఇచ్చట నేను నిల్చు టిది యెట్టు లెఱింగితి నన్నుఁ గాన నీ
వచ్చినకార్య మేమి యనవద్యగుణోత్తర చెప్పు నావుడుం

1 లేమియేఁ. 2 యే నెప్పు డెట్లు (గాంతున). 3 నీసత్యంబువలన నీమగనిం గను దని ..పాతివ్రత్యశౌచం,..,గనుఫించి యంత నయ్యుపశ్రుతి. 4 యపుడు సంభృతాత్ముం.

బొచ్చెము లేక యానహుషుపోయినపోకలు [1]దానికిం దగం
జెచ్చెరఁ గాలయాపనము సేసినభంగియుఁ జెప్పె దేవియున్. 173

వ. చెప్పి యుపశ్రుతితెఱంగును నతని కెఱింగించి దేవా నీ విత్తఱిం బ్రకాశుండ
వై భవత్ప్రతాపంబున నహుషునకుఁ బరాభవం బొనరించి నన్ను రక్షింపక
తక్కిన నుక్కివుం డగునతనిపాపనిశ్చయంబున నాపద వచ్చు ననిన విని వల్ల
భకు దివిజవల్లభుం డిట్లనియె. 174

క. ఆనహుషుబాహుగర్వ మ,నూనం బై యున్నయది సముజ్జ్వల[2]మునిస
న్మానప్రవృద్ధ మగుటను, దానం గాలంబు వేచెదను జయమునకున్. 175

చ. తఱి యగునంతకుం రిపునుదగ్రత సైచుట నీతి నీవు నా
కఱపినయట్లు చేయుము తగం జని యాతనిఁ గాంచి నన్ను నె
త్తెఱఁగున నైనఁ బొందఁగ మదిం దల[3]పోఁతయ కల్గెనేనిఁ గ్ర
చ్చఱ మునివర్గవాహనుఁడ వై చనుదెమ్మను మంతఁ దీఱెడున్. 176

ఆ. [4]అనిన నట్ల కాక యని పతి వీడ్కొని, యింతి నహుషుపాలి కేఁగుదెంచె
నతఁడు దమక మడర నద్దేవిఁ బెద్దయు, నాదరించి యిష్ట మడుగుటయును.

వ. ఇంద్రాణియు ని ట్లనియె మనవిరూపించినసమయంబునకుఁ గొండొకతడవు
గలదు కాలం బగుటయు నిన్ను వరియించెద నీవు మహామునివాహనుండవు
గా వలయు నది నాకుఁ బ్రియంబు నీకు ననన్యసామాన్యం బైనయానంబు
దేజోవిశేషకరం బగు ననిన నప్పలుకులకు నహుషుండు ప్రహర్షచిత్తుం డై.178

ఆ. ఏను దక్క నొరుల కెవ్వరి కైనన, వ్వాహనంబు నెక్క వశమె నీకు
సమ్మదంబు గాఁగ సప్తర్షిగణము నా, యందలంబు మోవ నరుగుదెంతు. 179

క. అని వనితఁ బంచి [5]యప్పుడ, మునులం బిలిపించి మౌర్ఖ్యమునఁ దనకుం వా
హనముగఁ జేసి యొకింతయు, ననుమానము లేక తిరిగె నతఁ డెల్లెడలన్. 180

క. చని పౌలోమియు సురగురుఁ, గని నహుషుఁడు వేచి యున్నకాలం బెడ లే
దనిమిషనాథున కిత్తఱి, ననుగ్రహము సేయ వలయు నవహితబుద్ధిన్. 181

వ. శరణాగత నై నన్ను రక్షింపు మనిన నతం డిట్లనియె. 182

క. ఆనహుషువలన నాపద, రా నీ నాతనికి నాతురత గావింపం
బూని యొనర్చెద వేలిమి, దానను ముని[6]వాహనత గతస్థైర్యుఁ డగున్. 183

క. వెరవున నీపతియునికియు, నరసెద నని యూఱడించి యప్పుడ వై శ్వా
నరు నర్చితుఁ జేసి పురం, దరు తెఱఁగుం జెప్పి యతనిఁ [7]దడవం బనిచెన్.184

1 దాను దానికిం; వానికిం దగం. 2 ముగ సన్మాన (ప్రవిష్ట) ప్రయుక్త. 3 పోయఁగఁ గల్గె నేని...నంత దీఱెడుం. 4 అంత...పల్కి వీడ్కొని...నద్దేవిఁ గని పెద్ద, యాదరించి. 5 యప్పుడు. 6 యానమున (గతైశ్వర్యుఁ డగుం). 7 దడవఁగఁ బుచ్చెం.

అగ్నిదేవుఁ డింద్రుని వెదకి బృహస్పతికిం దెలుపుట.

వ. పనిచిన వహ్నియు వనితారూపంబునం జని మనోగతి యగుటం జేసి సర్వదిశలును భూమ్యంతరిక్షంబులును గిరివిపినంబులును గొండొకసేపునకుం గలయం జూచి సంక్రందను నెందునుం గానక మగిడి వచ్చి వాచస్పతికి నత్తెఱం గెఱింగించి నాకు జలంబులు ప్రవేశింపరామి నంద పరికింప నేర నైతి నప్పులవలన నగ్నియు బ్రాహ్మణులవలన క్షత్త్రియజాతియు నశ్మంబులవలన లోహంబును నుద్భవించె వానివాఁడిమి యెల్ల యెడలనుం జెల్లుఁ దమతమజన్మస్థానంబులయం దడంగుం గావున నీళ్లు నాకు సంక్షయంబు సేయుట సుప్రసిద్ధం బనిన విని యనిమిషగురుండు హవ్యవాహను నత్యంతగౌరవంబునం గనుంగొని. 185

మ. సకలస్థావరజంగమంబులు భవత్సాన్నిధ్యమాత్రంబునన్
వికసిల్లుం గ్రతువైభవంబులుఁ జతుర్వేదంబులున్ నీవ పా
వక నీయంద [1]జలంబులుం గలిగె విశ్వవ్యాప్తిమై నున్ననీ
కొకచో టెట్టు లగమ్య మయ్యె నిను నీ వూహింపు పెం పారఁగన్. 186

ఉ. ఏనును బ్రహ్మమంత్రముల నెంతయు నీ కభివృద్ధిఁ జేసెదం
[2]గాని విశంకతన్ సలిలగామివి గమ్మనినం గృశానుఁడుం
బూనిక నేఁగి వారినిధిభూరినదీసరసీతటాకసం
తానము రోయుచుం జని శతక్రతుఁ డున్నసరోవరంబునన్. 187

ఉ. అంబురుహంబులం గలయ నారసి [3]చొచ్చి యొకండు నాళసూ
త్రంబున నున్నయింద్రుఁ గని రాగమునన్ గురునొద్ద కగ్ని శీ
ఘ్రంబున నేఁగుదెంచి తనకన్న తెఱం గెఱిఁగింప నాతఁడు
ల్లంబున నుల్లసిల్లి సురలన్ మునులం దగఁ గూర్చి గ్రక్కునన్. 188

మ. దివిజాధీశ్వరుపాలికిం జని కృతార్థీభూతచేతస్కుఁడై
వివిధస్తోత్రపరంపరాచతురవాగ్విన్యాసతం బ్రీతుఁ జే
సి వరిష్ఠం బగునీదుకృత్యము ననుష్ఠింపంగ నీ వుత్సహిం
[4]పవు నీ కేమికొ అంత వృత్రవధ యేపాపంబు రూపింపుమా. 189

క. శరనిధిఫేనంబున నా, హరి వొంది జగద్విరోధి యగువృత్రునిఁ దాఁ
బరిమార్ప నీకు విజయము, దొరకొనియెం గాక [5]దీన దోసము గలదే. 190

వ. అని సముచితంబుగా సంబోధించినగురునిసంభాషితంబుల నిర్దోషితుం డయి నిజరూపంబు వహించి సకలసుమనోమునిసహితంబుగా నతని సంభావించి జంభారి గర్తవ్యం బెయ్యది యని యడిగిన నాచార్యుం డితం డెఱింగినను విస్పష్టం

1 జగంబులుం. 2 గాన నశంకతన్...పూర్ణసరిత్సరసీతటాక. 3 యం దొకపద్మనాళసూ; చూచి యొకండు నాళసూ... 4 ఘవ నీ కేమి ... రూపింపఁగన్. 5 నీకు.

బుగా నహుషువృత్తాంతం బంతయు వివరించెదం గాక యని తలంచి యిట్లనియె.
క. నాఁ డట్లు నీవు నీ దగు, పోఁడిమి సెడి యడఁగుటయును భువనంబుల కె
వ్వాఁడును రక్షకుఁ [1]డయ్యెడు, వాఁ డిమగఁడు లేమిఁ ద్రిదశవర్గము మునులున్.
ఉ. ఒండొరుచేతఁ బీడ వడ నోపక రక్షకుఁ డైనవాని నా
ఖండలతుల్యు నేమిగతిఁ గాంతు మొకో యను చున్నచోట ను
ద్దండబలైకరక్ష్యము శతక్రతురాజ్యము దాని నేల న
న్యుండు సమర్థుఁడే యనుచు నొల్లరు దివ్యులలోన నెవ్వరున్. 193
వ. అట్టిసమయంబున మునిజనసహితంబుగ ననిమిషులు నహుషుకడకుం జని మనంబుల మనుజుం డనుననుమానంబు దక్కి యతని నింద్రపదవిఁ బరిపాలించుటకుం బ్రార్థించిన నతండును దాను హీనబలుండ నని శంకించినం దమతమ తేజంబులయంశంబు లతని కొసంగి శక్తిమంతుం గావించి యభిషిక్తుం జేసిన.
క. మహనీయభవత్పదవీ, మహితుం డై నహుషుఁ డేచి మదమున ధర్మ
స్పృహ దక్కి తన్ను నిప్పుడు, వహియింపఁగ నన్మనీంద్రవర్గముఁ బనిచెన్. 195
ఆ. ఇదియ కాదు మఱియు నెన్నియు దుర్వ్రిన, యములు గలవు వాని [2]కలసి నిన్ను
వెదక వచ్చితిమి వివేకహీనుం డగు, నతనిఁ జెఱుప నిప్పు డవసరంబు. 196
వ. అది [3]యెట్లం టేని వినుము నాఁడు హరిపంపునం జేసినయశ్వమేధంబున నీ వప గతకల్మషుండ వైనను నహుషునకుఁ దేజోహాని లేమిం జేసి యతని నాక్రమింప రా దయ్యె నిప్పుడు మహామునుల నధఃకరించి యతండు నిస్తేజుం డై యున్నవాఁడు గావున నీచేతం జెడు నట్లగుటయుం దురగమేధఫలపరిపాకంబ యింక నుత్సాహంబు సేయు మను చున్నసమయంబున యమవరుణకుబేరులు సోమసహితంబుగా నరుగుదెంచి పురందరుం గాంచిన నతండు ప్రియం బంది యప్పటి కార్యంబు తెఱంగు వారల కెఱింగించి తగినసంభాషణంబుల వారలఁ బ్రీతచేతస్కులం జేసి దృష్టివిషయదుస్సహుం డైననహుషు గెలుచునుపాయంబు విచారించునవసరంబున. 197
క. [4]కష్టుం డగు నానహుషుఁడు, నష్టాత్మకుఁ డయ్యె దివిజనాయక నీయు
త్కృష్టచరితమున సురలకుఁ, దుష్టిగ నిజరాజ్యసంగతుఁడ వగు మనుచున్.
క. మునివరుఁ డై నయగస్త్యుఁడు, నను దెంచిన శతమఖుండు సమ్మతి నుచితా
సన మిడి యర్ఘ్యముఁ బాద్యము, నొనరిచి యిట్లనియె [5]సవినయోక్తి నతనితోన్.
ఆ. అధికవిభవ మెసఁగ ససమానశక్తిస, నాథుఁ డగుచు నున్ననహుషుఁ డిప్పు

---

1 డై తగు. 2 నరసి (కలికి) నిన్ను...నిదియ యవసరంబు. 3 యట్లుండె వినుము.
4 దుష్టాత్ముం డగునహు; దుష్టుం డగు నానహు (ఈ పద్యముతర్వాత) 'వ. ప్రార్థించి దీవించి రంత. అని యొకవచనము. సందర్భ మంతగాఁ భొసఁగ లేదు. 5 సవినయోక్తులతోడఁ; వినయయుక్తి నతనితోన్.

డేమికతన భాగ్యహీనుఁ డై యుజ్జ్వల, శ్రీ దొఱఁగె మునివరేణ్య చెపుమ. 200

అగస్త్యుఁ డింద్రునకు నహుషుభ్రష్టతఁ దెలుపుట.

వ. అనిన విని యమ్మునీంద్రుం[1]డి ట్లనియె నన్నహుషుని మోచి వేసరు చున్నమును
లతనికడ గోష్ఠీవినోదంబుల నుండి బ్రాహ్మణంబు లయినమంత్రంబులు గోసంప్రో
క్షణంబునందుఁ జెప్పఁబడి యుండు నవి నీకుఁ బ్రమాణభూతంబు లగునే
యని యడిగినం బాపనిశ్చయుం డై యతం డమ్మంత్రంబులు ప్రమాణంబులు గా
వనిన నే నమ్మాట నిషేధించి పూర్వాచార్యులచేత నభినందితంబు లగుమంత్రం
బులు నిందించుట యజ్ఞానం బని వివాదంబు సేసిన నతండు కోపించి మదీయ
మస్తకంబు దన్నిన నతనిం గనుంగొని పుణ్యహీనుండును దేజోహానిదీనుం
డును నగుట యుపలక్షించి నీవు పూజనీయు లయినమహామునుల నిన్ను వహిం
పం బనిచితి వారలు గొనియాడుమంత్రంబులు గర్హించి తదియునుం గాక నన్ను
నవమానించితి గావున నింద్రపదభ్రష్టుండ వై బహుసంవత్సరంబులు భూలోకం
బున నురగరూపంబున నుండు మని శాపం బిచ్చి పదంపడి యనుగ్రహించి
భవదీయవంశజాతుం డయి యజాతశత్రుం డనుపెంపు గలిగి యుధిష్ఠిరనామధే
యుం డైనయొక్కసత్పురుషునిసందర్శనంబున దురితంబులఁ బాసి పుణ్యలో
కంబు వడయువాఁడ వనినఁ దత్క్షణంబ. 201

క. స్వర్గ[2]పరిభ్రష్టుం డై, దుర్గతికిం బోయె నతఁడు దుష్టాత్ములకుం
దౌర్గత్యము సుజనులకు న,నర్గళసద్గతియు నగుట యరుదే యెందున్. 202

మ. అనినన్ దేవతలుం దపోధనులు [3]నత్యానందముం బొంది రా
మునిఁ బూజించె నమర్త్యనాథుఁడు మనోమోదంబు సంధిల్ల న
య్యనురాగంబు చరాచరంబులకు హృద్యం బయ్యె సర్వాప్సరో
జనముం గాళికుఁ గాన వచ్చె సుభగైశ్వర్యంబు శోభిల్లఁగన్. 203

వ. తదనంతరంబ. 204

ఉ. పావకుఁ డాదిగా దిగధిపాలురుఁ గిన్నరసిద్ధసాధ్యులుం
దేవగురుండుఁ [4]దోన చనుదేరఁగ వైభవ ముల్లసిల్ల నై
రావణదంతి నెక్కి యమరావతికిం జని యింద్రుఁ డాశచీ
దేవియుఁ దాను మోదమునఁ దేలి రభీష్టవినోదలీలలన్. 205

వ. ఇవ్విధంబున మహానుభావుం డగునమ్మహేంద్రుండు. 206

క. ఆజ్ఞాభంగం బయినం, బ్రాజ్ఞేతరునట్లు దుఃఖపడి యుండఁడె తా
నజ్ఞాతవాసమును గా, లజ్ఞతఁ [5]జలుపండె యన్యులకు వగ వేలా. 207

---

1 డమరవరున కిట్లనియె...మంత్రంబులం గొన్ని సంప్రోక్షణంబునం...దేజోహీనుండును ...నురగంబ వై. 2, పద...జనియె నతఁడు. 3 నిత్యా...మునిఁ గీర్తించె...చరాచరేంద్రులకు ...శ్వర్యం బవార్యంబుగన్. 4 దోడ నరుదేరఁగ. 5 జేయండె.

క. కావున మీపడినయర, ణ్యావాసక్లేశమునకు నజ్ఞాతవిధిన్
[1]సేవకుల రైనదానికి, నోవకుఁడీ మీరు లఘుమనోవృత్తుల రై. 208

వ. అని యిట్లు సెప్పి శల్యుండు సభాసదులం గలయం గనుంగొని. 209

ఉ. కౌరవనాథుఁ డానహుషుకైవడి నాశముఁ బొందు వాసవ
శ్రీరమణీయుఁ డై జయము సేకొని ధర్మజుఁ డంబురాశివే
లారశనాసముజ్జ్వలవిలాసమనోహరమేదినీవధూ
సారసమగ్రభోగముల సన్నుతి కెక్కెడుఁ దానుఁ దమ్ములున్. 210

వ. అనిపలికి వెండియు నతండు పాండవాగ్రజున కిట్లనియె. 211

క. సౌఖ్యంబులు వొందు జగ, త్ప్రఖ్యాతులుఁ జెందుఁ దగఁ బురందరవిజయో
పాఖ్యానము విన్నను ద, ద్వ్యాఖ్యానము సేసినన్ జనావలి కనఘా. 212

క. మోహరము నడచు చుండఁగ, నీహరివిజయంబు [2]వినునరేంద్రుఁడు రిపుసం
దోహంబు గెల్చుటకు సం,దేహం బించుకయు లేదు ధీరవిచారా. 213

వ. అనిన విని ధర్మనందనుండు మద్రపతిం బ్రస్తుతించి [3]మహానుభావా భవదీయభాషణశ్రవణంబునఁ జిత్తంబు కలంక దేఱె నని సంభావించి యతనికి సముచితంబు లగుమజ్జనభోజనంబు లొనరించి యనంతరంబ యతండు పయనంబునకు నుద్యోగించిన. 214

ఆ. అతని ననుప నేఁగి [4]యధికసంప్రీతి నే, తెంచునప్పు డయ్యుధిష్ఠిరుండు
రణములోన మీరు రాధేయుఁ బలుకుట, మఱవకుండ వలయు మమ్ముఁ దలఁచి.

క. అనుటయు మద్రేశ్వరుఁ డా,తని నూఱడఁ బలికి గాఢ[5]తరముగ నాలిం
గన మొనరించి చనియె హ, స్తినగరికి బలమ్ముతో నతిత్వరితగతిన్. 216

వ. అట్టియవసరంబున. 217

మ. సకలారాతిభయంకరుం డగుచు నుత్సాహంబు వాటించి నే
లకు వ్రేఁ గయ్యెడుభంగి వచ్చె రణలీలాకౌతుకం బొప్పఁ దా
నొకయక్షోహిణితోడఁ బాండవబలం బుల్లాసముం బొంద సా
త్యకి బాహాబలగర్వనిర్వహణవిద్యాప్రౌఢి[6]సంరూఢుఁ డై. 218

వ. అంతం జేదిపతి యగుధృష్టకేతుండును జరాసంధనందనుం డగుసహదేవుండును [7]జె యొక్కయక్షోహిణితోడం జనుదెంచిరి సహోదరు లేవు రగుకేకయపతులు నేకాక్షౌహిణీసమేతు లై యేఁగుదెంచిరి తదనంతరంబ. 219

క. కొడుకులుఁ దానును గుఱ్ఱపు, దడములఁ గరిఘటల [8]భటరథవ్రాతములం
బుడమి చలింపఁగ ద్రుపదుఁడు, గడువేడుకఁ దోడు సూపెఁ గౌంతేయులకున్.

---

1 సేవకు లైనను దానికి. 2 విని. 3 మహాభాగా...భాషణంబులఁ జిత్తంబు కలంక దీఱె...లొనగూర్చి...నుద్యోగించి కదలిన. 4 యతిశయప్రీతి. 5 తమముగ. 6 సంధిల్లఁగన్. 7 నొక్కొక్క... 8 పటు.

వ. అదియును నొకయక్షౌహిణికిం గలిగి యొప్పె నయ్యవసరంబున ననుజతనుజసమేతుండును బార్వతీయమహీపాలసహితుండును నై యొక్కయక్షౌహిణి యొడ్డనంబు దీర్చె. 221

క. చిందములమ్రోఁతఁ బగతుర, డెందంబులతోడ దిక్తటీసంధులు నం
దంద పగులంగఁ గుంతీ, నందనులకుఁ దోడు మత్స్యనాథుఁడు సూపెన్. 222

వ. పాండ్యవిభుండు లోనుగాఁ బలు[1]దెసల నుండి వచ్చినబలం బొక్క యక్షౌహిణికిం గలిగి యొప్పె. 223

క. ఏడక్షౌహిణు లిమ్మెయిఁ, గూడెం బాండునృపసుతులఁ గ్రూరాహవసం
క్రీడావినోదమునకుం, దోడుపడం బూని యతికుతూహలవృత్తిన్. 224

వ. ఇవ్విధంబునం గూడి పెరిఁగి యుధిష్ఠిరుసైన్యంబు గయ్యంబునకుం గాలుద్రవ్వుచు నుండె నంత నక్కడం [2]గిరాతకాంచనసైన్యనిచయంబులం గూర్చికొని సమరంబునకు నమరి యొక్కయక్షౌహిణి గలభగదత్తుండు సుయోధనుం గలసె భూరిపరాక్రముం డయినభూరిశ్రవుండును మహాబలుం డయినశల్యుండును నేకాక్షౌహిణీసమేతంబుగా నేతెంచిరి వారలయట్ల సన్నద్ధుఁడై కాంభోజనాథుం డైనసుదక్షిణుం డనుయవనేశ్వరుండును వచ్చె నత్తెఱంగున సమకట్టి జయద్రథప్రముఖు లైనసింధుసౌవీరనరపతు లరుగుదెంచిరి మాహిష్మతీపతి యగునీలుండు యాదవవీరుం డగుకృతవర్మయు నవంతీశ్వరులు సోదరులు నగు విందానువిందు లిరువురునుం గా నిన్నలువురు నొక్కొక్కయక్షౌహిణితోడఁ జనుదెంచిరి మఱియునుం బలుదెసలనుండి వచ్చి కూడినవాహినులు మూఁడక్షౌహిణులకుం గలిగె ధార్తరాష్ట్రులకుఁ దోడుపడం బూనినయవి పదునొకం డక్షౌహిణు లయ్యె నట్టియెడ. 225

క. సవరణల నొప్పి యనిఁ బాం,డవబలముల మార్కొనం గడంగుచు నత్యు
త్సవమునఁ బేర్చినసేనల, కవకాశము లేదు విడియ హస్తిపురమునన్. 226

క. నానాముఖముల విడియం, గా నియమించెను బలంబుఁ గౌరవపతి యా
[3]సేనలదొరలకు నిలువఁగ, నైనను నెడ లేమి నధికహర్షం బెసఁగన్. 227

వ. ఇత్తెఱంగునం గురుజాంగలంబున రోహితకారణ్యంబున మరుదేశంబున నహిచ్ఛత్రంబునఁ గాలకూటంబున గంగాకూలంబున వారణావతంబున వటస్థానంబున [4]విచ్చలవిడి విడిసి ధనధాన్యాదిసమస్తవస్తువులకలిమిం జేసి యెలమి మిగిలియున్నంత. 228

1. దేశంబుల. 2 గిరాతనిచయంబులం ; గిరాతకాంచనజననిచయం ; గిరాతయవనపుళిందనిచయంబులం...నేఁగుదెంచిరి వారలయట్ల సన్నద్ధు లై కాంభోజనాథుం డైనసుదక్షిణుండును యవనేశ్వరుండును నొక్కయక్షౌహిణితోడ వచ్చి రత్తెఱంగున. 3 సేనకు దొరలకు. 4 విడిదల విడిసి...యెలమి గలిగి.

క. పాంచాలమహీవల్లభు, పంచినభూదేవుఁ డుచితభంగి నగరి కే
తెంచి ధృతరాష్ట్రుఁ బ్రీతిం, గాంచి కృపద్రోణవిదురగంగాసుతులన్. 229

వ. వారివారిమందిరంబులకుం జని కని సముచితాలాపంబులం బ్రసన్నచిత్తులం జేసి దుర్యోధనుసందర్శనంబును నిర్వర్తించి నిత్యనిపుణారాధనంబున ధృతరాష్ట్రు నభిముఖుం గావించి యొక్కనాఁ డక్కౌరవేశ్వరుపేరోలగంబున సమస్తసేనాపతులం గలయం గనుంగొని యిట్లనియె. 230

సీ. ధృతరాష్ట్రపాండుభూపతులు సహోదరు, [1]లగుటయు వారలయాత్మజులకుఁ
దమతమతండ్రులధనములు గైకొనఁ, దగుటయు మీకు నందఱకుఁ జూడ
నుచితంబ కాదె యట్లుండెఁ దొల్లింటిచం, దంబును మనకుఁ దెల్లంబకాదె
ప్రాణగోడ్డము లగుపనుల వారలఁ దీర్పఁ, దలఁచినఁ బుణ్యంబుకలిమిఁజేసి

తే. బాహుబల మొప్ప నిజరాజ్యపదవిఁ బొంది
యున్న వంచనమెయి మహిఁ గొన్న తెఱఁగు
నెఱుఁగుదుర కాదె దీనికి నెల్ల నియ్య
కొనియె నీపెద్దరాజు నే మనఁగ నేర్తు. 231

శా. నారీరత్నము నట్లు దెచ్చి సభలోన న్వారలుం జూడఁగాఁ
జీరల్ ప్రోవులు గాఁగఁ జేయుటయు [2]లచ్చిం బుచ్చికోల్కు మహో
గ్రారణ్యస్థలి నిల్పఁ బంచుటయు దైన్యవ్యక్తిమైపల్కుల్కు
సైరింపం జనుపాండవేయులకు నీసంధిక్రమం బొప్పదే. 232

క. వీరలవృత్తముఁ బొందుకు, మారులవర్తనము తెఱఁగు మాత్సర్యము లే
కారసి ధృతరాష్ట్రునకుఁ, గారవమున బుద్ధి సెప్పఁగాఁ దగు మీకున్. 233

తే. పాండవులు గౌరవులతోడిపగకు నొల్ల, రఖిలభూప్రజానాశన మగుటఁ జేసి
వార లస దని తలఁపంగ వలవ దధిక, ధర్మపరు లైనకతమునఁ [3]దగవు నడచె.

వ. అందుఁ గూడినవి యే డక్షోహిణు లిందుఁ [4]గూడినవి పదునొకం డక్షోహిణు లని తలంతు రేని వినుండు. 235

క. బాహుబలఘనుఁడు భీముఁడు, సాహసరసికాత్ముఁ డయినసాత్యకియు మహో
గ్రాహవభూమి సహస్రా, క్షోహిణు లట్లగుట మీరు సూడరె యెందున్. 236

క. [5]గాండీవధన్వునాహవ, పాండిత్యముఁ దలఁప నతని భండనమున మా
రొక్కండు నని యొకఁడు గడఁగుట, కొండం గని తగరు దాఁకఁ గోరుట గాదే.

క. ఆబీభత్సునిభూరిభు, జాబలమును దుర్నివారశౌర్యము శరవి
ద్యాబహుళతయును బందికి, నైబవరముఁ జేసినట్టిహరుఁడ యెఱుంగున్. 238

వ. అదియునుం గాక. 239

---

1 లగుటయు...దేర్పఁ, దలఁచినఁ...కొనిన యీా. 2 లక్ష్మిం...దైన్యావృత్తి; దైన్యవ్యాప్తి. 3 దగవె. 4 గలవి. 5 గాండీవధరుని యాహవ...దలఁప కతని.

మ. వివిధోపాయపరాయణుండు రిపుదోర్వీర్యాపహారక్రియా
ప్రవణోద్యోగుఁడు మంత్రరక్షణకళాప్రావీణ్యగణ్యుండు ధై
ర్యవివేకాదిగుణోత్తరుం డఖిలవిద్యాజాలసంవేది మా
ధవుఁ [1]డాదిక్కు నె పాండవేయుల కసాధ్యం బెద్దియుం గల్గునే. 240

ఆ. అదను దప్ప కుండ నమ్మహాత్ముల నెమ్మిఁ,బిలువఁ బంచి హితముఁ బ్రియము రెండు
పక్షములకు నగుట [2]పాటించి తగవుమైఁ,గొంత భూమియిచ్చి కూడి మనుఁడు.

చ. [3]అనవుడు భీష్ముఁ డిట్లనియె నక్కట భాగ్యము గాదె పాండునం
దను లోకయాపదం బడక ధర్మగతిం దగ నందఱుఁ సుహృ
జ్జనులను గృష్ణునిం గలసి సమ్మద మొందుటయుం బ్రశాంతిమై
మనముల నీసు దక్కి మృదు మార్గము వట్టుటయుం దలంపఁగన్. 242

క. [4]నీవాక్యము విప్రస్వా, భావిక మై యిట్లు శ్రుతికిఁ బరుషం బైనఁ
భావింపఁ గార్యమునయం, దేవిధమున సభకు నింతయిష్టం బగునే. 243

చ. సమయము యూఁది పాండవు లశక్తులచాడ్పున [5]నిందు నాఁడు బ
న్నమువడి చన్నదైన్యము వనంబునఁ బడ్డవిషాదవేదనా
శ్రమము విరాటువీట లఘు సంచరణంబున దాఁగి యున్నదుః
ఖమును జగం బెఱుంగదె యకల్మషులం బఱుపంగఁ బాడియే. 244

క. పితృధన మగుపా లుచిత, స్థితి వారల కిచ్చి నిర్విశేషుం డై యీ
పతి లోకము మెచ్చఁగ [6]నిజ, సుతనివహమునట్ల వారిఁ జూడఁగ వలయున్. 245

వ. అట్లుం గాక. 246

చ. [7]కడవఁగ జూద మాడి యవుఁ గా దన నేరక సత్యభాషణం
బెడలిన వచ్చుధర్మగతి హీనత కోర్వక రాజ్యహీనతం
బడుటకు నోర్చి ధర్మజుఁడు వంచిన సైరణ సేసెఁ గాక క
వ్వడినెఱిగిన్క కెట్టి మగవారును నోర్తురె యిజ్జగంబులన్. 247

వ. అనిన విని కర్ణుండు గనలి యిట్లనియె. 248

క. జనులెల్ల నెఱింగిన[8]యీ, పని యేటికి నుగ్గడింపఁ బలుమఱు దుర్యో
ధనునకయి శకుని జూదం, బున మేదిని గెలిచె ధర్మపుత్రుం డోడెన్. 249

ఆ. దీన నేమితప్పు కానకు నేఁగిన, యతఁడు సమయవృత్తి నాక్రమించి
తండ్రిపాలు మాకుఁ దగు నంచు [9]నడియరి, తనము సేసి రాక తప్పు గాక. 250

క. విరటుఁడు ద్రుపదుఁడుఁ దోడుగ, బరవసమున నెత్తి విడిసి బలిమి నడిగినం
గురుపతియు వెఱచి యిచ్చునె, ధరలోఁ జక్కనగ మిట్టి తగవులు గలవే. 251

---

1 డాదిక్కుట. 2 భావించి 3 అన విని...గాఁ. 4 ఈవాక్యము. 5 నుండి.
6 దన. 7 (కడు)...యెటుఁగా దన ... నెఱిగిన్క ... యేజగంబులన్ ; ముజ్జగంబులన్.
8 దీ, పనికి...మేదినిఁ గొనియె. 9 నది వెట్టి; గడుసరి.

వ. అనిన గాంగేయుండు గటకటంబడి కర్ణున కిట్లనియె. 252

ఉ. చిక్కనిపోటుమానిసి విసీ వినువారలు నవ్వ నేమిగా
నెక్కుడుమాట లాడెద వహీనపరాక్రమశాలి యర్జునుం
డొక్కఁడ [1]యార్వురన్ మనల నుగ్రరణంబున గెల్చె నిన్న నేఁ
డిక్కడఁ బల్కులన్ గెలిచె దీ వనితన్ మనరాజుకొల్వునన్. 253

క. నరుఁ [2]డాలవెనుక వచ్చినఁ, గురురా జడుగంగ నీవు గురుఁడును గృపుఁడున్
గురుసుతుఁడు వినఁగ వారల, చిరసమయము దెగుట యేను జెప్పనె తెలియన్.

తే. అనిన ధృతరాష్ట్రుఁ డాపగాతనయు భక్తి
ననునయించి రాధేయునిఁ గినిసి ప్రియము
దోఁపఁ [3]దా నిట్టు లనియె నా ద్రుపదమనుజ
పతిపురోహితుతోడ సంభ్రమము లేక. 255

ఉ. [4]మంచిగ నేను బంధులును మంత్రిజనంబులుఁ బెద్దలున్ విచా
రించి సమస్తభూప్రజకుఁ బ్రీతిగ బిడ్డలపాలి కిప్డు పు
త్తెంచెద సౌమ్యు నొక్కరు మదీయమనోగతి వారిఁ గూడి వ
ర్తించు తెఱంగు గైకొనుట దెల్లము కౌరవజాతి కెంతయున్. 256

తే. నీవు మున్నేఁగు మని యతనికి విభూష, ణాంబరమ్ములతోఁ దమ్ములంబుఁ బెట్టి
[5]వీడుకో లిచ్చి పుచ్చిన విప్రవరుఁడు, పాండుజనపాలతనయులపాలి కరిగె. 257

వ. ఇట్లు సని వారలం గని యతండు సముచితసంభాషణంబులఁ దనపోయివచ్చిన కార్యంబు తెఱం గెఱింగించె నిట ధృతరాష్ట్రుండును బుత్రమిత్ర [6]వృద్ధామాత్యసహితంబుగా నాస్థానాసీనుం డయి యుండి సంజయు రావించి యతని కి ట్లనియె. 258

తే. పాండునరపాలసుతు లుపప్లావ్యమునకు
వచ్చి యున్నారు నీవేఁగి వాసుదేవ
సహితముగ వారిఁ గని తద్విషాద మేమి
భంగి [7]మాను నమ్మెయిఁ దగఁ బలుక వలయు. 259

ధృతరాష్ట్రుఁడు సంజయునిఁ బాండవులయొద్దకుఁ బంపుట.

క. మీయయ్య మీఁదు వనవా, సాయాసము నిస్తరించి యభ్యుదయమునన్
డాయుట విని ముదితాత్ముం, డై యిట పుత్తెంచె నన్ను ననుమీఁ మొదలన్.

వ. అని చెప్పి చుట్ల నున్నవారలతో నిట్లనియె. 261

---

1 నార్వురన్ ... డెక్కుడు (పల్కులన్) మాటలన్ గెలిచె దీవును వేడుక రాజుకొల్వునన్. 2 డాలమునను. 3 గా...సంభ్రమ మెసంగ; సంభ్రమము దలఁక; సంప్రీతి మెయిన. 4 మంచిద నేము...జాతి కింతకున్; కంతకున్. 5 వీడు కొలుపునఁ బుచ్చిన విప్ర...; వీడు కొల్పిన నప్పు డవ్విప్రవరుఁడు, పాండురాజతనూజుల. 6 భృత్యామాత్య. 7 బాయు.

క. దుర్యోధనుండు గార్యా, కార్యజ్ఞుఁడు గామి నిట్టి కలఁక గలిగెఁ గా
కార్యులు దృఢధైర్యులు రణ, ధుర్యులు నగుపాండుసుతులు దోషా[1]న్వితులే.
క. క్షీరోదకవృత్తి మనము, వారలునుం గలసి బ్రదుక వలదే నెమ్మిన్
వారిడుమలఁ బడఁ దగియెడు, వారే పితృభాగ మేలు[2]వారలు గారే. 263
ఆ. మనల నింక నమ్మ రన్నతాత్ము లన్యాయ, పరులు గర్వులనుచుఁ బాండుసుతులు
గూడి మనుట కియ్యకొన నేర రైనను, ధర్మజుండు గలఁడు దగవు నడప. 264
వ. అని పలికి వెండియు. 265
మ. మన కీకుండఁగ వచ్చునే మనము దుర్మానంబు [3]వాటించి యొ
ప్పనికార్యంబులు వట్టి వారికిఁ దగం బాలీక [4]గర్వంబు లా
డిన నిక్కం బగు నల్క నర్జునుఁడు గాండీవంబు మోపెట్టఁ గృ
ష్ణునిసారథ్యము నై జగత్త్రితయసంక్షోభంబు గా కుండునే. 266
తే. అలఘుగదఁ [5]బూంచికొని భీముఁ డతిరయమునఁ
గురుకుమారులపైఁ దీవ్రకోప మెసఁగఁ
గవియు టాత్మ భావించినఁ గంప మడరు
నిక్క మెవ్వరు మార్కొని నిలుచువారు. 267
సీ. కవ [6]లగ్రజన్ములకంటె నేమిటఁ గీడు, ద్రుపదుఁ డల్పుండె తత్పుతులు బాహు
గర్వసమగ్రులు గారె విరాటుండు, నాతనితమ్ములు నాత్మజులును
నసదులే సాత్యకి యలఁతులఁ బోయెడు, వాఁడె వృష్ణికుమారవరు లనేకు
లట్టియోధులు పోర నరవాయి గొందురే, పాండ్యుండుఁ గేకయపతులు నాది
తే. యైనబంధులు మిత్త్రులు నగ్గలికలఁ, గొఱఁతవడియెడువారె యందఱును గెల్వ
నోపినను రుద్రునకు నైన నోర్వరాని, ధర్మపుత్త్రుకోపమునకుఁ దలఁక వలదె.
వ. అని పలికి సంజయుదిక్కు మొగంబై యెల్లవారును విన నిట్లనియె. 269
తే. నీవు ధర్మజుపాలికి నెమ్మి [7]నరుగు, మతఁడు పేరోలగం బున్న యవసరమునఁ
గాన్పు మతనికి ననుజవర్గంబునకును, బంధులకు నింపు వుట్టంగఁ బలుకుమచట.
క. నెయ్యము [8]వాటించి కడుం, దియ్య మెసఁగ నలుక లెల్లఁ దీఱునటులుగాఁ
గయ్య మనుతలఁపు లోనుగ, నయ్యమనందనుఁడు మాను నట్టితెఱంగుగాన్.

—సంజయుఁ డుపప్లావ్యంబున నున్నపాండవులయొద్దకు వచ్చుట.—

వ. [9]శాంతిప్రకారంబునం గార్యంబు నడపి యొక్కటి యై మనుట యొడఁగూర్చి
రమ్ము రథం బెక్కి పొమ్మని తగినతెఱంగున వీడ్కొలిపిన సంజయుండునుం

1 త్మకులే. 2 వారల కారే. 3 నం జేసె. 4 దర్పంబు ... క్షోభంబు సంధిల్ల (వా
ల్ల) దే. 5 బుచ్చికొని...కోప మడర. 6 లగ్రజులకంటెఁ గడు బెట్టిదులు కారె...గర్వస
మృద్ధులు...నరువాయి గొంద్రె యా. 7 నరిగి, యతని. 8 వాటించిన మది; వాటించి తగం...
ల్లఁ దెగునట్టులుగాఁ; లెల్లఁ దీఱెడునటుగాఁ...నన్. 9 శాంతిప్రకారంబు నడపి.

జని యుపప్లావ్యంబు సొచ్చి మాధవుమందిరంబున కరిగి యభ్యంతరవినోదంబుల నరసహితుం డై యున్నయన్నారాయణునకుం దనరాక యెఱింగించి పుచ్చి తగఁ బ్రవేశించి భయభక్తివినయ[1]సంభ్రమంబులు మెఱయ వారలం గాంచి యమ్మహాత్ము లిరువుర సంభావనంబులును సంభాషణంబులునుం బడసి సంప్రీత చేతస్కుం డై మఱునాఁడు ధర్మతనయునోడ్డోలగం బున్నసమయంబు వేచి సముచితంబుగా నతనిం గని సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లిన నతండుం బ్రియ పూర్వకంబుగా నాదరించి తనసమీపంబున నునిచికొనినం గొలిచి యుండి యతని కిట్లనియె. 272

తే. [2]భాగ్యమున నిన్నుఁ గనుఁగొనఁ బడసి నాదు
చూడ్కి చరితార్థ మయ్యె నస్తోకపుణ్యు
ధనుఁడు మీతండ్రి ధృతరాష్ట్రధరణినాథుఁ
డిందు మీయునికి విని ప్రియ మెసక మెసఁగ. 273

క. అనుజులు నీవును ద్రోవది, యును బుత్రచయంబు నున్న యోగక్షేమం
బున తెఱఁ గారయఁ బుత్తెం,చె నితాంతస్నేహపూర్ణచేతోవృత్తిన్. 274

వ. అనిన సూతనందనునకు ధర్మనందనుం డిట్లనియె. 275

క. ఆరాజు మాదెసం గల, కారుణ్యముకతమునను సుఖంబున నిట్లు
న్నారము నినుఁ బుత్తెంచిన, గారవమున నాదుమది వికాసముఁ బొందెన్. 276

క. అమ్మనుజేశ్వరునకు నే,మమ్మే పుత్రకులు సుఖులె మనుమలు సమ్మో
దమ్మునఁ బెరిఁగెద రే నగ,[3]రమ్ముల భూములను శుభపరంపర గలదే. 277

సీ. ద్రోణుండుఁ గృపుఁడును ద్రోణసుతుండును, సుఖ మున్నవారె సుశ్లోకుఁడైన
భీష్ముండు కుశలియే పెద్దతనం బిచ్చి, యాతనిఁ గౌరవు [4]లనుసరించి
మెలఁగుదురే బ్రాహ్మణులకు మన్నన గల్గి, యుండునే యే మర్థి నోసఁగినట్టి
వృత్తులు సెల్లునే యొత్తొరు వొండుల, వలనఁ బుట్టదు గదా కలఁకులందుఁ
తే. బుట్టినప్పుడు గాండీవి భుజబలంబు, తలఁతురా భీమసేనుగదావిహార
ముగ్గడింతురె కవలు మహోగ్రరిపుల, భూము లంతంత కొత్తుట పొగడఁబడునె.

మ. ఒకనాఁడా తమముందటం బలుమఱుం హోరాటమై నేల యొ
త్తికొనంగా బవరంబులన్ గెలువఁగాఁ దెల్లంబుగాఁ జూచి పాం
డుకుమారాళి నుతింప కుండుదురె యాటోపంబునన్ ఘోషయా
త్రకు గంధర్వులు వచ్చినప్పటిచరిత్రం బాత్మలం బాయునే. 279

క. వినుము మనము మధ్యస్థుల, మని నర్జును నెదిరి సంజయా యుట మున్నె

1 సంభ్రమంబులు మనంబునఁ బెనఁగొన. 2 భాగ్యమునఁ గాదె నినుఁ జూడఁబడసి నాదు...డిచట మీయునికి. 3 రమ్మున జనులకును ; రమ్మున రాష్ట్రమున. 4 లాదరించి ... యొత్తుడు నొరువుల ; యొత్తుఁ యొడ్డుల.

వ్వనికిని మానముఁ బ్రాణం, బును దగఁ దక్కించుకొనఁగఁ బోలునె చెపుమా.

క. దుర్యోధనునింటం దగు, కార్యమునకు ఖడ్గమునకుఁ గలవాఁ డై చా
తుర్యంబు మెఱయుకర్ణుని, యార్యత్వము సెల్లు చున్న యదియే నెమ్మిన్. 281

వ. అధిన విని సంజయుండు సవినయంబుగా నిట్లనుఁ గురురాజునొద్ద నవినీతులు నీతిమంతులు సత్త్వసంపన్నులు దురహంకారులు మఱియు వివిధప్రకా[1]రులు నయి బెరసి యుండుదురు వా రొక ళ్లొకళ్లమాటలం బోయెడువారు గారు కావున వారి నంత యనం బని లేదు నావిన్నపంబు చిత్తగింపుము. 282

క. పొం దొందఁగఁ దలఁచితి నీ, విందుశిశిర మైనవిమలహృదయంబున వా
రందఱకును సేమం బిట, ముందర లే కున్న నేఁడు మొదలుగఁ గలుగున్. 283

క. ధృతరాష్ట్రభూపతికి వృ, ద్ధతకతమునఁ జిత్త మొకవిధము గామి సుతో
ద్ధతి మాన్పఁడ నాఁ[2]డు మనః, క్షతి పిదపం బుట్టె యిపుడు శాంతుం డయ్యెన్.

తే. ఇట్టిచందంబు లెల్లను నీవు పుణ్య, చిత్తవృత్తి[3]మై సైఁచినఁ జెల్లి వచ్చు
నీయజాతశత్రుత్వంబు నిఖిలలోక, విశ్రుతముగాదె ధర్మప్రవీణహృదయ. 285

చ. జగముల నెల్లెడన్ దురితసంతమసంబు జయింపఁ గోరి పొ
ల్పుగఁ బరమేష్ఠి నిల్పిన వెలుంగు మహీసురు లట్టివారికిం
దగవు ఘటింప సత్పురుషదత్తము లై చనుజీవనంబు లెం
తగుమతు లైన మార్తురె పదంపడి యాయువు శ్రీయు నొల్లరే. 286

ఉ. ఒక్కొకచోఁ గడంగి ప్రతియోధులు మార్కొనునప్పు డాత్మలన్
నెక్కొని మోములం [4]బొడము నెవ్వగతోడ జనంబు లిట్టియం
దక్కట భీముఁ డైన మనయర్జునుఁ డైనను మాద్రిపుత్త్రులం
దొక్కరుఁ డైన నీపగఱ నుక్కడఁగింపరె యొక్కవ్రేల్మిడిన్. 287

క. వా రొకయాగ్రహవృత్తిం, గూరి [5]యధర్మంబు సేఁతకుం జాలరు దు
ర్వారబలు లయ్యుఁ బాండుకు,మారులు శాంతాత్ము లంద్రు మనుజాధీశా. 288

క. నలువురు దమ్ములు భవదా, ప్తులుఁ గృష్ణుఁడు వినుచు నుండ భూవర నీ కేఁ
గొలువునను విన్నవింపం, బలుకులు గల వవధరింపు పరిపాటిమెయిన్. 289

చ. అనవుడు వీరె తమ్ములును నాప్తులుఁ గృష్ణుఁడు [6]వీరె తక్కుకొ
ల్వునఁ గలయట్టిసర్వజనులున్ వినుచుండెద రయ్య నిన్ను నే
మను మని పంచెఁ జెప్పు మది యంతయు నేర్పడ నన్న ధర్మనం
దనుగరువంపుఁబల్కులవిధంబునకున్ మదిలోన నుల్కుచున్. 290

వ. సంజయుండు కృష్ణు సద్భక్తి నీక్షించి, పవనపుత్త్రుఁ బార్థుఁ గవల ద్రుపద

---

1 రంబులఁ బెరసి...వా రట్లు గావున. 2 డ మనః, స్మృతి. 3 సహించినఁ; సైరించినఁ. 4 బొదువు ... జనఁబు లిట్టిచో, నక్కట ... యందు రెల్లెడన్; చూడ నెల్లెడన్. 5 యు ర్మంబు సెడుటకుం...మహిజను లెల్లన్. 6 వీఁడె...నల్కుచున్.

తనయు సవినయమునఁ గనుఁగొని ప్రీతిఁ బాంచాలు మత్స్యధరణిపాలుఁ జూచి.

వ. సావధానుల రై వినుం డని పలికి యుధిష్ఠిరుదెసకు మోడ్పుఁగేలు [1]నిగిడించి
యి ట్లనియె. 292

ఉ. శాంతతఁ బొంది కార్యముదెసన్ ధృతరాష్ట్రమహీశుఁ డాత్మ న
త్యంతముఁ [2]దేఱి నన్నిట ప్రియంబునఁ బంచెదునప్డు నాకుఁ దే
రెంతయు వేడ్కఁ దాన వెర వేర్పడఁ జెప్పుచుఁ బన్నఁ బంచె ని
ట్లింత ఘటించెఁ బొందు మన మీపదనం దెలి వొందఁగాఁ దగున్. 293

క. చులుకనికార్యము సేయం, దలఁచుట మీయట్టిసర్వధర్మజ్ఞులు శాం
తులు ననఁ బ్రసిద్ధు లగుపెద్దలకుం దగ వగునె యెవ్విధంబునఁ [3]జూడన్. 294

ఆ. మడుఁగుఁజీరయందు మసి దాఁకినట్లు మీ, సత్కులమునఁ గల్మషంబు గౌర
వేంద్రుకతనఁ బొందె నింతయుఁ బాపంగ, నీవ నేర్తు [4]కార్యనిపుణహృదయ.

చ. అఖిలజనక్షయం బయి జయాపజయంబులు రెండునుం దుదిన్
సుఖములు గానియీపనికిఁ జొత్తురె యుత్తము లట్లుఁ గాక యా
నిఖిలసుఖంబు లేమిటికి నీ వని వృద్ధజనంబు బాలురన్
సఖులను బంధులన్ గురులఁ [5]జంపితయేని దయాపయోనిధీ. 296

ఉ. పెట్టనికోట నీకు హరి భీముఁడు నర్జునుఁడున్ రణంబునం
దొట్టినమంట లాకొలఁదియోధుల సాత్యకియున్ విరాటుఁడుం
జుట్టపుమేరు వుగ్ర[6]రణశోభితుఁ డీద్రుపదుండు నిన్ను ని
ట్టట్టన వచ్చునే సురల కైనను నొల్లవుగాక చివ్వకున్. 297

వ. మఱియు నక్కడ. 298

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణశల్యులుం
బ్రాణము లానుయోధనునిపాలివ యంద్రు నిజానుజన్ము ల
క్షీణపరాక్రముల్ [7]సుతు లజేయులు బాహ్లికసోమదత్తు లా
స్థాణున కైన నోడరు వశంబె జయింపఁగ వారి నేరికిన్. 299

ఆ. అధిప యిట్టిమీకు నన్యోన్యకలహంబు, నాకుఁ జూడ మే లనంగ రాదు
రెండుపక్షములకుఁ బ్రియము హితంబును, నాత్మఁ గోరువారి నడిగి చూడు.

వ. అని పలికి సూతనందనుండు గొలువు గలయం గనుంగొని. 301

ఉ. మ్రొక్కెద వాసుదేవునకు మోడ్చెదఁ జేతులు సవ్యసాచికిం
దక్కటిమిత్త్రబాంధవహితప్రియమంత్రివయస్యకోటికిన్
స్రుక్కుచు విన్నవించెద నసూయలు దక్కి యనుజ్ఞ సేయుఁడీ

---

1 మొగుడించి. 2 దీఱి...రంతయుఁ దాన యిచ్చి (ప్రియ మేర్పడ) ... మన మీప
నం; మన కీపదనం. 3 దలఁపన్. 4 ధర్మ. 5 జంపుదయేని. 6 సుతశోభితుఁ; రణశో
విభుఁ. 7 గల రజేయు.

యిక్కరుణాకరుఁ శరణ మే నిదె వేఁడెదఁ గోరి ధశాంతికిఁ. 302

వ. అనుచుం బ్రణామపూర్వకంబుగాఁ బాండవాగ్రజువదనంబునం జూడ్కి నిలిపి దేవా యుపశమించుట లెస్స [1]యిమ్మెయికిం గురుపితామహుండును సంతసిల్లు నాతనికి మతం బయిన తెఱంగు సర్వలోకసమ్మతం బగు నన విని ధర్మనంద నుం డిట్లనియె. 303

క. నెయ్యము దప్ప నొం డొకటి నీచెవి సోఁకెనె నాదుపల్కులం
దియ్యెడ సంజయా యనికి నిమ్మెయి [2]నల్కుదు నీవు మాకుఁ దాఁ
గయ్యము దక్కి మన్కి తగు కార్యము గాదొకొ పోరితంబు లే
కయ్యెడునర్థసిద్ధి వెడఁ గైనను నొల్లక యొండు సేయునే. 304

. జనులకు నెల్లను బథ్యము, లనఁగా ధర్మానుగతము లగు ననఁ బొగడం
జనుపనులు సేయుభీమా, ర్జును లే దుష్కర్మమునకు రోయనివారల్. 305

. మది సుఖము గోరి దుఃఖం, బొదవం గల కార్యములకు నుత్సాహము సే
యుదు రొప్పనితృష్ణం బడి, చదు రేమియు లేనియట్టిజను లాతురు లై. 306

. యోగ్య[3]తృష్ణదారు లుచితంపుఁ గొలఁదిమై, నడచినట్టివారు బెడిదములకు
నంత సొత్తు రెట్లు సంతాపకారుల, కాక పెనఁకువలు సుఖంబు లగునె. 307

. భోగంబులు వలదా యని తలంతు మేని. 308

తే. వస్త్రమాల్యానులేపనావసర[4]ములును, జతురతూర్యత్రయంబులసమయములును
నేము వెలిగాఁగ మాతండ్రి కించునెట్లు, పుత్త్రులన పట్టి మమ్మేల పోవఁ ద్రోచు.

. అయినను నొకమాట సెప్పెద సమచిత్తుండ వై విను మని యిట్లనియె. 310

. [5]తా నైన నపుడు వక్రుం, డై నీతిపథంబు విడిచె నక్కట పతి మ
మ్మైనను జక్కని తెరువునఁ, బూని నడవుఁ డనుచు నిపుడు బుద్ధులు సెప్పెన్.

. ఎదిరిం దమయట్టులకా, మదిఁ దలఁచినఁ బొసఁగుఁ గాక మాకుం [6]గుడు మిం
డిదె మీరు వ్రక్కఁ గొనుఁ డని, చదు రడిచిన మనసుపొందు చక్కంబడునే.

. అని చూపి చెప్పి వెండియు. 313

. సంపద దక్కి యుండఁగ నశక్తు లనం [7]జనుమమ్ముఁ బిల్చి పూ
జింపఁగ నంత చేలె పతి సెప్పెడువారలబుద్ధి నాఁడ మ
న్నింపఁడ యింక నేల యగు నీ వడియాసల వచ్చి రిత్త గా
రింపక మాను మాతనిచరిత్రము నీకును మాకు వింతయే. 314

. తగుమాట లాంబికేయుం, డగు నని కైకొనునె యెన్నఁ డైనను గొడుకుఁ

1 యిమ్మెయిం. 2 ......మాకుఁ గాఁ; నుల్కుదు మీకు వారితోఁ. 3 తృష్ణఁ దగిలి యుచితంపుఁ బోఁడిమై)...పెనఁకువల సుఖంబు గలదె. 4 ములను...యిచ్చు నెట్లు. 5 తాఁ బుత్తునకు వశుఁ, డై నీతి. 6 (గుడ) మిం డిదె మీవు...మనముపొందు; మనసుమందు. దగు...పూజింప నతండు ఛేలె.

మగఁటిమి గలఁ డనియెడు[1]న,మ్మిగఁ జూచుచు నుండు విషము మ్రింగినయేనిన్.

క. జూదపుసిరి యాసపడం, గా దని విదురుండు సెప్పఁగా నప్పుడు క
ర్ణాదులపలుకులు విని పతి, యాదరణము సేయ కున్న [2]నంతన తీరున్. 316

క. ధృతరాష్ట్రుఁ డిటమీఁదను, సుతులును శకునియును సూతసుతుఁడును దను నే
గతి నడపించిరి వారల, మతమ యనుష్ఠించుఁ గాక మరలంబడునే. 317

క. కార్యము తెఱఁ గిట్టిది నీ, వార్యచరితమునకుఁ జొచ్చి యాడెదు నీ కా
దుర్యోధనునవినయ మని,వార్యం బని యెఱుఁగరామి వలనో వెడఁగో. 318

క. చక్రధరు లెక్కఁగొనఁడు ప,రాక్రమనిధి యర్జునునకు రాధేయభుజా
విక్రమ మెదురుగఁ గొని ని,ర్వక్రముఁ జేసికొనువాఁడు రాజ్యం బెల్లన్. 319

వ. అని పలికి వెడవెడ యలుక వొడమిన మఱియు నిట్లనియె. 320

శా. చాపాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు నశ్వత్థామయుం గర్ణుఁడున్
భూపశ్రేష్ఠుఁడుఁ [3]దారు మున్నెఱుఁగరే పో రెట్లుఁ గయ్యంబు లా
శాపాశంబులు చుట్ట లా వెఱఁగియుం జా వేఁడి మార్కొందు రిం
తే పో తమ్ముఁ గపిధ్వజప్రభల యంధీభూతులం జేయవే. 321

క. మును మమ్ముఁ బొగడి పదపడి, యని వారల గెలువ నరిది యని పొత్తుగఁ జె
ప్పినమాటకు నే నొడఁబడ, విను సంజయ పక్షపాతవృ[4]త్తి విడువుమీ. 322

స్రగ్ధర. గాండీవజ్యారవం బుత్కటమయి పెలుచం గ్రమ్మినన్ భీముబాహా
దండం బేపారి శుంభద్గద జడియుచు రౌద్రంబుగాఁ దోఁచినన్ వే
దండద్వంద్వంబుమాడ్కిం [5]దఱిమి కవలు మాద్యద్గతిం దాఁకినం జా
కుండం బోకుండఁ గౌరవ్యులకు వశమె బిట్టుల్కి మూర్ఛిల్ల కుండన్. 323

వ. కావున. 324

చ. రణముల వారలన్ గెలువ రా దనుపల్కు లటుండ నిమ్ము స
ద్గుణుఁడవు నీవు వచ్చితి ప్రకోపశమంబుగఁ బల్కి యింక సై
రణ దగఁ జేయువారము పరాభవ మొందియు [6]మున్ను వారిదు
ర్గుణములు సైఁచు టీవు నొకకొంత యెఱుంగుదు వింత యేటికిన్. 325

ఉ. ఇంకను నట్లకాఁ దలఁపు మే మొకకీడునకుం బొడంగ మా
శంకలు దక్కు మయ్య కువిచారము గల్గినయేని బాంధవం
బంకుర [7]మొత్త మావలన నక్కటికం బొలయంగ మమ్ము నే
వంకకుఁ బోవ నీక గరువంబు జగంబు ప్రశంస సేయఁగన్. 326

క. రం డని పిలువఁ బనిచి పా, లిం డని కొడుకులకుఁ జెప్పి యింద్రప్రస్థం

1 న్నెమ్మిగఁ. 2 యంతన తీరెన్. 3 దాను మున్నెఱుఁగఁడే (పో రెట్లుఁ). 4 త్తిక విడుమీ. 5 దఱిమిడి కవ లుద్యద్గతిం. 6 మున్న...రెఱుంగుదు రింత. 7 మొత్తు

బొందెను వేఱొకపట్టణ, మొందెను మాకిచ్చి [1]యనుచు టుచితమ కాదే. 327

ఉ. నా విని సంజయుండు నరనాథున కిట్లను నెట్టితప్పులుం
బోవఁగఁ ద్రోచి తాలిమియ పూనుదు గావున నిన్నిమాట లి
ట్లీవు వినంగ నాడియును నేఁ దనివోవక విన్నవించెదన్
నీవిభవం బహింసయు ననింద్యచరిత్రము కాక [2]యన్యమే. 328

క. పా లీక కౌరవులు దుశ్శీలతఁ జెడఁ దలఁచిరేనిఁ జెప్పెద రుధిరా
భీలాన్నంబునకంటెను, మేలగు భిక్షాన్న మైన మీనడవడికిన్. 329

వ. అది యెట్లంటేని. 330

సీ. రాజసూయమహాధ్వరం బట్లు నడపి స, ద్ద్విజులకు సురలకుఁ దృప్తిఁ జేసి
శాంతియు దాంతియు సకలలోకంబులఁ, బొగడొంద [3]బ్రదికినపుణ్యమూర్తి
విట్టినీచరితంబు హింసాకళంకిత, మగు టెంత యొప్పదు నదియుఁ గాక
దుర్ణయవృత్తి దుర్ధ్యాతంబు పుట్టించి, యంతలు సేసినయట్టివారి

తే. నేల గర్వంబు సెల్లంగ నిచ్చి జగము, చేతఁ దిట్టులు వడునట్లు సేసి పోయి
తేల యడవుల నిమ్మెయి నిడుమ గుడిచి, తేల తాల్మియ ధనముగా నింతవడితి.

క. తుదిఁ బోయి కూరకర్మా, స్పద మగు[4]తెఱఁగునకుఁ జొచ్చి బంధుల గురులన్
వెదకి వధియించుసౌఖ్యం, బది యేటికి నార్యనింద్య మస్థిర మరయన్. 332

తే. అల్పులకు మ్రింగఁ [5]జేఁదైన హాలహలము
భంగిఁ బొంగెడుకోపంబు మ్రింగికొనఁగ
నీలగళు నెన్ని నిన్నెన్నఁ బోలు నట్టి
నీవు సాలినఁ గా కేల నెగడుఁ బేరు. 333

ఉ. అనవుడుఁ బాండురాజతనయాగ్రణి సంజయుమోముఁ జూచి యి
ట్లను నది యెల్ల నీపలికినట్టిద ధర్మువు లట్ల యుండి బో
ధను లరయంగ వచ్చినన ధర్మము లై చెడుఁ గొన్ని ధర్మవ
ర్తనములు గాక తోఁచి తుది ధర్మము లై చనుఁ గొన్ని [6]కర్మముల్. 334

కావున నన్ను దూఱఁ దలంచితేని నాచేయునది [7]ధర్మం బధర్మం బని నిరూపించి మఱి దూఱుము కోపంబు నివారింపం దగు నహింసయ యుత్తమధర్మం బగు నట్లయినను వంశదూషకులును లోకకంటకులును నగుపాపాత్ముల నిర్మూలంబు గాఁ జెఱుచుట ధర్మం బని పెద్దలచేత విందు మది యట్లుండె సంగ్రామంబు రాజులకు ధర్మం బవుం గా దని నీవ చెప్పు మట్లుం గాక యిది కర్తవ్యం బిది యకర్త

---

1 యనుచు. 2 యల్పమే. 3 జేసిన...బహింసా...యొప్పెడు...దర్ధ్యాతంబు ప్ర[illegible]ంచి...,చేతఁ బ్రువ్వంగఁ బడునట్లు. 4 విధమునఁ జరించి; తెఱఁగునకుఁ (దొడరి) దొడఁగి. బెల్లైన...నెన్ని యెన్నంగఁ; నెన్ని యెన్నినఁ. 6 కర్మవుల్; ధర్మముల్. 7 యధర్మం నిరూపించి...కర్తవ్యం బిది యని పునః.

వ్యం బని మనల శాసింప వాసుదేవుండు గలండు మన కీవితర్కం బేటికి నితం
డు ధర్మాధర్మవిధులకు గురుండు గార్యాకార్యనిరూపకులకు శిక్షకుం డుచితానుచి
తజ్ఞులకుఁ బ్రదర్శకుం డితనిపంపునం గాదె యదు భోజాంధక వృష్ణి సృంజయ కే
కయప్రభృతిభూపతిప్రకరంబు ప్రశస్తపథంబునం బ్రవర్తిల్లుచున్నయది విశేషించి
మాకు నితనిబుద్ధియ సమస్తపురుషార్థమ్ములకు మూలం బగుట నితనివచనం బవ
శ్యంబు నలంఘనీయం బనిన విని జనార్దనుండు సంజయున కిట్లనియె. 335

ఉ. పాండుతనూజకోటికి శుభం బెడఁ గోరుదు [1]నెప్డు నాంబికే
యుండును బుత్రపౌత్రమహిమోజ్జ్వలుఁ డక్కట చేటు మేలె యం
చుండుదు నట్లుఁ గాక తెలి వొంది యతం డిట వీరిఁ దేర్పఁగా
నిండుమనంబుతోఁ బనిచె నిన్నని దీనికిఁ బ్రీతిఁ బొందితిన్. 336

ఆ. నీవు నుచితవృత్తి నెయ్యంబు ధర్మంబు, వినయ మొప్పఁ దెలిపి వీరు శాంతిఁ
బొందునట్టిభంగి పొసఁగఁ బల్కుటయును, [2]నాకు సమ్మదం బొనర్చె నిపుడు.

ఆ. అనఘ యిట్టు లంతయును దలఁపం గడు, నెనసినట్టు లుండెనేని వింటె
పాండవాగ్రజన్మపలుకులచందంబు, సూడ సంధి లేనిచొప్పు దోఁచె. 338

క. అది యట్టిద సంధానము, దుది నెమ్మెయిఁ [3]గల్గు నెట్లు దుర్యోధనుఁ డు
న్మదుఁడు ధృతరాష్ట్రభూవిభు, హృదయంబు తెఱంగుగొంత యెఱుఁగుదుము గదా.

క. ఆరాజు సేయునెయ్యము, గారామును జెప్పె దీవు గడుఁ దీపులు గా
వీరు దమపాలు వడయక, నేరిమి[4]మాటలన దీర నేర్తురె చెపుమా. 340

ఉ. వీరలు పెద్ద ద్రవ్వ[5]కొక వెంట నొడంబడి తేఱి శాంతులై
కౌరవకోటిఁ గూడి మనఁ గా మదిఁ గోరుట పెంపుఁ దాల్మియుం
గారుణికత్వముం దగవు గాదె జగంబున పాడిఁ దండ్రిపా
లీ రని తెంపు సేసి పయి నెత్తిన నెత్తిరి గాక ద్రోహమే. 341

క. విను మవమానము పడి యి,[6]ట్లునికిఁ బడయుతో గడుకంటె నుజ్జ్వలులై మా
ర్కొనిన నది లెస్స యెట్లయి, నను వీరికిఁ బోటు మేలు నాకుం జూడన్. 342

వ. సంగ్రామంబు రాజులకు ధర్మం బవుఁ గా దని నీవ చెప్పు మని యుధిష్ఠిరుండు
నిన్నడిగెఁ గదా ద్విజాతులకు యజనయాజనాదికర్మకరణవిభాగంబు ధర్మశా
స్త్రాచార్యులు విధించునప్పుడు రాజు లిచ్చువారు గాని వేఁడుకొనువారు గా
రని చెప్పుట సకలలోకప్రసిద్ధంబు సర్వవర్ణాశ్రమధర్మపరిపాలనంబు సేయునట్టి
రాజులు దార నిజధర్మంబు వదలుదురా యదియునుంగాక పాడితోడి[7]యార్జనం
బునం దమకుఁ గలకలిమి యనుభవించుచు సత్పథంబున నడచు చుండఁ ద

---

1 నేను...వీరిఁ (దీర్పఁగా) దెల్పఁగా. 2 దగఁగ నాకు సమ్మదం బొనర్చె. 3 గలుగ నేర్చు;
ల్గునట్లు. 4 ......దేఱ; మాటలకుఁ దీర. 5 రొక వెంట...(మదిఁ దేఱుట)...పాటియందు.
రాకుఁ దండ్రి. 6 ట్లునికిఁ (నగు పొగడ్తకంటె) బడయు పొగడుకుంటె. 7 యార్జవంబునం.

మ్మొరులన్యాయంబు సేసినయప్పటికిం[1]గదా యాశస్త్రాస్త్ర ధర్మంబులింద్రాదు లగుపెద్దలు గావించిరి నీచెప్పెడిధర్మంబులు గౌరవులకుం జెప్ప వలవదా వారలు గదా మీఁదెఱుంగక కొఱంతనుఱుకులై చెడుతెరువునం బోయెదు వారని పలికి మఱియు నిట్లనియె. 343

క. నెట్టన సభలో [2]వేవుర, కట్టెదుర నరాతితనము గా కెంతయు వా
రెట్టితులువలో ద్రౌపది, నట్టెల పఱిచెడిదె జూద మాడరె యెందున్. 344

వ. అనవుడు సంజయుండు దేవా నీచిత్తంబున నిడి దీని నింత గొనియాడినఁ గర్జం బొడఁగూడునే యనిన వాసుదేవుం డిట్లనియె. 345

ఉ. అత్తఱి భీష్మముఖ్యు లగునచ్చటివృద్ధజనంబు లెల్ల నో
రెత్తక యూర కుండిరి మహీశ్వరుచిత్త మెఱుంగ కున్కిఁ దా
నొత్తి కుమారులం గినియ నోపఁడ యక్కట మాన్పఁ గన్న నా
చిత్తమ కాదు లోకములచిత్తము లెల్లను సంతసింపవే. 346

ఉ. [3]తిట్టులఁ బోయి యక్కొలువు తేఁకువవారలలోని కింతిఁ దా
నట్టులు దున్ససేనుఁ డదయాకృతి ముందల వట్టి యీడ్వఁగా
నెట్టు సహించె మామ సతియేడ్పు చెలుంగున కెట్టు లోర్చె నీ
పట్టున సేమ మారయఁగఁ బంచుట కెట్టులు నేర్చెఁ గ్రమ్మఱన్. 347

చ. ఇది దగ దంచు నడ్డపడునింతకు నేరక సభ్యు లందఱున్
మది మరగొన్నయట్టియెడ మానినికిం దనుఁ దాన కాచికో
లొదవిన దానఁ జేసి సభ నొచ్చెము దక్కినఁ బాండునందనుల్
బ్రదికిరిగాక యయ్యెడరు రాచకుమారుల [4]కోర్చునట్టిదే. 348

వ. సంజయా వినవే యప్పుడు సభాసదులకుఁ గర్ణశూలంబు లగునట్లుగాఁ గర్ణుండు.

క. లే రిచట మగలు నీకును, వీరలు జూదమున నోడి విడిచిరి నిన్నున్
వారిజలోచన నీపైఁ, గూరిమి గలమగని వెదకికొను మొరు ననఁడే. 350

క. నరునకు నది వాఙ్మయ మగు, శర మైహృదయంబు నాఁటి చలియింపక దు
ర్భరవేదనఁ జేయంగా, జిరకాలము దచ్చికిత్స సేసెనె చెపుమా. 351

వ. మఱియు దుశ్శాసనుండు వీర లందఱును గొడ్డువోయినవారలు పౌరుషంబు గల మానిసి యిందెవ్వం డనియె నతనిచెప్పినట్ల పెద్దగాలంబేని వీరల గొడ్డువోయిరి గాక వీరిదెస వారికి నేమి ఫలించె వెండియుఁ దత్సమయంబునఁ బుట్టినమాట లుగ్గడించునట్టివి గా వీ సంధికార్యం బత్యంతదుర్ఘటంబు దీని ఘటియింపం జేయుట యశక్యం బని తలంచెద నయినను. 352

1 గదా యీసర్వవర్ణాశ్రమధర్మపరిపాలనంబు సేయుశస్త్రాస్త్రంబు లింద్రాదు లగు;... స్త్రాస్త్రకర్మంబు. 2 నేవుర...నట్టులు పఱిచెడిదె జూ; నట్టు పఱిచి గొరులు జూ. 3 తిట్లఁ బోక...లోనర్చెఁ గ్రమ్మఱన్. 4 కోర్వ వచ్చునే.

సీ. పాండవేయులఁ దగం బ్రార్థించి యందుల, కక్కట యేనైన నరుగుదెంచి
కౌరవులకు బుద్ధిగాఁ జెప్పి రాజ్యంబు, పాలునేసిన మృత్యుపాశములకుఁ
దప్పరే వారలు దగవును నేర్పును, నామీఁద నిలుచుట నాకుఁ గీడె
నన్ను మన్నింతు రన్యాయంబు సొరనినా, మాటకుఁ [1]దా రొడఁబాటు లేక
తే. యుండుదురె కేరడము లాడు చుండిరేనిఁ
గవియుపాండవబాణాగ్ని గాదు సువ్వె
తమ్ముఁ దమలోభ మనుచిచ్చు దరికొనంగఁ
దెగినవారయి పోదు రింతియ తలంప. 353
వ. అని పలికి వెండియు నిట్లనియె. 354
ఆ. రోషమయమహాతరువు సుయోధనుఁ డురు,స్కంధ మందులోనఁ గర్ణుఁ [2]డలరుఁ
గొమ్మ సౌబలుండు గుసుమఫలములు దు, శ్శాసనుండు మూలశక్తి తండ్రి. 355
ఆ. ధర్మజుండు ధర్మతరు వర్జునుఁడు ఘన, స్కంధ మనిలసుతుఁడు శాఖ కవలు
పుష్పఫలము లేను భూసురులును వేద, ములుఁ దదీయ మైనమూలచయము.
క. ఈరెంటియందు నరసి య, సారం బిది గాఢసారసహితం బిది నా
నేర వలయు నదియును గా, కేరూపం బయ్యె[3]నేని నీ సేమిటికిన్. 357
మ. ధృతరాష్ట్రిందును బుత్త్రులుర్ వనము గుంతీనందనుల్ సింహముల్
మతి నూహింప నసింహ మైనవనముర్ మర్దింతు రెందుర్ వనా
వృతవృత్తంబులు గానిసింహములకుర్ వేగంబ చేటొందుఁ గా
న తగం బొందుట కార్య మీయుభయము న్సంతుష్టిమై నున్కికిన్. 358
క. పరిచారకులై యుండుదు, రరివర్గవ్యతికరమున కగుదురు వీరిర్
పరిఁ దనకొడుకుల మెలపిన, తెరువున మెలగింప వలదె ధృతరాష్ట్రునకున్.
క. ఏ నీపనికై వచ్చెదఁ, దా నొప్పఁ దలంచె నొండెఁ దప్పం దలఁచెర్
దానన నెగడెద మేమ, మ్మానవనాథునకుఁ జెప్పు మామత మెల్లన్. 360
వ. అనిన విని సంజయుండు ధర్మతనయుం గనుంగొని యట్లయినను గడు లెస్స గదా దేవా నావచ్చినకార్యంబు సఫలంబయ్యెఁ బనివినియెద ననివాసుదేవునకు నట్ల విన్నవించి భీమార్జుననకులసహదేవసాత్యకిద్రుపదవిరాటుల నీక్షించి మీయందఱచేత ననుజ్ఞాతుండన కదా పోయి వచ్చెదనాయాడినమాటలయం దేమియుం దగనియట్టివి లేవు గదా యనుటయుఁ బాండవాగ్రజుం డతని కిట్లనియె.
ఆ. పోయి వత్తుగాక యీయున్నయందఱు, విన్నఁగ నాడి తీవు విశదభంగి
నొక్కమాటయైన నుచితంబు గానిది, గలదె[4]యిట్లనంగ వలయు నెట్లు. 362
క. ఎదు రున్నరూపు వలుకఁగఁ, దుదిఁ గటకటఁబడవు నీవు దుర్నయమును బె

1 వా రొడఁ ... కోఁలడము (గారడము) లాడు ... గదిసిపాండవ; గవయుపాండవ.
2 వరయుఁ. 3 నేమి. 4 యె ట్లనంగ వలయు నిన్ను.

ట్టిదమును బెండును నగుపలు, కొదవదు నీనాలుకకు నయోన్నత యెపుడున్.
క. నీ వొండె విదురుఁ డొండెను, గా వలయుం గాక యిట్టికార్యంబులకుఁ
రా వేఱ కలరె తగువా, రీవినయము నేర్పు గలదె యితరుల కెందున్. 364
చ. అరిగినయప్డు పెద్ద లగునందలివిప్రుల నెల్లఁ గాంచి యా
దరమున వారిసేమ ముచితంబుగ నారసి వెండి కాన్పుమీ
గురునిఁ బితామహుం గృపునిఁ గూర్తురు వారలు నాకు నానమ
స్కరణముగాఁగ [1]వారి కధికప్రియభక్తి నమస్కరింపుమీ. 365
సీ. మాతండ్రిఁ గని యేను బ్రీతి మ్రొక్కుటగాఁగ, దండప్రణామంబుదగనొనర్చు
దుర్వృత్తిఁ [2]బొరయునాదుర్యోధనునిసేమ, మడిగితి నని చెప్పు మతనితమ్ముఁ
డగుటకుఁ దగియెడునాదుస్ససేనుని, కుశల మారయుము దక్కను గుమార
వర్గంబు నెల్లను వనితాజనంబుల, నుచితంపుమై సుఖ మునికి యడుగు
ఆ. విదురు శల్యుఁగాంచి వినయంబు దోఁపంగ, నాడుద్రోణతనయు నక్కు నేర్చి
కొంటి ననుము బాహ్లికుని సోమదత్తు భూ,రిశ్రవసునిఁదలఁచి ప్రియము నెఱపు.
వ. మఱియు వంశవంతులు వయోవృద్ధులు నగుభూపతులను గృతవర్మను గర్ణశకు
నిసైంధవప్రభృతులను దక్కటిరాజలోకంబును గయ్యంబునకుఁ దోడువచ్చినస
కలదేశాధీశులనుం గని యెవ్వరితోడ నెవ్విధంబునం బలుకం [3]దగుబ్రణామవి
నయబాంధవమైత్రీవాత్సల్యంబులకు నయ్యైప్రకారంబుల మద్వచనంబులుగాఁ
బలికి యుచితంబుమెయి నుపచరింపుము. 367
క. దాసీదాసజనముల కు, దాసీనముగాక యుండఁ దడయక యే మి
త్త్రాసంగ మొంది శత్రుని, రాసం బొనరించి తమ్ము నరసెద ననుమీ. 368
క. పోయినమొగమున నచ్చటఁ, జేయుతెఱం గెల్ల నీకుఁ జెప్పితిఁ బిదపన్
మాయయ్య పెద్దకొలువున, వాయోడక యిట్టనంగవలయుం జుమ్మీ. 369
గీ. అనఘ భవద్బలంబునన యాపద యించుక లేక పాండునం
దనులు నిజాప్తబంధుసహితంబు [4]సుఖస్థితి నున్నవారు త
జ్జనకునిరాజ్యపీఠమున సమ్మద మొందఁగ నిల్పి శైశవం
బునన ప్రభుత్వ మిచ్చి తగఁ బ్రోచితి వారల విశ్రుతంబుగన్. 370
ఉ. ఇప్పుడు పేక్షసేసి కృప [5]యేమియు లేక విహీనవృత్తి వా
రొప్పమిఁ బొందఁ జూచు టిది యొప్పునె యింతట సంతసింప రా
దిప్పుడు నంతకంత నట యెక్కుడు గోరినఁ జాల కుండదే
యొప్పదె కూడి మన్కి మన కొప్పనివారలయుక్కు దక్కఁగన్. 371

1 నందుఁ గలసభ్యుల కెల్ల. 2 బొరయని. 3 దగు నవ్విధంబునం బ్రణామ ... వాత్స
ల్యంబు లగునయ్యై. 4 సుఖంబున. 5 యించుక ... వృత్తి దా, రొ ... దెప్పుడు నంత కంత
(క) యె.

వ. అని [1]తదవసరంబునం బితామహునితో ని ట్లనుము. 372
చ. అడఁగఁగ నీక శంతనుని యన్వయముం గలిగించి తీవ యి
ప్పుడు [2]దగ నీమతంబునన పొం దొడఁగూడఁగఁ జేర్చి పౌత్రులన్
నడికి నధర్మవృత్తికిని జావునకుం దొలఁగించి మన్చినం
బుడమిజనంబు రాజులును భూసురులున్ నినుఁ బ్రస్తుతింపరే. 373
వ. అని పలికి వెండియు. 374
క. ఇంతలు వుట్టినచోటను, శంతనునందన యహీనకాంతిపరుం డై
కొం తేయాగ్రజుఁ డాలము, పొంతం బో నొల్లఁడనుము బుధు లియ్యకొనన్.
సీ. ఆసమయంబున నచ్చటివా రెల్ల, వినునట్లుగా సుయోధనునితోడ
బాహుబలాఢ్యులబలవిహీనులక్రియ, వెడలంగ నడిచిన వెట్టితనము
నత్యంతచిరకాల మడవులఁ గొండల, బాధలఁ బెట్టిన[3]పరుసఁదనము
సభలోన నట్లు పాంచాలరాజాత్మజఁ, దల వట్టి యీడ్చినతులువతనము
తే. ధర్మపుత్రుండు సైరించెఁ దథ్యమీవు,కురుకుమారుల నని మ్రింగికొనకు మొరుల
సొమ్మునకు నాసపడ దగ దిమ్ము వారి, పాలు వారలతోఁ గూడి బ్రదుకుమనుము.
వ. ఏము కలహం బొల్లక పొందు గోరుట తనకు మేలు దనమనంబున దరికొను తృష్ణానలం బార్ప నోరు [4]లడ్డంబు సొరమింజేసి యేన బుద్ధి సెప్ప వలసెఁ దన యొద్దం గలయోధవీరు లెయ్యెడల లేమి దెల్లం బయినను మాకుఁ జేదోడు ధర్మంబు గల దదియునుం గాక యఖిలలోకసేవితుం డైనకృష్ణుండు పెనుఁబ్రాపుగా వునఁ దమకు మమ్ము[5]గెలువం గొలఁది గా దది యట్లుండె నేను భీమసేనాదులకుం దమకుం బెద్దవాఁడ నగుట వీరును దారును మదీయప్రార్థనాభంగంబు సేయక నా దగుశాంతియు దాంతియుఁ జెల్లించి నన్నలజడిఁ బెట్టక పోరితం బుడిగి తమతమధనంబులు గుడిచి సుఖం బుండుట మనపెద్దలకుం దక్కటిబుద్ధిమంతులకును సంతోషం బగుఁ బెద్ద యీ నోపఁ డయ్యెనేనిఁ గుశస్థలంబును వృకస్థలంబును వాసంతియు వారణావతంబును జాలుఁ గా దేని మఱియు నెం దేని నొక్కటి యగునట్లుగాఁ దనతోడఁబుట్టువు లేవురకు నిలువ తావు లయి దిచ్చిన సర్వశాంతియగు న ట్లయిన నిందలియందలిబంధుమిత్రసహాయజనంబులు గలసి నవ్వుచుం దెగడుచు నునికి మనమనంబులకుఁ బ్రియంబు సేయుఁ గురుపాంచాలయాదవ మాత్స్యులు పరస్పరప్రీతిసంపాదకత్వసంపన్ను లై బ్రదుకుట నాకుంగోర్కి యింతయు నమ్మహాపురుషునకుం దెలియం జెప్పు మనిన విని దేవా నీయానతిచ్చిన మార్గం బంతయు నడపెద మీతండ్రి నీకును దమ్ములకును వాసుదేవునకు నెట్లు ప్రియం బట్లు సేయుహాఁడ కాక యనుచుం బ్రణామంబు

1 తదనంతరంబునం. 2 దగు...గూడఁగఁ (జేసి) బిల్చి. 3 పందతనము. 4 లెవ్వరు లేమిం జేసి. 5 గెలువ రా దని.

సేసిన సంజయునకు ధనంజయుం డిట్లనియె. 377

క. బాలసఖుండవు [1]నాకును, నీలెస్సఁదనంబు నేము నీతి విడిచి దు
శ్శీలురమగుటయు శైశవ, లీల మొదలు గాఁగ మును దెలియదే నీకున్.

మ. బలమత్తాకృతి యైనభీముఁ డనుశుంభత్కుంభిసంరంభమున్
నిలిపెన్ నాఁడును నంకుశం బయి తుదిన్ నేఁడుం దదుద్రేకమున్
మలుగం జేయ నజాతశత్రునికృపా [2]మాధుర్యంబు చాలంగ వా
రల కేలా నయవిక్రమోచితవిచారక్లేశముల్ సంజయా. 379

వ. అని పలికి ధర్మతనయానుమతంబున సంజయునకు సపరివారంబుగా సముచిత ప్రకారంబున మజ్జనభోజనంబు లొనరించి మాల్యానులేపనాద్యుపచారంబులు సేయించి మణిభూషణచిత్రాంబరంబు లొసంగి వీడుకొల్పిన నతండును బాండవులను వాసుదేవుని వీడ్కొని చనియె నని చెప్పిన. 380

క. విని యత్యంతకుతూహల, మునఁ బొదలుచు సంజయుండు మున్నిచ్చటికిం
జనియెను నెవ్వరితో నే, మనియెను విన వలతు మునిజనాధిప చెపుమా.

వ. అని యడిగిన. 382

ఉ. భూరికృపానుషంగ మునిపుంగవచిత్తసరోజభృంగ సం
సారదవప్రవర్ష సురసంస్తుతదివ్యగుణప్రకర్ష దో
స్సారనిరస్తదైత్య [3]శమశాలిమనస్థ్సితినిత్య లోకని
స్తారకశీల నిర్వృతివిశాల నిరంజన పాపభంజనా. 383

క. శ్రుతిమాళిరత్నమూర్తీ, శతధృతిముఖపద్మషండసౌరభకీర్తీ
రతిపతిహితాహితాఘా, సతతసమాచరితభక్తజనసంరక్షా. 384

మాలిని. సదయవిమలదృష్టీ సంశ్రి[4]తాశీఃప్రవృష్టీ
హృదయకమలవాసా యిద్ధమాయావిలాసా
విదితనిఖిలభూతీ విశ్వరక్షార్తహేతీ
సదసదుపచితాత్మా సంభృతానందవర్త్మా. 385

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున యుద్యోగపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

1 మాకును. 2 మాధ్వ్యంబు. 3 దమ...వృత్తిసువి. 4 తక్షీరవృష్టీ... విమలభాసా హేయమాయా ; హేతుమాయా...నిఖిలఖ్యాతీ...రక్షార్థ.

శ్రీ

గణేశశారదాగురుభ్యో నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఉద్యోగపర్వము, ద్వితీయాశ్వాసము.



శ్రీవిస్తారక[1]రణాకరు
ణావేశోదార శశ్వదమలాకారా
భావవికారవిదూర శు
భావహనామప్రకార హరిహరనాథా.

సంజయుఁడు ధర్మజునిసంధిపల్కులను ధృతరాష్ట్రునకుఁ దెల్పుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నివ్విధంబున వీడ్కొ
సూతనందనుండు పవనజవనంబు లగునరదంబుతురంగంబులం దఱిమి ప్రొద్ద
గ్రుంకునంతకుం గరిపురి సొచ్చి నగరి కరిగి యంతఃపురంబున నున్నధృతరాష్ట్రు
నకుం దనరాక యెఱింగించి పుచ్చి యతనిం గాంచి యడుగుల కెఱఁగిన నవ
నీవరుండును నత్యాదరంబున నెత్తి సమీపంబున నునిచినం గొలిచియుం
చేతులు [2]మోడ్చి యిట్లనియె.

ఉ. దేవర పంపఁగాఁ జని యుధిష్ఠిరునిం గని వచ్చినాఁడ నా
భూవిభుఁ డప్రమేయగుణపూజ్యుఁడు మీకు [3]నమస్కరించె సం
భావన సేసె నా కిచటిబంధుల నెల్లఁ దలంచె మీసుఖ
శ్రీవిభవంబులుం సుతులసేమము నన్నడిగెం బ్రసన్నుఁడై.

తే. అనుఁడు ధృతరాష్ట్రుఁ డిట్లను నయ్యజాత
శత్రునకు సేమమే యనుజన్ము లెల్ల
సుఖులె బంధులు భృత్యులు సఖులు మంత్రి
వరులు సంప్రీతి[4]మెయి నున్న వారె యచట.

వ. అనిన సంజయుం డిట్లనియె.

క. వా రెల్లను భవదీయ, స్ఫారబలము గారణముగ సౌఖ్యంబున ను
న్నార మని పలుకుదురు నిజ, మారయఁగా నట్ల కాదె యది జననాథా.

---

1 వరకరు; సత్కరు. 2 మొగిచి. 3 నమస్కరించి...సేసి...దలంచి. 4 సుఖమున్న

క. ధర్మజునకు భోగంబులు, ధర్మువున ట్లింపు గావు ధర్మంబులలో
నిర్మలబుద్ధి నహింసకుఁ, గూర్మి గడుం గలఁ డతండు కురువంశనిధీ. 7

ఉ. మానుషశక్తి యొల్లఁడు సమంచితదైవమ యూఁది యుండు నీ
పైన యతండు పుణ్యమును బాపముఁ బెట్టినవాఁడు నీవు నీ
[1]సూనువశంబ కాని యొకచొప్పుఁ దలంపవు కర్ణసౌబలా
ధీనము గార్యనిశ్చయము దెల్లము నీమత మొప్ప దేమియున్. 8

ఆ. ఆలుబిడ్డలేనియట్టిత్రిమ్మరి యగు, కొయ్య గాక కుదుటఁ గూడు వెట్టి
కుడుచువార లిట్టిక్రొవ్విదంబులు సేయఁ, జొచ్చు టిచ్చగించి చూతురయ్య. 9

చ. కొడుకులఁ గానరే నృపు లకుంఠిత తేజుల నెందు [2]నిమ్మెయిం
జెడుతెరు వైనచోఁ దగవు సెప్పక యొప్పరికించి చూతురే
పుడమిజనంబు లెల్ల నినుఁ బుత్ర్వఁగఁ దిట్టఁగ వించు నున్కి నో
చ్చెదుమది యెప్పుడుం జెవులు చీములు గట్టెడుఁ గౌరవేశ్వరా. 10

చ. చలమున దుస్ససేనుఁడును [3]సౌబలుఁడున్ మిముఁ బట్టి యార్ప బో
మ్మలక్రియ నాడు చుండుదురు మానక నీవు సుయోధనుండుఁ దా
రలసి యొకప్డు పాండుసుతు లాగ్రహవృత్తికిఁ జొచ్చిరేని నీ
చలము బలంబునుం గులముఁ [4]జక్కఁగఁ జేయరె యొక్కవ్రేల్మిడిన్. 11

క. వినుము యుధిష్ఠిరుసైరణ, మనవారలు [5]వెఱపుగా సమర్థింతురు డీ
[6]కొనఁగం దగరే కొండం, గని యోటమి వెట్టినట్లు కౌరవనాథా. 12

క. అనుజులకు నడ్డపడి యే, మిని జేయఁగ నీమిఁ జూచి మెచ్చితి గాకీ
వును సాదు రేఁగనేని, న్వీను తలపొలమునన కాని నిలువదు సుమ్మీ. 13

చ. [7]అనయము పుట్టె జూదమునయప్పుడ యెంతయుఁ జిచ్చు వెట్టి కా
ల్చినయది నీయుపేక్షయ వశీకృతచిత్తుఁడు ధర్మసూతి మె
త్తనిపులి యెల్లవారలు నధర్మము నీపయిఁ బెట్టునంతకు
న్వీనఁడును గానఁడుం బిదప నీకును నాకు మరల్ప వచ్చునే. 14

చ. అనయము నొచ్చుచున్నయవి యంగము లెల్లను వేగ వచ్చుట
స్మనము వశంబు గాదు జననాయక ప్రొద్దును బోయె నిప్డు డేఁ
బనివిని రేపు పుత్రులును బంధులు నాప్తులు నీవు నేర్పడన్
విన మనకార్య మంతయు సవిస్తరతం దగ విన్నవించెదన్. 15

ఆ. అనిన నట్ల కాక యని సంజయుని వీడు, కొలిపి కొంతప్రొద్దు కురువిభుండు
కార్యచింత మునిఁగి కంచుకి నొక్కరుఁ, బిలిచి వేగ విదురుఁ బిలువు మనియె.

1 సూనుమతంబె కాని. 2 నెవ్వరుం. 3 సైంధవుఁడున్...యాట. 4 జక్కఁగఁ.
5 వెఱపుగాఁగ మదిఁ దలతురు దీ, 6 కొనఁగాఁ దగ రని వ్రాసిన ; కొనఁ దగరు వెనుక దీసిన.
7 అనలము...జిక్క వెట్టెని ; తేర వచ్చుటన్.

వ. వాఁడును సత్వరంబుగాఁ జని యతనిం దోడ్తెచ్చి కాన్పించిన నమ్మహీవరుం డత్యాదరంబున విదురుం దనయొద్ద నునిచికొని యతని కిట్లనియె. 17

ఆ. పాండురాజసుతులపాలికిఁ జని యిప్డు, సంజయుండు వచ్చి సమ్ముఖమున నన్నుఁ జాల దూఱి నాకు రేపచ్చటి,పనులు సెప్పువాఁడ ననుచుఁ జనియె. 18

క. అప్పటనుండియు నెవ్వగ, గప్పికొనినఁ జిత్తవృత్తి గలఁగెడు మేనుళ్
నిప్పులఁ బొరలినయట్లయి, చొప్పడ దించుకయు నిద్ర శుద్ధవిచారా. 19

వ. అనిన విదురుం డిట్లనియె. 20

క. బలవంతుఁడు పై నెత్తిన, బలహీనుఁడు ధనముగోలుపడినయతఁడు మ్రు
చ్చిల వేచువాఁడు గామా, కులచిత్తుఁడు నిద్రలేక కుందుదు రధిపా. 21

క. ఇక్కొఱగాములలోపల, నొక్కటి నీచిత్తవృత్తి నొందెనో యొరు సొ
మ్మెక్కటి గుడువఁ దలంచితొ, నిక్కము గత మేమి [1]సెపుమ నిద్రసెడుటకున్.

తే. అనిన ధృతరాష్ట్రుఁ డిట్లను నతనితోడ
ధర్మసుతుమాటచొప్పువిధంబొ యెఱుఁగ
కునికిఁజేసి చింతిల్లితి నోపు దీవు
దెలియఁ జెప్పి నాయలమట మలుగఁ [2]జేయ. 23

చ. అనవుడు నిట్లనుళ్ విదురుఁ డక్కట ధర్మసుతుండు బాంధవుం
డును జెలికాఁడునుం దగుభటుండును బ్రెగ్గడయుళ్ గురుండుఁ [3]గాఁ
డెఁ నృపవరేణ్య నీకుఁ బ్రకటీకృతసత్యుఁడు శాంతమూర్తి స
ద్వినయవివేకశీలముల విశ్రుతుఁ డాతఁడు గీడు వల్కునే. 24

ఆ. నీవుఁ గొడుకు వారి [4]నెఱి లేక పఱిచితి, రదియ చాలు నుచిత మైనపాలు
పంచి యిండు పిల్లిపట్టినయీరువు, సేసి యున్న నేల [5]చెల్ల నేర్చు. 25

వ. మీరు శకునికర్ణదుశ్శాసనులమీఁద రాజ్యభారంబు వెట్టికొని యుండుదు రిది దుదిముట్ట నేర దెట్లం టేని. 26

క. తముఁ దా రెఱుఁగుట వేగప, డమి దాలిమి విడుపు గలుగుటయు లేనిప్రభు
త్వము గలదె వారియందీ, సుమానుషము లోకఁడుఁ బట్టి చూడం గలఁడే.27

వ. యుధిష్ఠిరుండు నీవు నిక్కమ తండ్రి వని తగవు నమ్మి చాల సైరించి యున్నవాఁ డది నీవ యెఱుంగు దనిన విని ధృతరాష్ట్రుం డిట్లనియె. 28

తే. సంజయునిచేతఁ గార్యంబుచంద మెల్లి
[6]యెఱిఁగి మన కెద్ది సేయంగఁ దెఱఁగు దానిఁ
బనిచి చేయింపు మిపుడు నామనము దల్ల
డిలుట హితభాషణంబుల డిందుపఱుపు. 29

---

1 యిట్లు. 2 దలఁగఁజేయు. 3 వింటె...సత్త్వుఁడు; శౌర్యుఁడు; చిత్తుఁడు. 4 నెఱుఁగక పనిచితి...యీలువు 5 చెల్లి వచ్చు. 6 ఎఱిఁగి చేయఁగఁ దగు తెఱఁగెద్ది దాని.

వ. నీవు ధర్మాధర్మవిదుండవు నయానయజ్ఞుండవు నాకుం బ్రజాగరం బొనర్చు చున్న
సంతాపం బుపశమించునట్లుగా భవద్వచనామృతంబు నాయుల్లంబున వెల్లి
గొల్పు మనిన విదురుం డిట్లనియె. 30

క. జనులకు నోడఁబా టగువిధ,మున నడచుచు లోకనింద్యముల నుడుగుచు మీఁ
దని యొకనికలిమి [1]కులుకక, మనుజులతోఁ బొంది పొసఁగి మను టొప్పు నృపా.

క. కోపము నుబ్బును గర్వము, నాపోవకయునికియును దురభిమానము [2]ని
ర్వ్యాపారత్వము ననునివి, కాపురుషగుణంబు లండ్రు కౌరవనాథా. 32

క. ఏలినవానిని దైవము, నాలిని బంధులను సముచితారాధనసం
శీలతఁ బ్రీతులఁ జేయని, పాలసుఁడా ఫలము లొసపడు [3]మనుజేంద్రా. 33

క. నెమ్మి గలవారి నొల్లరు, త మ్మొల్లనివారివెనుకఁ దగులుదు రధిక
త్వ మ్మెఱిఁగి యెఱిఁగి [4]తొడరుదు, రి మ్మెఱుఁగనియట్టివార లిభపురనాథా. 34

క. ధనమును విద్యయు వంశం,బును [5]దుర్మతులకు మదంబుఁ బొనరించును స
జ్జను లైనవారి కడఁకువ,యును వినయము నివియ తెచ్చు నుర్వీనాథా. 35

క. అరిదివిలుకానియుజ్జ్వల, శర మొక్కని నొంచుఁ దప్పి చనినం జను నే
ర్పరి యైనవాని [6]నీతి, స్ఫురణము పగరాజు నతనిభూమిం జెఱుచున్. 36

తే. ఒకటిఁ గొని రెంటి నిశ్చలయుక్తిఁ జేర్చి,మూఁటి [7]నాల్గింటఁ గడు వశ్యములుగఁ జేసి
యేనిటిని గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు, విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు.

క. విను మధురాహారంబులు, గొనుటయుఁ బెక్కండ్రు నిద్ర గూరినయెడ మే
ల్కనియునికియుఁ గార్యాలో,చనముఁ దెరువు నడచుటయును జన దొక్కనికిన్.

క. నడవడి యనుమున్నిటిం, గడవం బెట్టంగ నోడకరణిం దగి తా
నోడఁగూడదు ననిన సత్యము, గడచినగుణ మింక నొండు గలదే యరయన్. 39

క. క్షమియించువారిఁ గని చా,లమి వెట్టుదు రైననుం దలంప ననూన
క్షమయ కడు మెఱయుతోడవు, త్తమరూపము గోరువారు దాల్తురు దానిన్.

క. పురుషుండు రెండు [8]దెఱఁగుల, ధర నుత్తముఁ డనఁగఁ బరఁగుఁ దా నెయ్యెడలం
బరుసములు వలుక కునికిం, దురితంబులు వొరయు పనులు దొఱఁగుటకతనన్.

తే. చెల్లి యుండియు సైరణ సేయునతఁడుఁ, [9]బేదవడియును నర్థికిఁ బ్రియముతోడఁ
దనకుఁ గలభంగి నిచ్చునతండుఁ బుణ్య, పురుషులని చెప్పి రార్యులుగురువరేణ్య.

క. పాడి దప్ప కుండఁ బడయుసొమ్ములకు న,పాత్రములకు నీగి పాత్రములకుఁ
బెట్ట కునికి యనఁగ నెట్టన రెండు వి,ధములఁ గీడు దొడరు ధరణినాథ. 43

---

1 కలుకుచు; కలరుచు. 2 దు,ర్వ్యాపారత్వము. 3 నె నరేంద్రా. 4 తొడగుదు. 5 దుర్మ
ంలకు...బొదలించును. 6 రీతి. 7 నాల్గింటిఁ. 39 వ పద్యమునకు వెనుక, ‘ వ. అని మఱి
యు ధృతరాష్ట్రునకు విదురుం డిట్లనియె.’ నని యొకవచన మున్నది. 8 గుణముల. 9 బీదవడి
యును.... బెట్టినతండుఁ బుణ్య, చరితు లని.

తే. వెలఁది జూదంబు పానంబు వేఁట పలుకు, ప్రల్లదంబును దండంబుఁ బరుసదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత, యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల.

తే. తగినవేషంబు దనుఁ దానపొగడుకొనమి, నొచ్చియును గీడు వలుకమియిచ్చి వగవ
కునికి దన కెంత నడవక యున్నఁ బథము, దప్పకుండుట నడవడి [1]యొప్పు సేయు.

క. చెలిమియు సంభాషణమును, బలిమి వివాదంబుఁ దోపుఁబాడియు దమయం
తలవారితోన తగు నధి, కులహీనులతోడ [2]నైనఁ గొఱగా దధిపా. 46

తే. కొంచెమైనను దగఁ బంచి కుడుప మేలు
పనులయెడ దుఃఖ మోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట హితము శత్రునకు నైన
నిచ్చుటయ లెస్స యడిగినయెడ నృపాల. 47

క. తను లోకము గొనియాడఁగ, విని యుబ్బఁడు సజ్జనుండు వెండియుఁ గడు మే
లొనరించుఁ గీడొకించుక,యును దనదెసఁ దోఁప నీక [3]యుడుపుచు వచ్చున్.

వ. ఇట్టిచందంబులు ధర్మనందనునకుం గల వని పలికి విదురుం డది ప్రసంగంబు
గాఁ బాండవులఁ బ్రశంసించి నీవు వారలం బెనిచి మానుసులం జేసి రక్షించి
యిప్పుడుపేక్షించి వారలు వెలినుండ నూరకుండం దగునే [4]తగుపాలిచ్చి
వారి రావించి నీకొడుకులతోడివారింగా నడపుట యుచితంబు మీరును వారు
ను నొక్కటియై యున్న మీదిక్కు దేవతలకుం దేఱిచూడ రాదనిన నమ్మాటలు
వెడవెడ యూఁకొని ధృతరాష్ట్రుండు విదురున కిట్లనియె. 49

తే. హితముఁ గర్తవ్యమును నాకు నెఱుఁగు దీవ, ధర్మసుతుచందమును విదితంబు నీకు
నట్లుగావున నెఱిఁగింపు మఖిలకార్య, [5]జాతమును జిత్తతాపోపశమము గాఁగ. 50

క. అనుడు విదురుఁ డాతని కి, ట్లను నిమ్మెయి నన్ను నొత్తి యడిగినఁ జెప్పం
జను నున్నరూపు సెప్పెద, విను మవధానంబుతోడ విమలవిచారా. 51

ఉ. డక్కెను రాజ్య మంచు నకటా యిటు దమ్మునిభాగ మీఁక నీ
వెక్కటి మ్రింగఁ జూచె దది యెట్లరుగున్ విను మీను లోలతన్
గ్రక్కున నామిషంబు చవి గాలము మ్రింగిన [6]చాడ్పునూవె యి
ట్లుక్కివుఁ డైన నీకొడుకు నుల్లము నున్నటు లాడఁ గూడునే. 52

క. అన విని నిరుత్తరుం డయి, మనుజేంద్రుఁడు గొంతసేపు మాన్పడి తలఁపుల్
పెనఁగొన నిద్రాహీనిం, దను వలయఁగ విదురుతోడఁ దా నిట్లనియెన్. 53

క. ఇందాఁక నీదుపలుకుల, [7]డెందము తాపంబు గొంత డిందుపడియె నా

---

1 యొప్పఁ జేయు. 2 దోడరఁ. 3 యుడుగుచు. 4 తగువారి నునిచి వారి రావించి. 5 సరవియును. 6 యట్లు చూవె యి, ట్లుక్కున నీసుతుండు తన యుల్లము నన్నిటు లొప్పఁ గూర్చునే; నుల్లమునం దిటు లోరఁ గూడునే; యుల్లము నన్నిటు లాడఁ గూడునే. 7 డెందంబుకలంకు.

కుం దగ నయానయంబుల, చందంబులు సెప్పుచుండు సౌజన్యనిధీ. 54

వ. అనిన విని విదురుం డిట్లనియె. 55

ఆ. [1]తనియఁ బండ కుండ మును గోసికొనఁ జవి, చేటుకాదు విత్తుచేటుఁ గలుగుఁ బక్వ మైనఁ గొనిన ఫల మించుఁ జెడదు బీ,జంబుఁ గార్యసిద్ధిచంద మిట్లు. 56

తే. మాలకరి పుష్పములు గోయుమాడ్కిఁ [2]దేఁటి
పువ్వుఁ దేనియఁ గొనియెడుపోల్కి నెదురు
గంద కుండఁగఁ గొనునది కార్యఫలము
బొగ్గులకుఁ బోలె మొద లంటఁ బొడువఁ జనదు. 57

క. [3]పరులధనమునకు విద్యా, పరిణతికిం దేజమునకు బలమునకు మనం బెరియఁగ నసహ్యపడున, న్నరుఁడు దెవులు లేనివేదనం బడు నధిపా. 58

క. ఎదిరికి హితమును [4]బ్రియమును, మదికింపును గాఁగఁ బలుకుమాటలు పెక్కై యొదవినను లెస్స యటుగా, కిది యది యన కూరకునికి యెంతయు నొప్పున్.

క. చెలిమియుఁ బగయును దెలివియుఁ,గలఁకయు ధర్మంబుఁ బాపగతియును బెంపుం దులువతనంబును వచ్చును, బలుకుబడిన కాన పోనఁగఁ బలుకఁగ వలయున్.

క. బెడిదముగఁ గత్తి గొడ్డటఁ,బొడువఁ దెగినమ్రానఁ జిగురు వొడముఁ బలుకులం జెడఁ దునిసినకార్యంబు ని,గుడ నేరదు పిదప నెట్టుఁ గురువంశనిధీ. 61

క. తనువున విఱిగినయలుఁగుల, ననువునఁ బుచ్చంగ వచ్చు నతినిష్ఠురతన్ మనమున నాఁటినమాటలు, విను మెన్నియుపాయములను వెడలునె యధిపా.

ఉ. అక్కట ధర్మనందనుని యాస్యమునం బొకనాఁడుఁ గీడుప
ల్కొక్కఁడు లేదు నీకొడుకు లొండొరు మీఱి నికృష్టవాక్యముల్
[5]పెక్కులు పెక్కుభంగులను బ్రేలుచు నుండఁగ నీవు దానికిన్
స్రుక్కక వించు నుండె దనురూపమె నీ కిది కౌరవేశ్వరా. 63

ఆ. చేటుకాల మైనఁ జెట్టమాటలు నెఱి, గాని తెరువు వట్టుకర్జములును [6]దగినయట్ల తోఁచుఁ దగియెడునవి యవి, నీతు లని మనంబు నిశ్చయించు. 64

వ. నీబుద్ధి పాండవులతోడివిరోధంబునెడ మరలంబడమి పాపంబింతియ కాక యేమిసేయుదము మనకులంబునం దేజోధైర్యధార్మికత్వాదిగుణంబుల గరిష్ఠుం డయినయుధిష్ఠిరుండు నీసిరికి వెలి యై యట్లుండుట దగ వగునే నీపెద్దతనంబు సూచి సైరణ వాటించి యున్నవాఁ డనిన విదురుదిక్కుమొగం బై ధృతరాష్ట్రుండు నీ చెప్పిననీతివాక్యంబుల నామనంబు దనివోవ దింకను జెప్పు మనవుడు నతండు వెండియు నిట్లనియె. 65

1 కమియఁ బండ కుండఁ గాయఁ గోసినఁ జవి...బక్వ మైనఁ గోయ ఫల మిచ్చుఁ...ని, ంబుఁ. 2 వెండి. 3 ఒరుల. 4 నిజమును...మాటలు దగఁ బె, క్కొదవినను...లేదా, ఎది. 5 పెక్కువిధంబులం గణఁగి...దనురూపమె. 6 దగవులట్ల.

ఆ. సకలపుణ్య[1]కర్మచయమును నొకదెస, వినుము పాడి దప్పకునికి యొక్క-
దిక్కు-దీని శ్రుతులు తెలిపెడునెడఁ బాడి, కలిమి యెందుఁ బెద్ద[2]గా నుతించె. 66
తే. పాడిగలిగిన నిహలోకఫలము లెల్లఁ, జేరుటయ కాదు కీర్తియుఁ జెందుఁ బురుషు
ధరణిఁ బొగడిత యెందాఁకఁ బరఁగు నంత, కాలమును బుణ్యలోకంబు గల్గు నండ్రు.
వ. తొల్లి ప్రహ్లాదుండు దైత్యజాతిసంభవుం డయ్యును దనకొడుకు విరోచనుండును నంగిరసుం డనువిప్రుకొడుకు సుధన్వుండును దమతమప్రాణంబు లొడ్డుగా నొడ్డి యొక్క-ధర్మసందేహంబునకుఁ బన్నిదంబు సఱచి వచ్చి తన్నడిగిన నితండు గొడు కితండు లాఁతి యని తలంపక మధ్యస్థుండై సుధన్వు గెలిపించి యతనిచేత నిజతనయునిజీవితంబు దానంబుగాఁ గొని వాని బ్రదికించెం గావున నీవును ధర్మంబు విడువక యధర్మోపేతు లైననీకొడుకుల వలనిపక్షపాతంబు విడిచి తెఱంగు సేయుము వారును నాపద లేక బ్రదుకుదురు నీకును [3]శోకంబు లేక తక్కు-నని చెప్పి మఱియును. 68
క. పాపంబులు గర్జము లని, యేపునఁ జేయంగ నవియు నింపగు ధర్మ
వ్యాపారంబు లకార్యము, లై పరిణతిఁ బొందె నేని నట్టుల చెల్లున్. 69
చ. అది సభయే ప్రియం బెసఁగ నార్యులు నిల్వరయేని నార్యులే
మదిఁ దలఁపంగ వారలు సమంచితధర్మము వల్క-రేని న
ట్టిదియును ధర్మవే తగ ఘటించిన నిక్క-ము [4]లేదయేనిఁ దాఁ
బదిలవు నిక్క-మే యొకనెపం బిడుచొప్పగు నేని భూవరా. 70
ఉ. నీతిపథంబునన్ బ్రదుక [5]నేర్చుట యుత్తమభంగి శౌర్యసం
జాతము లైకరం బలరుసంపద లొందుట మధ్యవృత్తి య
స్ఫీతము లైనభారవహజీవనముల్ దలఁపం గనిష్ఠముల్
నీతికి బాహ్యులైన ధరణీవర మెత్తురె వారి నుత్తముల్. 71
ఆ. కయ్యమునక యెపుడుఁ గాలు ద్రవ్వుదురు నీ, పుత్రు లెల్ల సూతపుత్త్రుఁ డాది
యగుతదీయమంత్రు లంతకు ముందర, బిరుదు లీవు నీతి తెరువు సొరవు. 72
క. పాండవులు శౌర్య మొల్ల ర, ఖండిత[6]నీతిప్రకారకార్యము మెచ్చ
యుండుదు రెదు రేచినఁ దుది, మండుదు రార్పంగ రాదు మఱి యెవ్వరికిన్.
క. తమతండ్రిభంగి నీకును, సముచిత మగుభక్తి సేసి సజ్జన[7]నుతమా
ర్గమున నడచువారల [8]నీ, వమలమతిం గన్నకొడుకుల ట్లరయఁ దగున్. 74
వ. అని పలికి మఱియు నిట్లనియె. 75
క. కారణము లేకయును నుప, కారపరత్వమున నొరుల కార్యంబులకున్

---

1 కర్మసంచయ. 2 గానిపించె. 3 శోకంబు గాక. 4 లేనిదేనిఁ; గాకవేనిఁ; లేనిరీతిఁ. 5 నేర్చిన. 6 విక్రములు నీతి కార్యము మేలై...లేచినఁ. 7 మతమా. 8. నీ, దమలమతిన్.

[1]వారనియలజడిఁ బడియెడు, వారల చూ యేడుగడయు వారికి నధిపా. 76

చ. ఒకరునిచేతిప్రోవును దదున్నతిప్రాపును గాంచి యెల్ల వెం
టకును గొఱంత లేక పొగడం దగుసంపద నొంది యట్టిదా
తకుఁ దుదిఁ గీడు సేసినకృతఘ్నునిపీనుఁగు నైన రోఁత పు
ట్టక కబళింపఁ గుక్కలు నొడంబడునే కురువంశవర్ధనా. 77

వ. కావునఁ గృతము దలంపమి గీడు పాండురాజు నీకుం బరమభక్తుండు పాండవులునుం దేజోలాభంబులు గావించినవారలు వారల నాదరింపు మని చెప్పి వెండియు నిట్లనియె. 78

ఆ. బ్రదుకు చేటు పొగడు వడుట దూఱొందుట
యీగి వేఁడుకొనుట యిట్లు మఱియుఁ
గలుగుసౌఖ్యదుఃఖములు వచ్చు నెడపడి
వాని కింతయేల వగవ నధిప. 79

క. వగ బలము దఱుఁగు రూపఱు, వగచిన మతి దప్పుఁ దెవులు వచ్చును దూఱున్
వగచి నలంగినఁ బ్రియ మగుఁ, బగతురకును వగచు టుడుగు పార్థివముఖ్యా.

వ. అనిన విని ధృతరాష్ట్రుం డిట్లనియె. 81

క. రిత్తయుపచారముల నే, నుత్తముఁ డగుధర్మతనయు నుడికించితి దు
ర్వృత్తు లగుమత్సుతులకును, మిత్తి యగుం బోర వగలు మిగులక యున్నే.

వ. నెవ్వగలు నివ్వటిల్ల నీక నిలుపు నట్టిది యెయ్యది దాని నెఱింగింపు మనిన విదురుం డిట్లనియె. 83

తే. నియతతపమును నింద్రియనిగ్రహంబు, [2]భూరివిద్యయు శాంతికిఁ గారణములు
వానియన్నింటికంటె మేలైనశాంతి, కారణము లోభ ముడుగుట కౌరవేంద్ర.

వ. అని వెండియు. 85

క. జ్ఞాతుల [3]పూరితమును గో, వ్రాతమునాక్రమము విప్రవర్గముచనవుఁ
నాతులకారించుటయును, బ్రీతిం జన నిచ్చునతనిపెం పొప్పు నృపా. 86

క. అలమికొని యొండొరులప్రో, వులఁ బ్రాపుల నెలమికలిమిఁ బొంది బహుజ్ఞా
తులు నెమ్మిఁ గూడి తామర, కొలనిక్రియన్ సిరికిఁ బట్టగుదు రుజ్జ్వలులై.

చ. కరితురగాదిఘట్టనయు గాలియు నొంపదె యొంటి నున్నయ
త్తరువు ననేకభూరుహవితానము గుంపయి పేర్చి బాధలం
బొరయునె యన్నదమ్ములును బొందిన నేరికసాధ్యు లట్లుగా
కెరవయి నిల్చినం [4]గెలని కెల్లిద మై పఱివోదు రెంతయున్. 88

వ. కావునఁ గౌరవులుం బాండవులు నొండొరులకుఁ బ్రాపై [5]పొదలిన నెదిరికి నజ

1 దారల జడిఁబడి తిరిగెడు. 2 భూరిదయయును. 3 పోరితమును. 4 బరుల కెల్లి
ద మై. 5 పొరలిన.

య్యు లగుదురు పరులయొత్తు లేనిరాజ్యంబు పూజ్యమహిమం బరఁగు వనవాసంబునం గుందినకౌంతేయులం దడయక తెచ్చి యుచితపదం [1]బిచ్చి నిలుపుట నీకొడుకులకు నిలుపు గావించుట యగు నని చెప్పి మఱియు నిట్లనుఁ బ్రియవాదు లెందును గల రప్రియం బగుంగాకేమి యని తథ్యంబు పలుకువారు లేరు జూదంబునప్పుడే నడ్డపడి యప్రియం బగుటకు శంకింపక తథ్యంబు పలికితి నది నీకు రుచియింపక రోగికిఁ బథ్యాహారంబు దల కంటగించున ట్లయ్యె నైన నిప్పుడుం జెప్పెద వినుము కాకంబులం గైకొని మయూరంబులం బరిహరించు విధంబున మార్జాలంబులం బాటించి సింహంబులయెడ ననాదరంబు సేయు చందంబున సుయోధనాదులం బట్టి యుధిష్ఠిరప్రముఖుల విడిచితి నేఁడు కార్యంబు ముట్ట వచ్చినం [2]దోఁపక మిడుంగుఱు సోఁకినట్లు దల్లడించెదవు కులంబునకై యొకనిం దొఱంగుటయ నీతి యని పెద్దలు సెప్పుదురు దుర్ణయపరుండై సద్బుద్ధి సెప్ప వినం డేని మనము దుర్యోధనుం దొఱంగిన నేమి యగు నది యట్లుండె సంపద సహాయంబు నపేక్షించి యుండు సహాయంబు సంపద నుద్దేశించి వర్తిల్లు ని ట్లివి యొకటొకటిపొందునం గాని సిద్ధింపవు గావుననీ సంపద పాండవులకును వారిసహాయత్వంబు నీకునుం బ్రియం బొనరింప నొండొరులకలయుట మేలు గాక మనలావు వెలిసేయుట లెస్స యగునే కురువంశనిస్తారకు లగు భీష్మ యుధిష్ఠిరులును నవక్రవిక్రములగు కర్ణార్జునులును బ్రతాపధాము లగుభీమదుర్యోధనులును శస్త్రాస్త్రపారగు లగునభిమన్యులక్షణ ప్రభృతి కుమారులును శాపానుగ్రహసమర్థు లగుద్రోణద్రుపదాదిపరమాప్తులును వారివారిబంధుమిత్త్రజనంబులును నొక్కమొగంబై నీపనుపు సేయుచు నయవిక్రమంబు లప్రతిహతంబులై నడవం బృథివి శాసింప భవదీయవిభవం బుజ్జ్వలంబై యొరుల కెడ లేక చెల్లుచున్న నెంతయొ ప్పగునొ యటు విచారింపుము పాండవులు ధీరమతులై వైర మెత్తక యూరక తొలంగి యుండిరేనియుఁ గతిపయదినంబులలోఁ జీకాకుపడి చెడుం గాక గాంధారీనందనుచేత వసుంధరాపరిపాలనభారంబు నిర్వహింపం బడునే యనిన విని ధృతరాష్ట్రుండు విదురున కి ట్లనియె. 89

తే. నీవు సెప్పినమాటలు నిర్మలములు, నిపుణసమ్మతములు రాజనీతిమార్గ
బోధకంబులు నైనను బుత్త్రు విడువ, నోప ధర్మోజయతి యని యుండువాఁడ. 90

వ. అనిన విని విదురుం డతని కి ట్లనియె దేవా జ్ఞాతులు గుణహీను లైనను విడువం దగ దనిన సకలగుణసంపన్ను లై భవత్ప్రసాదంబు గోరుచున్న కౌంతేయులఁ దిగవిడువం [3]దగునే యేను నీకు హితంబు గోరెడువాఁడ నని నిశ్చయించి నాబుద్ధి వినుము వారలజీవనంబునకుఁ గొన్ని యలంతిపల్లియ లైనను దుర్యోధను నొడం బఱచి యేర్పఱచి తెఱంగు పఱచిన లెస్స యని చూచెద నతని

1 బిచ్చి నడపుట. 2 దోఁక నిరుముట్టి తల్ల. 3 దగ వగునే.

విడువ వలయు నని చెప్పితినే నీ [1]పెనఁకువం బశ్చాత్తాపంబు పుట్టు దాని కప్పుడు ప్రతీకారంబు లేదు కావున నెల్లభంగుల నియ్యకొని పాండవులతోడ సంధి సేయ వలయు నట్లుం గాక. 91

క. తమలోనిపాళ్ల [2]కుంగా, సమరము సేసినను గాని చాఁ జనదె శరీ
రము లాధివ్యాధిజరా, సమన్వితము లగుటఁ జేటు సహజం బరయన్. 92

చ. గజతురగాదిసంపదలుఁ గాంతలతోడివిహారలీలలుం
బ్రజ కనురాగ మొందఁ బరిపాలన సేయుక్రమంబుఁ బోరులన్
విజయముఁ బొంది పేర్చుటయు విస్ఫురితాభరణానులేపవ
స్త్రజనితవైభవంబుఁ గలరాజులుఁ బోయిర కాక నిల్చిరే. 93

క. కావునఁ జెవికిం జేఁ దగు, నీవాక్యము వినఁగఁ జాలి తేని నిహపర
శ్రీవిభవములకుఁ గీర్తికిఁ, దావల మై [3]వెలయు టింత తథ్యము సుమ్మా. 94

క. తగ నీలో నూహింపుము, దిగవిడువకు ధర్మతనయు దృఢమతి వై పొం
దగుచందము గొడుకులకుం, బ్రెగడలకుం జెప్పి తీర్పు పెం పేర్పడఁగన్. 95

ఆ. అనిన నాంబికేయుఁ డను నీదుపలుకులఁ, గలఁక [4]దేఱి బుద్ధి దెలివి నొందె
నిట్లు చేయువాఁడ నిదియ కర్జము ధర్మ, మును యశంబు లాభమును దలంప.

చ. అనుడు ముదంబు నమ్మియు నాత్మఁ బెనంగొన నన్నతోడ ని
ట్లను విదురుండు పెద్దవడి కక్కట నీమది కార్యవృత్తి నూ
ల్కొనియె సుయోధనుం గని యకుంఠితనిశ్చయ మై యతండు వ్రా
లినదెస వ్రాల కుండిన బలే మముబోఁటులకుం బ్రియం బగున్. 97

వ. అని పలికి నిట్టూర్పు నిగిడించి. 98

క. దైవంబ నేర్చుఁ గా కిటు, వోవఁగ నే నేర్తు నేరఁ బొమ్మని పలుకం
గా వశమె నరున కెక్కుడు, దైవము పౌరుషముకంటె ధరణీనాథా. 99

వ. అనిన విదురునకు వైచిత్రవీర్యుం డిట్లనియె. 100

తే. ధర్మపథమును నీతితత్త్వంబు తెరువు, నిర్మలము లగుపలుకుల నీవు నాకుఁ
దెలియఁ జెప్పితి పరమార్థదృష్టి యెట్టి,వాక్యములఁ గల్గుఁ జెప్పుము వాని ననఘ.

సనత్సుజాతుఁడు ధృతరాష్ట్రునకు నధ్యాత్మతత్త్వంబుఁ జెప్పుట.

వ. అని యడిగిన విదురుం డతని కిట్లనియె నాకుఁ దోఁచినయన్నియు నానేర్చినట్లు నీకెఱింగించితి నత్యంతగుహ్యంబు లగునర్థంబులు పురాణుం డయ్యునుం గుమారుం డగుసనత్సుజాతుండు దెలుప నోపుం గాని యిటమీఁద నాకుం దెలియ దనిన ధృతరాష్ట్రుం డమ్మునీంద్రుండు నాకెంతదవ్వు నీవ యవియునుం జెప్పు మనిన నేను శూద్రయోనిజాతుండ వేదాంతవేద్యంబు లగునర్థంబులు నా కగోచరంబు

1 వెనుకం. 2 కును సమ, రము చేసినఁ గాని చావు రాఁ జనదె. 3 వెలయు దింత.

లమ్మహాత్ముబుద్ధి నే నెఱుంగుదు దేవతలకుం దెలియనట్టివి యాతనికిం దెలియు
నతండు దెలుపం జాలు ననిన ధృతరాష్ట్రుం డతికుతూహలుం డై. 102

ఆ. మనకు నిప్పు డతనిఁ గను తెఱం[1]గెయ్యది, యగుటయును నెఱుంగ ననిన విదురుఁ
డధికభక్తిఁ దలఁచె నాత్మలో నాశ్రిత, వత్సలత్వనిధి సనత్సుజాతు. 103

వ. ఇట్లు దలంచుటయును దివ్యజ్ఞానమాననీయుం డగునమ్మునివరేణ్యుం డాక్షణం[2]బ
పొడసూపిన విదురుం డతనివచ్చుట యుగ్గడించుచు వినయంబున నతని నెదు
ర్కొని దండనమస్కారంబు లాచరించి యున్నతాసనం బిడి యర్ఘ్యపాద్యం
బు లిచ్చి ససంభ్రమంబుగాఁ బ్రత్యుత్థానంబును బ్రణామంబునుం జేసి యున్న
ధృతరాష్ట్రు నతనికిం జూపి విదురుం డిట్లనియె. 104

క. దేవా దేవరకృప నీ, భూవల్లభుఁ డమలతత్త్వబోధక మై సౌ
ఖ్యావహ మగువాక్యచయముఁ, దా వినఁ గోరుటయు [3]మిమ్ముఁ దలఁచితి భక్తిన్.

వ. మీరును గారుణ్యాతిశయంబున విజయంచేసితిరి గురుసమాశ్రితు లగువార లె
ద్దానివలన సుఖదుఃఖంబులు లాభాలాభంబులుఁ బ్రియద్వేషంబులు నాదిగాఁ
గలద్వంద్వంబులం బడక బ్రదుకుదు రట్టిపరమార్థోపదేశంబున నితనిం గృతా
ర్థునిం గావించి రక్షింప వలయు నని ప్రార్థించినం బార్థివుండును దదనురూపం
బులగు నాలాపంబుల నారాధించినం బ్రసన్నుం డై సనత్సుజాతుం డధ్యాత్మ
విషయంబు లగువివిధవాక్యంబుల సోపానప్రకారంబున నంత కంతకు సూక్ష్మం
బు లగు నర్థంబులు సమర్థించుచు నందుఁ బ్రజ్ఞాచక్షుం డెయ్యది యేర్పడ నడి
గె నదియెల్ల వివరించుచు హృదయపుష్కరకలితం బగుపరతత్త్వంబు ప్రసా
దించునట్టి గూఢోక్తులను గ్రహించుచుండ నెట్టకేలకుఁ బ్రభాతం బగుటయు
ధృతరాష్ట్రవిదురుల నామంత్రణంబు సేసి యద్దేవముని యంతర్ధానంబు నొందె
నట్టిసమయంబున. 106

### ప్రాతఃకాలవర్ణనము.

తే. తనకులంబునఁ బుట్టినధార్తరాష్ట్రు, లన్నదమ్ములతో విగ్రహంబు గొనుట
కుమ్మలించి వివర్ణత నొందినట్లు, గంది యెంతయుఁ జెలు వేదెఁ జందురుండు.

క. కుముదములుఁ దారు నొక్కటఁ, బ్రమదంబున నుండి నానిపదవి [4]దొలఁగినం
దమకున్ నిలువఁగఁ దగ దను, క్రమమునఁ జనునట్లు తారకంబులు విరిసెన్.

ఉ. ఎత్తినవేడ్కఁ గంధరము లెత్తి మొగంబులు సాఁచి చూడ్కులం
జిత్తములున్ నిగిడ్చి తమచెందెదునిక్కలు రోసి యింపుద
ళ్కొత్తఁగ నొక్కచో నొకటి నొక్కటి గాంచి మెలర్చు [5]కాయ్యూలం

1 నెయ్యది, యనుటయును నెఱుంగ దనుచు విదురుఁ; యనినఁ గాంచు వాఁడ ననుచు
...నురుఁ... శాశ్వత, వత్సలత్వ. 2 బు. ప్రత్యక్షం బై పొడసూపిన. 3 నాత్మఁ. 4 దొఱఁ
...నన్. 5 చెయ్యూలన్; కాన్పలన్,

జిత్తజుకేళిఁ దేలె విలసిల్లుచుఁ జక్కవదోయి వేకువన్. 109

మ. మునుసౌరభ్యము [1]నివ్వటిల్లఁగ మనోమోదంబునం దేఁటుల
ల్లన యోలిన్ వెడలంగ రేకులు సముల్లాసంబునన్ బింక మె
క్కన్ నయం బెక్కుచు గ్రద్దెపాం దెడలి వీఁకం గేసరంబుల్ గడ
ల్కొనఁ దోడ్తో మధు వుచ్చి పేరెల్మిఁ బొల్పుం జెందె నంభోజముల్. 110

చ. వెడవెడ నిద్రవోంది కను విచ్చినపాంథులమీఁద దాడివోఁ
దడఁబడ నొండొరుం బిలుచుదర్పకుపంపుబలంబులోనియ
ల్కుడుకరణిం జెలంగె శుకకోకిలభృంగతతుల్ వనంబులం
దెడనెడఁ [2]బల్కఁ గూయ సొగియింపఁగ మ్రోయఁగఁ దద్విరావముల్. 111

సీ. పద్మపరాగంబుఁ [3]బరఁగించు నరుణోద,యంబుకాంతికిఁ జెలువంబు మిగులఁ
బరువంబు దప్పినవిరుల రాలుచుఁ దరు, చయము చుక్కలు లేనిచదలఁ జెనయ
నరవిరి నెత్తావి నడరించు నున్నిద్ర, విటపీటిసౌరభవితతి వొదల
నెలఁత చీఱినయెఱకలనెఱిఁ దీర్చు జ, క్కవలు చందోయి కేఁకట యొనర్ప

ఆ. [4]వెలరువాఱుదీవియల నల్ల నల్లార్చు, సోర్ణగండ్లయందుఁ జొచ్చి సుడిసి
తిరిగి వేగుఁబోక తెమ్మెర లెలదీఁగ, కొనలవంక లొత్తు ననలఁ బ్రోచు. 112

ఆ. అంత నుదయశైల మనునశోకద్రుమ, సమితియందుఁ గాంతిచారుభంగి
[5]నెఱయ విరిసి తొలుత నెగసినయుజ్జ్వల, స్తబక మనఁగఁ బద్మసఖుఁడు వొడిచె.

సీ. ఉర్వీధరంబుల నొప్పెడుజేవుఱుఁ, జఱులకాంతికి నునుమెఱుఁగు వెట్టి
ధరణీజగుల్మలతావితానముపల్ల, వములకుఁ [6]గట్టెఱ్ఱవన్నె యొసఁగి
యరుణాంబుజంబులయంతర్దళంబుల, తళతళ యనుజిగి దళముకొల్పి
చక్రవాకద్వయసంతతిమెఱకల, గొమరారుకెంజాయ గ్రొత్త సేసి

ఆ. తనదుబాలబింబ మనుపమేయప్రభా, పటలజటిలగగన[7]భాగ మగుచు
నుల్లసిల్లి జగము లెల్లను విలసిల్లఁ, బూర్వశిఖరిమీఁదఁ బొడిచె నినుఁడు. 114

వ. ఇట్లు సూర్యోదయం బగుటయు ధృతరాష్ట్రుండు దత్కాలోచితాచారంబులు నిర్వర్తించి తగుతెఱంగున నలంకృతుం డయి యాస్థానమండపంబున కరిగి పేరోలగం బిచ్చినఁ గుంభసంభవకృపకృతవర్మాశ్వత్థామకర్ణాదు లగుదొరలును భీష్మవిదురబాహ్లికసోమదత్తభూరిశ్రవఃప్రభృతు లగుబంధుజనులును దుర్యోధనదుశ్శాసనప్రముఖు లగుకుమారులును లోనుగాఁ గలసమస్తపరిజనంబులును వచ్చి బలసి యుండి రయ్యవసరంబున సంజయుండు వచ్చి వాకిట నిలిచి పణిహారుల

1 నివ్వటిల్ల సుమనో...జిక్క మె,క్క...బెక్కుచు గ్రంచె (దండు)పాం దెరలి వీఁగం ...మధు వుబ్బ...బొల్పొందెం సరోజాతముల్. 2 బల్కుఁ గూయ...యింపుఁగ. 3 బచరించు. 4 తెల్లవాఱుమన్న దివియ లల్లార్చుచు. 5 నెఱయ మెఱసి. 6 కట్టెఱ్ఱనఁ బన్నొసఁగి. 7 భాగుఁ డగుచు.

వలనఁ దన్నెఱింగించి పుచ్చి చొచ్చి సముచితప్రదేశంబునఁ గూర్చుండి తనమాటలు వినుటకుఁ జిడిముడిపడుచున్నకొలువుఁ గలయం గనుంగొని యిట్లనియె.

సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ బాండవుల తెఱంగు సెప్పుట.

తే. పాండురాజతనూజులపాలి కర్థి, నిమ్మహారాజు పనుపంగ నేఁగి ధర్మ
పుత్త్రుఁ గాంచితి నాతండు మైత్త్రి మెఱయఁ, గౌరవులసేమ మెల్ల[1] బేర్వేరనడిగె.

వ. మఱియుం దగువారల నెల్ల నయ్యయియుచితవిధిం బ్రణామంబున వినయంబున బాంధవంబున మిత్త్రభావంబున వాత్సల్యంబునఁ బ్రసాదంబున నాదరించె నేనును భూనాథుండు గఱపిన తెఱంగునఁ గొఱంతలేకుండ బంధుత్వంబునకు వలయుమాటలాడితిఁ బదంపడి కార్యంబు ప్రసంగించి నాయాడినమాటలకు నయ్యుధిష్ఠిరుండు పలికినవచనంబు లింతయొప్పునే యని యగ్గించినధృతరాష్ట్రుం డవహితుం డై యడుగఁ దా నయ్యుధిష్ఠిరునకుం జెప్పినభంగులు నతండు వానికి నెల్ల నుత్తరం బిచ్చినతెఱంగును నెఱింగించి ధృతరాష్ట్రునకుం బితామహునకు దుర్యోధనునకుం గ్రమంబున వారివారితో నాడు మని నియమించినచందంబులు ధర్మనందనుపలుకులపరిపాటిం దేటపడం జెప్పి సూతసూనుండు వెండియు నిట్లనియె. 117

తే. ఏ నుపప్లావ్యపురమున కేఁగి తొలుత, వాసుదేవార్జునులఁ గంటి వారు[2] నీతి
పథము దప్పనిమాటలు బలిమిఁ దోఁచు, నట్లుగా నాడి రవి వినుం డాదరించి.

వ. అనిన విని ధృతరాష్ట్రుం డవ్వాసుదేవుచిత్తం బెట్లు తం డే మనియె నని యడిగిన నతనికి సంజయుం డిట్లనియె. 119

ఉ. తానును సత్యభామయును ద్రౌపదియుఁ నరుఁడుఁ రహస్యగో
ష్ఠీనిరతాత్ముఁ డై సుతులుఁ జేరనిచెందనియట్టిచోటఁ గాం
తానివహంబు గొల్వఁ బ్రమదస్థితి నుండియుఁ బిల్వఁ బంచె న
న్నానలినోదరుండు హృదయంబున నీదెసకూర్మి యెట్టిదో. 120

వ. ఏనును దత్ప్రాకారంబు పణిహారులవలన మున్న యెఱింగినవాఁడ నగుటం జేసి గంచుకంబును శిరోవేష్టనంబును ధరియించి వినీతవేషుండ నై పోవునప్పుడు కృష్ణార్జును లనేకమణిమయభూషణప్రభాభాసితు లై యొక్క సెజ్జన యున్నవారు కృష్ణుండు పవ్వళించి యుండి చాఁచినచరణంబులు దొడలపై నిడికొని యర్జునుండు గూర్చున్నవాఁడు సత్యభామయుం బాంచాలియు గద్దియలపై నున్నవారు సవినయంబుగా నేనును దండప్రణామంబు నేసిన నన్నాదరించి కృష్ణునిచేసన్న నర్జునుపనుపునం గనకరత్నమయం బగునతనిపాదపీఠం బతండు వేర్చినకాళ్లు దిగిచికొన నిద్దఱుముద్దియ లెత్తి తెచ్చి నాకుం బెట్టిన నేనును దానిం గరతలంబున నంటుచు ధరణీతలంబునఁ గూర్చుండి కేలు మొగిడ్చి ఫాలతలంబునం గది

1 వేర్వేర నడిగె. 2 ప్రీతి, పథము...డాదరమున.

యించి నీలవర్ణులు బాహుబలమదభరితులును నయి [1]యేనుఁగుదోయియుంబోలె నున్నయమ్మాధవధనంజయులఁ జూచునప్పుడు నాకు హర్షాశ్రుపులకలును దద నంతరంబ భయంబునుం బుట్టె నట్టియెడ. 121

క. ఈయిరువురుఁ బంచినపని, సేయుదు రటె ధర్మజునకుఁ జేకుఱనితలం
పేయది యతనిం దొడరుట, వేయేటికి జమునిశిరము వ్రేయుట గాదే. 122

వ. అని తలంచుచుండ నమ్మహానుభావులు నన్ను సంభావించి తా రుపయోగించు నట్టియన్నపానంబులను దమకుఁ గట్టఁదగినట్టివస్త్రంబులను దాము దొడుగునట్టి భూషణంబులను నాకుఁ బ్రియం బొనర్చి గారవించిన నేనును నాపోయినకా ర్యంబు విన్నవించిన విజయుండు బలుమొగంబుతో దానికి నుత్తరంబు వలుకం దొడంగినవారించి వారిజోదరుం డిట్లనియె. 123

సంజయుండు ధృతరాష్ట్రునకుఁ గృష్ణుఁడు సెప్పినమాట లెఱింగించుట.

తే. వినుము సంజయ ధృతరాష్ట్రవిభునిపెద్ద
కొలువునందుఁ దత్పుత్త్రులు గురుఁడుఁ గృపుఁడు
నాపగానందనుఁడు మొదలైనసకల
జనులు విను చుండఁగా నిట్టు లనుము నీవు. 124

ఆ. అయ్యజాతశత్రుఁ డలుగుట నీళ్లల, నగ్ని వుట్టినట్టి దయ్యె మీకు
నార్ప వెరవు లేదు నేర్పుమై నింకఁ గా, వింప వలయుపనులు వినుఁడు మీరు.

వ. *అవి యెవ్వి యంటేని. 126

సీ. కలయట్టివివిధార్థములు నశేషంబుగఁ, దగ నొసంగుండు సత్పాత్రములకు
జెలులఁ జుట్టముల నాశ్రితులను రావించి, సత్కరింపుఁడు సంతసం బెలర్ప
నిచ్ఛానుగుణముల నింద్రియసుఖముల, ననుభవింపుఁడు హృదయంబు లలర
నాండ్రను బిడ్డల నయ్యైవిధంబుల, గారవింపుఁడు [2]ప్రియపూరితముగ

తే. మఱియు నెవ్వారిచిత్తమెత్తెఱఁగునందు,వాటమై యుండునదియెల్ల వలయునట్లు
సేసి విహరింపుఁ డిం కెడసేయ [3]కనికి, నడవుఁ డఱచేతఁ బ్రాణంబు లిడికడంగి.

వ. అని చెప్పు మింత యేమిటి కంటేని. 128

ఉ. ఎందును నెవ్వరుం బడనియెంత[4]యుఁ గష్టముపాటు వచ్చినం
గొందల మంది పాండువిభుకోడలుదవ్వుల నున్ననన్ను గో
విందుఁడ కావు మంచుఁ బలవించుట యీఁగఁగ రానియప్పఁబో
లెం దలపోయ వ్రేఁగయి చలింపక యున్నది యెప్పుడుఁ మదిన్. 129

తే. ఇట్టియేఁ దేరు గడపంగ నెందు నుతికి, నెక్కుగాండీవ మేత్తెఱ నెక్కువెట్టి
రెండుదొనలును బూని కిరీటి యనికి,వచ్చు నేఁ డెల్లి యెందుఁ బోవచ్చుమీకు.

---

1 యేనికదోయి. * ఈవచనము కొన్నిప్రతులయందు గానుపించదు. 2 ప్రియపూర్వ కముగ. 3 కునికి. 4 యుఁ గష్టపుపాటు ; నికృష్టపుపాటు.

వ. అని పలుకునప్పటివారియెత్తికోలును నీకొడుకువిడు పోపమియునుం దలంచి భయం బందితి నితండు వారల నెఱుంగండు భీష్మద్రోణులప్రాపును గర్ణుగర్వం బును దన్నుఁ గెలిపించు నని నచ్చి తొడరెడు ననిన విని ధృతరాష్ట్రుం డర్జును డే మనియె నని యడిగిన నతనికి సంజయుం డిట్లనియె. 131

క. నరుఁ డలుక [1]వాఁడమియును సు, స్థిరుఁ డై తనయెత్తుసెరలచెలువునఁ గెందా మరలం దెగడెడుకన్నుల, నరుణచ్ఛవి నెఱయ నిట్టు లనియె నరేంద్రా. 132

ఆ. ఆసుయోధనుండు నతనికిఁ దోడ్పడ, [2]నరుగుదెంచినట్టి ధరణినాథ
చయము వినుచు నుండ సంజయ నావచ, నములు గాఁగ [3]నీ వనంగ వలయు.

ఉ. పాండునియగ్రనందనుఁడు పా లడుగం దగ నీఁడయేని మా
కొండన నేల మే లది సుయోధనుఁ డింతకు మున్ను పెక్కు లు
[4]ద్దండతఁ దాను జేసినవిధంబుల కెల్ల మెఱుంగు వెట్టిన
ట్లుండెడుఁగాక యేనును వృకోదరుఁడుం బ్రియ మందునట్లుగాన్. 134

క. మాయిరువురతోఁ గయ్యము, సేయ నతం డియ్యకొనిన సిద్ధించెన కా
దే యుచితచరితుఁ డగుకొం, తేయాగ్రజుకార్య మట్టితెఱఁ గొప్పుఁ గదా.

క. వనవాసంబున భూశ, య్యను ధర్మజుఁ డున్నయట్టియాయాసము వో
వునె యంపశయ్య దుర్యో, ధనుఁడు రణక్షోణిఁ బడక [5]తక్కినయేనిన్. 136

ఉ. సూనృత మూఁది బన్నములు సూడక లోన నడంచి నట్టికో
[6]పానల మెండి యున్ననిబిడాటవిపైఁ బచరించుతీవ్రదా
వానలుఁ బోలి శాత్రవచయంబుపయిం గవియించి నిల్చినం
గాని యుధిష్ఠిరుణ్ సరకుగాఁ గొన రాధృతరాష్ట్రనందనుల్. 137

మ. గద సారించుచు నంత్య[7]కాలవిచలత్కాలాకృతిణ్ భీముఁ డు
న్మదమాతంగచయంబు నుగ్గు గ లసన్నానారథవ్రాతముల్
చదియణ్ భూరిహయవ్రజంబు పొడిగా సంరంభతుంగాంగుఁ డై
కదియం [8]జూచి బలే సుయోధనుఁడు భాగం బిచ్చు రాజ్యంబునన్. 138

సీ. కోల్పులి వీఁకమై గొదగొని లేళ్లకు, నుఱుకు తెఱంగునఁ దఱియఁ జొచ్చి
పెనుగాలి జీమూతబృందంబుపై బెట్టిదంబుగ వీఁచుచందమున నడరి
కసిమసంగినమారి గడఁగి జీవులమీఁద, నుగ్రతఁ గవియున ట్లురవడించి
యాఁకొన్నలయరుద్రుఁడాగ్రహంబునజగ, త్ప్రచయంబుము ట్టెడుభంగిఁ బొదివి

---

1 వాఁడిమి కడు...చెలువుగఁ. 2 నరుగదెంచినట్టి యవనినాథ. 3 ని ట్లనంగ వలయు. 4 ద్దండత నాచరించె భుజదర్పము నేత్రమజూపి యాతఁ డొ, క్కండ కులక్షయంబునకు గారణ మయ్యెడు దప్ప దయ్యె నీ, వాం డననేల యాబిరుదు నోపిన యంతయుఁ దీర్ప నేర్పగాణ్. ట్లీపద్యము పంచపాదిగఁ గనవట్టుచున్నది. 5 తక్కిన నెంమణ్; నెట్లుణ్. 6 పానలుఁ బండియున్న. 7 కాలవిలసత్కాలాకృతిణ్. 8 జూచి కథా.

తే. నకులుఁడును దదనుజుఁడు సాత్యకియు నాను,భద్రకాదుకును నెదిరినబలమునెల్ల
బెదరఁ జెదర బడల్పడఁ [1]బెల్లు సావఁ, జేయఁ గని కౌరవులు సంధిసేయువారు.
ఉ. చిత్తము లుల్లసిల్ల [2]నలసింహకిశోరము లొక్కమై మదో
న్మత్తగజావళిం బొదువుమాడ్కి నరాతిబలంబు ముట్టి యు
ద్వృత్తిఁ గడంగి యప్రతిమవీరులు ద్రౌపదిపుత్త్రు లేవురుం
నెత్తురనీరఁ దేల్చిన ననిం గని మీనృపుఁ డల్క దీఱెడిన్. 140
మ. చెలులుం జుట్టలు నిష్టభృత్యులు మహోజం బ్రాణముల్ డాఁప కు
జ్జ్వలులై తోఁ నడవన్ విరాటుఁడును బాంచాలుండు [3]నేపారి సే
నలయుద్రేకము రౌద్రముం బెనుప నానాహేతిఘోరంబుగాఁ
దలపడ్డం గని గాక స్రుక్కుదురె గాంధారీసుతుల్ మాటలన్. 141
చ. తఱిమి శిఖండి దన్నొరులు దాఁకఁగ నెవ్వరిదిక్కుఁ జూడ కే
డ్తెఱఁ [4]దనపూన్కిపై మనము ధీరత నిల్పి రథంబు బల్విడిం
బఱపి కురుక్షితీశుఁ డనుబ్రహ్మకు వేయును నిండ భీష్మపై
కుఱికినఁ గాక మాకు నగ మూరక యిత్తురె మీరు మేదినిన్. 142
శా. విద్యుద్దండము నిల్చి పొల్చినగతిన్ విల్లంద మై యుండ న
స్మద్యోధావలిమానసంబున రణోత్సాహంబు రెట్టింప ధృ
ష్టద్యుమ్నుండు గడంగి ద్రోణుఁ గడిమిన్ డాయంగ వీక్షించి కా
కుద్యోగించుట కేల తక్కుదురు మీ రుగ్రాహవక్రీడకున్. 143
సీ. గాండీవగుణరవం బొండొండ చెలఁగంగ, శరపరంపర లాకసంబు గప్పఁ
బ్రతివిశిఖములు ఖండితములై రాలంగ, నెదిరి సైన్యంబుల మదగజాది
చతురంగములును జర్జరితంబులై యవ, యవభేద మెఱుఁగనియట్లు గాఁగఁ
[5]దునిసిన నెత్తురు నెనడును నెమ్ములు, నెఱచియుఁ గండలు నెనసి సమర
తే. తలము ఘోరంబుగాఁ గపిధ్వజము ధవళ
హరులు శోభిల్ల నొగలపై హరి యెలర్ప
దేవదత్తంబు మ్రోయఁ దోఁతెంచునట్టి
రథముఁ గని కాని [6]కానఁడు రాజరాజు. 144
శా. బాలక్రీడమహాసురప్రకరమున్ భంజింపఁడే యెప్పుడుం
ద్రైలోక్యంబును భక్తియుక్తిఁ దగ నారాధింపదే యట్టిశౌ
ర్యాలంకారు మహాత్ముఁ దా సరకుసేయం [7]డచ్యుతున్ మమ్మతం
డేలా కైకొను నాసుయోధనునియం [8]దెగ్గది యూహింపఁగన్. 145

---

1 చెల్లునడఁగ ; బెల్లగిల్లఁ. 2 ఘన (వర) (నర) సింహ. 3 నేపారు. 4 దనపూన్కి-మై...బల్విడిం, బఱపి...బ్రహ్మకు నూరును. 5 దునిసి నెత్తురు గ్రొవ్వు మెదడును. 6 మానఁడు ; పాలీఁడు. 7 దుర్మదుం. 8 దెగ్గమి ; దేనీతి యూహింపఁగాన్.

వ. ఏము పితామహగురుకృపాచార్యులకు నమస్కరించి యస్మదీయరాజ్యభాగంబు
నకై తొడరి కయ్యంబు సేయువారము కౌరవులకుం బూని యెవ్వరేమాతోఁ
బెనంగినను వారిశస్త్రాస్త్రంబులు ధర్మప్రతిహతంబు లగు నని తలంచెదము పం
డ్రెండు వత్సరంబులు వనంబున నమ్మెయి నిడుమలం బడి జనపదంబున్నం బదు
మూఁ డగు నేఁ డజ్ఞాతవాసాయాసం బట్లనుభవించివచ్చి మాతండ్రిపాలికిం బె
నంగుమమ్ము నింద్రాదిసురసహాయు లయ్యును ధార్తరాష్ట్రులు గెల్చువారై
రే ని ధర్మంబుకంటె నధర్మము బలవంతం బైనయది యగు నింతియ కాని
మాచేయునట్టిది గీడైనది గాదేము వాసుదేవుని మున్నిడికొని నడతుము
గావున నీయుద్ధంబున జయంబు మాకు సిద్ధంబ యెల్లభంగులం గర్ణసహితంబుగా
గాంధారీనందనులందునిమి యేము భూమి గొనుట దప్పదు గాండీవంబు దివియ
కయును గుడుసువడియెడు బాణంబులు దమయంతన తూణీరంబుల వెడలెడుఁ దో
లూడ్చుమహానాగంబునుంబోలెఁ గరవాలంబు దాన [1]యొఱ వెఱికి నిగుడుచున్న
యది గావున మా కవశ్యంబును సంగరంబు సంభవించుఁ బాశుపతాదిదివ్యశరం
బులం గురుపక్షప్రజాక్షయంబు సేసి శాంతిం బొందెదము సూతనందనా
నీవు సుస్థిరుండవై యింతయుం దెలియం బలుకవలయు నిమ్మాటలు విని కురు
వృద్ధుం డగు బాహ్లీకుండును బితామహుం డగుభీష్ముండును గురుం డగుకుంభ
సంభవుండును శిక్షకుం డగుకృపాచార్యుండును గురుపుత్త్రుం డగునశ్వత్థామయు
సద్బుద్ధి యగువిదురుండును ధర్మాచరణకల్యుం డగుశల్యుండును నెయ్యది నిశ్చ
యించి పలికి రది యయ్యెడు సుయోధనాదు లాయుష్మంతు లగువార కాక
యని పలికె నని చెప్పిన విని మందాకినీనందనుం డందఱు విన దుర్యోధనున
కిట్లనియె. 146

సీ. నలినగర్భుఁడు పెద్దకొలువున నున్నెడ, సురపతిప్రముఖులచూడ్కు లెల్ల
మెఱయు తేజంబున మిఱుమిట్లు గొన నిద్ద, ఱచ్చట నొరసికొం చరుగఁ జూచి
వీ రెవ్వ రిమ్మెయి మీ రుండ నరకు నే, యనియట్లు వోయెడునట్టివార
లని బృహస్పతి బ్రహ్మ నడిగిన నతని కి, ట్లనియె నాచతురాస్యుఁ డాదరమునఁ
తే. దపము పెంపును బలశౌర్యదర్పములును, గలిగి లోకహితార్థంబుగాఁ జరింతు
రేయుగంబుల నరుఁడు నారాయణుండు, ననఁ బ్రసిద్ధికి నెక్కినమునులు సుమ్ము.

వ. అని పలికి వెండియు. 148

క. అనిమిష[2]హితము దనుజనా, శనమును జేయుదు రధర్మసంగ్రామము గ
ల్గినచోట ధర్మపరు లగు, జనముల గెలిపింతు రధికసంరంభమునన్. 149

వ. దేవాసురయుద్ధంబునప్పు డింద్రుండు వోయి వీరి నారాధించి తో డడిగినం జను
దెంచి పౌలోమకాలకేయాదు లగు ననేకదైత్యదానవులం జంపి యింద్రునకు

1 యొఱ వెలికి. 2 జయము.

విజయంబు గావించి రది మొదలుగా వీరల నెల్లవారలు నెఱింగి యుండుదు
రిది యొక్క తేజంబ రెండుదెఱంగు లై వెలుంగు చుండునని చెప్పె వినోదార్థంబు
జన్మాంతరంబు నొందినయమ్మహాత్ములు గదా యీయర్జునుండును వాసుదేవుం
డును. నర్జునుండు సముద్రతీరంబున హిరణ్యపురంబువాడిచి నివాతకవచుల నఱు
వదివేవుర నిర్జించి పర్జన్యునకుఁ బ్రియంబు సేసె వాసుదేవుపరాక్రమంబు గంస
నరకాసురప్రముఖనిఖిలదుష్టనిగ్రహంబునం బ్రసిద్ధంబు గాదె తెలియ విను
మున్నరూపు సెప్పెద. 150

క. ఆయిరువురు [1]నొకతల యై, యాయోధనమునకు నడచునట్టిద యేనిన్
వే యేల మనమకా దెదు, రై యేడ్తెఱఁ దాఁక హరునకైనను వశమే. 151

క. సారథియు రథియు నై యొక, తేరం గృష్ణు లతిఘోర[2]తేజస్సార
స్ఫారతఁ దోఁచిన నైనను, ధీరత వాటించి చూచి తెలిసెదవు బలే. 152

వ. అనుచు నాసుయోధను నుపలక్షించి శాంతనవుండు మఱియు నిట్లనియె. 153

క. మది నామాట కొకింతయు, [3]బెదర వకార్యంబునందుఁ బ్రియము గలిగి యుం
డుదు కౌరవులకుఁ గాలము, తుదిమోకా కిట్టిగర్వితుని నే మందున్. 154

తే. [4]హితము లగునాదువచనంబు లిపుడు వినని, వాఁడవై తేని నప్పుడు వారు వడిరి
వీరు వడి రనుపలుకులు విందు గాక, శకుని కర్ణదుశ్శాసనుల్ సమ్మతింప. 155

వ. దుష్టకష్టనికృష్టాత్ము లగునిమ్మువ్వురుఁ జెప్పెడుబుద్ధులు గాని యొండు విన నొల్ల
వేమి సేయ వచ్చు నని పలికినం [5]గానీనుండు గనలి గాంగేయున కిట్లనియె.

ఆ. ఇట్టు లాడఁ దగునె యే నేమి సేసితిఁ, గొలిచి కుడుచుపాడి నలవుఁ జలముఁ
బలుకు టెందు నెగ్గ పతికిఁ బుత్త్రులకును, మనుమలకు హితంబ యొనర నడతు.

క. కాని తెఱఁ గైన నింతటి, మానిసిఁ గా నేల చేయు మనుజేంద్రుఁడు న
న్నీనెఱి దప్పినమాటలు, నీనోరన్ వెడలఁ దగునె నిండినసభలోన్. 158

వ. అనిన విని భీష్ముఁడు ధృతరాష్ట్రున కిట్లనియె. 159

భీష్ముఁడు గర్ణునిదుర్నయంబు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట.

తే. ఒకట నైనను వారియం దొకరిలోని, [6]చిదురపాలును బోలండు సిగ్గు లేక
పాండవుల గెల్తు నే నని పలుకు చుండు, వీనిరజ్జులు దులువలు విండ్రు తగిలి.

క. మగఁటిమి వారికి వీఁ డెదు, రుగ నమ్మి [7]సుయోధనుఁడు విరోధము గొని స
ర్వగుణాఢ్యులు బలవంతులు, నగుపాండునృపాలసుతుల నవమానించెన్. 161

---

1 నొకతలఁపున. 2 తేజోవిభవ... తెలిసెద వీవున్. 3 బెదరవు కార్యంబు...గలిగి యుం, డదు గౌరవులకు. 4 హితముగల నాదు. 5 గానీనుండు కడకటం బడి గాంగే. 6 చిఱుతవానిని,..,తులువలు వినుచు నుండ్రు. 7 సుయోధనుండు రోషము గొని.

ఉ. ఒక్కఁడొకం డనేక[1]విధయుద్ధజయంబులు గొన్నవారు వా
రెక్కడ నేమి సేసె నితఁ డీతనితమ్మునిఁ గూల నేసి యు
క్కెక్కినపార్థుపైఁ గవిసెనే పసు లాతఁడు గ్రమ్మఱింపఁగా
నక్కడ లేఁడె వీఁడు భవదాత్మజుఁ గొల్వఁడె ఘోషయాత్రలోన్. 162

వ. ఈదుర్జాతుండు గర్జం బెఱుంగక నీతిబాహ్యుండై వలసినట్లు ప్రేలరిమాటలాడు చుండు నీవునుం గైకొని విను చుండుదువు మేల కాక యనిన భీష్మపలుకులు విని ద్రోణుం డమ్మహారాజుతో ని ట్లనియె. 163

ఉ. శాంతనవుండు సర్వకురుసంతతికిం గలవాఁడు గాఁడె య
త్యంతహితంబు లీపలుకు లాహవ మొప్పదు ధర్మసూతితోఁ
బొంతువ మేలు దేవపతిపుత్త్రుఁడు సంజయు[2]తోడ నాడిన
ట్లంతకు నోపు మీకుఁ దెలియం దగు ఖాండవదాహ మాదిగాన్. 164

ఆ. శరశరాసనములు [3]ధరియింప రెట్టు లె, వ్వరును మగతనంబు వలనుఁ గలిగి
కయ్యమున జయంబు గైకొనరే యొరు, లర్జునుండ విజయుఁ డనఁగ నెగడె.

క. మనవీటన కా దయ్య, ర్జునునకు [4]సరివింటివానిఁ జూడఁగ లోకం
బున నెందు లేమి దెల్లం, బనుమానము లేదు తోడర నగునే వానిన్. 166

వ. అని చెప్పి యప్పాటం బరమహితోపదేశంబు సేసిన భీష్మద్రోణులపలుకు లాదరింపక వారికి సదుత్తరంబు లీక వారలతోడం దదనురూపంబుగా సంభాషింపక ధృతరాష్ట్రుండు వెండియుఁ బాండవులవలనివార్త లడుగుటకు సంజయుదిక్కు మొగం బైనం జూచి కురుపక్షవీరు లందఱుఁ బ్రాణంబులదెస నిరాశులై యుండి రమ్మహీపతి సంజయునితో ని ట్లనియె. 167

తే. ధర్మపుత్త్రున కిక్కడి తలఁపుభంగి, యెట్టు [5]లుండు నీసైన్యంబు లెల్లఁ గూడి
యునికివిని యెనే యెవ్వరిఁగొనియతండు, కౌరవులమీఁద నెత్తిరాఁగలుగువాఁడు.

వ. అనిన విని సంజయుండు వెచ్చ నూర్చి ఱిచ్చవడి మూర్ఛ వోయినచందంబున డెందంబు మొగుడం జేష్టలు దక్కి యుండి కొండొకసేపునకుఁ జిత్తం బొక్కింత సేసికొని యక్కటా యీభూపాలుం డింత వేల యగునే యుధిష్ఠిరుం డెవ్వరిఁ గొని యెత్తివచ్చువాఁ డని యడుగుచున్నవాఁ డింత యెఱుంగనివాఁ డెంత సెప్పినను దెలియ నేర్చునే యితనిభంగి యిట్టి దనినఁ గొడుకుల తెఱంగు వేఱ యెన్న నేల యే నింక నే మనువాఁడ నైనను న న్నడిగినమాటకుం దగిన మాఱుమాట వలుకవలయున కాదె యని తలంచి ధృతరాష్ట్రున కి ట్లనియె.

1 విధయుద్ధములందు జయంబు గొన్నవా ... (పసి) గొల్వఁడె. 2 తోడ నాడె నెం, ...తకు. 3 ధరియింప రెవ్వరు, మగతనంబు దలఁప మిగులఁ గలిగి; వలన మిగిలి. 4 బ్రతివింటి ...నిఁ జూపఁగ లోకం, బున లేమి నాకు దెల్లం. 5 విందుల సైన్యంబు లెల్లఁ ... రాఁగలఁడు ...డఁగు) వాఁడు.

చ. వినుము నరేంద్ర పాండుపృథివీపతి యగ్రసుతుండు సంధి సే
యన మదిఁ గోరు మీరు తమయయ్యసగంబును భూమి యీక త
క్కిన మఱి కాని ముంద రొకకీడుఁ దలంపఁడు మీబలంబు నె
ల్లను మదిఁ జీరికిం గొనఁడు లావున నేలఁ గొనం దలంచినన్. 170

వ. అతం డెవ్వరిం గొని యెత్తివచ్చువాఁ డని యడిగితివి నీ యెఱుంగనివార లం
దెవ్వరు గల రవధరింపుము. 171

మ. బకవిధ్వంసి జటాసురాంతకు హిడింబప్రాణహారిణుఁ గీ
చక నిర్మూలనకేళిలోలు సమరోత్సాహైకశీలప్రవ
ర్తకు నాగాయుతసామ్యకీర్తితబలోదగ్రుం బ్రతివ్యూహదా
హకు భీముం గొని వచ్చు ధర్మజుఁడు బాహాటోపముం జూపఁగన్. 172

వ. మఱియును. 173

మ. అట మి[1]న్నందినయట్టివానిపొడ వెం తన్నట్లు ఫాలాక్షు నె
క్కటికయ్యంబునఁ గన్న ఫల్గునుభుజాగర్వంబు లెక్కించు టం
తటివానిం గొని ధర్మసూతి సమరోత్సాహంబుమై నెత్తి వ
చ్చుటకుం గొంకునె పేఁపు నక్క నయి నిల్చుం గాక మీసైన్యముల్. 174

తే. నకులు సహదేవుఁగొని ధర్మనందనుండు, మొనసి కౌరవబలములమ్రుట్టికొనఁగఁ
దలఁచి తఱి వేచి వచ్చుట ధరణినాథ, సింగములఁ బట్టి వేఁటాడుభంగి గాదె.

తే. ద్రౌపదేయులు నాసుభద్రాసుతుండు
నుక్కుతునియలు గారె మిమ్మక్కుమీర
వరులఁ గొని యోర్చువాఁ డయి వచ్చు ధర్మ
పుత్త్రుఁ డిది నీకుఁ జూడంగఁ బోల దెట్లు. 176

వ. అని చెప్పి వెండియు నిట్లనియె. 177

క. వృష్ణికుమారోత్తముఁ డా, కృష్ణునితమ్ముండు సాత్యకియు దవదహనా
త్యుష్ణ[2]ప్రతాపమూర్తులు, కృష్ణాసోదరులు దలఁపఁ గేవలులె నృపా. 178

సీ. శౌర్యోజ్జ్వలుండు పాంచాలభూనాథుండు,మహితవిక్రముఁ డగుమత్స్యవిభుఁడు
నధికధైర్యాన్వితు లతనితమ్ము లుదగ్ర, తేజస్కులైనతదీయసుతులు
[3]నన్నదమ్ములు ప్రతాపోన్నతు లేవురు, కేకయపతులు నక్షీణబాహు
శక్తి యుక్తులు జరాసంధసూనుఁడు సహ, దేవుండు నాజయత్సేనవిభుఁడు

తే. వినుము శిశుపాలతనయులు వీరధనులు, ధృష్టకేతుండు వృషభుండుఁ దీవ్రరణవి
నోది యదుభర్త చేకితానుండు దర్ప, ఘనుఁడు శైబ్యనృపాలుండుఁ గలరుగాదె.

---

1 న్నందినయంతవాని... లెక్కించు నంతట; లెక్కింత మంతట; లెక్కింపు మంతట; ట్టించు నంతటి. 2 ప్రకారమూర్తులు; ప్రతాపదీప్తులు. 3 తమ్ములు నుగ్ర ... యుక్తుఁడు

క. వీ రెల్లఁ బాండురాజకు, మారులపాటునకుఁ [1]గుందుమనములతోడన్
వారిపగ దీర్పఁ గడఁగెడు, వారల కా కంద లాఁతివారుం గలరే. 180

వ. భీమసేనుసూనుండు ఘటోత్కచుండు దండ్రికంటెను లావును బీరంబునుం గల వాఁడు మాయాబలంబున మనబలంబు నెల్లం గలంచు మఱియును దూర్పున నుత్తరంబునం గలుగునరనాయకులు నానాసేనాసమన్వితు లయి వచ్చి చిచ్చయిననుం బిడికిలింత మనుచున్నవా రదియునుం గాక. 181

క. సకలభువనములు నఱచే, తికిఁ దేరం జాలునట్టిధీమంతుఁడు దే
వకికొడుకు గలఁడు ధర్మజు, నికి నాతం డెత్తి రాక నిలుచునె యధిపా. 182

వ. అని చెప్పిన సూతపుత్త్రునకు నంబికాపుత్త్రుం డి ట్లనియె. 183

ధృతరాష్ట్రుఁడు భీమసేనాదులపరాక్రమంబు దలంచి దుఃఖించుట.

క. వారిదెస నీవు సెప్పిన, యారథికులు ప్రబలు లగుదు రందరు నైనన్
వారెల్లను నొకతల య, మ్మారుతి యొకతల బల[2]ప్రమాణము సూడన్. 184

ఉ. భీముఁ దలంచినన్ మనము భీతిఁ గలంగుచు నుండు నాకు రే
[3]లేమియు నిద్ర రా దతని నేత్తెఱ మార్కొనఁ జాలునట్టివాఁ
డీమొన లేఁ డతం డలుక నెత్తినయాగద కాలదండ ము
ద్దామవిలాసుఁ డై కురుకదంబములో విహరింప కుండునే. 185

తే. చిఱుతనాఁడును వాఁడు నాశిశుఁ బోఁడు, వీరు చివ్వకుఁ జొత్తురు వైర మెత్తి
వానిచేఁ బీడ వడియును మాన రదియ, కాదె యీభేదమున కెల్లఁ గారణంబు.

క. సమరమున [4]దైత్యదానవ, సమితియు నాతని కెదుర్పఁ జాలదు భుజయు
ద్ధమున జరాసంధుని నొక, నిమిషంబునఁ జంపె నొరులు నిలుతురె యెదురన్.

మ. బొమ లల్లన్ ముడివడ్డ రౌద్ర[5]రస ముప్పొంగం దనర్పన్ భుజా
గ్రము లిం దెవ్వఁడు నాకు మా ఱనుచు శౌర్యస్ఫూర్తి శోభిల్ల ను
ద్ధమలీలం గవియంగ భీముఁ గని ధైర్యం బేది కౌరవ్యసై
న్యము లంతంతఁ గలంగఁ బాఱినటు లై నామోమునన్ వ్రేలెడిన్. 188

క. కరవాలము గద మొద లగు, పరికర మేమియును లేక బాహుబలమునం
గరిగతి నడరినను వృకో, దరునకు నొకఁ డెదుర నిలిచి [6]తలపడువాఁడే. 189

తే. ప్రళయకాలసముద్రముభంగిఁ బొంగి, కడు భయంకరుఁ డగుభీముఁ గడవ నీఁద
వశమె నాపుత్త్రులకు విధివశము వొంది, యెదిరిఁ దమ్ముని నెఱుఁగరుమదముకతన.

క. చిచ్చునకుఁ దోడు గరువలి, వచ్చుగతిన్ భీముదుర్నివారవిహారం
బచ్చుపడఁగఁ బ్రాపై వి, వ్వచ్చుఁడు వెస వచ్చు గాండివంబును దానున్. 191

వ. సంజయా వినుము నీకున్న రూపు సెప్పెద. 192

1 గంధమనముల. 2 ప్రమాణము లందున్. 3 యేమియు...ద్దామవిహారుఁ డై...వసి యింప కుండు నే. 4 దేవదానవ. 5 [illegible]

క. ఆయర్జునుమగఁటిమి కెన, యేయుగములఁ జూడ వినఁగ నెందును గలఁడే
నీయెదుర నాడినంతయుఁ, జేయుట కతఁ డోపు రిత్త సెప్పెడువాఁడే. 193

ఉ. [1]ఎక్కటిగాండివంబు నుతి కెక్కి వెలుంగుట మీఁదఁ గేశవుం
డక్కజ మైన తేజ మది యాసపడండు దనంత నర్జునుం
డొక్కఁడ వైరిసేనలకు నొట్టినమంట ప్రతాపమూర్తు లి
ట్లొక్కెడఁ గూడె నిన్నిటిమహోగ్రపువేఁడిమి కోర్వ వచ్చునే. 194

క. దివిజదనుజసహితము లగు, భువనము లన్నిట మహేంద్ర[2]పుత్త్రుఁడు విజయో
త్సవలీలఁ గ్రీడ సల్పుం, దవులంబడఁ డెందు నత్యుదగ్రబలమునన్. 195

వ. అని పలికి వెండియు. 196

క. [3]కురుసేనఁ గదా గెలుచుట, కరము భరం బర్జునునకు గాండీవమునం
బెరిఁగినయమ్ములమంటల, దరికొని తెగఁ గాల్చునట్టిదయ యగుఁ జుమ్మీ. 197

వ. భీమార్జునులకొలందులు భీష్మద్రోణు లెఱుంగునంతకంటె నెవ్వ రెఱుంగుదు రెఱింగియు మానుషంబు వాటించి సేనమొగంబున నిలుతురు కీర్తి వట్టి ప్రాణంబులు విడుతు రింతయ కాని చేయునది లే[4]దదియునుం గాక పౌత్త్రు లగుటయు శిష్యు లగుటయు గాంగేయునకు గురునకు సామాన్యం బగుటం జేసి రెండు దెఱంగుల వారికి వీ రొక్కరూప మనకడ నున్నతప్పునకు మనముందట నిలువ వలయు నను నింతమాత్రకుం గా వీరల కింత వలసె నేను దైవాధీనతకతంబున బిడ్డల నొత్తి చెప్పను నియమింపనుం జాల మొదల విదురుం డే మని చాటి చెప్పె నది యంతయుం బాటిలె జూదంబునాఁటనుండియుఁ గురుజాతికిం జేటు మూఁడుట దోఁచు చుండు మందబుద్ధియు లోభోపహతుండును నయి దురభిలాషంబున దుర్యోధనుఁ డింత సేసెఁ గాలపర్యాయంబునఁ గౌరవులకుఁ గడవరానియవస్థ వచ్చె సంజయా నే నేమి సేయుదు నెందుఁ జొత్తు నెద్దిదెరు వెవ్వరు శరణంబు వా రిరువురుఁ గలయంతటన పోయెనే విను మని మఱియు ని ట్లనియె. 198

చ. అనుజులు నట్టివార ద్రుపదాదిసుహృజ్జను లెల్ల నంతకం
బెను బలవంతు లాహవపటిష్ఠుఁడు రాజు యుధిష్ఠిరుండు స
ద్వినయ[5]వివేకశీలముల విశ్రుతుఁ డాతఁడు బంధుభృత్యులం
దనకు వశంబు సేసికొనుదానికి నేర్చుఁ బ్రభుత్వసంపదన్. 199

ఆ. సత్యశౌచధర్మశాలి దయాపరుం, డట్టిధర్మపుత్త్రు నాక్రమింప
మనము దలఁచు టెల్ల మంటలో మిడుత లు,దగ్రవృత్తి నుఱుకఁ దలఁచునట్లు.

---

1 ఎక్కడి (డ)...నొడ్డినమంట. 2 పుత్త్రుఁడు సమరోత్సవలీలఁ. 3 కురుసేనలఁ దా గెలుచుట,... తెగటార్చునట్టిదయ యగుఁ జుమ్మీ. 4 దదియును బౌత్త్రు లగు...మూఁడుటకుం జూచుచుండు...విపర్యయంబున. 5 వివేకదానములు.

వ. కావునఁ బాండవులతోడిభండనంబునఁ గులక్షయం బగుట దప్పదు శాంతిఁ బొందుటయ మేలు మనవారల కది ప్రియం బగునేని దానికిఁ దగినయత్నంబు సేసెద ననిన విని ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె. 201

క. దేవర యానతియిచ్చిన, యీవాక్యము లెన్న నాఁడు నీవ యుపేక్షిం
బో విడిచితి వింకను నీ, చే వత్తురు వారు వీరిచే టొప్పుదురే. 202

వ. అది యెట్లంటేని. 203

క. వారు దేస లొత్తికొనియు ధరారాజ్యం బిచ్చి [1]పోయి రా పోరా తా
రారణ్యపీడఁ బడియును, రారాజుం జెఱుకుఁ బాపరా మన మెఱుఁగన్. 204

వ. అట్టియెడ నైనను. 205

క. రావించి తగవుమై సం, భావింపవ కాక నాఁడ పాండవు లలుకం
బో విడువరె మిగులుదురే, నీవచనంబులకుఁ బిలిచి నిలుపుము వారిన్. 206

దుర్యోధనుఁడు దండ్రితో స్వపక్షవీరులసామర్థ్యంబు సెప్పుట.

వ. అనిన విని దుర్యోధనుండు దండ్రి కిట్లనియె. 207

చ. అడవులఁ గొండలం బడి మహాపద [2]రూపఱి చన్నవారి ని
ప్పుడు కొని వచ్చి కృష్ణుఁ డొకప్రోపుగఁ గూటువమూఁకఁ గూర్చినం
బొడుతురె పాండునందనులు భూవర యేటికి నింతభీతి మా
కడిమియు లావు నీ వసదు గా గణుతింపకు గెల్తు మెమ్మెయిన్. 208

తే. పరశురాముని గెలిచినబల్లిదుండు, భీష్ముఁ డవనీశ లీతనిపేరు వినినఁ
బాఱు చుండుట యెఱుఁగవే పాండుపుత్త్రు, లనఁగ నెంతటివా రితం డలిగెనేని.

క. కృపుఁడును గురుఁడు నయోనిజు, [3]లపరిమితభుజాబలాఢ్యు లాహవకేళీ
నిపుణు లజేయులు వీరలు, కుపితాత్మకు లైన మాఱుకొనునే హరుఁడున్. 210

క. ఈశ్వరవరజనితుఁడు హరి, దశ్వప్రతిమానతేజుఁ డస్త్రకళాని
త్యైశ్వర్యధురంధరుఁ డీ, యశ్వత్థామ గలుగ మన కని వెఱ పేలా. 211

ఆ. సహజకుండలుండు శౌర్యధుర్యుఁడు సము, దీర్ణబాహుబలుఁడు గర్ణుఁ డిందుఁ
గలఁడు వీని కెదురు గలఁ [4]డని యెన్నుమా, ధర్మపుత్త్రుపాల ధరణినాథ. 212

క. వినుము నరేశ్వర కర్ణుని, పెనుపు మహేంద్రుండు వచ్చి ప్రియమున శచికై
తను నర్థింపఁగ నిచ్చెను, గొను మని లోకంబు లెఱుఁగఁ గుండలయుగమున్.

వ. వీర లాధర్మపుత్త్రాదులచేతన కా దెవ్వరిచేతనుం జెడమి దెల్లంబు బాహ్లిక సోమదత్త భూరిశ్రవ శ్శల్య సింధురాజ గాంధారరాజప్రభృతిమహావీరులు వీరలకంటెను శక్తిసమగ్రులు దక్కటిరాజలోకంబును సహాయు లై వచ్చినవివిధ దేశాధీశులును నాతోడిసుఖదుఃఖంబుల కియ్యకొని యగ్గలికమై నగ్గి నైన నుఱు

1 పోయిరో పోరో. 2 రూపఱుతున్నవారి ... డొకప్రాపుగఁ ... మా కడిఁదియు. 3 లపరిమితమహానుభావు. 4 డేవఁ డెన్ను మా.

కను సముద్రం బైన నీఁదను దెంపు సేసి పొంపిరి వోవుచున్నవారు గావునఁ బాండవులకు మాదిక్కు దేఱి చూడనుం గొలంది గా దనుమానింపకు మిట్లునుం గాక మాకు నెవ్వరును లేక చుట్టంబులును జెలులును విడిచి తోడు వచ్చినవారును విచ్చి పోయి భృత్యులును విరక్తులై వారిక పోటుమానుసులును బంధుమిత్త్రసహాయులును బ్రజానురాగంబునుం గలిగినట్టి దైన నది ప్రాప్తకాలం బింతియ కాని యే మింక వారియడుగు లొత్తను బాఱి పోవనుం జాల మెల్లభంగుల [1]సమరంబు సేయుదుము తలపెట్టిన నాతలంచినట్లొండె వాసుదేవుండు దలంచినట్లొండె నయ్యెడు నెట్లైన మే లింతవట్టును నిర్ణయం బని పలికి మఱియు ని ట్లనియె. 214

తే. కులములోఁ దలపం పగుకూడు గుడువఁ, బంపఁ జూచెద వొకళులఁ బఱతురట్టె
వారు పైనెత్తి వచ్చినఁ బోరికోప, [2]మనిన ధృతిచేట కాకపొం దగునె చెపుమ.

క. నీవు బతిమాలి కొడుకుల, చావునకును జేటునకును జాలక యిమ్మై
వావిడిచి యఱచినం గడు, నేవపడరె జనులు నిన్ను నే మన నేర్తున్. 216

తే. [3]భీమసేనుని నీ వింతపెద్ద చేసి, పెక్కుభంగులఁ జెప్పితి యుక్కు గలఁడు
గదకు నేర్చునం చెంతయు బెదరెదతఁడు, నన్నుఁ బోలమి యెఱుఁగవే నరవరేణ్య.

మ. గద నాతో సరి మూఁడులోకముల నేఁ గానం జలం బెత్తి యు
న్మదుఁ డాభీముఁడు న న్ననిం దొడరిన న్వజ్రప్రహారంబు బె
ట్టిద మై తాఁకినఁ గూలుపర్వతముమాడ్కిం గుంభినిం గూల వ్రే
సెద నాకోర్కి గదా గదారణము వచ్చెం బెద్దకాలంబునన్. 218

ఆ. అతఁడు వడిన వెండి యూసేనఁ గోత్తల, సేయ నొకఁడు లేమి సిద్ధ మింత
యెఱిఁగి వెఱచి కాదె యేనూళ్లులైనను, [4]దమకుఁ జాలు ననియె ధర్మసుతుఁడు.

వ. అర్జునుండు గలం డని తలంచితి వేని. 220

తే. కర్ణువడసినయాశ్త గలుగఁ బోర, బ్రదుక వచ్చునె నరునకు నదియుఁ గాక
యతని భీష్మాదిరథికులయతులితాస్త్ర, మేయదివ్యబాణంబులు మ్రింగి కొనవె.

వ. దుశ్శాసన దుష్ప్రహ దుర్ముఖ వివింశతి వికర్ణ చిత్రసేనాదు లగునీకొడుకు లొకండొకండ జగంబు లెల్ల జయింపఁ జాలుదు రందఱు నొక్కమొగం బై త్రోచి నడచిన సవ్యసాచి యొక్కరుండ కాఁడు పాండవుల నెల్ల నొక్కెత్తున వైచి కొన నోపుదు రట్లునుం గాక మాకు నక్షౌహిణులు పదునొకండు వారికి నేడక్షౌహిణులు మాసైన్యంబు సారవంతంబు వారిబలంబు నిస్సారంబు వారు మ మ్మెవ్విధంబున జయింప నోపుదు రీయెక్కువదక్కువలు విచారింపక [5]వలవనివెఱపు

1 సంగరంబు. 2 మయిన. 3 భీమసేనుని నెంతయుఁ బెద్దఁ జేసి...తట్లుక్కు గలఁడు. 4 దమకుఁ బోలు. 5 వలువని.

గట్టికొని ముక్కారి వగచు చున్నవాఁడవు నిన్ను వగవ కుండ నుడుపం జాల మంతియకాని తక్కెల్లపనులకుం జాలుదు మని పలికి సంజయుఁడెసఁ గనుంగొని సుయోధనుం డి ట్లనియె. 222

క. నానా దేశంబులబలు, మానుసులం గూర్చికొని సమత్సరబుద్ధిం
[1]దానే మనియెడు నయ్యము, సూనుం డాతని తెఱంగు సూతము చెపుమా.

వ. అనిన విని సంజయుం డి ట్లనియె. 224

—సంజయుఁడు ధర్యోధనునకు ధర్మరాజునిశ్చయం బెఱింగించుట.—

ఉ. ఆతఁడు భండనం బనిన [2]నార్చిన మూరెఁడు వేర్చు నెంతయుం
బ్రీతి వహించి తమ్ము లొకపెండ్లికిఁ బోయెడునట్ల యున్నవా
రా తెలి వెందునుం గలదె యందలినాయకు లెప్పు డొక్కొ మా
చేతులతీఁట వుత్తు మనుచి త్తమ కాని చలింప రేమియున్. 225

తే. నరునిపాశుపతాదిబాణముల పెంపు
భీముగదసొంపు నమ్మి యుద్దామలీలఁ
జెలఁగి వెఱ వేది యక్కడిబలము [3]మునురు
గవిసి యెపుడుఁ గయ్యమునకుఁ గాలుద్రవ్వు. 226

క. నావుడు నిది యేా సంజయ, కైవారము నేసె దీవు కౌంతేయుల వా
రేవి రణసాధనమ్ములు, గా వెఱవక నడచువారు కౌరవులపయిన్. 227

వ. అనిన సుయోధనునకు సూతనందనుం డర్జునుదివ్యరథ శ్వేతాశ్వ కపిధ్వజదేవదత్తంబులమహానుభావంబులు వేఱువేఱ వర్ణించి చెప్పి యుధిష్ఠిర భీమ నకుల సహదేవులయరదంబులు దురంగాదిపరికరంబు లిట్టిట్టి వని యేర్పడం బలికి విరాటద్రుపదాదులకు వలయునుపకరణంబులు గొఱంత లేమియు నెఱింగించిన ధృతరాష్ట్రుం డిందుఁ గలబలుమానుసు లెవ్వరికి నసాధ్యులు వీరి సాధించు తెఱం గూహించిరే యని యడిగిన నతనికి సంజయుం డి ట్లనియె. 228

సీ. గంగాసుతుండు శిఖండిపా లతనికిఁ, బ్రాపు మత్స్యేశ్వరుబలము కుంభ
భవుఁడు ధృష్టద్యుమ్నుపా లతనికిఁ దోడు, పడు ద్రౌపదీపుత్రపంచకంబు
రారాజుఁ దమ్ములు మారుతిపాలు కు,మారు లందఱు నభిమన్యుపాలు
శకునిసైంధవులు నశ్వత్థామకర్ణులు, ద క్కొరుచేఁ బోనిదండిమగలు

ఆ. సవ్యసాచిపాలు సాత్యకి పా ల్కృత, వర్మ చేకితానవసుమతీశు
పాలు సోమదత్తుఁ డాలంబునకు నిట్లు, నిశ్చయించి రచట నృపవరేణ్యా. 229

క. నకులుఁడు సహదేవుండును, శకుని నులూకాదిసుతుల సారస్వతులం
బ్రకటబలు లైన కాళిం, గకులను సమయించువారు కౌరవనాథా. 230

1 దానే మనియెను. 2 నార్చుచు; నార్చియు మూరెఁడు లేచు...మనుచింతయ కాని తలంప రేమియున్. 3 మసరు గవిసి యుపుడు కయ్యమునకుఁ.

క. కేకయులు మనలఁ గలసిన, కేకయుల జయించువారు కృతపుణ్యుఁడు సు
శ్లోకుఁడు ధర్మతనూజుఁడు, లోకోత్తరు [1]శల్యుఁ దా గెలుచువాఁ డధిపా. 231

వ. అట్టిపలుకులసమయంబున నచ్చోటఁ గొందఱు జనంబులు ధర్మనందను నుద్దేశించి, 232

క. ఇతఁ డెక్కడ మద్రమహీ, పతి యెక్కడ నితని కతఁడు పాటియె యనుడుం
బ్రతివచనంబుల శల్యుని, యతిబలశౌర్యములు వారి కాతఁడ చెప్పెన్. 233

వ. ఇట్లు గాకయు నెవ్వరిమొగంబున నెవ్వరు వడిరి వారికి వార చాలి యుండు[2]వారని రివ్విధంబునఁ గ్రొవ్వు మిగిలి కొఱంత లేని తెగువం దేజరిల్లుచున్నవారు నీకు నీకొడుకునకు నెయ్యది గర్జం బై తోఁచె నదియ చేయుం డనిన విని విచిత్రవీర్యతనయుం డిట్లనియె. 234

క. నాకొడుకుల కెక్కుడిబ్రదు, కీకొలఁది దలంప నిప్పు డెన్నినవీరా
నీకంబు నోర్వవచ్చునె, [3]యీకూడినసైనికులకు నే మనువాఁడన్. 235

క. రాజు యుధిష్ఠిరుఁ డై హరి, దా జయ [4]మొడఁగూర్ప నున్నఁ దత్సైన్యము రా
రా జిట్లు సరకుసేయమి, నాజన్మము దుఃఖభాజనం బగుటఁ జుమీ. 236

క. నా కుడుప నేల వశ మగు, నీకూడినభూపతులకు నింతియకాలం
బై కడచన్నది సంజయ, నీ కీవగ పేల యింక నిలుపుము పలుకుల్. 237

వ. అనిన విని దుర్యోధనుండు నిజజనకుతో ని ట్లనియె. 238

ఉ. ఏమును బాండునందనులు నేకకులంబునఁ బుట్టి యొక్కచో
నే మొకఁ డైనఁ జేసి గడ నెడ్డు చరించినయట్టివార ము
ద్దామబలంబు శౌర్యమును దర్పము వారిక కల్గి వార సం
గ్రామమునన్ జయింతు రనఁగా నొకనిశ్చయ మెట్లు గల్గెడున్. 239

ఉ. వారిని వారివారి నిటు వర్ణన సేసెదు గాని మమ్ము మా
వారిఁ దలంప విప్పుడమి వారికిఁ బాయను [5]మాకు నంతయుం
జేరను మున్ సృజంచె విధి సిద్ధము దీని నొకండు మాన్పఁగా
నేరఁ డకారణంబ మది నెవ్వగ లేటికిఁ బట్టుకొల్పఁగన్. 240

వ. అనిన విని సూతనందనునకు నంబికానందనుం డిట్లను నా[6]కొడుకు నుత్తప్రలాపంబులు సేయుచున్నవాఁ డింతియ కాని సత్యధర్మనయపరాక్రమసహాయసంపన్నులైనపాండవులఁ దనకు గెలువ వచ్చునే తాను బ్రబలుం డయినను బెనఁకువ గీడ కాక మే లగునే యదియట్లుండె నొక్కటి యడిగెద సంజయా చెప్పుము. 241

---

1 శల్యు ననిఁ గెలుచు. 2 వార మని పూని రివ్వి; వా రని పూని పలికి రివ్వి. 3 యీకౌరవసైనికులను. 4 మొడఁగూర్పఁ గడఁగు. 5 మమ్ము... నెవ్వగ పేటికిఁ. 6 (కొడుకు రిత్త) ప్రతాపంబులు వల్కుచున్నవాఁడు; ప్రలాపంబులు వల్కుచున్నవాఁడు.

క. సమరమునకుఁ బురికొల్పుచు, మముఁ దలఁచిన [1]నుల్లికుట్టుమాటలఁ దచ్చి
త్రము లుడికించుచుఁ బాండవ, సమితిం గడఁగించువా రచట నెవ్వారొక్కో. 242

క. నావుడు సంజయుఁ డిట్లను, దేవా పాండవులయలుక ధృష్టద్యుమ్నుం
డేవెరవుమాట నైనను, నే వోసినయగ్నిభంగి [2]నిగుడం జేయున్. . 243

వ. అతండు ధర్మతనయుతో నిట్లను గాంగేయకుంభసంభవాది మహావీరక్రూర
సత్త్వ బహుళంబును గరిఘటాగిరికదంబకలితంబును దురంగనికరతరంగపరం
పరాఘోరంబు నగుకౌరవసేనాసముద్రంబునకు నేనొక్క-చెలియలికట్టనై నిలి
చెద ననవుడు నయ్యుధిష్ఠిరుండు నీ వింతకుఁ జాలుట యెవ్వరు నెఱుంగరే
యెట్లును సంగరంబున మ మ్ముద్ధరింపు మనియె నిట్లు గొనియాడిన నాతండు
నాదెసం గనుంగొని సంజయా మీవారల కెల్లనుం దెలియం జెప్పు మిాశ్వ
రాదిదేవతలు సమకట్టినసవరణ గలయర్జునుచేత నిర్జింపంబడినయుత్కృష్టజాతు
లనేకు లగుట యెఱుంగుదుర కాదె మనుష్యు లతని కెంతపెద్ద [3]యిట్టిజెట్టి
వెన్ను దన్ని చూడఁ గలవాఁడు గావున మముబోం ట్లెల్లఁ బోక పెనంగినం
బోరు భరం బైనం బ్రాణంబులపై వచ్చు నంతకంటెను బరమదయాపరుం డైన
పాండవాగ్రజుమఱువు సొచ్చి బ్రదుకుం డను మంత లంతలు దప్పులు సేసితి
మని తలంక వలవ దెంతలు సేసినను గాంతేయపూర్వజుండు శాంతిసుధానిధి
యగుటంజేసి శరణు సొచ్చినం గాచు నని పలికె ననిన విని ధృతరాష్ట్రుండు
దుర్యోధనున కిట్లనియె. 244

క. పరిజనులకు నీకును ని, ద్ధరలోన సగంబు సాలుఁ దక్కటిసగముం
గర ముచితంబుగఁ బాండవ, వరుఁ డగుధర్మజున కిచ్చి బ్రదుకుము నెమ్మిన్.

—ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుతో సంధి సేయు మని చెప్పుట.—

చ. పెనఁకువ [4]నాక యేల మన పెద్దల కెవ్వరి కియ్యకోలు గా
దనుచితవృత్తి గాన గురుఁ డాదిగ నాప్తులు బంధుమిత్రులుఁ
గొనకొని పోరికిం జొర రకుంఠితతేజుఁడు ధర్మపుత్రుఁ డా
తనిఁ దగఁ గూడి మన్కి ప్రమదం బగుఁ గౌరవజాతి కెంతయున్. 246

వ. అని వెండియు. 247

క. కర్ణుండు రేఁచి పెట్టఁగ, దుర్ణయపరు లైనశకుని దుశ్శాసను లీ
నిర్ణయమె మే లనఁగ నీ, కర్ణములకు నించు నెట్లు కార్యవచనముల్. 248

వ. అనినఁ గటకటంబడి సుయోధనుం డిట్లనియె. 249

క. నీచెప్పెడిపెద్దలు ద్రో,ణాచార్యులు మొదలుగాఁగ నని కొల్లనివా
రై చేరనివారిం గొని, యే చక్కంబెట్టువాఁడ నేఁ బాండవులన్. 250

శా. రాధేయుండును దుస్ససేనుఁడును బోరం బ్రాపుగాఁ బాండవ

1 నుల్కుపుట్టుమాటలఁ. 2 నెగడం. 3 యెట్టిజెట్టి. 4 నాకకాదు...జాతి కింతకున్.

క్రోధజ్వాలల నార్తు నొందొకఁడు [1]నాకుం దోడె నీ వింక నర్థ
బాధం బెట్టకు వాఁడిసూదిమొన మోవం జాలునంత్తైన నే
నీధాత్రీతల మీను వారలకు నాకే లింతసేగిం బడన్. 251

వ. అనిన గాంధారీవల్లభుం డతని కిట్లనియె. 252

ఆ. నీకు నంత పగవ నీపోవు తెరువునఁ, బోవువారు గాఁగఁ బూని యున్న
వారి కెల్ల నేను వగచెదఁ గయ్యంబు, వలవ [2]దుడుగు మయ్య చలముగొనక.

చ. ఉభయబలంబులుం బొగడ నుగ్రత భీముఁడు విస్ఫురద్గదా
రభస మెలర్పఁ గుంభములు [3]వ్రయ్యఁగ వ్రేసిన నెత్తు రొల్కఁగా
నిభములపిండు గావి సెలయేఱులతోడినగంబులట్లు సం
క్షుభితము లై పయిం బఱవఁ జూచి తలంచెదు నాదువాక్యముల్. 254

చ. ఉఱక ధనంజయుండు వివిధోగ్రశరంబుల నొక్కమాత్ర నే
త్తెఱ నుఱు మాడినం బుడమిఁ ద్రెళ్లిన నీదగు సైన్య మంతయుం
నఱికినఁ బడ్డఘోరవిపినంబువిధంబున నున్నఁ జూచి య
త్తఱి నయినం దలంపు [4]ముచితం బగునావచనంబుఁ బుత్రకా. 255

వ. అని పలికి యతనివలనం బలుకు గానక మనంబు [5]మరలం బెట్టికొని కొడు
కులు జయింప నోపుదురొకో యనునాస సంజయుదిక్కు మొగంబు సేసి
పాండవ కౌరవపక్షంబులం గలవారి నడుగుచుం గొలందులు దలపోయుచు
నాతనివచనంబులం దనవిచారంబులను బలాబలంబులు నిశ్చయించి పాండ
వేయు లెక్క డవుట యెఱుంగుచుఁ గ్రమ్మఱ నాసూతపుత్త్రుతో లెక్కలు
వెట్టుచుం బోలించుచుఁ బెద్ద ప్రొద్దు వితర్కించి కౌంతేయులశక్తి దేవశక్తియు
గాంధారేయులశక్తి మనుష్యశక్తిం గాఁ దెలిసినవాఁ డై యంబికానందనుండు
నిజనందనునితో ని ట్లనియె. 256

క. నరుఁ డగ్నిదేవుఁ దనకును, వరదునిఁ గాఁ గొలిచినాఁడు వానికిఁ గేతు
స్ఫురణం బాదిగఁ గలసం, గరపరికర మెల్ల నతఁడు గావించె [6]దయన్. 257

వ. అదియునుం గాక ధర్మదేవతయు వాయుదేవుండును వాసవుండును నాశ్వి
నులును వారలకుఁ బాండురాజుతోడివారలు వారి నొకకీడునుం బొరయకుండ
రక్షింతురు గావున భీష్మద్రోణప్రముఖులకుఁ బాండవులం బరిభవింప రామి
దెల్లంబు. 258

క. దేవత లేటికిఁ బార్థుఁడు, దేవసముఁడు గాఁడె వాఁడు దివిజులచేతం
బోవనిదైత్యులఁ జంపఁడె, యీవును నీవారు నతని నెఱుఁగరె చెపుమా. 259

వ. కౌరవులకు వచ్చినయిమ్మహాభయంబునకుఁ బ్రతీకారంబు శాంతిం గడచినయది

1 నాకుం బ్రాపె...నా కే లంతిసేగిం. 2 దుడగ నయ్య చలము మాని. 3 వ్రయ్యఁగ మోదిన. 4 ముచితంబుగ. 5 మొగుడం...వెట్టుచుఁ జాలించుచుఁ. 6 దగన్.

లే దెన్నిభంగులం జూచినఁ గయ్యంబుడుగుటయ మనకుం గర్తవ్యం బై యున్న
యది యుపశమింప వయ్యె దీర్ఘవైరంబు వలవ దనినఁ దండ్రికిఁ గొడు కిట్లనియె.

క. దేవత లర్జునునకుఁ దోడై వత్తు రనంగ వలవ దది యెట్లనినన్
దేవత్వము రాగద్వేషావేశము లేమిఁ గాదె యైనది మొదలన్. 261

వ. కావున వా రొకళ్లవారుం గా రట్లుం గాక పక్షపాతులై పూని వత్తురయేని
నది దేవత్వంబు గా దట్టిదేవత్వంబున నర్జునుండును సురక్షితుండు గా నేరఁడు
నీకు నాపనికిఁ జింత వలవ దని పలికి వెండియు నిట్లనుఁ బెఱిగి వచ్చు కార్చిచ్చు
నుడుపను బాషాణవర్షంబు వారింపను మహావాయువు నిలుపను నీళ్లు గట్టిగా
నభిమంత్రించి వానిపైఁ గరితురగాదుల నడపింపను నాసేన నడచునప్పుడు
వలసినచోట జలంబు లుత్పాదింపను జాలుదు సింహశరభశార్దూలభూతబేతా
ళాదిక్రూరసత్త్వసంరంభస్తంభనప్రకారం బెఱుంగుదు మిత్త్రశత్రువిషయంబు
లైనశుభాశుభంబులు వలయుభంగి నావహింప నేర్తు మఱియు నానావిధసిద్ధి[1]ప్ర
దంబు లగుమంత్రధ్యానాద్యనుష్ఠానంబుల నాకుం గొఱంత లేదు నీచెప్పినయగ్ని
ప్రముఖదేవతలం బ్రసన్ను లగునట్లుగా నారాధించినవాఁడ వారికి నాకుం
బోలె మహానుభావంబు గలిగినఁ బదుమూఁడు వత్సరంబు లబ్బంగి నిడుమలం
బడుదురె వినుము చెప్పెద. 262

—॥ దుర్యోధనుఁడు తండ్రితోఁ దనబలపరాక్రమంబు సెప్పుట. ॥—

క. ఏ నలిగిన వారిని సుర, లైనను రక్షింప నోప రమరు లలిగినం
బూని చెడ కుండఁ గాతును, మానవు లొక[2]సరకె నాకు మనుజాధీశా. 263

తే. గర్వమున నాడుమాటలు గాఁ దలంప, వలవ దిది యెల్ల నిక్కంబు వసుమతీశ
నన్ను నేఁ జెప్పికొందునే యెన్నఁడైన, నాత్మసంస్తుతి పౌరుషం బగునె చెపుమ.

వ. ధర్మతనయాదిపాండవేయులును ద్రుపదాదిపాంచాలురును విరటాదిమాత్స్య
లును వాసుదేవాదియాదవులును మఱియునుం గేకయ పాండ్య మాగధ చైద్య
ప్రముఖనిఖిలదండనాయకులును నాబారింబడి మున్నీరు సొచ్చినయేఱులచందం
బున నడంగిపోవుట యవధరించెదు గాక వారెల్లఁ దేజోధైర్యపరాక్రమోపాయ
విచారవివేకంబుల నాయెత్తు వత్తురె పితామహద్రోణకృపాశ్వత్థామలు శస్త్రాస్త్ర
విషయంబుగా నే నేమి యెఱుంగుదు రంతెంత నేర్తు రది యెల్ల నెఱుంగుదు
నంతయు నేర్తు నని పలికి యందఱు వెఱఁగుపడి యుండం దాను సంజయుతో
సంగరంబు తెఱంగు నాలోచనంబుగాఁ బాండవుల దెస మాట లాడు చుండఁ గ
ర్ణుండు ధృతరాష్ట్రుం గైకొనక ధార్తరాష్ట్రునకుం బ్రియంబుగా నిట్లనియె.

క. గురునలుక సాకు నస్త్ర, స్ఫురణ మెడలె నంద్రు జనులు బొంకది పూజా
పరతమెయి నమ్మునీశ్వరు, కరుణ [3]గొఱలి మగుడఁ బడయఁ గాంచితిఁ బ్రీతిన్.

1 ప్రకరణంబు లగు. 2 సరయొ. 3 వడసి.

ఉ. కావున నస్త్రశస్త్రము లఖండితసంపద [1]నొంది యుండు దే
వావలి కైన నన్నుఁ జెనయన్ భర మేఁ గలుగంగ నర్జునుం
డే విడిపించు మేదిని గడిందిమగంటిమి యుల్లసిల్లఁగా
నీవు బలంబు మెచ్చ నని నిల్చెద గెల్చెదఁ బాండవేయులన్. 267

శా. గాంగేయాదులు [2]నీకడన్ నిలిచి వేడ్కం జూడఁ గా సర్వసే
నాంగాంగంబులమీఁద గాలియును జిట్టాడంగ నీ కేను వీఁ
కం గౌంతేయులఁ దాఁకి తత్తనువు లుగ్రస్ఫారబాణాలిఁ గ్రూ
లం గోదండవిలాసముల్ మెఱయ లీలం బోరఁ గ్రీడించెదన్. 268

వ. అనిన విని యినసందనునకు మందాకినీనందనుం డిట్లనియె. 269

క. కాలుఁడు ప్రేరేపఁగ నిటు, ప్రేలినయంతటన నిన్నుఁ బెద్దగఁ దలఁపం
బోలునె మాకును నుడుగుము, చాలుదు నీ వెల్లపనులు సాధింపంగన్. 270

ఉ. కూలెడువారె పాండవులు ఘోరపుఁబోర నొకండొకండ యీ
చాలెడువార లెల్ల మును చావఁ గ్రమంబున సేన లన్నియుం
గూలఁగఁ గౌరవుల్ పిదపఁ గూలుదు రింతియ కాక నోరిచే
టేల వృథాభిమానమున నిన్నియుఁ బ్రేలెదు సూతనందనా. 271

తే. దివిజపతి నీకు నిచ్చిన[3]తీవ్రశక్తి
చేతఁ గవ్వడి వడు నని చూతువేని
వాసుదేవునిచే నది వ్రయ్య లయ్యుఁ
దునియ లయ్యును బొడి యయ్యుఁ దొరఁగు ధరణి. 272

క. సర్పముఖశరము గల దను, దర్పంబునఁ గ్రీడిఁ దొడరఁ దలఁపకు హరిపెం
పేర్పడఁగ నదియు కాదట, తీర్ప వలయువాని నెల్లఁ దీర్చు నరునకై. 273

న. అని పలికి ధృతరాష్ట్రునితో నిట్లనియె. 274

క. జ్ఞాతులు దమలోఁ బొందినఁ, [4]జేతోమోదమున వెలిఁగి చెలు వొందుదు ర
న్నీతిం బాసిన విగతవి, భూతిం గడకొఱవులట్ల పొగయుదు రధిపా. 275

వ. కావునఁ దమలో విరోధం బొప్పదు సంభాషణసహభోజనాదిసత్కారంబులను సవినయవర్తనంబులను బ్రీతు లైన జ్ఞాతు లిహపరార్థసాధకు లగుదు రని చెప్పి వెండియు. 276

క. విను మే నొకశైలమునకు, మును భూసురవర్గసహితముగ నొకపనికిం
జనునెడఁ జన రానితటం, బున నొకజు న్నుండె దానిఁ బొగడిరి తజ్జ్ఞుల్. 277

తే. దీని తేనియఁ ద్రావినమానవులకు

1 నొంది యుండ దే. 2 నాకడన్. 3 దివ్యశక్తి... చెప్పెదేని. 4 చేతోమోదంబు వెరిఁగి... పొల.

జరయు రుజయును దప్పియుఁ జావుఁ గలుగ
దనఁగఁ గొందఱు బోయలు విని కడంగి
యుఱక మొఱకులై [1]చఱిఁ బడ నుఱికి రపుడు. 278

వ. ఇట్లుఱికి మృతిం బొంది రట్లపోలె నవినీతు లైననీకొడుకులు పుడమియెల్లను దార యేలుతీపుఁ జూచెదరు గాని తమపాలిసిపోవుటం గానరు వీర లర్జును తోడం బెనంగి [2]మానప్రాణంబులు దక్కించుకొనువారె యట్లుంగాక సమబలు లైననుం గయ్యంబునఁ గదా వీ రౌదురు వారౌదు రనవచ్చు నది యేల నీలోనికి ధర్మనందనుం దెచ్చికొనుటయ నీకుం గర్తవ్యం బనిన బాహ్లికుండు ధార్త రాష్ట్రున కిట్లనియె. 279

క. కను భ్రమసిన తెరువరి తన, కనపాయం బైనమార్గ మరసి తగ నెఱిం
గినవారు సెప్పఁగాఁ గై, కొననికరణిఁ దగినవెంటకుం జొర వకటా. 280

వ. అనిన వైచిత్రవీర్యుండు దుర్యోధనున కిట్లనియె. 281

మ. కొడుకా యే నెటు లట్ల బాహ్లికుఁడు నీకుం గూర్చు భీష్ముండు నీ
యెడ సస్నేహుఁడు వీరిమాట విను మే మీమువ్వురున్ మన్ననల్
వడయంగాఁ దగునట్టివారము నినుం బ్రార్థించెదన్ ధర్మజున్
విడువంగాఁ దగ దిమ్ము వారలకు నుర్విం బాలు నెమ్మిం దగన్. 282

క. అనినను వెండియు నొడఁబా, టునకుఁ జొరనిదానికిం గొడుకుతోడఁ గడుం
గినిసి ధరణీశ్వరుం డి, ట్లనుఁ గొలువున నున్న[3]వార లందఱు వినఁగన్. 283

తే. [4]బవరములు గావె విఱిగిన బార సాఁప, వచ్చునే యొక్కరుండ వివ్వచ్చుఁ డడరి
పసుల బెట్టించునపుడు నీబలము విఱుగ, దయ్యెనే నీవుఁ గర్ణుండు నచట లేరె.

వ. అని రాధేయుదిక్కు మొగంబై మఱియు నిట్లనియె. 285

ఆ. నాఁటికొలఁది గాదు నారాయణుఁడు నొగ, లెక్కఁ గెలన భీముఁ డేచి నడవ
ననుజతనుజసహితుఁ డై వచ్చువివ్వచ్చు, మార్కొనంగ వశమె మనకుఁ గర్ణ.

చ. [5]బలమును దర్పమున్ మెఱయ బంటుతనంబున నీవు పాండవే
యుల నని మార్కొనం గడఁగు టొప్పెడు తెం పగుఁ జచ్చి శుద్ధుఁ డై
పలుకులు మాన్పు భృత్యుఁ డనుపాటి దలంచెద విట్లు మేలె య
చ్చలమున నీసుయోధనునిచావున కోర్చుట గాదె యెంతయున్. 287

వ. అనిన విని కానీనుండు సంక్షుభితమానసుం డై నివి యెల్ల ని ట్లయ్యె నిట్లుం గాక [6]తక్కినయది య ట్లుండె నదీసూనుండు నన్ను నిరాకరించి పలికినపలు కులఫలం బనుభవించుం గాక యని యతనినుద్దేశించి యిట్లనియె. 288

1 చఱిఁ దిగ నుఱికి రపుడు; చఱిలోని కుఱికి రపుడు. 2 తమ. 3 రాజు లందఱు. 4 బరవసము గాదె...బట్టించు. 5 బలిమియు...తెంపున...పాడి. 6 తక్కినప్పటి కది యట్లుండె...నిరాకరించినఫలం.

కర్ణుఁడు భీష్మునిపై రోషముచేత నస్త్రసన్న్యాసంబు సేయుట.

తే. నీకు నాలావుతోడ్పాటు లేక యుండ, వలయు నీతెగునంతకుఁ గలన నిలువ
నాయుధంబులు విడిచితి నంతమీఁద, [1]మెఱసి బలవిక్రమంబులు నెఱపువాఁడ.

వ. అని శస్త్రసన్న్యాసంబు చేసి కొలువున నిలువ నొల్లక దిగ్గన లేచి పోయె నట్టి యెడ శాంతనవుండు నవ్వుచు దుర్యోధనునితో నిట్లనియె. 290

క. అంతకుఁ జాలఁడె కర్ణుం, డింతకు మును బాస యిచ్చి యెన్నఁడు బొంకం
డింతటిమానిసి యలిగినఁ, గౌంతేయుల కెట్లు బ్రదుకఁ గా వచ్చు ననిన్. 291

క. అని వెండియు నిట్లను నా,తని మాటల కెట్లు [2]గడఁగి ధర్మతనయుతో
నని సేయక తక్కవు నీ, వనుమానము వాయఁ జూడు మతనిని నన్నున్. 292

వ. ఏను బాహ్లికద్రోణప్రముఖులు గనుంగొను చుండఁ బ్రతివీరుల ననేకసహస్రంబుల సమయించెదఁ బిదప రాధేయురణంబునుం జూచెదవు గాక యనిన విని దుర్యోధనుండు గర్ణపక్షపాతియు నవినీతుండును నగుటం జేసి సహింపక పితామహుతో నిట్లనియె. 293

చ. ఎఱిఁగి యెఱిఁగి యుండె మది నేది యెఱుంగక యుండె నెప్డు నం
దఱు వినఁ బాండునందనులు దర్పితులై యని గెల్తు రందు ముం
దఱ నిను బాహ్లికున్ గురునిఁ దక్కటివారిని నమ్మి యేను నే
డ్తెఱ నని సేయఁ బూనితిఁ గడింది[3]మగంటిమి తోడు సాలదే. 294

ఉ. కర్ణుఁడు దుస్ససేనుఁడును గల్గఁగ నా కొరు లేల సద్భటా
కీర్ణవిరోధిసైన్యముల గెల్వఁగఁ జాలుదు మేము మాకు నీ
యర్ణవవేష్టితక్షితి యనర్గళవిక్రమ మొప్ప దక్కు మా
నిర్ణయ మెల్ల నిట్టి [4]దవినీతియొ నీతియొ చూడుమీ తుదిన్. 295

క. అను పలుకులకు విషాదము, దనుకఁగ ధృతరాష్ట్రవిభుఁడు దననందను నే
మనియుం బలుకఁగఁ జాలక, [5]వెనుఁబాటున నిట్టు లనియె విదురునితోడన్. 296

తే. మృత్యుపాశోప[6]హతుఁ డయ్యె మీఁదు లేక
సూతనందనుతోఁ గూడి నాతనూజుఁ
డకట నాశంబుఁ బొందువాఁ డయ్యె మనకు
నింకఁ జేయంగ నగుపని యెద్ది చెపుమ. 297

వ. అనిన విని విదురుం డతని కిట్లను మనవారలు మున్న దుర్బలులు తమలోనం బెనంకువ లయి విరసవచనంబు లాడుచు నింతలు పుట్టించుట యిది యర్జుననకుఁ గార్యం బింతియ కాక యే మనువారము వారలు బంధుమిత్రసహాయులుం దారును నొక్కతలంపువార లయి యున్నవారు వలవనియీ వెంగలిమాటలు

1 నిలిచి బల. 2 ధర్మతనయునితోడన్. 3 మగంటిమి యుల్లసిల్లదే. 4 ద యనీతియొ...తఱిన్. 5 వినుఁబాటున. 6 నిహతుఁడై మీఁదెఱుఁగక.

విడిచి పాండవులం బిలువం బనిచి తగవు నడపుట దక్క మనకుఁ జేయం దగుపని వేఱొండు గలుగునే యని చెప్పిన ధృతరాష్ట్రుండు సంజయుచెప్పినకార్యవచనంబులకొఱంత వినం గలవాఁ డై యతనిదిక్కు మొగంబు సేసి. 298

క. మును వరుసతోడఁ దన[1]తలఁ, చినయన్నియు నీవు వినఁగఁ జెప్పి తగవుమై
నిను వీడుకొల్పునెడ నర్జునుఁ డే మని నిశ్చయించెఁ జూతము చెపుమా. 299

క. అని యడిగిన సంజయుఁ డి, ట్లనుఁ [2]దుదిఁ బార్థుండు నిశ్చయము సేసి సుయో
ధనుతో నిందలిపెద్దలు, వినఁగా నను మన్నపలుకు వినుము నరేంద్రా. 300

మ. కురువంశోత్తముఁ డైనధర్మజుఁడు నాకుం దండ్రిపాలీఁ దగుఁ
ధరలో సా మని తాన పల్క విసియుఁ దర్పంబుమై నీక త
క్కిరయేనిం [3]జటులాస్మదీయవిశిఖాగ్నిజ్వాలలం డాహుతుల్
వరుసం బెట్టుదు ధార్తరాష్ట్రతతి నైశ్వర్యం బవార్యంబుగన్. 301

వ. అని పలికి కౌఁగిలించికొని భూషణాంబరాదికమనీయవస్తువు లొసంగిన నేనునుం బాండవులను వాసుదేవుని సవినయంబున వీడ్కొని యింతవట్టును దేవరకు నెఱింగింప వేగంబ వచ్చితి ననిన నమ్మాటలు దుర్యోధనుం డాదరింపక పెడచెవులం బెట్టె ధృతరాష్ట్రుండును జిచ్చవడి యూరకుండె నప్పు డయ్యిరువురపాలనుసంజయుం డొక్కరుండు దక్క నయ్యాస్థానంబున నున్నసమస్తజనంబులును దిగ్గన లేచి తమతమనివాసంబులకుం బోయిరి తదనంతరంబ. 302

క. తనుజవశవర్తి యగున, మ్మనుజేంద్రుఁడు దనసుతుండు మర్దింపఁగ నో
పునో యనిఁ బాండుతనూజుల, ననుమతి [4]సంజయునితోడ నాడె దురాశన్.

సీ. ఈరెండు [5]వీఁకుల తారతమ్యంబులు, నెఱుఁగుదు పోరైన నెవ్వ రోర్తు
రిది నిశ్చయింతమే యెందు నుపాయంబుఁ, బౌరుషంబును గలవారు గలరు
చూతము చెపు మన్న సూతనందనుఁడు న, న్నడిగెద వే నొంటి యడుగవలదు
మీయయ్య సాత్యవతేయుఁ డీయెడకు వేం, చేయునట్లుగ భక్తిఁ జేసి తలఁపు

తే. పిలువఁ బంపు గాంధారి వారలు వినీతి, రతులు నిశ్చయవిదులు ధర్మజ్ఞచిత్తు
లుల్లమున నీకసూయాదు లొదవనేని, పూని మాన్పంగ నేర్తురు మానవేంద్ర.

కృష్ణద్వైపాయనుఁడు ధృతరాష్ట్రునియొద్దకు వచ్చుట.

వ. అనిన విని యంబికానందనుం డట్ల కాక యని యొకకంచుకిం బిలిచి వానిం బుచ్చి గాంధారిరావించి [6]సద్భక్తితాత్పర్యంబునఁ గృష్ణద్వైపాయనమహామునిం దలంచిన దివ్యబోధమహనీయుం డైనమహాత్ముండు విజయంచేయుటయు నందఱు

1 వలఁ, చిన. 2 మదిఁ...నందఱు పెద్దలు. 3 జటులాస్త్రిశస్త్రివిశిఖా...నైశ్వర్యంబుతోఁ గూడఁగాఁ. 4 సంజయున కిట్లు లనియె దురాశన్. 5 వీఁడ్లుల; వీఁడుల...డింగులకు వేం,... పిలువఁ బంపుము గాంధారి ప్రియముతోడ, నిశ్చయింతురు ధర్మవి (దు) నీతు లగుచు,

దండప్రణామంబులు సేసి సమున్నతాసనంబున నునిచి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి యున్నసమయంబున ధృతరాష్ట్రుండు విన్నపంబు సేయక మున్న యమ్మహాపురుషుండు ధృతరాష్ట్రసంజయులచిత్తవృత్తులు దాన యెఱింగినవాఁ డగుటం జేసి సంజయువలనఁ బ్రసన్నదృష్టి నవలోకించి యతని కి ట్లనియె. 305

క. నీవు సమస్తము నెఱుఁగుదు, గావున [1]నీ కూర కుండఁ గాఁ దగదు ధరి
త్రీవల్లభుఁ డడిగినపని, యీవిధ మని తెలియఁ బలుకు మేము వినంగన్. 306

వ. అనినఁ బ్రసాదం బని సంజయుండు ధృతరాష్ట్రున కి ట్లనియె. 307

క. ఆసేనకు నీసేనకు, వాసి యడిగె దీవు నన్ను వసుదేవసుతుం
డాసేనఁ గలఁడు తత్సము, [2]నీసేనం జూపుమా నరేశ్వర నాకున్. 308

వ. వాసుదేవుం డెట్టివాఁ డని యడిగెదేనిం జెప్పెద. 309

చ. జగముల నన్నిటిం దనవశంబుగఁ జేసినవీరు భంగముం
బగయు లలాటలోచనుఁడు [3]వాపఁగఁ బేర్చినయట్టిబాణు నొ
క్కగడియలోన గర్వ మడఁగం బఱిమార్చె సురేంద్రకల్పకం
బు గరములీలఁ దెచ్చె హరిభూరిపరాక్రమ మప్రసిద్ధమే. 310

ఆ. అధికదుష్కరంబు లైనకార్యంబులు, క్రీడవోలెఁ [4]జేయుఁ గేశవుండు
విను మతండు పార్థు నెనసి యేకార్థుఁ డై, యుండుఁ బూర్వభవసఖుండు గాన.

వ. అట్టివాసుదేవునిచక్రంబు నిజమాయాబలంబునఁ బాండవుల సర్వసమరసాధనంబులయందును సూక్ష్మరూప[5]వ్యాపి యై నిలిచి వారికి విజయం బొసంగు చుండు నని చెప్పి మఱియు నిట్లనియె. 312

క. పలుమఱుఁ [6]బాండుతనూజుల, కొలఁది వితర్కించెదవు నిగూఢం బది యేఁ
దెలియం బలికెద వారికి, బలమును సత్త్వంబు హరియ పార్థివముఖ్యా. 313

వ. హరిమహత్త్వంబు విన్నవించెద నవధరింపుము. 314

క. ఒకతల సమస్తజగములు, నొకఁడ జనార్దనుఁడు నిలిచి యొకతల యైనన్
సకలము నసార మాత్రం, డొకరునిసారంబ చాల నుత్కృష్ట మగున్. 315

క. తలఁపునన వాసుదేవుఁడు, గలిగింపను నిలుప నడఁపఁ గా నోపు జగం
బుల మఱియును గ్రీడార్థము, పలు[7]వోకలఁ బుచ్చు చుండుఁ గౌరవనాథా. 316

క. ఎక్కడ నడచును సత్యం, బెక్కడ ధర్మంబు వరఁగు నెక్కడఁ గలుగుం
జక్కటి నిలుచుం గృష్ణుం, డక్కడ నతఁ డున్నకడన యగు జయ మధిపా. 317

సీ. పురుషోత్తముం డెల్లభువనంబులును దాన, యఖిలభూతాత్మకుం డై విహార
లీల విచేష్టించు నీలోకముల మాయ, దొట్టి యొక్కొకమరి పుట్టి పెరిఁగి
కర్మానుచరణముల్ గైకొని వర్తించు, శిష్టరక్షణమును దుష్టనిగ్ర

1 నీ వూర కుండఁ గాఁ జనదు. 2 మీసేనం. 3 ప్రాపుగ నేర్చిన. 4 జేసెఁ; గేశ
ండు...యేకాత్ముఁ డై. 5 వ్యాప్తి యై. 6 కుంతీపుత్త్రుల. 7 పోకలఁ బోవుచుండుఁ.

హంబును దనపను లగుటఁ బాండవుల నేపం బిడుకొని ధర్మబాహ్యు లైన
తే. నీతనూజుల [1]నిక్కమ నిగ్రహింపఁ, దలఁచినాఁ డమ్మహాత్ముండు దథ్య మతని
నిట్టిచందంబువాఁ డని యెఱిఁగి యెవ్వ, రాశ్రయింతురు బ్రదుకుదు రట్టివారు.
క. అనవుడు [2]ధృతరాష్ట్రుఁడు వి,ష్ణుని నే నెఱుఁగనివిధంబునుం దెలియఁగ నీ
కని యున్న తెఱఁగుఁ జెప్పుమ, యనుటయు సూతసుతుఁ డిట్టులను నాతనితోన్.
వ. విద్యయు నవిద్యయు ననఁగా రెండు గల వవిద్యాదూషితుం డై తమోగ్రస్తుం
డైనవాఁడు విష్ణు నెఱుంగఁడు విద్యాసంపన్నుం డెఱుంగు ననిన విద్య యను
నది యెట్టిది యెద్దాన నీ వాసర్వేశ్వరు నెఱింగితి దాని నవిద్య యెట్టిది దానిని
జెప్పు మనుటయు నాంబికేయునకు సంజయుం డిట్లనియె సాత్త్వికరాజసతామస
వికారంబులత్రిప్పులం బడక ధర్మం బాచరించుచు భావశుద్ధి గలిగి యుండుదు
దీన నే నచ్యుతు నెఱుంగుదు విద్య యిట్టిది నీకునుం దక్కెవ్వరి కైనను నతని
నెఱుంగుటకు నిదియ తెరు విట్టిది గానివిధం బవిద్య యని చెప్పిన నతండు నిజ
నందనుని కిట్లనియె. 320
క. మన కాప్తుఁడు సంజయుఁ డీ,తనియుపదేశంబు వట్టిధర్మమున ముకుం
దుని [3]నాశ్రయింప వయ్య య,తనిఁ జొచ్చిన బ్రదుకు దీవుఁ దమ్ములు సుతులున్.
చ. అనిన సుయోధనుండు దమయయ్యకు నిట్లను నిజ్జగంబు ల
న్నిని నొకపెట్ట మ్రింగినను నెట్టిన సర్వము [4]గాచె నేనియు
న్వినుము ముకుందుఁ డర్జునునినెచ్చెలి నాఁ జెవు లార వించు నిం
క నతని నొక్కబామునకుఁ గా ధృతిపెంపఱ నాశ్రయింతునే. 322
తే. అనిన గాంధారి కిట్లను జనవిభుండు, నీతనూజుండు దుర్మాని నీతిబాహ్యుఁ
డుద్ధతుం డీసు[5]మాని నాబుద్ధి వినఁడు, వీఁడు సెడుఁ గాని బ్రదుకంగ లేఁడు సుమ్ము.
ఉ. నావుడుఁ దల్లి యిట్టు లను నందనుతో నిది యేల యాయువుల్
శ్రీవిభవంబులున్ మము నశేషసుహృజ్జనులం దొఱంగఁగా
నీవు గడంగె దిట్టియవినీతులునుం గలరే వృకోదరుం
డై విధి సంపఁగా నొరుల కాఁగఁగ వచ్చునె యింకఁ బుత్రకా. 324
వ. అనియె నట్టియెడం గృష్ణద్వైపాయనుండు ధృతరాష్ట్రున కిట్లనుఁ గృష్ణుండు
నీకుం గూర్చు నీవుం బరమాప్తుం డైనసంజయు నతనిపాలికిం బుచ్చి తది లెస్స
కార్యం బయ్యె వీఁడును నమ్మహానుభావుమహనీయప్రభావం బున్నరూపెఱుంగు
వీనిబుద్ధి విని యద్దేవు నాశ్రయింపు మతం డేకాగ్రచిత్తు లై యారాధించినవా

1 నొక్కమై...దథ్య మరయ. 2 ధృతరాష్ట్రుం డి,ట్లను కృష్ణుని నే నెఱుంగ నగువిధమున నీ; వి,ష్ణుని నెఱుఁగువిధంబు తెలియకున్నది తెలియం, గనియెడు తెఱంగు చెపుమా...సంజయుఁడు నిట్టు లను. 3 ప్రీతి నాశ్రయింపు మ, తనిఁ బొందిన. 4 గాచె నేనియున్; గాఁగె నేనియున్...డర్జునుని నెంచగ నాఁ జెవు లార...జామునకు గా. 5 మానఁడు.

రికిఁ జేరువ యగుఁ గామక్రోధోపహతు లై తమతమధనంబులం దృప్తులు గాక
యన్యాయంబున వర్తించువారలకు దూరం బై యుండు నెల్లభంగుల నాతనిం
జొచ్చి బ్రదుకు మనినం బ్రసాదం బట్ల చేయుదు నని విచిత్రవీర్యనందనుండు
సూతనందనునితో నవ్వాసుదేవునామనిర్వచనంబు నాకుఁ దేటపడం దెలిపి
యతనిం బొందునుపాయం బుపదేశింపవే యని యడిగిన. 325

తే. ఎల్లయందును దా వసియించు నెల్ల
యదియుఁ దనయందు వసియించు టంద్రు వాసు
దేవుఁ డనుపేరి కర్థంబు దెల్ల మింత
యెఱుఁగుజనులందుఁ దగ వసియించు శుభము. 326

తే. అతనిఁ బొందునుపాయంబు నంతరంగ,నిగ్రహము గాఁగ నార్యు లనుగ్రహింతు
రోపి చిత్తవికారంబు లుడిపి యేక, బుద్ధిఁ గొలువ బ్రసన్నతఁ బొందు నతఁడు.

వ. నీవును బలుబుద్ధు లుడిగి గోవిందు నాశ్రయింపు మనినం బ్రజ్ఞాచక్షుం డిట్లనియె.

క. నాకు నయనేంద్రియము గతి, లే కుండుట [1]కంతవగపు లే దఖిలమనో
జ్ఞాకారుఁ డైనహరి నా,లోకింపం గానమికిఁ గలుగు వగ పెపుడున్. 329

ఉ. ఆతనిఁ గన్నులారఁగ నహర్నిశముం గనుఁగొంచు నుండువా
రేతప మాచరించిరొ యుపేంద్రుని [2]నాశ్రితవత్సలున్ విని
ర్ధూతకలంకు ధర్మనిరతుం గరుణాకరు సర్వలోకవి
ఖ్యాతుఁ బవిత్రమూర్తి శరణాగతరక్షకు నాశ్రయించెదన్. 330

వ. అని పలికి పరమశాంతుం డై పారాశర్యు నుద్దేశించి దేవా యేను వాసుదేవుని
[3]శరణు సొచ్చి బ్రదుకువాఁడ ననుచుఁ గృతాంజలి యగుటయు వ్యాసమహా
మునియు నాశీర్వాదంబు సేసి యంతర్హితుం డయ్యెఁ గౌరవేశ్వరుండును దుర్యో
ధనసంజయుల నిజనివాసంబులకుం బోవం బనిచి తానును గాంధారియు నభ్యం
తరమందిరంబున కరిగి యుచితవ్యాపారంబులం బ్రవర్తిల్లుచు నుండె నని చెప్పిన
విని పదంపడి పుట్టినవిశేషంబు లెట్టి వని యడిగిన. 331

శా. నిత్యానిత్యవివేకవైభవసమున్నిద్రాంతరంగస్ఫుట
ప్రత్యక్షా పరమేశ [4]విశ్వజగదారాధ్యా మహానంతచి
త్సత్యానందవిభుస్వభావమహితా సంవిత్సమాధానదా
ర్గత్యవ్యాహతిసంప్రవర్తనవిదగ్ధశ్రీపదాంభోరుహా. 332

క. వ్యాసాదిమునిప్రోక్తమ, హాసందర్భాప్రమేయతారూఢగుణో
ల్లాసా నైర్గుణ్యసము, ద్భాసిరహస్యానుభావ భక్తాధీనా. 333

1 మతినివగపు. 2 సంశ్రితవత్సలున్. 3 మఱువు. 4 సర్వజగదా...మహానందచి
త్యానంత...సంపత్సమా...ర్గత్యావ్యా...ప్రవర్ధన.

మాలిని. నమదనిమిషచూడానవ్యరత్నప్రభాసం
గమరుచిరపదాబ్జా గర్వదుర్వారదైత్యో
ద్యమబహులతమోమార్తాండదోఃక్రీడనప్ర
క్రమ [1]లలితవికాసా గాఢభక్తిప్రకాశా. 334

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున యుద్యోగపర్వంబు.
నందు ద్వితీయాశ్వాసము.

---

శ్రీ

గణేశశారదాగురుభ్యో నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఉద్యోగపర్వము, తృతీయాశ్వాసము.



[1]వాగ్విభవారోగ్య
ప్రావీణ్యప్రాభవానుభావమహితసౌ
ఖ్యావహపదస్మరణ కరు
ణావాసకటాక్షకిరణ హరిహరనాథా. 1

### శ్రీకృష్ణునిరాయబారము.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

తే. సంజయుఁడు దన్ను వీడ్కొని చనిన ధర్మ
సుతుఁడు మఱునాఁడు దమ్ముల సుతుల నిష్ట
భృత్యవరులను దొరలను బిలువఁ బనిచి
యెల్లవారును విను చుండ నిట్టు లనియె. 3

క. మనము జనార్దనుపాలికిఁ, జని కౌరవసభకు నతనిఁ జను మని ప్రార్థిం
చిన మేలు బంధుహితగురు, జనములతో రణము గాక [2]సంప్రీతి యగున్. 4

వ. అని పలికి వార లందఱు బలసి చనుదేర మాధవుమందిరంబున కరిగి యతని చేత సత్కృతుం డయి సమస్తపరిజనంబులుం బరివేష్టింప నొక్కపార్శ్వంబునం బాంచాలియు సముచితపరివారపరివృత యై యుండ నతండునుం [3]దానును సుఖాసీనుం డై యుండి యతనితో నిట్లనియె. 5

క. ఆపదఁ [4]గడవం బెట్టఁగ, నోపి శుభం బైనదాని నొడఁగూర్పను మా
కీపుట్టువునకుఁ బాండు, క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా. 6

తే. సమయ మిది [5]మిత్త్రకార్యంబు చక్కఁజేయ, నీకతంబున నే మవినీతుఁ డైన
యాసుయోధనుతోడిపోరాట దక్కి, యనుభవింతుము మాయంశ మగుధరిత్రి.

క. నీకు మేము ప్రద్యుమ్నాదికుమారులతోడివారము మమ్ము దురితంబులు వొర

1 విభవారోగ్యశుభ. 2 సమ్మతి గలుగున్. 3 దారును సుఖాసీను లై. 4 గడు
ం...మిమ్ముఁ జూపి. 5 మంత్రికార్యంబు.

యకుండ నరసి రక్షింపు మనవుడు వాసుదేవుండు నీపంచినయట్ల చేయం గల
వాఁడ నెయ్యది తలంపు సెప్పు మనిన నజాతశత్రుండు నీవు కరినగరంబున కరిగి
కౌరవులతోడం దగినమాట లాడి తెఱంగు సేయ వలయు నని ప్రార్థించి యతని
నియ్యకొలిపి యిట్లనియె. 8
సీ. మాతండ్రితలఁపును నాతనినందను, చందంబు నిన్న యాసంజయుండు
పలికినపలుకులఁ దెలిసెఁగదా నీకు, వారిచిత్తముభంగి వాఁ డెఱుంగుఁ
బొలుపం పని యీక [1]యేలిమాటలన మ,మ్మలుక దీర్చెదరు తా రధికదుష్క-
రం బైనయాసమయం బేము పదుమూఁడు, వత్సరంబులు సల్పి వచ్చి యుండం
ఆ. గులముపాడి నడపఁ దలఁపఁడ పతి సెడఁ, దలఁచెనేనిఁ గొడుకు వలచినట్టి
వాఁడు గాన యతనివక్రత మాన్ప లేఁ, డింతకంటెఁ గలదె యెడరు మాకు.
క. జననియు సమస్తబాంధవ, జనములుఁ బ్రియ మంద వారి శాంతులఁగాఁ జే
యను నెమ్మిగ నొక్కటి య్యై, మననుం దెఱఁ గేది యునికి మాపౌరుషమే. 10
క. ఇచ్చటిబంధులు నీవును, [2]నచ్చెరువడి వినుచు నుండ నయి దూళును మా
కిచ్చినను జాలు నంటిని, బొచ్చెము గా దింతపట్టు పూర్ణము సుమ్మీ. 11
శా. ఆదుర్యోధనుఁ డంతమాత్రయును జేయం జాలఁడో [3]కాని పెం
పేదం గ్రూరత కోర్వ రాదు సిరి నా కే లందునే గ్రాసవా
సోదైన్యంబులు వచ్చు నాయరయునీచుట్టాలకుం గావునన్
మోదం బందుట గల్గుఁ గౌరవులు నేముం బొంది శ్రీ నొందినన్. 12
ఉ. అక్కట లాఁతు లైనఁ బగ తైనను జంపన కోర నేల యొం
డొక్క తెఱంగు లేదె యది యొప్పదె బంధుసుహృజ్జనంబు లా
దిక్కన నున్నవారు గణుతింపక సంపదకై వధించి దూ
[4]ఱెక్కట దోష మందు టనునీదురవస్థల కోర్వ వచ్చునే. 13
వ. అని పలికి పాండవాగ్రజుండు వెండియు. 14
ఆ. క్షత్త్రిధర్మ మింత కష్ట మగునె పెఱ, ధర్మ మాచరింపఁ దగ దటండ్రు
గాన శస్త్త్రిజీవికయ తగి యున్నది, యైన వంశనాశ [5]మనభినుతము. 15
వ. అదియునుం గాక. 16
ఆ. కలహ మగుట లక్ష్మిఁ [6]గావించుఁ బ్రాణహా,నియును జేయు నింత నిక్కువంబు
పలువు రొకని కోడి పాఱుట బల్లిదు, లనదచేతఁ జెడుటయును ఘటించు. 17
క. జయ మగునోడుదు మనుని,శ్చయ మొక్కఁడు లేదు వినుము సమరమునఁ బరా
జయము మరణంబుకంటె హృ,దయపుటభేదనము సేయుఁ దథ్యం బనఘా. 18

---

1 మేలిమాటలన మ, మ్మలుకలు దీర్చెద రధికదుష్క-. 2 నచ్చెరువడి చూచుచుండ. ...కిచ్చుటయె చాలు నను టది; జాలు ననుటది. 3 కాక. 4 ఱెక్కుడు...మొందు నను. 5 మనభిమతము; మభిమతంబె. 6 గారించుఁ.

క. కాన యవశ్యముఁ బెనఁకువ, [1]గానియుపాయమునఁ బగఱఁ గడ తేర్పఁ ధృతిం
బూని నడచు నెవ్వఁడు డెం, దానం జెయి వెట్టికొని యతఁడు నిద్రించున్.
ఆ. పగయ కలిగెనేనిఁ బాము న్న యింటిలో, నున్న యట్ల కాక యూఱడిల్లి
యుండు నెట్లు చిత్త [2]మొకమాటుఁ గావున, వలవ దధికదీర్ఘవైరవృత్తి. 20
చ. పగ యడఁగించు టెంతయు శుభం బది లెస్స యడంగునే పగం
బగ వగ గొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే కడుం
దెగ మొద లెత్తి పోవఁ బగ దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు నే
మిగతిఁ దలంచినం బగకు మేలిమి [3]లేమి ధ్రువంబు గేశవా. 21
ఉ. కావున శాంతిఁ బొందుటయ కర్జము దా నది యట్లు లుండె శ్రీ
గావలె నంచుఁ బోరితము గామియుఁ గోరెద మెల్లసొమ్ములుం
బోవుటయుం గులక్షయము పుట్టుటయుఁ వెలిగాఁగ నొండుమై
నేవిధి నైనఁ జక్కఁబడు టెంతయు నొప్పుఁ జుమీ జనార్దనా. 22
చ. మనమునఁ బక్షపాతగతి మాదెస మానుము ధర్మనీతివ
ర్తనముల రెండుదిక్కుల హితంబును బెంపును గల్గు నట్టిచో
ప్పున విదురాదిసజ్జనులబుద్ధికి రా నుచితంబుతోడిమె
ల్పునఁ [4]బరుసందనంబునను భూపతు లెల్ల నెఱుంగ నాడుమీ. 23
చ. [5]తగవునఁ బోక రాజు పెడిదంబులు వల్కనయేని సైఁచి యొ
ప్పుగ నిలుమీ గురుత్వముఁ బ్రభుత్వమునుం గలపెద్దవారిమా
ట గొనమి యాసుయోధనుకడఁ నిలువఁ మన మెల్ల గారవం
బుగఁ గురువృద్ధుపల్కుఁ దలఁపుం జన నిచ్చిన మెచ్చరే జనుల్. 24
మ. సుతువాఁడై వినయంబు సేకొనక యేచొప్పుం దగం [6]జెప్ప కా
ధృతరాష్ట్రుం డవినీతిఁ జేసినను సంధింపంగ రాదంచు వే
గ తెగం బాఱకు తెంపు సేయునెడ లోకం బెల్ల మెచ్చం బ్రకా
శితధర్మస్థితి నొంది మామనము నిశ్చింతంబు గాఁ జేయుమీ. 25
ఆ. ఇన్ని సంకటముల నిబ్బంగి నెంతయు, నొగులుచిత్తవృత్తి నొవ్వ దీర్ప
వెజ్జ వీవ కావె వేయేల యేగతి, నడపఁ దలఁచి తదియ నాకుఁ బ్రియము. 26
వ. అని చెప్పి తలంచికొని వెండియు ని ట్లనియె. 27
క. నీవు సుయోధనుపాలికిఁ, బోవఁగ వల దనియు నొక్కబుద్ధి వొడమెడుఁ
గోవింద యతఁడు మంత్రులుఁ, [7]గావరములు చక్క వినరు కార్యవచనముల్.
తే. కుటిలమతు లవినీతులు క్రూరకర్ము, లట్టినీచులకడకు ని న్ననుపఁ జాల

1 కానియుపాయంబునం బగఱ దీర్చు...దానం జే యొడ్డుకొని యతఁడు. 2 మొకవిధమై తోఁచు. 3 లేదు. 4 బరుసంబు మాని పెఱ. 5 తగవులఁ... మెల్లగారవం... గులవృద్ధు. 6 జేయ కా...సిదింపంగ; సందిలంగ. 7 [illegible]

నీవు సంకట[1]పడియెడు దేవపదవి, నైన నే నొల్ల నొంటి యం దరుగు టుడుగు.

చ. అనవుడుఁ గృష్ణుఁ డి ట్లనియె నాధృతరాష్ట్రుఁడు నట్టివాఁడ త
త్తనయుఁడ యేల [2]నీపలుకు తథ్యము నీతలఁ పే నెఱింగితి
న్మనమున శంక దక్కుము విరన్ వలతే విను మేను నిక్క మ
ల్గిన నచటం గలండె రణకేళికి మార్కొన నొక్కఁ డేనియున్. 30

క. పనుపుము కౌరవసభ కేఁ, జను టెట్లును మేల యర్థసంసిద్ధి యగున్
మన కొకటం బాపము రా, కునికికిఁ గత మైనపలుకు లొండెను గలుగున్.

వ. అని పలికిన యుధిష్ఠిరుం డి ట్లనియె. 32

ఆ. మేలు గాక నీకుఁ బోలిన ట్లయిన నం, దఱిగి యేము వారు నర్థిఁ బొంది
[3]యుండునట్లు గాఁగ నొడఁబాటు గావింపు, మెల్లభంగి మనకు నిదియ లెస్స.

క. మ మ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు, నెమ్మి యెఱుఁగు దర్థసిద్ధినెఱి యెఱుఁగుదు వా
క్యమ్ములపద్ధతి నెఱుఁగుదు, పొ మ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్. 34

కృష్ణుఁడు ధర్మరాజుతోఁ గౌరవులదుర్నయంబు సెప్పుట.

సీ. అనిన ముకుందుఁ డి ట్లనియె సంజయునిమా,టలును నీ వన్నపల్కులును వింటి
నీమది ధర్మైకనిష్ఠమై నున్నది, వైరంబు విడువరు వారు ద్రోణ
భీష్ములు గల రని బిరుదు లై యున్నవా, రగునె రాజన్యుల కడఁగి కుడువ
నక్లేశవృత్తి రాజ్యముచవి గొన్నవా, రేల [4]యిత్తురు నీకుఁ బాలు సెపుమ
తే. ధార్తరాష్ట్రులు సడికి నధర్మమునకు
నలుక రెన్నఁడు విడువు దైన్యంబు పొడువు
కయ్య మరివర్గజయమునఁ గలుగు నిహప
రములుఁ జిరకీర్తియును బాండురాజతనయ. 35

మ. గురుభీష్మాదులు సూచు చుండ సభ మీకుం గీడు నాఁ డట్లు ము
ష్కరు లై చేసిరి యంత సేసియును బశ్చాత్తాపముం బొంద నో
పర వా రెన్నఁడు నట్టిచోటఁ గృపయున్ బంధుత్వముం దక్కు మె
వ్వరుఁ గోపింపరె యాదురాత్మకులగర్వక్రౌర్యముల్ సూచినన్. 36

వ. కపటపునెత్తంబునెపంబుగా మిమ్ము వెడలనడుచునప్పుడు దుర్యోధనదుశ్శాసనశకునిసూతనందనులు పుయిలోట దక్కి కలకల నవ్వుచుం బలికినపలుకు లుగ్గడింపవచ్చునే వాని విని సమస్తజనంబులు ధృతరాష్ట్రు నిందించుచు మీరు బలవంతుల రయి యుండియు సత్యంబు వాటించి యూరక పోక సూచి యచ్చెరువాటుతో నుమ్మలించు చుండిరి తిట్టువాట్లం బోయెడువారు దైవోపహతు లై

1 పడిచేయు దేవ...నొల్ల నంటి నం దరుగఁ దగదు. 2 యీపలుకు. 3 యుండువిధము కాఁగ...మాను. 4 యిత్తురు మహిఁ బాలు సెపుమ...దైన్యంబు సేయు.

మున్న చెడి యుండుదురు గావున వారలం జెఱుపనుం జులుకన క్రూరాత్ములగు
కౌరవు లెల్లవారికి వధ్యులు గాఁ దగుదురు నీ కేల యవధ్యులైరి పాపాత్ము
లగుహింసకులం బాముల నెట్లట్ల నిర్విచారంబుగా వధియించుట కర్తవ్యంబు.

క. మీతండ్రికి భీష్మునకుం, జేతోముద మొదవ భక్తి సేయన తగు నీ
[1]కాతలకు నేనుఁ జని వి, ఖ్యాతంబుగ నీదువినయ మభివర్ణింతున్. 38

క. చెలులుం జుట్టలు దేశం, బులరాజులు వినఁగ నీదుపుణ్యచరిత్రం
బులు నీవు ధర్మమార్గము, దలఁచుటయుం దెలియఁ బలికెదం గురుసభలోన్.

వ. దానికి దుర్యోధనుం డియ్యకొనక తెఱంగు మాలినమాట లాడుటయుఁ దండ్రి
యతని వారింపనేరమికిఁ దో డుపేక్షకుం డగుటయుఁ జూచి మీతొల్లింటిపా
ట్లునుం దలంచి యెల్లవారును వారిన గర్హింతు రింతియ కాక మనకు నొండే
మి వలయు నాయోపినంతయుఁ బెక్కుభంగుల సంధియ కావింపం జూచెద
నవ్విధంబు [2]సిద్ధించిన మేలు గాదె యట్లు గాక తక్కిన నచ్చోటియుత్సాహంబు
చందంబును నందుఁ జేయం గలవారివర్తనంబులుఁ గొలందులు నెఱింగి నీకు
విజయం బగువిధంబునం జనుదెంచెద. 40

తే. ఆసుయోధనుముక్కున నావి గలుగఁ, బుడమి నీ కీడుఁ గావునఁ [3]బోర కలుగు
నేను గయ్యపుశకునంబు లెన్నియేనిఁ, గంటి నీ వనుత్సాహివి గాఁగ వలదు.

వ. చతురంగబలంబుల నాయితంబు గావించుచు దొరలం బురికొల్పికొనుచు నాల
స్యంబు లేక సమరంబునకు సన్నాహంబు సేయు చుండ వలయు నని పలికిన
విని వృకోదరుండు దామోదరున కిట్లనియె. 42

క. సమరంబు గలుగు ననుచును, మము [4]వెఱపింపంగ వలదు మాధవ నీ వా
కుమతి యగుధార్తరాష్ట్రుఁడు, శమించుకార్యంబు నడపు సౌజన్యమునన్. 43

వ. అని వెండియు. 44

శా. పాపాత్ముండు మదాంధుఁ డాతులువ నీపం పెట్లునుం జేయఁగా
నోపం డడ్డము సెప్ప రెవ్వరును మానోద్రేకముం గర్వముం
గోపంబుం దనుఁ ద్రిప్ప [5]నాప్తజనులం గుందించుటం బోయిన
ట్లే పో నిత్తురు గాన నిన్నతఁడు జాలిం బెట్టెడుం జూడుమీ. 45

ఉ. చొచ్చిన[6]చోన చొచ్చి తెగఁజూచెద నంచుఁ గడంగు చుండు న
న్మెచ్చఁడు బాహుగర్వమున నీచు సుయోధనుఁ డట్టివానితోఁ
బొచ్చెము లేక కూడి మనఁ బోవక పోవఁగ రాదు నాకు వి
వ్వచ్చుఁడు రాచవారుఁ గురువంశముచేటున కోప కుండుటన్. 46

ఉ. పాండవకౌరవుల్ గలసి పాలును నీరును బోలె నెమ్మిమై

1 కాతలఁపున కేఁ జని వి. 2 సిద్ధించెన యేని. 3 బోట కలుగు...గాఁగఁ దగదు.
4 వెఱపింపంగ నేల. 5 నాత్మజనులం. 6 తోన చొచ్చి...కోర్వ కుండుటన్.

నుండఁగ దుష్టచేష్టల సుయోధనుఁ డింతలు సేసె నాతఁ డొ
క్కండ కులక్షయంబునకుఁ గారణ [1]మంత్రది దప్పదైన నీ
వాం డన నేల యాబిరుదు నోపినయంతయుఁ దీర్ప నేర్పునన్. 47

చ. [2]తనపారిపోవునంతకు నుదగ్రతయుం గపటంబు మాన నే
ర్చునె ధృతరాష్ట్రసూనుఁడు యశోభరితం బగు భారతాన్వయం
బున కొకనింద వచ్చు ననుబుద్ధి దురాత్మున కేల కల్గు నా
యనమెయిఁ బోయి హీనగతి నైన ఘటించిన నెంత యొప్పునో. 48

వ. మాకును వారికిఁ బితామహుం డగుభీష్ముండు విను చుండ సుయోధనుతోడం
గురుకులేశ్వరునాస్థానంబున నావచనంబులుగా ని ట్లనుము. 49

తే. అన్నదమ్ములమైయుండియకట[3]మనల, నొరులుదలయెత్తిచూడనొండొరులతోడఁ
బెనఁగ నేటికి నీ సేల పెద్దవారి, బుద్ధి విని పంచి కుడుచుట పోలదొక్కొ. 50

క. అని యెవ్విధమున నైనను, వనజోదర సంధి సేయ వలయుం దగ నే
మును వారును గలయుట భూ, జనులకు నెల్లను హితంబు సౌఖ్యకరంబున్. 51

చ. అనుటయుఁ బిన్న నవ్వు నగి యంబుజనాభుఁడు వల్కె నెన్నఁడున్
విననివి భీముపాలఁ గడు వింతలు వింటిమి మాట లగ్గి చ
ల్ల నగుట భూరిభూధరము లాఘవ మొందుట గాదె యివ్విధం
బున నితఁ డిప్డు మార్దవముఁ బొందుట యింకిటఁ జెప్ప నేటికిన్. 52

శ్రీకృష్ణుఁడు భీమసేనునిఁ గౌరవులతోడి యుద్ధమునకుఁ బురికొల్పుట.

తే. అని సహోదరు లాజి నాయాసపడుట
కోర్వమియుఁ గౌరవులఁ జంప నొల్లమియును
గలుగు నెయ్యంబు పెంపునఁ గరుణ నార్ద్రుఁ
డైనపవనజుఁ బురికొల్ప నాత్మఁ దలఁచి. 53

వ. మురమర్దనుం డతనితో ని ట్లనియె. 54

ఉ. యుద్ధముమీఁదివేడ్కయు మహోగ్రవిరోధుల [4]నల్కఁ జేయుద
ర్పోద్ధతియున్ సుయోధనునియున్నతి సైఁపనియేపు రాజ్యసం
సిద్ధి నిజాగ్రజన్మునకుఁ జేయుతలంపును గల్గునీ వసం
బద్ధము లైనవాక్యములు వల్కుట యొప్పునె కీచకాంతకా. 55

వ. అని యంత నిలువక. 56

క. వెఱ పెట్టిదియో యెన్నఁడు, నెఱుఁగనినీయట్టివాని కెవ్వరొకో యీ
పిఱికితన మింత యలవడఁ, గఱపినవా రనుచు శౌరి గలకల నవ్వెన్. 57

వ. దానికి దరహాసితవదనుం డగుచు భీమసేనుండు వసుదేవసూనున కిట్లనియె.

1 మం దది...దేర్పు నేర్పునన్. 2 తన పాలివోవు... యంత యొప్పునే. 3 మనకు

ఉ. బంటుతనంబు మాటలకుఁ బాఱకు పాండునృపాలుపాలు నై
కొంటయు చాలు నన్ను నృపకుంజరుపల్కుల కడ్డ మాడ రా
కుంట యెఱుంగవే మును సుయోధనుచందముఁ జూపి యప్పు డే
మంటి యుపేంద్ర నన్నని రణాగ్రమునన్ నిను మూదలించెదన్. 59

క. నాకొలఁది విచారింపక, నీ కిట్లనఁ దగునె మిన్ను నేలయు నిమ్మైఁ
గాక తిరుగంగఁ బడినం, బో కే ముంజేతు లొడ్డి పోవఁగఁ ద్రోతున్. 60

ఉ. నావుడు నవ్వుటాల కనినం బవనాత్మజ యింత యేటికిం
గేవలయోధవే పరులకిల్బిషముల్ దలపోయ కిమ్మెయిన్
జావడ మైనఁ జూచి యిది చందము గాదని యంటిఁ గాక నీ
చేవయు లావు నీవు మును [1]చేసినభంగులు నే నెఱుంగనే. 61

వ. అని చెప్పి మాధవుండు మఱియును. 62

ఉ. పార్థుఁడు పోరఁ దేరు గడపం దనకున్ ననుఁ గోరి యెంతయుం
బ్రార్థన సేసె దాని కనురాగము వొందితి నేను గాన యు
ద్ధార్థుల మైనమాకు నిను నాసపడం దగదే యశంబు నా
నార్థములున్ విరోధి[2]విజయంబునఁ దక్కఁ గ నొంటఁ గల్గునే. 63

వ. అనవుడు. 64

శా. ఏమీ పార్థుఁడు నీవు దండిమగ లై యీవచ్చుకౌరవ్యసం
గ్రామక్షోభము బాహుదర్పమునఁ దీర్పం బెద్దమి ట్టెక్కి మి
మ్మే మెల్లన్ వెఱఁ గంది చూచెదము గా [3]కీసారెకుం బోయి రా
భీముం డి త్తఱి రిత్తమాటలకుఁ గోపింపండు సూ పెం పఱన్. 65

వ. అని పలికి యివ్విధంబున గోపాలదేవు మేలంపుమెయివడికార్యవచనంబులకుం దగం దానును దోడ్తో సరసం బాడుటయ కా మఱుమాట లాడి యంతటఁ దని వోవక బకమర్దనుం డతనితో ని ట్లనియె. 66

ఉ. కయ్యము గల్గిన ట్లయిన గంధగజప్రకరంబుకుంభముల్
వ్రయ్యఁ దురంగ[4]పంక్తులు ధరం బడఁ దేరిగముల్ బడల్పడన్
దయ్యమి కీవు వెక్కసపడన్ గదపండువు సేయఁ గోరునా
దయ్యమునెత్తికోలు దుది దాఁకుట గాదె భుజంగభంజనా. 67

చ. అన విని దేవకీతనయుఁ డాతని కిట్లనుఁ జెప్పినంతకం
టెను మిగులంగఁ జేయుదు గడిందిమగండవు నిన్నుఁ [5]దెప్పగాఁ
గొని పలుమాఱు నాపదలకున్ భయ మొందక దుఃఖవార్ధి లీఁ
దినమము నెల్ల నిక్కొఱంత దీర్చి సుఖాత్ములఁ జేయు పావనీ. 68

1 చేసినచందము నే నెఱుంగమే. 2 వినయంబునఁ దక్కఁ నొకంట. 3 కీసారికిం ...భీముం డింతటి. 4 సంఘములు వ్రాలఁగఁ...దుద దాఁకుట. 5 దేపగాఁ.

క. ఇదె పోయెదఁ గౌరవ్యులఁ, బదనికి రాఁ బలికి సంధి వాటించెద నా
కది యొప్పదె [1]కాని తుదిం, గుదు రింతకు నీవ కావె గుణరత్ననిధీ. 69

అర్జునుఁడు శ్రీకృష్ణునితోఁ దనయభిప్రాయంబు సెప్పుట.

వ. అనిన వాసుదేవున కర్జునుం డిట్లనియె. 70

తే. చెప్పఁ గలయంతవట్టును [2]జెప్పె నీక, జాతశత్రుండు వింటివి వా తెఱంగు
మాకు నెల్లను బలుకంగ మాట లొండు, గలవె యైనను జెప్పెదఁ గన్నయంత.

మ. ధృతరాష్ట్రుం డతిలోభదూషితుఁడు ధాత్రీభాగ మీ నేర్చునే
సుతుఁడుం గష్టుఁడు సంధి యేల యగు నంచున్ మున్న కై పెక్కున
ట్టితలం పచ్యుత నీకు గల్గినది గాండీవంబు దివ్యాస్త్రసం
తతియుం బెట్టినయట్ల యుండ మముఁ జింతం బాప రాదో కదే. 72

ఉ. నీ వొనరింపఁ [3]బూనినపనిం గమలోదర కీడు వుట్టునే
కా వనినట్ల యుండి యవుఁ గార్యము ల ట్లగుటం బ్రయత్నసం
భావన సేఁత పౌరుషముపద్ధతి తత్ఫలసిద్ధి వొందుచో
దైవము దోడ్పడన్ వలయుఁ దథ్యము రెండును నీవినోదముల్. 73

ఉ. [4]వేరిమి ధర్మజుం బరిభవించినద్రోహులు వధ్యు లన్న నె
వ్వారికిఁ బోలదే సుజనవత్సల నీవిటు లంట వారు మ
మ్మారస మెత్తి కీడ్పఱిచి యింతలు సేసినదాన నీమదిం
గూరినవొవ్వసొంపునను గోపము పెంపునఁ గాదె యాఱయన్. 74

ఉ. ఐనను జిత్తగింపు ద్రుపదాత్మజ నాసభ నట్లు సేసినన్
దానికి సైఁప లెస్స యని దైన్యముఁ [5]బొందుట కోర్చి యమ్మెయిం
గాననభూమికిం జనుట కారుణికోత్తమ నీ వెఱుంగవే
కాన సహించి పాండవులఁ గౌరవులం దగఁ గూర్ప నేర్పునన్. 75

తే. అలవి యెఱుఁగక ధార్తరాష్ట్రులు గడంగి, మమ్ముఁ బఱిచినపాటులు మానసమునఁ
జవుటఁ బెట్టినవిత్తులచంద మొంది, యంకురింపక చెడి పోయె నంబుజాక్ష. 76

వ. అమ్మెఱకుల నెమ్మెయి నయినను. 77

క. ఒడఁబఱిచి [6]మాకు వారికిఁ, బుడమి సగము గాఁగఁ జేసి పొంది పొసఁగి యుం
డెడునట్టి తెఱఁగు సేయుట, కడు మే లది గౌరవము సుఖంబును జేయున్. 78

క. నీ కిట్టిది చిత్తమునకు, రా [7]కుండిన నేని వలదు రం డిమ్మెయి మీ
రీకార్యము సేయుం డని, మా కానతి యిమ్ము కంసమర్దన తెలియన్. 79

మ. హిత మిబ్భం గిది మాకు ధర్మము తెఱం గిట్లుండు నం చేను నీ

---

1 కా కున్నం. 2 జెప్ప నీ. 3 బోయినపనిం...భావన శాంతి పౌరు. 4 వీరలు ధర్మజుం. 5 బొందట నూచి...గూర్ప పెంపునన్. 6 మాకు నిపుడీ, పుడమి సగము చేసి

మతి బోధింప వలంతినే హితము ధర్మంబులఁ విచారించి చూ
చి తగం బొమ్మని యేదిపంచి తది నిశ్చింతంబునం జేసి యు
న్నతిం బొందం గలవార మై యునికి [1]కృష్ణా నేఁడుగా వచ్చెనే. 80

వ. అనిన విని కృష్ణుండు విజయున కిట్లనియె. 81

చ. వెరవున లావునం గృషికి వేయువిధంబుల మేలొనర్చినం
దొరకొనునే ఫలంబు [2]దఱితోఁ దగువర్షము లేకయున్న నె
ప్పరుసున లెస్స సేసినను బౌరుషముల్ ఫలియించు నెల్ల నా
దరణమునం బ్రసన్న మగుదైవముచేతన చూవె ఫల్గునా. 82

ఉ. కావున సంధికిం బురుషకార మొనర్చెద నోపినంతయుఁ
దైవముచేత నె ట్లగునొ దాని నెఱుంగ సుయోధనుండు సం
భావన సేసి పాలొసఁగు[3]పాడియ కల్గిన బాల్య మాదిగా
నేవిధి నైననుం జెఱుప నింతలు పాపము లాచరించునే. 83

వ. అది యెల్ల నట్లుండె నిచ్చట విరాటుపసులఁ బెట్టింప నీవు వోయినయప్పుడు
భీష్ముండు దుర్యోధనుతోఁ జెప్పిన తెఱంగు. 84

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగ రాదు రా
లచ్చికి నై పెనంగిన బలంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చగుఁ గుం దగుం దొడరు డెల్ల[4]విధంబుల కోర్చు టట్లు గా
కిచ్చ దలంచి యొక్కమెయి నిత్తఱిఁ బొం దగుచేతయుం దగున్. 85

వ. అనియె దాని కతం డుత్తరం బిచ్చిన తెఱంగు. 86

ఆ. మనకుఁ బాండురాజతనయవర్గమునకు, నెట్లు వొందు గలుగు నేను రాజ్య
భాగ మీను సమర[5]భంగిక విక్రమ, నిరతిఁ బూను టిదియ నిశ్చయంబు. 87

వ. అని పలికె నది యంతయుఁ బదంపడి మన మెల్ల వింటిమ కాదె యామాటల
ఫలం బప్పుడ కనియు నాకష్టాత్ముండు వెండియుఁ దెలియండు. 88

తే. అతనిగుణదోషముల[6]చంద మట్ల యుండె, నాకు ధర్మజుబుద్ధిన నడప వలయు
నిత్తెఱం గాచరింపంగ నేఁగి యచట, నెల్లతెఱఁగును నేర్పడ నెఱిఁగి వత్తు. 89

చ. అనిన ముకుందుతో నకులుఁ డల్లన యిట్లను నీకు ధర్మజుం
డును బవనాత్మజుండు నరుఁడుం దగఁ జెప్పుట రిత్త గాదు మా
మనము లరణ్యవాసమున మత్స్యమహీపతిపాల నున్నయ
ద్దినములభంగి గాదు కృపఁ దీవ్రతఁ గుందినచంద మయ్యెడున్. 90

క. కడవఁగ నొకళ్లు పసరము, [7]నడిచిన నొక్కళులుఁ బెయ్య నడువ వలయునే

1 కృష్ణా మేలు (రెండు ; యొండు) గావచ్చునే. 2 తఱి పొం దగ. 3 పాటియ.
4 విధంబుల మేల యట్లు...దలంప నొక్క. 5 భంగికి...నియతిఁ. 6 భంగి యట్టు లుండె.
7 నడచిన మఱియొకఁడు పెయ్య.

చెడుతెరు వాకౌరవ్యుల, కడ నిలుచుం గాక [1]మనకుఁ గార్యం బేలా. 91

సీ. గోగ్రహణంబునఁ గోలె నెంతయు మెత్తఁ, బడ కుండుదురె వారు పద్మనాభ
నీయనుగ్రహమున నెమ్మిమైఁ గూడిన, బలము లే డక్షౌహిణులును దొరలుఁ
బాంచాలయాదవపాండ్యకేకయమాత్స్య,లోకతెంపు నెఱుఁగకయున్నవారె
భీమార్జునులలావు[2]పెంపును నీసహా, యంబును గెలుగుట కలుక రెట్లు

ఆ. గురుఁడుఁ గృపుఁడు బాహ్లికుఁడు భీష్ముఁడును బుద్ధి, సెప్పి వారిఁ జక్కఁ జేయ రెట్లు
కార్య మీవు సెప్పఁగా విదురుండు వి,నంగ నెట్లు గా దనంగ వచ్చు. 92

వ. అట్లుం గాక నీవు దమపాలికిం బోవుట ధార్తరాష్ట్రులాదరింప కుండ వెఱవ
రే నీవోయినప్పుడ యీకార్యంబు చక్కనగు ననిన విని సహదేవుండు వాసు
దేవున కిట్లనియె. 93

ఉ. రక్కసమాట లాడెదరు రాజును దమ్ములు వానిలోన నీ
వొక్కటి యైనఁ గాదనక యూఁకొను చుండుట యంతకంటె మే
లక్కడ యిట్లు [3]వేఁడికొన నైనను బోయెదు వో సుయోధనుం
డెక్కడ భూమిలోన సగ మిచ్చుట యెక్కడ దానవాంతకా. 94

మ. తలఁపం గూడునె యింతలేసిదొర లీదైన్యంబు చుట్టంబులుం
జెలులుం దిట్టరె లాఁతిరాజులకు మెచ్చే యివ్విధం బిట్టిదిం
గలదే వేఁడఁగఁ ధర్మజుం డడుగఁ బోఁగాఁ గృష్ణుఁ డాధార్తరా
ష్ట్రులు పా లీక చలంబునం బెనఁగ నిట్లుం గూడు దీ పయ్యెనే. 95

ఉ. వీరలు ధర్మమార్గము సవిస్తరతం [4]దగ నాడిరేనియు
న్వారలు దాని కియ్యకొనిరేని విను మచ్యుత యట్టిసంధి పెం
పారఁగ నేర్చునే యుచిత మైనది కయ్యము వంకమాట లే
నేరఁ గురుప్రవీరుసభ నిశ్చయ మిట్టిద కాఁగఁ జెప్పుమీ. 96

మ. తుది [5]రాజ్యమ్మునగమ్ము గో మ్మడవియందుం బేరు వంచించియుం
బదుమూఁ డేఁడులు నీవునుం దిరిగి రా పా లీక పో వచ్చునే
యది గాదేఁ దెగి బంట వై యఱుము మాయల్ వన్ను నే ర్పింకఁ జె
ల్లదు సూ నీ కని యాసుయోధనుని యుల్లం బుచ్చి పో నాడుమీ. 97

మ. అనినన్ సాత్యకి ప్రీతుఁ డై యితఁడు లెస్సై యుండఁ బల్కెం బ్రయో
జనముం గల్గదు గౌరవంబుఁ జెడు దుశ్చారిత్రకుం డాసుయో
ధను బోధింపఁగఁ బోయినన్ సరభసోత్సాహంబుమై నున్నవీ

1 మాకుఁ గ్రౌర్యం. 2 పెంపున కవుసహా, యంబు. 3 వేఁడికొని యైనను. 4 దెగ
నాడి రన్నియున్. 5 రాజ్యంబును గొంచుఁ బేరడవు లందుం జేరఁగన్ బంచియున్, బది
మూఁ డేఁడులు నిండె నంటి రిది (నీవనం దిరిగి) రాఁ బాలీక పోవచ్చునే ... మాయం జన్న నేఁ

రనికాయంబున కెల్లనుం బ్రియము సంగ్రామంబు మే లెమ్మెయిన్. 98

వ. అనిన విని రథికవరు లందఱు సహదేవుం డింత యొప్పు నాడునే సాత్యకిపలుకు లిట్లుండునే [1]తక్కటివి యెక్కుడిమాటలు పగవారి నడిగికొనం బోవుట యుచితం బఁట కయ్యంబు కర్జంబు గా దఁట భంగంబు నీఁగికొనం దగ దఁట యనునివి మొదలుగా ననేకు లనేకప్రకారంబుల వీరాలాపంబులం గొలువెల్ల నొక్కమ్రోఁతగాఁ జెలంగినయెలుంగులు నింగి ముట్టెఁ దదనంతరంబ. 99

—॥ ద్రౌపది కృష్ణునితోఁ దనమున్ను పడినభంగపాట్లు సెప్పుట. ॥—

తే. ధర్మనందనుపలుకులు దనకు హృదయ, తాప మొనరింప మోమున దైన్య మొంద నున్న పాంచాలి యిట్లని యొయ్యఁ బలికెఁ, గనలి శౌరితో గద్గద[2]కంఠి యగుచు.

ఉ. అంతలు [3]నేసి పో నడిచి యక్కట సంజయుచేతఁ జెప్పి పు
త్తెంతురె యిట్టియూఱట మదిం బ్రియ మంది యుధిష్ఠిరుండు దా
నంతన యూళ్లు లేవురకు నైదు సుయోధనుఁ డిచ్చునొక్కొ యీ
కంతకృపావిహీనమతి నాతఁడు నోఁచునె యన్నదమ్ములన్. 101

చ. తనమునుపడ్డ[4]బన్నములుఁ దమ్ములపైఁ గలకూర్మి పేర్మి నీ
జనపతి సైఁప కున్నె యది సక్కన రాజ్యముపాలు లేక తీ
ఱున కొడఁబాటు గల్గిన నెఱుంగమి పెట్టరె చాలరైరి వీ
రనరొక్కొ నాన లేమి యని యాడరె లోకమువారు కేశవా. 102

శా. [5]పెం పేదం దమ కిట్టితక్కువలు రూపింపంగ నేలా విచా
రింపన్ వారిక మేలు సంధి దమ వారిం జూచినం దారు సా
ధింపం జాలరొ కాక పోరఁ దగ మర్దింపం దలంపేని శం
కింపం బట్టొకొ వారు బ్రాహ్మణులె యేకీడైన సైరింపఁగన్. 103

ఉ. [6]ఓట యొకింత యేనియు సుయోధనుచిత్తమునందు లేదు నీ
మాటలఁ బోవునే దురభిమానము యెక్కుడు పూనుఁ గాక య
చ్చోటన సంగరంబు లగుచోఁ బ్రాలు పుట్టిన నైనఁ బాండవుల్
పోటున కిచ్చగింతురొక్కొ పోదురొ కానల నుండ నచ్యుతా. 104

ఉ. ఏ నిటు లంటి నావలవ దింకను నీవును రాజుఁ దమ్ములుం
గా నుచితంబు సూచి మనకార్యము మీసుజనత్వముం జెడం
గా నొకభంగి సేయక తగం గురువర్గముతోడిసంధి మీ
కైన తెఱంగునన్ వలచినట్టుల చేయుఁడు నేర్పు లేర్పడన్. 105

వ. అని మఱియు నిట్లనియె. 106

---

1 తక్కిన యవి యేటిమాటలు. 2 కంఠ. 3 నేసె. 4 భంగములుఁ దమ్ములపైఁ... సైఁప లెస్స యది. 5 పెం పేలా తమ కిట్టి. ... గాన్. 6 ఓటమి కింత యేనియు ... న సంగతంబు.

ఉ. ఆఱడిఁబోకయుఁ ఫలము నందుటయుం గని పల్కనేర్మిఁ
మాఱటనోరిదాన నయి మాటలు చిత్తమునందు నిల్పకేఁ
గాఱులు [1]ప్రేలెదఁ వినుఁడు కర్జము నెగ్గును గాన నల్కమై
వీఱిఁడి యైనమానినికి వెండి వివేకము గల్గ నేర్చునే. 107

చ. వరమునఁ బుట్టితిఁ భరతవంశముఁ జొచ్చితి నందుఁ బాండుభూ
వరునకుఁ గోడ లైతి జనవంద్యులఁ బొందితి నీతివిక్రమ
స్థిరు లగుపుత్త్రులం బడసితిఁ సహజన్ముల[2]ప్రాపు గాంచితిఁ
సరసిజనాభ యిన్నిటఁ బ్రశస్తికి నెక్కినదాన నెంతయున్. 108

వ. అట్లుంగాక. 109

ఉ. నీవు సుభద్రకంటెఁ గడు [3]నెయ్యము గారవముం దలిర్ప సం
భావన సేయు దిట్టిననుఁ బంకజనాభ యొకండు రాజసూ
యావభృథంబునందు శుచి యై పెను పొందినవేణి వట్టి యీ
యేవురుఁ జూడఁగా సభకు నీడ్చెఁ గులాంగన నిట్లొనర్తురే. 110

ఉ. ఆసభ నేకవస్త్రి యగు నట్టిననుం గొని వచ్చి నొంచుదు
శ్శాసనుఁ జూచుచుం బతు లసంభ్రము లై [4]తగుచేష్ట లేక నా
యాసలు మాని చిత్రములయాకృతి నున్నయెడన్ ముకుంద వి
శ్వాసముతోడ నిన్ గొలువ వచ్చె మనం బదియుం దలంపవే. 111

చ. అరయమిఁ జేసి కోడ లన [5]కప్పుడు దాసిగఁ జేసె నమ్మహా
పురుషునిపాలికిం బతులు పోవఁగ వీరలతోన యేలు జె
చ్చెరఁ జని కోటరంబు దగఁ జేయుదునో యటు గాక పాడిమై
వరవుడ మోపి చేయుదునొ వారికి మాధవ నిశ్చయింపుమా. 112

వ. అని యట్లుగ్గడించి. 113

ఉ. [6]ద్రోవది బంధురం బయినక్రొమ్ముడి గ్రమ్మున విడ్చి వెండ్రుకల్
దా వలచేతఁ బూని యసితచ్ఛవిఁ బొల్చుమహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలఁగ మనంబునఁ బొంగువిషాదరోషముల్
గావఁగ లేక బాష్పమును గ్రమ్మఁగ దిగ్గనలేచి యార్త యై. 114

వ. గోవిందుముందటం బెట్టి యిట్లనియె. 115

క. ఇవి దుస్ససేనువ్రేళ్ళం, దవిలి [7]సగము ద్రెవ్వి పోయి దక్కినయవి కౌ

1 సీఱెదఁ వినుము...గాన్ప నల్క...మానినికి. 2 ప్రోపు. 3 నెమ్మియు...పంకజ నేత్ర ...గులాంగన లిట్టు లోర్తురే. 4 తనుచేష్ట ... నాయాసలు మాల ... యాకృతి నున్నెడ యో ముకుంద. 5 కప్పుడు గాసిగఁ జేసి...కోటరీకమును (కోట్రికంబు...వరవుట) ...పాటి మై పర మిటు మోపి. 6 ఆపనజాయతేక్షణ రయంబునఁ గ్రొమ్ముడి వీడ్చి (గ్రన్నన నీడ్చి; గ్రమ్మ ఱ నీడ్చి) ...వలచేతఁ బట్టి (బూన్చి)...విషాదవేదనల్. 7 సగము ద్రెస్సి పోయి.

[1]రవులకడఁ దీఱుమాటల, యవసరమునఁ దలఁపవలయు నచ్యుత వీనిన్. 116

సీ. ఈవెండ్రుకలు వట్టి యీడ్చినయాచేయి, దొలుతగాఁ బోరిలో దున్నసేను
తను వింతలింతలు దునియలై చెదరి [2]యూ,పఱియున్నఁగని యుడు కాఱుఁగాక
యలుపాలఁ బొనుపడునట్టిచిచ్చే యిది, పెనుగద వట్టినభీమసేను
బాహుబలంబును బాటించి గాండీవ, మనునొకవి ల్లెప్పుడును వహించు

ఆ. కల్తివిక్రమంబుఁ గాల్పనే యిట్లు బ,న్నములు వడినధర్మనందనుండు
నేను రాజరాజువీనుంగుఁ గన్నారఁ, గానఁ బడయనైతి మేనిఁ గృష్ణ. 117

ఉ. నెట్టన యిట్టియల్క మది నిల్పితి రక్కసతాల్మిఁ జిచ్చొడిం
గట్టినయట్లు పెద్దయును [3]గాలము దీనికి నాఱు వెన్నఁడుం
బుట్టదు దుష్టనిగ్రహము పూని జగంబులు గాచునట్టితోఁ
బుట్టువు నీవుఁ దేజమునఁ బొల్చినభర్తలుఁ గల్గ నచ్యుతా. 118

శ్రీకృష్ణుఁడు ద్రౌపది నూరార్చుట.

వ. అనుచు నెలుంగు రాలుపడ నేడ్చిన యాజ్ఞసేనిం గృపాయత్తచిత్తుం డయి నా
రాయణుం డూరార్చి కూర్చుండ నియమించి కన్నీరు దుడువను బెన్నెఱివేణి
ముడువనుం దగువారి నియోగించి యమ్మానినితో ని ట్లనియె. 119

ఉ. [4]ముచ్చిర నేల నేఁ గలుగ ముద్దియ నాకు వృకోదరుండు వి
వ్వచ్చుఁడుఁ దోడుగాఁగ జనవంద్యుఁడు ధర్మసుతుండు వంప నీ
మెచ్చుగ శత్రుసంక్షయము మేకొని చేసెదఁగాక వేఱొకం
డచ్చుపడంగ నేర్చునె దురాత్ములు గౌరవు లుర్వి యిత్తురే. 120

క. లలనా యుడుఁగుము నీయే, డ్పులకొలఁదియె కురునృపాలపుత్రకళత్రం
బులయేడ్పు లింక [5]వానిం, గలకల నవ్వుచు వినంగఁ గాలం బయ్యెన్. 121

క. యమమహిషఘంటికానా, దము వినఁ గౌతూహలంబు దళుకొత్తెడుచి
త్తములు గలకౌరవుల కి, ష్టము లగునే సంధికార్య[6]శాంతవచనముల్. 122

క. మొదల విధినియతియును న,ట్టిద యందురు పెద్ద లది ఘటింపక పోదే
మదిఁ జూచి చెప్పినను ద,ప్పదు మేరువు దిరిగెనేనిఁ బాంచాలసుతా. 123

తే. పూని పలికెద వినుము రిపుక్షయంబుఁ, జేసి యుజ్జ్వలపుణ్యలక్ష్మీసమేతు
లైనపాండుకుమారుల యధికవిభవ, మీవు సూచెదు తడవు లే దిది నిజంబు.

క. అని [7]యూఱడిలఁగఁ బలికిన, విని యంకిలి దేఱుచిత్తవృత్తి గలుగునం

1 రవులాలంబునఁ దీరెడు, నవసరమునఁ దీర్పవలయు ; దెలుపవలయు. 2 చూ, పఱిగం
దు ననిరొడు కొఱకుఁ గాక ... యలపోలఁ (పొలుపారఁ బోరిలోఁ భుజశక్తితోడను) పేరివి
ల్లెప్పుడును...కడిదివిక్రమంబు. 3 గాలము నాకిటులుండ నెన్నఁడుం...తీవ్రతేజమునఁ బొల్చె
గడుం భయమంది యచ్యుతా. 4 ముచ్చర ... ధర్మసుతుండు గల్గ నీ. 5 వినుచుఁ...
...మందుఁ దెలుపఁ. 6 శాంతవచనముల్. 7 యూఱడించి పలి

గన యే ద్భుడిగెం దగ ఫల్గునుఁ డిట్లని పలికె నపుడు గోవిందునితోన్. 125

తే. పాండవులు ధార్తరాష్ట్రులుఁ బుండరీక, నేత్ర చుట్టరికంబున నీకు నొక్క రూపకావునఁ [1]గోరి యేరూపునందు, నుభయపక్షంబులకుఁ జేయుము చితహితము.

క. ధర్మార్థసంగతంబుగ, ధర్మతనయుచెప్పినట్ల తగఁ బల్కఁగ నా దుర్మతులు కౌరవులు స, [2]త్కర్మమునకుఁ జొరక యున్న దైవము యెఱుఁగున్.

క. అన విని కౌరవులకు మీ,కును హితముఁ బ్రియంబుఁ జేయఁ గోరియ కుంతీ తనయాగ్రజుపని ధృతరా, ష్ట్రునికడకుం బోయెదను గడుం [3]బ్రీతిమెయిన్. 128

క. అని పలికినహరిధర్మవ, చనముల తెఱఁగున కజాతశత్రుఁడు చిత్తం బునఁ బొంగి యట్ల చేయుము, మననిశ్చయ మిదియ దీని మఱవకు మనఘా.

వ. అని కార్యంబు నిశ్చయించి దినశుద్ధి నిరూపించి నారాయణుం జూచి నీనక్షత్రం బు రోహిణిగదా యెల్లి రేవతి నీకుఁ జంద్ర తారాబలంబులు గలవు గమనంబునకు రేపకడయ మేలు పయనం బగుట లెస్స యని చెప్పిన నప్పులుకుల కతండు సగౌరవంబుగా నియ్యకొనినం బాండవాగ్రజుండు గొలువుం గలయం గనుం గొని యెల్లవారును విన [4]నది యట్ల కాక యని పలికి తదనంతరంబ తానునుం దమ్ములుఁ బాంచాలియుఁ బరివారంబును నుచితప్రకారంబున నిజనివాసంబులకుం జనిరి మఱునాఁ డరుణోదయంబునఁ గృష్ణుండు గాలోచితకృత్యంబులు నిర్వర్తించి సూర్యోపాస్తి సేసి యగ్నిసమారాధనం బాచరించి ధరణీసురులం బ్రణామపూర్వకంబుగాఁ బ్రయాణదానప్రముఖపూజావిశేషంబులం బ్రీతులం గావించి వారలయిచ్చునాశీర్వాదంబులును సమంత్రాక్షతదూర్వాంకురాదులునుం గైకొని యుచితప్రదేశంబున నుండి సాత్యకి రావించి. 130

క. మన ప్రజలోఁ గరిపురికిం, జను దేరఁగ వలయువారి సవరణతో రం డని యేర్పడ [5]నియమింపు ప,యన మై యే తెమ్ము నీవు నని తగ మఱియున్.

వ. దుర్యోధనుండు దుష్టాత్మకుం డతండు మన్నించు మానుసులునుం గుటిలబుద్ధులు గావునఁ జక్రగదాద్యాయుధంబులు రథంబునం బెట్టింప వలయు నని చెప్పి పనిచి సమయజ్ఞతం బొడసూపి నిలుచున్న దారుకుం జూచి తేరు పూన్ప నియోగించిన నతండును మణిగణప్రభాపటలజటిలం బగునరదంబు వన్నిశైలసుగ్రీవమేఘపుష్పవలాహకంబు లనం బరఁగుతురంగంబులం బూన్చి [6]గరుడధ్వజం బెత్తి తెచ్చినం దానునుం బయనంపుఁజందంబునఁ గట్టాయితం బై జనంబుల చూడ్కులకుం బండు వగుచుఁ బుండరీకాక్షుండు మంగళతూర్యంబులు సెలంగఁ జామరంబు లుల్లసిల్ల రథం బెక్కినయవసరంబున యాదవపరివారంబుతో

1 బూని...ముచితవిధము. 2 ధర్మమునకుఁ జొరక; బొరయకున్న. 3 బ్రియమెసఁగన్. 4 నిది యిట్ల కదా. 5 నియమింపు (నియమించి) చు, ననఘా యే తెమ్మ. 6 గరుడధ్వజంబు నిలిపి తెచ్చినఁ.

[1]నరుగు దెంచినసాత్యకిం దనరథం బెక్కించుకొని యాంగికంబు లైనశుభసూచకంబులు గైకొనుచుఁ బూర్ణకలశవృషభాదిభద్రపదార్థంబుల నవలోకించుచుఁ బుణ్యాంగనలు సేసలొలుకఁ జిత్తంబు ప్రసన్నతం బొంద వెడలునప్పుడు. 132

సీ. పాండవ యాదవ పాంచాల కేకయ, పాండ్యమాత్స్యాదులు భద్రదంతి
[2]హయరథంబులతోడ నతికుతూహలమున, వచ్చినఁ గనుఁగొని వారి నెల్ల
సంభావనంబుల సంభాషణంబుల, నాదరించుచుఁ దగ నల్ల నల్ల
విభవంబు మెఱయంగ విడిదలపఱ పెల్లఁ, గడచినయత్తఱిఁ గరము శుభము
ఆ. లైనశకునములకు నందఱుఁ బ్రియ మంద, నరుగు చున్న యట్టియవసరమున
రథము రథముఁ గదియరా నిచ్చి ధర్మ నం, దనుఁడు నెమ్మి నిట్టు లనియె హరికి.

ఉ. వచ్చె జనార్దనుం డనినవార్తకుఁ బ్రాణము మేని కంతకున్
వచ్చిన సేద దేఱుఁ గురువంశపవిత్రచరిత్ర గొంతి నీ
వచ్చటి కేఁగి పాండవుల[3]యందఱమా అని చెప్పి మ్రొక్కుచున్
గ్రుచ్చియ కౌఁగిలించుకొని కుందినచిత్తమునొప్పి దీర్పుమీ. 134

చ. అడవికి నేఁగునాఁడు మము నంపఁగ నెంతయు దవ్వు[4]వచ్చిన
ప్పుడు దనమోము దైన్యమునఁ బొందెడునశ్రులుఁ జూచి చూచి య
ట్లొడఁబడి డించి పోవలసె నుమ్మలికమ్మున గొంతి యింతకున్
బడు గయి పాలలోఁ బడినబల్లివిధంబున నుండ కుండునే. 135

క. లక్కయిలు గాలినది మొద, లక్కట మాతల్లి మాకు నై నెవ్వగతోఁ
బెక్కిడుమలఁ బడు చున్నది, దిక్కెవ్వరు లేనియట్లు దీనత్వమునన్. 136

క. ఏ ననుట గాఁగ దుఃఖము, లైనవి దెగుసమయ మయ్యె నని చెప్పుము మీ
మేనత్త నూఱడింపుము, దా నెప్పుడు నీవు గలవు తన కను చుండున్. 137

వ. అని చెప్పి వెండియు. 138

ఆ. [5]గురుఁడు బాహ్లికాదికురువృద్ధులును సుహృ, ద్బాంధవులు నశేషధరణిపతులుఁ
బ్రీతిఁ బొంద నెవ్వరికి నేది దగుఁ బ్రణా, మాదివిధుల నడపు నాదుపలుకు. 139

క. పరమప్రియమున నాకై, పరిరంభణ సేసి గాఢబాంధవసాంద్రా
దరమున [6]సంభావింపు వి, దురుతో మధ్యస్థుఁ డగుహితుం డతఁ డనఘా. 140

వ. అనిమోఁ దదనంతరంబ యర్జునుండు. 141

చ. [7]జనులు వినంగ రాజ్యమున సాము గొనం గలవారమన్న యీ

---

1 బొడసూపిన. 2 తురగరథంబులతోఁ గూడఁగా వేగ, వచ్చిన...ధర్మజుఁ, డాదరమున నిట్టు. 3 యందఱి(రి)సేమము చెప్పి...గ్రుచ్చి కవుంగలించు. 4 వచ్చె...దనమోముఁ గన్నులను జొప్పెడు (బొడ్మెడు) నశ్రులుఁ...యెంతయున్ బడు గటు పాలలోఁ. 5 గురుఁడు భీష్ముఁ డాది ... నాదుమాట; మాదరమున. 6 సంభాషింపు...మధ్యస్థుఁడును హితుం. 7 ఘనులు వినంగ రాజ్యము సగంబు గొనం గలవార మైన నీ.

[1]జనపతికార్యనిశ్చయము సమ్మతి గైకొని చేసినఁ సుయో
ధనుఁడును దమ్ములుఁ సఖులు దానికి నేమును నియ్యకొందు మొం
డనిన సపుత్రమిత్రముగ నద్దెస నందఱ ద్రొచ్చి పాఁతుదున్. 142

మ. అనినఁ మెచ్చి వృకోదరుం డితఁడు కార్యం బింతదెల్లంబుగాఁ
బొనరం బల్కెనె యంచుఁ బేరెలుఁగు సొంపుం బొందవక్త్రంబు పొ
ల్పున దర్పం బొలయంగ నంగములకుం బొంగారునుద్బృంహిత
ధ్వని యై పొల్చుమహోగ్రసింధురముచందం బొంది యొప్పెం గడున్. 143

క. నకులసహదేవులును దా,నికి సంతస మంది యిట్లు నెయ్యము కయ్యం
బొకతెఱఁగు సేసికొని తడ,యక రమ్మని పలికి రప్పు డచ్యుతుతోడన్. 144

శ్రీకృష్ణుఁడు నారదాదిమహామునులం గని సంభావించుట.

వ. ఇవ్విధంబునం బాండునందను లందఱును గోవిందునకు వలయుమాటలు సెప్పి యతనిఁ గౌఁగిలించికొని యథోచితప్రకారంబున వీడుకొని వలగొని మగిడిరి తక్కినవారలు నర్హంబు లగుతెఱంగుల నామంత్రితు లై మరలిరి మాధవుండు ను బ్రయాణసర్వసంభారనిర్వాహకులఁ గలయం గనుంగొని తగినసల్లాపంబులు సేసి కరినగరంబుపెందెరువు గైకొని దారుకునిచతురత్వంబునఁ దురంగంబుల పటుత్వంబున నత్యంతసమీచీనం బైనయానంబున మనం బలరం జనిచని యొక్కయెడ నారద జమదగ్ని కణ్వాదు లగుమహామునులం గొందఱం గని రథంబు డిగ్గి నమస్కరించి సద్భక్తితాత్పర్యంబునఁ గుశలం బడిగి మీ రిక్కడకు విజయంచేయుటకుఁ గతంబేమి సేయం గలపని యెయ్యది నా కానతిం డనిన నారాయణునకు నారదుం డి ట్లనియె. 145

సీ. అనఘ పుణ్యాత్ముఁడ వగునిన్నుఁ గనుఁగొనఁ, గౌరవసభ నీవు గారవమునఁ
బలికెడిపలుకులభంగు లాకర్ణింప, విదురభీష్మాదులు విను తెఱంగు
నుత్తరం బిచ్చుకార్యోక్తులు నెఱుఁగంగ, వేడుక వచ్చిరి వీర లెల్ల
నని చెప్ప విని లెస్స యట్ల చేయుదురు గా, [2]కని హరి వల్కిన నమ్మునీంద్రు
తే. లతని దీవించి నీవు పో మ్మచటి కేము, నరుగుదెంచెద మని ప్రీతి ననుప నరిగి
యొక్కపుణ్యాశ్రమంబున యొద్దియేట, విడిసి దివసప్రవర్తనవిధులు నడిపి. 146

వ. కమలనాభుండు గదలిపోయి సూర్యాస్తమయసమయంబునఁ గుశస్థలంబు సేరం జనునప్పు డందలివిప్రు లెదురు వచ్చి కాంచి నిజనివాసంబులకుం జనుదెండని పిలిచినం బ్రసన్నవదనుం డగుచు సమ్మర్దంబు వలవ దని పలికి విశాలరమణీయం బైనబహిరంగణంబునం బటకుటీరప్రకరం బెత్తించి విడిసి తగువారునుం దాను ను వారలగృహంబుల కరిగి యభ్యాగతపూజలు గైకొని వారిని సంభావించి విడిదలకుం జని సమయసముచితవృత్తిం బ్రవర్తిల్లుచుండె నంత నక్కడ. 147

1. జనపతికార్య[illegible] 2. [illegible]

తే. వార్త విని యాక్షణమ కౌరవక్షితీశ్వ
రుండు గాంగేయగురువిదురులను బుత్త్రు
సంజయునిఁ గర్ణు సైంధవు శకునిఁ బిలువఁ
[1]బనిచి తా నిట్టు లనియె నందనునితోడ. 148

వ. కృష్ణుండు పాండవ[2]కార్యార్థంబుగా మనయొద్దకు వచ్చుచున్నవాఁడు నేఁడు కుశస్థలంబున విడిసె రేపిందు వచ్చునని వింటి మిట్టియాశ్చర్యంబునుం గలదే సర్వలోకాభిగమ్యుం డగునమ్మహానుభావునకు మన మభిగమ్యుల మైతిమి మన కింతకం టెను బెం పెయ్యది యతం డెవ్వరివలన సంతుష్టుం డయ్యె వారికి శుభంబును నెవ్వరిదెస ననాదరంబు సేసె వారికి నశుభంబు నగుట దప్ప దతనికి వలయుపూజ లాచరించుటకు సంవిధానంబు సేయుము గృహాలంకరణాదిమంగళప్రకారంబు లనుష్ఠింప నియమింపు మతనిచిత్తంబునకు నీవిభవంబును దనమీఁదిప్రియంబునుం దోఁచునట్టి తెఱంగున సమస్తంబును సమకట్టుము. 149

క. అనిన ధృతరాష్ట్రుపలుకులు, గొనియాడిరి సంతసిల్లి గురుఁడును భీష్ముం
డును నొగా కని దుర్యో, ధనుఁడుం [3]బరిచారకప్రతతిఁ బిలిపించెన్. 150

వ. ఇట్లుచితపరివారంబు రావించి యతండు. 151

క. అలుకుఁడు మృగమదమునమ్ము, గ్గులు వెట్టుఁడు గప్పురమునఁ గుంకుమమున గో
డలు వ్రాయుఁడు మణిదామక, ములు గట్టుఁడు పెద్దకూటమున సొంపారన్.

వ. మఱియు నగళ్లెల్లను శోభిల్ల నలంకారంబు సేయుండు. 153

క. పెనుపుం జతురత మెఱయఁగ, మనయింటను దుస్ససేనుమందిరమున శో
భనశిల్పము లొనరింపుఁడు, చనుఁడు వృకస్థలమునందుఁ జప్పరము లిడన్. 154

వ. అది [4]విడిపట్టు గాఁదగియెడుప ట్లని పలికి వాసుదేవుండు రేపకడయ వచ్చు నంతకుమున్న యింతయుం గావింపవలయు నని పనిచి పురంబున నుత్సవంబు సాటుం డని నియోగించి వివిధగంధమహితమాల్యంబులు సంపాదింపను మణిభూషణచిత్రాంబరంబులు సమకట్టను సరసాన్నస్వాదుపానద్రవ్యంబు లొడఁ గూర్పను నేర్పరు లగుతజ్జ్ఞుల నియమించె నట్టియెడ నాంబికేయుండు విదురున కిట్లనియె.

ధృతరాష్ట్రుఁడు విదురుతో శ్రీకృష్ణునిరాక సెప్పి సంతోషించుట.

క. వివిధమణిమయరథంబులు, జవనాశ్వంబులును భద్రసామజములు ర
త్నవిభూషణములు దాసీ, నివహంబులుఁ జాలఁ గృష్ణునికి నే నిత్తున్. 156

క. మనయింట సుయోధనుగృహ, మున దుశ్శాసనుని కేతమున నెయ్యది యా
తనిచూడ్కి కింపు నది యెల్లను గౌరవ మొప్ప నీ వలయు [5]మన కనఘా. 157

చ. అన విని యాతఁ డిట్లనియె నంబుజనాభునిఁ బ్రీతుఁ జేయు కం

1 బనిచి యిట్లనె దనదు నందనునితోడ. 2 కార్యార్థి యై. 3 బరివారకప్రతతిఁ బిలిపించెన్. 4 విడిపట్టు...పట్టు గావలయు నని. 5 మన మనఘా.

ఱెను హిత మైనకృత్య మొకటిం గలదే యది మేలు పాండునం
దనులకు నైదయూళ్లు లుచితస్థితి నిచ్చుట [1]కోప మన్నయు
న్కిన యిటు లోపుకల్మి ధరణీవర యేమిట వచ్చెఁ జెప్పుమా. 158

ఉ. నీతలఁ పేను గంటి నొకనేర్పున శౌరికి లంచ మిచ్చి సం
ప్రీతునిఁ జేసి కార్యగతి భేదము సేయఁగఁ జూచె దింత బే
లైతిగదే సుమేరుసదృశార్థముఁ జూచియుఁ బార్థుఁ బాయునే
యాతఁడు క్రీడిభక్తియును నచ్యుతు పెంపును నీ వెఱుంగవే. 159

తే. అర్జునుఁడు ప్రాణతుల్యుండు హరికి నట్లు, గాన జలపూర్ణమంగళకలశమునకుఁ
బాద్యమునకును గుశలసంప్రశ్నమునకు, మిగుల నొండు జనార్దను మెచ్చఁగాదు.

క. [2]మనకడకు నేమిగార్యం, బున్నకె యాతండు వచ్చెఁ బూనికిమెయి నా
పని వంచింపక చేయుట, విను మతనికిఁ బ్రియము దక్క వేయును నేలా. 161

వ. అనిన విని దుర్యోధనుండు దండ్రి కిట్లనియె. 162

క. అది విదురుచెప్పినట్టిద, తుదిఁ గృష్ణుఁడు పాండుసుతులతో వేఱగునే
పద నెఱుఁగ కీఁగి యిచ్చిన, బెదరి రనరె యొచ్చెమైనఁ బిమ్మట నగరే. 163

ఆ. అతఁడు పూజనీయుఁ డగు నే నెఱుంగుదు, నైన ధనము లీఁగి ననదతనము
వచ్చుఁ బెచ్చువెరిఁగి వైరులు గర్వింతు, రేల పగ యడంగు నిట్టులైన. 164

క. అనవుడు భీష్ముఁడు ధృతరా, ష్ట్రునిన కిట్లను [3]నీవునుం గొడుకు నేమేని
చ్చిన నొకటి యీఁగి లేకు, న్నను వేఱొక్కటి దలంచునా కేశవుఁడున్. 165

క. విను మతఁడు సేయఁ బూనిన, పని దప్పింపంగ రాడు పాండవులం దే
ర్పను గృష్ణుఁడు వెరవుగఁ జొ, చ్చిన మేలాపురుషువనుపు సేయుము పుత్రా.

క. నారాయణుండు ధర్మా, ర్థారూఢము గాఁగఁ బలుకు నది నీవును నీ
వారును గైకొని యెంతయు, గారవమునఁ జేయ నెల్ల కార్యంబు నగున్. 167

క. అనుటయు సుయోధనుఁడు భీ, ష్మున కిట్లనుఁ బాండురాజసుతులకు నిమ్మే
దిని హరి సగపాలీఁ దగు, [4]ననుఁ బోయే నీను గాని యది యట్లుండెన్. 168

వ. వేఱొకకార్యంబు సేయం దలంచితి నది వినుము పాండవులకు నేడుగడయు
జనార్దనుం డతనిం బట్టి బంధించిన ఱెక్కలు విఱిగినపులుఁగులుంబోలె వారు
నాకు విధేయు లగుదురు పాంచాలయాదవాదులైన తదీయబంధుమిత్త్రులు నా
వశంబున వర్తిల్లుదురు సమస్తదేశంబులు నేన యేలుదు దీనికిం దగినయుపాయ
సహాయంబు లనువు సేసెద నీవింక నేమి సెప్పెదవు చెప్పు మనిన విని యతి
ఘోరం బగునవ్విచారంబునకు నమాత్యసహితంబుగా సంతప్తచిత్తుం డై వై
చిత్రవీర్యుండు గొడుకున కిట్లనియె. 169

---

1 కొప్ప కున్నయు. 2 మనదెసకు...పని పంజరంబు (వేగిరంబు) సేయుట. 3 నీవుఁ
గొడుకు చొప్పున నే మి. 4 ననఁ బోయిన నీను.

క. ఓహో యిట్లనుట జగ, ద్ద్రోహం బిమ్మాట మఱవు దూతత్వంబుఁ
మాహాత్మ్యంబును ధర్మో, త్సాహంబును విను మబాధ్యతకుఁ గారణముల్.
క. ఈకారణములు గల వను, నాకొలఁదియె వాసుదేవుఁ డది గాకయుఁ గీ
డే కురు[1]వంశమున కతని, రాక యతం డేమి సేసె రా పాపాత్మా. 171
వ. అని యదల్చె నప్పుడు గాంగేయుం డాంబికేయున కిట్లను నీకొడుకు ప్రాణగొ
డ్డం బైనకార్యంబు సేయం దలంచె దామోదరు నిట్లు సేయం జూచెనేనిం
దానును బ్రధానులును వినాశంబుఁ బొందుదు రింతియ యిది సేసిరేమి సేయ
రేమి యమ్మహాత్మునెడ నీయపకారంబు విచారించినదుష్టాత్ములు నష్టాత్ముల కాక
యని పలికి యే నిట్టిదాని వినంజాల ననుచు మొగంబు గంటువెట్టుకొని దిగ్గన
లేచిపోయె ధృతరాష్ట్రుండును దుర్యోధనునితో నిటువంటికొఱగాములు మనం
బునం దలంచినప్పుడు సేయం గలవాఁడవు గావున దీనం జేటు వచ్చు నుడుగు
మయ్య యని చెప్పి యతనిం దక్కినవారినిం బోవం బనిచి తగినవర్తనంబున
నుండె మఱునాఁడు. 172
సీ. కాలోచితము లగు కరణీయములు దీర్చి, కమలనాభుఁడు రేవకడయ కదలి
తనుఁ గుశస్థలవాసు లనుప రా నందఱు, నాదరంబున నిల్పి యరుగునపుడు
గజ్జంబులును బండ్లు గంధమాల్యంబులు, ధృతరాష్ట్రిసుతుఁడు వుత్తేరఁ బ్రీతి
నెడ నెడఁ గొని వచ్చి యిచ్చిన వాని నె, ల్లను వేడ్కఁ ననుభవించినవిధంబు
తే. సలిపి యనుభవ మొల్లక చనఁగ నెదురు, బాహ్లిక ద్రోణభీష్మాది [2]బంధుమిత్త్రి
గణము సర్వభూపాలలోకంబుఁ గురుకు,మారవర్గంబుఁబుత్తెంచెమనుజవిభుఁడు.

—శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రునిమందిరంబునకుఁ బోవుట.—

వ. ఇట్లు దుర్యోధనుం డొక్కరుండు దక్క నెల్లవారిం దూర్యాదిశోభనపదార్థం
బులు సమకట్టి ధృతరాష్ట్రుండు వనుప నెదుర్కొనిన వాసుదేవుండు వారల
నందఱ నయ్యైతెఱంగుల సంభావించి కృతవర్మ దమవాఁడు గావున నతనికి సవి
శేష స్నేహంబు సేసి యతండు [3]సేరువ రా సమస్తజనంబులుం బరివేష్టింపం
జని తనరాకకు నలంకృతంబును బ్రమోదచాపలసుభగజనంబును నైనపురంబు
సొచ్చి రాజమార్గంబున నరుగునవసరంబున మౌక్తికమిళితంబులు బహుగంధ
లుళితంబులు నగునక్షతప్రకరంబులును బుష్పనికరంబులునుం జల్లుచు సంత
సిల్లుచు మ్రొక్కుచుఁ జొక్కుచు నిరుగెలంకుల రమ్యహర్మ్యంబులపై నిలిచి పొలి
చి కనుంగొనునంగనాజనంబులు దమలోన. 174
సీ. ప్రాణంబుతోఁ గూడ [4]రక్కసిచన్నుల, పాలు ద్రావినప్రౌఢబాలుఁ డితఁడె
వ్రేల్మిడిఁ జాణూరు విఱిచి లోకముల మె, చ్చించినయాజగజెట్టి యితఁడె

1 వంశమునకుఁ దన, రాక. 2 బంధువిప్ర. 3 చేరువఁ దాను... బ్రమోదభాషల శు
భకరంబును నైన. 4 పఱఁతి రక్కసచన్ను, బాలు గ్రోలిన.

దుర్వృత్తుఁ డగుకంసుఁ దునిమి యాతనితండ్రిఁ, బట్టంబు గట్టినప్రభు వితండె
సత్యభామకుఁ బారిజాతంబుపైఁ గల, కోర్కి దీర్చినరసికుం డితండె

తే. వెన్నలును గోపికాచిత్తవృత్తములును
నరసి మ్రుచ్చిల నేర్చిన హరి యితండె
శ్రుతిశిరోభాగములఁ దనసుభగచరణ
సరసిజామోదమును గూర్చుచతురుఁ డితఁడె. 175

వ. అనుచు నతికుతూహలంబున నవలోకింప నాబాలవృద్ధం బగుపౌరలోకం బాలో కనకౌతుకంబునఁ దనరథంబు గదిసిన సందడి జడియువేత్రహస్తుల వారించుచు నారాయణుండు సమ్మర్దమందగమనంబునం జని మణితోరణసుందరం బగురాజ మందిరద్వారంబు ప్రవేశించి కక్ష్యాంతరంబులు గడచి యేనుంగుమొగసాలఁ జొచ్చి యరదంబు డగ్గి యల్లన నడచునప్పు డంతకు మున్న యరిగి భీష్మద్రోణ ప్రముఖు లగువారలు ధృతరాష్ట్రునిం బోదువ నతండుఁ బ్రత్యుత్థానంబు సేసి విదురసంజయసహితంబుగా నెదుర్కొనం జేరి. 176

ఆ. అతనిఁ గౌఁగిలించి యచ్చటఁ గలవిదు, రాదిశిష్టజనుల నాదరార్ద్ర
[1]బంధుదృష్టిఁ జూచి పరిరంభసంభావ, నము లొనర్చి శౌరి ప్రమద మెసఁగ.

వ. వార లందఱకును సాత్యకిని దగినసమాచారంబులు నడపం బనిచె నట మున్న ధృతరాష్ట్రుపనుపునం దెచ్చి పెట్టిన నచ్చోటన యున్నయున్నతకనకాసనంబున నతం డునుప నాసీనుం డయ్యె నవ్వాసుదేవునకు విహితానుష్ఠానపరాయణు లగునగరిపురోహితులు రాజానుమతంబున నర్ఘ్యపాద్యమధుపర్కాద్యుపచా రంబు లాచరించి యతనితమ్ముని నర్హపీఠంబున నునిచి యర్చించిరి నరనాథుం డును దొరలును నిజోచితాసనంబుల నుండిరి కొలు వెల్లను సూర్యోదయసమ యంబునఁ గమలాకరంబువిధంబున [2]వికసించి యుండె నయ్యవసరంబునఁ గృ ష్ణుండు ధర్మనందనువచనంబులుగా నాంబికేయునకుం దగువారలకుం బ్రణా మపరిరంభణప్రముఖసముచిత సంభావనంబులు వలికి సంభాషణంబులకుం జొచ్చె. 178

క. రాజునకుఁ దియ్య మెసఁగెడు, పూజావచనముల నెయ్యపుంబలుకులఁ [3]బే
రోజమెయి బంధుమిత్త్రస, మాజములకు మేలములఁ గుమారులకుఁ దగన్.

వ. ఇంపు పుట్టించుచుఁ గొండొకసేపు నిలిచి పుండరీకాక్షుండు విదురుసదనంబు నకుం జనియెద మఱియుఁ బోవలయునెడలకుం బోయి వచ్చెద నని పలికి యాంబికేయునసుమతి వడసి యరుగ విదురుండు ససంభ్రమంబునం గడచి చని [4]మంగళోపచారసహితంబుగా నెదుర్కొని భయభక్తివినయస్నేహ

1 భావదృష్టిఁ జూచి. 2 విలసిల్లి యుండె. 3 జే నోజనయి. 4 మంగళాచారసహి.

[1]నందంబులఁ గందళితుం డగుచు గోవిందునకు దేవోపచారంబుల ననేకప్రకారంబుల నర్చన లిచ్చి కౌంతేయులకుశలం బడిగిన నతనికి వారలవృత్తాంతంబు సమస్తంబును సవిస్తరంబుగాఁ జెప్పిన యనంతరంబ. 180

క. ముదమునఁ గృష్ణుఁడు గుంతీ, సదనమునకుఁ జనియె నపుడు సమ్మదమున న
వ్విదురుం డోగిర మొనరిం, చెద నని తన్నడుగ నట్లు చేయుం డనుచున్. 181

వ. చని కాంచిన నద్దేవియు నతనితోడుసీడయుంబోనితనకొడుకులం దలంచి యడలు పుట్టిన నమ్మాధవుమెడ వట్టికొని యెలుం గెత్తి యేడ్చిన నతండు సంబోధించి యూరార్ప నెట్టకేలకు నుడిగి యాతనికి నాసనవిన్యాసనాద్యుపచారంబులు సేయించి తత్సమీపంబున నుచితపీఠంబునం గూర్చుండి గద్గదకంఠంబుతో ని ట్లనియె. 182

సీ. నీశిక్షఁ బెరుఁగుట నీతిమంతులుఁ బుణ్య,పరులు శూరులుఁగదా పాండుసుతులు
సుఖవృత్తిఁ బెక్కండ్రుసూరెలఁ గొలువ నుం,డెడువార లిడుమలఁ బడుచు నిర్జ
నం బైనకాననలోనన యెట్లు నిలిచిరి, నను బెట్టి [2]నాయెద గొనుచుఁ జనిరి
యేను వర్ధింపంగ నిం పారఁ గుడిచి మె,త్తనిశయ్య నిద్రించి వినుతభద్ర

తే. గానకరిబృంహితముల మేల్కాంచునట్టి
వారు కందమూలంబు లాహారములుగఁ
బొదలఁ బట్టలఁ బడి యుండి పులుఁగుమొకము
లఱవ మేల్కను చుండిరే యక్కటకట. 183

ఆ. తండ్రి లేనిప్రజలు దల్లిని బాసి పె,ద్దయునుగాల మివ్విధమునఁ బడిరి
భంగపాటు దుఃఖపాటును సంకట, పాటుఁ గలిగె విరటుపాలఁ బిదప. 184

వ. అని వెండియు. 185

ఉ. దానదయాపరుం డయినధర్మతనూభవుసేమ మెట్లు పం
చాననవిక్రముం డగుబకారికి భద్రమె యస్త్రశస్త్రవి
ద్యానిపుణుండు క్రీడి సుఖియా వినయాభరణుల్ గవల్ సమా
ధానసమేతులే యకట ద్రౌపది సాధ్వి [3]సుఖంబె దానికిన్. 186

చ. కొడుకులకంటె నయ్యనుఁగుఁ[4]గోడలి కెక్కుడు గూర్తుఁ గోడలుం
గొడుకులు సేయుభక్తి కట కోటిమడుంగులు భక్తి నాకు నె
ప్పుడుఁ దగఁ జేయుచుండు నది పుణ్యచరిత్ర కులాగ్రగణ్య క్రో
త్రడి సకలంబుఁ జూడ సభ దైన్యముఁ బొందుట నూచి పొక్కితిన్. 187

తే. నాఁడు ద్రౌపది పడినబన్నములు సూడ
[5]నోర్చినప్పుడ యెంతకు నోర్వఁ జెపుమ

---

1 నందకందళితహృదయుం డగుచు. 2 నాయందఁ గొనుచుఁ. 3 శుభంబె దానికిన్.
4 గోడలు నెక్కుడు గూర్చుఁ. 5 నోర్చు నప్పుడె నెంతకు.

యంత గడచినదుఃఖంబు లనుభవింపఁ
గలవె లోకంబువారికిఁ గమలనాభ. 188

వ. అట్టియెడ. 189

క. విదురుం డొక్కఁడు దక్కఁగ, సదస్యు లెవ్వరును ధర్మసంక్షయ మిది గూ
డదు నార యతనిశీలము, కుదు రీలోకమున కింతకుం దలఁపంగన్. 190

వ. అని యివ్విధంబునఁ గృష్ణుతోడఁ దనయుమ్మలికంబు లన్నియుఁ ద్రవ్వికొని శోకంబు వెల్లిగొనఁ గొండొకదిగం బాఱెడుచిత్తంబుతో మఱియు నిట్లనియె.

క. ఇది యెల్లను నొకతల యీ, పదుమూఁడేఁడులును నాకు బావకొడుకుచే
నదయ మగుకూడు గుడుచుట,యది యొకతల యయ్యె నేమి[1]యనఁ గలదనఘా.

క. తన్నుఁ దనతమ్ములను నా, కన్నకొడుకులట్ల తలఁతుఁ గాని విభేదం
బెన్నఁడు నామది లేమికి, వెన్నుఁడ దైవంబ సాక్షి వినుము పలికెదన్. 193

క. ఇది నిక్కం బగునేనియుఁ, దుది నీవుం బాండవులును దురితరహితులై
ముద మందఁ జూడఁ గనియెద, నది దీనికి మందు సువ్వె యంబుజనాభా. 194

సీ. బావ యొప్పం డనుపలుకుల నే మగు, నాతనికొడుకుఁ గీడాడ నేల
కురువృద్ధుఁ డగుబాహ్లికుని దూఱ నేటికి, భీష్ముని పైఁ బ్రియి వెట్ట నగునె
యిట్టి కూఁరిరులయింటి కిచ్చినమనవారి, నందుఁ గా కట్లు దా ననుట మేలె
యర్జునుపుట్టినయప్పుడు వీఁడు లో,కము లెల్ల గెల్చు పొగడ్త మొగులు

తే. ముట్టునట్టిద యగు రణమున జయించుఁ, గౌరవుల సోదరులుఁ దాను భూరిరాజ్య
గౌరవముఁ బొందు నని యశరీరవాణి,పలికె నది దిట్టువడుఁగాక వలయునేని.

వ. ధర్మంబు గలుగునే నది నిక్కం బయ్యెడు దాని కెల్లను నిర్వాహకుండవు నీవు గలవు గాదె నీమన్నించునెచ్చెలులకుం జెప్పెడుమాటలు గలవు విను మయ్యుధిష్ఠిరుతో నిట్లనుము. 196

క. వేఁడికొని కృపణులై కను, పోఁడిమి యది యేల రాజపుత్రులు దమమై
వాఁడిమి దప్పిన నిప్పులు, వేఁడిమి సెడినట్లు జనులు విని యులుకుదురే. 197

వ. భీమార్జునుల కిట్లని చెప్పుము. 198

ఆ. కొడుకుఁ గాంచు రాచకూఁతు రెద్దానికి, నట్టిపనికి నుచిత మైనసమయ
మొదవెఁ దడయు టింక నొప్పదు జనములు,నట్లు గాని పురుషు లనరు మిమ్ము.

క. భుజబలమున జీవించుట, నిజధర్మము మెత్తఁబడుట నింద్యము మాద్రీ
ప్రజలకుఁ జెప్పుము ద్రుపదా,త్మజఁ గార్యం [2]బడుగు మనుము తగ నందఱితోన్.

చ. అలిగినభీమఫల్గునుల కడ్డము లేమి యెఱుంగు [3]దంతలం
తలు వడి వాని నీఁగ వలదా వినుమా పని కెల్లఁ బాండుపు

---

1 యనఁ గల ననఘా ; దానన్. 2 బుడుపు. 3 దెంతలెంతలు.

త్రులె కలవారు నీ కెటులు దోఁచిన నట్టులు సేయువారు గా
కలఘువిచార నాయలఁత యార్పుము నీ గడ తేర్పు మెమ్మెయిన్. 201
వ. అనినఁ గృష్ణుండు గొంతి ననునయించి యిట్లనియె. 202

శ్రీకృష్ణుఁడు గుంతీదేవి నూఱడించుట.

చ. సుగుణవు పుట్టినింటికిని చొచ్చినయింటికిఁ దేజ మెక్కఁగాఁ
దగుచరితంబునన్ నడచుధన్యవు ధీరవు దేవి నీ వెడ
న్వగ లడఁగింప కున్న భువనంబుల నిం కిట నెవ్వ రోర్చువా
రు గలఁక దక్కుమీ హృదయరోగము లన్నియుఁ బుచ్చి వైచెదన్. 203
క. తనయులుఁ గోడలు సేమం,బున నున్నా రధికభక్తిపూర్వముగా దం
డనమస్కారంబులు నీ, కొనరించిరి కౌఁగిలించి [1]రుల్లములఁ దగన్. 204
క. నీకొడుకు లొందుసుఖములు, నేకొన రవ్వీరసుఖమ చిత్తములఁ గరం
బాకాంక్షింతు రలంతులఁ, బోక గలుగు నెట్టు లల్పబుద్ధులె వారల్. 205
క. ఉత్సాహంబున శత్రుకు, లోత్సాదనవిధి యొనర్చి యున్నతసామ్రా
[2]జ్యోత్సవము నొందుపుత్రుల, నుత్సుకతం జూతు గాక యూఱడు మింకన్.
చ. అన విని మోము విచ్చుచు మురారికి ని ట్లనుఁ గుంతి పాండునం
దనులకుఁ దండ్రియున్ గురువు దైవము నారయ నీవ కావె నీ
మనమున ధర్మమున్ హితము మంచిగఁ జూచి [3]విధించినట్ల చే
సి నెగడువారు గాక నినుఁ జేరిన నాపద లొంద నేర్చునే. 207
క. వారలకయేల మాధవ, కౌరవులకు మఱియు నీజగంబుల కెల్లం
జేరుగడ నీవ నీపలు, కారయ వేదంబ కాదె యఖిలంబునకున్. 208
వ. అనినం బ్రసన్నవదనుం డగుచు నద్దేవి గారవించి యామంత్రణంబు సేసి తదా
వాసంబు వెలువడి తనరాకకు నలంకృతం బైనదుర్యోధనుమందిరంబునకుఁ గృ
తవర్మ సాత్యకిసమేతుం డయి పోవుగోవిందునిం గని తదీయద్వారపాలకులు
సంభ్రమంబునం బఱచి యతని కెఱిఁగించి తదనుమతంబునం బఱతెంచి యెదు
ర్కొని కక్ష్యాంతరంబుల సందడి నెడ గలుగ జడియుచు వినయంబునం దో
డ్కొని చన నమ్మనుజవిభుండు గైలాసశిఖరాకారం బగుసౌధంబున బాహ్లిక భీ
ష్మ ద్రోణప్రభృతులును గర్ణ శకుని సైంధవాదులును దుశ్శాసనవికర్ణదుర్ముఖప్రము
ఖులును మఱియు ననేక దేశాధీశులునుం బరివేష్టింపఁ బేరోలగంబున సింహా
సనాసీనుం డై యున్నయెడకుం జనునప్పు డాసుయోధనుండు సపరివారంబుగాఁ
బ్రత్యుత్థానంబు సేయం జేర నరిగి యతనికిం దగువారలకు నాలింగనాద్యుప
చారంబులు దానుం దమ్ముండును నాచరించి. 209

---

1 రుల్లము చెలఁగన్. 2 జ్యోత్స్నవముఁ బొందుపుత్రుల. 3 విధించితట్ల చేసి... జేరిన
వారికిఁ గీడు గల్గునే.

క. అతఁ డనుపఁగఁ గనకమయో, న్నతపర్యంకంబునందు నారాయణుఁ డూ
ర్జిత మహిమ [1]నుండి యభ్యా, ర్చితుఁ డయ్యెఁ దగంగ నతనిచే సత్కృతులన్.

శ్రీకృష్ణుఁడు దుర్యోధనునితో సంభాషించుట.

వ. సాత్యకియును సముచితప్రకారంబునం బూజితుం డయ్యెఁ దదనంతరంబ నిజాస
నాసీను లయి తనమొగంబునం జూడ్కి నిలిపి యున్న దుర్యోధనాదులతో
మాధవుండు మధురసంభాషణంబులు సేయుచుండె నట్టియెడ. 211

తే. సముచితంబుగఁ గూరలచంద మగ్గ, డించి కుడుపు తెఱంగు వుట్టించి పలుకు
నాసుయోధనుతోఁ గృష్ణుఁ డచటఁ దాను, గుడువనొల్లకయునికి యేర్పడఁగఁ జెప్పె.

వ. చెప్పినవిని దుర్యోధనుండు సూర్యసూనువదనం [2]బవలోకించి యల్లన యిట్లనియె.

క. హరి పలికినవిధ మెంతయు, నెర వై యున్నయది వింటె యిమ్మాట తెఱం
గరయుదము తొలుత నీపెను, పరిచందం బెల్ల [3]నెఱుక పడియెడుఁ బిదపన్.

వ. అని యచ్యుతున కిట్లనియె. 215

తే. వలయునన్నపానంబులు పలుదెఱఁగుల, నేర్చువిధముల నేమొడఁగూర్చి వేడ్క
నున్న నీ వుపయోగింప నొల్లకునికి, బాంధ[4]వమునకు నీతికి బాహిరంబు. 216

క. కౌరవులకుఁ బాండవులకు, నారయ నీ వొక్కరూప యసదృశధర్మా
చారుండవు రాజునకుం, గూరుతు గత మేమి యి ట్లగుటకుం జెపుమా. 217

క. అనుడు నుపేంద్రుఁడు మనుజేం, ద్రున కిట్లను దూత లెందుఁ దొలిదొలి గుడువం
గొనఁ గట్టఁ [5]దొడఁగుదురె వ, చ్చినకార్యము దీర్చి పిదపఁ జేయుం డెల్లన్. 218

వ. అనిన గాంధారీనందనుండు దేవకీనందనున కిట్లనియె. 219

ఆ. వేగపడుట మేలె వినుము కార్యము దీఱుఁ, దీఱ కుండు దాని తెఱఁగు దగిన
యప్పు డాడ రాదె యిప్పుడు ముకుఁద్రాటఁ, గాలు గ్రువ్వ నేల కమలనాభ.

వ. నీవు వచ్చినవాఁడవు మాయింటఁ గుడిచి కూర్చుండి యెల్లపనులుం జెప్పుట
యొప్పుఁగాక కుడువ నొల్లననం దగునె దీనికిం గారణంబు నాయెఱింగినయది
లేదు విచారింపక పలికి తనిన మందరధరుండు [6]మందస్మితంబుతో నందఱం
గలయం గనుంగొని ధార్తరాష్ట్రకరంబు గజంబు పల్లవం బల్లన తెమల్చులీలం
గేల నమర్చి యిట్టిమాటలు తేటపఱుప వలయునేని వినుమని యతని కిట్లనియె.

చ. ప్రియ మెసఁగం దగం బిలిచి పెట్టెడుకూ డది లెస్సకూడు ద
క్కయనయహీనతం దమకు నాపద యైనెడ నిట్టు నట్టు నే
మియు నన [7]లేనికూ డెదిరి మేవడి యై చను నీవు మాదెసం
బ్రియుఁడవు గావు మాకు ధృతిపెం పఱ నాపద లే దొకింతయున్. 222

వ. అట్లుం గాక. 223

1 నైనసి యభ్యా. 2 బునం జూడ్కి నిలిపి యి ట్లనియె. 3 నేఱుపడియెడుఁ. 4 వంబున ; వంబున కిది నీతి. 5 గణఁగుదురె. 6 మందస్మితవదనంబుతో. 7 లేమికూ డదియుఁ; దు. దిన.

క. పగవారియింటఁ గుడిచిన, నగుఁ దమ కనుమాన మమృత మైనను దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టఁగఁ, దగ [1]దొడళుల కెప్పు డెవ్విధము వాటిలునో.
వ. నేను బగతుండనె యుంటేని. 225
క. అల్లుఁడు పాండవులకు వా,రలు నాకుం బ్రాణములు ధరావల్లభ యి
ట్టలముగఁ దమప్రాణములకు, నలుగుజనులు పగతు రగుట యనుమానంబే.
ఆ. కారణంబు లేక కౌంతేయులకు బాల్య, మాది గాఁగఁ గీడె యాచరింతు
పుణ్యపరులు దోడఁ బుట్టువు లార్యులు, వైర మెత్తఁ దగునె వారితోడ. 227
వ. ఇట్లున్నమీయందఱయన్నంబులు దుష్టాన్నంబులు విదురుం డొక్కనియ న్నంబు భోక్తవ్యం బని నిశ్చయించితిఁ గావున నందుఁ బోయెద నని చెప్పి యజ్ఞనపతి యనుమతిసేయఁ జనునప్పుడు తోడన బాహ్లికభీష్మాదికౌరవులును గుంభసంభవప్రముఖు లైనమాన్యులును జని మాధవుతోడ మాయిండ్ల నెల్ల ను గానిక లాయితంబులు సేసికొని నీవు విజయంచేయుటకు నెదుళ్లు చూచు చున్నవార మని పల్కి ప్రార్థించిన నే నన్నిచోట్లకు వచ్చినవాఁడన యందఱ యర్చనలుం గైకొంటిన మీరు నిలువుం డని వారల నిలిపి విదురుగృహంబు నకుం బోయిన. 228
సీ. సంభ్రమస్నేహనిశ్చలభక్తియుక్తిఁ బ,విత్రమజ్జనము గావించి విదురుఁ
డెల్లవంటకములు నేర్పడ బోనాలు, [2]వేర్పింప నెంతయుఁ బ్రీతి ముంద
రోజమై బ్రాహ్మణభోజనం బొనరించి, సపరివారముగ విశాలరమ్య
పూతస్థలంబునఁ బుండరీకాక్షుండు, దమ్ముండుఁ దాను నుత్సవ మెలర్ప
తే. సరసరంజకమహనీయసంప్రయోగ, మగుచతుర్విధహృద్యాన్న మారగించె
లలితసంభావనామంజులంబు లైన, పలుకు లెడనెడ విదురున కెలమి యొసఁగ.
వ. అతండును. 230
క. [3]గోవింద సంభ్రమము సం, భావింపుము మాకు నిదియ పరమధనం బొం
డేవిధమున నీ కర్చన, గావింపం జాలువాఁడు గలఁడే యెందున్. 231
వ. అని మఱియు [4]నత్యంతవినయవాక్యమ్ముల నారాధించు చుండె నిట్లు కృతాహా రుం డైనహరికిఁ జందనచర్చాద్యర్చనంబు లాచరించి యవ్విదురుండు కృతార్థుం డై యుండఁ గవిగణికప్రముఖనిఖిలవిద్వజ్జనంబులు గాయకపాఠకవాంశికవైణి కాది వినోదపాత్రంబులు నప్పరమేశ్వరుం గాన వచ్చి ప్రొద్దు వుచ్చి యభిమ తార్థంబులు వడసి చనిరి రాత్రి యగుటయుం దగినయభ్యంతరమందిరంబున హంసతూలికాతల్పంబున భుజంగతల్పు నునిచి యతనికడ నుచితాసనంబున నుండె. 232

1 దొడ్లకు నెప్పు. 2 పెట్టింప...నుత్సవ మొనర్ప. 3 గోవింద (సంభ్రమమె) నిన్నా నాగి సం. 4 నత్యంతవిమల.

ఆ. విదురుఁ డిట్టులనియె నిదియొకకార్యంబు, గాఁగఁబూని [1]యిందు రాఁగఁదగునె
దుష్టబుద్ధి నీచు దుర్యోధనుండు నీ, మాట వినునె దురభిమానఘనుఁడు. 233

క. వచ్చినసైన్యంబులఁ గని, పెచ్చు పెఱిఁగినాఁడు ద్రోణభీష్ములలావుల్
[2]నచ్చియుఁగర్ణుండొక్కఁడ,యిచ్చుఁ దనకు విజయ మనియు నెంతయుఁ బొంగున్.

వ. నీ విట వచ్చుట వినినయప్పుడు ధార్తరాష్ట్రు లందఱుం గూడం బొంచి తమలో నిశ్చయించిన తెఱంగు నీశాసనం బుల్లంఘింపం గలవారు పాండునందనులకు నేమియు నీ కుండువారు దార యీధాత్రియంతయు బీఱు వోవ కుండ నేలువారు వారిం గూడినరాజు లెల్లను దిగ్విజయంబునాఁడు పాండవులచేత భంగ పడినవారు గావునఁ గర్ణుతో నేకార్థుల మై చత్తుము గెలుతు మింతియ కాని యొండు లే దని నిశ్చయించికొని యున్నవా రట్లగుటం జేసి దుర్యోధనుండు గండు మిగిలి యున్నవాఁడు సంధి గానేరదు వారల కందఱకు నిది ప్రాప్తకాలం బై యున్నయది యెట్లును నుడుగ నేర్చినవారు గా రిట్లు దమ్మెఱుంగనిదుష్టాత్ములనడుమం గూర్చుండుటయు నవ్వెంగలివిత్తు లఱచువీఱిఁడియఱపులకు వంక లొత్తి మాఱు సెప్పుటయు నొప్పక యుండు వెడంగు లగుటం గార్యవచనంబు లెఱుంగరు మొఱకు లగుటం బ్రతాపభాషణంబులకు వెఱవరు వారలతలంపులు గీడు నీమహనీయప్రభావబుద్ధిపౌరుషంబు లే నెఱుంగుదు నయినను బాండవేయులపై స్నేహంబునను నీమీఁదిభక్తినిం జెప్పెద నంచుఁ బోవలవ దనిన వాసుదేవుం డతని కిట్లనియె. 235

తే. నీవివేకంబు నార్తియు నెఱపి తీవు, తల్లిదండ్రులమాడ్కి హితంబు సెప్పి
తేను నారాక[3]తెఱఁ గెల్ల నేర్పడంగఁ, జెప్ప విని యేమి సెప్పినఁ జేయువాఁడ.

శ్రీకృష్ణుఁడు విదురుతో సంభాషించుట.

క. ఎఱుఁగుదు నేను సుయోధను, కొఱగామియు నతనితోడఁ గూడినవృపు లం
దఱుఁ బగ మనమున నిడికొని, యఱుముటయును సంధిపొసఁగదనియు మహాత్మా.

ఆ. పుడమియెల్ల [4]నొడ్డగెడ వయి గజవాజి, యుతముగాఁ గడంగి యుగ్రమృత్యు
ముఖము సొరఁగఁ దివురు మూర్ఖత మాన్చుట, యధిక మైనపుణ్య మనఘచరిత.

వ. మానుపవచ్చునే యంటేని. 239

క. దొరఁకొని పుణ్యముఁ బాపము, నరుఁ డర్థిం జేయుచుండ నడుమ నొకట న
వ్వెర వెడలి తప్పినను ద, త్పరిణతిఫల మొందు నండ్రు ధర్మవిధిజ్ఞుల్. 240

వ. అట్లుం గాక. 241

తే. చుట్టములలోన నొప్పమి పుట్టినప్డు

1 యిట్లు రాఁగఁ. 2 నచ్చినఁ...విజయ మనుచు. 3 తెఱఁగెల్ల నేర్పరించి. 4 యొడ్డ జవాజియుతముగాఁ, గడఁగి యుగ్రమృత్యుగతము గాఁగ, మృగము సొరఁగ.

[1]డడ్డపడి వారితోఁడఁ గోట్లాడి యైనఁ
దాని యుడుపంగఁ జొరకున్న వానిఁ గ్రూర
కర్ముఁ డని చెప్పుదురు కర్మకాండవిదులు. 242

వ. కావున నీరెండుదెఱంగులవారికి [2]శాంతి గావింపం బ్రయత్నంబు సేసెద ధర్మార్థసహితం బైన తెఱంగుమాటలు మంత్రిజనసహితుం డైన సుయోధనునకుం జెప్పెదఁ దనకుం బాండునందనులకు లోకంబులకు హితం బయినవిధంబు వంచన లేక చెప్పెడునన్ను పాండవులవాఁ డని శంకించి యతండు నామాట వినం డయ్యె నేనియు మేల కాక యిట్లు సొచ్చి చెప్ప కున్న నన్నదమ్ములు దమలోనం బోరఁ గృష్ణుండు వారింపక యుపేక్షించెఁ దనచేతఁ జిక్కంబడదా యని యజ్ఞు లైనజను లాడుదు రెల్లభంగులం గార్యం బార్యు లియ్యకోనం జెప్పుదు ధార్తరాష్ట్రులుం దమకు బ్రదుకుతెరు వైన నాపలుకులు వట్టుదురు పట్టక నీతలంచినచందమునం దులువ లై కలగంబాఱిన వారు నాముందర నిలువం జాలుదు రే యని పలికిన విదురుం డట్లకాకయని సమ్మతించి యామంత్రణంబు సేసి నిజశయనస్థానంబునకుం జనియె ననంతరంబ. 243

ఆ. అతనివచనరచన యాత్మలోఁ దలపోసి, యిట్టివాఁడు గలఁడె యెందు ననుచుఁ
బాల[3]కడలికడల పాటి యై యొప్పున,ప్పాన్పునందు శౌరి పవ్వడించె. 244

వ. ఇట్లు సుఖనిద్ర సేసి వేగుంబోకట మాగధమంగళగానంబుల మేలుకాంచి సమయకర్తవ్యంబులు సలిపె నట్టియెడఁ గృతవర్మయు సాత్యకియు వచ్చి పొడసూపినం బురుషోత్తముండు వారలు మొదలుగాఁ గలయిష్టజనంబులు పరివేష్టింప నుచితప్రదేశంబున నున్నంత. 245

క. ఇనతనయశకునిదుశ్శా, సనసహితము గాఁగ నెలమిఁ జనుదెంచి సుయో
ధనుఁడు ప్రియోక్తులఁ దగువా, రును దానును వారిజోదరుం గొనియాడెన్.

వ. అతండును మధురసంభాషణంబులు సేయ వార లతనికి ధృతరాష్ట్రుండు బంధుమిత్త్రాదిసమస్తపరిజనసమన్వితుం డయి పేరోలగంబున నునికి యెఱిఁగించినఁ బ్రియంబునఁ గట్టాయితం బైన తేరెక్కి భేరీశంఖచామరప్రముఖభద్రచిహ్నంబులతో వెడలి గరుడధ్వజంబు గ్రాలఁ గృతవర్మసాత్యకు లొక్కరథంబునను దుర్యోధనాదిదుష్టచతుష్టయం బొక్కరథంబునను బార్శ్వంబుల రాఁ బౌరులకుఁ గన్నులపండు వగుచు రాజమందిరద్వారంబు సేర నరుగునప్పటియు లివునకుఁ గొలువువా రెల్ల నత్యుత్సుకు లై యెదురుచూడ రథోత్తమంబు [4]నవతరించి యరవిందనాభుండు. 247

తే. ఎదురువచ్చినవిదురునియిచ్చుకరముఁ, దమ్ముచేయును రెండు హస్తములఁ బట్టి

---

1 డడ్డవడి తాను వీరితో నాటలాడి, యైన నుడుపంగఁ. 2 సంధిఁ గావింపం. 3 కదలి పాన్పు (కడరఁబొటి) పాటిదియై యొప్పగు, పాన్పుమీఁద శౌరి. 4 నుత్తరించి.

నడచె ముందటఁ [1]గదియుసందడిఁ గడంగి, కర్ణదుర్యోధనులుదొలఁగంగ జడియ.

వ. కృతవర్మాదియాదవులు లోనుగాఁ గలయభ్యంతరు లైనబలుమానిసులు పొదివి కొని పోవఁ దనసమీపంబునఁ గౌరవులు రవిసన్నిధి తారాగ్రహంబులచందం బగుచుండం దేజో[2]రాశి యగురాజీవాక్షుండు సని తనకు బ్రత్యుత్థానంబు సేసిన కురురాజును దొరలను నభినందించుచు. 249

క. తన కనిపెట్టినమణిమయ, కనకోన్నతపీఠమునఁ బ్రకాశంబున ని
ల్చినయెడఁ దోఁచిరి నారద, మునిప్రముఖు లంతరిక్షమున నుజ్జ్వలు లై. 250

వ. ఇవ్విధంబున సన్నిహితు లయినయమ్మహామునులం గురుపితామహునకుం జూపి నారాయణుం డిట్లనియె. 251

ఆ. మనలఁ జూచువేడ్కఁ జనుదెంచినారు మ, హాత్ము లైననారదాదిమునులు
వీరి కర్ఘ్యపాద్యవిధు లొన[3]రింపు మా, సనము లిడఁగఁ బనుపు సత్వరముగ.

వ. వీరలు సముచితాసనంబుల నుండక మనకుఁ గూర్చుండుట దగవు గా దనిసంగొలువువారెల్ల సంభ్రమాశ్చర్యంబులతో మునులవలన చూచుచుండ భీష్ముండు పరిచారకులం బనిచి కనకమణిమయాసనంబు లనేకంబులు దెప్పింప వారలరుగుదెంచిన వారలకు నమస్కరించి యాసనార్ఘ్యపాద్యాదివిధులం బూజలు సేయించి కృష్ణుఁడు గూర్చున్న యనంతరంబ ధృతరాష్ట్రుండునుం దక్కటివారును నుచితప్రకారంబుల నమ్మునీంద్రులకు నభివందనంబులు సేసి నిజాసనాసీను లైరి దుశ్శాసనుండును వివింశతియును గద్దియ లిడ సాత్యకియుఁ గృతవర్మయుఁ గృష్ణుం గదిసి యిరువంకలం గూర్చుండిరి కర్ణదుర్యోధనులుం జేరువ నొక్కగద్దియ నుండిరి విదురుండును మణిపీఠంబునఁ గృష్ణునివెనుకదెసఁ దదీయోన్నతపీఠంబునఁ గరం బత్తమిల్లి యుండె గాంధారరాజు నిజపుత్రపరివృతుం డై యొక్కదిక్కున [4]నుచితపీఠాసీనుం డయ్యె నట్టిసమయంబున. 253

క. అంబుదశుభగాత్రుం బీ, తాంబరధరుఁ గమలదళనిభాక్షుఁ హరిఁ జూ
డం బడసి లోచనము లమృ, తం బానినమాడ్కి సమ్మదంబునఁ దేలన్. 254

క. ఆకొలువువారు గర మచ, లాకృతి నొకపలుకు లేక యందఱు వింజం
బొఁ కిడిన[5]కరణి నవశము, దాకారితచిత్తవృత్తు లై యుండంగన్. 255

శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రునితో సంభాషించుట.

క. జలదస్వనగంభీరత, నెలుఁ గొప్పఁగ దంతదీప్తు లెసఁగ ముకుందుం
డలరుచెవుల నఖిలజనం, బులు విన ధృతరాష్ట్రభూవిభున కిట్లనియెన్. 256

క. జననాథ నీయెఱుంగని, పనులు గలవె యైనఁ దగవుఁ బరమహితంబుం
దనవారికిఁ జెప్పన తగు, నని వచ్చితి భారతాన్వయము ప్రియ మొందన్. 257

1 నదియు (దగియు) సందడిఁ. 2 రాజి యగువారిజాక్షుండు. 3 రింప నా, సనము. 4 నుచి (తపీఠస్థుం డయ్యె) తాసనాసీనుం డయ్యె. 5 యట్లు పరవశ, శాకారితచిత్త.

క. క్షీరోదకగతిఁ బాండవ, కౌరవు లొడఁగూడి [1]మనికి కార్యం బది నీ
వారసి నడపుము వా రన, వీ రనఁ గురుముఖ్య నీకు వేఱుం గలదే. 258

చ. భరతకులంబు ధర్మమును బాడియు సత్యముఁ [2]బొత్తుఁ బెంపునుం
గరుణయుఁ గల్గి యుండు ననఁ గా నుతిఁ గన్నది యందు సద్గుణో
త్తరులరు నీవు నీయనుఁగుఁదమ్ముఁడు నీతనయుల్ యశోధురం
ధరశుభశీలు రీసుచరితక్రమ మిప్పుడు దప్ప నేటికిన్. 259

శా. ఈవంశంబున కెల్ల నీవ కుదు రిం దెవ్వారి[3]చందంబు లె
ట్లై వర్తిల్లినఁ గీడు మేలుఁ దుది నీయం దొందెడుం గాన స
ద్భావం బారసి లోనిపొత్తు వెలివృత్తంబుల్ జనస్తుత్యముల్
గావింపం దగు నీక యెవ్విధమునం గౌరవ్యవంశాగ్రణీ. 260

చ. వినుము సుయోధనాదు లగువీరు [4]సధర్ములు గాక కార్యము
గ్గొనక మహార్థసిద్ధి యెడలుం దమ కిట్లన కన్వయంబువ
ర్తన మిది గాదు నాక బెడిదంపుఁదనంబున బంధుకోటికి
న్మనసులు నొవ్వఁగా నవగుణంబులకుం బయిలొడ్డ రేమియున్. 261

ఉ. కౌరవపాండవుల్ తెఱఁగు గైకొని శాంతతఁ బొంది యున్కి మే
లారయ నాకు నీకుఁ గుల మంతకు నీనృపకోటి కుర్వికిం
బోరిత మైన నింతకును బుట్టు మహాపద గావునన్ ధరి
త్రీరమణాగ్రగణ్య గణుతించి యవశ్యముఁ [5]బొం దొనర్పవే. 262

తే. నీకు వలసినఁ దీర్పంగ నేర వచ్చు, నధిప తెఱఁగు నీవశమునయదియ కాన
నీకు వీరలఁ దేర్చుట నెఱియ కాదె, సిద్ధ మెవ్వారిఁ దెలి వొందఁ జేయ నేర్తు.

ఉ. అందు వృకోదరార్జునుల నాహవరంగమునందు మీఱునా
రెందఱొ యెన్నుమా యిచట నీగురుభీష్ములఁ గ్రేణి సేయువా
రెందఱొ వారు వీరు నని నీల్గుటకంటె [6]భవద్బలంబు లై
యందఱుఁ గూడు టొప్పదె జనాధిప శాంతి యొనర్పు మెమ్మెయిన్. 264

తే. జగతిఁ గలజనపతులు నీచరణపీఠ, మర్థిఁ గొలువ సముద్రవేలావృతోర్వి
యెల్ల నేలుట యొప్పదే తల్లిప్రజల, యెడ విరోధంబు వాటించు టెంతమేలు.

క. నరనాథ నీ వుపేక్షా, పరుఁడ వయినఁ గౌరవులక పాండవులక కా
దరయఁగ భూప్రజ కెల్లను, దురితం బొన[7]రించినట్లు తుదిఁ గీడు సుమీ. 266

క. కౌరవపాండవులం దె, వ్వారలకుం జావు నొవ్వ వచ్చిన మే లు
ర్వీరమణ చిత్తమున నె, ట్లారయుమా నీకు దుఃఖ మగు నెట్లయినన్. 267

1 యునికి...నీ, వారిని నడపుము ..గులముఖ్య. 2 బెంపు దాల్మియున్. 3 చిత్తంబు. 4 సమర్థులు గాక ; సు (న) ధర్ములు గాక. 5 బొంము సేయవే. 6 భవద్విధేయు లై ... గూడుటొప్పు హృదయంబున శాంతి. 7 రించు టదియె తుదిఁ.

ఉ. వీరును వారుఁ బండితులు విక్రమవంతులు బాహుగర్వదు
ర్వారులు లోనిరిత్తబవరంబున నాఱడిఁ జావఁ బోవ నె
ట్లూరక యుండ [1]వచ్చు కడునొప్పెడు మేనులు వాఁడికైదువుల్
గూరఁగ నాటినం బుడమిఁ గూలుట కక్కట యోర్వ వచ్చునే. 268
ఆ. ఇట్లు గాక యుండ నీరెండుదెఱఁగుల, వారిఁ గాచికొనుము వసుమతీశ
నీదుప్రాభవంబు నీతియు శాంతియు, నఖిలజనులుఁ బొగడునట్లు గాఁగ. 269
వ. అని చెప్పి వెండియు. 270

శ్రీకృష్ణుఁడు పాండవులు సెప్పినమాటలు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట.

తే. పాండవులు దండ్రిసచ్చిన ప్రజలు వారి, నరసి ప్రోచితి శైశవ మాది గాఁగ
నడుమ నిష్కారణమ దిగవిడువఁ [2]దగునె, పార మొందంగ రక్షింపు గారవమున.
వ. పాండుకుమారులు నీకుం [3]బరమభక్తిం బ్రణమిల్లి యందఱు నొక్కమాటగా నీతోఁ జెప్పు మని నాకుం జెప్పినవిధంబు వినుము తనపంపునం బండ్రెండువత్సరంబులు వనంబున వసియించితిమి పదుమూఁడగు నేఁడు జనపదంబున నజ్ఞాతవాసంబునుం జలిపితిమి మాతండ్రిసమయంబు పరిపాలించి యే మర్ధరాజ్యం బెట్లునుం బడయుదు మని కృతనిశ్చయుల మై పడితిమి తల్లియుఁ దండ్రియు నెల్లచుట్టంబులు నేడుగడయును మాకుఁ దాన మావలన నేరమి గల్గినం గినిసి యిట్లు గాద ట్లని చక్కంబెట్టునది తనగలపదివేలేండ్లకుం దన్న కాని మఱి యెఱుంగ మెట్టివార మైనను మమ్మును దుర్యోధనాదులనుం దలంపరు తనయందుఁ దెఱంగు గలిగిన నెవ్వరు గోఱ గాకున్నను గులంబుపాడి సెడక చెల్లు నని రని పలికి మఱియు ని ట్లనియె. 272
ఉ. సారపుధర్మముఁ విమలసత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొంద లేక చెడఁ [4]బాఱిన దైనయవస్థ దత్తు లె
వ్వార లుపేక్ష సేసి రది వారలచే టగుఁ గాని ధర్మని
స్తారక మయ్యు సత్యశుభదాయక మయ్యును దైవ ముండెడున్. 273
వ. అని యీసభ్యులకుం జెప్పు మనిరి నీవును సభాసదు లైనరాజులు నే మనియెదరనుం జేసు ధర్మంబును నీతియును మున్నిడికొని మనోవాక్ప్రకారంబు లేక రూపం [illegible]నసత్యంబ కాఁ జెప్పితి నిత్తెఱంగు మీకు మేలు క్రోధమానమత్సరంబు[illegible]డిచి యిట్లు సేయుండు. 274
ఆ. పాండ[illegible]కుఁ దగినపాలు మేదినిఁ బంచి, యిచ్చుకంటెఁ గార్య [5]మెద్ది గలదు
ధ[illegible] సముచితం బగువిధ మెద్ది, శక్య మెద్ది చెప్పుఁడ వాక్యవిదులు. 275
క. అ[illegible]మహారాజా, విను మని ధృతరాష్ట్రుతోడ వెండియుఁ దా ని

[illegible] 2 నేల. 3 బ్రణయభక్తిం... కృత నిశ్చయుల మైతిమి. 4 బాలిది; బ్రాటిలి; [illegible] క్షేమి గల్గను.

ట్లని చెప్పె వాసుదేవుఁడు, తనమది నలఁ లేక కార్యదశ దెలియంగన్. 276

ఆ. వారితండ్రిపాలు వారికి నిచ్చి నీ, పాలు నీవుఁ బుత్రపౌత్రచయము
ననుభవించి సుఖుల రై యుండుఁడిది బంధు,మిత్రసుజనకోటిమెచ్చు తెఱఁగు.

క. ఎఱుఁగవె యజాతశత్రుని, నెఱియును ధర్మంబు సత్యనిష్ఠయు మిము నె
త్తెఱఁగున ననువర్తించెనొ,యెఱుఁగవె [1]తగుచేవ గలుగు టెఱుఁగవె యధిపా.

వ. నీ [2]వెఱుంగు దైనను జెప్పెద విను మింద్రప్రస్థపురంబుననుండి పాండవాగ్ర
జుండు నీకుం బెంపునుం బేరునుం జేయం గోరి. 279

చ. మద మడఁగించి భూపతిసమాజము నెల్లను నిన్నుఁ గొల్వఁ జే
యుదు నని పూని దిగ్విజయ మున్నతిఁ జేసి మహావిభూతితో
మదిమది నుండ [3]నీసుతుఁడు మంత్రులు సౌబలు జూద మార్చి సం
పద గొని యంతఁ బోవక సభన్ ద్రుపదాత్మజ భంగపెట్టరే. 280

ఉ. దానికి నీ వొడంబడితి ధర్మజుఁ డంతయుఁ జూచి సత్యముం
బూని వృకోదరార్జునులు బొంగులుగాఁ బెడచేతఁ గన్న నీ
దూనఁగ నోర్తుగొంచుఁ జని యుగ్రవనంబున దుఃఖమగ్నుఁ డై
దీనత నుండి పూన్కిదగఁ దీర్చియుఁ గూడి మనంగఁ [4]గోరెడిన్. 281

క. తనుఁ దాన పోలుఁ గాకే, మన వచ్చు నజాతశత్రు నతిశాంతతయున్
వినయము [5]గౌరవమును నే,జనపతులకుఁ గలవు సెపుమ సౌజన్యనిధీ. 282

క. ఏ నిం తాడితి నీసం, తానం బిరుదెఱఁగునకు హితము గోరి భవ
త్సూనునిమతియతిలోభము, మానిచి పాండవులఁ దెమ్ము మనుజాధీశా. 283

ఉ. వారలు శాంతశూరులు భవచ్చరణంబులు గొల్వఁ బూని యు
న్నా రటుఁ గాక మీ కది మనంబున కప్రియమేని నింతకుం
బోరికి వచ్చుచుండుదురు భూవర రెండుదెఱంగులందు నీ
కారయఁ బథ్య మేది యగు నవ్విధ మేర్పడ నిశ్చయింపుమా. 284

చ. అనవుడు రోమహర్షణము లంగములం బొడమన్ సదస్యు లె,
ల్లను బ్రియ మంది నెమ్మనములం బురుషోత్తముఁ డింత యొప్పఁ బ
ల్కనె మఱుమాట లాడ నయకోవిదుఁ డెవ్వఁడు ధీరుఁ డెవ్వఁ డిం,
దనువరి యెవ్వఁ డంచు నచలాకృతు లై నెఱి నూర కుండఁగన్. 285

వ. జామదగ్న్యమహామునిసుయోధనుతో ని ట్లనియె. 286

సీ. వినుము దంభోద్భవుం డనురాజు దన కెదు, రెవ్వారు లేరంచుఁ గ్రొవ్వి నరుఁడు
నారాయణుం డనువారలు గంధమా, దన మనునగమునఁ దపము సేయ
వారిపైఁ జని యాహవమునకుఁ బిలిచిన, నమ్మునీంద్రులు వల దని యనేక

---

1 తగుచావు. 2 వెఱుంగవేనియుఁ దెలియం జెప్పెద. 3 నీసుతుల మంత్రులు జూద మొనర్పఁ జేసి. 4 గోరెదన్. 5 సత్యము మన్నే.

విధములఁ జెప్పంగ వెండియుఁ బోకున్నఁ, గుశముష్టి నుజ్జ్వలవిశిఖవృష్టి
ఆ. గురిసి నరుఁడు సేనఁ గూల్చి యాతని భంగ, పెట్టి పట్టి విడిచె నట్టియుమ్మ
హాత్ము లిపుడు పార్థుఁ డనఁ గృష్ణుఁ డనఁగ లీ,లార్థ కలితజన్ము లైరి సూవె.
వ. కావున నాదంభోద్భవుచందంబున నుద్ధతి వాటించుటయు నరనారాయణుల
తోడఁ దొడరుటయు మీఁద మే లయి యుండదు పాండవులతోడిపొందు మే
లనిన యనంతరంబ కణ్వుండు దుర్యోధనున కిట్లనియె. 288

—కణ్వుండు దుర్యోధనునితో గరుత్మంతునివృత్తాంతంబు సెప్పుట.—

క. అది వోలుఁ దన్ను నెదిరిని, మది నెఱుఁగక నిగ్రహించి మద మెత్తుట [1]యొ
ప్ప దహంకారం బొనరిం, పదె పౌరుషహానిఁ దొల్లి పక్షీంద్రునకున్. 289
వ. అది యె ట్లనిన. 290
సీ. అమరేంద్రరథసూతుఁ డైనమాతలి దన, సుత గుణకేశికిఁ బతిఁ దగంగ
నారసి యార్యకుం డనుభుజంగాధిపు, మనుమనిఁ జికురునితనయు సుముఖు
నర్థిమైఁ గోరిన నార్యకుం డుమ్మలి, కంబుతో ని ట్లను గరుడుఁ డితని
[2]తండ్రి వధించి యెంతయు నల్కమై వీని, నిం కిట నెల సమయించువాఁడు
ఆ. గాఁగఁ బూని పోయెఁ గావున నే మియ్య, కొనఁగ నేర మనిన విని బలారి
నడిగి పడసి యిత్తు నాయువు రం డని, వారిఁ గొనుచు నరిగె సారథియును.
వ. వారలభాగ్యంబున నప్పు డింద్రుండును నుపేంద్రుండును నొక్కచో నుండం
గని మాతలి యక్కార్యంబు విన్నవించినం గరుణించి జిష్ణుండు విష్ణునకుం
జెప్పిచేయించువాఁ డై వైనతేయుదెసకుం దాన చాలి సుముఖుం జిరాయు
రుపేతుం జేసిన. 292
క. మాతలి పాణిగ్రహణం, బాతనిఁ జేయించి యున్న నంతయు విని తా
నేతెంచి గరుడుఁ డతికో, పాతురుఁ డై రేఁగి పెలుచ నమరాధిపుతోన్. 293
వ. వాసుదేవుసన్నిధి ని ట్లనియె. 294
క. విను నీ వదితిసుతుండవు, వినతకొడుక నేను విబ్ధు వీఁగెడుమనకుఁ
జనకుఁడు గశ్యపుఁ డొక్కఁడ, దనుజుల శోధించి చంపుదమ యిరువురమున్.
క. ఏమిట నీ కేఁ దక్కువ, నామేరకు నడ్డపడితి నావుడు నింద్రుం
డీమహనీయమహిమకును, [3]ధాముము విష్ణుండు గాక తక్కొరుఁ డగునే. 296
వ. అనినఁ గటకటంబడి గరుత్మంతుండు. 297
ఉ. తమ్ముఁడ నీవు నాకొలఁది తథ్య మెఱుంగక నాకు నీచభా
వమ్మగుభంగిఁ జేసితివి వాసవ యియ్యదితిప్రసూతవం

1 శక్యపహం. 2 తండ్రిని వధియించి తడయక వీని నిం, కిటనేల సమయించువాఁడు గాఁగఁ, బూని పోయెఁ గాన నే నియ్యకొన నేర, ననిన విని బలారి నడిగి యిత్తు, నరయ జాల్ఁ గలుగు నాయువు. 3 ధా మును.

శమ్మఖిలమ్ము దాల్తు నొకసన్నపుటీఁకన యిట్టినన్ను నీ
విమ్మెయిఁ దూలవుత్తె యని యీక్షణరోచులఁ గెంపెలర్పఁగన్. 298

వ. ఉన్నం గనుంగొని కోపించి వాసుదేవుండు వెడనవ్వు నవ్వుచు. 299

క. నీవేటిమోపుకాఁడవు, నావెరవున నిన్ను నడపినను గర్వం బే
లా వెడఁగ యంచుఁ దనముం, జే వీఁపున నిడ సురేంద్రజిత్తు వికలుఁడై.

క. ఎముకలు విచ్చుచుఁ దుండము, దెఱచుచు వ్రేఁగడరి సొగసి త్రెళ్లి వివశుఁడై
యఱచిన నోడకు మని హరి,నెఱి సక్కఁగఁ ద్రోచి యెత్తె [1]నెగయంగఁ గృపన్.

వ. ఇవ్విధంబునం గేశవుండు గరుణించి గరుడుని ననునయించి యింక నవుదానికి నుద్ధతి మాని బుద్ధి గలిగి యుండు మని వీడ్కొలిపి పుచ్చినం బోయెం గావున గర్వంబు గొఱగా దింతయు నీమహానుభావుం డెఱుంగు నని నారదుం జూపి యితండు మాతలికన్యాకార్యంబునకుఁ దోడై నడచె నడుగు మదియకాదు సర్వేశ్వరుం డగుమాధవుమాహాత్మ్యం బితనికిం గరతలామలకం బయియుండుఁ బ్రభవిష్ణుం డగునాదివిష్ణుఁడు గదా యీకృష్ణుం డీతనిసహాయత్వంబు గల కౌంతేయులతోడం గూడి మనికి కార్యం బనిన నారదుండు ధార్తరాష్ట్రు నాలోకించి. 302

క. బలవంతులబలములు న,గ్గల మగుబల మెదురఁ గలుగఁగాఁ గీడ్పడు నే
కొలఁదులవారికి గర్వము, నిలుచునె నయమార్గవృత్తి నిలిచినభంగిన్. 303

వ. అని వెండియు ని ట్లనియె. 304

ఆ. ఇదియ కాని చేయ నెద్దియే ననుచు ని, ర్బంధవృత్తిఁ దలఁపు వట్టికొనిన
నట్టివాని కెందు నలజడి వాటిల్లు, గాలవుండు గుఱియ కాఁడె [2]మనకు. 305

వ. వినుము విశ్వామిత్రుపాల విద్యాభ్యాసంబు సేసి గాలవుం డనుమునికుమారుండు గురుదక్షిణ యేమి సమర్పింతు నని యడిగిన నతం డేమియు [3]నేల యనియుడిపిన నుడుగక యెన్ని సెప్పిన నన్నింటికి నన్ని సెప్పి నిర్బంధించినఁ గటకటంబడి య త్తపోధనవర్యుం డట్లేని శుద్ధధవళవర్ణంబు లై యొక్కకర్ణంబు నీలం బైనయుత్త మాశ్వంబు లెనమన్నూఱు దెచ్చి యి మ్మని పలికినం బోయి. 306

తే. గాలవుం డవ్విధముఘోటకముల నెందుఁ
బడయ లేక చింతాభరభ్రాంతుఁ డగుచు
వెడలి యాహారనిద్రలు విడిచి తా మ
హాపథముఁ బోదుఁ గాకని యరిగి యరిగి. 307

వ. ఒక్కచో గరుడునిం గని బాలసఖుండు గావున నతనికిం దనవృత్తాంతంబు సె ప్పిన నతండు గరుణాభరితుం డై. 308

క. దేవతలు గాని యిట్టివి, గావింపం జాల రీసకలదిక్కులలో

---

1 నెనయఁగఁ గృపతోన్. 2 తలఁప. 3 లేమి.

దేవేంద్రుదిక్కు బహుదివి, జావాసం బందుఁ బోద మని మునిపుత్రున్. 309

క. అఱకడ నిడి ప్రాఙ్ముఖుఁ డై, పఱచి జలధిలోనఁ జదలఁ [1]బాఱెడునెడఁ జె
య్యాఱి దప్పి నిలుపఁ జాలక, యొఱగినగాలవుని డించె నొకగిరిమీఁదన్. 310

వ. ఇట్లు డించి డప్పి దేర్చి యందుఁ గశ్యపనందనుండు శాండిలి యనునొక్కతప
స్విశాపంబునఁ బక్షంబులు డుల్లి యనుగ్రహంబునం గ్రమ్మఱ వచ్చిన విషాద
మోదంబు లనుభవించి యట సనుట సాలించి మగుడ మహీతలంబునకు
మునికుమారుం దెచ్చి యయాతి తననెచ్చెలి యని ప్రతిష్ఠానపురనాథుం డగు
నతనికడకు నాతనిం దోడ్కొని చని యగ్గాలవు తెఱం గెఱింగించిన నతండు.

క. తన కట్టిగుఱ్ఱములు లే, కునికిని మాధవి యనంగ నొప్పెడుపుత్రిన్
ముని కొసఁగె దీనికై యే, [2]మనుజేశుఁడు నీఁడె హయసమాజము ననుచున్.

వ. ఇ ట్లొసంగినం దోడుకొని. 313

తే. ఇట్టిహయములు గలరాజు లెవ్వ రొక్కొ
యనుచుఁ దిరిగి యయోధ్యకుఁ జని తదీయ
నాథు నిక్ష్వాకుఁ గనిన నన్నరవరుండు
దనకు నిన్నూఱ కాని లే వనియె హరులు. 314

క. అన విని మాధవి ఋషి కి, ట్లను నొక్కమహానుభావునతులవరమునం
దన[3]యవతి నయ్యె నేఁ గ,న్యన యగుదుం గాన నిమ్ము న న్నితనికిన్. 315

వ. ఒక్కసమయంబు సేసికొని యిచ్చి గుఱ్ఱంబులు వచ్చినవి యెల్ల రాఁ బుచ్చి
కొ మ్మనిన గాలవుండు నవ్విధంబునకు సమ్మతించె నపత్యార్థి యై యిక్ష్వాకుండు
ను నయ్యంకువునకు భార్య యగుట పుత్రజన్మావధిగా నొడివి యశ్వంబుల నొ
సంగి కన్యకం బరిగ్రహించి దానియందు వసుమనస్సుం డనుకొడుకుం బడసి గా
లవునకు నమ్మగువను మగుడ సమర్పించినఁ జూచి యబ్భంగిం గలచోట్ల నెల్ల
నరసి తురంగంబులం గావించికొ మ్మని యతనికిం జెప్పి సుపర్ణుండు సనియె
మఱియు మహీతలంబునం గ్రుమ్మరి యమ్మునికుమారుండు గందువ లెఱింగి
పోవం బోవ. 316

క. ఆసమయంబునను దివో, దాసుఁడు నౌశీనరుండుఁ దరుణికి నిన్నూ
ఱేసిహయంబుల నిచ్చి మ,హాసత్త్వుల సుతులఁ బడసి రధిక ప్రీతిన్. 317

వ. ఇట్లు క్రమంబునఁ గాశీశ్వరునకుఁ బ్రవర్ధనుని భోజపురనాథునకు శిబిం గనిన
యక్కన్యకం గొని వెండియు వసుంధరం దిరుగు చుండ గరుత్మంతుండు గ్రమ్మఱ
వచ్చి యమ్మునితో నీ వింక జాలింబడ వలవ దొక్కకారణంబున నీరాజులు ము
వ్వురకు నివ్వాజులు గలిగె నింతియ కాని యొండెడ నీచందంబున మొత్తంబు లై

1 బాఱు నెడం జెయ్యాఱి. 2 మనుజేశ్వరుఁ డీఁడు. 3 యువతి.

దొరక నేర వియ్యాలునూఱు గుఱ్ఱంబులను గురునకు సమర్పింపు [1]మొక్క-టిసెప్పెద విను మని యిట్లనియె. 318

క. ఈమువ్వుర తెఱఁగునఁ దగ, నామునియుం గొడుకుఁ బడయునట్లుగ నిమ్మీ కోమలిని గొంతకు వి, శ్వామిత్రున కెట్టులైన సంప్రార్థనతోన్. 319

వ. అని తానునుం దోడు సని యత్తపస్విపాలికిం బోయి యత్తెఱం గెఱింగించి గాలవుం గానిపించి యీతండు బాలుండు నీవు దయాళుండ వితనిం గృతార్థుం జేయ వలయు నని ప్రార్థించి పక్షిరా జక్కార్యంబు చక్కంజేసి పోయిన. 320

క. మునివరుఁ డష్టకుఁ డనియెడు, తనయుఁ బడసి శిష్యునకు సుదతి నొప్పించెన్ వనితయుఁ దపంబు సేయం, జనియెను గాలవున కిట్టి[2]చరితము గలిగెన్. 321

వ. కావున నెట్టివారికి నిర్బంధము దగదు దుర్మానంబు దుర్దశ నాపాదించు నయ్యయాతి దుర్మానంబునం గాదె పుణ్యలోకపరిభ్రష్టుం డై మాధవీపుత్రు లగునన్నలువురు దౌహిత్రులకతంబున నూర్ధ్వగతి గనియె నట్లగుటంజేసి. 322

క. నిర్బంధము దుర్మానము, దుర్బుద్ధికిఁ గాక తగునె దుర్యోధన నీ మార్బలమె పాండవులకున్, దౌర్బల్యము వాపు శుభము దలఁకొను సంధిన్.

వ. కృష్ణునిమాట విని నీ వికౌరవాన్వయంబు రక్షింపు మనియె నివ్విధంబున నమ్మువ్వురుమునీంద్రులు సెప్పినహితోపదేశంబులదెస ననాదరంబు సేసి గాంధారేయుండు రాధేయుం గనుంగొని చే యప్పళించి నవ్వి వీర లింతవెట్టు లగుదు రే యని పలికి వారల నవలోకించి. 324

దుర్యోధనుఁడు నారదాదిమునులమాటలు వినక నిరాకరించుట.

క. మునులార నన్ను విధి యే, [3]మని ముసు పుట్టించె నట్టు లయ్యెదుఁ గాకీ వినఁ జవి గానిపలుకులకుఁ, బని గలదే యుడుగుఁ డింక బహుభాషణముల్.

వ. అనిన విని ధృతరాష్ట్రుం డమ్మహామునులతో నిట్లనియె. 326

తే. మీరు సెప్పినబుద్ధులు గారవమునఁ, జేయఁ గాంచినఁ బుణ్యంబు సేయ నెట్లు నాముఖంబునఁ గార్యంబు [4]నడవ దేమి, సేయువాఁడ నొండెద్దియుఁ జెప్ప లేదు.

క. అని యతఁడు శౌరితో ని, ట్లను నిమాముం బరముఁ గలుగునట్టివిధము నీ వనఘా చెప్పితి నాకుం, [5]జన వేదియు లేదు దీని నస్మతి నడపన్. 328

ఆ. మందబుద్ధి నాదునందనుఁ డీవు పో, రానిచుట్టమవు మహానుభావుఁ డవు దయార్ద్రచిత్తుఁడవు వీనిఁ దేర్పవే, యనునయించి యెట్టులైనఁ గృష్ణ.

క. అనిన ముకుందుఁడు దుర్యో, ధనుతో నిట్లనియె విమలతరవంశమునన్ జనియించి తెల్లగుణముల, ననూనుఁడవు నీకు నీదురాగ్రహ మగునే. 330

చ. తులువలు గాక యిట్టిదొర దుర్ణయవృత్తికిఁ జొత్తురయ్య పు

---

1 మే నొక్క-తెఱంగు చెప్పెద విను మని. 2 చందము గలిగెన్. 3 ముని పుట్టించెం దగ నిట్టు లయ్యెదుఁ. 4 నడపఁ డేమి. 5 జనవు మనవు.

త్రులు ననుజన్మలుం జెలులు దుష్టపథంబునఁ బోవ కుండఁ జు
ట్టలుఁ దగువారుఁ దండ్రియు నొడంబడఁ జేయుము కార్య మల్పబు
ద్ధులవెడమాట లూఁకొనకు దోసము సేగియు వచ్చు నమ్మెయిన్. 331

క. [1]పాండిత్యశౌర్యనిత్యులు, పాండుసుతులు వారిఁ గూడి బ్రదుకుట ధృతరా
ష్ట్రుండును బాహ్లికుఁడును భీ,ష్ముండు గురుఁడుఁ గోరు తెఱఁగు సూవె నరేంద్రా.

ఆ. విను మసత్యలోభమున సిరి యగునె యాఁ,గొని మునిండి దినినఁ గ్రొవ్వు లావుఁ
గలుగునయ్య శకునికర్ణదుశ్శాసన, మంత్రితంబు గార్యతంత్ర మగునె. 333

శా. తోడం బుట్టినభీమపార్థులమహాదోర్దర్పముల్ లాఁతులై
తోడంచుం [2]బెఱవారి దుర్బలుల నెందుం జొచ్చి దైన్యంబునం
గూడం బెట్టెదు నీవ పాండుసుతులం గుందింపఁగా సత్యముం
బాడిం దప్ప రొకప్పుడుం గినియ రాబంధుత్వ మే లొల్లవో. 334

ఉ. వారును మీరుఁ [3]బొంది జనవల్లభు లెల్లను భృత్యభావనం
జేర సమస్తవస్తువులుఁ జేకుఱఁగా బ్రదు కొప్పుఁ గాక నీ
కీరస మెత్తికోల్ గఱపి యిప్పుడు కార్యము దప్పఁ జూచునీ
వారలు ముట్ట వచ్చిన నవశ్యము నంతకుఁ జాలరుం జుమీ. 335

ఆ. వీర కారు పాండవేయులఁ బోర మా, ర్కొన సురాసురులకుఁ గొలఁది గాదు
గాన వారితోడికయ్యంబునకు నిర్ణ, యింప వలదు సంధిపెంపుఁ జేయు. 336

క. ఈయున్నరాజు లందఱు, [4]వాయుసుతున కొక్కయెత్తు వాఁ డలిగిన శూ
లాయుధుఁడు వడఁకు నాకొం, తేయులతోఁ బొడుచు టుడుగు ధీరవిచారా.

క. ఒకకార్యము సెప్పెద మీ, సకలబలములందు సవ్యసాచి కెదురుగా
నొకరుఁడు గలిగినఁ గయ్యము, నకుఁ బూనుఁడు రిత్త బహుజనక్షయ మేలా.

క. పెక్కండ్రు గోవులం గొని, యుక్కు మిగిలి నడవ వెనుక నుద్దవిడిం దా
నొక్కఁడ నరుఁ డేతెంచినఁ, జిక్కె సమస్తంబు నది ప్రసిద్ధమ కాదే. 339

క. తోడు[5]దొన లేనియప్పటి, క్రీడికొలఁది యట్టి దధిప కినియక విను మేఁ
దో డైరా నెదురుట గడుఁ, గీడు వలవ దుడుగవయ్య గెలు పరిది సుమీ. 340

తే. అనుజతనుజులుఁ జెలులు వియ్యములు నడుగు
మాలి పోదురు నీకుఁ గా మనుజనాథ
దొరకుఁ గులనాశనుం డనుదూఱు మేలె
పాండవులతోడ నొడఁగూడి బ్రదుకవయ్య. 341

ఉ. రాజ్యముభార మెల్ల ధృతరాష్ట్రునియంద వెలుంగు చుండఁ ద
త్పూజ్యకుమారపట్టమునఁ బొల్చి చరింపఁగ నీవు పాండవుల్

---

1 పాండిత్యసత్యశౌర్యులు ; శౌర్యసత్త్వులు. 2 బెడబాపి... నెందుం దెచ్చి. 3 గూడి జన. 4 వాయుజు నని నోర్వ గలర. 5 తొన లేని.

సజ్యతఁ దండ్రిచిత్తము ప్రసన్నతఁ బొందఁగఁ గొల్చి యున్కి సా
మ్రాజ్యముగాఁ దలంతు రసురక్తమతిం దమకుఱ్ఱ ధరాధిపా. 342

క. కౌరవనాయక పాండుకు, మారులు నీతోడిపొత్తు మనియెద మనఁగా
శ్రీ శా మోఁకా లొడ్డిన, వారివిధము కాదె నీవు వల దనుటెల్లన్. 343

భీష్మద్రోణులు దుర్యోధనునకు హితంబు సెప్పుట.

చ. అన విని భీష్ముఁ డిట్లనియె నాధృతరాష్ట్రతనూజుతోడ నీ
జనకునిమాట పట్టుము ప్రసన్నమతిన్ మనవంశ మెల్లఁ బా
వనముగ నిందు వచ్చి బుధవత్సలుఁ డీహరి యిట్లు సెప్పఁగా
వినమిఁ గడుం జెడుం దెరువు వీరలపం [1]పొనరింపు పెంపుగన్. 344

క. మానక ధృతరాష్ట్రుఁడు ప్రా, ణానం గలుగంగ బంధునాశము రాజ్య
శ్రీనాశము నుద్దామయ, [2]శోనాశముఁ జేయ నేల చూచెదు చెపుమా. 345

వ. కృష్ణార్జునులతోడివిరోధం బీబంధులోకంబునకు కాదు లోకంబున నెవ్వరికినిం జూడం బోలదు లోకంబులు రెంటికిని హానిం జేయక కూడి బ్రదుకుట మే లనినఁ దదనంతరంబ ద్రోణాచార్యుండు దుర్యోధనున కిట్లనియె. 346

తే. పితృపితామహగురుల మై ప్రీతిఁ గోరు, చున్న [3]యట్టిమాపరమహితోపదేశ
వాక్యములు విని దుర్జనవచనరచనఁ, గొనక బంధులతో నొడఁగూడి మనుము.

ఉ. వెన్నుఁడు ప్రీతిఁ జెప్పినసవిస్తరవాక్ప్రచయంబు త్రోవఁ బో
వన్న కుమార యట్లయిన నాయువు శ్రీయును నీకుఁ గల్గు మా
కన్నులు సల్లగా నకట [4]గన్గొను చుండుదు మేము నట్లు గా
కున్నను నీవ నేర్తు నిను నొం డన నేరము నిండుకొల్వునన్. 348

చ. అనవుడు నాంబికేయుఁడు నిజాత్మజుదిక్కు మొగంబు సేసి యి
ట్లను హరి నాశ్రయించి భవదగ్రజుఁ బుణ్యు నజాతశత్రునిం
గను మట వోయి దీన మనకార్యము లన్నియు సిద్ధిఁ బొందు నీ
తనిపలు కాదరింపమిఁ బదంపడి పాటిలు నెల్లచేటులున్. 349

వ. అనియె నట్టియెడ గురుభీష్ము లొత్తి చెప్పం దలంచి గాంధారేయున కిట్లనిరి.

క. ఈకృష్ణునిసారథ్యము, నాకృష్ణునిగాండివంబు నై తోఁపక ము
న్నీకొలఁదిఁ జక్కఁబడి నీ, వీకురువంశంబు గావు మిభపురనాథా. 351

వ. అని పలికి మఱియు. 352

సీ. ధర్మపుత్త్రునిపదద్వయమున కతిభక్తి, నెఱఁగిన నతఁడు నిన్నెత్తి గ్రుచ్చి
నిడుఁగేలఁ బెద్దయుఁ దడవుగాఁ గౌఁగిలిం, పఁగ భీముఁడును నీవుఁ బరమహర్ష
మునఁ జారుతరవక్షములు సంగతములు గాఁ, బరిరంభణం బొనర్పంగ నరుఁడుఁ

1 పొనరింపఁ బెంపగున్. 2 శోనాశన మేల నీవు సలిపెదు చెపుమా. 3 మాయట్టి ఘోరహితోప. 4 కన్గొన నే మును గందు మట్లు గా.

గవలును మ్రొక్కినఁ గర మర్థిఁ దిగిచి నీ, వాలింగనంబు సేయంగ నిట్లు
తే. వారు మీరును దగ బాంధవమునఁ బొదలి
యింపు దళుకొత్తఁ దామరతంపరైనఁ
జెలులుఁ జుట్టలుఁ గలిసి పేరెలమిఁ బొంది
యుల్లసిల్లంగఁ గుల మెంత యొప్పునొక్కొ. 3
క. సమరమునకు వచ్చినభూ, రమణు లుభయకటకములను బ్రమదం బెసఁగం
దమతమపురములకుం బో,వ మహీజను లెట్టియుత్సవముఁ బొందుదురో. 35
వ. అని వెండియు ననేకవిధంబులం జెప్పి యీరెండుదెఱంగులవారును బంచి కు
చి సుఖం బున్న నఖిలభూప్రజకును బ్రమోదం బగుం గావున నట్లు సేసి యం
ఱచేత దీవనలు వడయ వయ్యా నీ వనిన విని దుర్యోధనుం డప్పుండరీకాక్షు
వీక్షించి యి ట్లనియె. 35
క. గురుఁడును బితామహుఁడు నీ, నరనాథుఁడు నెల్లప్రొద్దు నను దూఱుదు రి
ప్పురుసున నీవును దామో, దర దూఱెదు గాని తగవుఁ దలఁపవు కంటే. 35
క. వనితం బఱిచి రరణ్యం, బున నిడుమలఁ బడితి మనుచుఁ బోటరులై చం
పను [1]జెఱుపఁ దలఁచి మాదెసఁ, గనలుదు రప్పాండుసుతు లకారణమ కడున్
మ. అరయం దప్పొకయింత నావలన లేదాధర్మపుత్త్రుండు జూ
దరివెంటం దమకించి సౌబలునిచేతన్ భూమి గోల్పోయి ము
ష్కరుఁడై వెండియు నొడ్డఁగా నతఁడు నక్షప్రౌఢిమై గెల్చె నే
తెరువు వైనం దనయిచ్చ[2]తోఁ బడియె నింతే కాక యేఁ బూఁటయే. 35
తే. మాత్స్యపాంచాల[3]పాండ్యాదిమనుజపతులఁ
గూర్చికొని తార కయ్యంబు గోరి యెత్తి
విడిసి రింతియ కాక యివ్విధము నుగ్ర
కర్మమున కేము దొడఁగుట గలదె చెపుమ. 35
క. ఉక్కఱి సురపతి కైనను, మ్రొక్కము నృపధర్మమూఁది మొనతలఁ బడినన్
మిక్కిలి పేరును నిట దివి, నక్కజముగఁ బెంపుఁ బడయ నగుట నుపేంద్రా.
చ. చిఱుతఁదనంబునం దగవు చిత్తమునం దలపోయ లేక ముం
దఱ యటు వోవ నిచ్చితిఁ బితామహుఁడున్ జనకుండు నింకఁ గ్ర
చ్చఱ నిలఁ బంచి చక్కసగ మక్కడ నెవ్వరికేని మద్బలం
బెఱుఁగక యీఁ దలంచినను [4]నే నది యేటికి సమ్మతించెదన్. 361
తే. తొంటిచవి గని యిప్పుడుఁ దోఁచి పాండు
సుతులు రాజ్యంబు సేయంగఁ [5]జూచుకలుచ.

1 జెఱుపను మాదెసఁ గడు. 2 లో మెలఁగి రింతే. 3 యాదవమనుజ. 4 నే నట
5 జూచు టరయ.

నాకు నీఁ దీఱునే యింక నాఁటిచూఱ
లెక్కడివి ద్రోణభీష్ము లీదిక్కు సుమ్ము. 362

ఉ. ఏమును వారుఁ బంచికొని యేలుట గల్గదు పల్కకుండు మిం
కేమియు వాఁడిసూదిమొన యించుక మోపినయంతమాత్రయుఁ
భూమి యొనర్చి పాండునృపపుత్త్రుల కిత్తునె యెవ్వరైన సం
గ్రామమునన్ జయంబు గొని రాజ్యము సేయుట నిశ్చయించితిన్. 363

తే. అనిన విని కిన్కఁ బూనినయలఁతినగవు
చెలువు మొగమున కొక క్రొత్త[1]పోలు పొనర్పఁ
బుండరీకాక్షుఁ డగు టెల్లఁ బోయి యప్పు
డరుణకమలాక్షుఁ డగుచు మురాంతకుండు. 364

శ్రీకృష్ణుఁడు దుర్యోధనునితో మున్నతండు సేసినదుర్ణయంబు సెప్పుట.

క. మొనతలఁ బడియెదు నీచె, ప్పినయట్టుల తడవు లేదు బిరుదులరై నీ
వును వీరు నిలువుఁ డిదె భం, డన మెల్లియ వచ్చె నూఱటలు గనుఁ డింకన్.

సీ. అరయంగఁ దప్పు లేదంటి నీవలనఁ గీ, డొకనాఁడు సేసియు నొక్కనాఁడు
సేయవె నీజనించినయది యాదిగా, నుడుగక పాండవేయులకుఁ జాల
నెగ్గు సేసితి విష మిడి పెనుఁబాములఁ, గఱపించి నీరిలోఁ గట్టి త్రోచి
లక్కయిల్ గాలిచి పెక్కుభంగులఁ జంపఁ, దలఁచినఁ జావక ధర్మరక్షఁ

ఆ. జేసి నెగడి రాచసిరి నొంది యున్నఁ జూ, పోప కీవు తీవ్రపాపబుద్ధిఁ
గనమి జూద మొకటి కల్పించి కపటంబు, సేయ దాననెల్ల చేటుఁ బుట్టె. 365

తే. అన్నదమ్ముల నెత్తంబు లాడి సతుల, తలలు వట్టి సభాస్థలంబులకు నీడ్చి
చీర లొలిపింతురే యిట్టి[2]వారి నెందుఁ, దడవుమా నీవొకండవు దక్కనధిప.

ఉ. అప్పుడు నీవుఁ గర్ణుఁడును నాడినమాటలు గొల్వులోపలం
జెప్పెడునట్టివే కులము శీలముఁ గల్గినపుణ్యకాంత[3]క
ట్లొప్పమి సేయు టెల్లఁ గని యున్నజనంబులు వించు నుండఁగాఁ
దప్పొకయింత లేదనువిధం బది నీక చనుం గుమారకా. 368

తే. ఎత్తి విడిసినవారని యెల్లతప్పుఁ, బాండవులమీఁదఁ బెట్టిన బ్రదుకు గలదె
ద్రోణభీష్ములుఁ దండ్రియుఁ దోడుతోడఁ, జెప్పుతగుమాట[4]లేమియుఁ జెవులుసొరవు.

క. శాంతిం బొందుట నీకుం, గుంతీపుత్త్రులకు మేలగున్ దానికి యే
నింతయు నాడెద నది నీ, కెంతయు రుచియింప కునికి యెఱిఁగి యెఱిఁగియున్.

వ. అని యిట్లు నారాయణుండు నానాప్రకారంబులం జెప్పుటకుఁ గటకటం బడి

---

1 చెలు వొనర్పఁ ... డును డిల్లఁ బోయి. 2 క్రూరు నెందు. 3 న, ట్లొప్పమి...గని యోలిజనంబులు. 4 లింకేమి చెవులు,

యెడుదుర్యోధనునకు దుశ్శాసనుం డిట్లనియె. 371

మ. జనకుండున్ గురుభీష్ములుం దగినకర్జం బాప్తులై నీకుఁ బ్రీ
తి నెఱింగించు తెఱంగు గాదు తమబుద్ధిం బోయి [1]సంధాన మి
ట్లొనరం జేయక యున్నఁ గృష్ణునకు ని న్నొప్పించువా రింతవ
ట్టు నిజం బిచ్చట నింక నీయునికి నెట్లుం గీడు వుట్టుం జుమీ. 372

ఆ. అనిన బాహ్లికాదు లగుకురువృద్ధుల, నాత్మజనకుఁ గృష్ణు నాదరింప
కతఁడు రాజసమున నప్పుడు దిగ్గన, లేచి పోయె సంచలించెఁ గొలువు. 373

తే. అతనివెనుకన కర్ణుండు ననుజగణము, శకునియును వారిపొందైన జనపతులును
బోయి రమ్మెయిఁ జని యొక్కప్రోవు గట్టి, వేఱ యంతంత నుండిరి గోఱడమున.

వ. ఇట్లున్నం గనుంగొని గాంగేయుండు. 375

చ. ఇతఁ డిది యేల క్రొవ్వి ధరణీశుఁడ నంచు వృథాభిమాని యై
మతి సెడి లోభమోహమదమత్సరముల్ దనుఁ ద్రిప్ప నిట్లసం
గతమునఁ బోయె వీనివెనుకం జని రేమి దలంచియో మహీ
[2]పతులును వీరు గొంద ఱతిభారపుమానుసు లేమి సేయుదున్. 376

తే. అని జనార్దనుఁ గనుఁగొని యకట కాల
పక్వ మయ్యె నీనరపతి[3]ప్రతతి యెల్ల
ననుడుఁ దగువారిదెసఁ గలయంగఁ జూచి
తగవుమెయి నిట్టు లనియె నన్నగధరుండు. 377

శా. ఈదుర్యోధనుఁ డింతగర్వి యగునే యీయున్నవా రెల్ల నా
చే దైన్యంబునఁ బొందు టొప్ప దని చర్చింపం డయీభంగికిన్
లేదే యొండుదెఱంగు సత్కులముఁ బాలింపంగ వర్జింప రా
దే దుష్టాత్మకు నీచు నొక్కరుని [4]బోదే భేద మీజాతికిన్. * 378

ఉ. కంసుఁడు నిట్ల తండ్రిమది గందెడుచంద మొనర్చి ధర్మవి
ధ్వంసము సేసినం గులమువారలు నా కెఱిఁగింప నేను దు
ర్మాంసము గోయువైద్యునిక్రమంబున నాతనిఁ ద్రుంచి యన్వవాయో
త్తంసముఁ జేయనే జనకుఁ దద్విధ మొప్పదె మీరుఁ జేసినన్. 379

ఆ. అంతతోడ నెల్లయాపదలును దీఱు, వంశ మధికగౌరవంబు నొందుఁ
గూడి మనుట గలుగుఁ గురుపాండవులకు ని, త్తెఱఁగు సూడ మీకు నుఱవకాదె.

వ. అనిన విని ధృతరాష్ట్రుం డుదరిపడి విదురున కిట్లనియె. 381

ఆ. బుద్ధిమంతురాలు పొందుగఁ బలుకంగ, నేర్చు వచ్చి కొడుకుఁ దేర్చి పోవుఁ

---

1 సంధాడ మిం, పొనరం. 2 భృతులును...రతిబీరపుమానుసు. 3 ప్రచయమునకు; ప్రకరమునకు. 4 బొందే నీతి యీజాతికిన్; బొందే నీచుఁ డేజాతికిన్. * వ. అని మఱియుఁ గృష్ణుం డిట్లనియె. అను నొకవచనము గలదు,

గాన వేగ నీవు గాంధారిఁ దోడి తె, మ్మనుడు నరిగి యతఁడు నట్ల చేసె. 382

వ. అద్దేవియు. 383

క. చనుదెంచి యుచితపీఠం, బున నున్నం గురువిభుండు వాలఁతుకతోఁ ని
ట్లను నీతనూభవుఁడు దు, ర్వినయంబునఁ జనియె నిట్టివెంగలి గలఁడే. 384

క. నీ వైనఁ జెప్పి శాంతుం, [1]గావింపఁగ నోపుదేనిఁ గౌరవకుల మీ
గోవిందుశాసనము సం, భావింపం గాంచి చెడక బ్రదుకుం జుమ్మీ. 385

తే. అనుడు నీపుత్త్రుఁ డవినీతుఁ డగుట యెఱిఁగి, యెఱిఁగి వానివశంబున నేల పోయె
దీవు పాండవులకు నేమి యిచ్చితేని, నడ్డపడ నెవ్వరికి వచ్చు నధిప చెపుమ.

క. అని గాంధారి పతియుఁ డా, నును విదురుం బనిచె నందనుం బిలువ నతం
డును మొగము జేవుఱింపఁగఁ, [2]జనుదెంచెను సభకు విదురసంప్రార్థితుఁ డై.

వ. మున్ను దనతోడం జనినవార లందఱు నచ్చోటన నిలువ నిట్లు వచ్చి సుయోధ
నుండు నిజాసనాసీనుం డై యున్నఁ జూచి తల్లి చిత్తంబున గర్హించుచు నతనికి
ధర్మంబును నీతియును జుట్టఱికంబును బ్రదుకుఁదెరువును నిజశక్తియు సహాయంబు
గొలందియుఁ గులజనచిత్తప్రకారంబును బాండుపుత్త్రులబలపరాక్రమంబులుఁ
దెలియునట్లుగాఁ దెఱంగుపడం జెప్పి బుజ్జగించియుం గినిసియు ననేకవిధంబుల
నాడిన నమ్మాటలదెస ననాదరంబు సేసి యుద్ధతిం గ్రమ్మఱం జని యతండు కర్ణా
దులం గలసి వారునుం దానును దుర్మంత్రంబునకుం జొచ్చి. 388

దుర్యోధనాదులు శ్రీకృష్ణునిం బట్టికొని చెఱం బెట్టఁ దలంచుట.

క. హరితలఁ [3]పొప్పదు భీష్ముని, గురునిం గూర్చికొని మనలఁ గ్రొవ్వఱఁ బట్టం
గర ముత్సహించు చున్నాఁ, డరయ నతనివచనరచన నంతయుఁ దెలిసెన్.

క. మును దాఁ గంసునిఁ బరిమా, ర్చినచందము వారి కెల్లఁ జెప్పెడుఁ దనకున్
మును మనము గడఁగి [4]వెసఁ బ, ట్టినఁ గార్యం బగుఁ జలంబు డింపకుఁ డింకన్.

తే. పట్టి యీతనిఁ జెఱఁ బెట్టి పాండవులకు, దిగులు పుట్టింత మంతటఁ దెగక యెత్తి
వచ్చిరేనియు నిర్జింప వచ్చుఁ గోఱ, లెల్లఁ బుచ్చిన నురగంబు లేమి సేయు.

వ. అని విచారించె నిట్లు దుష్కార్యాలోచనంబు సేసి దుర్యోధనదుశ్శాసనశకుని
కర్ణు లగుదుష్టచతుష్టయంబు మొదలుగాఁ గలయవినీతులు దైతేయమర్దను
మర్దింప నిశ్చయించి రయ్యవసరంబున. 392

చ. అడఁకువ లేమి నల్క యురియాడుట నొండొరుఁ గూడ కుండుటన్
బుడిబుడి మాటలాడుటను బోవుచు వచ్చుచుఁ [5]గ్రందు గ్రమ్మఱం
బడుటను దెల్ల మైన మును పన్నగఁ దాఁ బరికించి యున్కి న
ప్పుడు హరిఁ బట్టుసంకులము పుట్టుట సాత్యకి నిశ్చయించుచున్. 393

1 గావింపఁగఁ జాలితేని. 2 చనుదెంచెన్ మగుడ. 3 పొప్పెడు. 4 తనుఁ.
5 గ్రంద గ్రమ్మఱన్ బడుటకుఁ దెల్ల.

తే. బఱటికొనిపోయి కృతవర్మఁ[1]బన్నఁ బనిచె, నీవు బలమును వాకిట నిలువు మేను
లోపలికి నెల్లఁ జాలుదుఁ బాపబుద్ధు, లన్నదెసఁ దప్పి రని నిర్భయమునఁ జెప్పె.
వ. ఇట్లు పరమాప్తుం డగుహార్దిక్యు నట వుచ్చి సాత్యకి సత్వరంబుగాఁ జనుదెంచి జనార్దనునకు [2]నత్తెఱం గెల్ల నెఱింగించి తదనుమతిం గౌరవేశ్వరబాహ్లికభీష్మవిదురులతో ని ట్లనియె. 395
మ. అదె కౌరవ్యు [3]లశక్తదుర్జనత సేయం బూని పైఁ బాఱఁ జూ
చెద రమ్మెమ్మ దమచేతఁ దీఱునె జయశ్రీకాంతు దైత్యాంతకుం
బొదువం దారు దలంచు టెల్ల ననలంబుం జీర బంధింపఁగా
మది నూహించినయట్లు కాక తమదుర్మంత్రంబులం బోవునే. 396
వ. అనిన విదురుం డదరిపడి వైచిత్రవీర్యున కిట్లనియె. 397
ఉ. భూవర నీతనూభవులు పుణ్యు నగణ్యపరాక్రముఁ హరిం
గేవలమర్త్యుఁ గాఁ దలఁచి కిట్టినఁ బట్టినఁ దారు మంటపై
వావిరిఁ గ్రమ్మునాశలభవర్గముచాడ్పున మ్రంది పోరె కా
లావధి [4]యయ్యెఁ గావలయు నక్కట వారికి వారివారికిన్. 398
వ. అనుటయు గోవిందుం డందఱు విన నంబికానందనున కిట్లనియె. 399
ఉ. రోషము నాపయిం గలిగి [5]క్రూరతఁ గౌరవు లింత సేఁత సం
తోషమ నీవు ప్రాభవముతోఁ దగ నాకు ననుజ్ఞ యిమ్ము ని
ర్దోషత నేను నోపుగతి దోర్బలదుర్జయు లైనవారి వి
ద్వేషముఁ జక్కఁబెట్టి జగతీవర యంతక పోయి వచ్చెదన్. 400
క. [6]అనుడు ససంభ్రమముగ న, జ్జనపతి దుశ్శాసనాదిసకలపరిజనం
బును నాదుర్జనునిం దో, డ్కొని రమ్మని విదురుఁ బనుచుడుం జని యతఁడున్.
వ. సపరివారంబుగా దుర్యోధనుం దోడ్తెచ్చినం జూచి యతనికి ధృతరాష్ట్రుం డి ట్లనియె. 402
చ. అలవి యెఱుంగ కిట్లు దనుజారికిఁ గీడొనరింప నీవు నీ
తులువలు నుత్సహించితిరి దుర్మతులార సమీరు మీకుఁ [7]జోఁ
కలవడి పట్ట వచ్చునె మహాద్రిఁ గదల్పఁగఁ బోలునే దవా
నలుఁ జమరంగ శక్యమె వినాశముఁ బొందెద రేమి సేయుదున్. 403
ఆ. అనిన విదురుఁ డిట్టు లను సుయోధనుతోడ, బాలకేళిఁ దొడఁగి లీలఁ గృష్ణుఁ
డెచట [8]నెచట నెవ్వ రెవ్వరి నేమేమి, సేసె వినవె యేల చెడియె దిట్లు. 404

1 బనిచె నీవు, బలములును గూడి వాఁకిట. 2 నక్కార్యంబు నల్లన నెఱింగించి. 3 లశక్తి... బాఱుతెం. 4 యయ్యె నిప్పుడు దలంపఁగ వారికి. 5 క్రూరత మూర్ఖుల కింత ... యింతటఁ బోయి. 6 అన విని సంభ్రమముగ. 7 జోకలవడఁ; జేనలవడఁ. 8 నెచటను నెవ్వరి నేమి చేసె, వినవె యేల వృథా నీవుచెడియె.

వ. అనియె నట్టియెడఁ గట్టెదుర నున్నయక్కురుపతికుమారుం జక్కం జూచి యేనొ క్కరుండన యని తలంచియె దుర్మదంబునం బొదివి పట్ట నుత్సాహంబు సేసి తనుచు దరహాసంబు సేయు వాసుదేవునిఫాలప్రదేశంబున బ్రహ్మాయు వక్షంబున విరూపాక్షుండును వదనంబున వహ్నియుఁ బార్శ్వంబుల నింద్ర యమ వరుణ కుబేరులు నాదిత్యమరుద్విశ్వేదేవాశ్వినులు నుద్భవించిరి హాలగాండీవమండిత బాహు లగుబలదేవార్జునులు సవ్యదక్షిణభుజంబులను నిజాయుధహస్తు లగు యుధిష్ఠిరభీమనకులసహదేవులు వీఁపునను వివిధప్రహరణపాణు లగుయదువృష్ణి భోజాంధకవీరు లూరులను బ్రభవించిరి జనితనానాహస్తవిన్యస్తంబులయి శంఖచ క్రగదాఖడ్గశక్తిశార్ఙ్గప్రముఖనిఖిలసాధనంబులు వెలింగె నేత్రశ్రోత్రనాసావివ రంబుల సధూమధూమకేతుజ్వాలాజాలంబులు నిగిడె రోమకూపకలాపంబులం దరణికిరణనిభప్రభలు వెడలె నిట్లు దుర్నిరీక్ష్యం బగునత్తేజోరూపంబుఁ గనుంగొ నంగొలఁదిగాక సకలజనంబులు నయనంబులు మొగిడ్చి యద్భుతభయానకరసం బుల జొత్తిల్లు చిత్తంబులతోడం గదల కుండ నప్పుండరీకాక్షుండు నారదాది మహామునులవలనను భీష్మవిదురద్రోణసంజయులయందును గరుణాతరంగితం బగుకటాక్షవీక్షణం బొలయ వారలకు దివ్యదృష్టి యొసంగిన నాపుణ్యపురుషు లు సాంద్రానందంబునం దేలుచుండి రయ్యవసరంబున. 405

తే. దేవదుందుభివ్రాతంబు దివి రెఁ గల్ప, వృక్షపుష్పధారామయవృష్టి గురిసె
సిద్ధసాధ్యవిద్యాధరశ్రేణి భక్తి, నిచ్చ్చజయజయశబ్దంబు లెసఁగెఁ జదల. 406

వ. అప్పుడు ధృతరాష్ట్రుం డమ్మహాసంకులంబు [1]విష్ణుని దివ్యవిజృంభణంబు గా వలయు నని యూహించి. 407

క. కరుణింపుము సంశ్రితభయ, హారణధురీణా సహింపు మజ్ఞానంబుఁ
శరణంబు వేఁడెద భవ, చ్చరణంబులు గనుఁగొనం బ్రసాదింపఁగదే. 408

చ. అనుడు దయార్ద్రచిత్తుఁ డగునప్పరమేశ్వరుఁ డిచ్చె దృష్టి య
జ్జనపతి కద్భుతం బడర సమ్మదపూరము గ్రమ్మ నాతఁడుం
గనుఁగొని భక్తి మ్రొక్కి నినుఁ గంటిఁ గృతార్థుఁడ నైతి నింక నొ
ల్ల నొరులఁ జూడ లోచనములం బురుషోత్తమ సంహరింపవే. 409

క. అనినపలుకులకు నచ్చటి, జను లెల్ల నృపాలు సితవిశాలాక్షుఁ గనుం
గొను చుండి రపుడు దమనె, మ్మనమ్ము [2]లాశ్చర్యరసనిమగ్నంబులు గాన్. 410

వ. తదనంతరంబ దామోదరుండు ధృతరాష్ట్రు నభిమతం బొడఁగూడ నతని కన్ను లెప్పటియట్లు కావించి నిజవిశ్వరూపప్రపంచంబు నుపసంహరించి మునీం ద్రులనామంత్రణంబు సేయ నమ్మహాత్ము లంతర్ధానంబు సేసిరి దానును సముత్థా

1 కృష్ణుని (దివ్యనిరామయువిజృం) విశ్వరూపదివ్యవిజృం. 2 లాశ్చర్యమానమగ్నం.

నంబు సేసి యంతకు మున్న సన్నిహితులై యున్న కృతవర్మ కరంబును సాత్యకి
హస్తంబును నవలంబించి యూరక వెడలె నని చెప్పిన. 411

ఆ. ఇవ్విధమునఁ గృష్ణుఁ [1]డేఁగినపిదపటి, కథ వినంగ నాకుఁ గౌతుకంబు
మనము నిండి గడలుకొనుచున్న యది వివరించి చెప్పు మునివరేణ్య యనుడు.

ఉ. [2]భక్తమనఃప్రమోదకరపాదసరోజవికాశ చేతనా
శక్తిమయప్రభావ మునిసంస్తుత సాత్యవతేయభారతీ
ప్రోక్త నిగూఢసంప్రకటభూమసమాశ్రయ వత్సలత్వసు
వ్యక్తకృపాభిరామ గుణవర్జన నిష్కల నిత్య పుష్కలా. 413

క. అవ్యయ [3]నిర్మలవిభవా, దివ్యప్రభవా సుఖైకదీప్తానుభవా
నవ్యత్వనిత్య యతిసం, సేవ్యసుసాంగత్య లోకజీవనకృత్యా. 414

మాలిని. రవిశశిమయనేత్రా ప్రస్ఫురత్కాంతిహృద్యా
నవజరఠవికారన్యాస లీలానవద్యా
వివృతనిగమశాఖావిశ్రుతాగ్రైకవేద్యా
వివిధ[4]నియతచర్యావిత్తచిత్తప్రసాద్యా. 415

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున యుద్యోగపర్వంబు
నందుఁ దృతీయాశ్వాసము.

శ్రీ

గణేశశారదాగురుభ్యో నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఉద్యోగపర్వము, చతుర్థాశ్వాసము.



మత్తులసీ[1]పల్లవ
దామచ్ఛవిలబ్ధమరకతప్రతిమత్వో
ద్దామప్రభాస్థిమాలా
శ్యామాయితవిపులవక్ష హరిహరనాథా. 1

### కృష్ణుండు గుంతియింటికిం జని యాయమతో మాట లాడుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియెఁ గృష్ణుం డత్తెఱంగున వెడలిన విస్మిత యై గాంధారి యభ్యంతరమందిరంబున కరుగం గౌరవు లెల్లను బంధుమిత్త్రసహాయసహితంబుగాఁ దనతోడన వెడల మొగంబు గంటు వెట్టికొని కక్ష్యాంతరంబులు గడచినప్పుడు దారుకుండు తేరినొగలపై నుండి పొడసూపి కేలు మొగిడ్చి ఫాలభాగంబునం గదియించినం దత్ప్రదేశంబున నిలిచి వారల దెస మరలి చూచి మీ రింక నిలువుం డని పలికిన నాంబికేయుండు పుండరీకాక్షుం జేరి నిజతనూజుల నుపలక్షించి. 2

ఉ. వీరును [2]పాండుపుత్త్రులును వేరము దక్కి పొసంగి మన్కికై
పోరిత మాడి యే నటులు బుద్ధులు సెప్పినభంగియుం గులా
చారము నిర్వహింపఁ బలుచందములం దగ దుఃఖపాటు నీ
కౌరవజాతికిం దెలిసెఁ గాదె గదాధర నీదుసన్నిధిన్. 3

వ. అని వెండియు. 4

తే. నీకు శుద్ధుండ నగుటయ నిఖిలబంధు, మిత్త్రగురుజనకోటికి ధాత్రి కెల్ల
నంబుజాక్ష నిర్దోషుండ [3]నగుట గాన, నా తెఱంగు నీ వెఱుఁగుట నాకుఁ జాలు.

వ. అనిన విని యచ్యుతుండు బాహ్లికభీష్మద్రోణకృపప్రముఖనిఖిలవిశిష్టజనంబుల నాలోకించి. 6

---

1 వల్లభ. 2 పాండునందనులు. 3 నట్లు గాన.

తే. ఇప్పు డీసభఁ బుట్టినయింతవట్టు, మీకుఁ దెల్లంబు గాదె యీమేదినీవి
భుండు [1]దా నేమిటికిని ముఖ్యుండఁ గాను, దప్పు దన దెస లే దని చెప్పి విడిచె.
వ. కావున నాకు నియ్యెడం దడయం బని లేదు పోయి వచ్చెద ధర్మపుత్త్రునకు నింత వృత్తాంతం బెఱింగింప వలయు నని పలికి వారల నామంత్రణంబు సేసినవాఁ డై రథారోహణంబు సేసి ధృతరాష్ట్రుండును నచటిజనంబులును వెనుకం జనఁ జని కుంతీగృహద్వారంబున నరదంబు డిగ్గి. 8
క. వారందఱుఁ దనతోడన, గారవమున నరుగుదేరఁ గాఁ జొచ్చి మహో
దారుఁడు గుంతీచరణాం, భోరుహముల కెఱఁగి వినయభూషణుఁ డగుచున్. 9
క. కౌరవసభఁ దా నాడిన, గౌరవవాక్యములుఁ గార్యఖడ్గక్రమవా
క్పారములు సుయోధను[2]దు, ష్ప్రారంభము నల్పవచనపద్ధతిఁ జెప్పెన్. 10
వ. ఇట్లు ధృతరాష్ట్రుకొలువునం బుట్టినవిశేషంబులు పాండురాజమహిషి కెఱింగించి మాధవుండు మఱియును. 11
తే. కురుకుమారులు దమయంతఁగుడిచి క్రొవ్వి,మీఁ దెఱుంగరు [3]మా కేమి మేలకాక
నాలుకలుగ్రోయునర్జునానలముదగిన,యెరగౌనం గని సంతృప్తి యెసకమెసఁగు.
వ. పాండుకుమారులపాలికిం బోయి వచ్చెద వారికిం దగినబుద్ధు లానతి య్మనిన నద్దేవి విక్రమోపజీవిత లయినముచుకుందుండును సృంజయుండును ననుతొంటినరపతులచరిత్రంబులు సెప్పి యుధిష్ఠిరుండు వీరిని వినండో కాక యని పలికి యెల్లవారును విను చుండ వెండియు నిట్లనియె. 13
ఉ. [4]రాజుల కెందు నారయఁ బరాక్రమజీవనవృత్తి దక్క నొం
డోజ నిషిద్ధ మంత్రు మును లుత్తమసత్త్వులు వంశధర్మముల్
పూజితభంగిఁ జేయుదురు బుద్ధివిహీనులు వానిఁ దక్క ని
స్తేజపుఁగూటి కియ్యకొని దీనతఁ బొందుదు రంబుజోదరా. 14
క. నీవియ్యంబులు సంధియ, కావింపం బడిరి వీరిఁ గలయుట కష్టం
బావెరవు దప్పుటయ మే, లై వచ్చెం బొమ్ము విడువు మనుమానంబున్. 15
మ. నిజవంశోచిత[5]వీరవృత్తమున కున్మేషంబుగా నాకపి
ధ్వజుఁ డుత్సాహము సేయ కున్న నకటా దైన్యంబు వాటిల్లదే
భుజదర్పోద్ధతుఁ డైనభీమునకు నీపాం దొప్పునే నీవు న
ర్వజగన్మాన్యుఁడ విందు రాఁ దగునె దైవం బిట్లు దప్పించునే. 16
వ. అని యంత నిలువక గొంతి యిట్లనియె. 17
క. మఱచిరె కొలువున ద్రౌపదిఁ, బఱచినబన్నంబు ధర్మపథము దొఱంగా

1 నేనేమిటికిని...తప్పు (నా) తన మీఁద లేదని చెప్పికొనియె. 2 దు,ష్ప్రారంభము నల్ప వచనగతితోఁ జెప్పెన్. 3 యెట్లైన మేలు. 4 రాజులకుం బరాక్రమము రాజసజీవనవృత్తి దక్క నొం. 5 మైనవృత్తమున.

వెఱచుట [1]కప్పటి కదిదగుఁ, జెఱచినచో వెదక వలదె చిరతరకీర్తిన్. 18

శ్రీకృష్ణుఁడు కర్ణునిఁ దనరథం బెక్కించుకొని కొన్నిరహస్యోక్తులు వలుకుట.

వ. అని పలికి పుండరీకాక్షుం గౌఁగిలించికొని [2]యచ్యుతుండు మ్రొక్కిన దీవించి
యేను సుఖం బున్నదాన నని పాండవులకుం జెప్పుము చేతులలావునం గనిన
జీవనంబున బ్రదుకుం డనుము పోయి రమ్మని వీడుకొల్పిన సింహగమనసుంద
రంబుగా వెడలి తనతోడన గదలి వచ్చినధృతరాష్ట్రాదుల నిలువం బనిచి
రథారోహణంబు సేసి గోవిందుండు కర్ణుదెసం గనుంగొని నన్ననిచి వత్తు గాని
రమ్మని కరంబు సాఁచి చెయి వట్టి తనయరదం బెక్కించికొని సాత్యకి వేసరి
నెక్కి కెలనం జనుదేరం గదలి చని యనుప వచ్చినకృతవర్మ నుచితప్రకారం
బున సస్నేహంబుగా నిలిపి యరుగునవసరంబునం బౌరలోకంబు. 19

ఉ. అక్కట వాసుదేవు[3]పను పాదరణంబునఁ జేయ రైరి వీ
రెక్కడిబుద్ధిమంతు లని నిందును నందును లోక మెల్లఁ బే
రుక్కున మ్రగ్గుటం దలఁప నొల్ల కపాయము సేసి రట్టె యీ
యుక్కివు లెందునుం గలరె యొప్పరు వో ధృతరాష్ట్రనందనుల్. 20

వ. అని మఱియు ననేకు లనేకప్రకారంబుల బలుకుచు నిరుగెలంకులం [4]జూచు
చుండఁ బుండరీకాక్షుండు పురంబు నిర్గమించె నిట ధృతరాష్ట్రుండును మగిడి
కొలువుకూటంబునకు వచ్చి యెప్పటివారలు పరివేష్టింప నుండి కృష్ణునివలని
మాటలాడుచున్నసమయంబున సుయోధనుతో భీష్మద్రోణు లిట్లనిరి. 21

చ. పలుకునె యిట్లు గొంతి విని బమ్మెరపోయితి మింతబెట్టిదం
బు లగునె మాట లయ్యుమయుఁ బుణ్యుఁడు గృష్ణుఁడుఁ గార్యవాదముల్
[5]వలికెడువార లిట్లు దెగఁ బాఱిరి ధర్మజవారిరాశికిం
జెలియలికట్ట వాసె మనచే నగుకర్జముచంద మెట్టిదో. 22

వ. అని పలికి వెండియు. 23

శా. మాకుం జూడఁగఁ బోలు [6]కార్య మిది ధర్మప్రీతి నీ వేఁగి సు
శ్లోకుం డైనయుధిష్ఠిరుం గని జనస్తుత్యంబుగా శాంతిమై
నీకౌరవ్యుల నెల్లఁ గాచికొనవే యే పొప్ప దెందుం దుర్
శోకం బొందక వేగమైఁ గదలి కృష్ణుం గూడఁ బోవే నృపా. 24

వ. అనిన విని దుర్యోధనుండు మొగంబు రాఁజ చుండ నూర కుండె గాంగే
యుండును గురుండును దిగ్గన లేచి యతని నవలోకించి. 25

క. కురునృప విను సంసారము, దరి ద్రొక్కిన [7]వార మింకఁ దలఁకెద మే సం
గరమునకు నేము నీకై, పొరలితి మెల్లైన నగును బోయెద మనుచున్. 26

---

1 కవ్వఁరి కిందరు, చెఱ. 2 యతండు మ్రొక్కిన. 3 పలుకొ. 4 జనుచుండఁ, 5 వలికెడునట్టివారు దెగఁబాఱిరి. 6 వాక్య మిది. 7 వార మేము.

క. అరిగిరి రాజును సభ్యుం, దరమునకుం జనియె రాజతనయుండు బహిః
పరివారముఁ బొమ్మని మిత, పరిజనుఁడై యేఁగె నాత్మభవనంబునకున్. 27

తే. అంత నక్కడ నచ్యుతుఁ డరిగి యరిగి, యధికసంప్రీతి దలకొన నర్కతనయు
నాననంబు వీక్షించి యి ట్లనియె [1]నెమ్మి, నన్యు లెవ్వరు విన కుండ నతనితోడ.

సీ. నీవు వృద్ధజనోపసేవివి ధర్మసం, వేదివి తెలియంగ వినుము సిద్ధ
మంత్రబలంబున మార్తాండువరమునఁ, గన్నియతఱి గొంతి గన్నవాఁడ
వగుటఁ బాండునృపాలునగ్రసుతుండవు, ధర్మమార్గం బిది ధర్మతనయుఁ
డాదిగాఁ గలతమ్ములందఱు నాచేత, నెఱిఁగి నీయడుగుల కెఱఁగి సకల

ఆ. పుత్త్రమిత్త్రబంధుభూరిసేనాసమ, న్వితము గాఁగఁ గొలిచి నిన్ను రాజ్య
భారవహనమునకుఁ బట్టంబు గట్ట నుజ్జ్వలుండ [2]వగుదు రమ్ము వారికడకు. 29

వ. ఏను నిన్ను సామ్రాజ్యంబునకు నభిషిక్తుం జేయుదు నీవు దొలుత వెడలునప్పటి మహోత్సవంబునకు యువరాజై యుధిష్ఠిరుండు నీరథంబున నుండి నీకు ధవళ చామరంబులు వైచు వాయుపుత్త్రుండు సితచ్ఛత్త్రంబు వట్టు సవ్యసాచి సారథ్యంబు సేయు మఱియుఁ బాంచాలయాదవపాండ్యమాత్స్యులు లోనుగాఁ గల రాజలోకంబుతోడఁ గవలు నభిమన్యుప్రభృతికుమారులు బెరయ నేమెల్లం బలసి పరివేష్టించి వత్తు మిట్టిమహేంద్రవిభవంబున మహనీయుండ [3]వగుచు మహీచక్రం బేలు మని చెప్పి మఱియును. 30

క. పాంచాలరాజపుత్త్రియు, నంచితముగ నిన్నుఁ బొందు [4]నార్వురవరులన్
సంచితపుణ్యుఁడ వీ వొక, యించుకయును వేఱు సేయ కేతె మ్మెలమిన్. 31

వ. ఇట్లనినఁ గుంతికి సమస్తబంధుమిత్త్రులకుఁ బ్రియం బగు ననిన విని రహస్యం బుగా రాధేయుండు మాధవున కి ట్లనియె. 32

కర్ణుఁడు శ్రీకృష్ణునకుఁ దగినయుత్తరంబు లిచ్చుట.

చ. వెడవెడ యేనుఁ దొల్లి యిది వింటి ననుం గని [5]కుంతి యెంతయుం
జెడ నది వైచి పోయెఁ గృపఁ జేకొని సూతుఁడు దెచ్చి తాను మున్
గొడుకులఁ గాన కున్కిఁ బ్రియకుం దగ నిచ్చినఁ జేఁపెఁ జన్ను ల
ప్పుడఱియు నప్పు డాదిగ శుభస్థితిఁ బెంచెఁ బ్రయత్నశీల యై. 33

క. మూత్రపురీషాదులు దమ, గాత్రములం [6]దింక వారు గారవ మెసఁగం
బుత్త్రుం డని సంవర్ధిత, గాత్రునిఁ గాఁ జేసి రింతకాలముఁ గూర్మిన్. 34

క. నేఁ డింక నెఱిఁగి యొరువుల, [7]వాఁడఁ గదా యనుచు నేను వారిఁ దొఱఁగినం
బోఁడిమి సెడదే మదిఁ గడు, వాఁడి గలదె నీకు నకట వారిజనాభా. 35

1 నచటు, నన్యు. 2 వగుము. 3 వగుము. 4 నాఱువవరుసన్. 5 కుంతి నిర్దయన్ జెడ నటువైచి. 6 దింకఁ బరమకారుణ్యమునన్...డని ననువర్థిత,...ఁగాలము నెమ్మిన్. 7 వాఁడఁ జుమీ.

వ. వృద్ధోపసేవనంబును ధర్మసంవేదనంబునుం గలవాఁడ వని నన్ను నీవ చెప్పితివి రాధయు నధిరథుండును నాకు జాతకర్మాదిసమస్తసంస్కారంబులు నిజకులోచితంబుగా నాచరించి రట్టితల్లిదండ్రులకుఁ బుత్త్రకృత్యంబులు నిర్వర్తింపక వారలం బ్రాసి యేను వచ్చుట ధర్మం బగునే యని పలికి వెండియు. 36

క. సోదరులుఁ [1]బ్రియులు ననుజులు, నాదెసఁ బెక్కండ్రు వారి నందఱ విడువం
గా దని యూహింపక దా,మోదర నన్నిట్లు పిలుచు టుచితమె చెపుమా.

వ. అదియునుం గాక. 38

ఉ. సూతసుతుండు వీఁ డనక సూనుల తమ్ములకంటె నాకు సం
ప్రీతి యొనర్చి తేజమును బెంపును నాఁటికి నాఁటి కగ్గలం
బై తనరార నన్నుఁ దనయంతటిమానిసిఁ జేసి యుండ నే
నే తగ [2]వూఁది యాకురుకులేశ్వరుఁ బాయుదు ముట్ట వచ్చినన్. 39

క. నను నయ్యర్జునునకు నెదు, రని పెద్దయు నమ్మి యుండు నక్కట దుర్యో
ధనుఁ డా[3]నమ్మిగ వమ్ముగఁ, జనునే పాండవులఁ గలయఁ జననా కనఘా. 40

ఆ. ఏను నర్జునుండు నెక్క టెక్కటి దల, పడక యున్న నగరె పుడమిజనము
[4]లందు నాదువచ్చు టతనికి నపకీర్తి, యనిన నాకు వేఱె యడుగ నేల. 41

క. హిత ముపదేశించితి నీ, వతినిర్మలబుద్ధి వగుట నైనను నిది నా
మతి సొరదు రహస్యము ర,క్షితముగఁ బాటింపుమయ్య చిత్తములోనన్. 42

వ. అది యేమిటి కంటేని. 43

తే. ధర్మతనయుండు దాను నాతమ్ముఁడగుట,యెఱిఁగెనేనియు సామ్రాజ్యమేల పూను
నట్టిధార్మికుఁ డాధిపత్యంబుఁ జేయ, వలవదే శాశ్వతంబుగ [5]వసుధకెల్ల. 44

క. అనుజులు ఋత్విజులు గ నీ, వని యిటు సేయు మని నీవుపద్రష్టవు గా
విను కురుకుమారపశువిశ, సనమున రణయజ్ఞ మతఁడు సమ్మతిఁ జేయున్. 45

వ. దానం బుణ్యభూమి యగుకురుక్షేత్రంబున మముబోం ట్లెల్లను సద్గతి [6]వడయుదురుగాక యనిన విని వసుదేవనందనుండు సూతనందనున కిట్లనియె. 46

మ. [7]దయ నాయాడినమాట గైకొనవు సంతాపంబుఁ దెచ్చుం జుమీ
స్మయ మెట్లుం దుది నీకు నర్జునునితో మాత్సర్య మైనం బరా
జయ మొండెఁ మృతి యొండెఁ గాక గెలువన్ శక్యంబె పెక్కండ్ర కిం
తియకాలం బగునట్టె నీమనము శాంతిం బొందఁగా నేర్చునే. 47

క. గాండీవముఁ గవదొనలు న,ఖండితదివ్యాస్త్రములు నొగలపై నేనుం
జండ[8]భుజబలము నై యు,ద్దండత నరుఁ డడర నెదురఁ దరమే నీకున్. 48

---

1 ప్రియులు తనయులు. 2 వేది. 3 నమ్మిక వమ్ముగ. 4 లందు నేను వచ్చు. 5 వసుధయెల్ల. 6 వడయుదుముగాక. 7 దయచే నాడిన; నే నాడిన...గైకొనక; కొనమి...వచ్చుం

వ. ఎల్లభంగులం బాండవుల గెల్తు రది యట్లుండె నీవు పొమ్మిప్పుడ పోయి సుయోధనునకును గురుభీష్ములకును మీకుం దోడు వచ్చినరాజుల కందఱకుం జెప్పు మిమ్మాసంబు సౌమ్యం బై శీతోష్ణంబులు లేక పుష్పఫలోపేతంబును సమగ్రధాన్యంబును సులభయవసేంధనంబును నగుచు నొప్పి యున్నయది యేడెని మిదిదివసంబులకు నమావాస్య వచ్చు నది పుణ్యదినంబు నాఁడు భండనంబు గావలయు ననినఁ గానీనుండు గమలనాభున కిట్లనియె. 49

క. కలవు నిమిత్తస్వప్నం, బులు గౌరవపాండవులకుఁ [1]బోటగు దానన్
గెలు పయ్యుధిష్ఠిరునకును, గల దెఱుఁగుదు నీవు సెప్పఁగా నేమిటికిన్. 50

వ. అట్లు గాన కదా యే నందు రా నని పలికి మఱియును. 51

క. దీనికి మూలము శకునియు, నేనును దుశ్శాసనుండు నింతియ కుంతీ
[2]సూనుల వారలు గలసిన, రానేరఁగ వచ్చు నాకు రాజీవాక్షా. 52

వ. ఈసమరసముద్రంబు [3]దఱియ నీఁది నిన్నుం గనియెదఁ గా దేని నూర్ధ్వలోకంబునం గాంచెద నీ వింక నేమియుం బలుకకుము పనివినియెద నని కౌఁగిలించుకొనిన నట్ల కాక పొమ్మని విష్ణుండు వీడుకొలుప రాధేయుండు రథావతరణంబు సేసి కనకరత్నమయం బగుతనయరదం బెక్కి కరిపురంబున కరిగె నచ్యుతుండును సాత్యకిం దనరథం బెక్కించికొని దారుకుం జూచి పద పద పో నిమ్ము పో నిమ్మని పలికి లలితాటోపకలితుం డగుచుఁ జనియె నట్టియెడ విదురుండు విషాదంబుతోఁ బాండురాజమహిషిపాలికిం జని యిట్లనియె. 53

ఉ. అక్కట కౌరవాన్వయమహార్ణవ మింకెడునట్లు [4]పుట్టె నిం
దొక్కరుఁ డైనఁ గేశవుహితోక్తి మేకొనఁ డయ్యె నర్జునుం
డెక్కటి దాన చాలుఁ దము నిందఱఁ దీవ్రశరాగ్నిఁ గాల్పఁ బెం
పెక్కినపాండునందనులయేడ్తెఱఁ దొల్లియుఁ దా రెఱుంగరే. 54

తే. [5]అన్ని వడియును బంధుక్షయంబు సేయ, నొల్ల కెల్లవిధంబుల నుపశమంబ
కోరి రప్పాండవేయులు వారి కిట్టి, దొసఁగు వచ్చునె తులువలతోడఁ బుట్టి. 55

వ. అని వెండియు నివ్విధంబుమాటలఁ బాండవులకుఁ గయ్యంపుటలజడి మైనవగపు దోఁప నాడుచుం గొండొకప్రొద్దు నిలిచి నిజనివాసంబునకుం బోయినయనంతరంబ కుంతి యిట్లని వితర్కించె. 56

మ. తమవారిన్ సిరికై వధించు టిది సద్ధర్మంబె యక్లేశకృ
త్యమె తాఁ గయ్యము ద్రోణభీష్మకృపకర్ణాటోపముల్ మాన్పు ట
ల్పములం దీఱునె యందు నర్జునియుల్లం బెప్పుడుం గ్రోధదీ
ప్తము [6]భీమాదులమీఁదఁ దక్కొరుల కుత్సాహంబు లే దాజికిన్. 57

1 బోరగు. 2 సూనులు వారలఁ గలయక, రా నాకెటు సంభవించు. 3 గడ్వ నీఁది...నేమియు నానతీయకు. 4 దోఁచె. 5 ఆహవంబున బంధు. 6 భీమాదులయందుఁ.

వ. అని యిత్తెఱంగునఁ బెక్కులు చింతించి తలంచుకొని కర్ణునకుం బుట్టువు దెలిపి స
హోదరస్నేహం బావహించెద నట్లయిననాహవంబువలనికడంకయుడుగకుండు
నె యని విచారించి యతనిపాలికిం[1]బోవక నిశ్చయించి యుచితప్రకారంబున వెడ
లి యతం డనుష్ఠానార్థంబు భాగీరథికిం జనుట విని తత్ప్రదేశంబున కరిగి యతనికి
జపకాలం బయి యునికిం జూచి వెనుకవలనఁ గూర్చుండఁ గొండొకసేపునకు
జపంబు దీఱి గలయం గనుంగొని యమ్మహాదేవిం గాంచి కానీనుండు సంభ్రమ
వినయంబులతోడం జేరి సూతగోత్రంబును రాధేయనామంబునుం జెప్పి యభి
వాదనంబు సేసి నీవు విజయంచేసినకార్యం బేమి నాకుం జేయం గలపని యె
య్యది యాన తి మ్మనినఁ గుంతి యేకాంతంబుగా ని ట్లనియె. 58

కుంతీదేవి గర్ణునకు నతండు దనపుత్త్రుం డగుట దెలుపుట.

సీ. వినుము సూతాన్వయంబున నీవు పుట్టుట, బొం కేను మాకుంతిభోజునింటఁ
గన్నియనాఁడు భాస్కరుని [2]రావించితి, వరమంత్రబలమున వచ్చి యతఁడు
సంప్రీతి నొసఁగంగ జన్మించినాఁడవు, నాకుఁ గావునఁ బాండునందనుండ
వగుదు ధర్మస్థితి నట్టినీ వితరులఁ, గొలువ నేటికిఁ గురుకులవరేణ్య
తే. ధర్మతనయాదు లైననీతమ్ములకును, ధార్తరాష్ట్రులకును నీవ తగువిభుండ
వేలు మీలోక మెల్ల నీ కేల రాధ, కొడు కితం డనుతక్కువ కొడుకుఁగుఱ్ఱ.
క. అని పలికినయవసరమున, నినబింబములోన నుండి యిది నిజ మిబ్భం
గిన నెగడ వన్న మే లగు, ననువాక్యము వెడలెఁ గర్ణుఁ డాకర్ణింపన్. 60
తే. దాని వినియును నపుడు రాధాసుతుండు, దిరుగఁబడనిమనంబుతో ధీరవృత్తిఁ
దల్లి కి ట్లను [3]నీమాట తథ్య మగున, దైన నొక్కటి సెప్పెద నవధరింపు. 61
క. క్షత్త్రియసంస్కారమునకుఁ, బాత్త్రముగా నీవు నన్నుఁ బాటింప విహా
ముత్త్రఫలములకు నీ కేఁ, బుత్త్రుఁడ నని వచ్చు [4]టింకఁ బొసఁగునె చెప్పుమా.
వ. సూర్యానుగ్రహంబునం జేసి నింద్యంబు గాక తక్కెనేనియు నాజన్మంబు పరమ
రహస్యంబు నై యున్నయది దీనిఁ బ్రకాశంబు[5] సేయుట మన కెంత మేలట్లుంగాక.
ఆ. విజయువిక్రమంబు విఖ్యాత మై యుండ, నేను గుంతికొడుక భానుజుండ
ననుచు నతనిఁ జేర [6]నరిగిన నతనికి, వెఱచి పోయె నన రె వేయు నేల. 64
క. కడిఁదిపగఱ నేఁ దెప్పగఁ, గడవంగా నీఁదఁ దలఁచుకౌరవనాథుం
జెడుఁ గాక యంచు నిత్తఱి, విడువఁ దగునె [7]యతనివలన వెలసినవాఁడన్. 65
క. కౌరవులచేతఁ [8]గుడిచిన, వారికి నిది సమయ మెట్టివారును సంగ్రా
మారంభంబునఁ బాయుదు,రే రాజులు మనలఁ దిట్ట రే య ట్లయినన్. 66

---

1 బో నిశ్చయించి. 2 నారాధించ, నంతర్బలంబున నతఁడు వచ్చి,...లేలు భూలోక మెల్లను నేల రాధ. 3 తనమాట తథ్య మరయ. 4 టింకఁ బోలునె. 5 సేయ కుండుట. 6 నరిగిన నన్నుఁ దా. 7 యతనిచేత వెల. 8 వెలసిన, వారికి.

వ. ఏ నవశ్యంబును దుర్యోధనునకై నీకొడుకులతోడం బెనంగుదు. 67

ఉ. నీపలు కెంత [1]వోలినను నిర్ణయ మిట్టిద కాని యొండు లే
దీపనిమీఁదిభారమున నీ విట వచ్చితి గాన పాండవుల్
సేపడిరేనిఁ జంప నఱ సేయక చెప్పెద సవ్యసాచిపైఁ
గోపము పెద్ద వాఁడు సమకూరిన బిట్టుఱఁ జంపుదుం జుమీ. 68

ఆ. సవ్యసాచిచేతఁ జచ్చుటయును గీర్తి, కరమ యతఁడు లోను గాఁగ నేవు
రేను లోనుగాఁగ నేవురు గాని నీ, కొడుకు లార్వు రనుట విడువు మింక. 69

చ. అనుటయు నప్డు గొంతి హృదయంబున శోకము నివ్వటిల్ల ని
ట్లను నిది దైవసంఘటన మక్కట యెట్లును దప్ప నేర్చునే
యనుపమసత్యవిస్ఫురణ నాడినమాట మఱాకు మన్న నీ
యనుజుల నల్వురం గడపు మర్జునుఁ జేతకు సమ్మతించితిన్. 70

ఆ. అనుచుఁ గౌఁగిలింప నర్కజుం డట్లకా, కని ప్రియంబు మెఱయ వినతుఁ డై న
నరిగె సదనమునకు నద్దేవి యతఁడును, జనియె నిజనివాసమునకుఁ బ్రీతి. 7

వ. అక్కడ వాసుదేవుం [2]డుచితప్రయాణంబుల నుపప్లావ్యంబునకుం జని ధర్మతనయ
చేతం బూజితుం డయి భీమసేనాదులు విరాటద్రుపదముఖ్యు లగుతగువారలు
దన్నుం గాంచిన వారి నెల్ల నభినందించి కొలువున నుండి యుధిష్ఠిరుతో న
ట్లనియె. 7

తే. ధార్తరాష్ట్రు లున్మత్తులు దగినపలుకు, లేల విని సంధి సేయుట కిచ్చగింతు
రెదిరిఁ దమ్మును [3]నెఱిఁగిర యేని వార, లంత లంతలు సేయుదు రయ్య నాఁడు

వ. అని యెల్లవారును వినఁ దనపోయివచ్చినకార్యంబు తెఱంగెఱింగించి పథి
మంబు వుచ్చువాఁ డయి పుండరీకాక్షుండు నిజమందిరంబున కరిగె నాఁ
రాత్రి ధర్మనందనుం డనుజసహితంబుగా నుచితప్రదేశంబున నుండి గోవి
దుని రావించి నీవు సుయోధనుతోఁ బలికిన [4]చందం బెట్టు లతండు విని యె
ధంబున నుత్తరం బిచ్చె నని యడిగిన నచ్యుతుం డిట్లనియె. 7

శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకుఁ గౌరవసభం బుట్టినవిశేషంబులు దెలుపుట.

క. కయ్యము గాని తెఱంగున, నెయ్యం బగునట్లు గాఁగ నెఱిఁ బలికితి నే
నెయ్యది [5]సుఖంబు పథ్యం, బెయ్యది యెఱుఁగంగఁ దథ్య మెయ్యది దానిన్

తే. బహువిధంబులఁ బలుకునాపలుకు లెల్లఁ, [6]జీఁదక న్నిడి తనపెడచెవులఁ బెట్టి
యీఱతాఱలు మఱుమాటలిచ్చి యపహ, సించె దుర్యోధనుఁడు వేయుఁ జెప్ప నే

క. అనిన విని ధర్మజుం డి, ట్లను నప్పుడు దండ్రి యుచిత మాడఁడె భీష్ముం
డును గురుఁడు విదురుఁడుం ద, క్కిన పెద్దలుఁ బలుకరే తగినచందమునన్. 7

1 వోపినను. 2 డుచితప్రకారం. 3 నెఱిఁగినయేని. 4 చందం బెయ్యది యితం డేమివి
బున. 5 శుభంబు పథ్యం. 6 జీఁదకను వెట్టి; జిఱుతకను వెట్టి.

క. నావుడు హరి యిట్లను స, ద్భావమున విచిత్రవీర్యతనయుఁడు దగ నా
నావిధములఁ జెప్పిన సం, భావన వినఁ డతఁడు వలుకుఁ [1]బ్రతికూలంబుల్. 78

సీ. శంతనుపుణ్యవంశం బంకురించిన, చందంబు నంబికానందనుండు
జాత్యంధుఁ డై యుండ సామ్రాజ్య మంతయుఁ, బాలించి పాండునృపాలుఁ డతనిఁ
గొలిచి యుండుటయును గురుకులంబున కెల్లఁ, దేజంబుగా మీరు దిగ్విజయము
సేసి కావించినసిరి వారు వంచనఁ, గొనుటయు సత్య మకుంఠితముగ

తే. నీవు సమ్మయంబు నడపిన నెఱియుఁ దండ్రి, పాలు మీకు నీఁ దగుటయుఁ బాడిలేమి
[2]నడరఁ జెడుదురు కౌరవు లనియుఁ బెద్ద, లెల్లఁ జెప్పిరి మొగమోటయింత లేక.

క. అలయక యందఱుఁ జెప్పం, గలయంతయుఁ జెప్పి రతఁడు గటకటఁబడి య
క్కొలువు వెడలి పోయెం ద, మ్ములుఁ గర్ణుఁడు రాజలోకముం దో నరుగన్.

వ. ఇట్లు గొడుకు ముష్కరుండై యరిగిన ధృతరాష్ట్రుండు గాంధారి రావించి.

క. తగ [3]విదురుఁ బంచి యాతని, మగుడఁగఁ బిలిపించె నాయమయుఁ దనయునకుఁ
వగయును గూర్మియు వెరవును, మిగిలినవచనముల సంధి మెయికొనఁ జెప్పెన్.

వ. ఎవ్వ రెంత సెప్పినను గైకొనక కడంగి దుర్యోధనుండు దనకుం గలవారల నెల్లను గురుక్షేత్రంబునకు నడవుం డని చెప్పం బనిచె భీష్ముని సేనాముఖంబు సేసికొని యెత్తి విడియం గలవాఁ డిది ధార్తరాష్ట్రునిశ్చయం బేనును నాయోపినంత సామవాదంబు లాడితి నారదాదిమహామునులను సుయోధనునకు బుద్ధులు సెప్పునట్లు సేసితి నేమిసెప్పినను నెంతటం బో కున్నం గినుక దెచ్చికొని జంకించియు భంగించియు ధిక్కరించియుఁ దృణీకరించియుం జూచితిఁ గార్యంబు భగ్నం బగుట కొల్లక వెండియు శాంతవచనంబులు వలికితి నతం డశక్తదుర్జనత సేయం జూచిన నమానుషంబు లగువానిం గొన్ని వెడమాయలం బన్ని పెక్కుపోకలం బోయితి నెన్నిభంగుల సంధియ కావలయు నని పొరలం గలయంతయుం బొరలితి నప్పాపాత్ముం డెట్లునుం జక్కంబడక తనచలంబుతోన పొట్టుపొర లయ్యెఁ గయ్యంబు వొడుచుంగాని యవశ్యంబును రాజ్యంబుపాలిచ్చువాఁడు గాఁడు కౌరవులయెడ దండంబు దక్క నొం డుపాయంబు లేదు మీకుం బోలినతెఱంగు సేయుం డనిన ధర్మతనయుండు దమ్ములం గనుంగొని యి ట్లనియె. 83

క. కురుసభఁ బుట్టినచందము, హరి యంతయుఁ జెప్పె నింక ననుమానము లే
దరిమర్దనమున కయ్యెడు, వెరవుం జేవయును [4]మెఱయ వెడలుఁడు గడఁకన్.

వ. అని పలికి యజాతశత్రుండు కరుణాయత్తచిత్తుం డై యచ్యుతు నాలోకించి. 85

క. కురువంశము ద్రుంచుటకుం, జోరఁ జాలక నామనంబు సుడివడియెడు నే

---

1 బ్రతివచనంబుల్. 2 నరయఁ జెడుదురు. 3 విదురుఁ బుచ్చి; బిలిచి (బెట్టి) యాతని,మగుడఁగ రావించి యాయమయు. 4 మిగుల.

[1]వెరవును దొరకొనదు గదే, సరసీరుహనాభ పొందు సంపాదింపన్. 86
వ. నామనంబును దమ్ములతలంపును నీ వెఱుంగుదు ధార్తరాష్ట్రులచందంబును
భీష్మద్రోణవిదురాదులచిత్తంబులును నెఱింగి వచ్చితి మాకు ధర్మచ్యుతి లే
కుండునట్టి కార్యంబు నిశ్చయింపు మనిన నారాయణుం డిట్లనియె. 87
ఉ. యుద్ధము కాక [2]కార్యమును నొండొక టెద్దియుఁ గల్ల నేర్చునే
బుద్ధులు సెప్పు వాక్యముల పోల వినం డన నేల యట్టిచో
బద్ధునిఁ జేయఁ జూచె ననుఁ బట్టి సుయోధనుఁ డింక నయ్యసం
బద్ధునితోడిసంధికి నుపాయము నామదిఁ దోఁప దెమ్మెయిన్. 88
వ. అని చెప్పి విదురుం డేకాంతంబున నాడినమాటలును భీష్మద్రోణబాహ్లికాదు
లగుపెద్దలకు ధార్తరాష్ట్రులదెసం బుట్టినమనఃక్షోభంబును గుంతి గౌరవులు
వినంబలికినపలుకులుం బ్రకటించి ధర్మపుత్త్రుపైఁ బాపంబులేకునికిఁ దెలిపి సమ
రం బవశ్యకర్తవ్యంబుగా నిశ్చయించె నట్టియెడఁ దమ్ములన్న మొగంబునం జూడ్కి
నిలిపి యూరకుండి రతండు [3]వారలం గలయం గనుంగొని యిట్లనియె. 89
ఉ. కౌరవకోటిచేత మనకష్టపుఁబాటు దలంపు వచ్చినం
గ్రూరవిచేష్టితంబునకు గొంతి యొడంబడె బంధువర్గముం
ఘోరముగా వధించుటకుఁ [4]గోల్కొన కున్నది బుద్ధి మీరు ని
ర్ధారణ సేయుఁడా హితము ధర్మము నయ్యెడువృత్త మెట్టిదో. 90
వ. అనిన విని యర్జునుం డతని కిట్లనియె. 91
చ. హితమును [5]ధర్మముం దగవు నిట్టిది నా మన మేమి నేర్తు మ
చ్యుతుఁడు సమస్తధర్మపరిశోధకుఁ డావిదురుండుఁ బాండుభూ
పతిసతియుం దగం బలుకుపల్కుల నందియ మెల్లఁ బాసె ని
ట్లితఁడు రణంబు సేయుఁ డన నింక విచారము లెల్ల నేటికిన్. 92
ఆ. అనిన నట్ల కాక యఖిలధర్మజ్ఞాన, ఘనుఁడు మనకు నేఁడుగడయుఁ దాన
శౌరి నిశ్చయింప సంశయం బేటికి, సంఘటింపుఁ డుగ్ర[6]సమరవిధము. 93
వ. అని యుధిష్ఠిరుండు [7]దమ్ములతో నెట్టకేలకుం దెగువ సెప్పి. 94
క. బాహాగర్వము వివిధ, [8]వ్యూహావిధిజ్ఞతయుఁ గలిగి యొకరుం డేడ
క్షోహిణులు నడపి భీష్మో, త్సాహంబున కోర్చుచాపధరుఁ డెవ్వఁ డొకో. 95
వ. అట్టివానికి వాహినీనాయకత్వం బిచ్చి యభిషేకంబు సేయ వలయు. 96
తే. అనిన సహదేవుఁ డిట్లను [9]నధిప పుత్త్ర,పౌత్త్రసోదరవంతుండు బాహువీర్య

1 వెరవున దొరకొనఁ దగదే. 2 కార్యమను...టెయ్యది గల్గుఁ జెప్పుమా...జేయఁ జూచె
దను...దోఁచ దేమియుం. 3 వారల వలననుఁ. 4 నూల్కొన; గూర్కొన; గోరక. 5 ధర్మ
ముం మనకు. 6 సమరమునకు. 7 దమ్ములకుం గొడుకులకుఁ దేటపడం జెప్పి. 8 వ్యూహావిదగ్ధ

ఘనుఁడు మన కాశ్రయం బయి మనిచె మత్స్య
దేశపతి గాఁడె సేనాపతిత్వమునకు. 97

వ. అనవుడు నకులుండు. 98

చ. [1]బలయుగముఁ బెంపుఁ దేజమును బాహుబలంబును నగ్గలంబు పె
క్కు తెఱుఁగుఁ గార్యఖడ్గములకుం దగుతోవలు ద్రోణులందు భీ
ష్ములదెసఁ గోపముం గలఁ డమోఘపరాక్రమశాలి నీబలం
బుల కధినాథుఁ గా ద్రుపదభూపతిఁ బట్టముఁ గట్టు టెట్లొకో. 99

వ. అనుటయుం దదనంతరంబ ధనంజయుండు. 100

ధృష్టద్యుమ్నాదులకు సేనానాయకత్వంబు నిర్ణయించుట.

సీ. అగ్నికుండమున ద్రోణాచార్యునకు నాశ, మొనరించుదానికై యుద్భవించె
రథరథ్యములు ధనుర్బాణంబులును దను, త్రాణఖడ్గములు నుద్దామలీలఁ
దనతోన జన్మించె దహనశిఖామూర్తి, భుజవీర్యవిక్రమస్ఫూర్తిశాలి
సైన్యనాథుండు ధృష్టద్యుమ్నుఁ డగు నని, తలఁచెద నాతఁడు దక్కనొరులు

తే. భీష్ముతోఁ గోర్వ [2]రుగ్రంపుబిరుదు ధైర్య,ధనఘనుండు శిఖండి భీష్మునకు మృత్యు
వై జనించినవాఁడు మహాబలుండు, దండనాయకుఁ జేయ నతండు దగును.

వ. అనవుడు ధర్మనందనుండు గోవిందుం జూచి యితండు సకలచరాచరతారత
మ్యసంవేది విశేషించి మనకు నితనిమాటయ విజయమూలంబు గావున నిమ్మ
హాత్ముండు నిరూపించినవాఁడు వరూథినీముఖ్యుండు. 102

క. అనుటయు దామోదరుఁ డిట్లను ధృష్టద్యుమ్నుఁ డర్హుఁ డగునభిషేకం
బొనరింపుము పేరోలగ, మున నక్షోహిణుల కెల్ల [3]ముఖ్యుఁడు గాఁగన్. 103

క. సురగంధర్వఖచరకిం, పురుషాదిసమస్తదివ్యభూతంబులబం
ధురభూరివ్యూహంబుల, విరచనముల నెఱుఁగు నతఁడు వీరోత్తముఁడున్. 104

క. [4]నీయొద్దిరాజు లందఱు, ధీయుక్తులు విక్రమప్రదీప్తుల మైనన్
వే యేటికి ధృష్టద్యు, మ్నాయత్తము సేయు సైన్య మంతయు నధిపా. 105

వ. అనిన విని యుధిష్ఠిరుం డక్షోహిణులకుం బ్రత్యేకనాయకులను నీవ నిర్దేశింపు
మనుటయు నతండు. 106

తే. సేన దమకును గలవారు లేనివారు, ననక తగువారిఁ జెప్పెద నఖిలసమర
పండితుల నేరి వారి నీబలము లేదు, నడపఁ జాలించి యభిషేచనం బొనర్పు.

వ. అనిన నట్ల చేయుదు వా రెవ్వ రెవ్వరు నిరూపింపు మని యడిగినఁ గుంతీనంద
నునకు దేవకీనందనుం డిట్లనియె. 108

సీ. పటు[5]పరాక్రమనిధి పాంచాలపతియు న, మానుష తేజుండు మత్స్యవిభుఁడు

---

1 బలమునుఁ. 2 దత్కృష్ట; భీష్మునోర్వరు సంగ్రంపు...బాహుబలుండు దగఁడె.
3 ముఖ్యుఁ డగుటకున్. 4 నీయోధవీరు లందఱు...విక్రమైకదీప్తుల. 5 పరాక్రమశాలి.

శత్రుభీకరమూర్తి సాత్యకియును జరాసంధాగ్రతనయుండు శౌర్యఘనుఁడు
సహదేవుఁడును ధైర్యశాలి యాదవశిరో, మణి చేకితానుండు మహితవిభవ
ఖని యగుశిశుపాలతనయుండు దోర్దర్ప, ధుర్యుండు ధృష్టకేతుండు సమర
తే. లంపటుండు శిఖండియు లావు వెరవుఁ, గలరు నీయెడ ననురక్తి గలరు సా(…)
బెంపు గలరుక్కు మిట్టిన తెంపు గలరు, కోరి పతులుగఁ జేయు మక్షోహిణులక(…)

వ. అని దండనాథుల నిశ్చయించి వెండియు. 11

క. కురుసైన్యము నిస్సారం, బరయఁగ మనబలము లెల్ల నతిదృఢములు నీ
వరవాయి గొనక నడపుము, ధరణీశ్వర సేనమొగము దైవము నీకున్. 11

క. నీయనుజులు దివిజులకు న,జేయులు ధృతరాష్ట్రసుతులఁ జెఱుచుట వ్రేఁగే
తోయజనాళము గజలీ, లాయత్తము గాదె యెత్తు మాహవమునకున్. 11

వ. అని నిర్ణయించి నారాయణుండు నిజనివాసంబునకుం జనియె ధర్మతనయుండు(…)
దమ్ములుం బ్రియం బంది యారాత్రి సుఖనిద్ర సేసిరి రేపకడయ పాండవాగ్రజ(…)
డనుజతనుజదనుజాంతకసామంతమంత్రిపురోహితసహితంబుగాఁ బేరోలగంబు(…)
నుండి సమస్తపరివారంబును వినఁ గార్యంబునిశ్చయంబుఁ దెలియం బలికి త(…)
వారలతో సముచితసంభాషణంబులు సేసి మహనీయమహిమ వెలయం బుం(…)
రీకాక్షుండు పనిచినట్ల పాంచాలనాథప్రముఖుల నక్షోహిణులకు నధిపతులుగ(…)
వేరువేర యభిషేకించి శ్వేతవంశజాతుం డగుటంజేసి శ్వేతుం డనం బ్రఖ్యాతు(…)
డగుధృష్టద్యుమ్నునకు నుత్కృష్టప్రకారంబున నభిషేకం బొనర్చి సర్వసేనా(…)
పత్యంబునకుం బట్టంబు గట్టి యయ్యైనమంద్రను దక్కటిదొరలను గనుంగొ(…)
మధురవాక్యంబుల నగ్గించి కౌరవులతోడికయ్యంబునకుం గురుక్షేత్రంబున(…)
విడియం బోద మని చెప్పి వారినెల్ల ధనంజయునకుం జూపి. 11

ఉ. ఎప్పుడు నెయ్యెడం బొదివి యిందఱకుం దగ నీవు కంటికిన్
ఱెప్పయుఁ బోలె మా టయి నెఱిం బను లారసి యొజ్జచాడ్పునం
జెప్పుచు [1]వీరిబుద్ధి గొని చేయుము కార్యము నీకు రక్ష దా
నిప్పరమేశ్వరుండు గలఁ డిచ్చు శుభం బని చూపెఁ గృష్ణునిన్. 11

వ. ఇట్లు గాంభీర్యమాధుర్యధుర్యుం డైనయుధిష్ఠిరుండు వరిష్ఠప్రభువులచిత్తంబ(…)
[2]లారాధించి సర్వజనసమ్మతంబుగా సమరోత్సాహంబు సేసి మహోల్లాసంబ(…)
నం బ్రస్థానభేరి పఱవం బంచిన. 11

సీ. [3]బీఁతెండ తాఁకున బీటలు వాఱిన, పచ్చిగోడలమాడ్కిఁ బగిలె దిశలు
కాఁగినయెసరులకరణిఁ బొరింబొరి, శరనిధు లుప్పొంగి పొరలఁ బడియెఁ
గలము పైఁ గీలించి గాలి కెత్తినచాఁప, వోలె మిన్నంతయు బూరటిల్లెఁ
గులపర్వతావళి గులిశభయంబున, బెదరి వాపోవున ట్లెదురు సెలఁగె

1 వీరిఁ బట్టుకొని. 2 లారసి. 3 బిట్టెండతాపను ..వాశిన.

తే. ధాత్రి కమ్మరిసారెవిధమునఁ దిరిగెఁ, జిత్రరూపులభంగి నిశ్చేష్టితంబు
లయ్యె సర్వభూతములుఁ బ్రయాణభేరి, భూరినిష్ఠుర ఘోరభాంకార మడరి. 116

పాండవులు గౌరవులతోఁ డియుద్ధంబునకు వెడలుట.

వ. ఇట్లు ప్రస్థానభేరి సెలంగిన సకలసైన్యంబులు దండనాథసహితంబుగా సన్నద్ధంబు
లయ్యె మఱునాఁడు. 117

ఉ. భూరివిభూతిఁ బెండ్లికిని బోవు తెఱంగునఁ బాండునందనుల్
దారును బుత్త్రులుఁ హరియుఁ దమ్ముఁడు నుజ్జ్వలచారులీల శృం
గారము సేసి [1]సమ్మదవికాస మెలర్పఁగ వీరసంభ్రమో
దారసముద్ధతిం జనిరి ద్రౌపది యున్నెడ కందఱుం దగన్. 118

వ. ఇట్లు సని యమ్మహాదేవి నామంత్రణంబు సేసి తత్ప్రభృతిపుణ్యస్త్రీకరకలితలలి
తాక్షతంబులు గైకొని విప్రాశీర్వాదంబు లాదరించుచు భద్రపాఠకశ్లోకంబు
లాకర్ణించుచు శోభనపదార్థంబులు గనుంగొనుచు నాంగికమాంగల్యసూచ
కంబులు సేకొనుచు వెడలునప్పుడు. 119

క. [2]తగుశంఖకాహళాదిక, మగుమంగళతూర్యసంచయము గంభీరం
బుగ మ్రోసె జయముఁ దెలుపుచు, జగతీశ్వరుమ్రోల నాకసము దీటుకొనన్.

క. మనుమనిజయప్రయాణం, [3]బనుమోదింపంగ నాసుధాంశుఁడు సనుదెం
చినకరణి గొడుగు కుంతీ, తనయాగ్రజుమ్రోల నతిసితప్రభ నొప్పెన్. 121

వ. అట్టియెడ నమ్మహీవల్లభుండు. 122

క. [4]ఉచితగతిఁ జేరి వంది, ప్రచయము గీర్తింప నెక్కె రథమం దొనరన్
ఖచియించినవజ్రంబుల, రుచులను బోలు పారుసీవిరులు బెరయంగన్. 123

వ. తదనంతరంబ. 124

సీ. వక్షస్థలంబున వనమాల గ్రాలంగ, వెలిమావుగెడలవాగెలు ధరించి
నొగలపై హరి యొప్ప నగచరకేతువు, మెఱయంగ నరదంబు మెఱుఁగు లడర
దివ్యకిరీటంబు దీప్తులు భూనభోం, తర మెల్లఁ గలయంగఁ బరఁగుచుండ
గాండీవతూణయుగ్మములు పూర్వాపర, భాగంబులకు నవాభరణములుగఁ

తే. దెలిమొగంబుతో నల్ల నేతెంచి యొక్క
పార్శ్వమునఁ బొడసూపి భూపతికి మ్రొక్కి
దేవదత్తంబు పూరించె దేవదేవు
పాంచజన్యంబు మున్నుగా ఫల్గునుండు. 125

శా. భీముండుం గవలుం గుమారులును సంప్రీతిన్ గదాద్యాయుధో
ద్దామస్ఫీతరుచుల్ వెలుంగ రథసంతానంబు రమ్యోజ్జ్వల

1 సంతసవికాస మెలర్పఁగ...సమున్నతిం. 2 తగ. 3 బనుఘోషింపంగ. 4 ఉచిత
గతి నేఁగి.

[1]శ్రీమీఱం దగ వచ్చి శంఖములు గర్జిల్లంగఁ బూరించుచుఀ
భూమీశుం గని యగ్రభాగమున కొప్పం బెంపునుం జేయుచున్. 126

క. నిలిచిరి దక్కటిదొరలును, బలుమానుసులును మహోగ్రభంగి నవరణాల్
సెలు వొంద నధిపుచుట్టుల, నలంకరించిరి విభూషణాంశుచ్ఛటలన్. 127

వ. అప్పుడు పాండవాగ్రజున కభిముఖంబుగాఁ జనుదెంచి. 128

క. సాష్టాంగ మెఱఁగి సమరా, [2]వష్టంభం బొప్ప దివ్యవాహనలీలో
త్కృష్టగతిఀ ముంగలి యై, ధృష్టద్యుమ్నుండు వొలిచెఁ దేజోమహిమన్. 129

వ. ఇవ్విధంబునం జారుభీషణంబుగా సన్నద్ధుండై యుధిష్ఠిరుండు గదలి శుభసూచ
కంబులు గైకొనుచు నడచె నట్టిసమయంబున నెల్లవారిపరిచారకులును శకటాది
సకలసాధనంబులును బటగృహంబులును మొదలుగా వలయుసమస్తవస్తువు
లొడఁగూర్చి వెడలినదండు పఱపై సముద్రంబు గాఁపువోవుచందం బయ్యె
నిట్లరిగి ధర్మపుత్త్రుండు కురుక్షేత్రంబు దఱియం జొచ్చి ఋష్యాశ్రమంబులకు
దేవతాయతనంబులకు నలజడిగా కుండం బరిహారంబు సేయుచుం జని తృణ
కాష్ఠజలసమృద్ధం బై తగియెడుసమస్థలంబున హిరణ్వతి యనుపుణ్యనదిపొంత
విడిదలగా నిరూపించి యచ్చో నిలిచెఁ దదనంతరంబ. 130

తే. విడియుటకు సూచకంబుగ విష్ణుఁ డొత్తెఁ, బాంచజన్యంబు ధర్మజ పార్థులాది
గాఁగఁ దమతమవీరశంఖంబు లెల్ల, దొరలు నొత్తిరి దివి మ్రోఁత [3]దూఁటుగట్ట.

వ. తదనంతరంబ యొక్కరమ్యప్రదేశంబున రాజమందిరంబును నుచితస్థానంబుల
సమస్తజననివాసంబులు నై రమణీయబంధురంబును సింధురాశ్వశాలామాలి
కామనోహరంబునుం గా వీ డెల్ల విడిసె వీటిచుట్టునుం దిరిగి ధృష్టద్యు
మ్నుండు సురక్షితంబు [4]చేసి వచ్చె రాజును దొరలును దమ్ములును సకలపరివా
రంబును దగినతెఱంగున నుండిరి నానావస్తుబహుళసంభారంబుల మహో
దారం బగుచుఁ బాండవస్కంధావారంబు మహనీయాకారంబున నొప్పె
నంత నక్కడ. 132

క. చారులచే నంతయు విని, కౌరవపతి విననియట్లు కర్ణాదులతోఁ
బేరోలగమున విగతవి,కారుం డై యిట్టు లనియె గర్వ మెలర్పన్. 133

క. తనవచ్చినకార్యము మన, మనుకూలతఁ జేయ కున్న హరి యలుకమెయిఀ
జని యప్పాండుతనూజులు, మనములఁ [5]గిను కూనునట్టిమాటలు సెప్పెన్. 134

చ. మును మనచేత భంగపడి ముచ్చిరి యుండుటఁ జేసి పాండునం
దనులును నెత్తి వత్తు రుచితంబుగ సంగర మెట్లుఁ గల్గుఁ బే
ర్చినబహుసైన్యముల్ బయలఁ జేరఁ దగఀ విడియింత మెల్లి దం

1 శ్రీమై లీలఁగ. 2 వష్టవ్యం బొప్ప దివ్యబాణసలీలో. 3 దూదుకట్ట. 4 ఁజేయుచు.
5 గిను పూనునట్టి.

డని పురిఁ జాటఁ బంచి దొర లందఱుఁగుఱ్ఱ బడి సేయఁ [1]డెత్తెఱన్. 135

వ. మనకు విడిదల కురుక్షేత్రంబని పలికి దుశ్శాసనుం జూచి నీవును గర్ణుండును
గాంధారపతియును సమస్తంబును సమకట్టుం డనుటయు వారలు ప్రియంబునం
బని పూని వెడలి [2]దండు సాటించి తగువారల కెల్ల నెఱింగించి పుచ్చిన సకల
పరివారంబును బ్రమోదంబు నొందె భూవల్లభుండును గొలిచి యున్నవారలం
బోవం బంచి వలయునెడకుం జని తగినవర్తనంబున నుండె నట్టిసమయంబునఁ
బ్రయాణోచితంబు లగుబహుప్రకారవ్యాపారంబులయందుఁ దత్పరు లయిన
దొరలనానాచేష్టితంబులను గరితురగరథంబులకు సవరణలు సమకూర్చుచతుర
పరిచారకులసంభ్రమంబునను వివిధాయుధంబులు రవణంబులుగా నాయితంబు
లు సేయఁ బ్రవర్తించుపదాతివర్గంబులసంరంభంబునను నయ్యైసరకులు పయనంబు
నకనువు సేయుబలుమానుసులతిరుగుడువడుటనుం బురంబు సమరోత్సాహచం
ద్రోదయంబునకు మహార్ణవం బై ఘూర్ణిల్లుచుండె నపరదినముఖంబున. 136

క. త్వరితగతి సమయసముచిత, కరణీయము లాచరించి కమనీయాలం
కరణోజ్జ్వలుఁ డై యెలమిం, గురురాజే తెంచెఁ గొలువుకూటంబునకున్.

వ. వచ్చి దుశ్శాసనప్రముఖనిఖిలసహోదరపరివృతుం డై యుండి. 138

దుర్యోధనుఁడు ద్రోణప్రభృతుల సేనాపతులం జేయుట.

సీ. అరిభయంకరుఁడుద్రోణాచార్యుఁడును రణో, త్సాహలంపటుఁడు రాధాసుతుండు
శరతత్త్వవేది యశ్వత్థామయును భూరి, బాహావిలాసుండు బాహ్లికుండు
శౌర్యవైభవశాలి శల్యుండు ధైర్యసం, పన్నిధి గృపుఁడును బ్రకటశక్తి
సారదుర్జయమూర్తి భూరిశ్రవుండును, దర్పోజ్జ్వలుండు గాంధారపతియు

తే. నుగ్రతేజుండు గృతవర్మయును బ్రతాప
ఘనుఁడు గాంభోజుఁడును బరాక్రమధనుండు
సింధురాజును బతులుగాఁ జేయఁ గోరి
కొనఁగ దగువార లగుదు రక్షోహిణులకు. 139

చ. అని మది నిశ్చయించి తగ నందఱఁ బిల్వఁగఁ బంచి వారితో
ననిపని మాటలాడి వినయంబునఁ బ్రార్థన సేసి మీర లీ
యొనరినసైన్యముల్ పదునొకొంటికిఁ బ్రాభవ మాచరింపఁ జొ
చ్చిన సకలంబు నొప్పు నభిషేకము గైకొనుఁ [3]డుత్సవంబుగన్. 140

క. అనవుడు నందఱు నొగ్గా, కని సంతస మంద నధిపుఁ డభిషేకించెన్
జను లెల్ల సంప్రమోదం, బునఁ బొందఁగ నప్పు డతి[4]విభూతిం బ్రభులన్. 141

వ. ఇట్లు మహామహిమ వెలయ నక్షోహిణీనాయకుల సమకట్టి రారాజు పితామ
హుపాలికి వారిం దోడ్కొని చని సవినయంబుగా నతనికిఁ బ్రణామంబు సేసి

1 డిత్తఱన్. 2 దండు సాగించి. 3 డుత్సవంబునన్. 4 విభూతిప్రభలన్.

వారలం జూపి వీరల మనయక్షోహిణులు పదునొకొంటికిం బతులఁ గావించి
నిన్ని సైన్యంబులు నొక్కలావున వర్తించుచందంబు సూచికొన వలయు న
చెప్పుచుఁ జేతులు మొగిచి యిట్లనియె. 14

చ. నెఱిఁ బడి యాజి నీమొనలు నేరవు గూడి తగం జరింప నిం
దఱుమన సొక్కఁడై చనక తప్పఁ గదా బహుదేశవాసు లం
ద[1]ఱొకటి సేయుచో వెరవు దప్పక చెల్లుట యెట్లు గల్గు ని
త్తెఱఁ గొకచాలువానిబలుతీర్పునఁ గాక పొసంగ నేర్చునే. 14

ఆ. అమరసేనలును దమంతన వర్తింప, నేర కునికి నాకుమారుమొగము
గా నొనర్ప వలసెఁ గాదె సమస్తసే, నలను నీవ యరసి నడప వలయు. 14

క. తారలకుం జంద్రునిగతిఁ, గౌరవులకు మేటి వీవ [2]కావున నీవీ
భారంబు వూని మముఁ గడ, చేరుపఁ దగు నెమ్మెయిం బ్రసిద్ధచరిత్రా. 14

తే. సర్వసేనాధిపత్యంబు నిర్వహింప, నీవు దక్క నిం దొక్కరు నీవ యరసి
చెప్పుమా కలఁడేని రక్షింపు మమ్ముఁ, బూని పట్టంబుదాల్పుము పొడిచిగెలువ

వ. అనిన విని గాంగేయుండు గాంధారేయున కిట్లనియె. 14

ఆ. మీరుఁ బాండుసుతులు నారయ నా కొక్క, రూప కార్యమున్నరూపు వల
వలయుఁ గయ్యమైన వత్తు మీలోన నా, యునికిచందమునకు నుచిత మిది య

క. సేనాధిపత్యమును దగఁ, బూనెద నను మార్కొనంగఁ బురుషుల నుర్విం
గానఁ గిరీటికి నొక్కని, కే నొర్వ నతండు శరము [3]లెక్కు డెఱుంగున్. 14

క. పెఱవారి నెల్లఁ దర మిడి, నఱకుదుఁ బాండుక్షితీశనందనులను రూ
పఱ నేయం జేయాడదు, దఱుమరు నామీఁద నత్యుదగ్రత వారున్. 1

వ. అప్పటికిఁ దగినభంగి యయ్యెడు నది యట్లుండె నని పలికి మఱియు నిట్లని
ఆ. మున్ను కర్ణునొండె నన్నొండెఁ గయ్యంబు, సేయఁ బనుపు మిట్లు సేయువాఁ
డైనఁ గాని సకలసేనాధిపత్యంబుఁ, బూన నేరఁ జుమ్ము [4]భూపతనయ. 1

వ. అనినం గర్ణుండు కౌరవపతితో నిట్లనియె. 1

క. ఇప్పుడు క్రొత్తగ దీనిం, జెప్పంగా నేల మున్న చెప్పితిఁ గాదే
యెప్పుడు భీష్ముఁడు వడు నే, నప్పు డనికి వచ్చువాఁడ నని సభలోనన్. 1

ఆ. అనిన నట్ల కాక యని సర్వసేనాధి
పత్యభారపట్టబంధమునకు
నియ్యకొనియె భీష్ముఁ డయ్యగ్గలికఁ గొని
యాడె విభుఁడు ప్రముదితాత్ముఁ డగుచు. 1

క. భేరీమృదంగ[5]శంఖకు, లారవములు సెలఁగఁ జేయుఁ డని పనిచి మహో

---

1 దఱ కని సేయుచో. 2 కావున ననికిన్. 3 లెక్కు డెఱుఁగుటన్. 4 భూ
ణ్య. 5 శంఖము, వారవములు...పనిచె.

దారపతాకాద్యుత్సవ, గౌరవములు నడపె నెల్లకడలం బురిలోన్. 156

వ. ఇట్లు పట్టణాలంకారంబు సంఘటించి రత్నకాంచనకలధౌతమయంబు లగుకల
శంబులఁ దీర్థజలంబులు దెప్పించి మణిప్రకరంబునఁ గుసుమనికరంబున [1]మంగళ
తరుత్వక్ప్రచయంబున మహౌషధినిచయంబున విహితమంత్రంబుల నుచితతం
త్రంబుల బుత్విక్పురోహితసహితుం డై తత్సంస్కారప్రకారం బాచరించి. 157

క. గురుఁడును గృపుఁడును [2]లోనగు, గురులను మోదింప బాహ్లికుండు మొదలుగాఁ
గురుజాతి యెలర్పఁగ న,న్నరపతి భీష్మాభిషేచనం బొనరించెన్. 158

తే. ఇవ్విధంబున నభిషేక మెలమిఁ జేసి, పరమభక్తి నక్షౌహిణీపతులఁ జూపి
వీరికిని సైన్యములకును మీర యొడయ,లనుచుఁ బట్టంబుగట్టె [3]శంతనుతనూజు.

క. అత్తఱిఁ బాషాణంబులు, నెత్తురు నెమ్ములను గురిసె నిష్ఠురనినదా
యత్తమయి నభము పిడుగుల, మొత్తంబులు వడియె నగరమున నెల్లెడలన్.

క. దానికి జను లుత్సాహావి, హీనతఁ బొందంగఁ గౌరవేంద్రుఁడు నానా
దానాదు లయినశాంతివి, ధానము లొనరించి యాన తత్పరమతి యై. 161

క. తల్లియుఁ దండ్రియు [4]వెఱఁగునఁ, బుల్లవడక వారికడకుఁ బోయి తడయఁగా
నొల్లక పయనపువీడ్కో,లెల్లను దనయిచ్చ నడపి యేడ్తెఱ వెడలెన్. 162

తే. వెడలి తమ్ములుఁ దగువారు వివిధభృత్య
గణముఁ దానును నేలగ్రక్కదలఁ గదలి
రాజరాజు గాంగేయుఁ బురస్కరించి
కొని సముద్ధతి నడచె దిక్కులు వడంక. 163

వ. నడచి కురుక్షేత్రంబు దఱియం జొచ్చి యం దొక్కరమణీయప్రదేశంబు విడి
దలగా నిరూపించి నిలిచి భానుసూనుండునుం దానును మెలంగి యెల్లవారిని
విడియించి నడుమ నిజనివాసంబు గావించినఁ గౌరవేశ్వరుస్కంధావారంబు
వారణపురంబున నెవ్వ రెయ్యెడ వసియింతు రాచందంబున నందం బై యొప్పె
నిట్లు రెండువీళ్లును సన్నద్ధంబు లైనసమయంబున. 164

ఉ. సంధికి నేఁగి కార్యము పొసంగక కృష్ణుఁడు రాకయుఁ సుహృ
ద్బాంధవసంఘయుక్తముగఁ బాండవకౌరవవీరు లష్టది
క్సింధురకంధరంబు లడఁగించుబలంబుల పెల్లుతోడ గ
ర్వాంధత [5]నాజి కెత్తుటయు నాబలభద్రుఁడు విన్కి నార్తుఁ డై. 165

బలరాముఁడు పాండవుల వీడ్కొని తీర్థయాత్ర వోవుట.

వ. కతిపయపరివారంబు పరివేష్టింప రయంబునం జనుదెంచి సముచితప్రకారంబున
ధర్మనందనుం బేరోలగంబునం గని సంభ్రమాలింగనాసనార్ఘ్యపాద్యంబుల నతని

1 మంగళతరుత్వక్పల్లవప్రచయంబున. 2 లోనుగ. 3 శంతన. 4 మనమున. 5 నాజి
కెక్కుటయు... డెఱింగి యార్తుఁ డై.

చేత సంభావింతుం డయి దామోదరభీమార్జుననకులసహదేవుల యభివా
నంబు లాదరించి పాంచాలవిరాటప్రముఖు లగుతగువారలవినయంబుల స
నందించి యాదోరలతోఁ దత్కాలయోగ్యమితసంభాషణంబులు సేసి యన
తరంబ వారల కిట్లనియె. 1

క. కౌరవపాండవు లెంతయుఁ, గ్రూరత వాటించి బంధుకోటికి నిఖిలో
ర్వీరమణులకుం జేటుగఁ, బోరికిఁ దెగి రిట్టిఘోరపుంబని [1]యగునే. 1

తే. ఇట్టిదానికి నోర్వక యెన్నఁడేనిఁ, గృష్ణుతోడ నేఁ జెప్పితిఁ గినిసి యిరుదె
ఱంగువారికిఁ దగఁ జెప్పి సంగతంబు, సేయు మని యెంత సెప్పినఁ జేయఁడయ్యె

క. పలుకులపాం దెఱుఁగనివా, రలఁ బూజావాక్యములఁ దిరంబై తనకుం
[2]దెలువం దగదే యే మని, యలుకమెయిఁ సంధి సెఱిచి హరి యే తెంచెను

తే. వీరు వారును సంబంధవిషయబంధు, లగుట సరి గాదె హరికిఁ దా నర్జునునకు
బక్షపాతంబు సేయుటఁ బాండవులను, [3]బెట్టుచోటులు గానక పట్టిరాలు. 1

ఉ. కావున వీరికిఁ జయము గల్గుట నిశ్చయ మెల్లభంగులం
జావు నిజంబు వారికి నసంశయమై యిటు లుండ దీని నె
ల్లే వినఁ జూడ [4]నేర్తుఁ దగ నింతప్రవీణుల నేన చేసితిం
జూవె సుయోధనుం బవనసూనుని నొండొరుఁ జంపఁ జూతునే. 1

క. హరి యెఱుఁగనిచక్కటియుం, బురుషార్థము నా కెఱుంగఁ బోలునె యాని
ష్ఠురత వినఁ జూడఁ జాలక, సరస్వతీతీర్థమునకు జనియెదుబుద్ధిన్. 1

వ. మీకుం జెప్పి పో వచ్చితిఁ బోయి వచ్చెద నని పలికి బలదేవుండు వాసుదే
ధర్మపుత్త్రు లోడంబడి యనుపఁ దీర్థయాత్ర వోయెఁ దదనంతరంబ. 1

రుక్మివృత్తాంతము.

సీ. కృష్ణునిదేవి రుక్మిణిసోదరుఁడు రుక్మి, [5]యనువాఁడు బలవిక్రమాన్వితుండు
శార్ఙ్గగాండీవవిజయములు నాఁ గల, దివ్యచాపములఁ దృతీయ మైన
చాపంబు గలవాఁడు సైన్యసమేతుఁ డై, చనుదెంచి ధర్మజుఁ గని తదీయ
సత్కారములు గాంచి సముచితాసనమున, నుండి యక్కాలువున నున్నహ

ఆ. లెల్ల వినఁ గిరీటి కిట్లను సమరంబు, సేయ వెఱచి తేనిఁ జెప్పు నాకు
నెదురు లేరు జగతి నెవ్వరు నీకుఁ దో, డ్పడి జయింతు నెట్టిపగఱ నైన. 1

వ. అని తన్ను నాక్రమించి తనతోఁబుట్టువు రుక్మిణిం గొని వచ్చినయాకృష్ణుస
ధిన సిగ్గు లేక యాడినమాటలు విని చిఱునవ్వు నవ్వుచుం గవ్వడి యతని
ననం బాలోకించి. 1

తే. చెనసి గంధర్వసేన నిర్జించునపుడు, మత్స్యనాథుగోవర్గంబు మరలఁ దెచ్చు

1 గలదే. 2 దెలుపంగఁ దగదె. 3 పెట్టుపాటులు గానక. 4 నేర్తు గద నె
5 యనురాజు.

[1]నెడను దప్పె నీకందువ యెఱుఁగనైతి,నింక నేఁ గాని తోడు గ మ్మెచటికైన.
వ. అని [2]యతనియుత్తరమునకుఁ దగినయట్ల పలికి మఱియును. 177
క. మున్నే నసహాయుఁడనై, [3]చన్నకడం జనఁగ నైనచందం బయ్యెన్
వెన్నుఁడు దోడు గలఁడు వెఱ, పెన్నండును వలవ దింక నేమిటికైనన్. 178
చ. వెఱచితి రాఁ గదే యనిన వెండికదా పగఁ దీర్తు నీవు నా
వెఱ పెటు లున్న నీరథికవీరులు [4]వాపెద రొల్ల నిన్న నీ
యుఱుకడ కేఁగి తోడుపడు మొల్లకు నెవ్వరికేని నన్న నే
ర్తెఱ నతఁ డేఁగి కౌరవపతిం గని యట్టుల బెట్టువల్కినన్. 179
క. ఆతఁ డివి యేటిమాటలు, నీతో డగు టొల్లఁ బొమ్మనిన రుక్మి వృథా
[5]యాతాయాసవిషణ్ణుం, డై తనపురమునకు మగుడ నరిగెం బెలుచన్. 180
తే. ఇట్లు బలదేవరుక్ముల కిద్దఱకును, గయ్యమునకు సన్నాహంబు గలుగదయ్యెఁ
గాని తక్కలోకమ్మునఁ గలుగునృపతి, కోటి యిరువాఁగునందును గూడె ననికి.
వ. అట్టియెడ నిశాసమయంబున ధృతరాష్ట్రుండు సంజయు రావించి యిట్లనియె.
క. బవరము గీడని యెఱుఁగుదు, నవినీతుం డైనకొడుకు నదలిచి యుడుపం
దివిరియు నోరాడమి నై,వవశం బప్పనికి మనకు వగ పింకేలా. 183
క. ఎయ్యదిగా నున్నది యది, యయ్యెడుఁ జేయునది గలదె యవనీశులకుం
గయ్యానఁ జచ్చుటయు మే, లయ్యెప్పుట లెస్సగాక యది యట్లుండెన్. 184
వ. రెండువీళ్లను గురుక్షేత్రంబున విడిసినపిదపం బుట్టినవిశేషంబులు గల వేని
నెఱింగింపుము. 185

సంజయుండు ధృతరాష్ట్రుని కులూకుఁడు పాండవుల నాడినమాటలు సెప్పుట.

తే. అనిన సంజయుఁ డిట్లనునకట కొడుకు,మీఁదఁ దప్పువెట్టెదవు నీమీఁదికొఱఁత
నీకుఁ గానంగ వచ్చునె నీవెఱుంగ,కుండఁ బఱచెనె యాతండు పాండుసుతుల.
వ. ఆపని గడవంబడియె వార్తలు వినియెద వేని వినుము దుర్యోధనుండు దుశ్శా
సనశకునికర్ణులతో విచారించి యులూకుం బిలిచి నీవు వోయి పాండవులం
గని వాసుదేవుసన్నిధిని బాంచాలవిరాటప్రముఖులు వినఁ బలుకు మని పరు
సనిమాటలు గఱపి పుచ్చిన నతండును. 187
క. చని కొలువున ధర్మసుతుం, గని దుర్యోధనుఁడు సెప్పఁ గా నను నియమిం
చినమాటలు గొన్ని గలవు, విను మలుగక యనిన నతఁడు విని యిట్లనియెన్.
ఆ. నీకు వెఱవ నేల [6]నిన్న నాబుద్ధిమం, తుండు సెప్పు మనినతులువమాట
లెన్ని గలవు వాని నన్నింటి ననుమాన, మింత లేక యాడు మెల్ల వినఁగ.
వ. అనిన నులూకుం డిట్లనియె. 190

1 నవుడు దప్ప...యరయనైతి. 2 యతనితరమునకు. 3 చన్నకరణి. 4 దీర్చెద. 5 యాత్రాయాతవిష. 6 నాకార్యవంతుండు, నిన్నుఁ జెప్పు మనిన నీతిమాట.

సీ. కయ్యంబునకుఁ బెద్దకాల మేనియుఁ బూఁచి, పట్టి వచ్చితి కడుబరవసమున
సంజయుతో మీరు శంక లే కాడిన, యెక్కుడుమాటలు పెక్కు గలవు
భూమిభాగము గోలుపోయినయలుకకు, ద్రౌపదిఁ [1]బఱిచినదైన్యమునకుఁ
దగ మంచిబంట వై తఱి యిది బాహుబ, లాస్త్రవిద్యలు సూప నని తలంచి
ఆ. నిలువ వలయు నీకుఁ గలవారి నెల్లను, గూర్చి మోహరించికొని కడంగి
నడవు సమరమునకు [2]వెడ జంకఁ బో దింకఁ,దప్ప గ్రుంక లేదు తఱికిఁ జొరుము.
క. ఆతతబలుఁ డగుభీష్ముని, చేతి[3]బలువు ద్రోణునంపసెల లవియుటయుం
జూతు రటు రండు కృష్ణుని, చేతన సకలంబుఁ జక్కఁ జేసికొనుండీ. 192
క. వారిద్దఱవాలమ్ముల, భారిం బడి యర్జునునకు బ్రదు[4]క వశమె మీ
వా రెల్ల నెఱుంగ రె య, వ్వీరులదివ్యాస్త్రశస్త్రవిభవసమృద్ధుల్. 193
వ. అని భీమసేనుం జూచి. 194
క. ఈవాయుపుత్త్రు డాజిం, ద్రావుదు నే దుస్ససేనురక్తం బనియెం
ద్రావఁగ శక్యం బేనిం, ద్రావు మనక [5]రాదె యింకఁ దడ వేమిటికిన్. 195
క. విను నూతికప్పవిధమున, నిను నీవ యెఱుంగు దెఱుఁగ నేరవు గర్వం
బున [6]నావలికోలఁది రణం, బున నొకమరి పెట్టు వడక పో నేర్చెదవే. 196
వ. అని పలికి సవ్యసాచిం జూచి. 197
తే. వినుము గాండీవ మనునొకవిల్లు దాటి
పొడవు గలిగియుఁ గృష్ణుండు వూని తోడు
గూడుకొని వచ్చుటయు నెఱుంగుదుము వీని
కెల్ల శంకించి భూమి పా లీము గాని. 198
క. పవనజుగదయును నీగాం, డివమును నెట వోయె నంగడికిఁ బాంచాలిం
దివిచికొని వచ్చునెడఁ బరి, భవ మెఱుఁగవె బీర మేల పలు[7]కుదు తోడ్తోన్.
చ. వలలుఁ [8]డనక విరాటుకడ వంటలవాఁ డయి భీముఁడుక బృహ
న్నల యన నాఁడువేడి వయి నాన యొకింతయు లేక నీవు న
గ్గల మగుదైన్య మొంది కడుఁ గాఱియ వొందితి రుర్వి యేలునా
సలఁ బడి సవ్యసాచి యిది శౌర్యమొ బాహుబలంబొ చెప్పుమా. 20
ఉ. మాయలు నింద్రజాలములు మాధవుఁ డిందును గొన్ని వన్నినక్
వాయపురజ్జు లెప్పుడు నవారణ నీ వెటు లాడి తేనియుక్
వేయును నేల పార్థులును విష్ణులు [9]నేఁ బదివేలు వచ్చినం
జేయుదు మేము గయ్యు మొక-చీరియు సంపదఁ బంచి యిత్తుమే. 20

1 బన్నంబు దైన్య. 2 వెడఁ జంకెఁ బోటింక. 3 బదువు. 4 కఁగ వశమే, మీరెల్ల
5 గాదె. 6 నాగద. 7 కం దోడ్తోఁ. 8 డ నావిరాటునకు వంటకుఁ దా నయి. 9 వే పదివేల
యుదు నేను...యిత్తు .

వ. *అనిన భీమార్జుననకులసహదేవు లొండొరులం జూచుచు నాసనంబులు చలింప మొగంబులు జేవురింపఁ గ్రోధాయత్తచిత్తులై యున్నం గనుంగొని నవ్వుచు నారాయణుం డులూకున కిట్లనియె నీవు వోయి సుయోధనుతో నెల్లవారును వినఁ నిట్లనుము. 202

తే. బవర మెల్లియ బిరుదవై బరవసంబు, గలిగి [1]చావుము చావక తొలఁగ రాదు
కృష్ణసారథికం బగుజిష్ణురథము, దొడరి నీ వెందుఁ జొచ్చినఁ దోన చొచ్చు.

క. రిత్తలు [2]రజ్జెడువాఁడే, మత్తగజాయుతబలుండు మారుతి యని ను
ద్వృత్తుఁ డగుదుస్ససేనుని, నెత్తు రురము వ్రచ్చి త్రావు నీవుం జూడన్. 204

వ. అని యిట్లు హరి పలికినయనంతరంబ యర్జునుం డులూకున కిట్లనియె. 205

క. వారు గలరు వీరు గలరు, పోరికి నని చెప్పె దీవు పొంగారుచు మీ
వారిని మిమ్మును రేపు గ,దా రూ పేర్పడఁగఁ [3]జూచెదం గితవసుతా. 206

చ. తనభుజశక్తి లేక యొరుదర్పము యూఁది పరాక్రమింప వ
చ్చిన నది సెల్లునే కులవిశిష్టుని సువ్రతు వృద్ధు [4]నార్యు భీ
ష్ముని నెసకొల్పి సేనలకు ముఖ్యుఁడ వీ వని యుబ్బఁ జేసి యా
తునఁ దల పెట్టి చంపికొనఁ జూచె సుయోధనుఁ డింత నే మగున్. 207

చ. తనతలఁ [5]పెట్లు భీష్మభుజదర్పము లోకముకంటె నెక్కుడీ
తని నొకభంగి నండ గొని తప్పుదు చావున కంచు నున్నవాఁ
డనిఁ దొలుముద్ద గొందుము రయంబున నాతని వెండి ద్రోణులం
దునుముదు మప్డు సూతసుతుఁ దోలుదు మంతట నాస మాలెడున్. 208

క. అనుజులతనుజులచావులు, గనుఁగొని మఱి తాను భీముగదచే నిలఁ గూ
లినయప్పుడైన దుర్యో, ధనుఁడు మదిం దలఁచుఁ గాక తనదుష్కృతముల్.

వ. అది యట్లుండె నీవు వేగపోయి రేపకడయ మీరాజుం గలనికి నడపింపు మనియె నప్పుడు ధర్మనందనుం డులూకునకుం దాంబూలాభరణంబు లిచ్చి వీడుకొలిపి ధృష్టద్యుమ్ను నవలోకించి యెల్లి గయ్యం బని మనసైన్యంబుల కెఱింగించి సర్వసన్నాహంబులు సమకట్టు మని పనిచి కొలువువిరిసి చనియె ధృష్టద్యుమ్నుండును ద్రోణులం దొడరం బడసితి నని యుబ్బుచు వెడలి భీష్ముం దలపడఁ గంటి

* ఈ వచనమునకు 201 వ పద్యమునకును నడుమ "వ. అని నకులుం జూచి.
క. దామగ్రంథి యనంగా, మోమిడికొని విరటుగుఱ్ఱములఁ బట్టుచు నీ
వామెయి నుండితి రాజ్యము, పైమమతను గాక నీకుఁ బౌరుష మేదీ.
వ. అని సహదేవుం జూచి.
క. వెడ తంత్రీపాలుం డనఁ, గడుహీనత విరటుపసులఁ గాచితి వౌ నీ [తుల గానిపించెడి.
పుడమి గల దేమొ యను మా, నడి కోర్చితి గాక నీకు శౌర్యము గలదే." అని కొన్ని ప్ర

1 పొడువుము. 2 బలికెడువాఁడే,...యుత్తబలుఁడు. 3 జూచెదవు. 4 నాజి...దెస. 5 పిట్లు.

నని పాంగుశిఖండి దోడు గా రాజుశాసనంబు నిర్వర్తించె నిట యులూకుండు
వచ్చి దుర్యోధనుం బేరోలగంబునం గని యతనికిఁ గృష్ణార్జునులపలుకు లున్న
రూపు విన్నవించిన నతండు కర్ణుదెసఁ గనుంగొని సమస్తసేనలకు రేపు బవరం
బని చెప్పి పుచ్చుము సకలసాధనంబును నాయితంబులు సేయు మని పనిచిన
నతండు నట్ల చేసె నిట్లు భయకటకంబులు రణంబునకు నుత్సహించి విజృంభించి
యుల్లసిల్లె ననిన ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 210

క. వినుము హరితోడు గలయర్జును గెలువ [1]నదీసుతునకుఁ జొప్పడునే యా
పని నిలుపు ములూకుని చెప్పినమాటల కేమి యనిరి పిదపఁ గొలువునన్.

వ. అనిన విని యంబికానందనునకు సూతనందనుం డిట్లనియె. 212

ఆ. అయ్యులూకుపలుకు లన్నియు విని భవత్తనయుతోడ నిట్టు లనియె భీష్ముఁ
డేను గలుగ [2]వెఱవ నేటికి సేనలఁ గాతు నీవు మెచ్చఁ గౌరవేంద్ర. 213

క. నడిపింపఁగఁ బొడిపింపఁగ, నెడమడువై కలఁగినప్డు డేర్పఱుపఁగ నేఁ
గడు నేర్తుఁ బేర్చునాదగు, కడిమియ నీసైన్యమునకు [3]గాసెన గాదే. 214

క. అనినం గురురా జిట్లను, వినుము పితామహ మహాస్త్రవిత్తము లనఁగాఁ
జనునీవును నాచార్యుం, డును గలుగఁగ నాకు నెన్నఁడును వెఱ పేలా. 215

తే. ఏను గంధర్వకిన్నరదానవాది
దివ్యభూతంబులకును భీతిల్ల ననినఁ
బాండుపుత్త్రులమాత్రకు భయము నాకు
నెక్కడిది [4]వ్రేల్మిడిన వారియుక్కు మడఁతు. 216

భీష్ముఁడు కౌరవసేనలో నతిరథమహారథాదుల నిరూపణంబు సేయుట.

వ. అని పలికి మఱియు నిట్లనియె. 217

క. నీయందు వారియందుం, జేయం గలమానుసులవిశేషంబులఁ జి
త్తాయత్తంబుగఁ జెప్పుము, నీయెఱుఁగనియవియు లేవు నిక్కపుఁదరముల్.

క. అనవుడు నీ వి ట్లడిగిన, విని యూరక యుండఁ దగదు విను మేర్పడ [5]నె
ల్లను నున్నరూపు సెప్పెద, మనవారల వారివారిమానము లధిపా. 219

వ. అని గాంగేయుం డిట్లనియె. 220

సీ. నీ వతిరథుఁడవు నీతమ్ము లందఱు, సమరథశ్రేష్ఠులు సమరమునకుఁ
బరుసనివీరులు పాంచాలసేన ని,ర్జింతురు నను నేన చెప్పికొనఁగ
నేర నాయేత్తెఱ మీ రెఱుంగుదురు భో, జాగ్రణి కృతవర్మ యతిరథుండు
దృఢవేధి యాతండు దీర్చు నెంతటిపని, నైనఁ గైకొని శల్యుఁ డతిరథుండు

ఆ. వాసుదేవుతోడియీసువాఁ డల్లుర, విడిచె నిన్నుఁ గూడి విక్రమమునఁ

1 (పితామహు...పెద్ద కొలువునన్. 2 నీకు...నీసేన 3 గవిసెను. 4 వారిల్
మిడి నుక్కడంతు. 5 నొయ్యన...రూప.

బేరుకొనఁగఁ జాలు భూరిశ్రవుం డతి, రథులమొదలి యనికి రక్కసుండు. 221

క. విను సైంధవుఁడు మహారథుఁ, డనిఁ బోక పెనంగు నతని నాద్రౌపదికై
పెను పఱఁ బఱిచిరి కుంతీ, తనయులు వారల కెదుర్పఁ దపముం జేసెన్.

వ. కాంభోజరా జగుసుదక్షిణుండు సమరథుం డితనిపాల రథబృందంబులు మేలు
గలుగుఁ బాండవబలంబులం గలంచు మాహిష్మతీపతి యగునీలుం డర్ధరథుం
డితనికి సహదేవునకుఁ దెగనిపగ యై యుండు దానంజేసి యాలంబున నోల
మాసగొనం డవంతిదేశాధీశు లగువిందానువిందు లర్ధరథులు పరస్పరస్నేహం
బున సాహసికు లై యొకళ్లొకళ్లం బెట్టి పోవక పోరుదురు త్రిగర్తపతులు దోడం
బుట్టువు లేవురును మహారథులు గోగ్రహణంబునం బడినబన్నంబుఁ బాపికొనం
గడంగుదురు వీరికి భుజబలం బగ్గలం బై యుండు. 223

క. సమరథుఁడు బిరుదు లక్షణ, కుమారకుం డేచి మొనలఁ గోల్తల [1]సేయుఱ
మియు నెల్ల మిగులుభుజగర్వము మదముం గలఁడు కొనఁ డరాతుల నధిపా.

వ. బృహద్బలుండు సమరథుండు గోసలబలంబులతోడం గడంగిచిచ్చునుం [2]గరువ
లియునుం గొని తాఁకు దండధారుఁడు సమరథుండు సేనపఱపు గలండు బెట్టి
దంబు గాఁ గయ్యంబు సేయు. 225

తే. అతిరథోత్తముఁడిప్విటియందు మేటి,కృపుఁడుతనపెంపువాటించిగెలుచుఁజచ్చుఁ
గాని నాలుగుదెఱఁగులసేనలకును, దివియఁ డించుకయును నరదేవముఖ్య.

క. శకుని విను సమరథుఁడు పాం,డుకుమారులతోడ నెప్పుడుం బగ గొని వా
రికిఁ గీడ రోయు భృత్యులు, ప్రకటబలులు గలరు నేర్చు బవరంబునకున్. 227

మ. వరదివ్యాస్త్రవిదుండు బాహుఘనుఁ డశ్వత్థామ గాండీవితోఁ
బురుడింపం దగువాఁడు వీని కెన యీభూలోకసంచారు లె
వ్వరు లేరీతఁడు బ్రాహ్మణుం [3]డననిభావం బూనఁగా నోర్వమిం
దర మూహింపఁగ లేద కాని జముచందం బయ్యెడుం బోరులన్. 228

సీ. అతిరథోత్తముఁడు ద్రోణాచార్యుఁ డందలి,యిందలివిలుకాండ్ర కెల్ల గురుఁడు
హితుఁడు నీకెంతయు [4]నేర్చినమొన లితం, డడరినఁ జమరినయట్లు మ్రందు
వృద్ధని యితని భావింప రా దనిలోన, నంగవిస్ఫురణంబుభంగి సూడ
నర్జునుపైఁ గూర్మినతని నో నేయఁడు, సచరాచరం బైనజగము లెల్ల

తే. నొక్కమొగ మై కడంగినఁ జిక్కువఱుచు, దివ్యబాణజాలంబుల దీటుకొలిపి
ప్రాణములు డాఁపఁ డీతనిపాటిదొరలఁ, గాన మేరాజ్యములయందుఁ గౌరవేంద్ర.

క. అతిరథుఁడు బాహ్లికుఁడు విను, మతులితబలుఁ డితనియట్ల యాత్మజుఁడును వి
శ్రుతశక్తి సోమదత్తుం, డితనికి నీతనికి సమర మెన [5]పెండిలికిన్. 230

1 సేయుఱ. 2 గొనక...దండధారుం డర్ధరథుండు. 3 డనినభావం. 4 నేచిన. 5 ఁబెం.

క. అసురవరుఁ డీహలాయుధుఁ, డసమానబలుండు సమరథాగ్రణి విను పాం
డుసుతులయెడ రోషము గలఁ, డసంఖ్యమాయాబలమున [1]నరులఁ గలంచున్.
తే. వినుము ప్రాగ్జ్యోతిషాధిశుఁ డనుపమాన, శక్తి యాభగదత్తుండు సమరథుండు
గజము నెక్కి తా నేనికకయ్య మైన,నేర్చు నైరావణము మీఁదియింద్రుఁబోలి.

—భీష్ముఁడు గర్ణుని నర్ధరథుం డని చెప్పుట.—

వ. గాంధారరాజు లగు[2]వృషకుండును నచలుండును సమరథులు మానిసితనంబును
మానుసులుం గలవారు వీరిసమరోపాయంబ జేయం బై యుండు. 233
సీ. నీకుఁ బ్రెగ్గడయును నెయ్యంపుఁజెలియు నై, కయ్యంబునకు నెప్డుఁ గాలుద్రవ్వఁ
బాండుపుత్త్రులతోడిపగకు ని[3]న్నెనకొల్పుఁ, గొలువున రజ్జులు వలుకు నట్టి
రాధాసుతుం డర్ధరథుఁడు గుండలములుఁ, గవచంబుఁ బోవుట కారణముగ
బీఱువాఱినవాఁడు వీఱిఁడి కృపఁ బెద్ద, పరశురాముండు శాపమున వీని
తే. యస్త్రవీర్యంబుఁ జెఱిచె నట్లగుట వీఁడు
పార్థు మార్కొని మానంబుఁ బ్రాణములును
దనకు సొమ్ముగఁ దక్కించుకొనఁగ లేమి
యెల్లవారికి నెంతయుఁ దెల్ల మధిప. 234
క. అనవుఁడు గురుఁ డిట్లనుఁ గ,ర్ణునిచందము మున్న గడఁగు రోయఁడు [4]పాఱుఁ
విను మేమఱి యుండుం గా,వున నీతం డర్ధరథుఁ డవుం దలపోయన్. 235
వ. అనిన విని రాధేయుండు గ్రోధతామ్రాక్షుం డగుచు గాంగేయున కిట్లనియె.
క. [5]ఒంటమిని లేనియెొంటర, మింటరములు వలుకు టుచితమే యర్ధరథుం
డంటి నను నేమితక్కువ, గంటి చెప్పుమ దీన నీవు గన్నది గలదే. 237
తే. నొవ్వఁ బలుకుదు సభలోనఁ జివ్వ కొల్ల, కేను గురుపతిఁ జూచి సహించి పోదు
సురనదీపుత్ర విను నాకుఁ జూడ నర్ధ, రథుఁడ వగు దీవు లావు బీరంబు నరయ.
వ. అని పలికి కొలువుఁ గలయం గనుంగొని. 239
చ. హితుఁ డని నమ్మఁగాఁ దగునె యీతనిఁ గార్యపుమాట లిట్టివే
పతిదెసకూర్మి వాపుటకుఁ బట్టుగ నెక్కువ తక్కు వంచు ను
న్నతు లగుమేదినీశులకు నానగఁ బల్కుట గాక యిట్టివా
రితవులు తండ్రికిన్ సుతుల కే మన నేర్తుము పెద్దరాజులన్. 240
వ. అని దుర్యోధనుం జూచి యిట్లనియె. 241
ఉ. కర్జము దప్పె నీయెదురఁ గష్టపుమాటల కేల యోర్తు రీ
దుర్జనుఁ డైనశాంతనవుదోర్బల మేటిది యీతఁ డొక్కఁడున్
వర్జితుఁ డైన నేమి నృపవర్గము గుందుట యొంటఁ బాయునే

---

1 నడరుచు నుండున్ ; నమరులఁ గలఁచున్. 2 వృత్తుండును 3 న్నెనకొల్పి. 4 బోరన్.
5 ఒంటికి శే వెవి యొంటగ.

యర్జునపక్షపాతి యితఁ డాలము మేకొని చేయఁడుం జుమీ. 242
తే. చాలఁ గాలంబు వోవక చతురు లైన, వృద్ధజనములబుద్ధులు విందు గాక
[1]ముదియ మతి దప్పి నోరికి నోదవినట్లు, పలుకువెడఁగులమాటలు పాటియగునె.
క. సేనకు మొగ మీతఁ డైనం, బూని మహీశ్వరులు నీకుఁ బొడిచెద రే దు
ర్మాని యని కాదె యీతని, తో నడచుట గొల్ల నైతి దురమున కధిపా. 244
వ. అనిన భీష్ముండు సూతసూనున కి ట్లనియె. 245
చ. ముదుకఁడ నైననాదుబలముం జలముం వివిధాస్త్రశస్త్రసం
పదయును బోయి నీగురుఁడు భార్గవుచే విను మాజిభూమి నా
కెదిరినవారు పెక్కుఁడల నే మయిరో యెఱుఁగుం జగంబు నా
[2]ముదిమియు నీకుమారుతనముం వరుసం విజయుం డెఱింగెడున్. 246
క. అనుమానింపక సభలో, నను నేఁ జెప్పికొన వలసె నా కిమ్మెయి దు
ర్జనితుఁడ వగునీయెడ నీ,సున [3]నా కిటు వలుకవలసె సూతతనూజా. 247
తే. కార్యమును ఖడ్గమును నింత గలుగునీవు,గలుగఁ జేటు వాటిల్లె నిక్కౌరవులకు
దీని మముబోఁటు లెల్లను దీర్ప నెట్లు, సాలెదము మంచిబంటవు సక్కనగుము.
చ. నెప మిడి యోహటించి యిటు నీవు దొలంగినఁ బోవ వచ్చునే
కుపితమనస్కుఁ డై నరుఁడు గూల్పఁ గ్రమంబున దొడ్డ లెల్లఁ జ
న్నపిదప నెట్లుఁ [4]జొచ్చెదు రణంబున నప్పుడు సావ కున్న దై
న్యపుఁబరివారముం బతియు నైన నెఱింగెద రెల్ల చందముల్. 249
వ. అని పలికి దుర్యోధను నుపలక్షించి కర్ణుతో వెండియు. 250
ఆ. సూతపుత్త్ర యితఁడు నాతలఁ బెద్దమో, పెత్తి నమ్మి యున్నయట్టిచోటఁ
గ్రందు సేయ నాకుఁ గా దని సైరించి, యున్న బ్రదికి తింక నూర కుండు.
వ. అని యాడి మొగంబు గంటు వెట్టికొని యున్నసురనదీసూనుదిక్కు మొగం బై
సుయోధనుండు నీకుం గోపింప నగునె నన్నును గార్యభారంబునుం జూచి నా
బ్రదుకునకై సర్వంబును సహింప వలయు నని తేర్చి యంగరాజుం గనుంగొని
మీ రిద్దఱు నొక్కటి యై భరంపడి యిప్పని సక్కంజేసి కాక మీలోన నిట్టి
యెరవుమాట లేల యని వోదివి పలికి తదనంతరంబ పాండవపక్షంబువారల
తారతమ్యంబులు వినువాఁ డై యమ్మాట వుట్టించిన నతనికి భీష్ముం డిట్లనియె.
తే. పాండుపుత్త్రుల [5]నద్దెస దండిమగలఁ, గలనిజం బేను జెప్పినఁ గర్ణుమనసు
నొచ్చు నీచిత్త మెట్లగునో యెఱుంగ,నాకు నిది యేమి పని రిత్త నడుమ నుండి.
వ. అనిన మఱియు దుర్యోధనుండు [6]దఱిమి యడుగుటయు ని ట్లనియె. 254

---

1 ముద్రిత. 2 ముదియును నీకుమారతయు మువ్వురుసం. 3 నినుఁ జెడనాడ నేల. 4 జచ్చెదు.

—భీష్ముఁడు పాండవవీరులం దతిరథమహారథాదుల నిరూపించి చెప్పుట.—

తే. అతిరథుండు యుధిష్ఠిరుం డగ్నికల్పుఁ, డాహవంబున నప్రతిహతుఁడు భీముఁ
డతిరథశ్రేష్ఠుఁ డతనిమహాబలం బ,మానుషము విక్రమం బసమాన మధిప.

క. సమరథులు గవలు భుజగ,ర్వము పటువిక్రమము దుర్నివారంబులు వా
రిమనంబులు నిర్భయములు, దమమొనలకు మించి [1]బెట్టు దాఁకుదు రధిపా.

సీ. వా రందఱును ధర్మవైభవంబునఁ దప, స్సంపద నెక్కుడు జనుల కెల్ల
ధనువునాఱంగంబులను బరిణతులు దాఁ, కోర్తురు పరులకు నోర్వరాని
కోల్తల గలరు పెక్కులు పరాక్రమములు, వేర్వేఱ చేసిన వీరు లొక్క
మొగ మయి తాఁకిన వెగ డంద కుండునే, మనసేన మున్నవమానపాటు

ఆ. దుఃఖపాటు గలిగి తోడరంగ వచ్చిన, వారు గాన యలఁతిఁ బోరు ప్రాణ
మాసపడక యోపినంతయుఁ బెనఁగుదు, రది సహించి నిలుచు టరిది మనకు.

మ. నరుఁ డీమానమువాఁ డనంగ వశమే నా కంతవా రెందు నె
వ్వరు లే రింకను [2]బుట్టరాపులికి దుర్వారోద్యముం డై నయా
హరియుం దోడఁటె యేము చెప్పుదు నతం డాసేనలం గాచు నొ
క్కరుఁడుం గీటడఁగించు నీబలములన్ గాండీవదుర్దాంతుఁ డై. 258

వ. అనిన విని యక్కొలువున నున్న రాజులమనంబు లెల్లను జేవ సెడియె భీష్ముండు
వెండియు ని ట్లనియె. 259

సీ. ద్రౌపదేయులు మహారథు లేవురును వారి, తరమ యుత్తరుఁడును ధరణినాథ
యతిరథవర్యుఁ డయ్యభిమన్యుఁ డర్జున, వాసుదేవుల కెన వచ్చువాఁడు
లఘుచిత్రములు నేర్పులావునుదాల్మియుఁ,గలఁడుతండ్రులపాటుదలఁచుచుండుఁ
గావున బెడిదంబుగాఁ బోరు సాత్యకి, యతిరథోత్తముఁడు శౌర్యాన్వితుండు

తే. పాండవస్నేహసక్తుఁడై యుండుఁ గాన,యలుకమనమీఁదఁ బెద్దయుఁగలిగిపెనఁగు
వీర లిరువురుఁ బరుసనివారు [3]సమర, పరుల నొప్పింతు రీయోధవరుల నెల్ల.

మ. అలఁతిం బోరు మహారథుల్ ద్రుపదమత్స్యాధీశు లుద్యద్భుజా
బలశౌర్యాఢ్యులు పాండురాజసుతసంబంధప్రియస్నేహముల్
గలిమిం జేసి తదీయ[4]సైన్యమునకుం గా నొచ్చియుం జచ్చియున్
గెలిపింపం దమకించి చొత్తు రని కేకీభూతచేతస్కులై. 261

ఆ. వీరగుణము బలము వీఁకయుఁ గలఁడు మ, హారథుఁడు శిఖండి యతనితమ్ముఁ
డతిరథుండు దర్పయుతుఁడు ధృష్టద్యుమ్నుఁ, డుగ్రతేజుఁ డనికి నుగ్రునట్లు. 262

క. అతనిసుతుఁ డర్ధరథుఁ డా, ధృతవర్ముఁడు పిన్నవాఁడు త్రిమ్మటకాఁడై
మతిహీనత శస్త్రాస్త్ర, ప్రతతిపరిశ్రమము లేక పాలసుఁ డగుటన్. 263

ఆ. చేదిభూవిభుండు శిశుపాలతనయుండు, ధృష్టకేతుఁ డధికధీరమతి వ

1 బిట్టు. 2 జూప నాతనికి. 3 సమద. 4 సైన్యములకుం,

హారథుండు భోజుఁ [1]డజుఁ డనురాజులు, నట్టివార తెంపు నలవుఁ గలరు. 264

వ. ఉత్తమౌజుండును యుధామన్యుండును క్షత్త్రదేవుండును జయంతుండును నమి
తౌజుండును విరాటుండును సత్యజిత్తుండును ననంబరఁగు పాంచాలకులప్రదీపకులు
మహారథులు మత్తమాతంగబృందంబుచందంబునం బ్రతిబలంబుపయిం గవిసి
కోలాహలబహుళంబుగాఁ గలంపం జాలుదురు కేకయపతు లేవురు సహోదరు
లు మహారథులు గడిందిమగలు గెంపురథంబులమొత్తంబులతోఁ గార్చిచ్చు
పగిదిం బొదువుదురు కాశికుండు నీలుండు సూర్యదత్తుండు మదిరాశ్వుండు
శంఖుండు విరాటజ్ఞాతులు మహారథులు వివిధాయుధవిద్యావిశారదులు వారి
పోరు భరంబై యుండు. 265

సీ. చిత్రాయుధుండును జేకితానుండు మ,హారథు లిద్దఱు నర్జునునకుఁ
గూర్తురు కయ్యాన గోర్తురు నేర్తు రా,యుధముల కెల్ల నత్యుగ్రు లవ్వి
ధమువార చంద్రదత్తవ్యాఘ్రదత్తులు, వినుము సేనాబిందుఁ డనునృపాలుఁ
డతిరథోత్తముఁడుమారుతపుత్త్రునెనయతం, [2]డొక్కరుండును వారియుఱిదిలావు

ఆ. పాండ్యుఁ డతిరథుండుబలఁగంబు గలవాఁడు, సమరథుండుగాశ్యుఁడమితబలుఁడు
కుంతిభోజుఁ డాజికోవిదుఁ డతిరథుం, డతనియొద్దిజోదు లధికబలులు. 266

వ. రోచమానుండు మహారథుండు దేవసమానుండు. 267

తే. అతిరథుల కెల్ల [3]దల దండ్రి యట్టివాఁడు
యసురవిభుఁడు ఘటోత్కచుం డాహిడింబ
కొడుకు మాయాబలంబున నోడుచుఁ బగఱ
నతనికడ దానవానీక మగ్గలంబు. 268

వ. తోఁచినవారిం బేరుకొంటి నింతియ కాని రెండువీళ్లను మంచిమగలు పెక్కండ్రు
గల రని చెప్పి గాంగేయుండు. 269

క. పాండవుల[4]దిక్కువీరు ల,ఖండితబలులైన నామొగంబునఁ బడి యు
ద్దండత చూపఁగ లేరు శి,ఖండిని నొక్కరునిఁ జంపఁ గాని కుమారా. 270

క. అనవుడు దుర్యోధనుఁ డా,తని మీరు వధింపమికిఁ గతం బేమి యొకో
వినఁ దగు నేనిం జెపుడా, యనుటయు నిట్లనియె భీష్ముఁ డతనికి నెమ్మిన్. 271

వ. ఏ నాశిఖండిని జంపమికి మూలంబు సాలం గలదు తత్ప్రపంచం బంతయు వివ
రించెద నాకర్ణింపుము. 272

— భీష్ముఁడు దుర్యోధనున కంబోపాఖ్యానంబు సెప్పుట. —

సీ. శంతనుపిమ్మట సత్యవతీదేవి, యనుమతితోడఁ జిత్రాంగదునకు
సామ్రాజ్యపట్టంబు సమ్మతిఁ గట్టితి, నల్పకాలంబున నతఁడు దీఱెఁ

1 డనుజా దనుజులు. 2 డొక్కండు వారియందుం గలండు; రుండును సేనయుక్కు మడఁచు. 3 దలితండ్రులట్టివాఁడు; దండ్రియైనట్టి. 4 దిక్కురథికు ల.

దత్పరోక్షావస్థఁ దదనుసంభవుని వి,చిత్రవీర్యుని రాజుఁ జేసి పెండ్లి
సేయంగఁ దివిరి కాశీపతికూఁతులు, కన్యలు ముప్వురు గలుగుటయును.

తే. నాతఁ డర్థిఁ దదీయస్వయంవరమున, నఖిలనృపతులఁ బిలిపించె [1]ననియు నెఱిఁగి
తల్లి కెఱిఁగించి యొంటిమైఁ దత్పురమున,కాయితం బయి పోయితి నరథ మెక్కి.

వ. ఇవ్విధంబునం జని యమ్మహోత్సవంబున నలంకృత లై యున్న యంబయు నంబి
కయు నంబాలికయు నను ముద్దియల ముప్వురం బట్టి రథంబుపయిఁ బెట్టికొని
రా నచ్చటిరాజు లెల్లను జతురంగబలంబులతో వచ్చి నన్నుం బొదివినఁ బటు
విశిఖానలశిఖా[2]కలాపంబున వేఁడిమిసూపి వారి నిలువరించి యరుగుదెంచి సత్య
వతికి నప్పొలంతుల నొప్పించిన నద్దేవి విచిత్రవీర్యునకు వారలవివాహంబు సేయ
నుద్యోగించె నట్టియెడ నమ్ముప్వురయందుం బెద్దయది యైనయంబ యనుకన్యక
నాతో నిట్లనియె. 274

తే. సౌంభపురవల్లభుం డైనసాళ్వుమీఁదఁ,దలఁపుగలదు నాకతఁడునుదగులు గలిగి
యుండు నాదెస నీవు ధర్మోత్తరుండ, వతనిపాలికిఁ దగ నన్ను ననుపవయ్య. 275

క. అన విని సత్యవతికిఁ జె,ప్పిన నాయమ ననుప నంబఁ బెంపుగ వృద్ధాం
[3]గనలం దోడుగ నప్పుడ, పనిచి యనిచితిని జనంబు ప్రస్తుతి సేయన్. 276

వ. ఇట్లు పనిచి తక్కినకన్నెల నిరువురం బాణిగ్రహణంబు సేయించితి. 277

క. అంబయు నట సాళ్వునికడ,కుం బోయిన నతఁడు భీష్ముకొనిపోయినదా
[4]నిం బరచుం గైకొన ధ,ర్మంబే కన్యాత్వ మెడలె మగువా నీకున్. 278

వ. ఇంక నిన్ను భార్యఁ గా వరియింపం దగునే యనినఁ గామశరపీడిత యగుచు
నక్కామిని యతని కిట్లనియె. 279

తే. తమ్మునికిఁగాఁగ భీష్ముఁ డుదగ్రవృత్తిఁ, గన్నియలఁ గొనిపోయెడుఁ గాన బలిమి
నన్నుఁ గొనిపోయె నాచేతనిన్ను వినిన,యపుడె పుత్తెంచెదూషింపననఘుతగునె.

వ. మాతండ్రి యెఱుంగక స్వయంవరాలంకారంబు నాకుం జేయించినకతంబున
నింత వుట్టె భీష్ముండు నాచెలియండ్రం దనతమ్మున కిచ్చి నన్ను నీకడకుం దగ
ననిచె దీన నేమితప్పుని మఱియు ననేకప్రకారంబులం బలికిన వినక తన్నుం
జేకొనక సాళ్వుండు. 281

క. కరుణంబుగ నేడ్చుతలో,దరిఁ బో పొమ్మిచట నింకఁ దడయకు మని మం
దిరము వెడలంగ [5]నడిచిన, నరిగె నదియు నార్తచిత్త యై వికలగతిన్. 282

వ. చని చని యప్పొలంది యిట్లని వితర్కించు. 283

తే. సాళ్వునకుఁ గానియపుడ సంసారమునకుఁ, బాసితిన యింక భీష్మునిపాలి కేల
యరుగ నాతండు మూల మిహానికెల్లఁ, గాన యాతని సాధింతుఁ[illegible] నేను.

1 నది యెఱింగి. 2 కలాపంబుల. 3 గనలఁ దగుదోడు. 4 నిం బరచ [illegible]

క. [1]గాంగేయు గెల్వ నెవ్వరి,కిం గోలఁదియె తపము పేర్మి గెలిచెదఁ గా కం
చుం గాంత సనియె సంయమి, పుంగవు లాకకొంద ఱున్న పుణ్యస్థలికిన్. 285

వ. చని వారలకుం దనవృత్తాంతం బెఱింగించిన వా రిది రాజులు సేసినపని సాధు లచేతఁ జక్కంబడునే యనిన నవ్వనిత దపశ్చరణంబునకు వచ్చితి ననుటయు నీవు సుకుమారవు నీ కిది సొప్పడునే తండ్రిపాలికిం బొమ్మిదియ పరమధర్మం బని పలికిన వారి కన్నారీరత్నం బి ట్లనియె. 286

క. ఎవ్వరు నెఱుఁగక యుండఁగ, నివ్వనమునఁ దపము సేఁత యిది నిర్ణయ మే నెవ్వారికడకు నే మని, [2]యెవ్విధిఁ బో నేర్చుదాన నేటికి బంధుల్. 287

వ. అని చెప్పునవసరంబున నయ్యాశ్రమంబునకు హోత్రవాహనుం డనురాజర్షి వచ్చిన నమ్మును లభ్యాగతపూజలు సేసినయనంతరంబ యంబం గనుంగొని యిక్కన్నియ యెక్కడిది దీనివిషాదంబునకుం గారణం బేమని యడిగి వారివలన దాని జన్మప్రకారంబును దద్వృత్తాంతంబును విని తనకూఁతుకూఁతు రగుట యెఱింగి యయ్యంగన వినం దపస్విజనంబులకుం జెప్పి యప్పొలంతిం దనయంకతలంబున నునిచికొని వెండియు నడుగ సవిస్తరంబుగా నచ్చేడియ సెప్పిన విని శోకించి యవ్విషమప్రకారంబునకు [3]నిస్తారంబుఁ జింతించి. 288

ఉ. నీ కిది యేటికిం దప మనింద్యచరిత్రవు నీవు నిన్ను నేఁ
జేకొని కాతు నొక్కగతిఁ జెప్పెద భార్గవరాము నాశ్రిత
శ్రీకరుఁ గాన్పు మాపదలు సెందఁగ నీఁ డతఁ డాశ్రయించినన్
శోకము [4]దక్కు మన్న విని సుందరి యల్లన యత్తపస్వితోన్. 289

ఆ. పరశురాముఁ గానఁ బడయుట యెక్కడఁ, గలుగు నాతఁ డెట్లు కరుణ సేయు
[5]ననఁ దపస్వి యిట్టు లను మహేంద్రం బను,పర్వతమునఁ జేయుఁ బరమతపము.

వ. నన్ను మన్నించుం గావున మదీయదౌహిత్రి వగుట యెఱింగిన నిన్ను రక్షించు నందుఁ బొమ్మనుసమయంబునం బరశురామశిష్యుం డగునకృతవ్రణుం డను మునివచ్చి యతిథిసత్కారంబులం బూజితుం డై యున్నఁ బ్రియపూర్వకంబుగా నాహోత్రవాహనుండు భార్గవుం డెయ్యెడ నున్నవాఁ డని యడిగిన నతం డి ట్లనియె. 291

క. తనప్రియసఖుఁడవు నీ వని, మునిజనులకుఁ జెప్పుచుండు ముదమున నిన్నుం
గనుఁగొనఁగ నెల్లి యిచటికిఁ, జనుదెంచు ననేకశిష్యసంఘముతోడన్. 292

తే. అనిన విని యెల్లవారును నధికహర్ష
మెసఁగ నున్నంత మఱునాఁడ యేఁగుదెంచె

---

1 గాంగేయుఁ జెనయ. 2 యెవ్విధమునఁ బోవు దాన...బుద్ధుల్. 3 విస్తారంబు చింతిం[illegible]వనిన...యి ట్లను న. 5 ననినఁ దపసి యిట్టు లనియె మహేంద్ర మున్నర్వ

భార్గవుం డమ్మునీంద్రులు పరమభక్తి
నర్చ లిచ్చిరి హోత్రవాహనుఁడుఁ గనియె. 293

వ. కని పరశురామునిసంభావనంబును సంభాషణంబును బడసి కాశిరాజకన్యకం
జూపి యిది నాదౌహిత్త్రి దీనివృత్తాంతం బంతయు విను మని యమ్మౌనినిం గాని
పించిన నదియును. 294

చ. కనుఁగవ నశ్రుధార లొలుకం [1]జరణానత యైన రాముఁ డి
ట్లను విను హోత్రవాహనునియట్టుల యేనును నీకు నీమనం
బునఁ గలచింత యంతయును బుచ్చెద నాకడఁ జేరి తింక నీ
వనటఁ దొలంగఁ బెట్టి గరువంబుగఁ జెప్పుము దీనిమూలమున్. 295

వ. అనిన విని యమ్మహాత్మునకు నంబ దనవృత్తాంతం బంతయు సవిస్తరంబుగాఁ
జెప్పి నీ వార్తశరణ్యుండవు [2]నాపరిభవంబు దీర్చి నన్ను రక్షింపు మనవుడు నతం
డి ట్లనియె. 296

క. పరిభవము రెండుదెఱఁగులఁ, దరుణీ తోఁచినది సాళ్వుఁ దగఁ [3]దేర్తునొ యు
ద్ధురుఁ డగుభీష్మునిఁ దేర్తునొ, కరముప్రియం బెద్ది హృదయగతముం జెపుమా.

చ. అనవుడు నింతి యిట్లను మహాపురుషా నను సాళ్వుఁ డింకఁ గై
కొనఁ డది సాలు భీష్మదెసఁ గోపము నామదిఁ గల్గి యుండు నా
తని వధియింపఁ బూని యిటు తాపసవృత్తికి వచ్చి యిచ్చటన్
నినుఁ గని యీపరాభవము నీఁగఁగ నీశరణంబుఁ జొచ్చితిన్. 298

తే. అనిన నాచెప్పినట్ల గంగాత్మజుండు, సేయఁ జేయక తక్కినశితశరముల
నతనిఁ బడవైతు నూఱడు మబల నీకుఁ, దపము సేయంగ నేటికిఁ దనువు డయ్యా.

పరశురాముఁ డంబం దోడుకొని భీష్మునియొద్దకు వచ్చుట.

క. అని పలికి పరశురాముఁడు, సనుదెంచెను మునిజనంబు సమ్మదమునఁ దోఁ
జనుదేరఁ గురుక్షేత్రం,బున కుద్ధతిఁ గాశిరాజపుత్త్రిం గొనుచున్. 300

వ. వచ్చి సరస్వతీతీరంబున విడిసి తనరాక నాకెఱింగించిన నేను ఋత్విక్పురో
హితప్రభృతివివిధబ్రాహ్మణసమేతంబుగాఁ బూజాద్రవ్యంబులు గొని తత్ప్రదేశం
బున కరిగిన నమ్మహాత్ముండును మదీయభక్తివినయసంభ్రమంబులు సంప్రీతి నభి
నందించి యర్చనలు గైకొని కాశిరాజకన్యకం జూపి నాతో ని ట్లనియె. 301

తే. బలిమి మున్నేల తెచ్చి తిప్పడఁతి మగుడఁ
ద్రోచి పుచ్చంగఁ దగునయ్య నీచవృత్తి
వచ్చె దీనిఁ దమ్మునికి వివాహ మింక
నైనఁ జేయుము చెఱుచుట యనుచితంబు. 302

---

1 శరణాగత...వాహనుని యి ట్లను. 2 నాపరిరంభంబు. 3 గూర్తునొ...భీష్మునిఁ దీర్తు
నొ ; దీర్తునొ...భీష్మునిఁ దీర్తునొ.

క. అనుటయు ననఘా తెలియఁగ, విను మిది నాతోడ సాళ్వవిభునకు నేఁ గూ
ర్చినచాన నతనిపాలికి, ననుపుము నన్ననినఁగాదె యనిచితి మగుడన్. 303

తే. ఇంక నాతమ్మునికి దీని నెట్లు పెండ్లి, సేయ [1]నేరుతు ననుడు నాచెప్పినట్లు
సేయ వైతేని నిన్ను నీచెలులఁ జుట్ట, ములను జంపుదు ననియె నమ్మునివరుండు.

వ. ఏను వినయంబు వదలక వినతుండ నగుచు వివిధవాక్యంబులం దెలుప నంత
కంతకు నతనికిఁ గోపం బగ్గలం బైన నెండియు. 305

ఆ. గురుఁడ వై సమగ్రకోదండవిద్యామ, హత్త్వ మిచ్చినాఁడ వలుగఁ దగునె
కారణంబు లేక యీరస[2]మెత్తి యి, ట్లనినఁ బరశురాముఁ డాగ్రహమున. 306

చ. గురుఁ డని నన్నెఱుంగు దనఘుండవు నావచనంబునం దనా
దరణము సేసి తెన్నియొ విధంబులఁ బల్కెదు భక్తితోడ నీ
వెరవులు దక్కి మాయబల వేగమ పెండిలి సేయు మంతతో
మరలు మదీయకోపశిఖ మానదు [3]వేయొకవేయుఁ జేసినన్. 307

వ. అనిన విని [4]ధర్మాచరణంబున కింత వట్టి పెనంగ నగునె పరానురక్తచిత్త యగు
మగువ నిల్లాలిం జేయువారుం గలరె యిట్టియకృత్యం బాచరించుకంటె నీచే
త నెట్లయినను లెస్స తొల్లి పెద్దలు సెప్పినచొ ప్పవధరింపు మని యి
ట్లంటి. 308

తే. గర్వి యై కార్య మిట్టి దకార్య మిట్టి, దని యెఱుంగక లోకంబు చనుపథమునఁ
దిరుగ [5]కున్మదవృత్తి వర్తించునట్టి, వాని గురునైన దండింప వలయునండ్రు. 309

క. అనుమాటకుఁ గాలానల, మునుబోలెను మండి కయ్యమున కాయిత మై
మొన[6]లేర్చి వేగ యిచటికిఁ, జనుదెమ్మని భార్గవుండు సంరంభమునన్. 310

వ. పలికిన నేనును. 311

క. అలుకఁదనంబున విప్రున, కలుగంగాఁ [7]దగదు గురుఁడు నై యున్నాఁడం
చలయక తలఁచితిఁ గాకిటు, నిలుమీ నీరణము సేఁత నిజ మగు నేనిన్. 312

క. క్షత్రియులఁ దొల్లి యలుకకుఁ, బాత్రము సేసితపె నాఁడు బలియుఁడు గంగా
పుత్త్రుఁడు వుట్టమిఁ గాకిది, యాత్రయి [8]నింకేల చెల్లు నెఱుఁగవె నన్నున్. 313

క. ఏ నొకరుండన వచ్చెదఁ, గాని బలము దేను నీవు గఱపినశస్త్రా
స్త్రానేకవిధ[9]విలాసము, దాన వలయు సేన గాదె తథ్యం బరయన్. 314

వ. అని పలికి యతనికిం బ్రణమిల్లి చనుదెంచి సత్యవతి కింతయు విన్నవించి యద్దే
వియనుమతి వడసి సర్వసన్నాహసమేతం బగురథం బెక్కి విప్రాశీర్వాదంబులు
సెలంగ వెడలి వచ్చి కురుక్షేత్రంబు దఱియం జనునెడ భాగీరథి భామినీరూపం
బున నరుగుదెంచి తన్నెఱింగించి మదీయభక్తి నభినందించి యే నాయితం బై

1 నేర్తునె యనుఁడు. 2 మెత్తితీ, రనిన. 3 వే యొకటెన్ని. 4 యధర్మా. 5 కున్మత్త.
6 వేర్చి. 7 దగునె. 8 నీకేల చెల్లు. 9 విలాసము, గానఁగవలె.

పోవుటకుఁ గారణం బడిగి నాచేత నత్తెఱం గెఱింగినదియై నన్నుం గినిసి భార్గవు పాలికిం జని నీశిష్యుండు నిరపరాధుండు నాకొడుకున కలుగం దగునే యని చెప్పి యతనియందుఁ [1]బిక్కగానక మగుడ నేతెంచి నావలనను మెత్తంబాటు లేకున్నం జనియె నప్పుడు సిద్ధవిద్యాధరమునిగణంబులు గౌతుకంబున్నం గనుం గొను చుండ నేను జమదగ్నితనయున కనతిదూరంబునం దేరు డిగి వినతుండ నై నిలిచి నీవు భూచారి వై యున్నవాఁడవు రథికుండ నైననాకు నీతోడ సమరంబు సేయ నగునే యనినయనంతరంబ యతండు దివ్యంబు లగురథరథ్యం బులు శస్త్రాస్త్రంబులునుం గలిగి యకృతవ్రణుండు సారథిగా సమరసన్నద్ధుం డై తోఁచినం జూచి రథారోహణంబు సేసి శంఖంబు పూరించి గుణంబు సారించి నూతు నగ్గించి తనకు నమస్కరించి కడంగిన నప్పరశురామదేవుండు. 315

—భీష్ముఁడు పరశురామునితో యుద్ధంబు సేయుట.—

క. శరవర్షము నామీఁదం, గురిసిన నే [2]నాకసమునఁ గుదియించితి నా
యరదంబుపొంతకును న,చ్చెరువుగ నొకబాణ మైనఁ జేరక యుండన్. 316

క. ఒకమొగి నఱువదియమ్ములఁ, బ్రకటబలుం డైనపరశురాముఁడు నాయం
గకములు దాఁకఁగ నవ్వ, ప్రకరము నొ నాఁట నూతుపైఁ బడ నేసెన్. 317

క. దానికి నవ్వుచు వేగం, బే నొకభల్లంబు దొడిగి యేసితి సాంద్ర
జ్యానాదభరితరోదసి, యైనతదీయోగ్రచాప మఱిముఱిఁ దునియన్. 318

ఉ. ఒండొకవిల్లు పుచ్చికొని యుజ్జ్వలరోషమహానలార్చు లొం
డొండ మొగంబుపై నెగయ [3]నుర్వి చలింప గుణధ్వనిఁ సము
ద్దండతఁ దీవ్రమార్గణశతంబున నాయరదంబు ముంచె రా
ముండు వియచ్చరప్రకరముల్ వెఱఁ గందుచుఁ బ్రస్తుతింపఁగన్. 319

క. ఉఱక మదీయాంగంబులు, గిఱిగొన నట్లోయుటయును గినుక గదిరినన్
మెఱుఁ గారునారసమ్ములు, దఱచుగ నించితిఁ గడంగి దద్గాత్రమునన్. 320

తే. ఉచ్చి పోయిన[4]యేటుల నొలుకుశోణి,తమునసర్వాంగకంబులుఁ దడిసియొప్పఁ
జిగురుఁదఱచునఁ గెంజాయమిగిలి చెలువు,వడయుకొ్రమ్మావిచాడ్పున భార్గవుండు.

క. నెత్తురు వడిసిన మూర్ఛా, యత్తుం డై సొగయుటయును నాతనిఁ గని యు
ద్వృత్తక్షత్రియధర్మో, పాత్తం బగు తేజ మొల్లఁబా రై తోఁచెన్. 322

వ. అప్పుడు మనంబున నన్ను నేన గర్హించుకొను చుండితి. 323

ఆ. అంతఁ దెలిసి రాముఁ డతికుపితాత్ముఁ డై, యేఱు వాఱు తెంచు నెసకమెసఁగ
నప్రమేయశరము లడరించె నవి సత్వ, రముగ నేను బ్రతిహతములు సేసి. 324

క. మరుదప్రమేయ గుహ్యాక, శరమున వారించె నతఁడు సరభసముగ ను

1 బక్క ; పక్క (బలుకు). 2 నారసమున. 3 నుర్వి సలింప...బిచ్చలింపఁగన్. 4 గం టను నొలుకు ; నటను.

ద్ధురశిఖిబాణం బేసిన, గురుఁడు వరుణవిశిఖనిహతిఁ గుదియం జేసెన్. 325

క. ఇమ్మెయి నతఁడును దివ్యా, స్త్రమ్ములు నామీఁద నేయ రయమునఁ బ్రతిఘా
తమ్మొనరించితి దివిజగ,ణమ్మంబరవీథిఁ గీర్తన మ్మొనరింపన్. 326

తే. రాముఁ డంత్యకాలానలోద్దామలీల
మండి నాయురస్థ్సలి యొక్కమార్గణమున
నేసె నంతంత నున్నమునీశ్వరులును
గాశిరాజకన్యకయును గడఁగి యార్వ. 327

క. ఆనిశితాస్త్రం బెయ్యది, యో నాకుం దెలియ దది మహోగ్రత నాఁటం
గా నొచ్చి పడితి నరదము, పై నప్పుడు సూతుఁ డచటు వాపె రథంబున్.

తే. చేతనుఁడ నయి యేను మత్సూతుఁ గినిసి, రాముఁ డున్నెడ కప్పుడు గ్రమ్మఱంగ
రథముఁ దోలించి బాణపరంపరాని, మగ్నుఁ జేసితి నంబనెమ్మనము దలఁక.

వ. ఇట్లు బహుప్రకారంబులం బోరుచుఁ బ్రొద్దు గ్రుంకినప్పుడు రణం బుపసంహ
రించుచు రేపకడ దొడంగుచుం బెనంగ నిరువదిరెండు దివసంబులు చెల్లిన
మఱునాఁటికయ్యంబున నేనునుం గడంగి. 330

క. కడు బెట్టిదముగఁ గదియం, బడి హయములు నొవ్వధనువు భగ్నంబుగఁ జే
డ్పడి సారథి దెరలఁగఁ దన,యొడలు [1]సిరుఁగ నేసినను మహోద్ధతి గురుఁడున్.

క. ఒకశక్తివైవ నఱకితి, [2]నకుటిలముగ శక్తిదశక మడరించిన స్రు
క్కక త్రుంచితి బహుశక్తుల, నికరము వరఁగించినం దునిమితిం బెలుచన్. 332

క. విస్మయము నొందుభార్గవు, నస్మత్కర మపుడు లాఘవారూఢముగా
నస్మితుఁ డగుచుం బటుదీ, ప్తిస్మేరాస్త్రముల [3]నేసితిం బరవశుఁగాన్. 333

వ. ఇట్లతండు మూర్ఛిల్లిన మునిజనంబులును నంబయు నధికశోకసమాకులత్వంబు
నొంది హాహాకారంబులు సెలంగఁ బొదివి రంత. 334

ఆ. తెలిసి భార్గవుండు దృఢతీవ్రనారాచ, పంక్తిగురిసి నన్నుఁ బారవశ్య
మంది నేల కొఱఁగునట్లుగాఁ జేసి మ,త్సూతుమస్తకంబుఁ దునియ నేసె. 335

వ. అట్టియెడ నెనమండ్రువిప్రులు సమానవయోరూపంబుల నొప్పువారలు నన్నెత్తి
నేద దేర్చి రథంబుపయిం బెట్టి గగనగమనంబునం బోయి రంతకు మున్న
మందాకిని మున్ను నాకన్నచందంబున నొగలపయినుండి మదీయరథ్యంబుల
పగ్గంబులు ధరియించి యున్నయది యేనునుం గనుంగొని నమస్కరించిన
దీవించి చనియె వెండియు. 336

క. సారథ్యంబును జేయుచు, ధీరత వాటించి రామదేవునితోడం
గ్రూరాస్త్రంబులఁ జతురవి,హారం బొనరించితిని సురావలి వొగడన్. 337

---

1 సిరుగ. 2 నకుటిలమతి. 3 జేసితిం బర.

భీష్మునకు వసువులు స్వప్నసాక్షాత్కారంబున మోహనాస్త్రం బిచ్చుట.

వ. ఇవ్విధంబునం బోరి సూర్యాస్తమయం బగుటయు నెప్పటియట్ల చని యే నా రాత్రి యేకాంతంబున దర్భశయనంబున నుండి సురభూసురవర్గంబులం దలంచి భక్తిం బ్రణామంబులు సేసి పరశురాముని జయింప రాదయ్యెడు దినంబులు పెక్కులు సనియె నతని నాజి జయించుట గలుగునేని మీరు నాకుం దోఁచి యూఱడింపవలయు నని ప్రార్థించి నిద్రించుచుండం బవలు నన్నెత్తి రథం బుపయిం బెట్టిన యెనమండ్రునుం బ్రభాతసమయంబునం గలలోన వచ్చి. 338

తే. నీవు నేమును నొక్కటి నీకు వెఱవ, నేల గాంగేయ రాము జయించునట్టి శరము సుమ్మని మోహనాస్త్రంబు నాకు, నిచ్చి పోయిరి క్రమ్మఱ [1]నెక్కడేని.

వ. ఏను మేలుకాంచి సంతోషించి తన్మంత్రస్వరూపంబును బ్రయోగోపసంహార ప్రకారంబులును జిత్తంబున నిలిపికొనుచుఁ గాలోచితకృత్యంబు లాచరించి యొక్కసారథి నంగీకరించి యరదంబు పూన్పించి సన్నద్ధుండనై సత్వరంబుగా సమరంబున కరిగినం బరశురామదేవుండు. 340

క. నిన్న నడఁ సచ్చి పోయితి, వున్నయడఁయు నేడు దీర్చియుడిపెద నీగ ర్వోన్నతి యింకెట [2]పోయెదు, నన్ను నెఱుఁగ వెట్టులనుచు నాపైఁ గవిసెన్.

క. కవిసినఁ గడంగి [3]యేనును, గవియించితి నంపవెల్లిఁ గడుఁ గూరిత భా ర్గవుఁడును మద్గాత్రంబున, వివిధాస్త్రప్రతతి నించి వెగ డొందించెన్. 342

వ. ఏనుం గోపించి. 343

తే. రయము మెఱయంగ నొక్కనారసము ఫాల
దేశమునయందు నాఁటించి తీవ్రశక్తి
నురము వైచినఁ దూఁగాడి [4]యొఱగ నూఁది
పట్టి యకృతవ్రణుఁడు దేర్చెఁ బరశురాము. 344

క. అప్పుడు దెప్పిఱి కన్నుల, నిప్పులు రాలంగ నన్ను నిశ్చలదృష్టిం దప్పక చూచి యలఁతిన, వ్వొప్పఁగ బ్రహ్మాస్త్ర మాతఁ డుగ్రత నేసెన్. 345

క. తెగ గొని బ్రహ్మాస్త్రము యేఁ, దగ నేసిన నొకటి నొకటి దాఁకొని రెండుఁ గగనం బంతయుఁ [5]దేజ, స్థగితముగాఁ జేసె సురలు దైత్యులుఁ దలఁకన్.

తే. సకల భూత[6]సంక్షోభసంజనక మైన, యట్టియెడఁ గని యిది దఱి యని తలంచి మోహనాస్త్రంబు నంచితావాహనంబు, సేయుటయునుజరాచరశ్రేణిమోసె.

వ. తదవసరంబున. 348

క. ఉడు గుడుగు మోహనాస్త్రము, విడువకు మనునెలుఁగుతోడ వేగంబున న

---

1 నెచటికేని. 2 పో నగు, నన్నెఱుఁగవె యనుచు వచ్చి. 3 పెల్లుగ...గుఱిసి ; (గ్రుచ్చి) వెగడొందించెన్. 4 నొగల. 5 దేజస, మగణితముగ జేసి...మునులు దలంకన్. 6 విక్షోభ.

య్యెడ కేఁగుదెంచి నారదుఁ, [1]జెడపడు టించుకయు లేక యి ట్లనునాతోన్.
క. గురునకు నవమానము ని,ష్ఠురవృత్తిం జేసె దీవు సూచితిమే యి
ప్పురుషునఁ బరుసపునడవడిఁ, గురువంశప్రవర యిట్లు గూడునె చేయన్. 350
వ. అని సువ్యక్తంబుగాఁ జెప్పి. 351
క. వీరె సుర లాకసంబున, గారవమున బుద్ధి సెప్పఁగా నీకడకుం
దా రేఁగుదెంచి రని క, న్నారంగాఁ జూపె నాకు నయ్యెనమంద్రన్. 352
వ. ఇవ్విధంబున నెప్పటివిప్రవరులు సన్నిధి సేసి నన్నుం జూచి నగుమొగంబులతో నెఱుఁగనివారపోలె ని ట్లనిరి. 353
క. నారదముని త్రైలోక్యస, మారాధ్యుం డితనిపలుకు లాగమవాక్యో
దారములు వినుము వీనిం, గ్రూరత వాటింపఁ దగదు గురువిషయమునన్.
వ. అనిన విని యేను సమ్మోహనాస్త్రం బేయుట యుడిగి బ్రహ్మాస్త్రంబు దీపింపం జేసితి నప్పుడు జామదగ్న్యుం డది యెల్ల నెఱింగి యోటమి యెక్కించుకొని చలంబు మిగిలి యున్నం దజ్జనకుండు జమదగ్నియుఁ దదీయపితృవర్గంబును నత నికి సన్నిధిసేసి వేఁడికొని [2]శాంతవచనంబులం దేర్చి యి ట్లనిరి. 355
క. వినుము వసుమూర్తి యీతం, [3]డనన్యసామాన్యతేజుఁ డాహవభూమిన్
మనకు జయింప వశమె భీ,ష్ముని విప్రున కగునె రోషమును మత్సరమున్. 356
తే. సమర ముడుగు నారాయణసఖుఁడు నరుఁడు
సవ్యసాచి నా నిం కొకజన్మ మొంది
యితని వధియించుఁ గాని తక్కి తరజనము
లకు నసాధ్యుండు భీష్ముఁ డాలంబులోన. 357
వ. అనిన నతండు వోక పెనంగిన వెండియు ననేకప్రకారంబులం జెప్పి యమ్మునులు నాకడకుం జనుదెంచి యుపశమనవాక్యంబులు వలికి జామదగ్న్యుతోడం ద మయాడినమాటలు దేటపఱిచి యప్పుడు పొడసూపినజాహ్నవియుం దారు బహువిధంబుల నన్ను ననునయించి భార్గవుపాలికి నమ్మహాదేవిం దోడ్కొని యరిగియుం గ్రమ్మఱ మత్సమీపంబునకు వచ్చియు నెట్టకేలకుం జలం బుడిపిన నే మిరువురమును దివ్యాస్త్రంబు లుపసంహరించి సమరం బుడిగితి మట్టియెడ నయ్యెనమంద్రు విప్రులుం జేరి నాతో ని ట్లనిరి. 358
ఆ. గురుఁడు బ్రహ్మవిదుఁ డకుంఠితతేజుండు, పరశురాముఁ డతనిపాలి కీవు
భక్తిమెఱయ నేఁగి ప్రణమిల్లి తదనుగ్రహంబు వడయ వలయు ననఘ యిపుడు.
వ. అని చెప్పి యతనికడకుం దారును నారదమునీశ్వరుండును జమదగ్నిప్రముఖులును భాగీరథియును జని నీశిష్యుండు దేవవ్రతుండు వానియెడ నలుగం దగునె వాఁడు దగవు మాలినపనిఁ జేయంజాలక పెనంగె నింతియ కాని విరోధి గాఁడు

[1] జెడఁబడు; జెడమడు. [2] సాంత్వ (సాత్విక). [3] డనూన.

[1]వానిం గరుణింపు మని తెలిపి నన్నుం బిలిచినం బోయి యే నమ్మహాత్మునకు సాష్టాంగదండప్రణామంబు సేసిన నతండు దీవనతోఁ గ్రుచ్చి యెత్తి కౌఁగిలించికొని గాంగేయా నీశక్తికి భక్తికిం బ్రీతుండ నైతి నని సస్నేహంబుగా సంభావించి యంబ నవలోకించి నన్ను భీష్ముండు గెలిచె నావలన నయ్యెడుపని యింతియ నీవింక నీకుం జూడం బోలినగతిం బొమ్మనిన నమ్మానిని దేవా యిది యిట్టిద నీయోపినంతయుం జేసితి నీచేతం బోకున్న నేమి సేయుదు నేను దపంబుపెంపున భీష్ముని వధించెద జన్మాంతరంబున నైనన్నుం జలంబు సాధ్యంబు సేయుదు నటు సూడు మని పలికి పోయెఁ దదనంతరంబ యమ్మునిజనపితృదేవతా సమూహంబును భృగునందనునన్ను నామంత్రణంబు సేసి యంతర్ధానంబు సేసె భార్గవుండును నన్ను వీడ్కొలిపి మున్ను దనతో వచ్చినతపోధనవర్గముం దానును మహేంద్రశైలంబునకుం జనియె నేను మగిడి యెడ నెడ నుర్వీసురుల యాశీర్వాదంబులు సంభావనవచనంబులుఁ బ్రస్తుతివాక్యంబులుఁ గర్ణంబుల కింపు సేయ నిట వచ్చి సత్యవతికి నమస్కారపూర్వకంబుగా నంతయు నెఱింగించిన నద్దేవి యభినందించి. 360

—నారదుఁడు భీష్మున కంబవృత్తాంతం బంతయు జెప్పుట.—

తే. అంబవృత్తాంత మరయంగ ననుదినంబుఁ
దగినవారలఁ బుచ్చుచుఁ దలఁకు చుండు
నేను నది యాదిగాఁ జింత నేపు దక్కి
స్రుక్కి యుండియు రాజుల నుక్కు మడఁతు. 361

వ. ఒక్కనాఁడు పారాశర్యనారదులం గని యక్కార్యంబు భయంబు దోఁప విన్నవించిన వారలు దైవాధీనం బగుదాని మానుషంబున మానిపింప వశంబుగా దాచింత విడువు మని రందు నారదుం డక్కాశీశ్వరకన్యక తెఱంగు విను మని యిట్లనియె. 362

సీ. ఆతన్వి యమునానదీతీరమున కేఁగి, యత్యుగ్ర మగుతప మాచరించి
యందుండి కౌశికునావాస మాదిగాఁ, గలుగుసిద్ధాశ్ర[2]మంబులకు నెల్లఁ
జని చని తత్ప్రదేశంబుల నిష్ఠుర, వ్రతములు సలుపంగ వచ్చి నీదు
జనని జాహ్నవి యిట్లు వనితల కతిదుష్కరము లగుబహునియమములు నీకు
తే. నడపఁ గత మేమి యనుఁడు నన్నాతి వలుకుఁ
దద్ద యవమాన పడితి శాంతనవుచేత
నపరజన్మంబునం దైన నతనిఁ జంప
నేను జాలుట కై యిట్టిదాన నైతి. 363

వ. అనిన విని భాగీరథి గుటిలప్రచార వగుట నీ వీతనువు విడిచి యే ఱయి పాఱంగల

1 వానికిం...మని తేర్చి. 2 మములకుఁ జేర్చిఁ జని...జాహ్నవి చూచి.

దాన వింతియ కాని యొండు గా నేర వనిన నవ్వేలంది నవ్వుచు సరకు సేయక
తిరిగి తొంటికంటెను దీవ్రం బగుతపశ్చరణంబునం బ్రవర్తిల్లుచు [1]మత్స్యదేశ
వాసిని యై యుండి యొక్కనాఁడు నిజవ్రతఫలంబులో సగంబున నంబ యను
పేర నది యై యమ్మండలంబునం బరఁగి యున్న సగంబునను దనరూపు సెడ
కుండవహించికొనిజాహ్నవీప్రభావంబు నాత్మీయప్రభావంబున గెలిచివెండియు.

క. పుణ్యాశ్రమదేశముల న,గణ్యం బగుతపము సేయఁ గా రుద్రుఁడు గా
రుణ్యము వాత్సల్యము దా,క్షిణ్యము మెఱయంగ నింతికిం బొడసూపెన్.

క. మును లచ్చెరు వంది కనుం, గొన శంభుఁడు నిల్చి వరముఁ గోరు మనుడు భీ
ష్ముని నాకుఁ జంపఁగా దొర,కొనునట్లుగ నొసఁగు మనియెఁ గోమలి యెలమిన్.

వ. అనవుడు నద్దేవుం డట్ల [2]కాక యని యనుగ్రహించిన నంబ యెత్తెఱంగున
నది యయ్యెడు నని యడిగిన. 367

సీ. ఈమేను విడిచి నీ వేఁగినయప్పుడు, ద్రుపదభూవిభునకుఁ దొల్త పుత్రి
వై పుట్టి పిదపఁ బుత్త్రాకృతిఁ [3]గాంచి శి,ఖండినామమున నుద్దండబాహు
బలమునఁ గోదండపాండిత్యమును బటు, శౌర్యంబు నొప్పఁ బ్రశస్తి కెక్కి
యనిఁ జంపఁ గలదాన వాతని నామాట, దప్ప దూఱడు మని చెప్పి హరుఁడు

తే. చనియె నాప్రొద్దు సమిధలుసాలఁ గూడ, వైచి యనలంబు గూర్చి యవ్వనితక్రోధ
దీప్తమూర్తి యై భీష్ము వధించుదాన, ననుచు సొదసొచ్చె మునులకు నద్భుతముగ.

వ. అట్టియెడ ద్రుపదుం డనపత్య యగుతనమహిషివిషాదంబు దీర్పం దివురుటను
గాంగేయుతోడిరోషంబునను శివుని నుద్దేశించి తపంబు సేసిన నద్దేవుండు
ప్రత్యక్షం బయి వరంబు వేఁడు మనిన భీష్ము వధియించునట్టివాని నొక్క
పుత్త్రుని నొసంగవలయు ననుడు. 369

తే. కూఁతు రై పుట్టి [4]పదపడి కొడుకుఁ దనమ్ము,గాంచి భీష్ముని నాజిరంగమునఁ జంపు
నట్టియుజ్జ్వలాపత్యంబు పుట్టు నీకుఁ, దప్ప దిది యని రుద్రుండు సెప్పి చనియె.

వ. ద్రుపదుండును బ్రీతుం డయి నిజప్రియకు నవ్విధం బెఱింగించెఁ దదనంతరంబ
కాశీశ్వరకన్యకచైతన్యం బుదరంబు ప్రవేశించిన. 371

క. పాంచాల[5]రాజభార్య స,మంచితగర్భంబుఁ దాల్చి మఱువడఁ గూఁతుం
గాంచి నిజపతియుఁ దానును, వంచనఁ గొడు కనిరి యెల్లవారును వినఁగన్.

వ. ఇట్లు వుట్టినబిడ్డకుఁ బుత్త్రప్రకారంబున జాతకర్మాదికృత్యంబులు నిర్వర్తించి శిఖం
డి యనుపేరు వెట్టి [6]యతిప్రచ్ఛన్నంబుగాఁ బెనిచి రహస్యంబు తెఱంగాకన్ని
యకుం జెప్పి యక్షరశిక్షాదు లాచరించి ద్రోణాచార్యుకడ శస్త్రాస్త్రపరిశ్రమం
బు సేయించు చుండ జవ్వనంబు చొరవకుం దఱి యగుటయు నమ్మగువం జూచి

1 వత్సదేశ (తత్సమీపదేశ) నివాసిని యై. 2 యగుంగాక. 3 దాల్చి. 4 యది మఱి కొడు
కు. 5 రాజపత్ని. 6 యతిప్రయత్నంబుగాఁ బెంచి.

వగచి తల్లిదండ్రులు దమలో విచారించి వేగంబ వివాహంబు సేయవలయుఁ బరమేశ్వరువరంబుకొలంత దననెఱసినప్పుడ నెఱయుంగాక యని నిశ్చయించి దశార్ణదేశాధీశుం డగుహేమవర్మ యనురాజకన్యకం దగినతెఱంగునఁ బాణిగ్రహణంబు సేయించి తెచ్చి యున్నంత. 373

ఆ. అక్కుమారి చతుర యగుట శిఖండివ, ర్తనము నెడఁ బ్రమాదమున నెఱింగి
యుగ్గడింప నొల్ల కూరక యెఱుఁగని, యదియపోలె నుండె నాత్మ [1]నొచ్చి.

వ. ఇట్లు దశార్ణవిభుపుత్త్రి యెఱింగి శిఖండి పురుషుండు గామి దనదాసికిం జెప్పిన నదియు నప్పు డన్నరనాథున కెఱింగించి పుచ్చిన నతండు విషాదరోషంబుల నొంది దూతం బుత్తెంచిన వాఁడు వచ్చి పాంచాలపతిం గాంచి యిట్లనియె.

చ. కొడు కని [2]తెచ్చి యిట్లగునె కూఁతు వివాహము సేయ దీన నీ
పడసినలాభ మేమి నగుఁబాటగు నింతియ కాక యెల్ల నే
ర్పడ నెఱుఁగంగ వచ్చితి నరాతిభయంకరు హేమవర్మ నా
గడమున గాసిచేసితి మగంటిమి నీదెస నైనఁ జూపుమా. 376

ఆ. [3]అనిన నగుచు వాని కను ద్రుపదుం డివి, యేటిమాట లిట్లు లేల చేయ
వచ్చు నింతవెట్టివారును గలరె యి, త్తెఱఁగు వొసఁగ కునికి యెఱుఁగ రాదె.

వ. అని వెండియు నేర్పునం దీర్పుమాట లనేకంబు లాడి నిక్కం బరయం జూచి నవానికిం జొరవ యీక త్రోపుసేసి వీడ్కొలిపి పుచ్చినం బోయి వాఁడును నిజనాథున కవ్విధంబు విన్నవించిన. 378

క. కోపోద్రేకంబున నతఁ, డాపాంచాలపతిమీఁద నతులితసైన్యా
టోపమున వచ్చి పురిపరి, ఖాపరిసరతలముచుట్టుఁ గైకొని విడిసెన్. 379

వ. ఇట్లు విడిసిన. 380

ఆ. పట్టు [4]వడ్డమృచ్చుపగిదిఁ బాంచాల భూ, నాయకుండు దనకు నానచేటు
రాక కుమ్మలించి యేకాంతమునఁ బత్ని, యొక్కతియును గొల్వ నూర కుండె.

వ. తదీయదండనాథులు సమరోత్సాహంబునం బ్రవర్తిల్లి రంత సూర్యాస్తమయసమయం బగుటయు రెండువీళ్లును భండనంబుతోడి వేడుకం జేసి వేగుటయ వేచియుండె. 382

క. అప్పుడు శిఖండి మరణము, [5]దప్పఁగ నడికొండు ప్రతివిధానము సేయం
జొప్పడమిఁ దలఁచి యొరులకుఁ, జెప్పక వెస నరిగెఁ బురముచెంత యడవికిన్.

—— శిఖండి యక్షునివలనఁ బురుషత్వంబు నొందినవృత్తాంతము. ——

వ. అవ్విపినంబు స్థూలకర్ణుం డనునొక్కయక్షునికి నివాసం బై యునికిం జేసి నిర్జనం

1 నొర్చి. 2 చెప్పి కూఁతునకుఁ గూఁతు...టింతియ. 3 ఆ. అనిన నగుచు ద్రుపదుఁ డది యేటిమాట లి, ట్లేల చేయవచ్చు నింత వెట్టి, వారు గలరె యెట్టివారికి బుద్ధి యి, త్తెఱఁగు. 4 వడ్డమృగము. 5 దప్పను దన కొండు.

బై యుండు శిఖండియు న త్తెఱం గెఱుంగుం గావున నతని నుద్దేశించి యందుఁ
జొచ్చి తత్ప్రదేశంబున మహనీయసుందరం బగుతదీయమందిరంబున కరిగి
యచ్చటఁ బ్రాణవియోగం బగువిధం బాచరింపం బూనిన. 384

ఉ. [1]యక్షుఁ డెఱింగి వచ్చి యిటు లాఱడి చావఁగ నేల చెప్పుమ
జ్జాక్షి భవన్మనోరుజకు నౌషధ మే నొనరింతు నన్న ఫా
లాక్షుఁడు దక్క నొడ్లకును నాపని సేయఁగ రాదు నాదుచి
త్తక్షతి పుంస్త్వ మేను దగఁ దాల్పక మానదు గుహ్యకోత్తమా. 385

క. అని తనవృత్తాంతం బా,తని కెఱిఁగించుటయు నతఁడుఁ దన దగుచిత్తం
బునఁ గరుణ పుట్టి యెంతటి, పని యిది యే నిత్తు సమయపరిపాలనతోన్. 386

క. నాపురుషత్వము గైకొని, వే పోయి దశార్ణపతికి వెలయించిన మీ
యాపదలు దొలఁగి చనఁ బొడ, సూపుము పదినాళ్లయంతసూనృత మొప్పన్.

క. అంతవునంతకు నీ దగు, కాంతారూపంబు నేను గైకొనియెద ని
శ్చింతమున మగుడఁ జనుమని, యింతికిఁ బురుషత్వ మిచ్చె నెంతయు వేడ్కన్.

తే. ఇచ్చి తాను భామాకృతి నెలమిఁ [2]దాల్చి
వీడుకొల్ప శిఖండియు వీటి కేఁగు
దెంచి నిజమందిరంబు సొత్తెంచి తల్లి
దండ్రులకు మ్రొక్కి నిలిచి ముదం బెలర్ప. 389

క. తన తెఱఁ గంతయు నెఱిఁగిం, చిన నద్భుతహర్షమగ్నచేతసులై త
జ్జననీజనకులు బహువిధ, వినుతులఁ గొనియాడి రంత వేకువ యయ్యెన్. 390

వ. తదనంతరంబ సూర్యోదయం బగుటయుఁ గాలోచితకరణీయంబులు నిర్వర్తించి
పాంచాలవిభుండు సంబంధితో వలయుమాట లాడం దగువారలం బనిచి రావిం
చి సంభ్రమంబులేక వేగిరపడక నాగరికప్రకారంబున శిఖండిపురుషత్వంబు దేట
పఱిచి యతనిమాట గీడ్పఱిచి సపరివారంబుగా నద్దశార్ణపతికి విందువెట్టి
[3]కట్నంబు లిచ్చి యతనియనునయాలాపంబులు గైకొని యనిచి పుచ్చిననతండు
తన్నుందాన నిందించుకొనుచు నిజపురంబునకుం బోయె నట్టియెడ నయ్యక్ష
వరుమందిరంబుచక్కటికిం గ్రీడార్థంబు గిన్నరవిభుండు విమానారూఢుం డయి
చని దానియొప్పు గనుంగొని యగ్గించుచు నిల్చి యొక్కింతసేపునకుం జుట్ట
నున్నగుహ్యకులతో నిట్లనియె. 391

క. ఘన మిచట నిలిచి యుండఁగ, మనమున శంకింప కిట్లు మసలినవాఁ డీ
తనిగర్వ మేల యిక్కడఁ, [4]జనుదేరఁగ నిచ్చు నెట్లు సైఁపఁగ వచ్చున్. 392

వ. అని పలికి యలుక [5]మొగంబున ముడివడ నున్నంతఁ గిన్నరు లాగుహ్యకు నరసి

1 యక్షుఁడు వేగ...సేయఁగఁ గాదు...త్తక్షుభి; 2 దాల్చె, వేడ్కతోడ. 3 కట్ట నిచ్చి. 4 జనుదేరక నిల్చు టెట్లు. 5 ముసంబున.

తద్వృత్తాంతం బంతయు నెఱింగించి దేవా సిగ్గుపెంపున రా నేర కున్నవాఁ
డని విన్నవించిన. 393

ఆ. అయిన నేమి పిలువుఁ డని పిలిపించిన, వచ్చి మ్రొక్కుటయును వనిత యైన
యతనిఁ జూచి [1]యింక నవుదాని కిట్టుల,యుండుఁ గాక యని విభుండు వలికె.

స్థూలకర్ణునకుఁ గుబేరునివలన స్త్రీత్వము గలుగుట.

వ. స్థూలకర్ణుండును దలరి దండప్రణామంబు సేసి యుండె నప్పుడు గొలిచియున్న
[2]దొరలు ధనదునకుం గృప వుట్టె నల్లన తెలిపిన నట్లేని వీఁడు శిఖండి యా
యువుగలంతకాలంబును గాంతాకృతి నై యుండి పదంపడి నిజరూపంబు
దాల్చుంగాక యని యనుగ్రహించి యరిగిన. 395

తే. గుహ్యా[3]కుండు విషాదంబు గూరి యుండ
నచ్చటికిఁ గొన్ని దినముల కరుగుదెంచెఁ
దల్లిదండ్రుల కెఱిఁగించి తగవు మెఱయ
సమయనిష్ఠ వాటించి పాంచాలసుతుఁడు. 396

క. వచ్చినఁ గనుఁగొని నీదెసఁ, బొచ్చెము లే దిట్ల మగిడి పొ మ్మిది విధి నీ
కిచ్చినరూ పని గుహ్యకుఁ, డచ్చుపడం బలికి యెల్ల నతనికిఁ జెప్పెన్. 397

వ. చెప్పి వీడుకొలిపిన శిఖండి యత్యంతప్రమోదంబునం దండ్రికడకు వచ్చి యత్తె
ఱం గెఱింగించిన నాతండు ప్రీతుం డయి దేవగురుద్విజపూజనంబు లాచరించి
ద్రోణాచార్యుపాల సవిశేషంబుగా శిష్యభావంబు ప్రతిష్ఠించె. 398

క. అని చెప్పి నారదుఁడుఁ దా,నును సత్యవతీసుతుండునుం దమయిచ్చం
జనిరి శిఖండిచరిత్రము, జనకర్ణపరం[4]పరం బ్రశస్తం బయ్యెన్. 399

వ. ఇవ్విధంబునఁ గాశీపతికన్యక సిద్ధమూర్తియయి నెగడె నేను నంగనల నంగనా
పూర్వుల నంగనాభిధానుల నంగనాకారులను వధియింప కుండ వ్రతంబు
వూనినవాఁడం గావున నంగనాపూర్వుం డగుశిఖండి నాకు భండనంబునం
గోదండపాండిత్యంబు మెఱసినను జంపను నొంపనుఁ, గడంగితినయేని నింత
కంటెను దుర్యశంబు గలదె యె ట్లయిన నగుదుం[5]గాని భగ్నవ్రతుండ నగుట
కోర్వ నిది నా తెఱంగు. 400

క. అని చెప్పిన దేవవ్రతు, వినుతవచనములు విభుండు విని తనచిత్తం
బున నొక్కింత వగచి యీ,తనికి మగతనంబుపూన్కి దగు నని పలికెఁ. 401

వ. తదనంతరంబ కొలువునం గలయ సమరవిషయంబు లయినసల్లాపంబులు సెల్లు
చుండఁ గొండొకసేపు వినుచుండి సుయోధనుండు సురనదీసూనునకి ట్లనియె.

1 యింక వౌదాని కే నిట్లు; నాదాని కీవిట్ల యుండుఁగాక. 2 వారలు. 3 కుఁడు...బునఁ గూలి యుండ. 4 పరాప్రశస్తం. 5 గాదని భగ్నవ్రతుండ.

ఆ. పాండవులకుఁ గలుగుబలము లన్నియు సమ, యింప [1]నీకు దినము లెన్ని వట్టు
గురుఁడుఁగృపుఁడు గురునికొడుకుఁగర్ణుండునెం, తెంతమానమున వధింతురనఘ.

వ. అనిన విని గాంగేయుం డతని కిట్లనియె. 404

క. అనఁ బాండవసేనలఁ జం,పను [2]జెఱుపను నేము సాలుభంగుల నీ కి
ట్లనుమానము వాయఁగ నడు, గన తగుఁ గడు లెస్స విందు గాక నరేంద్రా.

వ. యేను [3]నాసాలెడుకొలంది సెప్పెదఁ దక్కటివారుఁ దమతమచాలుటలు దార
చెప్పెద రది యెల్లను బిదప విందు గాని మున్ను నీ కొక్కబాస యిచ్చెద
నాకర్ణింపుము. 406

క. [4]మీఁటు గలరాజరథికుల. నాఁటికి వేవుర వధింతు నరుశరములు నో
నాఁటి పడ వైచునంతకు, వేఁ టాడెదఁ బ్రతిబలంబువీరుల నెల్లన్. 407

వ. అట్లుగా నాకయ్యంబు సేయుదివసంబులలోన. 408

క. పదివేలఁ జంపఁగా నో,పుదు నే ననునెత్తికోలు వుట్టినయది నీ
పదునొకఁడక్షోహిణులను, జదురున నడపింతు [5]నెదిరిసైన్యము గలఁతున్. 409

వ. అని పలికి వెండియు. 410

క. నీ వడిగినపని యేర్పడఁ, గా విను మే నొక్కనెలఁ దెగం జేయుదు నా
నావిధదివ్యాస్త్రంబుల, లావున నప్పాండవులబలంబుల నెల్లన్. 411

వ. అనవుడు గురుకృపాశ్వత్థామకర్ణులం గనుంగొని గాంధారీనందనుండు మీమీ
చందంబు లెట్లనిన నాచార్యుండు మందస్మితాననుం డగుచు ని ట్లనియె. 412

తే. ఏను ముదిసినవాఁడ మహీశ యెట్టు, లయిన నోపినభంగి నీ యనుఁగుఁదాత
సాలినన్నిదినంబులఁ [6]జాల వచ్చు, నబ్బలంబుల నని సమయంగఁ జేయ. 413

క. అనినఁ గృపాచార్యుం డీ, యినుమడిదివసములఁ దీర్ప నే నోపుదు నా
విని గురుతనూభవుఁడు పది, దినములఁ గడ తేర్తు ననియె ధీరవిచారా. 414

వ. అందఱపలుకు లాకర్ణించి కర్ణుండు. 415

క. నానాస్త్రశస్త్రచయబడ, బానలముం గవియఁ జేసి యత్యుగ్రత నే
నేనాళ్లన యప్పాండవ, సేనాసాగరము [7]నివురఁ జేయుదు నధిపా. 416

వ. అని ప్రతినసేసినఁ గలకల నవ్వి గాంగేయుండు. 417

చ. పలికిన నేమి యన్నియును బల్క నగున్ మనరాజునొద్ద మా
ర్పలికెడువారు లేరు విను పాండవమధ్యముగాండివంబు దీ
ప్తుల మిఱుమిట్లు గొన్నకనుదోయి గుణధ్వని వ్రయ్యలైనవీ
నుల [8]నయినన్ బలే పలుకు నూల్కొన కుండుదు సూతనందనా. 418

---

1 నీడు దినము...గర్ణుండు నెం, తెంతమాత్రమున. 2 నొంపను...సాట. 3 నా చేతం జాలెడు. 4 నీటు గల ; మేటు లగు. 5 నెమరు...గాతున్. 6 జాల నోర్తు, నరిబలంబుల పని...కీను. 7 నీఱు సేయుదు ; నింకఁ జేయుదు. 8 నయనంబు లై పలుక...కుండుట.

వ. అనియె నివ్విధంబున నీకొడుకు కడంబుట్టినవిశేషంబులు ధర్మతనయుండు చారుల
వలన విని తమ్ములఁ రాఁ బనిచి వారలతో ని ట్లనియె. 419

సీ. మన చారు లిప్పుడు సనుదెంచి రా వీట, నుండి దుర్బుద్ధి సుయోధనుండు
గొలువున గాంగేయకుంభసంభవకృపా, శ్వత్థామకర్ణులవలను సూచి
యనిఁ బాండవులబల మంతయు సమయింపఁ, జాలుదు రెంతేసికాలమాన
మున నన్నభీష్ముండు దన కొక్క_నెల వట్టు, నని యాడె ద్రోణుండు నట్ల పలికెఁ

ఆ. గృపుఁడు రెట్టి సెప్పెఁ గృపికొడు కోపుదుఁ, బదిదినముల ననియె బాహువీర్య
ఘనుఁడు గాన సూతతనయుఁ డేనాళ్లన, [1]తీర్ప నేర్తు నని ప్రతిజ్ఞ సేసె. 420

వ. అని చెప్పి యర్జునుం గనుంగొని వారు దమతమయోపినచందంబులు సెప్పిరి నీచే
తం గౌరవబలంబు లెంతదడవునకుం [2]దెగు నాకుం జెప్పుమనిన నతం డిట్లనియె.

తే. వార లంతకుఁ జాలనివారె నీబ, లముల సమయింపఁ జాలెదు లావు వెరవుఁ
గలర కాక యారాజుతోఁ బలికి బాస, దప్ప వచ్చునె వారికి ధరణినాథ. 422

వ. అని దరహాసోల్లాసభాసితవదనుం డై. 423

మ. అనుమానం బది యేల నీమదిమదీయస్ఫారబాహాబలం
బు నిరూపింపఁ దలంచితేని విను మేపుం జేవయుం జూపి కృ
ష్ణునితోడ్పాటునఁ బేర్చి యేఁ గడఁగినం జూర్ణంబు గావింతు నొ
[3]క్కొ_నిమేషంబున దేవదానవులతోఁ గూడం ద్రిలోకంబునున్. 424

వ. అది యె ట్లంం డేనిఁ గృత్రిమకిరాతుం డైనపశుపతి మెచ్చి జగత్సంహారసమ
యంబునం దాను బ్రయోగించునట్టిపాశుపతమహాస్త్రంబు నా కిచ్చె నది
నాయందు సన్నిహితం బయియున్నయది గావున శత్రునిరాసం బనాయాసం
బై యుండు నప్పాశుపతంబుమహనీయప్రభావంబు [4]భీష్ముం డున్నరూ పెఱుంగుఁ
డు ద్రోణకృపాశ్వత్థామలు నెఱుంగరు కర్ణున కెఱుంగ నెంతద వ్వట్టిఘోరసా
ధనంబున సమస్తంబును సమయించుట యుక్తంబు గాదు తక్కినయాయుధం
బులం బోరి వైరులం బరిమార్చినం బౌరుషంబు దీపించు నని తలంచెద నప్పటికి
వలయువిధంబు భయ్యెడునది య ట్లుండె నీవా రక్కడివారికిఁ దక్కువవారె భీమసే
నుండు గవలభిమన్యుండు ద్రౌపదేయులు సాత్యకి విరాటద్రుపదులు ధృష్టద్యు
మ్నుండు శిఖండి యుత్తమౌజుండు యుధామన్యుండు ఘటోత్కచుండు [5]జెట్టా
నజెట్లున్నవారు మఱియు ననేకులు వీరలయట్టివార యందఱం జెప్ప నేల
యేనుంగువోలె నీలావు నీవెఱుంగవు దివిజులకు నజేయుండవు నీయొక్కనికిఁ
ద్రిభువనంబు నెదురె నీవు నిక్కం బలుగవు గాక నీ వలిగిన నెవ్వా రెట్లయ్యె
దరో యటు సూడుము నీసైన్యంబుల నెవ్వరికి నేమి సేయ వచ్చు మనకు విజ

1 దీర్ప వచ్చుటకుఁ బ్రతిజ్ఞ. 2 దెగు మఱి చూతము నాశం. 3 క్కనిమేష...గానీ

యానందంబు సులభంబ యని పలికెనని సంజయుండు ధృతరాష్ట్రున కెఱిం
గించె నని వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పుటయు. 425

క. కమలభవాదిదైవతముఖస్ఫుటనిర్గళితప్రశస్తవా
గమృతరస[1]ప్రసారకలితాంచితసేకవిధిప్రకర్షసం
గమసముదీరితోల్లసనకందళితప్రమసద్దయాలతా
సుమమహదుపాశ్రయప్రమదశోభితవిశ్వజగన్మధువ్రతా. 426

క. సముదయబహుత్వారణ్య, భ్రమణపరిశ్రామ్యదంతరంగనితాంతో
[2]త్తమసంశమార్గదర్శన, సమర్థపుణ్యాభిధానసకృదుచ్చరణా. 427

మాలిని. అవగమితరహస్యాష్టాంగసమ్యక్ప్రకారో
త్సవగుణకరుణావిస్తారగాథప్రశాంతి
ప్రవణహృదయపద్మోద్భాసివిజ్ఞానసారా
వ్యవహితపరమానందానుభూత్యేకరూపా. 428

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున యుద్యోగపర్వంబు
నందు సర్వంబును జతుర్థాశ్వాసము.

శ్రీ మ దాం ధ్ర మ హా భా ర త ము
ఉద్యోగపర్వము సమాప్తము.
ఆ ది పం చ క ము
సంపూర్ణము.

25172
25-3-73

---

1 ప్రపూరకవిధాంచిత... సంగమవితతోల్లసన్నయన.; ముదితోల్లసన్నయన. 2 త్తమసర
మార్గాదర్శన.

